బళ్లారిజిల్లాలో తుంగభద్రానదీతీరమున హంపియను నొక పట్టణముగలదు. 1509–1530 వ సం॥ వరకు కృష్ణదేవరాయలు విజయనగరమును పాలించుచుండెను. విజయనగర చక్రవర్తులలో ఇతడు మిగుల యుత్తముడు. అనేక రాజ్యములు జయించెను, అనేక గ్రంథములు రచించెను. దేవరాయల ఆస్థానమున అల్లసాని పెద్దన్న మనుచరిత్రను, నంది తిమ్మన పారిజాతాపహరణమును, తెనాలి రామకృష్ణుడు పాండురంగ విజయమును వ్రాసినటుల తెలియుచున్నది. శ్రీ చల్లపల్లి రాజాగారితో బళ్లారి కమ్మ మహాసభకు వెళ్లినపుడు శ్రీ రాజాగారు నేను తదితర మిత్రులతో కలసి శిథిలమైన నగరము నంతను పరిశీలించితిమి. శిథిలమైన గుఱ్ఱపు శాలలు, పాలనింపు రాతితొట్లు, ఇంకనెన్నో చిత్రవిచిత్రపు మందిరములుగలవు. ఆతని కాలములో ప్రతిరోజు నాలుగువేల వృషభములు ప్రత్యేకముగ పోషింపబడుచుండెడివట. పెద్దపెద్ద తొట్లలో పాలుపోసి తెగలకు ఏనుగుల పిల్లలకు, గుఱ్ఱపు పిల్లలకు పాలుపోసి త్రాగించెడివారట. ఋషిమూలికా పర్వతము దగ్గరనున్న చక్కని ఓషధులతో జంతుచికిత్స వైద్యులతో చేయించెడి వాడట.

## శిఖ్ఖుల పశుసంరక్షణ

ఆ॥ గోవు భూవధూటి కొంగుబంగారమే
యన్నమాట నేటి కంతరించె
పచ్చితురకయింటి పండుగకీనాడు
పిండివంటయయ్యె పిచ్చితల్లి! "గోవు"

గోసంరక్షణమై హిందువులకున్న యభిప్రాయమునే శిఖ్ఖులుంగూడ బలపరచుచున్నారు. గోవుయొక్క పవిత్రతనుగూర్చి శిఖ్ఖుమతగ్రంథమగు "గ్రాందిసాహెబ్" నందు యేమియు చెప్పబడియుండలేదు. వీరికి గోవునందుగల పూజాభావము హిందువులనుండి వచ్చినదియేగాని వేరొండుకాదు. గోవిషయమై వీరియభిప్రాయములు "గ్రాందిసాహెబ్" నందున్న కొన్నికథలనుబట్టి శిఖ్ఖుసాంప్రదాయమును బట్టికూడ తెలిసికొనవచ్చును. గోపవిత్రత విషయములో హిందువులకంటె శిఖ్ఖులకు మూఢవిశ్వాసముగలదు. గోవధకు విధింపబడవలసిన శిక్ష మరణదండనకన్న యేమాత్రము తక్కువగానుండకూడదని వారినిశ్చితాభిప్రాయము. మహమ్మదీయులకు శిఖ్ఖులకువచ్చు ఘోరకలహములకుగల కారణము శిఖ్ఖులకువచ్చు పట్టుదలయే. ఈ పట్టుదలవలననే వీరు మహమ్మదీయులతో పోరాడి అల్పసంఖ్యాకులచే ఓడిపోయి తమసామ్రాజ్యమును కోల్పోవలసినవారైరి. శిఖ్ఖులకున్న గోసంరక్షణ పట్టుదల, గోపోషణ ఏమతములవారికి లేదనియే చెప్పవచ్చును.

## పార్సీవారి పశుసంరక్షణ

"సీ॥ పాము నానాహామును వెసబాఱఁదోలి
శ్వాసకాసలవిడిచి నిశ్చయముగాఁగ
నక్షిల ముఖ నేత్ర రోగములంటకుండ
స్వస్థచిత్తులైయుంద్రు ప్రజలు ధరిత్రి." "కామధేనువు"

పశుసంరక్షణ విషయమై హిందూమతమున కత్యంతసన్నిహితే సంబంధముగల పార్సీమతమువారి మతగ్రంథము "జెందుఅవెస్ట"లో బోధింపబడిన కర్మకాండలు చాలవరకు వైదికకర్మకాండలను పోలియున్నవి. పార్సీమతప్రవక్తయగు జరాతుస్త్రుడు పశువధ మహాపాతకమని బోధించెను. పార్సీమతస్థులు గోవుకన్నను వృషభమే ఎక్కువ పవిత్రమైనదిగా నెంచుదురు. మానవసృష్టికి మూలము పురుషుడని క్రైస్తవమతస్థులు తలచునట్లు పశుసృష్టికి మూలము వృషభమే మొదటిదని పార్సీవారి నమ్మకము. వృషభ వీర్యమువలన దంపతులు వానివలన 280 విధములగు తదితరజంతువులు పుట్టినట్లు వారి శాస్త్రమునందున్నది. హిందువులకు గోమూత్రము వైద్యములో చెప్పినరీతిగా ఎంత శుద్ధమైనదో పార్సీలకు వృషభమూత్రము అంతకన్న ఎక్కువ పవిత్రవంతమైనది. శరీరసంబంధమగు అంతశ్శుద్ధిగాని బాహ్యశుద్ధిగాని వృషభమూత్రమువలన చేయవచ్చును. మానవ శవమునుగాని జంతుశవమునుగాని తాకినవారు వృషభమూత్రముచే పారిశుద్ధ్యము నొందుదురు.

ప్రసవించిన స్త్రీలు మొట్టమొదట బూడిదతో కలిపిన వృషభమూత్రము 3, 6, 9 చుక్కలను త్రాగుదురు. తరువాత ఆయువతి గుఱ్ఱములనుగాని ఆవులనుగాని మేకలనుగాని పాలుపిండి నీరుకలుపని క్షీరరసమును మూడుదినములవరకు తీసికొనవలెను. మూడుదినముల పర్యంతము ఆమె తనబట్టలను, నవరంధ్రములను, దేహమును, నోటిని వృషభమూత్రముతో కడుగుకొనవలెను. ప్రాణములేని శిశువుపుట్టిన స్త్రీలకై ఈపద్ధతి మొదట నేర్పరుపబడినను నేడు ప్రసవించిన ప్రతిపార్సీయువతియు ఈరీతిగా దేహపారిశుద్ధ్యము నొందుట యాచారమైపోయినదని "కాప్రొటెక్షన్" అను ఆంగ్లగ్రంథము తెలుపుచున్నది.

" తే ॥గీ॥ తురకలకు పుణ్యనగరమై వఱలుచుండి
ఘనతనుం గాంచినట్టి మక్కాపురంబు
నందు వధశాల పైభాగమందు "పశు వృ
షభములందక్కు నన్యముల్ చంపుడ"నుచు
వ్రాయబడియున్నదనుట కాహ్లాదమొకద॥" "మూగతల్లి"

ఎక్కువ వెలపెట్టి గుడ్డను; తక్కువ వెలపెట్టి గొడ్డును కొనరాదు

బక్రీదుపండుగరోజున మహాత్మాగాంధిగారు ఈ రీతిగా తెలిపిరి. బక్రీదు మహమ్మదీయులకు సంతోషదినము. హిందువులకు దుఃఖదినము. హిందువులకు దుఃఖ మేల ? గోమాత హిందువులకు దైవతుల్యము. ఈ సత్యమును మహమ్మదీయులు తెలిసి కొని యుండియు వారు గోవులను బలులనుపేర వధించుచున్నారు. హిందువులందరి వలెనే నేనును గోవును ప్రేమించువాడనే. శాస్త్రీయపద్ధతులతో గోసంరక్షణము చేయుటకు నేనొక సంసనుకూడ స్థాపించితిని. కాని బక్రీదు సందర్భమున మహమ్మ దీయులపై హిందువులు కినుకవహించుటలో నే నేకీభవించియుండలేదు. మహమ్మ దీయులు గోవులను వధించుటవలన అనవసరముగ హిందువుల మనస్సుకు నొప్పికలిగించు చున్నారు. ఇట్లుచేయుటకు వారి అజ్ఞానము, మూర్ఖతయే కారణమనుటలో సందేహము లేదు. బక్రీదునాడు కాని ఏ ఇతరరోజున కాని మహమ్మదీయుడు గోవును వధింపవలె ననుమత నియమ మెక్కడనులేదు. హిందువులు గోవును పూజించుచున్నారుకదా ? హిందువులు గోవును పూజించువారైనను వారే దానిని వధించుటకు మహమ్మదీయుల వశము చేయుచున్నారని కొందరు మహమ్మదీయులు వాదింతురు. అట్లయినచో మహమ్మ దీయులు అజ్ఞానముగను మూర్ఖముగనున్నను వారు గోవులను వధించుటకు హిందువులే పరోక్షముగ కారణభూతులగుచున్నారు. ఎక్కడచూచినను గోవులను అమ్మువారు హిందువులే. అటితరి హిందువుల దుఃఖమునకు కోపమునకు కారణముగపడదు. సంవత్స రములో ఒక్కరోజున మహమ్మదీయులు వధించుచున్న గోవులకంటె హెచ్చువధలకు హిందువుల అజ్ఞానమే కారణమగుచున్నది.

ఏటేటా జరుగుచున్న పశువధలు, పశువుల స్వాభావిక మరణములను గురించిన హృదయ ద్రావక మగునట్టియు, సప్రమాణ మగునట్టియు లెక్కలను నేను సేకరించితిని. 1935సం॥వు పశువుల లెక్కలనుబట్టి నూటికి 80పశువులు స్వభావమగు రోగములచే మర ణించు చున్నవనియు 20 పశువులు వధింపబడుచున్నవనియు తేలుచున్నది. స్వాభావిక మరణముల సంఖ్య స్థలభేదములనుబట్టి మారుచున్నది. ఎక్కడ పశుగ్రాసమునకు అవ కాశములు బాగుగనున్నవో, ఎక్కడ వ్యవసాయము జాగ్రత్తగ నడపబడుచున్నదో అక్కడ పశువులు స్వాభావిక మరణములు నూటికి 7 కంటెను తక్కువగనున్నవి. కరవు ప్రదేశములలో నూటికి 30 కంటెను హెచ్చుగనున్నవి. 1935 సం॥ లో బొంబాయి రాజధానిలో 742 లక్షల పశువులున్నట్లు లెక్కలవలన తెలియుచున్నది. వీటిలో 9 లక్షలు (నూటికి 12 వంతున) స్వాభావిక మరణములు పొందినవి. రెండులక్షలు (నూటికి 33 వంతున) వధింపబడినవి. 1935 వ సం॥ లో బ్రిటిష్ ఇండియా మొత్తము మీద (బెంగాల్, బీహార్, ఒరిస్సాలతో కలసి) 8 కోట్ల గోవులుండెను. 3 కోట్లకు పైగా గేదెలుండెను. 1935-1930 సం॥ లెక్కలను పోల్చిచూచిన గోవుల అభివృద్ధి కంటె గేదెల అభివృద్ధి మూడురెట్లు పెరిగినదని కానవగును.

---

సామాన్యముగ గోవుల యజమానులు హిందువులనుట అందరికి తెలిసిన విషయమే. వీరు క్షమింపరాని తమ అజ్ఞానమును పోగొట్టుకొన్న యెడల స్వాభావిక రోగముల వలన కలుగు అనేక మరణములను సులభముగ నివారింప కలుగుదురు. ప్రతిసంవత్సరము ఇన్ని మరణములు కలుగుటకు కారణమేమి? ఈ సంపదలోని విపరీతవ్యదుబారాను నివారించుటకు ఏమిచేయగలము, ఏమిచేయవలెను అను విషయములను గురించిన 2 భాగములు ఈ దిగువ నుదహరింపబడినవి. ఒకప్పుడు గోసంపదనుబట్టియే మానవుల ఐశ్వర్య పరిమితిని నిర్ణయించెడివారు. అట్టి గోసమితి నేటిమానవులకు పెద్దబరువైనది. ఇది నేటి కరన్సీవిలువ దిగతీతవలెనేయున్నది. కాని ఉన్న భేదమిదియే. పశుక్షీణతఅనగా నాణెపు విధానముతో సమతూగు గోవుల నాణెములవిలువ తగ్గుదల స్వప్రయత్నముచే నివారింప సాధ్యమైనది. ఈ ప్రయత్నము మూడువిధములు.

1. మహమ్మదీయులు తమ ఆహారముకొరకుకాని బలులకొరకుగాని గోవధలను మానవలెనని బ్రతిమాలుటలో శక్తిని వ్యర్థపరుపరాదు. ఆవిషయము వారి గౌరవమునకే వదలివేయవలెను.

2. గోవుల అభివృద్ధిపట్ల ప్రత్యేకశ్రద్ధ వహింపవలెను. ఇందుకుగాను గేదెపాలు నెయ్యి వాడుట మానవలెను.

3. సహజముగ చనిపోయినపశువుల చర్మమువాడుట, వాటి యితరభాగముల నన్నిటిని ఆహారముగాతప్ప ఇతరవిధముల పూర్తిగా ఉపయోగించుకొనుట, తోళ్లుఊరు పనిని మంచిస్థితిలోనికి తెచ్చుట.

అభివృద్ధికి కావలసిన సాధనములు జంతురక్షణశాలలలోను, గోశాలలలోను దేశమందంతటను సిద్ధముగనేయున్నవి. కాని అచ్చటచ్చట ప్రబలిన దురభిప్రాయములను తొలగించి ఈ సంస్థలను సక్రమపద్ధతులపై నడపుట ఒక్కటియే ఆవశ్యకము.

" సీ॥ పరిశుద్ధికినిగోవు వరబుద్ధికినిగోవు
కర్మల నంసిద్ధి కాకరము గోవు
హవ్యమునకు గోవు కవ్యమునకు గోవు
భోజనసిద్ధికి బూజకదియ
ఐహికసుఖసిద్ధి కాశ్రయమగు గోవు
పరలోకసుఖ లాభకరము గోవు
భోగయుక్తికి గోవు రోగముక్తికి గోవు
ఘనతప్రసిద్ధి సాధనముగోవు

---

తే॥ గీ॥ ఇవ్విధంబున జనులకు నెల్లపనులు
గోవువశమున నెప్పుడు కుదిరియుంట
గోవు జనులకు నెల్లెడ సేవనీయ
మయ్యె ప్రత్యక్షదైవమై యహరహంబు॥"

"గోప్రభావము"

## జంతువుల మరణములకు కారణములు

హిందూదేశములో లభించుచున్న హెచ్చుభాగము తోళ్ళు వధలవుగాక స్వాభావమగుమరణములకు పాల్పడిన జంతువులవే. ఈ దేశములో మాంసాహారులు తక్కువఅగుటనందునను, హింసపట్ల ముఖ్యముగా పశువులను వధించుపట్ల సమాజముగ ప్రతికూలభావము ఉండుటవలనను, హెచ్చుభాగము పశువులును, కొలదిభాగములు మేకలును, గొఱ్ఱెలును ముసలితనములోనే స్వాభావముగ మరణించుచున్నవి. పశుపోషణకు అవకాశము తక్కువగానున్నచోట్ల పశువులు ఆహారములేక సగముమాడి రోగములపాలై చనిపోవుట తటస్థించుచున్నది. పశువులలో అంటువ్యాధులు ప్రబలినపుడు వాటిని నివారించు ప్రయత్నములు తక్కువగనున్నందునకూడ పశువులు హెచ్చుగ మరణించుచున్నవి. తరచుగా సంభవించు అనావృష్టి ఫలితముగ చెలరేగు కరవులవల్ల అనేకప్రదేశములలో పశువులు చనిపోవుచున్నవి. ఇవిగాక ఇతరప్రమాదములు పాముకాట్లు, కొండరాళ్ళవలన అపాయములు, రాళ్ళు కఱ్ఱలు విసరుటవలనగు అపాయములు, అడవిమృగములవలన అపాయములు ఇవన్నియు మనకు లభించుచున్న తోళ్ళఉత్పత్తికి కారణములు. ఆకలిమంటచే చనిపోవు జంతువులలో ఎక్కువభాగము మనుష్యులకు పనికిరాని జంతువులు కాని, వారిపని తీరిపోయిన జంతువులుకాని అయియున్నవి. సాధారణముగ వీటి మొగము చూచువారెవరును ఉండరు. అక్కడక్కడ లభించు కొలది పచ్చికమీదనే వీటి ఆధారము. స్వభావముగ చనిపోయిన జంతువుల చర్మము పలుచనై ఎండిపోయి కాగితము వలె పటుత్వములేక యుండునని రాయల్ కమీషన్ ఆఫ్ ఎగ్రికల్చర్ వారు తెలిపిరి.

## తోళ్ల పరిశ్రమ

ఇండియా గొడ్ల తోళ్ల పరిశ్రమకు అనేక అవకాశములున్నవి. ప్రపంచములో కల్ల ముడితోళ్లు లభించుటకుగల అవకాశములు మన దేశములో హెచ్చు కలవు. ప్రపంచము మొత్తముమీద గోవులు [illegible] పదికోట్లు. ఇందులో ఇండియాలో పదునారు కోట్లు. ప్రపంచములోనున్న గేదెలు [illegible] నాలుగుకోట్ల డెబ్బది లక్షలలో మూడుకోట్ల నలుబది లక్షలు ఇండియాలోనే యున్నవి. మొత్తము ఇరువదికోట్ల ముప్పది లక్షల మేకలలో ఇండియాలో అయిదుకోట్ల మూడులక్షలున్నవి. మొత్తము ఏబది

---

అఱువైఅరు పిండిప... లభుచంటలో నున్నవి



శ్రీ పాలడుగు వీరరామచంద్రరావుగారి ఘాలెంజి బండపట్టు గెలిచిన గిత్తలు. చాల బహుమతులు బడసినవి. (శిరిపురం-గుం. జి.)



పైవారి పేరెన్నికగన్న వృషభరాజము



తోడా జాతి దున్న



పాలదూడలు



శ్రీ రావెళ్ల వెంకట్రామయ్యగారి ఆబోతు
బెంగుళూరు ప్రదర్శనములో బహుమతి పొందినది జొజ్జవరం కృ. జి.

కోట్ల ఏబదిలక్షల గొఱ్ఱెలలో ఇండియాలో నాలుగుకోట్ల పదిలక్షలున్నవి. ఈ పశువుల వలన ప్రతిసాలున సప్లయి కాబడుచున్న తోళ్లసంఖ్య ఆర్నాల్డుగారిచే మదింపు చేయబడినది.

ఆవు చర్మములు 20000000 ముక్కలు
గేదె చర్మములు 350000 ,,
మేక చర్మములు 22000000 ,,
గొఱ్ఱె చర్మములు 11500000 ,,

ఇవిగాక ఇండియాలోని అడవులు సర్పములకును అడవి బల్లులకును ప్రసిద్ధములు. నీళ్లలో మొసళ్లకు తరుగులేదు. ఈ అడవి జంతువుల చర్మములుకూడ కొంతకాలము నుండి వ్యాపారసామగ్రిగా పరిగణింపబడుచుండినవి.

ఇండియాకు కావలసిన అన్నిరకముల చర్మములను తయారుచేయుటకు ఇవి వీలుగా నున్నవి. ఆవు చర్మములు సామాన్య జనులకు కావలసిన చెప్పులకు చౌకగా గిట్టుచున్నవి. మేకతోళ్లు ధనికులగు స్త్రీ పురుషుల పాదరక్షల కుపయోగపడుచున్నవి. ఇవి అతిమృదువుగానుండి ప్రపంచములో నాణ్యమైన తోళ్లలో ఒకటిగా ఎంచబడు చున్నవి. గొఱ్ఱె తోళ్లు లైనింగునకు గేదె చర్మములు పాదరక్షల అడుగుభాగములకును, ఇతర పరిశ్రమలకును ఉపయోగపడుచున్నవి. ఆవు చర్మములు ట్రంకు పెట్టెలకును సూటుకేసులకును, సంచులకును, పట్టీలకును, పటకాలకునుకూడ ఉపయోగపడుచున్నవి. గొఱ్ఱె మేక తక్కిన ప్రాకెడి జంతువుల చర్మములు అందమైన విలువగల వస్తువులకు పనికివచ్చు చున్నవి.

తోళ్లకు సంబంధించినంతవరకు మన దేశములో కావలసినదానికంటె అధికో త్పత్తి ఉన్నదని తలచుచున్నారము. ఇప్పటిస్థితినిబట్టి నిజమేకాని ఈదేశ ప్రజల జీవిత ప్రమాణము పెరిగినయెడల ఇప్పుడు లభించుచున్న చర్మములు ఈ దేశములోని ప్రజలకు మనిషికి సాలుకు ఒక చెప్పులజత వంతునైనను సరిపోజాలవు. పాదరక్షలు నాగరికులైన వారికి వేషములలో భాగములు మాత్రమేకావు. ఆరోగ్యమాత్రముల ననుసరించి అవి అందరికి అవసరములు. ఇండియాలో ఏ కొలదిమందియో పాదరక్షలను ధరించ గలుగు చున్నారు. కోట్లకొలది డబ్బులేక పాదరక్షలు కొనుటకు డబ్బులేక పాదరక్షలు లేకయే తిరుగుచున్నారు. ఇండియా ప్రజల దారిద్ర్యము ఇండియా తోళ్లపరిశ్రమకేగాక పెక్కు ఇతర పరిశ్రమల బలహీనతకుకూడ కారణమగుచున్నది.

యుద్ధమునకు పూర్వము జర్మనీవారు మన ఆవు, గేదె తోళ్లను మేక తోళ్లను అమెరికావారు కొనుచుండిరి. ఈ విపరీతపు ఎగుమతులవలన ముడితోళ్లు మన దేశము

లోని పరిశ్రమల వారికి కావలసినన్ని దొరకుట దుర్లభమయ్యెడిది. యుద్ధ సందర్భమున తోళ్లు ఎక్కువ అవసరమయ్యెను. ఇండియానుండి సప్లయిచేయమని కోరిరి. బ్రిటిషు సామ్రాజ్యము అవసరమును అప్పుడు గుర్తించెను. "హారిజన్"

## విదేశీయుల పశుసంరక్షణ

" సీ॥ గోమాంసభక్షణం బేమానవునికైన
రుజనుగల్గింపజేయు రూఢిగాను
నాత్మోపయోగమై యాలజంపినవాడు
బ్రహ్మహత్యనుమించి పాపియగును
నితరోపయోగమ్ము నెంచి గోవులజంపి
మాంసమమ్మినవాడు మాసిపోవు
దనయంత దానుజచ్చిన గోవుమాంసమ్ము
దినువాడు ఛండాలమునజరించు

గీ॥ నెవ్విధమునగాని గోవును నొవ్వజేసి
దాని మాంసమ్ముగాని దుగ్ధమ్ముగాని
మూత్ర పురీషముంగాని పుచ్చుకొన్న
వాడు నశియించు బాపియై వసుధయందు."

"మూగతల్లి"

అమెరికా సంయుక్తరాష్ట్రములందు మిస్సోరియను రాజ్యముగలదు. అందు మిస్సోరి కాలేజీఅను పేరుగల ఒక కృషివిద్యాలయము గలదు. దాని ప్రధానాధికారి "మిస్టర్ జాన్ హెచ్ గెహార్స్ అనునతడు. ఈతను వ్యవసాయ సంబంధమగు గ్రంథము లనేకము వ్రాసెను. అందొక గ్రంథము "టాయిల్ స్టాల్ స్న, ఫార్మ్ కానిత్స్యన్స" అయియున్నది. ఈ గ్రంథములయొక్క ఆరవ అధ్యాయమునందు పశుజాతి ఉపయోగమును గూర్చియు, వాని మహత్మ్యమును గురించియు, గొప్ప వర్ణనలు చేసెను. సి. డబ్ల్యు. బర్కెట్ తన "సాయిల్" అను గ్రంథములో పశువులగూర్చి చక్కగా వర్ణించిరి. అమెరికా యూరపు విద్వాంసులు ఏబదిసంవత్సరముల పూర్వము తెలిసి కొనిన సంగతులు భారతదేశ మహర్షులు అనేకవేల సంవత్సరములకు పూర్వమే తెలిసికొని యుండిరి. ఈ విద్వాంసులు పశుపోషణ గోమహాత్మ్యమును తెలిసికొనినప్పటి నుండియు వారు గోజాతిని ఇంకను జాగ్రత్తగా పోషించుచుండిరి. ఇప్పుడు అచ్చట

గోవులు నివసించుటకుగాను రాత్రింబవళ్ళు చాలినంత నిర్మలవాయువును పండుకొనుటకు తిరుగుటకు పరిశుభ్రమగు స్థలమును, నిద్రించుటకు మెత్తని గడ్డి పాన్పులును లభించునట్టి ఏర్పాటులతో పశుశాలలు నిర్మింపబడుచున్నవి. ఆర్జెంటైనాలో పశువు అతివిశేషముగా పోషింపబడుచున్నవి. ఆస్ట్రేలియా గ్రేట్ బ్రిటనులో శ్రేష్ఠమైన జాతులు పెంచబడుచున్నవి. ఆ దేశమందలి వ్యవసాయమున నుపయోగింపబడుటకంటెను పశువులను మాంసాహార సంపాదనకొరకు, పరిశ్రమాభివృద్ధికొరకు ఆధారభూతముగా నున్నవి.

ఆంగ్లేయులకు గొడ్డుమాంసమనిన ప్రీతి. కావుననే హిందూదేశ గోవధ ముసల్మానులకంటె అతివిశేషముగా ఆంగ్లాధికారులకొరకు జరుగుచున్నదని గాంధి, మాలవ్య, దయానంద ప్రభృతులు సెలవిచ్చియుండిరి. నెపోలియన్ ఒకసందర్భమున సైనికులు గోగర్భముపైననే నడచుచుందురని చెప్పియుండెను. అనగా గోమాంసభక్షణమునకే వారు యుద్ధశూరులగుదురని భావము. ఆంగ్లేయులు గోవృషభపాల అనేకరీతులు పోషించి క్రొవ్వెక్కునటుల చేయుదురు. ఇటీవల పదివేలకొలది ఎడ్లు దూడలు ప్రస్తుత యుద్ధమిలిటరీవారికొరకు వధింపబడినవి. అందుచేతనే పశువులధర, విలువ పెరిగినది. రైతులా పశువులవిలువ తెలిసికొని చాలా జాగ్రత్తతో చూచుచున్నారు. పాశ్చాత్యులీ పశుమాంసమును అనేక పిండివంటకములు తయారుచేయుదురు.

క్రీస్తు శకారంభమునకు పూర్వమే సిరియా మున్నగు ప్రాంతములందు ఆర్యావర్తమునందు పశుజాతి కానవచ్చెనని అరిస్టాటిల్ మహాశయుడు వ్రాసియుండెను. హైందవులకు, గ్రీకులకు, రోమనులకు, ఐగుప్తీయులకు, హెబ్రూలకు పశువులు వెండి బంగారములకంటె విశేషప్రియతరములుగా నుండుట నిజము. అవియే వారి కల్పతరువులు. కామధేనువులు. హెసాయిడ్ అను నొక ప్రాచీన గ్రీకు కవీశ్వరుడు తన గ్రంథమునందు బండ్లులాగుటకు పొలములు దున్నుటకు తొమ్మిదేండ్లు నిండిన కోడెను కట్టుట యుక్తము. కారణమేమన వీని వయస్సు పదియేండ్లప్పటికి తన చిన్నతనపు చేష్టలు పోగరుబోతుతనము తగ్గిన, అప్పుడు అవి చెప్పినట్లు వినును. లేకున్న కాడిని బండిని తునకలు తునకలుగా విరగగొట్టును. హిందువుల హెబ్రూల గ్రంథములలో పశుపోషణావిధానమునుగూర్చి అనేక ప్రమాణములు గలవు. ఇప్పటికిని ఇండియాలోను ఫ్రాన్సు జర్మని రష్యా బల్గేరియా రోమేనియా ప్రాంతములందు పొలముపనులు చక్కబెట్టుటకు పశువులే చాలావరకు నుపయోగపడుచున్నవి.

## పశువులను బాధపెట్టుట

ఎన్ని పడరానిపాట్లు పడుచున్నను తమ బాధలను చెప్పుకొనుటకు పశువులకు నోరులేదు. అట్టి మూగజంతువులను సదా ప్రేమించవలెను. ఈ విషయమున బౌద్ధ, జైన మతాదర్శము లనుస్మరణీయములు. కృషికులు పశువులను బాధపెట్టుట తప్పనిసరియై

పశువులమీద అన్నిరాబడులు పందొమ్మిదికోట్ల రూపాయలని గ్రహించండి

నను ఆశాధలు సాధ్యమైనంత తక్కువగ నుండవలెను. ఇంగ్లండు మున్నగు దేశము లలో పశువుల నెగుమతిచేయు విషయములో వానినిపెట్టు బాధలపరిమితములు. శక్తిలేక కదలని జంతువుల చెవులలో నూనెను పోయుట, చెవులలో గడ్డిముక్క నిప్పు అంటించుట, తోకలు విరుగదీయుట మున్నగు అనేక ఘోరకృత్యములు చేయుచుందురు. పశువధవలన ప్రత్యక్షముగా గాకపోయినను పరోక్షముగావచ్చు నష్టము లనేకములు. కటికవృత్తి ఎక్కువగాయున్నచోటులనే నేరము లెక్కువగా జరుగుచుండుట అందరికి తెలిసినవిషయమే. లండనుకు తూర్పుభాగములో వందలకొలది కటిక దుకాణములు గలవు. ఆ పశువధ చేయునప్పుడు వాని నేడిరక్తమునకై అనేకమంది బాలురు చెంబులు పుచ్చుకొని వెళ్ళుదురు. అచటివారీవిధమున చిన్నతనమునుండి క్రూరదృశ్యములను చూచుట కలవాటుపడినందున వారిలో చాలామంది కఠినాత్ములు క్రూరాత్ములు తయారగుచున్నారు. అచట జరుగు నేరములకు, క్రూరకృత్యములకు మందులేదట. సంయుక్త రాష్ట్రములలో జరుగుచున్న హత్యానేరములు చాలావరకు కటికవృత్తియందున్నవారి చేతనే చేయబడుచున్నవి.

## టాలుస్టాయికవి వర్ణన

ఈ కవిగారు వ్రాసిన ఒక గ్రంథములో ఈదిగువరీతిగా వర్ణింపబడెను. ఈ భయానకదృశ్య వర్ణనలు ప్రతివారును చదువదగినవే. "అది జూన్ మాసము. ఆరోజు ట్రీనిటీ పండుగకు ముందు శుక్రవారము. కటికదుకాణముల బజారంతయు జనసమూహముతో క్రిక్కిరిసియుండెను. ఎద్దులు ఆవులు ఆవుదూడలు బండ్లకు కట్టివేయబడియుండెను. గుఱ్ఱపుబండ్లనుండి అనేకఆవుదూడలు దుకాణములోనికి దింపబడుచుండెను. కొన్ని బండ్లు దుకాణములనుండి పశుశవములను మోసికొనిపోవుచుండెను.

తెరచబడియున్న ద్వారమున కెదురుగా దుకాణములలోనికి ఇద్దరు మనుష్యులు ఒక బలిసిన ఎద్దును బలవంతముగా లాగుకొనిపోయిరి. లోపలికి వెళ్ళినతోడనే ఒక కటికవాడు తన బలముకొలది ఆ ఎద్దు అణుపై ఒక్క దెబ్బవేసెను. వెంటనే అది భూమిపైబడి తన నాలుగుకాళ్లతోను వెనుకభాగముతోను విలవిల కొట్టుకొనసాగెను. తక్షణమే మరియొక కటికవాడు దాని కొమ్ములు పట్టుకొని తలను బొక్కబోర్లగా త్రిప్పెను. ఇంతలో ఇంకొకడు తన కత్తితో దాని గొంతుకను పరపరకోసెను. రక్తసిక్తములగు బట్టలు ధరించిన ఒక చర్రవాడు ఆ ఎద్దు కుత్తుకనుండి ప్రవహించుచున్న రక్తము నొక పళ్ళెములోనికి పట్టెను. ఆ పళ్ళెము నిండుటతోడనే వానిని ఆబాలుడు అల్యూమినిమ్ ఫ్యాక్టరీకి తీసుకొనివెళ్ళెను. ఇటులనే మరొకపళ్ళెము నిండెను. కాని ఇంకను ఆయెద్దు పొట్ట వెనుకకాళ్ళు కొట్టుకొనుచునేయుండెను. రక్తము ప్రవహించుట ఆగిపోయినతోడనే కటికవాడొకడు దాని తల పైకెత్తి చర్మము వొలిచెను. తెలుపు నరములతోనున్న ఆ ఎద్దుదేహము చూచుటకు వికృతముగా నుండెను.' ఇంకను ఆ

యెద్దు కొట్టుకొనుచునే యుండెను. ఈరీతిగా ఒకదానితరువాత నొకటిని చంపుచునే యుండిరి.” ఇట్టి ఘోరకృత్యములు కన్నులార జూచిన యే మానవుని గుండెలు సమసిపోవు!

## ప్రాచీన ఋషీశ్వరుల పశుధర్మ సూత్రములు

దివావ్యక్తవ్యతా పాలే రాత్రౌ స్వామిని తద్గృహే
యోగక్షేమేఽన్యథా చేత్తుపాలో వ్యక్తవ్యతామితి ॥

పగలంతయు పశువులన్నియు కాపరుల స్వాధీనములోనుంచి మేపుదురు. కాబట్టి వాని మంచిచెడ్డలన్నియు వారే చూడవలయును. అందువలన నా పశువుల కేమైన ప్రమాదము వచ్చినపుడు కాపరులదే బాధ్యతయై యున్నది. సాయంకాలమునకు కాపరులు పశువులను తోలుకొనివచ్చి తమ యజమాని గృహమందు కట్టివైచి వెళ్ళుదురు. ఆ సమయములో యజమానిదే బాధ్యతయైయున్నది.

గోపః క్షీరభృతో యస్తు సదుహ్యాద్దశతో వరాన్
గోస్వామ్యనుమతే భృత్యః సా స్యాత్పాలేఽభృతే భృతిః॥

కాపరికి కూలి ఈయనిచో యజమానికి పదియావుల పాలను పిండియిచ్చి తాను ఒక ఆవుపాలను తనకూలిక్రింద పిండుకొనవచ్చును.

నష్టం వినష్టం కృమిభిః శ్వహతం విషమే మృతమ్
హీనం పురుషకారేణ ప్రదద్యాత్పాల ఏవతు॥

కంటికి కనుపడనిది, పురుగులచే కుక్కలచే తినబడినది, పల్లపుగుంటలు మొదలగువానిలోబడి చచ్చినది, కాపరిలేనిది, పారిపోయినది, అట్టి పశువును కాపరియె తెచ్చి ఈయవలెను.

విఘుష్య తు హృతం చోరైర్నపాలో దాతుమర్హతి
యదిదేశేచ కాలేచ స్వామినః స్వస్య శంసతి॥

దొంగలు దొమ్మిచేసి పశువులను అపహరించినచో ఆవిషయము కాపరి వెంటనే యజమానికి దగ్గరలోనున్నపుడే చెప్పినచో కాపరి నిచ్చుకొనవలసిన బాధ్యతలేదు.

నావినీతైర్వ్రజేద్ధుర్యైర్న చ క్షుద్వ్యాధి పీడితైః
న భిన్నశృంగాక్షిఖురైర్న వాలధి విరూపితైః ॥

---

లంక మేతను, గోదావరి ఈతను సరి

తుంటరివి, ఆకలిరోగములు గలవి, కొమ్ములులేనివి, గ్రుడ్డివి, గిట్టలులేనివి, తోకలేనివి యగు వృషభములను గట్టినబండ్లలో ప్రయాణము చేయరాదు.

పంచ పశ్వనృతే హంతి దశహంతి గవానృతే
శతమశ్వానృతే హంతి సహస్రం పురుషానృతే॥

చతుష్పాద జంతువువిషయమై అబద్ధము చెప్పినవాడు అయిదుగురు బంధువులను నరకమున త్రోసినవాడగును. గోవుల విషయమై అబద్ధమాడినవాడు పదిమందిని, గుఱ్ఱముల విషయమై అబద్ధమాడినవాడు వందమందిని, మానవుల విషయమై అబద్ధమాడినవాడు వెయ్యిమంది బంధువులను జంపినపాపమును బొందును.

అనిర్దశాహాం గాం సూతాం వృషాం దేవశూలాం స్తథా
సపాలాన్వా విపాలాన్వా న దండ్యా న్మనురబ్రవీత్॥

ఈని పదిదినములు గూడ గడవని గోవులను, చక్రము శూలము మొదలగు నచ్చు వేసి విడిచిన యెద్దులను, హరిహరాదులగు దేవతలకై అచ్చువేసిన యెద్దులను, గాపరులతోనున్నను లేకున్నను పొలములలోని సస్యములను దినుచున్నను వానిని దండింపరాదు.

క్షేత్రేష్వన్యేషు తు పశుస్సపాదం పణ మర్హతి
సర్వత్ర తు సదో దేయః క్షేత్రికస్యేతి ధారణా॥

మార్గగ్రామ సమీపేతర ప్రదేశములందలి పొలములలో గోవులు మేసినచో రూపాయి పావలా జరిమానా విధించవలెను. తినువాని గోవులు తినిన మేతఫలమును కాపరిగాని యజమానిగాని పొలము యజమానికి ఈయవలెను.

న వారయే ద్గాం ధయంతీం న చాచక్షేత కస్యచిత్
న దివీంద్రాయుధం దృష్ట్వా కస్యచిద్దర్శయే ద్బుధం॥

నీరు త్రాగుచున్న యావునుగాని, పాలు పుడుచుచున్న దూడనుగాని నివారింపరాదు. పాలు పీయునప్పుడు మాత్రము నివారింపవచ్చును. ఇతరుల దూడలు పాలు గుడుచునపుడు వారికి జెప్పరాదు. ఇంద్రధనస్సును ఆకాశమున జూచి యాదోషము నెరిగినవాడయి యుండియు ఇతరులకు చూపరాదు.

పిబంతీషు పిబేత్తోయం సం విశంతీషు సంవిశేత్
పతితాం పంకలగ్నాం వా సర్వప్రాణై స్స ముద్ధరేత్॥

---

గడ్డగడ్డకు పుట్టెడునీళ్ళు తాగినా రెడ్డే సేద్యము చేయవలయును

గోవులు త్రాగుటకు నీరుపోసినతరువాత తాను త్రాగవలయును. అవి పరుండిన తరువాత తాను పరుండవలయును. రోగముచేత క్రిందపడినను, బురదలో దిగబడినను శక్తికొలది ప్రయత్నించి లేవదీయవలెను.

కుశైః కాశైశ్చ బధ్నీయాద్గోపశుం దక్షిణాముఖమ్
పాశలగ్నాగ్ని దగ్ధేతు ప్రాయశ్చిత్తం న విద్యతే।

గోవును దర్భత్రాళ్లతోను, రెల్లుత్రాళ్లతోను దక్షిణాభిముఖముగ కట్టవలెను. ఈత్రాళ్లకు నిప్పుతగిలి కాలిపోయినను కొంచెము సంతాపము మాత్రమే కలుగును. కట్టివేసి యుండగా గోవు అగ్నిదగ్ధమయ్యేనేని ప్రాయశ్చిత్త మేమియులేదు.

కూపఘాతే తటాబంధే నదీబంధే ప్రపాసుచ
పానీయేషు విపన్నానాం ప్రాయశ్చిత్తం న విద్యతే॥

గోవులు నీరుత్రాగుటకై లోతుదిగుడు బావులలోనికి, మెట్లుకట్టియున్న పెద్ద తటాకములలోనికి, నదుల ఆనకట్టలలోనికి, నీరు త్రాగుటకై కట్టించిన పెద్ద రాతితొట్టి లోనికి దిగి మరణించిన యజమానికి ప్రాయశ్చిత్తము లేదు.



# ప శు సం ప ద

## రెం డ వ భా గ ము

### ప్రాచీన భారత రైతు

"మలమల యెండలో మాడుచునుండి
వడవడ జలిలోన వడకుచునుండి
మూగపసులతోడ ముచ్చటల్ సలిపి
అంటు డొక్కలతోడ నాకలిమంట
నారుగాలంబును దీరికలేక
దుస్థితిం దలచుచు దున్నుచునుండ
పదునారగా మేడి పైకిదున్నంగ
సుడిగొని యట్టిట్టు స్రుక్కుచునుండి
మటి పండ్లబిగువులో మాటాడలేక
దున్నుచుండెడి మాతి దుర్గతిజూడ"

"ఆచార్య రంగా"

ప్రాచీన భాగతరైతు స్థితిగతులపై ఒకసారి దృష్టి ప్రసాదించిన విశదమగును. అతనెంత స్వతంత్రముగా, సంతోషముగా నుండువాడో, భారతదేశపు శాంతి సౌభాగ్యాలు కలిగి వర్ధిల్లుచు యితరదేశాల దృష్టినికూడ ఆకర్షించుటకు అతను ఏరీతిగా కారకుడయ్యెనో మనకు గోచరించును. ప్రాచీనరైతు తన యింటబుట్టిన ఎద్దులతో సేద్యము చేసికొనుచు, తన పశువుల ఎరువుతో పొలమును బలపరచుకొనుచు, మిగతా ఎరువును వంటచెరుకుగా నుపయోగించుకొనుచు, కష్టకాలములో ఉపయోగించుకొనుటకు తగిన ఆహారపదార్థముల నిలువచేసికొనుచు, పాలు నెయ్యి తానుత్రాగినంత వరకు త్రాగి మిగిలినవి నగరములలో అమ్ముకొని యింటిఖర్చులకు కావలసిన ధనమును సంపాదించుకొనుచు జీవయాత్ర సాగించుచుండేవాడు. తన కుటుంబమునకు కావలసిన గుడ్డలు తానే స్వయముగా వడికి తయారుచేసికొనెడివాడు. ఈరీతిగా అన్నివిధముల అతడు స్వతంత్రమును, ఆనందమును, అనుభవించగలిగెడువాడు. సంతుష్టులు స్వయంపోషకు

---

చాలుక్రిందదున్ని బ్రతికినవాడు; చేనుక్రిందదున్ని చెడినవాడు లేదు

ఆ మాంసమును డబ్బాలలో పెట్టి విదేశములకు ఎగుమతి చేయుదురు. ఈ పరిశ్రమలకు పుట్టినిల్లు ఆస్ట్రేలియాదేశము. దీనినే ఇంగ్లీషులో "బేబీ బీఫ్ పరిశ్రమ" యందురు.

మనదేశములో మంచిరకముల పశువులు కొలదిగానున్నవి. ఒంగోలుజాతి పశువులు ప్రపంచములో ఎచ్చటనులేవని విదేశీయులే ఒప్పుకొనుచున్నారు. మైసూరు సంస్థానములోనున్న అమృతమహల్ జాతి, కోయంబత్తూరు జిల్లాలోనున్న కంగాయంజాతి, బెంగాలు జిల్లాలోనున్న ఆలంబాడీజాతి, గుజరాతీ జిల్లాలోనున్న కాంక్రేజుజాతి, పంజాబుదేశములోనున్న హరియానా షహివాల్ జాతి మున్నగునవి మనదేశములో ప్రశస్తమైన జాతులుగా పరిగణింపబడుచున్నవి. శీతోష్ణపరిస్థితులనుబట్టి జాతులుకూడ వృద్ధియగుచుండును. ఎక్కువవర్షములుకురియు మలబారు, బెంగాలు ప్రాంతములందుండు పశువులు పొట్టివిగానుండును. ఎక్కువ వేడిగానుండు సింధుప్రాంతములందుండు పశువులు బలముగాను, ఎత్తుగాను అందముగాను యుండును. మైసూరు ప్రాంతములందుండు పశువులు దృఢమగు ఎముకలుగలిగి ఎత్తుగా అందముగానుండును. ఒంగోలు ప్రాంతములందుండు పశువులు భూసారమెక్కువగా నుండుటవలన ఎత్తుగానుండును. దున్నలకు గేదెలకు వర్షము ఎక్కువగల ప్రాంతము లందున్నను పరవాలేదు. బొంబాయిజిల్లా మాహిల్ అను గ్రామములోని గేదెలు పెద్దవిగ బలిష్టముగనుండును. అచ్చట వర్షము తక్కువగానుండును.

## పశుసంపద సంవత్సరాదాయము

భారతదేశములోని పశుగణాభివృద్ధికిని, పాడిపరిశ్రమాభివృద్ధికిని సాధనోపాయములను సూచించుటకై ఒకకమిటీని ఈ మధ్యకాలములో నియమించిరి. కమిటీ అధ్యక్షులు శ్రీ డా॥ నార్మన్ సి. రైట్ గారు నవంబరునుంచి మార్చివరకు దేశములో పర్యటన మొనర్చి ఈరీతిగా తెలిపిరి. సంవత్సరాదాయము పశువుల మూలముగ సుమారు 1900 కోట్ల రూపాయలని తేల్చిరి.

| | | |
|---|---|---|
| పాలు పెరుగు మొదలగువానివలన | 810 | కోట్లరూపాయలు |
| వ్యవసాయపనులవలన | 612 | ,, |
| ఎరువులవలన | 270 | ,, |
| వ్యవసాయేతర పనుల వలన | 161 | ,, |
| తోళ్ళు చర్మము ఉన్ని మాంసము వలన | 45 | ,, |

## పశుసంఖ్య - ప్రభుత్వసహాయము

రైతు సంపదకు పశుసంపదయే మూలాధారము. పశుసంపదలేని రైతుసంసారము ధాన్యములేని కొట్టమువంటిది. పశుసంపదను వృద్ధిచేయుటకు ప్రభుత్వము కొంత

పల్లందున్నినవాడు; పల్లకెక్కినవాడు నొకటే

వరకు సహాయపడుచున్నది. కాని రైతుకూడ శ్రద్ధతీసికొననిదే ఈ సహాయము పరిపూర్ణత పొందలేదు రైతుప్రభుత్వమిచ్చిన సహాయముతీసికొనిన కాదు. ప్రభుత్వమునకు అది చేయుసహాయము సద్వినియోగపడు మార్గములను రైతు నచ్చజెప్పవలెను. అప్పుడే ప్రభుత్వమురొక్క సహాయమును రైతు సక్రమముగా పొందగలుగును.

ప్రపంచము మొత్తంమీదనున్న పశువులసంఖ్య సుమారు 70 కోట్లు. భారత దేశములో పశుసంఖ్య $24\frac{1}{2}$ కోట్లు. అందులో మద్రాసు రాజధానిలోని సంఖ్య 8 కోట్లు. ఆంధ్రరాష్ట్రములో దాదాపు $2\frac{1}{2}$ కోట్లు యుండును. దేశములో పండు పంట కొరకు ప్రజలతోపాటు పశువులు పాటుపడుచు ఉభయులు పాటుపడుచున్నారు. గేదెజాతినికూడ కలుపుకొనిన దేశములో ప్రతివంద మనుష్యులకు 60 పశువులున్నవి.

ప్రపంచము మొత్తం 70 కోట్లు

ఇండియా 25 కోట్లు

మద్రాసు 8 కోట్లు ఆంధ్రదేశము $1\frac{1}{2}$ కోటి

పశువుల సంఖ్య

## భారతదేశములోని పశుసంఖ్య

భారతదేశ రైతునాయకులు, పశుసేవాభిలాషులు నగు శ్రీ ఆచార్యరంగా ఎం. ఎల్. ఏ. గారు భారతదేశములోని పశువుల వివరముల క్రిందివి తెలిపియుండిరి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఎద్దులు | 4628307 | లేగదూడలు | 31653341 | గేదెదూడలు | 11098661 |
| కోడెలు | 46762653 | దున్నపోతులు | 5193396 | నాగళ్ళు | 25349192 |
| ఆవులు | 30532054 | గేదెలు | 15116893 | బండ్లు | 7506114 |

మడికి గట్టు; ఇంటికి గుట్టు మంచిది

## భారత సంస్థానములలోని పశుసంఖ్య

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఎద్దులు | 1863433 | లేగ దూడలు | [illegible]626580 | గేదెదూడలు | 3756143 |
| కోడెలు | 11888808 | దున్నపోతులు | 1098342 | నాగళ్ళు | 5843276 |
| ఆవులు | 13430983 | గేదెలు | 1479781 | బండ్లు | 1827797 |

## భారత వ్యవసాయము — పాటుపడు పశువులు

ఈక్రింద నుదహరించిన పట్టికను బట్టి హిందూదేశములో వేరువేరు రాష్ట్రముల యందు పశుసంఖ్య ఎంతగలదో తెలిసికొనవచ్చును. ఇంతియేగాక ఆచటి జనసంఖ్యకును పశుసంఖ్యకును సంబంధము నూరు ఎకరముల భూమికి ఎన్నెన్ని సాధారణ పశువులు ఎన్నెన్ని ఎద్దులు గలవో కూడ గ్రహింపవచ్చును. ప్రతిరాష్ట్రమునందు సహజముగనున్న పచ్చికబీళ్ళు పశువులమేత కొరకైనను కూడ నిర్మాణింపబడినవి.

| రాష్ట్రము | సాగుభూమి | పశువుల సంఖ్య | జనులకు పశుసంఖ్య |
|---|---|---|---|
| అస్సాం | 5,915000 | 5785000 | 76.1 |
| బెంగాలు | 23528000 | 25491000 | 54.6 |
| బీహారు ఒరిస్సా | 25,269000 | 20728000 | 61.0 |
| బొంబాయి | 27492000 | 8480000 | 57.0 |
| సింధు | 4425000 | 2326000 | 70.9 |
| బర్మా | 17046000 | 6267000 | 47.4 |
| మధ్యపరగణాలు | 24895000 | 11671000 | 83.9 |
| మద్రాసు | 33339000 | 22111000 | 52.2 |
| పంజాబు | 26940000 | 15237000 | 73.7 |
| సంయుక్త రాష్ట్రములు | 35121000 | 31046000 | 68.4 |
| మొత్తం | 226950000 | 150978000 | 61.1 |

## చెన్నరాజధాని పశువులు

చెన్నరాజధానిలోని పశువులు చాలా కాలమునుంచి మంచి పేరుప్రతిష్ఠలలో నున్నవి. ఇందను మైసూరు ఒంగోలు నెల్లూరు ప్రాంతములలోని పశువులు ఎక్కువ సాంప్రదాయముగ నుండును. పశువులకు కావలసిన సామగ్ర్యములు చూచుటకు రైతు కొన్ని సంతలకుకూడ పోవ కుతూహలపడు చుండును. దక్షిణదేశములో పశువుల సంతలు తిరుచునాపల్లి, మధుర తిరునల్వేలి మున్నగు జిల్లాలలోను ఉత్తరమున అనంతపురం బళ్ళారి మొదలగు జిల్లాలలో గలవు.

ఒంగోలుజిల్లా పశువులు చూచుటకు చాలా అందముగానుండును. కాని కొన్ని ప్రత్యేకపు పనులకుకూడ పనికివచ్చును. కాని మైసూరు పశువులలో సర్వవిధముల

భేదించును. అవి ఆకారములో చాలా పెద్దవిగను మిక్కిలి వినయ విధేయతలు కలిగి యుండును. పెద్దబరువులు ఈడ్చుటకు ఉపయోగించును కాని మైసూరు పశువులు రోడ్లమీద నడచుటకుమాత్రమే ఉపయోగపడును. ఇంకను బలముగల పాదములు కలిగి చాకచక్యముగా మిక్కిలి స్థైర్యముగానుండును.

రాజస్థానియొక్క శీతోష్ణస్థితి వివిధప్రాంతములలో వివిధరూపములుగా నుండును. శీతోష్ణస్థితిగూడ పశువుల శిక్షణమునకు కొంత తేడాను కలుగజేయుచున్నది. కోయంబత్తూరు ఆలంబాడి పశువులు చాలాతక్కువ ధరలకు విక్రయించబడును. దక్షిణ కోయంబత్తూరులోని పశువులు అనేకసంవత్సరములే పనిచేయగలవు. దక్షిణదేశపు వేడిప్రాంతములలోని సామాన్య పశువులు పది లేక పన్నెండు సంవత్సరములు పని చేయును. ఇంకను దక్షిణదేశములో చాలా తాలూకాలలోని పశువులు రెండు లేక మూడుసంవత్సరములే పనిచేయును. ప్రత్తిపండు నల్లరేగడి నేలలో అనగా తిరునల్వేలి, దక్షిణరామనాడు, మధురజిల్లాలలో కంగాయం పశువులుకూడ ఇప్పుడు వ్యవసాయవృత్తికి ఉపయోగపడుచున్నవి. ఆ దేశపు పశువులు "మలయమాడు" అని అనంతపురం జిల్లాలో పిలువబడును. ఇవి పదిసంవత్సరములు పనిచేయును.

పశువులు చిన్నతనమునందు ఒక దేశమునుండి మరియొకదేశమునకుగొని పోబడిన యెడల ఆయాదేశపు శీతోష్ణస్థితులకు అవి అలవాటగును. దక్షిణమలబారులోకూడ కొంతమొత్తముగల పశువులు మేపబడుచున్నవి. పడమటి తీరమునందు నివసించు పశువులు కొంతకాలము పచ్చిగడ్డి బాగుగాతినును. చాలాకాలము ఆహారము లేక మలమల మాడును. కంగాయం, ఒంగోలు ప్రాంతపు భూములలో సున్నమెక్కువగా నుండుటచే పశువులఎముకలు దృఢముగానుండును. అందుచేత మొదటిరకము పశువులుగా పరిగణింపబడుచున్నవి. పడమటితీరపు ప్రాంతము నీలగిరి ప్రాంతము గంజాం ప్రాంతములలో ప్రత్తిపండు నల్లరేగడిభూములు ప్రత్యేక తెలుపు[illegible]ములు, నూతుల వ్యవసాయపు మెట్టభూములుగలవు. ఏటినీరుసాగుచేయుటకు చాలాపశువులు కావలెను. నల్లరేగడి భూములలోని రైతులు పశువులను జాగ్రత్తగా మేపుదురు. ఎఱ్ఱరేగడి భూములలో రైతులు మంచిబలము గురుతుగల పశువులను మేపరు. నూతులక్రింద పొలములు సాగుబడిచేయు ప్రదేశములలోని ఎక్కువ నీటిని [illegible] లాగ వలసి యుండుటవలన మంచిబలముగల ఎద్దులుండవలెను. కోయంబత్తూరులో నున్న నూతులు దత్తమండలములోని పెద్దమోటలు నల్లరేగడి భూములలోనున్న పెద్ద ఎద్దులే యుండవలెను.

## ఆంధ్రరాష్ట్రములోని పశుసంపద (వేలలో)

ఈ క్రింది పట్టీను శ్రీ వూ జీ పార్లమెంటరీ సెక్రటరీ యం. బాపినీడుగారు వ్రాసిన ఆంధ్రసర్వస్వమునుంచి తీసికొనబడెను.

---

మార్గశిరమాసములో మ[illegible]టకు ప్రొద్దుండదు

| జిల్లా పేరు | ఎద్దులు | ఆవులు | దూడలు | దున్నలు | గేదెలు | గొఱ్ఱెలు | మేకలు |
|---|---|---|---|---|---|---|---|
| విశాఖపట్టణము | 411 | 316 | 222 | 267 | 241 | 603 | 363 |
| తూర్పుగోదావరి | 251 | 242 | 192 | 110 | 214 | 62 | 104 |
| పశ్చిమగోదావరి | 166 | 139 | 112 | 95 | 188 | 68 | 80 |
| కృష్ణా | 163 | 146 | 100 | 116 | 354 | 203 | 192 |
| గుంటూరు | 196 | 130 | 144 | 183 | 559 | 557 | 166 |
| నెల్లూరు | 226 | 242 | 138 | 142 | 356 | 1081 | 471 |
| కర్నూలు | 190 | 100 | 75 | 56 | 269 | 577 | 278 |
| బళ్ళారి | 200 | 114 | 103 | 31 | 130 | 350 | 238 |
| అనంతపురం | 243 | 153 | 135 | 50 | 135 | 1171 | 430 |
| కడప | 155 | 92 | 55 | 70 | 219 | 744 | 303 |
| చిత్తూరు | 353 | 344 | 320 | 46 | 133 | 962 | 549 |
| మొత్తం | 2254 | 2018 | 1456 | 1166 | 2798 | 6379 | 3174 |
| మొత్తం ధర రూపాయలలో | 178780 | 100900 | 29120 | 58300 | 83940 | 25516 | 9522 |
| తల1కిసరాసరివెల | రూ 70 | 50 | 20 | 50 | 30 | 4 | 3 |

షరా:— ఇంకను ఆంధ్రరాష్ట్రములో సుమారు 75 లక్షల కోళ్ళుగలవు. వీటిలో అయిదవ వంతు విశాఖపట్నం జిల్లాలోనే యున్నవి.

## ఆంధ్రరాష్ట్రములో గవర్నమెంటువారి పశుచికిత్స

| జిల్లా | తాలూకా | గ్రామములసంఖ్య | పశువుల ఆస్పత్రులు | పశువులసంచార వైద్యులు |
|---|---|---|---|---|
| విశాఖపట్నం | 19 | 11547 | 7 | 13 |
| తూర్పుగోదావరి | 13 | 1920 | 8 | 9 |
| పశ్చిమగోదావరి | 7 | 716 | 4 | 6 |
| కృష్ణా | 9 | 981 | 6 | 8 |
| గుంటూరు | 9 | 926 | 5 | 6 |
| నెల్లూరు | 13 | 1621 | 3 | 10 |
| కడప | 9 | 889 | 4 | 5 |
| కర్నూలు | 9 | 796 | 4 | 11 |
| బళ్ళారి | 9 | 908 | 4 | 9 |
| అనంతపురం | 9 | 853 | 3 | 7 |
| చిత్తూరు | 10 | 2254 | 3 | 10 |

షరా:— వైస్రాయ్ లిన్‌లిత్‌గో రిటీవల 20 వేల పశువులున్న కేంద్రములో ఒక పశువైద్యుడవసరమనిరి. ఈరీతిగా లెక్కించిన ఎంతమంది పశువైద్యులుండిన మన పశుసంతతి బాగుపడునో చదువరులు గ్రహించుదురుగాక.

# స్వస్థవృత్తము

## మూడవ భాగము

“కవ్వ మాడించుచు గదురు గిట్టునద్రిప్పి
కామితార్థములిచ్చు కర్మభూమి

పైరుల్ పరిశ్రమల్ పలురకమ్ముల మించ
మక్కువ జూపించు మాతృభూమి

పసులకు గ్రాసంబు ప్రజలకు బూసంబు
సమకూర్పజాలిన జన్మభూమి

గోవు మాణిక్యాల గొట్టు నాగళ్ళకు
బూజలనందించు పుణ్యభూమి

కటకటా! నేటికన్నియు గనులమూసి
జీవకళ గోలుపోయి నిస్తేజమెల్ల
కాలగర్భంబునందట్టె కలిసియుండె
బ్రాభవం బణగాఱగా బల్లెటూళ్లు॥”

“పల్లెటూరు”

పశువు లారోగ్యముగా నుండుటకు మంచి మేతయు త్రాగుటకు మంచి నీరును పీల్చుటకు శుభ్రమైన గాలియును లభించునటుల చేయుట మన కర్తవ్యము. పశువులను ఎండలో నుంచక తడియనీయక కాపాడుచుండవలెను. పశువునకు దేహారోగ్యమున కంటె అధికమైన శ్రేయస్సులేదు. అట్టి ఆరోగ్యము లేనప్పుడు ఆపశువ [illegible] గాత్రము పనిచేయజాలదు. ఒకవేళ చేయగలిగినను ఆపని పశువునకు మిక్కిలి శ్రమ [illegible]నిపింపక పోదు. కాబట్టి ప్రతిరైతు తమపశువులను ఆరోగ్యస్థితిలో నుంచుట ముఖ్యధర్మముగ పరిగణించబడినది. గాలివలన దీపమునకు హాని కలుగనీయక మన ప్రయత్నపూర్వకముగా నెటుల కాపాడుచున్నామో అటులనే యుక్తమైన ఔషధాది వస్తువులను గుర్తెరింగి రోగములను మాన్పుటకు ప్రయత్నము చేయవలెను.

---

పుష్యమాసమునందు పూసలుగ్రుచ్చు ప్రొద్దువుండదు

## ఆహార పానీయములు

వివిధ దేశములయందు పశువుల కాహారముగ నుపయోగించు పదార్థములు వివిధములుగ నుండును. ఇట్టి పదార్థస్వభావము దేశముయొక్క శీతోష్ణస్థితిని బట్టియు ఆ యా పశువులు చేయుపనులను బట్టియు మారుచుండును. దూడలుగానుండు వయస్సులో దేహముయొక్క సకలభాగములను వృద్ధిజేయుటకును పశువు బ్రతికినంతకాలము నిరంతరము ఆ యా భాగములను తిరిగి బాగుచేయుటకు దేహవ్యాపారములకు సాధనముగ నుండుటకు ఆహార ముపయోగమైయున్నది. పశువులకు పెట్టు ఆహారపదార్థములలో జీర్ణముకాగల మాంసకరపదార్థము లెంతయున్నవో ఉష్ణకరపదార్థము లెంతయున్నవో క్రొవ్వుపదార్థము లెంతయున్నవో విచారింపవలయును. పశువులకు పెట్టు ఆహారపదార్థములలో యే యే వాన్ని కలిపిపెట్టవలెనో తెలిసికొనుట ముఖ్యమైనపనియై యున్నది. ఆహారము విస్తారముగా దొరకు కాలములందును వేసవికాలమందును పశువులకు హెచ్చు తగ్గులులేక సమానముగా మేత మేపవలయును. ఆ మేత సులభముగ జీర్ణమగునదిగను సారవంతమగునదిగను ఉండవలయును గాని నిస్సారమైనట్టియు బూజుపట్టియుండునట్టియు తుక్కుగడ్డి ముక్కినగడ్డి మొదలగునవి మేపరాదు. వేసవికాలమందు సరియైన మేత దొరకకపోవుటచేత క్షుద్బాధకు ఓర్వలేక విషవంతములైన ఆహారములుతిని పశువులు పలువిధరోగముల పాలగుచున్నవి. జంతువుల జీర్ణశక్తి భిన్నభిన్నములుగా నుండును. నెమరువేయు జంతువులుదిను ఆహారములో చాలాభాగము [illegible] జీర్ణము చేసికొనగలవు. పాడిపశువులకు అం[illegible] బలకరముగు [illegible] పెట్టనవసరములేదు. ఈ జంతువులు తాముతిను ఆహారములోని సారమును చాలవరకు గ్రహించుచునుగాన వాని శరీరపోషణకు తగినబలమును పొందగలవు.

జంతువ వయస్సు మీదయొక్క పరిమాణము [illegible] తువులు పాటుపడుట ఈమూడును జీర్ణశక్తిలో హెచ్చుతగ్గును కలిగింప[illegible] [illegible] పాటు పగులునట్లు మేపినను తక్కువచేసిపినను ఎక్కువగా పనచేయుచున్నను రోజు విడచి రోజు ఆహారము పెట్టినను ఎక్కువసారమును తీసికొనలేవు [illegible] పోనుగడ్డుండి సామాన్యస్థితిలో 70 పాళ్ల సారముకంటె తీసికొనలేవు. పశువు నెమరు వేయుచున్నదో ఏపదార్థము ఆహారముగాను [illegible] కలుపబడినవో అను ఆహారము [illegible] బట్టి జీర్ణశక్తి మారుచుండును.

పశువులను పోషించుటకు చవుకగానుండు దాణాలకొరకు, మేతకొరకు ఎవరెవరేసే నాల నిచ్చుచుంటిరని రైతులాందోళన పడుచుందురు. కాని అట్టివిషయములు రైతుయొక్క అనుభవముమీదనే తెలిసికొనుటయుండదని నా అభిప్రాయము. పలువిధరకములగడ్డిజాతులను, దాణాలను రైతు నిత్యముపాడుచుండును. అట్లువాడుట వలన

---

మాఘమాసములో ముంటలోపడ్డా చలియుండదు



అఖిలభారత పశుప్రదర్శనము - బెజవాడ

ఈ ప్రదర్శనములో డాక్టరు యేజెళ్ల శ్రీరాములుగారుకూడ పాల్గొన్నారు.



పాందువ్వ మునసబుగారి సాంప్రదాయముఃగల ఎద్దు.



శ్రీ మాదినేని వీరరాఘవయ్యగారి ఎద్దులజత — జంపని గుం. జి.



శ్రీ గన్నంనేని వెంకయ్యగారి ఎద్దులజత — పూనూరు గుం. జి.



శ్రీ బెల్లం రాఘవయ్యగారి చక్కని కోడెలు — కేశవర్పాడు గుం. జి.

ఏయేపదార్థములు సరిపడినవో, ఏవిసరిపడుటలేదో గ్రహించి మార్చుకొనుచుండవలెను. గవర్నమెంటు వ్యవసాయడిపార్టుమెంటువారు పలువిధరకముల దాణాలను కనిపెట్టుట, పశువు ఖరీదునకుమించిన ఖర్చును సామాన్యరైతు భరించలేకపోవుట కలుగుచున్నది గాన కృత్రిమ ఆహారములతో, పశువులను పోషించక స్వచ్ఛమగు గడ్డిజాతులతో, దాణాలతో, పోషించుటవసరము. ఆయాదేశశీతోష్ణస్థితిగతుల బట్టికూడ ఆహారము పెట్టుచుండవలెను. ఒక ప్రాంతమందు పెట్టుఆహారపదార్థములు వేరొక ప్రాంతమందు పెట్టిన సరిపడవు. ఒక ప్రాంతములో ఒక జొన్న చొప్పనూనెపెట్టిన కొన్నిపాలు పాలుపడును. అదేరీతిగనే మరొక ప్రాంతమందు వాడిన పనిచేయదు. కాబట్టి ఆయాదేశ శీతోష్ణస్థితిగతులను బట్టియు, ఇండియా గవర్నమెంటువారు పరిశోధనచేసిన ఈ పదార్థములేమైన యున్న వారిసలహాల ననుసరించి పెట్టుటవసరమని నేను సలహా నిచ్చుచున్నాను.

## జీర్ణశక్తి కలుగుటకు పెట్టువస్తువులు

ప్రతిదినము పశువులకు పెట్టుమేతతో తగినంత తెలికపిండి గోధుమలు వగైరా కలుపుట మంచిది. తగినంత ఉప్పును కూడ ఆహారముతో చేర్చి పెట్టుటమంచిది. పశువెంతబరువున్నదో గ్రహించి పదివందల పౌను బరువున్న జాతువునకు రోజునకు అరపౌను తూకముగల చమురుపదార్థములు పెట్టవలెను. ప్రతిరోజూయిచ్చు ఆహారములో నాలుగుపాళ్లు నియుండవలెను. అప్పుడప్పుడు ఆహారముతో మెంతిపిండి కలిపి పెట్టుట మంచిది. ప్రతిదినము పెట్టుఆహారములలో కొన్నిబలములు గలిగియుండును. మరికొన్ని రోగములు పుట్టించును. శనగ, కంది, పెసర, అలసంద, గోరుచిక్కుడు, మినుము, అలచంద, మున్నగు కాయధాన్యముల పొట్టు, చెత్త మున్నగువాటిలో మాంసకరపదార్థము లుండుటవలన మంచిబలము కలుగజేయును.

## రైతుల ఆతురత

ప్రతిరైతు మా పశువునకు ఏ ఆహారము పెట్టిన పాలిచ్చును ఏమి మేపినబాగుగా బలియును. వాతముచేయకుండ పెట్టునట్టిఆహారములేవి? యని వివిధరకములుగా వైద్యులను సలహాలడుగుదురు. ఇట్టి సలహాలు రైతులఅనుభవము మీదనే తెలిసికొనుటమంచిదిగాని వైద్యుల నడిగి అనుభవములేని సలహా నిచ్చువారు కొందరుందురని తలంచవలెను. రాగి, సజ్జ, మొక్కజొన్న, కొఱ్ఱ, వరిగ, అరిక మున్నగు కంకిధాన్యముల గడ్డియును చొప్పయును అంతబలముగల వస్తువులుగావు. వరిపొట్టునకుండు బలము ఊలపొట్టు నకులేదు. వరిగడ్డికంటె గోధుమగడ్డి బలకరమైనది. శనగలు పప్పుకంటె నెక్కువబలము గలవి. కంకిధాన్యముల గడ్డి అన్నిటికన్న బలహీనముగా నుండును. కాయధాన్యముల గడ్డికంటె కంకిధాన్యముల పొట్టు బలమెక్కువనిచ్చును. చమురునిచ్చు అనుదములు, నువ్వులు మున్నగు గింజ ధాన్యములు బలకరమైనవి. ఈ చమురునిచ్చు గింజల

---

శివరాత్రికి శివశివాఅని పొందిచలి

కంటె కాయధాన్యము లెక్కువ బలకరముగా నుండును. కాయధాన్యముల కంటె తెలికపిండి, కొబ్బరిపిండి మున్నగునవి బలకరమైనవి.

ప్రతిధాన్యములోను నీరు, చమురు, మాంసకరపదార్థములు, ఉష్ణకరపదార్థములు నారవస్తువులు తప్పకయుండును. పశువు జీర్ణము చేసికొనునప్పుడు మాంసకరపదార్థములు ఒకవిధమగు పంచదారగా మారిపోవును. ఉష్ణకరపదార్థములుకూడ మరొకవిధమగు పంచదారగానగును. చమురు విశేషముగానున్న పదార్థములు తేలికగా జీర్ణమగును. అందుచేత నువ్వులు మున్నగునవి త్వరగా జీర్ణము కావు.

ఒకపశువు తానెంతబరువుగలదో దానిలో 20 వ వంతు బరువుగల మంచి పుష్టిగల ఆహారము పెట్టినయెడల అది సజీవముగ బ్రతికియుండగలదు. అంతకంటె ఆహార మెక్కువయిచ్చిన బలము హెచ్చును. కాబట్టి వందమణుగుల బరువు తూగుపశువునకు రోజునకు నాలుగుమణుగుల ఆహారమిచ్చిన ప్రాణముతో నుండగలదు. 50 మణుగుల బరువుగలదానికి రెండుమణుగులు ఆహారమిచ్చిన చాలును. ఆహార మెంతకావలయునో అంతకు నాలుగురెట్లు నీరుకావలయును. నాలుగుమణుగుల పొడిఆహారము తినుపశువునకు 16 మణుగుల నీరు కావలెను. నెమరువేయు జంతువులకు పెట్టు ఆహారము కొంచెము బిరుసుగాను ఎండుగాను నుండవలెను. మెత్తని ఆహారము పెట్టిన నెమరునకు తెచ్చుకొనజాలవు. అందుచేతనే పలువిధరోగములు కలుగుచుండును.

## వాయువు

పుట్టినదిమొదలు చనిపోవువరకు మేలుకొన్నను నిద్రపోవుచున్నను ఎడతెగక చేయునుపని గాలిపీల్చుటయే. కనుక పశుజాలము బ్రతుకుటకు వాయువే ప్రాణాధారము. గాలి మనకంటికి కనబడదు. అది వీచునట్లు స్పర్శరూపమున తెలియును. సముద్ర మంతయును నీటిమయమై యుండుటవలననే మనమందు భూమికూడ వాయువుచేత నావరింపబడియున్నది. గాలి ప్రతిపశువునకు ముఖ్యావసరము. కొన్ని ప్రదేశములనుండి వెలువడు గాలి మంచిదిగను మరికొన్ని ప్రదేశములనుండి వెలువడుగాలి చెడ్డదిగను యుండును. [illegible] శ్వాసకోశములలోనికి వాయువును పీల్చకుండ జీవించుటయే కష్టము. ఊపిరితిత్తులందు ముఖ్యభాగమగు ప్రాణవాయువు పశువుయొక్క జీవితాధారమైయున్నది. [illegible] శరీరమందలి పోషణమును ఉష్ణతను అనుకూలమగు గతుల నుంచుటకు నరములకు సామాన్యముగా శరీరమంతటికి బలము కలుగజేయుటకు వాయువు అవసరమైయున్నది. వాయువు చలనము లేకపోవుట ఒకప్పుడు మురికితోను విషయుక్తమైగూడ నుండును. అట్టి విషపూరితమైన గాలి పీల్చుటవలన అనేక పశువులు మరణించుచున్నవి. కాబట్టి వాయువు ధారాళముగా నుండు చోట్ల పశువుల నుంచవలెను.

---

ఉత్తరాన ఉరిమినా, పాముకరచినా తిరుగక, కరవక విడువవు

తరువాత బండికట్టుట నాగలిదున్నుట తటసించును. తరువాత పశువునకు వగర్పు వాతము మున్నగు రోగములు సంభవించును. అంతటనుంచి మరల పశువు ఆస్పత్రులకు తీసికొని వచ్చి చికిత్సలు చేయించుదురు. ఈ రోగమే పాడిపశువులలోగూడ నుండును. కాబట్టి. రైతులు చక్కగా గమనించి మీ పశువులకు తగినంత శరీరపరిశ్రమ కలుగునటుల చేయుదురుగాక.

## విశ్రాంతి

కష్టపడి పనిచేసిన పశువునకు విశ్రాంతి అవసరము. విశ్రాంతివలన అలసట చెందిన అవయవములు తిరిగి బలము చెంది యథాప్రకారముగా పనిచేయుటకు దార్ఢ్యము కలవగును. ఎల్లప్పుడు యిట్లగు సుకరముగా మేపు పశువునకు గూడ విశ్రాంతి యవసరము. శరీరమెట్లు విశ్రాంతి కోరునో పశువు జీర్ణకోశముగూడ అట్లే విశ్రాంతి గోరును. బండ్లు కిరాయికి తోలు రైతులు పశువునకు విరామమీయక తమ కిరాయి నపేక్షించి వానిని రాత్రింబవళ్ళు చంపుదురు. ఇట్టి రైతులు చాలా మూఢులని చెప్ప వచ్చును.

## దేహమును శుభ్రముగానుంచుట

ఉష్ణదేశములయందు స్వేద మెక్కువగానుండును. శీతలదేశమునందు ఊపిరి మూలమునను మూత్రముగుండను విసర్జింపబడు కల్మషములు ఉష్ణదేశములయందు శరీర స్వేదమునుండి బయటకు పోవును. కల్మషములు శరీరముమీదను నిలిచియుండిన యెడల శరీరముయొక్క వ్యాపారము కట్టిపెట్టును. మన దేశములో రైతులు పశువుల దేహమును శుభ్రపరచుటలేదు. శుభ్రపరచనిచో మడ్డిజేరును. ఈమడ్డి చేరుటవలన గజ్జి తామర పొడ నుసిమిరి మున్నగువ్యాధులుపుట్టును. గోమరులు పిడుదులు ఈమడ్డి నాశ్రయించుకొనును. పాటుపడుపశువులను పాడిపశువులను శుభ్రముగా తోమి కడుగవలెను. అప్పుడప్పుడు గేదెల శరీరమునకు నూనెగాని ఆముదముగాని వ్యాసులైనును గాని రాచి స్నానము చేయించిన చాలా ఆరోగ్యముగానుండి పాలు బాగుగానుండును.

## మాలీసు చేయుట

మనదేశములో పశువును మాలీసు చేయుట యొకవిధమగు చికిత్సాపద్ధతిగ చిరకాలమునుండి యెంచబడుచున్నది. ఈ వైద్యసంబంధమగు పరిశ్రమలు అనాది నుండియు వచ్చుచున్నవి. బెణుకులు కీళ్ళవాపులు నరముల సంబంధములగు వెన్నెముక సందర్భములందు తిమురువాతము పశువును పడగొట్టి లేపినతరువాతను ఈ చికిత్సాపద్ధతు లుపయోగపడుచున్నవి.

పశువు శరీరమంతటనుగాని లేక శరీరముయొక్క యే ప్రత్యేకభాగముయొక్క గాని పోషణమును బలపరచుటయును వ్యాధివలన శరీరముయొక్క యే ప్రత్యేకస్థలము

---

దుక్కిలేని చేను, తాలింపులేని కూర

పశుశాలలలో ఎంగిలి, మలమూత్రములు, శ్లేష్మము, మున్నగు అశుద్ధవస్తువుల నుంచరాదు. రజస్వలకన్యను, కడజాతివాండ్రను, రంకటాండ్రను రానీయరాదు.

నలంఘయే ద్వత్సతరీం నక్రీడే ద్గోష్ఠసన్నిధౌ
న గంతవ్యం గవాం మధ్యే సోపానత్కైస్సపాదుకైః॥

శాలలో లేగలమీదగా దాటరాదు. వ్యభిచరించరాదు. చెప్పులు పావుకోళ్లు వగైరా తొడుక్కొని పోరాదు.

హస్త్యశ్వరథయానైశ్చ సవితానైః కదాచన
దక్షిణోత్తరగైః ప్రహ్వైర్గంతవ్యంచ పదాతిభిః॥

ఏనుగు మొదలగు వాహనముల నెక్కి గోవుల మధ్యనుండి పోరాదు. కుడివైపున గాని ఎడమవైపున గాని అతి వినయముగా కాలినడకతో పోవలయును.

శాలాం ద్విపానాం వృషగోహయానాం, తాం యామ్యదిగ్ద్వార
వతీం విదధ్యాత్
సౌమ్యా కకుబ్ద్వారవతీం సుఖోభాం తేషాంశమిచ్ఛన్ హితమాత్మనశ్చ॥

ఏనుగుల యొక్కయు వృషభములయొక్కయు గోవుల యొక్కయు గుఱ్ఱముల యొక్కయు శాలలో దక్షిణద్వారము లుండునట్లు చేయవలయును. అట్లు చేసిన పశువులకును తనకును మేలుకలుగును.

గావోవృషోవా హయహస్తినోర్వా అన్యేఽపిసర్వే పశవోద్విజేంద్రాః
యామ్యాముఖైనైనతు చోత్తరాదిఙ్ముఖాదినా తే ఖలు బంధనీయాః॥

గోవులనుగాని వృషభములనుగాని గుఱ్ఱములనుగాని ఏనుగులనుగాని మరియే యితరపశువులైనను దక్షిణముఖముగానైనను, ఉత్తరముఖముగానైనను కట్టవలయును.

ఆగచ్ఛంతో గోష్ఠేవృద్ధ్యైచ వేశ్మ బంభారవేణ సంసేవతో్యే
గోష్ఠవృద్ధ్యైగవాంగాః ఆర్ద్రాంగ్యోవా హృష్టరోమిః ప్రకృష్టా
ధన్యా గావః స్యుర్మహిష్యోఽపిచైవం॥

గోవులు అంబాయనుచు నింటికివచ్చిన గోశాలవృద్ధియగును. గోవులను సేవించుచువచ్చినను గోశాల వృద్ధియగును. తడిసిన అవయవములతోగాని, నిక్కబొడిచిన వెండ్రుకలతోగాని సంతసించుచు వచ్చిన గోవులుమంచివి. ఈరీతిగనే గేదెలుకూడ నుండును.

రోహిణి ఎండను రోళ్ళు పగులును

## పశువులశాల — ఇతర నిర్మాణములు

మనము నివసించు గృహము లెంత పరిశుభ్రముగ నుండునో పశువులనుంచు శాలలు గూడ అంత పరిశుభ్రముగా నుండవలెను. పశువుల శాలలు అనారోగ్యముగా నున్న యెడల అందుండు జంతువులకే గాక ఇండ్లలో కాపురముండు మనుష్యులకుగూడ అంత అనారోగ్యము కలుగుట మనకందరకు తెలిసిన విషయమే గదా? కావున అట్టిశాలలు తేమలేనివిగ చక్కగా గాలివచ్చునవిగ పశువుల మలమూత్రాదులు కడిగివేయుటకు వీలుగలవిగ నుండవలెను. పశుశాలకు కొట్టమనియు, పశువుల చావడియనియు పశువుల దొడ్డియనియు, మన దేశములో పేర్లు పెట్టుదురు. పశువులు అడవిలో నుండునపుడు వాటికి ఎండతగులకుండ పెద్దచెట్లును, వర్షమునకు తడవకుండ కొండగుహలును, వలసినపుడెల్ల తగినంత మేతయును నీరు త్రాగుటకు సెలయేరులును విహరించుటకు విశాలమగు స్థలములు భగవంతుడు నిర్మించియున్నాడు.



పశువుల కొట్టము

అనాది సిద్ధమగు వేద కాలమునందు సయితము ఋషిపటీరములందు పెంచబడుచుండెడివి. మన ఉపయోగములకై వాటిని తెచ్చుటతోడనే వాటి స్వేచ్ఛ పోయినది. మన దేశములో పశుశాలను నిర్మించుట కష్టమైనపని కాదు. అతి స్వల్పఖరీదుతో తాటి

---

జాతులన్నిటిలో ఒంగోలు పశుజాతే మంచిది

యాకుల కప్పులతోను దూలములతోను నిర్మింపవచ్చును. ఇంకను మనము పశువులను వేయుపాకగాని పెంకటిచావడినిగాని మిగుల ఎత్తుగా నిర్మించరాదు. రైతులలో కొందరు తమస్థితికి మించి చాలధనము వ్యయము చేసి పశువులను పెంకుటి చావడులు కట్టినవారు గలరు. ఈ చావడులు చాలాపునాదితో కట్టబడునుగాని అందచందములు లేక మోటుగా నిర్మింపబడుచున్నవి. రాయలసీమలో పశువులను వేయుశాలలు చాల మోటుగానుండును. ఇంకను పూర్వపద్ధతులలోనే యున్నారుగాని ప్రస్తుతకాల పరిస్థితులనుబట్టి శాలలను నిర్మించుటలేదు.

పశుశాల నిర్మాణమునకై పలురకముల రాళ్ళు సున్నము వెదుళ్ళు కలప మున్నగునవి రైతుయొక్క ఆస్తినిబట్టి నిర్మించవలెను. ఏసామగ్రి తక్కువ ఖరీదుగలిగి గట్టితనముగానుండునో విచారించి పశుశాలను నిర్మించవలెను. కొన్నిశాలలు అనేకశతాబ్దముల క్రిందట నిర్మించినను చెక్కుచెదరక యుండును. కనుక సామగ్రిని పరీక్షించి త్వరలో శిధిలముగానట్టియు త్వరలో మరమ్మతు కోరనటువంటియు సామగ్రిని ఉపయోగించుటమంచిది.

## పశుశాలనివేశనస్థల లక్షణములు

నేలగుల్లగానుండరాదు. వర్షపునీరు నిలువకొండ త్వరగాజారిపోవునట్లు ఏటవాలుగానుండవలెను. పోతనుట్టిగ స్థలములలో శాలను నిర్మించరాదు. చెమ్మగానుండుస్థలములు మాగాణిపొలములు మురకినీటిపొలములు శ్మశానములు, పశుశాలనివేశనమునకు దూరముగానుండవలెను. సాధారణముగా పైసూత్రముల ననుసరించి నివేశనముల నెంచుకొనుట కవకాశము కలుగదు. ఎక్కడస్థలము లభించిన అచ్చటనే కట్టవలసి వచ్చును. అట్టి సమయమునందు నివేశనము నెత్తుచేసియు నేలక్రింద తూములనుంచియు చెమ్మతగులునట్లు యేర్పాటు చేయవలెను. చకిరాతిరాళ్లను నరికించి త్రుళ్ళు నీరునిలువకుండ గోతులనుపూడ్పించి నివేశనమును శుభ్రపరచవలెను.

## శాల నిర్మాణము

శాలలో తగినంత వెలుతురు గాలి లేనియెడల చెమ్మగానుండి అనారోగ్యము కలుగును. మట్టిగోడలచెమ్మవలనను పైకప్పులు కారుటవలనను శాలకు సమీపమున చెట్లుండుటవలనను చెమ్మచేరును. ఇటికలు చెమ్మను పీల్చును. చిన్నసందులందును పశుసమూహముగల వీధులందును విశాలముగు పెరడుగాని గాలిగాని లేక సంకుచితముగు స్థలమున కట్టబడిన శాలలో వెలుతురు గాలిచొచ్చుటకు వీలులేక పోవుటచే చెమ్మ హెచ్చుగానుండును.

పునాదులు సరిగానుండకపోవుట వలనను గాలివానలకు కూలి చాలా పశువులు మరణించుచున్నవి. అందువలన పునాదులు గట్టిగ బలముగనుండవలెను. నేల గట్టిని

---

తప్పు ను విస్తారముగా పెట్టిన లోగా లెక్కించవచ్చును

కానప్పుడు కంక్రీటుచేసి పునాదులు కట్టుటమంచిది. ఇందువలన దుర్గంధములు చెమ్మ భూగర్భమునుండి శాలలోనికి చొరబడజాలవు. భూమి మట్టమునకు గచ్చుమట్టమునకు మధ్యగా పునాదుల వెడల్పునను నీటిని చొరనీయని వస్తువులతో కట్టవలెను.

గోడలను సాధారణముగా ఇటుకతోగాని, రాతితోగాని కట్టుదురు. ఇటుక సరియైన ఆకారమును సరాసరిగ ఒకటేమాదిరి రంగుగలిగి ప్రయోగించినచో లోహపుధ్వని నిచ్చుచుండవలెను. ఇటుకలు గాలిచొరనిచ్చుటకు చెమ్మపీల్చుటకు చాలినంత గుల్లగా నుండవలెను. మందముచాలని గోడలుగల శాలలలో శీతాకాలము చలియు, వేసవి యందు వేడిమియు అధికముగానుండును. పెద్దతుపాను గాలులందైనను గోడలు చెమ్మను పీల్చకుండునట్టిరీతిగా కట్టవలెను.

సామాను గదులవుగాక పశువులుండు ప్రతిగదికి కనీసము ఒక కిటికీయుండవలెను. నాలుగువైపులద్వారము లుండవలెను. వేసవికాలమందు రాత్రింబవళ్లు కిటికీలు తెరచి యుంచవలెను. శీతాకాలమునందును వర్షాకాలమునందును తూర్పు కిటికీలు తెరువరాదు. శాలలో వేపచెట్లుండుట మంచిది. రాత్రులందు తలుపులు మూయవలెను. పగలు మూయరాదు. శాలలో ఎక్కువపశువులుగల రైతు పశుచికిత్సకొరకు ఒక గదిని నిర్మించుటమంచిది. ప్రాథమిక పశుచికిత్సకొరకు కొన్ని పశువైద్యగ్రంథాలు తెప్పించి చూచుట మంచిది. కొన్నిమందులు పరికరములు యుండుట మంచిది.

పశువుల కొట్టము భూమిమట్టమునుంచి 10 అడుగుల ఎత్తుతక్కువగా నుండరాదు. ద్వారముపైపు 8 అడుగుల ఎత్తుండవలెను. మధ్యభాగము 12 అడుగుల ఎత్తుండవలెను. వాయుప్రదేశమునకు, వాయునిర్గమనమునకు నుపయోగించునట్లు కిటికీలు శాలయొక్క వాయుప్రదేశము ననుసరించి తగినవైశాల్యము కలవై యుండును.

పెంకు కలప తాటియాకు గడ్డి మొదలగు వానితో ఇంటికప్పుల నేటవాలుగ కట్టుదురు. ఇంటికప్పు వర్షమును ఎండను ఆపుటయేగాక కొంతగాలినికూడ చొరనిచ్చుటకు వీలుగా నుండవలెను. తాటియాకు కప్పులలో ఎలుకలు పురుగులు పిట్టలు పాములు చేరుటకు వీలుగనుండును. ఇంటికప్పుపై పడిన వర్షపునీరు పైకిపోవుటకు చూరుప్రక్కలను కాలువల నేర్పరచవలెను. ఇంటికప్పు దట్టముగనుండి వేడిమిని చొరనీయని పదార్థములతో నిర్మింపబడవలెను. ఇంటికప్పు ఎంత ఎత్తుగ నున్నదానినుండి లోనికి ప్రవేశించు వేడిమి అంతతక్కువగ నుండును.

## పశువులు సుఖముగా నుండుటకు యంత్రము

| | | | |
|---|---|---|---|
| 56 | 56 | 3 | 7 |
| 6 | 3 | 63 | 62 |
| 65 | 60 | 8 | 1 |
| 4 | 5 | 61 | 64 |

ఈ అంకెలను కాగితముమీద వ్రాసి పసుపు అంటించి పశుశాల తలుపులకు అంటించవలెను.

## పశుశాల విస్తీర్ణము

పశుశాలకు సుమారు ఏడెనిమిది శెట్ల విస్తీర్ణముగల విశాలమగు స్థలము ముందు భాగమున నుండవలెను. దానిచుట్టు ఎత్తుతక్కువగానుండు గోడలుండవలెను. పశుశాల చౌకముగానైనను గుండ్రముగానైనను నుండవచ్చును. పశుశాలను మూడుభాగములుగా విభజింపవలెను.

1 ఆవులు గేదెలు ప్రసవించుట
2 దూడలను తల్లులు లేనపుడు ఉంచుట
3 దుక్కిటెద్దులను పశువుల నుంచుట

ఈ మూడు భాగములు దక్షిణపువైపు తెరచియుంచవలెను. ఉత్తరపు గోడకట్టవలెను. అందు చిన్నచిన్న కిటికీలుంచవలెను. ఆకిటికీలు భూమికి అయిదారడుగుల ఎత్తుండవలెను. శాల 16 అడుగుల వెడల్పుండవలెను. ఉత్తరపు గోడనుంచి పశువులు నిలుచుండుటకు 10 అడుగుల స్థలముండవలెను. ఒకనీటితొట్టి యుండవలెను. మంచినీరు త్రాగు తొట్టె ఇటుకతోగాని సిమ్మెంటుతోగాని చేసియుంచవలెను. తొట్టెయొక్క లోతు 18 లేక 21 అంగుళముల వెడల్పును 12 లేక 15 అంగుళములలోతును భూమి నుంచి 12 అంగుళముల నీటి మట్టమును యుండవలెను.

పశుశాల యొక్క ఏటవాలు ఉత్తరదక్షిణములుగా నుండవలెను. పశువుల యొక్క తలమొదలు వెనుకటి భాగము వరకు ఏటవాలుగనుండవలెను. ఆ ఏటవాలు 30 అంగుళములు దాటియుండరాదు. అట్లున్నయెడల మూత్రమును అతిసులభముగా బైటకుపోగొట్టగలదు. ఉత్తరపుగోడవైపు ఖాళీచేయవలెను. ఎందుచేతనన మేతవేయుటకుగాని సామానులు తీసికొని పోవుటకుగాని ఖాళీయుండవలెను. వెలుపలిభాగమున 8 అడుగుల పొడవు 4 అడుగుల వెడల్పు 2 అడుగులలోతు గొయ్యి యుండినయెడల మలమూత్రములన్నియు అందులోనికి వచ్చును. దక్షిణపువైపు పైకప్పు స్తంభములచేతగాని యిటుకచేతగాని కలపచేతగాని అమర్చబడియుండవలెను. ప్రతిస్తంభము యిటుకతో కట్టియుండవలెను. ద్వారము 6 అడుగుల వెడల్పు 6 అడుగుల పొడవునుండవలెను. దూడలుగాని ఆవులుగాని గేదెలు ఈనుగదులు వేరీతిగనేయుండవలెను. దూడలునీరు త్రాగుటకు 6 లేక 9 అంగుళములవరకు లోతుగలిగినతొట్టెయుంచవలెను. మొత్తముమీద 17 అడుగుల కంటె తొట్టెఎత్తుండరాదు.

## పశుశాల నేల స్వభావము

నేల గట్టిగను తేమపీల్చనట్టిదిగనుయుండవలెను. నేల గట్టిగాలేనిచో పశుశాలకు అపాయము వచ్చును. నేలమట్టము ఎత్తుగానుండు చోటనే పశుశాల నిర్మింప

సాధుత్వానికి గుజరాతీగోవు నే చెప్పాలి

వలెను. కొట్టపు నేలతేమను గ్రహింపనిచో కొట్టమెల్లపుడు తేమగానుండి వ్యాధిని జనింపజేయు సూక్ష్మజీవుల కాస్పదమగును. మరియు కొట్టపు ప్రాంతములందు చెట్లతో నిండియుండునట్టి ఉపవనములుగల నేలయుండుట మంచిది. ఈ నేలకు సమీపమున యంత్రశాలలు మురుగుకాలువలు దుర్గంధము వెదజల్లు శ్మశానవాటికలు అపవిత్రకరము లగు కసాయిదుకాణములు మొదలగునవి యుండరాదు. అట్టిపరిసరములుగలవి నివాస యోగ్యములు కావు. పశువుల మలమూత్రాదులు జారుటకును అప్పుడప్పుడు కడుగు టకు వీలగునట్లుగను కొట్టములోనుండు స్థలము ఏటవాలుగా నుండవలెను. ఆ నేల మిగులగట్టిగా నుండవలెను. లేనిచో పశువుల త్రొక్కుడువలన గుంటలుపడును. ఆ గుంటలలో మలమూత్రాదులుపడి సహింపరాని దుర్వాసన కలుగజేయును. ఇటుక ముక్కలు సున్నమువేసి నెమ్మదిగా దిమ్మెసకొట్టిన చాలును. పశువుల కాళ్లవెనుక నుండు భూమి ఏటవాలుగనుండి మధ్య కాలువనేర్పరచవలెను. ఆ కాలువ రెండు మూడు అడుగుల పొడవు ఒక అడుగు వెడల్పుగలిగి ఇటుక సున్నముతో కట్టబడి యుండవలెను. పశువులు విడచు మలమూత్రాదులు ఆ కాలువలో జేరుటచే ఆస్థలము పొడిగను ఆరోగ్యముగను యుండును. ఇంకను నేలను శుభ్రపరచుటకు పగిలిపోయిన ఇటుక పెంకు సున్నము మున్నగువానిచే నిర్మించి వానిపైన మొరటిరకపు ఇటుకలచే అంచుకట్టి సిమ్మెంటుచే చదునుపరచవలెను. అట్టివి చిరకాలముండును. ఆ నేల 1½ లేక 2 అడుగులు మామూలు నేలకన్న ఎత్తుండవలెను. ప్రతిసంవత్సరము నేలమీద నున్న మట్టితీసి క్రొత్తమట్టి పోయవలెను. లేనిచో గోమారుపట్టును.

## శాలను శుభ్రముగా నుంచుట

పశువులమందను విస్తారముగా శాలలో నుంచరాదు. వాటికి విశాలమైన గదు లుండవలెను. అవి నిలుచుండుటకు పడుకొనుటకు స్థలముండవలెను. కొన్ని పెద్ద పశువులైనచో 60 అంగుళములస్థల ముండవలెను. ఒక్క పశువేయున్నయెడల 10 అంగుళముల పొడవు 8 అంగుళముల వెడల్పుండవలెను. అట్లుండిన యెడల దాని యిష్టమువచ్చినటుల తిరుగగలదు. పశుశాలను ప్రతిదినము ఉదయ సాయంకాలములందు శుభ్రము చేయుచుండవలెను. ప్రతిదినము మలమూత్రాదుల తీసివేయవలెను. ఫినైల్ లోషన్ గాని సున్నపునీళ్లనుగాని జల్లుచుండవలెను. భూమిమీద ఇసుక కంకర మున్నగునవి పోయుటవలన నేల బాగుగానుండును. పశుశాలను తుడుచుట కడుగుట మున్నగు పనులు పశువులను పొలములలోనికి తోలిగాని బయటకట్టివేసిగాని మరొకదొడ్డిలోనికి తోలిగాని దొడ్డిని శుభ్రము చేయవలెను.

---

మేతలన్నిటిలో బీటిమేతే శ్రేష్ఠమైనది

## కాలముల ననుసరించి పశుపోషణ

### శీతాకాలము

ఈ కాలము అక్టోబరు 15 వ తేది మొదలు మార్చి 1 వ తేదివరకుండును. ఈకాలమందు పశువులకు ఎక్కువఆహారము వేడిమిగల గాలి అత్యవసరము. రాత్రులయందు వానికి కంబలులుగాని, వానికికప్పుటకు ప్రత్యేకముగా తయారుచేసినవిగాని ఉపయోగింప వలెను. వానిని పగలు 12 గంటలు మొదలు 2 గంటలవరకు బయటనుంచుట చాలా మంచిది. ఈ కాలములో పాడిపశువులకు పాలసేర్లు వాలుకసేర్లు అనువ్యాధి తరచుగా పోవుచుండును. మలబద్ధకము లేకుండ చూచుచుండవలెను. దూడలకు పాలు ఎక్కువ తక్కువలు త్రాగుటవలనను తల్లిపాలు చిక్కగనుండుట వలనను రోగములు కలుగు చుండును. మిక్కిలి మలబద్ధకముగానుండు దూడలకు ఎనిమాచేయుట మంచిది. ఈ కాలములో చలిగాలి వర్షములకు బాధపడకుండ చాలాజాగ్రత్తగా కాపాడు చుండవలెను. పాడిపశువులు ఈ కాలములో చలిగాలివలన తక్కువపాలు యిచ్చు చుండును. పచ్చిగడ్డి ఎండుగడ్డి బలముగలిగించు మందులు వస్తువులు వలయునంత పెట్టుచుండవలెను. సెప్టెంబరు నెలాఖరునుంచి మార్చినెలాఖరు వరకు జనుముగడ్డి నిలువచేసియుంచవలెను. ఈరీతిగాచేసిన యెడల పశువులు ఆరోగ్యముగా నుండును. లేనియెడల రోగములచే పీడింపబడుచుండును. అక్టోబరు మొదలు మార్చివరకు ధాన్యము స్వల్ప ఖరీదునకు దొరకును. ఆకాలమందు వానిని నిలువజేసి సంవత్సరమంతయు ఉపయోగించవచ్చును. ఫిబ్రవరినెలలో గోధుమపొట్టు తవుడు చిట్టు సులభముగా మనకు లభించును.

### వేసవికాలము

మార్చి 1వ తేదీనుండి జూన్ 15 వ తేదీవరకు లేక జూలై 1 వ తేదీవరకు యుండును. ఈకాలమందు పశువులు విస్తారముగా ఆహారము కొరకు నీటికొరకు నిరీక్షించుచుండును. సరిగా మేపని యెడల చనిపోవును. శీతాకాలముకంటె ఈకాలములో జాగ్రత్తగా మేపుచుండవలెను. మధ్యాహ్నవేళలందు పశువులను బయటకు రానీయ రాదు. ఎండదెబ్బతగులును. రాత్రులయందు బయటనుంచవలెను. ఈకాలములో పచ్చిగడ్డిదొరకదు. అందుచేత పాతరవేసిన పచ్చిజొన్నచొప్ప, దాణాదినుసులు, జనుము, తదితర పొట్టుధాన్యములు మున్నగునవి రాత్రింబవళ్లు పెట్టవలెను. ఇంకను ఈ కాలములో పచ్చిఆకులు కాయలుకూడ మంచిఆహారముగ నీయవచ్చును.

### వర్షాకాలము

జూన్ 15 వ తేదీనుంచిగాని జూలై 1 వ తేదీనుంచిగాని వర్షాకాలము ప్రారంభింపబడి అక్టోబరు 15వ తేదీతో అంతిమగును. ఈకాలమందు పచ్చిగడ్డి విస్తారముగా దొరకును. జంతువులను బయటనుంచరాదు. వర్షములో తడుపనీయక జాగ్రత్తగా కాపాడవలెను. నాకర్లు పశువులదగ్గర నెల్లవేళలనుండి కాపాడవలెను. పశుశాలలను శుభ్రముగానుంచవలెను. లేనిచో పలువిధరోగములపాలగును. పశువులను బురద చెమ్మలేని స్థలములందు కట్టవలెను.

# పశుగ్రాసము

## నాలుగవ భాగము

"వలియ వలియో వలియ రావేలు గలవాడా? రార పొలిగాడ!

రావేలు నీదయ్యా! రాశి మాదయ్యా!
నూటేలు నీవయ్యా! నూగు మాదయ్యా!
వేవేలు నీవయ్యా! వెన్ను మాదయ్యా!
కోటేలు నీవయ్యా! కొండ్ర మాదయ్యా! ॥వ॥

ఎద్దులు నూర్వంగా మిద్దె రాసూలు
కోడెలూ నూర్వంగా కొండ రాసూలు
ఆవులూ నూర్వంగా అడ్డ రాసూలు
దున్నలు నూర్వంగా దిన్నె రాసూలు. ॥వ॥

తూరుపూ ఒకవానా తుమ్మెదల మోత
పడమటా ఒకవానా బాజాల మోత
ఉత్తరా నొకవానా ఉఱుమూల మోత
దక్షిణా నొకవానా తాళాల మోత. ॥వ॥

మంగళగిరి లాగూ పొంగెరా రాశి
సింహాచలము లాగూ సిగదేలె రాశి
కోటయ్య కొండల్లా కొనదేలె రాశి
బాపూడి కొండల్లా పొడుగయ్యె రాశి. ॥వ॥

దాగెరా పొలిగాడూ తలకాడి క్రింద
తొంగెరా పొలిగాడూ తొలికట్ట క్రింద
వచ్చెరా పొలిగాడూ నరగాణి దాటి
పోయెరా పొలిగాడూ పొలిమేర దాటి. ॥వ॥

---

పాలేరువానికి గొడ్డుపోయినా; మాయతల్లికి బిడ్డపోయినా దుఃఖంలేదు

గీ. అనుచు బాలినాగి బంతుల నవలఁద్రోలి
కంకులందుళ్ళి దంతెల గలయదున్ని
పొల్లు పొలకట్టు పొలికట్టె వల్లనుసిమి
రాశి కళ్లములో బ్రోవుచేసి రంత. ॥వ॥"

"రైతు హరికథ"



పూర్వము ప్రసిద్ధి జెందియుండిన గ్రామము లనేకములు ఇపుడు పాడు పడిన గ్రామములుగనే పరిణమించు చున్నవి. ఈ కారణముచేతనే వ్యవసాయము చేయువారల సంఖ్య తగ్గుచున్నది. గ్రామములోనున్న రైతులకా! ఐకమత్యము లేదు. పశుసంతతి నుద్ధరించుటయే సున్న. పల్లెలు పేరు లేకుండ పాడగుట కుపక్రమించుటచే పశువులకు మేత చిక్కకపోవు కారణముచేత ననేకులు వానిని కసాయి వారలకు విక్రయించుచున్నారు. ఈ కారణముచేత దినుట కాహార పదార్థములు తక్కువగా నున్నవి. దొరికినను వాటివెలలు పూర్వముకంటె మితిమీరియున్నవి. పాలు, పెరుగు, వెన్న మున్నగు వానిని గురించి చెప్ప పనియే లేదు. బీదవారలు జీవించుటే కష్టముగానున్నది. మన దేశములో పశువులు ఇదివరకంటె చాల చిన్నవిగను దుర్బలముగను కృశించునవిగను నగుచున్నవి. ఈ పశువులు పూర్వపు పశువులంత పని చేయజాలకున్నవి.

పశుజాతుల అభివృద్ధికై పశువులు బలముగలిగి శక్తితో పనిచేయుటకు ముఖ్యముగ మేతవిషయమై శ్రద్ధవహించవలెను. బలకరమగు క్రొత్తక్రొత్త రకముల గడ్డిని పెంచవలెను. ఎండుగడ్డినే కాకుండ బలకరమగు పచ్చిగడ్డిని సయితము నిలువయుంచు పద్ధతులను కనిపెట్టి గడ్డి కఱవగు వేసవి దినములందు ఉపయోగించవలెను. నేను

పట్టిగొడ్డుకు అరుపులెక్కువ; వానలేని మబ్బుకు ఉరుములెక్కువ

ఇండియా గవర్నమెంటువారి ఇంపీరియల్ ఎగ్రికల్చరల్ రీసర్చి లైవ్‌స్టాకు కమిటీ మీటింగునకు ఢిల్లీ వెళ్ళినపుడు, కలవు దినములలో మేత నిలువయుంచు విషయమై చాలా పరిశోధనలు జరిగినటుల మీటింగులో తెలుపబడెను. హాలెండు దేశమున పశువుల విషయమై చాలాశ్రద్ధ వహించుచున్నారు. వంద ఎకరములుగల ఖండములను పశువుల మేతకై వదలిపెట్టుచున్నారు. ఈ రీతిగనే మన దేశములో గూడ నాచరణలో పెట్టినపుడే మన పశువులు బాగుపడజాలవు.

డిశంబరు నుంచి జూలై నెలవరకు మన దేశమునందన్ని ప్రాంతములందును మేత బాగుగా దొరకును. పైరులను పచ్చిగడ్డిని నిలువజేయుటకు తగిన సదుపాయములు జేయవలెను. పైరులను పచ్చిగడ్డిని వృథాగా పోనీయక ప్లసమముగా వాడుకొనవలెను. పచ్చిగడ్డిని తీసివేయబడిన గుంటలయందు నిలువచేయు పద్ధతులను నేర్చుకొనవలెను. ప్రత్తిగింజలు మొదలగు ధాన్యములు తదితరములగు చిట్టు, తవుడు మొదలగు బలకర పదార్థములును తరచుగ తగినంత ఉప్పుతో చేర్చి పెట్టవలెను. గడ్డి కోయతలసిన కాలము మించకుండ కోసి నిలువచేయుటవలన లాభము రాగలదు. సాధారణముగ మన పల్లెగ్రామాదులలో పశువుల మేపు పద్ధతియందు చాలగడ్డి పాడగుచున్నది. దంటుగల జొన్న మొదలగు పైరులను ముక్కలు ముక్కలుగ నరికి పశువులకు వేసినచో గడ్డి అంతగా నష్టము కాజాలదు. ఇట్లు పారపోయిన గడ్డిని పేడతో కలిసి ఎరువుగ నుపయోగ పడుచున్నను గడ్డి చాలని పరిస్థితులయందు ఇట్లు గడ్డిని వృథాచేయుట పొరబాటు.

## మద్రాసు రాజధానిలోని పశుగ్రాసము

సాధారణముగా ప్రతిజిల్లాలోను అచటపెరిగినపైరు సరిపోవుటయో లేక ప్రక్క జిల్లానుంచి తెచ్చుకొనుటయో జరుగును. గంజాంజిల్లానుంచి నెల్లూరుజిల్లావరకు సామాన్యముగా గడ్డివాములు నాలుగు లేక అయిదు సంవత్సరములవరకు నిలువయుండుటగలదు. నల్లరేగడి భూములయిన గుంటూరు కందుకూరు ప్రాంతములలో రెండు లేక మూడు సంవత్సరములవరకు నిలువయుండు జొన్న చొప్ప వాములుండుటయు గలదు. కాని మద్రాసురాజధానిలో వసతులన్నియుగలవు. అనగా వర్షము శీతోష్ణస్థితి, పశుగ్రాసము నీటివసతి గలవు. వ్యవసాయముచేయురైతులు తమ పశువులను తగినంతశ్రద్ధగా చూడరు. వారిపశువులు వేసవికాలములో పైరులుకోసినతరువాత ఆ చేలలో మేపుదురు. తోటలు పొలములు గలున్నచుక్క పశువులకుమాత్రము మంచిమేతపెట్టుదురు. కోస్తాకుమారముగానుండుజిల్లాలలో వర్షము ... పంటలుపోవును. దత్తమండలములో మెట్టభూములు దున్నుటకు ఎక్కువపశువు అవసరములేదు. ఒక జతఎద్దులున్న అసామి 30 లేక 40 ఎకరములవ్యవసాయము సాగుచేయగలడు. మొన్న మొన్న టివరకు నూతుల క్రింద వ్యవసాయముపలననే కొంతవరకు వరిపైరగుచున్నది. అందుచేత ఎండుగడ్డికి

కరవులేదు. ఆమాదిరిగనె కోయంబత్తూరు, సేలం, ఉత్తరార్కాడు తిరుచునాపల్లి జిల్లాలలో నూతిక్రిందవ్యవసాయమే ఎక్కువగానున్నది. కొన్నిచోట్ల జొన్నపైరుకూడ సేద్యమగుచున్నది.

సాంప్సన్‌దొరగారు 1916 లో రామనాడు, మధుర, తిరునల్వేలు జిల్లాలలో పశువులకు మేతతక్కువయ్యె నని తెలిపెను. ప్రత్తిధరపెరుగుటవలన వరినాటక ప్రత్తినే వేసి అమ్ముకొనిరి. అందుచేత ఆసంవత్సరము మేతలేకపోయెను. అందు చేత వరిగడ్డికొనవలసివచ్చెనట. ప్రత్తిపంట చాలాలాభకరమని దక్షిణజిల్లాలలోనిరైతులు ఆపంటను వేయ మొదలిడిరి. వరిచేనుకు ఖర్చుపెట్టవలసినంత మొత్తమును ప్రత్తిపంటకు ఖర్చుపెట్టవలెను. పడమటితీరముయొక్క పెరు వేసవికాలము రాకమునుపే తయారగును. మలబారులోగూడ పంటచాలాతక్కువ. అప్పుడప్పుడు సగముగడ్డి పొలముమీదనే విడిచిపెట్టబడును. కొండలమీద మాన్సూనువాయువులవు వచ్చువర్షముచే గడ్డిపెరుగును. దానిని కొందరు పశువులకు మేపుదురు. కాని దీనిని చాలామందిమేపరు. మలబారు దక్షిణ కన్నడముకన్న చాలాతక్కువ. ఎందుచేతనన కన్నడములో భూమి తడిగానున్నపుడే దున్నెదరు. దేశములోవ్యవసాయము చాలాఅభివృద్ధిలో నున్నది. అందువలన ప్రతిరైతు తనపశువులకు తనసొంతమేతపైన ఆధారపడి యుండవలెను. తోటమాలికి ఎరువుఅత్యావసరము. అందుచేత అతను చాలాపశువులను పెంచవలయును. ఇంతియే గాక బాగుగామేపబడిన పశువులు ఎక్కువ ఖరీదులోనుండును. ఈపద్ధతి కోయంబత్తూరు సంతలలోచూడగలము.

పాటుపడుపశువులను మేతప్రాంతములకు తోలుకొనిపోయి అచ్చట ఖరీదునకు అమ్మెదురు. ఈపద్ధతిప్రస్తుతము విశాఖపట్నంజిల్లాలో నున్నది. మిగిలిన పశువులను వానిసొంతరైతులేమేపుకొనుపద్ధతి దత్తమండలములలో నున్నది. ఉత్తరసర్కారులలోను విశాఖపట్నపుతీరప్రదేశములలోను గంజాంజిల్లాలోని చికాకోల్‌తాలూకాలోను పశువులకు క్రమశిక్షణపద్ధతి కొంతకాలముక్రిందట జరిగినది. పైనుదహరించిన ప్రాంతమందంతయు పశువులమేత బాగుగానుండెడిది. ఉభయగోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాలనుంచి చిన్నకోడెలను ఈ ప్రాంతమునకు తీసికొనివచ్చి గ్రామాదులలోగాని పట్టణపు సంతలలోగాని విక్రయించుచుండెవారు. ఈకోడెలను బాగుగామేపు రైతులుకొనెడివారు. ఆరంభములో ఈకోడెలతో తేలికగా భూములనుదున్నెడివారు. వచ్చిన సంవత్సరములోనే బలమగు ఆవరముతిని బాగుగాబలిసియుండెడివి. ఇట్టి బలముగల పశువులను డెల్టాలోనుండు ధనవంతులగురైతులు ఎక్కువవెలపెట్టి కొని తీసికొనివెళ్లుదురు. విశాఖపట్నం జిల్లాలో ఈపద్ధతి ఎక్కువగానుండును.

దత్తమండలములలోని నల్లరేగడిభూములు పచ్చికకు తగ ప్రసిద్ధికెక్కినవి. ఒకటి రెండు సంవత్సరముల వయస్సుగలకోడెలు నెల్లూరు చేరగాద్రుంకొని ప్రత్తిపండు

---

భూములలోనుండు రైతులకుఅమ్ముదురు. కాని దత్తమండలములో పశుశిక్షణ చాలా తక్కువ. పడమట బళ్లారిజిల్లాలో మైసూరుకోడెలను ఎక్కువగాకొందురు. పుంగనూరు ఉత్తరసేలము ప్రాంతములందు పచ్చిమేత ఎక్కువగానుండును.

కోయంబత్తూరు జిల్లాలో తొట్టెయన్‌జాతివారు పశువులకాపరులుగా నుందురు. ఆజాతివారు పశువులను కొంతకాలము పనిచేయించుకొని తరువాత అమ్ముదురు. వారు పశువులకు పచ్చిమేతమేపి పాలుకుదుర్చి తరువాత ఎండుగడ్డినిమేపుదురు. ఇక రెండు మాసములకు ముందుగాఅమ్ముదురనగా నూనెపిండులనుగాని ప్రత్తిగింజలనుగాని బాగుగా మేపుదురు. దక్షిణ తిరుచునాపల్లిలోను, ఉత్తర మధురప్రాంతములోను పశువులను మేపుట చాలాతక్కువ. దక్షిణ కోయంబత్తూరు తిరుచునాపల్లి జిల్లా కారూరు తాలూకాలోను మంచిరకము కోడెలను తెప్పించిమేపుదురు. దక్షిణమలబారులో బీద పశువులుండును. కొందరు మలబారు వర్తకులు ధర్మపురిసంతలో చిన్నదూడలనుకొని మలబారుకొచ్చి తిరువాన్కూరు జిల్లాలలోనుండు తాలూకాలలోని రైతులకమ్మెదరు. అవి మాన్సూనుగాలుల వలన పెరుగుగడ్డిని వర్షాకాలములో తినును. వేసవికాలములో ఎండుగడ్డితినును.

## ఒంగోలు పశువుల మేత

నెల్లూరుజిల్లా దక్షిణ భాగములో మెట్టపంటలుపండును. అందుచేత పశువుల నంతి జాగ్రత్తగానుంచరు. ఈ జిల్లాలో పచ్చిమేతయొక్క విస్తీర్ణమునుబట్టి రైతులు పశువులను మేపుటయునుగలదు. పల్లపుభూములనగా వరిపండించు భూములలో కొంత మెట్టభూమిఅనగా అచ్చటచ్చట దిబ్బలుండు ప్రదేశములందుగూడ పశువులమేతకై ప్రత్యేకముగా విడిచిపెట్టబడును. జూలైనుంచి అక్టోబరు వరకు పశువులు గ్రామముల వెలుపల బాగుగామేయవచ్చును. దక్షిణభాగమున వర్షాకాలముగుటవలన అచ్చటి పశువులను పడమటి అడవిప్రదేశములకు మేతకై తోలబడును. గ్రామాదులలో మేత చాల నప్పుడు పనిచేయు పశువులు నవంబరునుంచి డిశంబరువరకు ఆపశువులు మేతకై వెంబడించును. రైతులందరు ఒకచోట గుమిగూడి వారిపశువుల నన్నిటిని కలిపి మందలుగా తోలుదురు. ఈశాన్యమాన్సూను వాయువులు బాగుగా వీచి వర్షములు కురిసిన పశువులు జనవరి మేతకై యుంచబడును. తరువాత వరికోత కాలములో మంచిపచ్చిమేత దొరకును.

గుంటూరుజిల్లాలోని చేలలలో సున్నము ఎక్కువగానుండుటవలన మేత తియ్యగానుండును. ఒంగోలు తాలూకాలో పట్టగ్రామములలో ఆరవవంతుభాగము పశువుల మేతకై ప్రత్యేకింపబడును. ఆసారవంతపు భూమికి పచ్చికబయళ్లకు నిష్పత్తిలో చాలావ్యత్యాసముగలదు. ఒంగు భూములలో పెరు పచ్చిమేత మంచిదిగానుండును. పచ్చిమేత పెరుగుటకు యేవిధమగు కృషియు చేయ నవసరము లేదు. పొలము దున్నగానే

మృగశిర విందికర్తె; ముసలెద్దు రంకె వేయును

వర్షములుకురిసి చాల చిక్కనిమేత లభించును. ఈ గడ్డి మూడురకములుగా నుండును. చెంగలిగడ్డి, గొపాగడ్డి, ననములగడ్డి అని మూడురకములు. చెంగలగడ్డి ఉత్తర సర్కారులంతయు వ్యాపించియున్నది. ఈ గడ్డి మంచిబలముగలదిగ నుండును. ననమలగడ్డి చెంగలగడ్డి తినిన తరువాత నుపయోగపడును. రైతులు పచ్చికబయళ్లలోని మేతను అదనముగా కోసికొని వచ్చి యింటివద్దనుండు పాడిపశువులకు మేపుదురు. ఈ పద్ధతి ఉత్తరసర్కారులలోనేగాక ఒండు భూమిప్రదేశములందు గూడగలదు. ఒండు రేగడి భూములలో జొన్న ముఖ్యమైన ఆహారము. ఒండుభూముల గ్రామములలో కోడెలను ఇంటిదగ్గరనేయుంచి బాగుగా మేపుదురు. అందువలన వాటికి తగిన వ్యాయామములేక కాళ్ళుగుదులుపట్టియుండును. ఎల్లప్పుడు తిరుగు పశువులు సకాలములో బలిసివయస్సు రాకపోయినప్పటికి అవి యిండ్లలోనుండి మేపబడు పశువుల కంటె ఎక్కువ చాకచక్యముగా నుండును.

పశువులకు కాయధాన్యములమీద పచ్చుపొట్టుగాక బియ్యపుపడితికూడ పెట్టుదురు. పచ్చికబయళ్లచుట్టు కంచలేమియు నుండకపోవుటవలన పశువులను సాయంకాలమునకు యింటికి తోలుకొని రావలయును. పొలములుదున్ను కాలములో వాటిని పొలములలో పందిళ్లువేసి కట్టివేయుదురు. తదితర కాలములలో ప్రత్యేకపశుశాలలుండును. ఈ ప్రాంతములందు నల్లరేగడి భూములగుటవలన జొన్న బాగుగా పెరుగును. జొన్న తినుటవలననే ఒంగోలుజాతి మిగులబలిష్టము గానుండును. ఇంతియేగాక ఆభూములలో సున్నముండుటవలన జొన్నయెక్కువ బలముకలుగజేయును. శీతోష్ణస్థితి వర్షపాతముమీదగూడ పశువుల బలుపు ఆధారపడియుండును. పల్నాడు నల్లమల కొండల ఎరుపునేలలమీద పెరుగు పచ్చిగడ్డి తినిన పశువులు నల్లరేగడ భూములలోని పశువుల కంటె ఎక్కువగా మేపబడవు. ఈ రెండుజిల్లాలకు మాన్సూను వాయువులు వీచును. సరాసరివర్షము 29.5 అంగుళము లుండును. వరిధాన్యము నూనెగింజలు ప్రత్తికాయ ధాన్యములు మొదలగునవి పెరుగును. అదియునుగాక పోరంబోక స్థలములమీద పచ్చిక బయళ్లమీద మంచిగడ్డి పెరుగును. పైనుదహరించిన ఆహారములన్నియు పశువులకు మేపిన బాగుగా బలియును. పూర్వము ఈపంటలన్నియు పండెడివి. ఆ పంటలను పశువులకు పెట్టుటవలన మంచిబలముగలిగి మంచిజాతి వృద్ధియగుచుండెడిది. కాని ప్రస్తుతకాలమున ఆ పంటలన్నియు తగ్గిపోయి ఆ స్థలములలో పనుపు, వేరుశనగ, మిరప, పొగాకు మొదలగు మెట్టపైరుల పండించుటవలన ప్రస్తుతపు పశువులకు ఆ బలమగు మేత లేకపోవుటవలన బహు నీరసముగా నుండుచున్నవి.

రైతులు కాయధాన్యములకన్న వరిధాన్యములందే ఎక్కువశ్రద్ధ చూపి కావలసిన ధాన్యమును ఎంతగడ్డిని పండించుకొనుచున్నారు. ఒంగోలు తాలూకాలో పచ్చికబయళ్లు నదుల ఒడ్డులును పోరంబోకలునునై యున్నవి. పూర్వపు దినములలో 50 ఎకరములుగల రైతు భూమిని సాగుచేయుటకు ఈక్రింది రీతిగా పైరు వేసెడివారు

---

చెప్పకపోయినను చప్పికొమ్ముల యెద్దును కొనవలయును

12 ఎకరములున్న ఉలవ
5 ఎకరములున్న కొర్రలు సజ్జలు ఉలవ
15 ఎకరములున్న వరిగెలు పైరుజొన్న
5 ఎకరములు పైరుజొన్న
2 ఎకములు గోధుమలు
11 ఎకరములు పచ్చిమేత

మొత్తం 50 ఎకరములు. పైనుదహరించిన 50 ఎకరముల రైతునకు ఈక్రింది విధముగా పశువులుండును.

రెండు జతల ఎద్దులు
రెండు లేక మూడు గేదెలు
మూడు దూడలు

మంచి ధరలుగల రోజులలో సజ్జలు ఉలవలు ఖరీదున కమ్మబడును. వీటి యొక్క మేతయంతయు రైతు తనపశువులకు మేపుకొనును

ప్రస్తుతకాలపు 50 ఎకరముల సాగు ఈరీతిగా నున్నది.

6 ఎకరములు జొన్న
4 ఎకరములు కొర్రలు సజ్జలు
4 ఎకరములు పిల్లిపెసర
15 ఎకరములు వరిగెలు పైరుజొన్న
5 ఎకరములు పైరుజొన్న
2 ఎకరములు గోధుమలు
10 ఎకరములు పొగాకు పచ్చిమిర్చి వేరుశనగ కొత్తిమిరి
5 ఎకరములు పచ్చిమేత

వీటన్నిటిలోను 10 ఎకరముల పంట అమ్మిన 5 ఎకరముల పచ్చిమేత తగ్గి పోవును. 6 ఎకరములు ఆహారపంటలు. ఇద తయు చూడగా నూటికి 5 వంతుల భూమి పచ్చిమేతకై వదలివేయుదురు. ఆ ప్రదేశములోని పశువును చూచి మంచిదో చెడ్డదో రైతు చెప్పగలడు. అందుచేతనే 20 సంవత్సరములకు యిప్పటికి ఎంత వ్యత్యాసమున్నదో గ్రహించండి.

---

ఏడు కరచలు చూచి ఎద్దును కొనమన్నాడు

## అరణ్యపు మేత

సాధారణముగా గ్రామములదగ్గరగానుండు అడవులను గ్రామరైతులలో నెవరోకరుకొందురు. ఆగ్రామరైతులు కొంతధనమును ఆరైతునకు పచ్చిమేతకొరకుయిచ్చి తమపశువులను మేపుకొందురు. కరవువచ్చినపుడు మాత్రము అడవులు యేనిబంధనలలోను యుండవు. అప్పుడు గ్రామరైతులందరు తమ పశువులను ఉచితముగా మేపుకొనెదరు. అడవిమేత మూడుభాగములుగా విభజింపబడును.

(1) పశువులు ఎల్లప్పుడు అడవులలోనుండి మేయును. ఈరీతిగా తూర్పుకొలిగల్లు, పడమట ధర్మపురి, హోసూరు ప్రాంతములందు జరుగును.

(2) అడవులకు చుట్టుప్రక్కల గ్రామాదులలోనుండు పశువులు ప్రతిదినము పగలు మేసి సాయంకాలమునకు యింటికివచ్చును. ఆయారైతులకు అడవులలో పొలములున్న యెడల ఎరువునకై రాత్రులందుంచుదురు.

(3) గ్రామాదులకు అరణ్యములు చాలాదూరముగా నున్నప్పటికి వ్యవసాయదినములలో మేతకొరకు అరణ్యములకు వచ్చుపశువులుండును.

## ఎల్లపుడు అరణ్యములలోనుండు పశువులు

కొలిగల్, ఉత్తరభవాని, ధర్మపురి, హోసూరు మొదలగు అడవులలో పచ్చిమేత ఎక్కువగానుండును. అడవులలో మేయుపశువులు ముఖ్యముగా ఆవులు వానిదూడలు. ఆవులతో ఆబోతులుకూడయుండును. కోడెలనుమాత్రము పెద్దవికాగానే సంతలకు తీసికొనిపోయి అమ్మెదరు. అటువంటి పెద్దసంతలు మహదేశ్వరమలై, చెట్టిసముద్రము, మచిరిమున్నగు ప్రదేశములైయున్నవి. ఇంకను రైతులు ఉత్తరకోయంబత్తూరు, ఉత్తర సేలం, పడమటి చిత్తూరు, మైసూరురాజ్యము వానుకొనియుండు అడవులలోను కోడెలను మేపుదురు. కోడెలను బాగుగా మేపి మలబారు పడమట మరియు ఉత్తరకోయంబత్తూరు, చిత్తూరు ఉత్తరము మరియు తూర్పుఆర్కాటు ప్రదేశములలో అమ్మెదరు. ఇంకను వానిని తంజావూరు తిరుచునాపల్లి మధుర తిరునల్వేలి మొదలగు ప్రదేశములకు తీసికొనిపోవుదురు. ఇచ్చట ఆవులు అసౌఖ్యముగనుండును. ఎల్లపుడు ఎండలలోను వానలలోను నిలబడి మేయుచుండును.

## అడవులకు చుట్టుప్రక్కల గ్రామాదులలో నుండుపశువులు

అడవులు ఎంతదగ్గరలోనున్న పశువు లంతహీనస్థితిలో నుండును. అడవులలో కూడ సంవత్సరముపొడవున మేత యుండదు. సాధారణమేతను అనేకవందల పశువులు మేయును. అటువంటిపశువులు ఎంతఎండకాయుచున్నప్పటికి మేతలేకుండ నుండగలవు. చాలాప్రదేశములలో ఇట్టిపశువులు ఎరువుకట్టుకొనుట కుపయోగపడును. ఇట్టిపశువులు చాలానీరసముగా నుండును. ఇట్టిపశువులు రైతుల కొన్నియుండునో

---

ఫంట పెంటలోవున్నది; పాడి పూరిలోవున్నది

అంతభాగ్యవంతు డందురు. మధురజిల్లాలోని కంభంలోయలో ఇట్టి పశువులుగల భాగ్యవంతులుందురు. ఈకంభంలోయ భూములలో సున్న మెక్కువగా నుండుటవలన పచ్చిమేత ఎక్కువగానుండును.

## చాలాదూరమునుండి వచ్చుపశువులు

మాగాని ప్రదేశములనుండి అరణ్యముల మేతకు చాలాదూరమునుంచి పశువులు వచ్చును. అట్టివి గోదావరి, కృష్ణా, గుంటూరు తంజావూరు జిల్లాలనుంచి ఎక్కువగా వచ్చును. సుగాలీలు అనుజాతివారు తోళ్లవ్యాపారము చేయుదురు. వారెక్కువగా ఆప్రాంతములకుపోయి తోలుకొని వచ్చుదురు. ఆ పశువులు ఏకారణము వలననైన చనిపోయిన వీరికి లాభము. సేలము వాయవ్య భాగపు టడవులలోను, కోయంబత్తూరు ఈశాన్యపు టడవులలోను, పశువులకు మేత యెక్కువగా దొరకును. సేలము ఉత్తరజిల్లాలలోనున్న హోసూరు, ధర్మపురం తాలూకాలలో తక్కువ ఖర్చుతో మేతదొరకును. అటవిశాఖకు ప్రతిపశువునకు సంవత్సరమునకు ఒక అర్థరూపాయి యిచ్చుదురు. ఒకపశువు ఆరువందల చదరపు మైళ్ళ వైశాల్యముగల స్థలములోని పచ్చిగడ్డి అడ్డులేకుండ మేయును. ఈ పచ్చిక బయళ్లలో నీరు త్రాగుటకు చెరువులుకూడ కలవు.

### పశువుల బీళ్ళు

"పసరుకల నును లేత పచ్చికబీళ్ల
గమ్మని మేతలం గడుపార మేసి
మునిమాపు వేళల మోరల నెత్తి
తోకల నెగబట్టి తోడరి కుప్పించి
గంతులిడుచును అంకె ఖంగున వేసి
యింటి దారిఁబట్టి యేగుచునుండ
పరుగిడి కొట్టంపు ప్రాంతంబులందు
వలనొప్పగా నంది వాటుగా బండి
నిశ్చింతతో నెమ్ము నెమఱు వేయంగ
గాంచి, యానందించు కాలంబు మాటి
కడకు మే మీరీతి గడపగావలసె."

"కష్ట జీవి"

---

ముక్కు త్రాడులేనిఎద్దు; ముండపెంచిన బిడ్డ ఒకటి

మేతలన్నిటిలో బీటిమేత (Fodder) యే శ్రేష్ఠమైనది. పూర్వము భూమి చాలినంత యుండెడిది. ఇప్పుడు వ్యవసాయదారులు (Farmers) పశువుల యభివృద్ధిని గణింపక పొలమునంతయు వ్యవసాయము చేయుచు బీడును విడిచిపెట్టుటలేదు. కొన్ని ప్రదేశములలో కొంతకాలము ముప్పది యకరముల కొక యకరమువంతున బీడుభూమి




పశువుల బీళ్లు

యుండవలెనని శాసననియమములు (Laws) ఉండుచూ వచ్చినవి. కాని యిప్పు డవి లేవు. ఇప్పుడన్ననో ధనాభావముచే భూమినంతయు సాగుచేయుచున్నారు. అందు వలననే పశువులు క్షీణించుచున్నవి. ఇంగ్లండు, స్విట్జర్లండు, కాలిఫోర్నియా జపాను, డెన్మార్కు మున్నగు దేశములలో పశువులకై వ్యవసాయదారులు ప్రత్యేకముగా పచ్చికబీళ్లను నెలకొల్పి తదితరమేతలకు బీటిమేతలకు తారతమ్యమును గ్రహించిరి. అన్నిజాతుల పశువులకు బీటిమేతయనిన మిగులప్రీతి. ఈమేత అన్నికాలముల యందు తగినంత దొరకునెడల పశువులకు సాధారణముగా మరొకమేత అవసరముండదు. ఇట్లు లభింపనపుడును, విరామములేక పగలంతయు పనిచేయు పశువులకు దినమంతయు మేసి పొట్టనిండించుకొనుటకు దగిన యవకాశము లేకపోవుటచేతను గడ్డి మొదలగునవి తెచ్చివేయుటయేగాక కొద్దిపరిమాణమునందే యెక్కువ సారముగల తెలికపిండి మొదలగు పదార్థములు దాణావేయ వలసియుండును.

---

మంచివానికి ఒకమాట; మంచిగొడ్డుకు ఒకదెబ్బ

## బీళ్లలోని గడ్డిజాతులు

పచ్చికయనగా నేలపై స్వాభావికముగా మొలచు గడ్డిగాదములు. వీని మంచి చెడ్డలు అందు మెండుగనుండు జాతుల ననుసరించి యుండును. ఈదేశపు పచ్చిక బయళ్లయందు గానవగు జాతు లనేకములు. వానినింకను బాగుగా బరీక్షించినవా రెవరునులేరు. 1907వ సంIIన దొరతనమువారి యుద్భిజ్జశాస్త్రజ్ఞులు (Botanists) గుంటూరు, కృష్ణ, గోదావరిజిల్లాలలోని గడ్డిజాతులను కొంతవరకు పరీక్షించినటుల దెలియుచున్నది. కృష్ణా గోదావరి జిల్లాలలో తరచుగా గానవగు గడ్డిజాతులలో గరిక, గునుకు, చెంగలి, మొలవ, తుంగ, ఊద, కావురు, ఆమడ, కొండ్ర, చికిలింత, ఊలిక, చిప్ప, ఊసడము, ఏనుగమోకాలు, తొండంగి, పిల్లిపెసర, జనిపె, దర్భ, ఆవురు, రెల్లు, గెలగడ్డి మున్నగునవి ముఖ్యములు. ఇవిగాక గడ్డికుటుంబములో జేరని గజ్జేరు, ఎలకచెవి, అమృతకాడ, పాలిల మొదలగు ననేకజాతుల మొక్కలుగూడ బీళ్లలో గానవగును.

## ప్రశస్తమైన జాతులు

పై గడ్డిజాతులలో గరిక, గునుకు, మొలవ, చెంగలి మున్నగునవి మిగుల బలమైనజాతులును, పశువులు బాగుగాదినునవియునై యున్నవి. ఊలిక, చిప్ప, తుంగ మొదలగునవి యిసుక కొడి నేలలో బయలుదేరు జాతులు. చవిటినేల లో ఉప్పి, గజ్జేరు మున్నగునవి మాత్రమే పెరుగును. కాబట్టి పశువుల మేతక్రింద వదలునేల మంచిదైననేగాని యందలి పచ్చిక యందు మేయు పశువులకు బలమును ఆరోగ్యమును (Strength and Health) గలుగవు. కాని మంచి నేలలు విలువగలవగుటచే పశువుల బీటిక్రిందనుంచక రైతులు వ్యవసాయమును బెట్టి యింపుకు పనికిమాలిన నేలలనే బీళ్ల క్రిందనుంచుదురు. కొంద రింతమాత్రమును జేయక నేలనంతటిని సేద్యము చేయుదురు.

## బీటిమేతయే బలమెక్కువ

బీటిమేత దినినపశువులు మిగుల బలముగానుండును. పాడిపశువులపాలు చాల రుచిగానుండును. కాని యిప్పటి వ్యవసాయదారులు ఊడ్పుచేలగట్లను మాత్రమే మాగాణి రైతులు పశువుల మేతకై ఉపయోగించుచున్నారు. అందున్న పచ్చిగడ్డి తగినంత సారము లేక పశువులమేతకై చాలకపోవుటచే ఉలవలు, తవుడు, తెలికపిండి మొద లగు కృత్రిమాహారములను కల్పించుచుండిరి. ప్రకృతి సిద్ధముగ పెరిగిన పచ్చికబయళ్ల యందు పశువులుమేత మేయుట శ్రేష్ఠమైన పద్ధతి. బీళ్లను పెంచుట యన్ని ప్రాంతము లందు సాధ్యముకాదు. అంతమాత్రముచే రైతులు నిరుత్సాహపడి పశువుల మేతవిష యమై లోటు కలిగింప నక్కరలేదు. సామాన్యముగా వర్షాకాలమునందు బీటిమేత కొరకు తదితర తాలూకాలవారు ఉత్తరాది తోలుదురు. పశువులు మిక్కుటముగా బలిసి ఆనందదాయకములుగా నుండును. బీటిమేత దినుటవలన పశువులకు సాధార ణముగా వ్యాధులు రాజాలవు.

---

కడురాడిన యింట్లో; కవ్వమాడిన యింట్లో కరవుండదు

## మాగాని మెట్టభూములలోని వ్యత్యాసములు

మెట్టభూములలోని మేతకు, మాగాణి భూములలోని మేతకు చాల వ్యత్యాసము (Difference) యున్నది. మెట్ట భూమిమేత దినిన పశువులు బిగుతరముగానుండును. మాగాణి భూమిమేత తినిన పశువులు బిగుతరము తప్పియుండును. మెట్ట భూములలో నున్న పశువులకు ఎల్లప్పుడు పనియుండుటవలన ఆరోగ్యము బాగుగానుండి అంటు వ్యాధులు (Contagious diseases) దగ్గరా అంతగాసోకవు. వీటిమేత తినిన పశువుల పాలనుంచి వచ్చు వెన్న గట్టిగానుండును. మాగాని భూములలోని మేత నిస్సారముగ నుండును. వీటిమేత వ్యాపకమగుట చేత పశువులకు మిగుల నారోగ్యకరము. మనము తడితర మేతలెంత బెట్టినను పశువులకు వీటిమేతయంత సంతోషదాయకముగను, బలము గను నుండదు. బీళ్లలో ననేకజాతి గడ్డి గింజలుండుటచే పశువులకు గావలసిన వివిధ వస్తువులన్నియు నందుండును. మన మేదేని ఒకరకపుగడ్డి కోసిమేపినను యితరాహార మును బెట్టినను అందు పశువులకు గావలసిన ద్రవ్యములలో గొన్ని యెక్కువగను, మరి కొన్ని తక్కువగను యుండుట తటసించును. మరియు పశువులు ఎండుమేతకంటె పచ్చికను మిగుల నిష్టముతో దినును. కావున నీ దేశమున పశువుల యభివృద్ధి కోరువారు సాధ్యమైనంతవరకు వానికి బీళ్లు అమరునట్లుజేయ ప్రయత్నించవలెను.

## ఎరుపునేలలయందు విత్తనముల నుపయోగించుట

పశువుల వీటిక్రింద పదలునేల మంచిదైననేగాని యందలి పచ్చికయందు మేయు పశువులకు బలము ఆరోగ్యము కలుగదు. మెట్టతాలూకాలలో ఎరుపునేలలు (Red lands) విశేషముగా బీళ్లు వదలబడుచున్నవి. కాని యిందు వర్షము మరియు చున్నంత వరకేగాని అటుపిమ్మట తర్వాలో పదు నారిపోవుటచే గడ్డియంతగా బట్టదు. పశుజాతులైనను ప్రశస్తముగా నుండవు. కోయంబత్తూరు జిల్లాలో బాగుగా పట్టని ఎఱ్ఱనేలలోను కంకరనేలలోను కొలకగడ్డియను ఒకజాతిగడ్డి విత్తులనుజల్లి ప్రత్యేకముగా బీళ్లను తయారుచేయుదురు. ఒక పర్యాయము జల్లి ఏడెనిమిది సంవత్సరముల వరకు బీడుగా వదలి తరువాత మరల సాగులోనికి తీసికొనివచ్చుదురు. ఎకరమునకు రమారమి ఎనిమిదిపౌనుల విత్తులుపట్టును. ఈగడ్డిని ప్రత్యేకముగా అప్పు డప్పుడు గంటి జొన్న సాత్తు మొదలగు సస్యములతో గలిపి జల్లి యూపంటను తీసివేసిన తరువాత నేలను బీడుగావదలుదురు. ఇట్టి విత్తులను జల్లి బీళ్ళనుజేయు పద్ధతి తెలుగు జిల్లాలలోగూడ నవకాశము గలవారవలంబించదగు గాక.

## బీళ్లలో సున్న మెక్కువ కావలయును

బీళ్ళలో పెరుగుగడ్డిజాతులు సున్నము (Lime) నెక్కువ దీసికొనును. కాబట్టి లోతుగనుండు నల్లనేలలో నవుడభూమి సున్నము గలుటమంచిది. గరికగడ్డికి సున్నము

మరింతయిష్టము. కోయంబత్తూరు జిల్లాయందలి నేలలలో నప్పుడప్పుడు నున్న మెత్తా వగ నుండుటచేత నచ్చట బీళ్ళలో గడ్డి బాగుగా పెరుగుచున్నది. మధ్యపరగణాల (Central Provinces) లో నున్న కొన్ని జిల్లాలలో ఆవుల, ఎద్దుల పోషణనిమిత్తము ప్రత్యేక అధికారుల నియమించియున్నారు. అడవులను (Jungles) వ్యవసాయమునకు చెలికత్తెలందురు. తగినగడ్డిని పెంచి నిలువుదలచేసి అడవులలో మేపుటకంటెను గడ్డి కోయించి అమ్ముట మంచిది.

## బీళ్లలోని పశువులను కాపాడుట

పశువుల మేతకై భూమి సాగుచేయక బీడుగా విడిచిపెట్టుట ప్రాముఖ్యమైన విషయము. బీళ్ళలో సర్వకాలములయందును చక్కని పచ్చికయుండు టవసరము. నీడయును శుద్ధోదకమును ముఖ్యములు. పశువుల నూరివెలుపల సంచారము లేనిచోట్ల మేపునెడల నవి మనుష్యుల చూడగనే బెదరిచూచుచుండును. అందువలన నిర్జనప్రదేశము లలో మేతమేయుటను పశువుల కలవరచరాదు. పశువుల కాపరులు (Cattle Attendants) తమకు తీరికగా నున్నప్పుడెప్పుడో పశువులకు నీరు బెట్టజాలుదురు గాని సరియైన వేళకుమాత్రము పెట్టరు. మన యిండ్లయందున్న పశువులకన్న బీళ్ళలోనుండు పశువులు స్వేచ్ఛగానుండును. బీళ్లలోనుండు పశువులు మనుష్యులను చూడగనే బెదరుగా చూచుచుండును. అందువలన పశువులు మచ్చికను సరిగా రాజాలవు. అందుచేతనే అరణ్య ములలోనుండు పశువులను మచ్చికచేసి పట్టుకొనుటకెంతో ప్రయత్నించెదరు. అట్లు ప్రయత్నించి తీసికొనివచ్చి యింటివద్దనుంచి మేపినను వాటి పౌరుషము మాత్రము చావదు. బీటిలో మేయుపశువులను అప్పుడప్పుడు గ్రామములలోనికి తోలుకొనివచ్చి ఆబీటి మేత కోసికొనివచ్చి మేపుట మంచిపద్ధతియైయున్నది.

పశువుల కాపరులను బట్టికూడ ఆపశువులు తగినచేష్టలు చేయుచుండును. బీటి పశువులకు క్రౌర్యము, తామసము, అహంకారము ఎక్కువగానుండును. పెద్దపులులు మొదలగు ఘాతుకజంతువులు బీళ్లలోనున్నవని అనుమానమున్నపుడు కాపరులు జాగ్రత్తగా చూచుచుండవలెను. పశువులకు నియమిత వేళల నేర్పరచి నీరు పెట్టుచుండ వలెను. అక్కడనున్న పశువులలో నేదైన జబ్బుగానున్నదో, పోట్లాడుకొనుచున్నదో, ఏదైన దెబ్బతగిలి రక్తము కారుచున్నదో, ఈనుకొని పోయినదో మొదలగునవి బాగుగా పరీక్షించి తగిన శ్రద్ధ తీసికొనవలెను.

బీళ్లలో చర్మముకొరకు మాదిగవాండ్రు పాషాణమిడిని, దొమ్మ గురకచే చని పోయినవాటిపేడను జల్లుదురు. అట్టిమేతతిని పశువులు చనిపోవుటయుగలదు. కావున రైతులు అప్పుడప్పుడు బీళ్లను పరీక్షించుచుండవలెను. ఇంకను విషపురుగులుగాని దుష్ట సర్పములుగాని జంతువులుగాని బీళ్లలో నివసించి పశువులను చంపుచున్నది లేనిది చూచు చుండవలెను. పెద్దరోగము, గురక దొమ్మ మొదలగు అంటుసంబంధమైన రోగములు (Contageous diseases) వ్యాపించుచున్నవి లేనివి పరీక్షించు చుండవలెను.

## గ్రామ కట్టుబాట్లవసరము

గత శతాబ్దములో దేశములో జనాభా వృద్ధియగుటచేత వ్యవసాయమునకు అనుకూలముగాని భూములన్నియు ఆక్రమించుకొనబడినవి. మైదానములన్నియు పల్లెలుగా మారినవి. అందుచేత క్రమముగ పశువులకు వలసిన పచ్చిక లేక పోయినది. వాని జవసత్వములు (Strength and energy) క్షీణించి పోవుచున్నవి. కాబట్టి మరల పచ్చిక భూములను పెంపొందింపవలసిన యవసర మెంతేనియు గలదు. మనహిందూ దేశములో విశేషముగ పచ్చికబీళ్ళులేవు. విశేషముగ లేకున్నను ఉన్నవానిని అభివృద్ధి చేయుటకు మార్గము లుండకపోలేదు. అనేక గ్రామములచుట్టు పశువుల మేతనిమిత్తము కొంత బంజరుభూమి యుండును. అట్టి బంజరుభూములలో తంగేడు, జిల్లేడు, తంగెపుచెట్లు మున్నగు పనికిరాని చెట్లు పెరిగి ఆసలమును ఆక్రమించుకొనుచుండుట మనమందర మెరిగిన విషయమే. ఇట్టిభూములలోనుండు పనికిరాని చెట్లనునరికివేసి బీటి సంబాధమగు మేతలువేసి పెంచి గ్రామపశువులను మేపుచుండుట మంచిది. ఇటువంటి పనులు చేయుటకు గ్రామములో సంఘీభావము (Unity) కావలెను. ఇప్పటి పరిస్థితులలో ప్రతి గ్రామమునందు పార్టీలుండుట తటస్థించు చున్నవి. ఈ పార్టీలుండుటవలన పశుగ్రాసము (Fodder) నశించినది. కాలువగట్లమీదనుండు గడ్డికూడ రెట్టింపు ధరపెట్టి కొనవలసివచ్చుచున్నది. గ్రామ పోరంబోకులలో నిదివరకు ఐకమత్యముగానున్నపుడు తమయిష్ట ప్రకారము అపరసస్యములువేసి పెంచెడివారు. తగాదాలున్న గ్రామములలో ప్రభుత్వము వారికి పితూరీలుచెప్పి ఉభయులుకలసి పశువులనోటిలో గడ్డకొట్టుచున్నారు. ఈరీతిగా మన దేశములో రైతులకైకమత్యము లేక పశుసంతతిని నాశనము చేయుచున్నారు. గడ్డిజాతుల పేర్లేమరచిపోవుచున్నారు. కాలమునకు తగినట్లుగ పైరులు వేయక సరిగా పంటలు పండించక ఎరువులను తోలక పశువుల మేతవిషయమై పశువుల బీళ్ళవిషయమై తగిన కట్టుబాట్లుచేయక పశుసంతతిని పాడుచేయుచున్నారు.

## బీళ్లను వృద్ధిజేయుట

పచ్చికబయళ్లసంఖ్య పెంచుటకు శీఘ్రముగ ప్రజాభివృద్ధియగుచున్న దేశములయందు వీలులేదుగాన పూర్వమునుండి వచ్చుచున్న పచ్చికబయళ్లయందే ఎక్కువ పచ్చికనుపెంచు విధానముల నవలంబించవలెను. గ్రామములకుసంబంధించిన బయళ్ళయందు పశువుల మందలను విచ్చలవిడిగా వదలివేయక అట్టిబయళ్ళను కొన్ని భాగములుగా విభజించి ఒక్కొక్కభాగము కొన్ని దినములు మేయునట్లు చేయవలెను. ఈరీతిగా చేయుట వలన మిగిలిన భాగములయందు పచ్చికపూర్తిగా పెరుగుటకు వీలగుచున్నది.

బీళ్ళకు వర్షము కురిసినవెంటనేగాని, బీళ్ళలో నీరునిలిచినప్పుడుగాని పశువులను తోలి మేపరాదు. అట్లు మేపినయెడల గడ్డినంతయు త్రొక్కిపాడుచేయుటయే గాక మంచి రకపు గడ్డిఅంతయు నాశనమగును. గడ్డి పెరుగు ఋతువుల (Seasons)

దుక్కిచలవే చలవ; తల్లిపాలే పాలు

యందు పశువులను తోలరాదు. మేతబాగుగా పట్టి కొంచెము ముదిరిన తరువాత మేప వలెను. జిల్లేడు, రెల్లుదుబ్బులు, నల్లఉమ్మెత్త తాకుచెట్లు, మున్నగు పనికిరాని మొక్కలను తీసివేసి మంచిరకముల గడ్డిజాతులను పెంచవలయును. మంచి విత్తనమునువేసి పెంచి కాయలుకాయించి ఎండించిన తరువాతగొఱ్ఱెలను మేకలను బీటినాలుగువైపుల త్రిప్పిన యెడల ఎండినకాయలు బ్రద్దలై బీడంతయు వ్యాపించును. వేసవి కాలములోబీళ్ళలో మేపరాదు. గడ్డిపెరుగుకాలములో ఆపుదలచేసి మంచిగడ్డి జాతులు విత్తనములు ముదిరిన తరువాత పూర్తిగా మేపవలెను. మంచిరకపు గడ్డిని ముఖ్యమైనపశువులకు మేపి తక్కినవాటికి రెండవరకము మేపుట రైతునకు సునాయాసముగా నుండును. బీళ్ళలో నీరుత్రాగు గుంటలుగాని, చెరువులుగాని ఎక్కువగా నుండరాదు. అట్లుండుటవలన బీళ్లు తేమగలిగి పాడగును. ఇంతియేగాకుండ పశువులు మాటిమాటికి నీరుత్రాగుటకు వెళ్ళి మంచిజాతిగడ్డిని పాడచేయుచుండును. విషపురుగులు, దుష్టజంతువులు, దుష్ట సర్పములుండు పుట్టలను నిర్మూలించవలెను.

## విదేశములలోని పచ్చికబయళ్ళు

ఉష్ణమండలములోను సమశీతోష్ణ మండలములోను పచ్చిక బయళ్ళుగలవు. ఈబయళ్లలో వాన ఎక్కువగాకురవదు. కనుక చెట్లు మొలవవు. నదీతీరమున మాత్రము చెట్లు మొలచును. ఎండకాలమున పచ్చిక ఎండిపోవును. ఉష్ణమండలపు పచ్చిక బయ ళ్లను సావన్నాస్ (Savannas) అందురు. సమశీతోష్ణమండలపు పచ్చిక బయళ్లలో సంవత్సరము పొడుగునను పచ్చిక పెరుగుచుండును. ఇచ్చట ఎండకాలమున ఎండ ఎక్కువ. వర్షమెక్కువగ లేకపోయినను పచ్చికకు కావలసినంత కురియును. ఈపచ్చిక బయళ్లను పాంపాస్, స్టెప్స్, ప్రయరీస్ అనిపేర్లు. ఇట్టిప్రదేశములు సాధారణముగా సముద్రమునకు దూరముగ నుండుటచే ఎండకాలము నందు ఎండయు, వానకాలమునందు వానయు ఎక్కువగానుండును. ఇటువంటి పచ్చికబయళ్ళు అన్ని ఖండములలోనుగలవు. వేలకొలది పశువులను గొఱ్ఱెలను మేపుకొని ఇచ్చట జనులు నివసించుచున్నారు. ఉష్ణ మండలములలోను, దానికి సమీపమునయుండు సమశీతోష్ణప్రదేశములలోను అరటి, మామిడి, ఈత, పేరీత, కొబ్బరికాయమున్నగు నవియును చక్కగా ఫలించును. కొబ్బరికా యలు మనదేశములోను, సిలోన్ (Ceylon) లోను, సుమిత్రా జావా మున్నగు ఉష్ణ ప్రదేశములలోను చక్కగా ఫలించును.

ఆయాప్రదేశములలో చెట్లచేమలలో భేదమున్నట్లు ఆయా ప్రదేశములలో జంతుజాలములలోను భేదమున్నది. దట్టమైన అడవులలో జంతువులు విశేషించి యుండును. ఇచ్చట వీనికి వలయు ఆహారములు మెండుగనుండుటయే ఇందులకు కారణములు. ఎడారి ప్రదేశములలో మృగములు ఉండవు. శీతలమండలములలో జంతువులుకొన్నియే యుండును. శీతోష్ణస్థితులలోని భేదముల ననుసరించియే జంతువులుండును. ఆఫ్రికా

---

మలుగులు మింగితే; మాపటికి ఈనుతుంది

ఉష్ణమండలము (Tropical Region) లోనిదట్టమైన అడవులలో పులి, సింహము, జిరాఫీ, జీబ్రా మొదలగు నానావిధ మృగములును చెట్లపై నివసించు కోతులు మున్నగునవియు, పాములు పక్షులు మున్నగునవియు విశేషించియుండును. ఈ ప్రదేశములలోని నదులలో మొసళ్ళు; ఖడ్గమృగములు, నీటిగుఱ్ఱములు, మున్నగునవి నివసించును. ఆఫ్రికాలోని పక్షిజాతులలో నిప్పుకోడి (Ostrich) పెద్దది. ఆస్ట్రేలియాలోని జంతువులు ఇతరదేశములలోని జంతువులకన్న విచిత్రమైనవి. శీతలదేశములకు సమీపమునందుండు ప్రదేశములలో జంతువులు తక్కువ. వీనికి చలిబాధలేకుండుటకై వీనిచర్మము పైనఉన్ని (బొచ్చు) ఎక్కువగానుండును. బొచ్చుకై ఈజంతువులను వేటాడుదురు. రెయిన్‌డియర్ అనుజంతువు మంచుగడ్డలమీదను దిబ్బలపైనను సులభముగా త్వరగా నడువగలదు. అక్కడ దొరకుపాచియే దీనికిఆహారము. ఎడారులలో ఒంటెతప్ప మిగిలినఏజంతువును తిరుగజాలదు. ఆహారము సంపాదించుకొనుటకై దాని కడుపులోనుండు తిత్తి విచిత్రమైనది. దాని పాదములు వెడల్పయి మెత్తగానుండుటచే ఇసుకలోదిగబడవు. ఈకారణములనుబట్టి దీనికి ఎడారిఓడఅనిపేరు. ఎడారిని ఆనుకొనియుండు పచ్చిక బయళ్ళలో సాధారణముగా పచ్చికమేయు జంతువులు విశేషించియుండును. గొఱ్ఱెలు, మేకలు, పందులు, గుఱ్ఱములు మున్నగునవి యుండును. అచ్చటిజనులకు ఇవి చాల ఉపయోగకరమైన జంతువులు. ఇవి తినుటకుఆహారమును, కట్టుకొనుటకు బట్టలును-తోలును యిచ్చును. పచ్చికబయళ్ళు ఎక్కడనుండునో అచ్చట అంతయు పీటిని జనులు కోట్లకొలది పెంపుచుందురు. పశువులు ఉష్ణప్రదేశములందును వానిని ఆనుకొని యుండు సమశీతోష్ణ ప్రదేశములలోను ఎక్కువగా నుండును. మన దేశములో సుమారు 60 కోట్లును, యునైటెడ్ స్టేట్సు (United States) లో 50 కోట్లును కలవు. మిసిసిపి (Misisipi) నదికి పడమట రాకీపర్వతమును ఆనుకొని యుండు బయళ్ళలో వీనిని విశేషించి పెంచుచుందురు. దక్షిణ అమెరికాలోని అర్జెంటైనాలోను పశువుల సంఖ్య ఎక్కువ. ఆస్ట్రేలియా న్యూజిలాండు బయళ్ళలో గొఱ్ఱెల నెక్కువగా పెంచుదురు. యునైటెడ్ స్టేట్సులో మాత్రము 50 కోట్ల పందు లున్నవి. వానికి కొన్నలుపెట్టి బలిపింతురు.

శీతోష్ణ స్థితిగతుల ననుసరించి ప్రపంచములో పైరుపచ్చలుండును. మిక్కిలి వేడియు, వర్షపాతమును గల ప్రదేశములలో గొప్ప అడవులు పెరుగును. వేడియు స్వల్పవర్షపాతముగల ప్రదేశమున పచ్చిక విస్తారముగా పెరుగును. ఇట్లే సమశీతోష్ణ ప్రదేశములలో, పచ్చికయు, అంగుపగ్గ పాకు మొక్కలుగల ప్రదేశముల పెద్దవృక్షములు పెరుగును. ధ్రువప్రాంతము మంచుగప్పు ప్రదేశము. ఇచ్చటమంచు గడ్డ కట్టియుండును. పంటలుపండవు. ఇచ్చట సీల్, సీలు, ఎలుగుబంట్లు, రెయిండీరు మున్నగు జంతువులుండును. అచ్చట జనులను ఎస్కిమో (Eskimo) లందురు. అచ్చట వారు జంతువులను వేటాడి చంపితిని బ్రతుకుదురు. రెయిండీరుయొక్క పాలనుగూడా త్రాగుదురు.

---

వరుపుకు మెరుపులు మెండు; పట్టిగొడ్డుకు అరుపులు మెండు

వేటాడుట చేపలను బట్టుట వీరిముఖ్యవృత్తి. వీరుసెడ్జస్ (Sedjas) అనుబండ్లమీద మంచుగడ్డలపై ప్రయాణము చేయుదురు. ఈ బండ్లను కుక్కలచే లాగించుదురు.

భారతదేశము ముఖ్యముగా వ్యవసాయముపై నాధారపడియున్నది. పాశ్చాత్య దేశములలోవలె మనదేశములో వ్యవసాయము యంత్ర సహాయము వలన జరుగుటలేదు. వ్యవసాయమున వెన్నెముక పశువులు. వ్యవసాయపెట్టుబడిలో పశువులు ముందువచ్చును. తిండికి అన్నము ప్రధానమెట్లులనో వ్యవసాయమునకు పశువులు అట్టువంటివి. ఇట్టి పశువులకు సరియైనతిండిలేక అవి డొక్కలు ఎగరగొట్టుకొని, లోతునకు పోయిన కన్నులతో నీరసముగానుండి పనిచేయులేక పోవడమేగాక వాటి సంతతికూడ "నానాటికి తీసికట్టు నాగంభట్టూ" అను లోకోక్తిప్రకారము అగుచున్నది. పశువుల మేతనుగూర్చి మన దేశాన్ని యితరదేశాలతో పోల్చి చూచిన డెన్మార్కు దేశములో నూరు ఎకరముల సాగుబడిభూమి విస్తీర్ణమునకు 45 పశువులును, హాలెండులో 38 న్ని, జర్మనీలో 32 న్ను, ఆస్ట్రేలియాలో 37 న్ను, అమెరికాలో 17 న్ను, కెనడాలో 14 న్ను బ్రిటిష్ ఇండియాలో 67 గలవు. కనుక నూరు ఎకరములభూమిపై మనదేశములో 67 పశువులు మేతకొరకు ఆధారపడియున్నవి. ఇట్టి పరిస్థితులలో పశువులకు ఏరీతిగా మేత దొరకునో తెలిసికొనవలెను. భూమి విస్తీర్ణముకన్న పశువులసంఖ్య ఎక్కువగుచున్నకొలది పశువులకు మేతకొరకక పోవడమేగాకుండ వ్యవసాయ ఖర్చులు కూడ ఎక్కువగుచున్నవి. కాబట్టి మనదేశములో పశువులకు సరియైన మేత లేకపోవుట వలననే వృద్ధిలోనికి వచ్చుటలేదు.

విదేశములలో బలమైనపశువులకు బలముగు పశువులను కలిపి, వాటి సంతానమునకు తగినమేతపెట్టి పోషించి మంచిజాతిని తయారుచేయుదురు. కాబట్టి శాస్త్రరీతిగా పెంచుపద్ధతి మనదేశీయులకు సాధ్యపడుటలేదు. సామాన్యముగా ఒక జత పశువులను పోషించుటకు రైతునకు సంవత్సరమునకు సుమారు రు. 50 నుంచి 60 ల వరకు అగును. ఇది కేవలము పశువుల ఉలవలక్రింద, తెలికపిండిక్రింద ఖర్చుపెట్టిన సొమ్ము. గడ్డి, చొప్ప, జనుముకాడ మున్నగునవి లెక్కచేసికొనుట లేదు. ఇవికూడ కలుపుకొని, వాటికితోడు అప్పుచేసికొనిన పశువులకు వడ్డికూడకట్టుకొనిన ఒకజత ఎద్దులను మేపుటకు రైతునకు సంవత్సరమునకు రు. 120 నుంచి 150 ల వరకు అగుచున్నవి. గవర్నమెంటువారు వ్యవసాయ ఫారములలో ఒకకాడిఎడ్లను మేపుటకు సంవత్సరమునకు రు 125 నుంచి 250 ల వరకు అగుచున్నవి. కనుక పశువులను తయారుచేయుటకు సరియైన మేత పెట్టలేకున్నాడు.

పశువులకు ముఖ్యముగా బలముకలిగించు తవుడు, తెలికపిండి ధరలు పెరుగుట వలన పశువులను మేపలేకున్నాడు. ఈ కారణమువలన పశువులు చూడిగా నున్నపుడు సరియగుమేతపెట్టక పాలుయిచ్చినన్నాళ్లు రైతులువాటిని మేపుచున్నారు. ఈపద్ధతే చాలాతప్పు. చూడిగానున్న ఆవునుగాని, గేదెనుగాని బాగుగా మేపినపుడే మంచి

---

దున్నగలిగితే మన్ను ముట్టవలెను

సంతానము కలుగును. పట్టణములలో కొంతమంది పాలవాండ్రు పాడిపశువులను పగలంతా వీధులలోనుండు ఎంగిలివిస్తళ్ళను తినుటకు వదలిపెట్టి రాత్రితమకు సేరుపాలు వచ్చుటకు ఆశపడినవారున్నారు. ఇటువంటి అభ్యాసముల మానుకొనవలెను. మన దేశమునుంచి నూనెగింజలు నువ్వులు వేరుశనగ ఆముదాలు మున్నగునవి విదేశములకు ఎగుమతియై వాటితోనే క్రూడాయిల్, మోబిలాయిల్, అనుపేర్లతో డబ్బాలలోనికెక్కించి ఎక్కువధరలకు సప్లయి అగుచున్నవి. ఇటిగింజలను విదేశములకు వెళ్లనీయకుండనున్నప్పుడే పశువులకు దాణావస్తువులు దొరకును.

## పిండులను తయారు చేయుట

చమురుగింజలనుండి నూనెను తయారుచేయగా మిగిలిన పిప్పినే పిండి (Cake) యందురు. ఈపిండి పశువులకు మేతగను, పొలములకు ఎరువుగను నుపయోగించెదరు. కొంత నూనె ఈ పిండులలో కలసియుండును. గానుగ ననుసరించి ఎంత నూనె యుండునది తెలియును. ఇనుపయంత్రముల గానుగలలో మాత్రముండు పిండులలో నూనె ఎంత మాత్రముయుండదు. కొన్నిరకముల పిండులను మాత్రమే పశువులుతినును. నువ్వులు, ప్రత్తివిత్తులు, ఎట్టగిసె, ఆవ, పసుపు, వేరుసెనగ, కొబ్బరి, మొదలగువాటి పిండులు పశువులు మిగుల ప్రీతితో తినును. ఆముదము, బొప్పాయి, మహువా పిండినిమాత్రము తినజాలవు. ఏయే పిండిని ఎరువుగా నుపయోగించునది వాటివెలల ననుసరించి యుండును. కొన్నిటిని పశువులు తిననందువలన వెల (Cost) సరసముగునని తలంచరాదు. కొన్నిప్రదేశములలో పశువుల ఆహారమున కుపయోగపడునవి చాలస్వల్ప ధరలకు లభించును. అట్టి సందర్భములలో వాటినే ఎరువులుగా నుపయోగించవలెను.

పశువుల కుపయోగించని ఆముదపుపిండి తినుట కుపయోగించు వానికంటె వెల ఎక్కువ. ప్రతిరైతును ఏదిచౌకగా లభించునో ఆలోచించుకొనవలెను. పశువులకు దగిన పిండిని మేపి వాటి మలమూత్రములు (Urine and dung) భూములకు వినియోగించిన యెడల రెండువిధముల లాభములుండును. పశువులకు మేపినందువలన వాటిలోని పుష్టికారపదార్థములు నశింపవు. అవన్నియు మలమూత్రములలోనే యుండును. కాని మలమూత్రములు పదిలము చేయుటయందు జాగ్రత్త లేనియెడల నష్టమగును. చెరకు మొదలగు విలువగల సస్యములను పైరు చేయుకొనువారు పశువులకు తెలికపిండి (Oil Cake) మేపి వాటిని పొలములోనే రాత్రియందు కట్టివేసిన యెడల నష్టముండదు. మేతకుండవలసిన ధర్మములకును ఎరువున కుండవలసిన గుణములకును చాలవ్యత్యాసము గలదు. తేమ, నార, మాంసకృత్తులు, ద్రావణీయమైన సేంద్రియపదార్థము మొదలగు వస్తువులన్నియు మేతకుపయోగపడెడు పిండులలో నుండవలెను. ఈకారణములవలన మేతకుపయోగపడని పిండి ఎరువుల కుపయోగపడుపదార్థము లెక్కువగా నుండును.

## ప్రత్తిగింజలు

ఈ గింజలు పాడిపశువుల కాహారముగ వాడబడు చున్నవి. ఈ గింజలపైన కొంచెము ప్రత్తియంటియుండును. ఈ ప్రత్తియు, గింజలపై పొట్టును జీర్ణముగావు. ప్రత్తిగింజలయందు తగినంతచమురున్న నే గాని పశువులకు బెట్టినపుడు జీర్ణముకాదు. ప్రత్తిపండు జిల్లాలలో గింజలు చౌకగదొరకును. ఈ గింజలను చితుకగొట్టి ఎరువుగ వేసిన తగినంత ఫలితము బొందవచ్చును. ఎక్కువ కాలము నిలువయున్న యెడల ప్రత్తిగింజలు పశ్వాహారమునకు పనికిరావు. అప్పుడు గింజలు చౌకయగును. గనుక వీటిని ఎరువునకు బనికిరావని తలంపరాదు. ఎరువునకు చమురు ఆరిపోయిన గింజలే శ్రేష్ఠము. చమురున్న గింజల నెరువుగా నుపయోగించినప్పుడు త్వరితఫలితము గాన్పించదు. ప్రత్తిగింజలయందు చమురు తక్కువగా నుండుటచేత చమురును దీయుట కీదేశమున ప్రయత్నింప బడుట లేదు.

## ప్రత్తిగింజల నూనె

అమెరికా దేశపు ప్రత్తివిత్తులనుండియు, ఈజిప్టు (Egypt) దేశపు ప్రత్తివిత్తుల నుండియు గానుగల మూలమున చమురు తీయబడుచున్నది. ఈ చమురు కూరలలో తాలింపులు వేసికొనుటకును, వెన్న చేయుటకును, చేపలు మున్నగు ఆహారపదార్థములు నిలువ చేసికొనుటకును ఉపయోగింపబడుచున్నది. మనదేశపు ప్రత్తివిత్తుల చమురు వగరు రుచిగలిగి గోధుమరంగుతో నుండుటచె దీనినెగుమతి నంతగా నుపయోగించుటలేదు. ప్రత్తి నూనె కొంచెము పసుపురంగు (Yellow Colour) కలిగి రుచిగానుండును. ఈ నూనె పశువుల చర్మవ్యాధుల (Skin diseases) కు వాడవచ్చును.

## ప్రత్తిపిండి

ఈపిండిలో 10 వేలపాళ్ళలో

| | | |
|---|---|---|
| 950 | పాళ్లునీరు | |
| 1575 | ,, | మాంసకృత్తులు |
| 3274 | ,, | ఉష్ణకరపదార్థములు |
| 2035 | ,, | నార |
| 376 | ,, | లవణపదార్థములు |
| 1790 | ,, | నికరవస్తువులు |

ఉండును. గింజలపై పొట్టునుతీసి శుభ్రము చేయకుండ సిదము చేయబడిన పిండిలో నూటికి 3.4 భాగములు నత్రజని (Nitrogen) యు 1.26 భాగముల భాస్వరము

బుధవారం పుట్టినదున్న భూమిని దున్నిన, త్రొక్కిన తోడైపండును

(Phosphorus) యుండును. ఈపిండి పెట్టబడిన పాలలో క్రొవ్వుపదార్థములు (Fats) ఎక్కువగాయుండును. దానివలన వెన్నయొక్కవై పూర్వముకంటె నెక్కువ జిడ్డుగను గట్టిగను యుండును. నేయిగూడ గట్టిగ ముద్దగనుండును. ప్రత్తిగింజల పదార్థము పశువులకు పెట్టుచున్నంతకాలము యీరీతిగా నుండును. పిండినిగాని గింజలనుగాని అధికముగా పెట్టరాదు. గింజలలో చమురు ఎక్కువగా నుండుటవలన పిండినే పెట్టుటమంచిది. ప్రతిదినము ఇతరాహార పదార్థములతో పిండిని చేర్చిపెట్టుటవలన పశువులకు బలము నిచ్చుటయేగాక వెన్నయు పాలును వృద్ధియై చాలమంచి గుణములు కలుగును. ప్రత్తిపిండివలన వెన్నవలె పాలంతగా వృద్ధియైనటుల కానరావు.

## వేరుశనగపిండి

బొంబాయి, మదరాసు రాజధానులలో పప్పుకొరకును నూనెకొఱకును విశేషముగా పైరు చేయుచున్నారు. వేరుశనగ పరదేశములనుండి ఎన్నియో శతాబ్దము (Century) ల క్రిందట మన దేశమునకు తేబడినది. చీనా, మనిల్లా, అరేబియా దేశములనుండి, తేబడినట్లు తెలియుచున్నది. వీని జన్మభూమి బ్రెజిల్ (Brezil) దేశము. ఇది అయిదారు నెలలపంట. పంట తీరగనే పై పచ్చితీగనుకోసి ఎండవేసినచో పశువుల మేతకు పనికి వచ్చును.

నూరుపాళ్ళ వేరుశనగపిండిలో 13. 41 చమురు
49. 48 మాంసకృత్తులు
23. 5 ఉష్ణకరపదార్థములు

గలవు. మాంసకర పదార్థములలో 80 పాళ్ళు మాత్రమే జీర్ణమగును. కాబట్టి జీర్ణకర పదార్థములు 39.58, జీర్ణకరమగు ఉష్ణకరపదార్థము 16.9, జీర్ణమగుచమురు 12.06. జీర్ణమగుచమురును 23 చే గుణించి జీర్ణమగు ఉష్ణకరపదార్థములతో కలిపివేయవలెను. అందువలన జీర్ణమగు చమురు విలువ 44.63 యుండును. కాబట్టివేరుశనగపిండిలో నూరుపాళ్ళలో 39.58 మాంసకృత్తులు, 44.63 ఉష్ణకరపదార్థములును జీర్ణమగును. అనగా సుమారు 1.25 అగును. కాబట్టి ఇది మిక్కిలి బలకరమైనది. దీనిలో ఉష్ణకర పదార్థములున్నవి. పాడిపశువులకు దినమునకు చిన్న దూడలకు ఒక అరపౌనున్ను పాడి పశువులకు 4 లేక 5 పౌనులను పెట్టిన బాగుగా పాలనిచ్చును, వెన్నయగును. పెట్టిన తరువాత ఒక ఔన్సు ఉప్పు (Salt)) పెట్టవలెను. ఇప్పుడిప్పుడే రైతులలో చాలమంది దీనిని వాడుచున్నారు. వ్యవసాయ డిపార్టుమెంటు (Agricultural Department) వారు ఈ విషయమై బాగుగా ప్రచారము చేయుచున్నారు.

---

## తెలికపిండి

దీనిపంట మనదేశమునందంతటను యున్నది. కాని బొంబాయి చెన్నరాజధానుల యందు, బర్మా మధ్యపరగణాలయందు విస్తారముగా పైరగుచున్నది. నువ్వులవలన దీయు చమురు మానవులకు పశువులకు ఆహారమునకేగాక మందులలోనికి గూడ పనికి వచ్చును. తెలికపిండి (Oil Cake) పాడిపశువులకును, తదితర పశువులకును మంచి ఆహారమైయున్నది. పాతముగల పశువులకు దినమునకు ఒక అరవీసెడు వంతున ఈయవలెను. నికృష్టపశువులకు అంతగా వాడరాదు. పశువు రోగములోనున్నప్పుడు తెలికపిండి పెట్టుటమంచిది. వాతసంబంధమగు రోగములు కలిగినపుడు ఈపిండిని అప్పుడప్పుడు పెట్టుటమంచిది. నిండుచూలుతో నున్న పశువులకు ఎక్కువగా వాడిన మొదల పిండము (Foetus) కరిగిపోవును. పశువు ఈనిన పిమ్మట బాగుగా పెట్టవచ్చును. దుక్కిటెద్దులకు సాయంకాలముపూట పెట్టవలెను. గానుగ ఆడినవెంటనే పిండి తెచ్చిపెట్టిన మిగులబలము గలిగించును. నిలువయున్న పిండి అంత శ్రేష్ఠమైనదికాదు.

ఈపిండిలో 10 వేల పాళ్ళలో

| | | | |
|---|---|---|---|
| 1080 | పాళ్లనీరు | 3175 ,, | మాంసకృత్తులు |
| 2900 ,, | ఉష్ణకరపదార్థములు | 365 ,, | నారపదార్థములు |
| 1140 ,, | లవణపదార్థములు | 1340 ,, | తదితర వస్తువులు |

యుండును. పిండులన్నిటిలో తెలికపిండి శ్రేష్ఠమైనది. ఈ పిండినిగురించి ఆయుర్వేదపశువైద్యవస్తుగుణదీపికలో తేటతెల్లముగా తెలుపబడినది.

## కొబ్బరి పిండి

కొబ్బరికాయలను (Coconut fruits) ఎండబెట్టి గానుగలోవేసి చమురు దీయుదురు. చమురుదీయగా మిగిలిన పిండి పాడిపశువులకు ఆహారముగా నుపయోగించు చున్నది.

ఈపిండిలో నూటికి

| | | | |
|---|---|---|---|
| 9.00 | పాళ్లు నీరు | 19.35 | పాళ్లుపిప్పి |
| 4´.00 ,, | పిండిపదార్థములు | 9.12 ,, | కొవ్వు |
| 8.64 ,, | నారపదార్థములు | 5.89 ,, | బూడిదపదార్థములు |

యుండునని తెలియుచున్నది. ఆరంభములో ఈ పిండిని పశువులంతగా తినవు. అలవాటు చేసినకొలది దినమునకు 7½ పౌనుల కొబ్బరిపిండి (Coconut cake) ని తినునట్టు చేయవచ్చును.

## గడ్డి రకములు స్వభావము

కొన్నిజాతుల గడ్డి మరికొన్నిటికంటె మృదువుగ నుండును. మెట్టపైరులగడ్డి దంపవరులగడ్డికంటె మృదువుగ నుండును. కొసామణి మొదలగు రకములగడ్డి మిక్కిలి మృదువుగ నుండును. కేసరిగడ్డిని పశువులు బాగుగాతినును. మిగుల ఆరోగ్యకరముగా కూడ నుండును. భూమియందలి ఖనిజములను బట్టి గడ్డియొక్క స్వభావము మార్పుగలదు. విశాఖపట్టణము జిల్లాలోని గరపనేలలలో పెరుగుగడ్డికంటె గోదావరిజిల్లాలో పెరుగు గడ్డి మృదువుగ నుండును. మృదువుగనుండు రకములలో గడ్డితక్కువగును. మోటుగ నుండువానిలో గడ్డియెక్కువగును. దుబ్బు బాగుగా జేయురకములో నట్లుగాక నెక్కువ గడ్డియగును. ఎక్కువకాలములో పండురకములు తక్కువకాలములో పండురకముల కంటె నెక్కువ గడ్డినిచ్చును.

వరిగడ్డిలో 8.72పాళ్లనీరు, 7.3పాళ్ల మాంసకరపదార్థములు, 45.89పాళ్ల ఉష్ణకర పదార్థములు, 42.96 పాళ్ల క్షారబూడిదపదార్థములు ఉన్నవి. మొత్తముమీద ఈ వరి గడ్డిలో నుష్ణకరపదార్థములు హెచ్చుగానున్నవి. అందువలననే వరిగడ్డితో విశేషముగా మాంసమిచ్చు మరియొక పదార్థము కలుపనియెడల సరియైన యాహారముకాదు.

పైనచెప్పిన అన్నిజాతుల వరిగడ్డి పశువులకు మంచి ఆహారమైయున్నది. ప్రతి మెట్టభూమిని మాగాణిగా చేయుచున్నారు. అందుచే పశువుల బీళ్ళను, మెట్టపైరులను, పశువుల ఆహారములకు మిగులనష్టము గలుగుచున్నది. కాబట్టి రైతులు సగభాగము మాగాని, సగభాగముమెట్ట నుంచిన అన్ని సౌకర్యములకు వీలగును.

## తదితర గడ్డిజాతులు

రెల్లుగడ్డి:— ఇది నదియొడ్డులను, లంకలలోను, పెద్ద పోరంబోకు గట్లమీదను, చెరువులచుట్టును పెరుగును. ఇంకను కాలువగట్లదగ్గిరా వరదలకు తెగకుండ ఈమొక్కలను నాటుదురు. ఇది మంచిభూమియైనయెడల 20 అడుగులవరకు కూడ పెరుగును. వేరు లోతుగాపోవును. ఆకులు పొడుగుగా సన్నముగానుండును. ఈ గడ్డిని ఇండ్లకప్పులకు ఉపయోగించుదురు. మరికొందరు రెల్లుతడికలు అల్లుదురు. దీనిని పశువులు తినవుగాని మిక్కిలి లేతమొక్కలను దున్నలు, గేదెలు తినును. కానిమొత్తముమీద ఈ గడ్డి పశువులకు అంతమంచిదికాదు.

ఆరింక గడ్డి:— తేమనేలలయందు అయిదు అడుగుల యెత్తుపెరుగును. దీనిని పశువులు తినవు.

తేవ గడ్డి:— సారవంతమగు భూములయందు నాలుగైదడుగుల ఎత్తు పెరుగును.

---

కృషితో నాస్తి దుర్భిక్షం; జపతో నాస్తిపాతకం.

పుత్సంగలి:— చెట్లక్రింద డొంకలమీద బెరుగును. అది నేలమీద ప్రాకుచుండును. ఆకులు గరుకుగానుండును. మేకలు, గొఱ్ఱెలు ఎక్కువగాదినును.

తుమ్మగరిక:— నేలమీద ప్రాకుచునేయుండును. ఆకులు చిన్నవిగానుండి నునుపుగానుండును. పశువులకు నిది మంచిఆహారమైయున్నది.

గండ్రగడ్డి:—వరిచేలగట్లమీదను, తేమనేలలమీదను పెరుగును. అది కొంత భూమిమీదబడి కొంతభాగము పైకి లేచియుండును. కాడ బల్లపరుపుగానుండును. పశువులుతినును.

చిక్లింత:—ఈగడ్డి సగభాగము పైకి లేచియుండును. ఆకులమీద నూగుగలదు. పశువులు తినవు.

ఒండుగడ్డి:— కాడకుఆకులు రెండుప్రక్కలనే యుండును. రుచిగానుండును. పశువులు బాగుగాదినును. పాడిపశువులకు మేపిన వెన్నను కలుగజేయును.

పెద్దఒండు గడ్డి:—వరిచేలలో మొలచును. ఆకులు గరుకుగానుండును. పశువులు దినవు.

దూసగడ్డి:— చేలగట్లమీదను, కాలువగట్లమీదను పెరుగును. కాడలు గుండ్రముగానుండును. అంత మంచిదికాదు.

ఊడుగడ్డి:—లోతునీటిలోనైనను బెరుగగలదు. వర్షములు లేనిచోట నేలనంటుకొనియుండును. కాడ బల్లపరుపుగా నుండును. అంతమంచిదిగాదు.

చిప్పర:—దీనిని పశువులు బాగుగాతినును. ఎక్కువగా మెరకనేలలందును, బీళ్లలోను పెరుగుచుండును. ఈ మేత దివ్యమైన ఆహారము. పాడిపశువులు తినిన నెక్కువగా పాలిచ్చును.

చిప్పబూరగడ్డి:—నాలుగైదు అడుగుల ఎత్తువరకు నీటిలో పెరుగును. ఇది నీటిమీద తేలుచుండును. గింజలు తెలుపుగానుండును. అంత మంచి మేతగాదు.

తొండంగి:—ఆకులు నునుపుగానుండును. కాడలు ఎరుపుగానుండును. గట్లమీదను, డొంకలమీదను పెరుగును. చాల రుచిగానుండును. పశువులు చక్కగా దినును, ఎక్కువగా తినుచుండినయెడల వాతముకలుగును.

చెంగలిగడ్డి:—నేలమీద ప్రాకును. ఆకులు చిన్నవిగానుండును. అంచులవద్ద మెత్తనినూగుండును. ఈ గడ్డి పశువులకు మిగులయిష్టము. జబ్బుచేయదు.

---

దర్భగడ్డి:— అడుగు మొదలు మూడడుగుల యెత్తువరకు బెరుగును. ఇదియును పశువులకు మంచిగడ్డియైయున్నది. దీని సన్నకాడలను బ్రాహ్మణకార్యములందు నుపయోగింతురు.

చీపురుగడ్డి:— రాతిప్రదేశములందు బెరుగును. కాడ రెండు మూడడుగుల యెత్తు బెరుగును. దీని ముండ్లే దీనికి విత్తనములు. కాని ఈగడ్డి మనగృహములు శుభ్రము చేయుటకు చీపురుకట్టలుగా కట్టి యుపయోగించుదురు.

ఉడుతతోకగడ్డి:— ఈ గడ్డి బీళ్లలోను, కొండప్రదేశములలోను బెరుగును. ఆకులు మెండుగానుండును. పశువులు బాగుగా తినును.

గునుగుగడ్డి:— ఇదియును మంచిమేతయే బీళ్లలో నెక్కువగా పెరుగును.

గెలగడ్డి:— ఈగడ్డికూడ చిట్టడవులలోను, బీళ్లలోను వృద్ధిపొందును. ఇదికూడ పశువులకు మంచి ఆహారము.

తుంగగడ్డి:— నీటిలో పెరుగుచు గడ్డలు కట్టు మెట్టమీద లేదు. గడ్డిని పశువులు బాగుగా తినును. రుచిగానుండును.

కొండజెట్టిగడ్డి:— కొండలమీదను, చిన్న గుట్టలమీదను పెరుగును. మేకలు గొఱ్ఱెలు విస్తారముగ దినును.

శంఖిణీగడ్డి:— రెండడుగుల యెత్తు బెరుగును. ఆకులు బిరుసుగా నుండును. ఈగడ్డి అంత ప్రశస్తమైనది గాదు.

పూలికగడ్డి:— పెద్దపెద్ద కాలువల గట్లమీదను, బీళ్ళలోను పెరుగును. పశువులకు శ్రేష్ఠమైనది.

కావురుగడ్డి:— మాగాని పొలములలోను, తదితర స్థలములందును ఈగడ్డి పెరుగును. పశువులు బాగుగా దినును.

ఎడ్డిగడ్డి:— దీనికొనలు పలకలుగానుండును. అంత శ్రేష్ఠమయినది గాదు.

గొడ్డుతుంగ:— ఈగడ్డి వగరుగా నుండును. గేదెలు దున్నలు మాత్రము కొంచెముగ దినును.

తెగడతుంగ:— నీరు తడియున్న ప్రదేశములందు బెరుగును. అన్ని పశువులు మిగుల ప్రీతితో దినును.

వరిగ, చోడిగడ్డి:— మృదువుగ నుండును. మిగుల బలముకలిగించును. వరిగడ్డి కంటె మిగుల సారవంతమైనది.

---

పెసరకాడ :—వరిచేల గట్లమీదను మాగానిచేలు కోతకోసిన తరువాతను పెసర విత్తనము వేయుదురు.

అనపకాడ :—ఈ కాడయందు ఒక విధమైన సువాసన గలదు. పశువులకు పెట్టిన బలము గలిగించును.

మినపకాడ :—ఈకాడ పశువులకు శీతకాలములో పెట్టిన మంచిబలము గలుగ జేయును. వాతముగల పశువులకు పెట్టరాదు. అట్లు పెట్టినయెడల పక్షవాతమును గలుగజేయును.

ఉలవకాడ :—ఈ మొక్కలు వేసిన రెండు నెలలలోనే పెంపొందును. వరి కోతలైన తరువాత మాగాని చేలలోను మెట్టచేలలోను వేయుదురు. ముదరకుండ మేపిన యెడల వగరుగానుండి పశువులుతినవు. పైనచెప్పిన కాడలన్నియు కాయలుకాచి ముదరనిచ్చిన తరువాత మేపిన మంచిబలము గలుగజేయును. దీనిని ఎండబెట్టి వరిగడ్డి, జొన్నచొప్పవలె మేపినను మేపవచ్చును.

పిల్లిపెసర :—ఇది పశువులకు మంచి యాహారమేగాని పశువులు ఎంత విస్తారముగాతినిన అంత విషముగ పనిచేయును. వర్షాకాలములో తినిన పశువులకు వేసవి కాలములోను, వేసవికాలములో మేసిన పశువులకు వర్షాకాలములోను వాతరోగములు నేత్రరోగములు తప్పకకలుగును. కాబట్టి ఈ పై ఆహారపదార్థములు తినినంత కాలము ఉప్పుగాని తెలికపిండిగాని అప్పుడప్పుడు పెట్టుటమంచిది. ఈ మేతను అప్పుడప్పుడు పెట్టుట మంచిదిగాని వరుసగా మేపుట అంత మంచిదిగాదని నాయభిప్రాయము.



బండి ఎద్దు అమ్మినవాని బ్రతుకు బందీలని నమ్మండి.

# ప శు జా తు లు

## అ యి ద వ భా గ ము

### ఆ బో తు.

ఆలయంబు ముందరా వృషభేంద్రుండు
నలసి పండుకొనియు హాయిగాను
నెమరు వేయుచుండి నిడువాల మాడించు
వాలకంబు నందివలెనుదోచు.

వీధినడుమ నెమరువేయుచు నిలుచున్న
యాముపెద్దు నెంతో యాదరమున
ముట్టిబట్టియావు మూపురంబు గదల్చు
బిరుదులెల్ల దువ్వు బిల్లగుంపు.

భీతి జనియింపజేసెడి భాతిబరుగు
పరుగునంబోయి యారచ్చబడ్డ చెంత
గర్షక కుమారులందఱం గలియరాచు
కొనుచు బసవన్న గోకించుకొనుచు నుండె.

పసర మడ్డమువచ్చియుండిన బైబల్ దమకింపకే
బుసలగొట్టక కాలుదువ్వక పూన్కితో దలగల్పకే
మసలుచుండెను బోటుగిత్తలమధ్య మేతలమేయుచున్
బసవ డెల్లరి కూర్మిపేర్మికి బాత్రుడై తనరారుచున్.

బుసకొట్టక తలయూపక
పసివారలు దువ్వ మోరపైకెత్తుచు దా
మసలెను బసిబిడ్డని. కతి
బసవకుశాలంబు చుట్టుప్రక్కల మెఱయన్.

---

వడ్లు గొడ్లు ఉన్నవాడిదే వ్యవసాయము.

అచ్చుగ్రుద్దినట్టు లాము బెద్దనుబోలి
కోడెదూడ లెన్నొ కోర్కెలురల
దొడ్డిదొడ్డియందు దులదూగుచుండంగ
గడు ముదంబుసెందె కర్షకాళి.

"పల్లెటూరు"

ప్రాచీనకాలమున గృహమేధులకు పాడిపంట పశువులుపదవమేగాని ధనసంపద గాదని తెలుపుటలో నతిశయోక్తిలేదు. ఇప్పటికిని మన పల్లెప్రదేశములలో గూడ నిట్టి పేరుగలదు. ఎంత సామాన్య సంసారమైనను ఒకటి రెండు పాడియావులైన నింటయింట నుంచి పోషించుచుండును. కొట్టమును పసిపిల్లలును పాడియావులును గృహాలంకారము అను లోకోక్తి ఏర్పడినది. పసిపిల్లలును పాడియావులును లేనియిల్లు యిల్లుకాదనియే పలువురు తలంచుచుందురు. ఈరీతిగా మానవులకును పశువులకును అవినాభావ సంబంధ మేర్పడియున్నది. పశువులు స్వల్పభోజనముతో తృప్తినొందునుగాని మానవాహారముల నపేక్షింపవు. అతిసులభముగ మచ్చికయగును. సక్రమముగ పెంచబడిన గోవృషభముల సుందరాకృతు లత్యంతదర్శనీయములై యలరారుచుండును.

గోభక్తి అత్యంతము ప్రబలిన కాలములోనే అబోతులను దైవార్పణ మొనరించి స్వేచ్ఛగా వదలుపద్ధతి యేర్పడినది. వృషభములను బాగుగాపెంచి చక్రాంకితము నొనర్చి వదలివేసెదరు. అట్టి వృషభము లెవరిసొమ్ములు గావు. గ్రామస్థులందరును వానిని పరమభక్తితో చూచుచు వానికి గ్రాసమిచ్చుచుందురు. అవి స్వేచ్ఛగా గ్రామవీధులలోను పొలములలోను సంచరించుచు మేయుచుండును. ఇష్టమువచ్చిన యింటిగుమ్మముకడ నిలిచినంతనే గృహలక్ష్మి అతిథిసేవ యొనరించుటలనే యీ అబోతునకు గూడ నాహార పానీయాదులను భక్తిపూర్వకముగా నొసంగి పంపుచుండును. వాని నారగించి ఆ వృషభ రాజము మందగమనముతో వెడలిపోవుచుండును. ఆ కాలమంతయు మారి అట్టి అబోతులను యములనుగొని ఈ గ్రామములోని కిరీట మెగుడువచ్చినదిరా! యని వినుగు విశ్రామములతో ఏడ్పేమూగ రైతులు అచ్చటచ్చటను న్నారని చెప్పుటకు సాకుసిగ్గగుచున్నది. పూర్వము గ్రామస్థులందరుగాని నాలుగైదుగ్రామములు కలసిగాని సంప్రదించి వృషభ రాజమని పేరుపెట్టి ఎట్టిప్రదేశములందు మేసినను, ఎంతనష్టపరచినను సహించి చక్కగా తర్ఫీదుచేసి చక్కని సాంప్రదాయముగల కోడెలను ఆవులద్వారా సంపాదించుకొనెడి వారు. ఇప్పుడాపద్ధతియంతయుపోయి, ఏ ముసలమ్మకో, పిల్లికిబిచ్చముపెట్టని ఏ షావుకారుకో, ఎన్నో కూనిలుచేయించి గ్రామపెద్దనని పేరుపొందిన ఏ దుష్టరైతునకో, సరియగు సాంప్రదాయ లక్షణాలు తెలిసికొనకుండ దొరికినగిత్తలనెల్లతెచ్చి వారి పేర్లతో అబోతులను అచ్చువేయుట మొదలుపెట్టినారు. ఇట్లుచేయుటవలన సరియైన శ్రద్ధభక్తిలేక వాటిని సరిగా పోషించక జాతియంత నిర్వీర్యమై డొక్కలుదించుకొని కృశించే గోవృషభములెన్నియున్నవో పరిశీలించిన మన హృదయము నీరవ్వకతప్పదు.

---

అంకమేతకు గోదావరిఈతకు సరిపోతుంది.

అట్టిపశువులకు క్రమశిక్షణలేక పొడచుటయో, పగబట్టి చంపుటయో తటస్థించినపుడు ఏగంగిరెద్దువాండ్లకో యిచ్చివేయుటయు గలదు. కాబట్టి రైతుసోదరులంత గమనించి నవీన శాస్త్రసిద్ధాంతరీతిగా ఆబోతులుగా నుంచుదురుగాక.

ఆబోతునకు యేవిధమైన అంటువ్యాధియుండరాదు. కష్టములను, మనోవిచారమును కలిగినయెడల ఆబోతుల శరీరారోగ్యముచెడి మంచిదూడల పుట్టించజాలవు. పశువుల యభివృద్ధికి సలక్షణమైనట్టియు, సహజబలాధిక్యత కలిగినట్టియునగు నాబోతు లవసరము. ఇండియాగవర్నమెంటువారు ఆబోతులవిషయమై నధికశ్రద్ధ వహించి కొన్నిలక్షల ధనముతో ఫారమ్ములుపెట్టి పశుసంతానాభివృద్ధికి పాటుపడుచున్నారు. విదేశీయ ఆవులతో స్వదేశ ఆబోతులను, మన ఆవులతో విదేశీయ ఆబోతులను కలిపినప్పుడే ఇంకను పాడి, పశువృద్ధి యగునని నవీనపశువైద్యశాస్త్రజ్ఞుల అభిప్రాయము. షార్టుహారను ఫక్కు, జర్సీఆవులను హిస్సారు నెల్లూరు గుజరాతు జాతులలోనికెల్ల శ్రేష్టమగు హిస్సాన్, జాతితో కలుపుటవలన మంచిసంతానము కలుగును. ఈరీతిగా జాతియొక్క లక్షణములను కనుగొని కలుపుటమంచిది. ఒంగోలు ఆబోతు లక్షణములను పశుజాతులలో గమనింపదగును.

అమృతమహల్ జాతి ఆబోతు

గడ్డగడ్డకు పుట్టెడు నీళ్లు త్రాగినా; రెడ్డే సేద్యము చేయాలి.

## అమృతమహల్ జాతి (Amrutamahal Breed)

మైసూరులోనున్న జాతులన్నిటిలోను ఈ జాతియే ప్రసిద్ధికెక్కినది. ఈ జాతిని మూడుభాగములుగ విభజించ వచ్చును. హాళికర్, హగల్వాడి, చిత్రాలదుర్గఅనునవి. ఆయాజిల్లాలనుండి వచ్చినవిగాన ఆయాపేర్లువచ్చినవి. మనదేశములో నీ జాతియెచ్చట నున్నను వెంటనే గుర్తింపవచ్చును. ప్రస్తుతముఉన్న అమృతమహల్ జాతి కలగలపుగా నున్నది.

పూర్వము హళ్ళికారు్సఅను గొల్లజాతి ఉత్తరదిక్కునుండి దక్షిణభాగమునకు వచ్చి చిత్రాలదుర్గులోను, తూంకూరులోను, తమజాతి పశువులతో నివాసమేర్పరచుకొనిరి. ఈ పశుజాతినే అమృతమహల్ జాతియందురు.

### ఒడ్వయరుప్రభువు - హైదరాలీ

పూర్వము తత్ప్రదేశ ప్రభువులలో నొకడగు దేవరాజు ఒడయార్ అను ప్రభువు పశువులయందుండు ఆసక్తిచే, ప్రత్యేకముగా వానికొక పశువులకొట్టము నిర్మించెను. ఇంకను వాని యభివృద్ధినిగూర్చి మిగుల జాగ్రత్తతోను డెడివాడు. వానిపాలు మున్నగునవి గృహనిర్వాహములు నుపయోగించుకొను చుండెడివారు. ఈ పశువులను పెంచుట కూడ రాజకీయములలో నొక ముఖ్య సమస్యయైయున్నది. మొట్టమొదట పశువులకు ముద్రవేయుట ప్రారంభించినది ఈ ప్రభువే - ఈ రాజుపేరే ప్రత్యేకముగా బ్లాకులు చెక్కించి ముద్రించెడివాడట.

మైసూరు రాజ్యము బలవంతముగ హైదరాలీ వశపరచుకొనినపుడు ఆప్రభుత్వము యొక్క శ్రేష్ఠమైన పశుసంతతినిగూడ గైకొనెను. అట్లుగైకొన్న పశువులలో ముఖ్యమైనవి చిత్రాలదుర్గులోని పాలెగారనునవి. హైదరాలీరాజ్యసంబంధ విషయములలో యుద్ధసమయములందు తమపశువులనుగూడ నుపయోగించెను. తనరాజ్యములో 60 వేల ఎద్దులను తయారుచేయించెను. కాని ఈ ప్రభువు ఆపశువులయందంత శ్రద్ధవహింపలేదు. కుమారుడు టిప్పుసుల్తాను మాత్రము ఈజాతిని తనకున్న పశువులతో చేర్చి తనతండ్రికన్న మిగుల జాగ్రత్తతో కాపాడెను.

### టిప్పుసుల్తాను (Tippu Sultan)

చిక్కదేవర ఒడ్వయరు ప్రభువు అమృతమహల్ జాతి పశువులకు పెట్టిన "భిన్ని చావది" అని పేరున బదులుగా టిప్పుసుల్తాను "అమృత" అను పేరుగామార్చెను. టిప్పుసుల్తాను, ఈ పశుసంతతినిగూర్చి మిగుల జాగ్రత్త తీసికొని ఒకప్రత్యేకసంస్థగా నేర్పరచెను. బ్రిటిషువారు మైసూరునకు ముఖ్యపట్నమగు శ్రీరంగపట్టణమును వశపరచుకొనిన తరువాతకూడ తద్విధమున అతిజాగ్రత్తతో రక్షించిరి. అమిల్దారులు, ఉద్యో

---

పశువుల కాచేవాడు పాటుకు అక్కరకురాడు.

గనులు, చిన్నకోడెలనభివృద్ధికి దెచ్చుటయు, జాగ్రత్తగా పెంచుటయు వారియొక్క విధిగానుండెడిది. ఆకోడెమాడలు ప్రభుత్వ శాసనప్రకారము ఎట్టిపంటలోనైనను స్వేచ్ఛగా విహరించుటకు స్వతంత్రమీయబడెను.

### వృషభములు మూడుభాగములుగ విభజింపబడెను

1. దుక్కిటెద్దులు
2. యుద్ధసమయములందు తుపాకులు, మరఫిరంగులు మోయుఎద్దులు
3. విలాసార్థమైయుంచబడినయెద్దులు

ప్రతిసంవత్సరము పశుసంతతినిగూర్చి సంవత్సరపు లెక్కలు రాజకీయముగ ప్రకటింపబడుచుండెడివి. టిప్పుసుల్తాను ప్రభువైయున్న కాలమున తాను స్వయముగ పశువులను ఆయాలెక్కలను పరీక్షించి పశుసంతానము నభివృద్ధి పరచెను. ఈరీతిగా చిక్కదేవరాజా ఒడ్యాయర్ ప్రభువుతో ఉన్నతదశకువచ్చిన పశువులే ఈ అమృతమహల్ జాతియైయున్నవి. ఇట్టి సుప్రసిద్ధజాతి పశువుల సహాయము వలననే హైదరాలీ బ్రిటీష్ ప్రభుత్వముమీదికి యుద్ధమునకు పోవుసమయమున నూరుమైళ్ళ దూరమున రెండుదినములలో తన యుద్ధసామగ్రినంతను గొనిపోజాలెను. హైదరాలీ పశువుల సహాయముచేతనే తాను ఓడిపోయినపుడెల్ల శత్రుముఖమునుండి తన యుద్ధసామగ్రిని అతిత్వరితముగా శత్రువులకందకుండ తొలగించెడివాడు. ఇట్టిపశుసంతతిని బ్రిటిషుప్రభువులు హైదరాలీ తనయుడగు టిప్పుసుల్తాను నోడించి తాము వశపరచుకొనినపుడు వాని యొక్క ప్రసిద్ధిని గొప్పతనమునుగూర్చి ఆశ్చర్యమొందిరి.

### కెప్టెన్ దేవిడ్సన్ (Captain Davidson)

బ్రిటిష్ సేనానియగు కెప్టెన్ దేవిడ్సన్ ఈ జాతిపశువులను గూర్చి ఈవిధముగా పొగడెను:—

బొంబాయిసేనల ననుసరించి ఆఫ్గనిస్థానమునకు పోయినపుడు మైసూరు సేనలో పోయిన 230 మైసూరెద్దులతో సమానముగ యుద్ధసామగ్రిని ఈడ్చుకొని పోగలిగిన ఎద్దులు మరి యేసేనవెంటగూడలేవు. అట్లున్నను సాటిరావు. ఈసేనలు ఆఫ్గనిస్థానమునుండి మరల తిరిగి వచ్చుచు బొంబాయి పార్కులో విడిచినపుడు ఆప్రదేశము ఆపరిసరప్రాంతములుగూడ ప్రఖ్యాతివహించిన ఎద్దులను చూచుటకువచ్చిన జనులతో క్రిక్కిరిసిపోయెను. ఈ ఎద్దులు విశ్రాంతిలేక 16 గంటలు వరుసగా మెడమీద కాడితీయకుండ బరువులాగెను. బెంగాలుసేనలో ఉన్నటువంటియు, ప్రభుత్వ సొత్తయినటువంటియు ఎద్దులుచాలనున్నను మైసూరెద్దులంత అందమైనవి బలమైనవి ఓర్పుగలిగినవిగా నుండవు.

---

బావిక్రిందదున్ని బ్రతికినవాడు; చేనిక్రిందదున్ని చెడినవాడు లేడు.

## విల్లింగ్డన్ ప్రభువు, మైసూరుకమీషనర్ (Lord Willingdon)

కొన్నికొన్ని యితర దిగ్విజయములు ప్రత్యేకముగా అమృతమహాల్ జాతి సహాయము వలననే కలిగినవి. అయిపురములో జరిగిన ద్వీపకల్ప యుద్ధసమయమునందు ఇంగ్లీషుసేనానియగు విల్లింగ్డన్ ప్రభువు యీక్రింది విధముగాచెప్పెను:—

ఈసమయమునందు నాకు అమృతమహాల్ పశువులసహాయమున్న యెడల యెంత బాగుండునోయని పశ్చాత్తాపపడెను.

మైసూరుకమీషనర్ 1808 వ సం॥ లో ఈరీతిగాచెప్పెను:—

అమృతమహాల్ జాతి పశువులు మిక్కిలి చురుకుదనము బలముకలిగి సేనలకన్న అతి త్వరితముగా నడువ శక్తికలిగియుండెడివి. అరేబియా గుఱ్ఱములు తదితరజాతి గుఱ్ఱముల కంటె ఎంతఘనతవహించినవో, అట్లే అమృతమహాల్ పశువులు అన్నిజాతులకంటె అగ్రస్థానము వహించినవి. మైసూరు ముఖ్యపట్టణమగు శ్రీరంగపట్టణము బ్రిటిష్ప్రభుత్వ వశమైనప్పుడు వారాసంతతిని వశపరచుకొనిరనియు, పిమ్మట తమకుకావలసినప్పుడు కొన్ని ఎద్దులను సహాయము చేయుషరతుమీద ఆపశువులను మైసూరుమహారాజునకు వశపరచిరి. టిప్పుసుల్తాను బ్రిటిష్ప్రభువుల వశమైనప్పటికంటె ఆ పశుసంతతిని ప్రత్యేక జాగ్రత్తతో చూచి యుద్ధసమయమునందు వానిసహాయముమీద కొంతఆధారపడియుండిరి. తరువాత బ్రిటిష్అధికారమందున్నపుడు పశువులయభివృద్ధికై నియమింపబడిన యుద్యోగులు వానినంత జాగ్రత్తగా చూడనందున ప్రాముఖ్యత తగ్గిపోయినది. తత్కారణమున ఆంగ్లేయ ప్రభుత్వపుఆశలన్నియు నిరాశలాయెను. ఆకారణమువలన ఈ జాతిపశువులు రానురాను క్షీణదశనొందుచు పదమూడుసంవత్సరములకు వాటియొక్క ప్రాముఖ్యతపూర్తిగానశించెను.

## మైసూరుప్రభుత్వము (Mysore Government)

ఈజాతి పశువులు 1813 వ సం॥లో మైసూరుప్రభుత్వమువారు టీళ్లతోసహా మదరాసు సేనయొక్క భోజన సామగ్రిని జాగ్రత్తపెట్టెడు ఉద్యోగస్థుడగు కప్టెన్ హార్వేగారి వశము నొనర్చిరి. అప్పుడా సముదాయము పదిసంవత్సరములలోనే మిగుల జాగ్రత్తతీసికొనుటవలన రెట్టింపుపశువులాయెను. 1840 వ సంవత్సరములో మైసూరు మహారాజుపశువుల గుంపులను వానికిచెందిన టీళ్లను బ్రిటిష్ ప్రభుత్వమునకు చెందిన ఆదేజాతి పశుసముదాయమును కలిపి మైసూరు కమీషనర్ వారి స్వాధీనమాయెను. 1860 వ సంవత్సరములో మైసూరుప్రభుత్వప్రతినిధి యాజ్ఞవలన ఆపశువు యందజాగ్రత్త ప్రబలుటయు మీదుమిక్కిలి వానిని అమ్మివేయుటయు గూడగలిగెను. తరువాత వారికే ఆపనిచేయుట తప్పుగాకనబడెను. వానినమ్ముటవలన ఫలితము ప్రజాసామాన్యమునకు ప్రభుత్వమునకుగూడ మిక్కిలి నష్టముగలిగెను. తరువాత మైసూరుమహారాజు సహాయము చేత పశుసంతానాభివృద్ధినిగూర్చి మిక్కిలి జాగ్రత్తపడెను. మరల కొంతధనము హెచ్చించి

అమృత మహల్ జాతి ఎద్దులను ఆవులను మైసూరుదేశమంతయు విసుగు విరామములేక వెదకి వానిలో శ్రేష్ఠమైనవిమాత్రము తీసికొని ఆజాతిని పెంపొందింప మొదలిడెను.

## మద్రాసుప్రభుత్వము

ఆదేసమయమునందు మద్రాసుప్రభుత్వముకూడ కన్ను తెరచి కొంతధనము హెచ్చించి మంచి సాంప్రదాయములగు 4000 ఆవులను 100 శ్రేష్ఠమైన కోడెలను 1870 వ సం॥లో కొనిరి. 1833 వ సం॥లో బ్రిటిష్ ప్రభుత్వము ఈపశువులనన్నిటిని మైసూరుమహారాజునకు 2 లక్షల 25 వేల రూపాయలకమ్మిరి. మైసూరు మహారాజు వానియందుండు ప్రీతిచే ఆదేసమయమునకు నెంచి, వానివలయుధనము హెచ్చించి, తగిన శ్రద్ధనుజూపి వానియభివృద్ధికి మిక్కిలి పాటుపడెను. తుదకీజాతిని పూర్వజాతి పశువుల స్థితికిగూడ తేగలిగెను. పశుశాలలను గూర్చి కొన్ని పుస్తకములనుపెట్టి వానిలో పశువుల నన్నిటిని గూర్చి విపులముగా వ్రాయబడెను. వానికిగూడ జననమరణములు అతిజాగ్రత్తగా వ్రాయబడినప్రతి నెలరిపోర్టును ప్రకటించెడివారు. పశువులమేపువారి అజాగ్రత్త, వారి దొంగలెక్కలు జాగ్రత్తగా పరిశీలించుచుండెడివారు. మద్రాసుప్రభుత్వమునకు ప్రతిసంవత్సరము ఈజాతినుండి మైసూరుప్రభుత్వమువారు 200 ఎద్దులను మాత్రమిచ్చెడివారు. ఇతరులెవరైన ఆజాతి పశువులు కావలెనని కోరినయెడల మైసూరు, బెంగుళూరు ప్రభుత్వసేనాధికారుల అనుమతితో బహిసడిం[illegible]రు. ఒక్కొక పశువుఖరీదు నూరు రూపాయలుండెడివి. మైసూరుప్రభుత్వమువారి దేశములో ఆర్థికక్లిష్టపరిస్థితులు సంభవించినపుడు తమపశువులనమ్మిన ఆరు సంవత్సరముల తరువాత మైసూరుమహారాజు మరల వానియభివృద్ధికి గడంగెను. కొంతమంది ప్రత్యేకోద్యోగులు మైసూరు దేశమంతయు తిరిగి ప్రత్యేకముగ అమృతమహల్ జాతికి చెందిన ఆవులను, ఎద్దులను కొనుటకు నియమింపబడిరి. కాని వారు అట్లుగాక ఆజాతిలోనే కొన్నిరకములగు హాళ్ళికర్, చిత్రాల దుర్గ, హాగల్ వడి, మొదలగు అన్నిరకపు పశువులనుకలిపి కొనుటవలన మంచిజాతి పశువులు దొరకుట కష్టమయ్యెను.

## 1 అమృతమహల్ జాతి (Amritamahal)

ఈజాతిపశువులు క్రొత్తమనుష్యులను చూచినపుడు కోపించి మీదకు దూకును. వానిని సాధుత్వములోనికి దెచ్చుటకు కొన్ని మాసములు పట్టును. వానిని మచ్చికచేసి కొనుటకు కొన్నిదినములవరకు ఆహారము పెట్టక పోయినయెడల అతిబలహీనస్థితికివచ్చి చెప్పినట్లువినును. వానిచే యెప్పుడును మంచిబరువులను లాగించుచు బాగుగాపనిచేయించుచుండినగాని అవి అంకెకురావు. ఆవులుకూడ ఎద్దులంత ప్రశస్తమైనవికావు. కారణమేమనగ అవిఅంతగా పాలిచ్చునవికావు. అవియిచ్చుపాలువానిదూడలకేచాలును. కానిగృహకృత్యములకెంతమాత్రముపనికిరాజాలవు. మంచిఆవు పూటకు సేరుపాలుయిచ్చును. పాలు మాత్రము అతిశ్రేష్టముగను, తీపిగనుండును. మైసూరుజిల్లాలోనున్న ఈ జాతి పశువులు

---

గ్రుడ్డియెద్దు చేనిలోబడి తన నోటికందినదెల్ల తినును.

తొలికాన్పు ఆరుసంవత్సరముల వయస్సున యీనును. దూడలను పగటివేళ స్వేచ్ఛగా వానితల్లులదగ్గరనే వదలిపెట్టి రాత్రిపూట మాత్రము ప్రత్యేకముగనుంచి కాపాడుదురు. వానికి మూడుమాసములు వచ్చినతరువాత మిక్కిలి జాగ్రత్తగా పెంచుచు మంచిమంచి బీళ్ళలోనికి వదలిపెట్టుదురు.

## అమృతమహల్ జాతి లక్షణములు

తల:—పొడవుగానుండి శరీరమున కందమునిచ్చుచుండును. రోషవంతములై, పౌరుషముగ, నలుపుగ, చిన్నవిగ, ఉబికియుండుకన్నులుగలిగి, చెవులు నిక్కబొడుచు కొనియుండును.

కొమ్ములు:—పలుచగ, అందముగ, పొడవుగనుండును.

మూపురము:—బలముగ, అందముగ, పొడవుగ, మంచిఆకారముగనుండును.

గంగడోలు:—పలుచగ పొట్టిగనుండి వెడల్పురొమ్ము, బలముగల భుజములు, బలముగ గుండ్రముగనుండు ప్రక్కటెముకలుకలిగియుండును.

తోక:—మందములేక, పొట్టిగా సన్నముగ నుండవలెను.

కాళ్ళు:—చక్కగా నమరి బలిష్టములై యినుపముక్కలా యనునట్లుండును. కాళ్ళలోని ఎముకలు మందముగానుండును. చీలమండకు వెనుకభాగమున వెంట్రుకలుండెడు ఉబ్బెత్తుభాగము పొట్టిగానుండును. చిన్నవిగ, మందముగ, నుండు డెక్కలుండును. కొమ్ములు, డెక్కలు మూతిభాగముల చర్మమునలుపుగానుండును.

చర్మము:—పలుచగా, ఒకవిధమగుపట్టువలె, పొట్టిగ, మృదువుగ, నుండు బొచ్చుకలిగియుండును. పశువుఅన్నివిధముల ఆరోగ్యకరముగ, మంచిగుణములు కలదిగా నుండును.

## ౨ మైసూరుజాతి (Mysore Breed)

ఈజాతికిని, ఒంగోలుజాతికిని దగ్గరపోలిక యుండును. మైసూరుజాతిని ప్రతి పల్లెటూరు రైతులును స్వరాకారకు పనులకొరకు తెప్పించుచుందురు. ఈ పశువులను చూచుటకు అన్నిదేశములనుండి ప్రతిసంవత్సరము జరుగు మైసూరు మహారాజావారి దసరాయుత్సవములకు పోవుచుందురు. ఈ పశువులు చిన్నవిగను పలువిధ రంగుల తోడను యుండును. వ్యవసాయదారులు ఈ పశువులమీదనే ఆధారపడియుందురు.

మైసూరుజాతిని "నాతుదాన" యని ఆ యా ప్రాంతములవారు పిలుచుదురు. రెండవజాతిని "దద్దోదనా" యని యందురు. అనగా పెద్ద పశువనియర్థము. కాని ఇవి అంత యెక్కువగా దొరకవు. అట్లు దొరికినను యెక్కువఖరీదుండును. "దద్దోదనా"

గ్రుడ్డివాడు అవుతోకబట్టుకొని నడచినట్లు.

"నాతుదాన" యనునవి మైసూరుపదములు. దడ్డోదనా పశువు అమృతమహల్, హళ్ళికర్, చిత్రాలదుర్గ, అనుబాంది, మహాదేవరచెత్త అను యితర పశుజాతులవలె నుండును.

ఈ పశువులు ధనికులవద్దను, పెద్ద రైతులవద్దను కనబడును. కొంతమంది రైతులు ఈ పశువర్తకము మీదనే జీవింతురు. చాలామంది రైతులు ఆవులమందలను పశుసంతతి కొరకు కొండలమీదకు, తదితర ప్రాంతములకు తోలుకొనిపోయి మేపుచుందురు. ఒక సంవత్సర ప్రాంతపు దూడలను రైతులు ఆవులమందలనుండి విడదీసి అతిజాగ్రత్తతో రెండు మూడు సంవత్సరముల వరకు మేపి మంచిధరలకు కొన్నెదురు. దడ్డోదనా అను జాతి ఎద్దులలో శ్రేష్ఠమైనవానిని కొన్నిటిని ఏరికొని తమ యింటివద్దనే యుంచి బాగుగ మేపుదురు. ఇంకను పంటలమీదకు, బీడుగాములలోనికి, గోవుల మందలలోనికి తోలి జాగ్రత్తగా మేపి ఆబోతులుగా తయారుచేసి వానిని మిక్కిలి పవిత్రవంతములుగా జూచుచుందురు.

## 3. దడ్డోదనా జాతి (Daddodana Breed)

ఈజాతి దూడలను బాల్యమునందే రైతులు తదితర పశువులనుండి విడదీసి అమ్మెదురు. ఇవి సామాన్యముగా ఎక్కువబలముకలిగి మంచి బుద్ధిగలవిగ నుండును. ఈజాతి ఆబోతుల నంత బలియునట్లుగా మేపరు. గ్రామములలోనే అన్నిపశువులను ఆబోతులను కలిపి మేతకుతోలుటచేత కల్తీసంతతి పుట్టును. ఒక్కొక్కప్పుడు రెండు మూడు గ్రామాలవారు చందాలు వసూలుచేసి చిన్నదిగను, మంచి లక్షణములుకలదిగ నుండు కోడెదూడను కొనెదరు. అది గ్రామధనమై గ్రామస్థులందరకు చేరినదై యుండును. దీనిని పంటపొలము లన్నిటికి వదలిపెట్టుదురు. ఆపశువు స్వేచ్ఛగా మేసి బాగుగా బలిసినతరువాత ఆవులమీదకు వదలిపెట్టుదురు. దడ్డోదనా సంతతి ఆవుల నింటివద్దనే యుంచి మేపుదురుగాన వానికి మంచి ఆబోతులను సమకూర్చి మంచి సంతతులు కలుగునట్లు చేయుదురు. ఆబోతునకు వృద్ధాప్యమురాగానే దాని స్థానమున మరియొక మంచిదూడను ఆబోతుగాజేసి విడచుదురు.

## మైసూరుజాతి ఎద్దులు

అమృతమహల్ జాతి మైసూరుదేశములోనిదే యగుటవలన మనదేశమునందంతట ప్రసిద్ధికెక్కినవి. అన్ని జిల్లాలవారు నిప్పుడిప్పుడే ధనవంతులలో కొందరు స్వారి చేయించుటకు, సర్దారులకు తీసికొని వచ్చుచున్నారు. ఇవి దూరప్రయాణములకు పనికి వచ్చును. దుక్కికి అంత మంచివిగావు. విశేషముగ బరువులు లాగలేవు. గాలిమంటు తగిలినపుడు జాగ్రత్తగా కాపాడవలెను.

---

ఆవుండగా గాడిదను పాలు పితికినట్లు.

## మైసూరుజాతి లక్షణములు



మైసూరుజాతి ఎద్దు

కన్నులు :—సాధుత్వముగా, స్పష్టముగా కనపడును. రెప్పవెండ్రుకలు నలుపు రంగుగా నుండును.

చెవులు :—పొట్టిగా, వెడల్పుగ నుండి నిక్కి బొడుచుకొని యుండును.

మూతి :—పొట్టిగా, అందముగా నుండును.

గంగడోలు :—విజృంభించియుండును.

మూపురము :—పెద్దదిగానుండును.

కొమ్ములు :—పెద్దవిగా, సునుపుగా నుండును.

కాళ్ళు :—సమచతురములో నుండును. కాళ్ళఎముకలు బల్లపరుపుగా బలిష్ఠముగా నుండును.

శరీరము :—వెనుకభాగము వంగియుండి విశాలముగా నుండును. చర్మము అంతగా కదలదు.

రంగు :— తెలుపుగ లేక గోధుమరంగుగ నుండును. తల కాళ్ళు మెడభాగములు ఎక్కువరంగు గలిగియుండును.

---

గేదె పాలైనను ఆవుపాలు కొంచెము కలిసినచో పవిత్రమగును.

## 6. ఒంగోలుజాతి (Ongole Breed)




ఒంగోలుజాతి ఆబోతు

ఈజాతి పశువులుకూడ ఇండియాలోనే గాక పరదేశములలో గూడ ప్రఖ్యాతి చెందినవి. మొదట నెల్లూరుజిల్లాలోని ఉత్తరభాగపు తాలూకాలలోనే ఈ పశువు లెక్కువగానుండెడివి. ప్రస్తుతము ఆ తాలూకాలు గుంటూరు జిల్లాలో చేరిపోయినవి. వ్యవసాయమే ప్రధానవృత్తిగా లేని దేశములలో గూడ పశువులను జాగ్రత్తగా పెంచుదురు. అందువలన రైతు లెక్కువగా నీ పశుసంతానాభివృద్ధికై తమకాలమును వ్యయపరచుచుండెడివారు. ప్రజలను బాగుగా కాపాడుచున్న ప్రభుత్వమున్నచోటికి పోయి వారు కాపురముండెడివారు.

ఆ పశువులను పెంచువారు ప్రభుత్వోద్యోగుల వలన కష్టనష్టములకు వెఱచి వారి బారినుండి తప్పించుకొనుటకు తమ పశుసంతతిని ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు మార్చుచుండెడివారు. వారత్యంత భాగ్యవంతులగుటచేత మిక్కిలి అందమైనటువంటి, సుప్రసిద్ధమైనటువంటి పశువులను తమవద్ద నుండుకొనుచుండెడివారు. తత్కారణముగ ఒంగోలు ప్రాంతములందు ఆ సంతతియొక్క మంచిపశువులు ఇప్పటికి దొరకును.

---

ఆశపడి వెల్లులి తినినా రోగముపోలేదట.

కారుమంచి, నిడమానూరు, పొందూరు, జయవరం, టంగుటూరు, కరవడి మున్నగు గ్రామాలలో మిక్కిలి మంచిపశువులు దొరకును. మరియు వెలుపలపదను, నెన్నూరుపాడు, మూసితీరమునందున్న పల్లెటూళ్ళలోను కందుకూరు తాలూకాలోను గూడ నీజాతిలోని ప్రసిద్ధమైన పశువులు దొరకును. దగ్గరమాగాని ప్రదేశములలో నుండు నెల్లూరు దక్షిణభాగములో పశువులు బహు తక్కువజాతివి. అంతియేగాక ఆ యా ప్రదేశములవారు పైప్రదేశములవారివలె గాక పశువులయందంత జాగ్రత్త వహింపక వానికి సరియగు పశుపోషణకూడ చేయరు.

## ఆవులు




ఒంగోలుజాతి ఆవు

ఒంగోలుజాతి ఆవులయొక్క పాలను దూడలకే వదలిపెట్టుదురు. మూడు నాలుగు మాసముల ప్రాయమువచ్చిన తరువాత ఆ దూడలకు పచ్చిగడ్డిగాని, ఉలవ గుగ్గిళ్ళనుగాని చిట్టు వగైరాలనుగాని మేపుదురు. అవి ఇంటిలోని పిల్లలవలె గారాబముగా పెరుగుచుండును. ఆ యా ప్రదేశములకు పోయి చూడవలెననిన అవి బయటకు రావు. ఆ యా రైతులు తమ యిండ్లలోనే యుంచి మేపుదురు. ఈ రీతిగా పెంచి ఎక్కువ ఖరీదుల కమ్మెదరు. పాడివిలువనుబట్టి ఆవును అమ్ముదురు. ఆ యావునుండి

చాలా నేతిని తయారుచేసి వర్తకులకు అమ్మెదురు. రైతులు మాత్రము తక్కువగ వాడు కొనుచు నేతిని అమ్ముకొనుచుందురు. మంచిఆవు 11 నుంచి 14 పౌనులవరకు పాల నిచ్చును. చూచుట కందముగానుండి కామధేనువా యన్నట్లు కనపడుచుండును.

## ఎద్దులు బరువులులాగుట

ఒంగోలుజాతి ఎద్దులు మైసూరుజాతి యంత అందముగ నుండకపోయినను, అంతవేగముగ నడువకపోయినను ఎక్కువ బరువులు లాగుటలో నెమ్మదిగా లాగినప్పటికి అన్నిజాతుల పశువులను మించి అగ్రస్థానము వహించును. వానిని ప్రత్యేకముగా బరువులలాగుటకే ఉపయోగించుచుందురు. చెన్నపట్టణములో అయిదుటన్నుల వరకు బరువుగల సామానులను ఇవిలాగుట గాననగును. ప్రశస్తమైన పశుసంతతి ఇచ్చుట గలుగుటకు కారణము అచటనుండు బీళ్ళేయైయున్నవి.

1857 వ సంవత్సరమునకు ముందుకూడ వీనిమీద పన్ను వేసిరి. నెల్లూరులో మాత్రము వేయలేదు. సాగుచేయబడు భూములలో నూటికి 30 వ వంతు యితరభూమిని ప్రత్యేకముగా బీళ్లకు వదలిపెట్టుచుండెడివారు. ఆ బీళ్ళలో ప్రతిగ్రామమునకు పెంచుటకు హక్కుండెడిది. 1858 వ సంవత్సరము వరకు పశుసంతానాభివృద్ధికి ఉత్సాహ మొసంగుటకు సాంవత్సరిక పశుప్రదర్శనములు జరుగుచుండెడివి. అవి 1871 వరకుగూడ జరుగుచునే వచ్చినవి. ఈ 12 సంవత్సరములలోను 18 వేల రూపాయలు పశుప్రదర్శనములలో బహుమానములుగా పంచిపెట్టబడెను.

గుంటూరు జిల్లాలో 1935 వ సం॥ నుంచి గుంటూరు సీమరైతుసంఘం (గోవాడ) స్థాపకులు శ్రీ ఆలపాటి సూర్యనారాయణగారు పశుప్రదర్శనా దర్శకులై నేటివరకు ప్రదర్శనముల నేటేట జరుపుచుండుటవలన మంచి సాంప్రదాయముగల పశుపోషణ నభివృద్ధికి వచ్చుచున్నదనుటకు సందియములేదు. ఇంకను తెనాలిలో జరుపు దేశోద్ధారక పశుప్రదర్శనము, చుండూరులో జరుపు ఆంధ్రరాష్ట్ర పశుప్రదర్శనముల వలనకూడ పశుసంతతి మున్ముందు వృద్ధిలోనికి రాగలదు.

## ఒంగోలుజాతి లక్షణములు

తల :—అంత పెద్దదిగను, ఎక్కువ బరువుగను, యుండక దాదాపు శరీరమునకు తగినపరిమితిగా నుండవలెను.

ముఖము :—ఒకమాదిరి పొడవుగా నుండవలెను.

మూతి :—బాగుగాబలిసి మంచి వెడల్పుగల ముక్కురంధ్రములు కలిగియుండవలెను.

నొసలు :—బాగుగా, వెడల్పుగా నుండవలెను.

---

పొట్టేలు పొట్టేలు దెబ్బలాడగా మధ్య నక్కపడిచచ్చినట్లు.

కన్నులు :—కోడిగ్రుడ్డు ఆకారముగలిగిన విశాలమగు కన్నులలో నలుపుగ్రుడ్డు కలిగియుండవలెను. కంటిచుట్టు అరంగుళము వెడల్పున నలుపురంగుగల చర్మముండవలెను.

చెవులు :—సామాన్య పొడవుగానుండి వాలిపోవును.

కొమ్ములు :—పొట్టిగానుండి వెనుకకు గాని ముందునకు గాని తిరిగియుండవలెను. ఆవులలో కొమ్ములు పలుచగానుండి పొడవుగానుండును. కొమ్ముల మొదటిలో పగులవు.

మెడ :—చిన్నదిగ, లావుగ, మందముగ నుండును.

మూపురము :—మంచి కండరముగలిగి నలుపుగానుండును. అది ఒకవేళ ఒక ప్రక్కకు ఒరిగినను కుడివైపునకేగాని ఎడమవైపునకు ఒరగదు. మూపురభాగమంత కండరములతో నిండియుండును.

శరీరము :—పెద్దదిగ, లావుగ, పొడవుగ నుండవలెను. మిక్కిలి శ్రేష్ఠమగు పశువుల టంగువారు మూపురమునకు వెనుకభాగమునకు 84 అంగుళము లుండవలెను. క్రిందినుండి ఎత్తు మూపురమునకు వెనుకభాగమున 36 అంగుళము లుండవలెను.

గంగడోలు :—కండరములతో నుండి, ముడుతలుపడి బొడ్డువరకు వ్యాపించియుండును.

ఎదుర్రొమ్ము :—లోతుగ, వెడల్పుగ నుండవలెను. రెండు ముంగాళ్ళమధ్య లోతుగా నుండవలెను. ప్రక్కటెముకలు పొడుగుగ, లోతుగనుండి రెండువైపుల సమానమైన ఎముకలు గలిగియుండవలెను.

వెన్ను :—సామాన్యమైన పొడవుగలిగి అందముగా నుండవలెను. వెన్నుభాగము వంగియుండవలెను.

తోక :—అడుగుభాగమున సన్నముగా నుండక మందముగా నుండవలెను. పొడవుగ అందముగ జాలరుతో అలంకరింపబడి చివర కుచ్చువలె నుండవలెను. తోకయొక్క చివర మడిమలకు తగులుచుండును.

గుదము :—తోకయొక్క వెనుకభాగము వెడల్పుగా నుండవలెను. పిర్రల మధ్యకు నుండవలెను. గుదము బాగుగా వెలుపలికుండినగాని పేడ శరీరమునకు అంటకుండా సరిగాపడదు.

తొడలు :—కండరములుగలిగి బాగుగా వృద్ధిజెంది లోతుగా నుండవలెను.

కాళ్లు :—కొద్ది వంకరగానుండి బలముగా నుండవలెను. అంత పొడవుగా నుండరాదు. బలమైన పొడుగాటి భుజములుకలిగి యుండవలెను. మృదువుగ నుండక బలముగలిగి మొద్దుగ నుండవలెను.

---

పశువులు తినివేయునేమోయను భయముతో పొలములో పైరువేయుట మానినట్లు.

పాదములు :— పొడవుగానుండి ఒకమాదిరి మృదువుగానుండును. చీలియుండవలెను.

ఎత్తు :— చాలా ఎత్తుగానుండును. మంచివయస్సు వచ్చినపుడు 56 మొదలు 62 అంగుళముల ఎత్తువరకుండును. ఈ ఎత్తు భూమినుంచి మూపురమువరకని తెలిసికొనవలెను.

రంగు :— తెలుపు లేక బూడిదరంగుగాని లేక నలుపు తెలుపుగాని యుండును. మూపురము తెలుపుగానుండి మెడమీద అచ్చటచ్చట నలుపు లేక బూడిదవర్ణపు మచ్చలుండును. మూతి నలుపుగానుండును. మోకాళ్లమీద, శీలమండలకు కొద్దిగా పైభాగమున వెనుక కాళ్ళమీద అచ్చటచ్చట నల్లని మచ్చలుండును.

## ౫ కపిలియన్‌జాతి (Capiliyan Breed)

కంభంలోని కపిలియన్నుజాతి మనుష్యులు ఒకజాతి పశువులను పెంచుదురు. కపిలియన్ను పెంచుటచేతనే ఈజాతి కీపేరువచ్చినది. ఈజాతి కన్నడజాతివారి సంతతి యగుటచేత ఇప్పటికి కన్నడభాషలోనే మాట్లాడుచుందురు. అవి చిన్నవిగను, చురుకుగను ఉండును. మిక్కిలి ఓర్పుతో బండ్లులాగును. ఆజాతి మనుష్యులు ఆ యా ప్రాంతములకు వచ్చినపుడు తమవెంట నా పశువులను తీసికొనివచ్చితిమని చెప్పుదురు. ఆజాతి పశువులను వారు పవిత్రవంతమైనవని అర్థమువచ్చు ఒకపదముచే పిలుచుదురు.

ఆవులనుండి పాలుతీయరు. వాని సంతానాభివృద్ధికై పెంచుదురు. ఈజాతి పశువేదైన చచ్చినయెడల దానిని పాతివేయుదురేగాని మాదిగవాని చర్మమునొలుచు కత్తికి గురికానీయరు. ఆ పశుసమూహముతో నున్న పెద్దపశువును పశురాజము లేక పల్లదుపశువు అని పిలుచుచుందురు. అది చనిపోయినపుడు దానిస్థానే మరియొకదానిని గొప్ప ఉత్సవముతో నాపదవికి నెలకొల్పుదురు. ఆ యుత్సవసమయమునందు ఆ పశుజాతి సమూహమంతయు ఒకచోట కల్పించబడియుండును. చెరకుగడ మోపులను వాని ముందుంచి వాటిచుట్టును మూగియుండిన ఆజాతి మనుష్యులు ఆ పశుసముదాయములో నేది ముందుగా ముట్టునోయని చూచుచుందురు. అట్లు మొదట సాహసించి ఆ చెరుకుగడలను తినుదూడను ఆ పశుసమూహమునకు రాజుగాజేసి దానికి కుంకుమపెట్టి పూలదండలతో నలంకరించుదురు. దీనినే నంద గోపాలస్వామి యందురు.

## నంద గోపాలస్వామి

ఈ నందగోపాలస్వామి యను రాజునకు ఒక నౌకరుని ప్రత్యేకముగా నుంచుదురు. ఆ నౌకరునకు కొంతపాలము ఈనాముగా నిచ్చుదురు. అతనికి ఆ పశువు రాజుగా చేయకముందు జరుగు ఉత్సవములో అచ్చటివారందరును మిక్కిలి భక్తితో వేయు నగలు, రాగిడబ్బులు మున్నగు కానుకలన్నియు అతడే గ్రహించును. ఈ పశు

---

వేరులో పురుగుపట్టిన చెట్టంతయు చచ్చినట్లు.

రాజులు అనేకమైన అత్యాశ్చర్యమైన పనులు చేయును. అవిచేయు పనులనుగూర్చి ఇప్పటికిని అనేకమంద నేకరకముల కథలు చెప్పుకొనుచుందురు.

వేడిగాలిని పీల్చుటకై తాను రాజుగా చేయబడిన పశుసమూహమును తోలుకొని పోవుటకు ముందు పంచదారను పాలను ఆ పశువుముందు పెట్టుదురు. ఆ పశువు అది త్రాగి తలయూపినయెడల వారుచేయుపనికి నొప్పుకొనినట్లు భావించి వారు దానిని తోలుకొనిపోవుదురు. దానిపోషణకై వినియోగింపబడిన నౌకరు ఒక ప్రత్యేకకులము నకు జెందినవాడై యుండును. అతడు చనిపోయినయెడల మరల నాకులమువారినే యెన్నుకొనుచుందురు. ఆ నౌకరు తానొక పశురాజువలె సంచరించును. ఈ పశు రాజును ఎన్నుకొనిన తరువాత దాని చుట్టునున్నవారు చేయబోవు పూజకు ముందు ఒక బాలునకు దైవసంబంధమగు శక్తిపూని యెవడు దానికి నౌకరుగా నుండవలెనో వానిని చూపించును.

ఈ కపిలయను జాతివారు ఆజాతి సభ్యుల అందరివద్దను పన్ను వేసి పదునొకండు వేల రూపాయలను ప్రోగుజేసి రాతితో గదులుగదులుగ నుండు ఒక పెద్దభవనమును కంభంలో నిర్మించి ఆ పవిత్రవంతమగు పశుజాతి నివసించుట కుపయోగించిరి. పశువుల బీళ్ళలో మేసినందులకు యితర పశువులకు పన్నువిధించునట్లు వానికిగూడ విధించిన యెడల సాక్షాద్భగవంతునే మానవునితో సమానముగా వారు తలంచుచుందురు.

## ౬ తంజావూరుజాతి (Tanjore Breed)

ఈజాతి పశువులు చెన్నరాజధానిలోనున్న అన్నిపశువుల కంటెను మిక్కిలి వ్యత్యాసముగ నుండును. కారణమేమన వాని కొమ్ములను కోసివేసినందున బ్రిటిష్ జాతి పశువులవలనే యుండును. తంజావూరు గృహములలో ప్రత్యేకముగా మేపబడిన ఆవులసంతతి యగు దూడలను వాని యజమానులె వానికి ఆరుమాసముల ప్రాయము వచ్చినపుడే కొమ్ములు కోసివేయుదురు. ఆ కోసివేయుటకు ఈక్రింది పద్ధతి ననుస రించుదురు.

కొన్నిటికి తోకవెంద్రుకలను తీసి వాటిని చెరుకురసముతోగాని లేక పంచ దారతోగాని కలిపి కొమ్ములపైన పూతపెట్టుదురు. అంతట యినుపకడ్డీని కాల్చి కొమ్ము పూర్తిగా కాలిపోవువరకు ఆకడ్డీతో చుట్టును గీయుచుందురు. అటుల కొమ్ము పూర్తిగా నశించువరకు రెండు మూడు వారములు పట్టును. అటుల నొకసారి కాల్చిన తరువాత మరల వానిజన్మలో కొమ్ము లెంతమాత్రము పెరుగవు. తరువాత వాని చెవు లను రెండంగుళములు కత్తిరించుదురు. అట్లు కొమ్ములను కాల్చనియెడల అవి మిక్కిలి పొగరుబోతులై మనుష్యులమీదకు వచ్చునని అపని చేయుదురు. అట్టిపని చేయుటవలన వాని సహజాకారమునందు పెద్దమార్పుగలిగి అవియొక క్రొత్తరకపు పశువులో యన్నట్లు

---

ఈగ ఎంతచక్కని శరీరముమీద వ్రాలినా రుచిచూచునది పుండులోని బాధమాత్రమే.

తోచును. ఆ కొమ్ముల విషయములో తప్ప తక్కిన అన్ని విషయములలోను ఈ తంజావూరు పశువులు కంగాయంజాతిని పోలియుండును.

### తంజావూరుజాతి లక్షణములు

తల :—పొట్టిగ నొసలు వంగియుండును.

కన్నులు :—విశాలముగానుండి వంగియుండును.

చెవులు :—కత్తిరించియుండును, కొమ్ములుండవు.

మెడ :—పొట్టిగ, మందముగ నుండును.

వీపు :—ఎత్తుపల్లములులేక సరిసమానముగా నుండును. వీపుపై పునవు పోనుపోను ఎత్తు పెరుగును.

తోక :—పొడవుగానుండి కొన్ని సమయములందు నేలను తాకుచుండును.

కాళ్ళు :—పొట్టిగ, బలముగ నుండును. పాదములు చిన్నవిగ అందముగ గట్టిగ నుండును.

శరీరము :—దట్టముగ, రొమ్ముకలు పట్టుగ నుండును.

మూపురము :—ఒకమాదిరి యభివృద్ధి జెందియుండును.

గంగడోలు :—పలుచగానుండి రొమ్ముకవరకు వ్యాపించియుండును.

ఎత్తు :—మూపురము వెనుక 41 నుంచి 48 అంగుళములుండును.

### 7 కంగాయంజాతి (Kangayam Breed)

ఈ జాతినే కోయంబత్తూరు జాతియందురు. ఈజాతి కంగనాడు, కొంగు, మరియు కంగాయం అని పిలువబడును. ఈ పేరు కంగాయం తాలూకానుండి వచ్చినది. ఈ పశుసంతతి కోయంబత్తూరు దక్షిణభాగములో నెక్కువగా నుండును. ఇందులో పెద్ద చిన్నయని రెండురకములు గలవు. చిన్నజాతి కంగాయ లోను, ధరపురంలోను, ఉడమల్ పేట, పొల్లాకిపల్లడం, మరియు ఎరోడా తాలూకాలలో నెక్కువగా దొరకును.

కంగాయంజాతి పశువులు శ్రేష్ఠమైనవి. ఆయా ప్రదేశవాసులు వానిని తమ భాగ్యములుగ జూతురు ఆ ప్రదేశమునందచ్చటచ్చట ఒక్కొకరు 500 నుంచి 1000 పశువుల వరకు కలిగియుందురు. సామాన్యముగ ప్రతిరైతును 10 నుంచి 20 వరకు పశువులను అమ్మకమునకై తనయొద్ద నుంచుకొనును. ఈ పశువులు సంతలలో నేగాక తదితర జిల్లాలనుండి బేరగాండ్రువచ్చి వానిని ఖరీదునకు తీసికొని పోవుచుందురు. ఇవి దక్షిణ హిందూదేశమునకును సిలోనునకును ఎక్కువగా ఎగుమతి చేయబడుచున్నవి.

---

పృథివియందే ఓషధులిమిడియున్నట్లు.



కంగాయంజాతి ఆవు

ఇవి బలిష్ఠములై చురుకగు పశువులు. వీనిని పెంచుట చాలతక్కువ వ్యయమగును. ఆవులు మాత్రము పాలు నొసంగును.

## పశువుల సంతలు

అవనాషి, మహాదేశ్వరకొండ, మధుర మున్నగు ప్రాంతములలో ప్రతిసంవత్సరము పెట్టబడు పెద్ద పెద్ద సంతలలో ఈ పశువుల నమ్ముచుందురు. దక్షిణ జిల్లాలలో నమ్మబడు పశువులసంత లంత మంచివిగావు. కంగాయం తాలూకాలవారు మంచి మంచి పశువులను పరదేశముల కెంతమాత్రము ఎగుమతి చేయరు. ఆ ప్రాంతములలో కొనువారు పెద్దపశువులను కొనక చిన్నదూడలనే కొని బాగుగా పెరిగియున్న బీళ్ల లోనికి తోలుదురు. అట్లు మేపబడిన మంచిమంచి ఎద్దులజతలు మధుర, తిరునల్వేలి జిల్లాలలో కంగాయం ప్రాంతములకన్న ఎక్కువగా కన్పట్టును. గ్రామాలలోనున్న యితర పశువులతో సమానముగా ఈ ఎద్దులను మేపుదురు. గాని వానికొరకు ప్రత్యేక జాగ్రత్తవహింపరు. ప్రతిరైతుయొక్క పొలముచుట్టును (కోయంబత్తూరు జిల్లాలో మాత్రము) అలవలు అనగా దళ్ళు ఎత్తుగాకట్టుదురు. ఈ సరిహద్దులలోపలనే రైతు తన పశుసముదాయమునంతను నుంచుకొనును.

---

పోట్లాడేకోళ్లు బాదినా వెనుదీయవు.

### కంగాయంజాతి లక్షణములు

తల :—పొట్టిగ నొసలు విశాలముగనుండును.

కన్నులు :—ప్రకాశవంతముగ, నలుపుగ నుండును.

చెవులు :—పొట్టిగ నిక్కబొడుచుకొని యుండును.

కొమ్ములు :—పొట్టిగ, గట్టిగ, వెడల్పుగ నుండి మొనలు చివర్లు తేలియుండును. ఇంకను పెద్దజాతిలో కొమ్ములు బాగుగా పొడవుగా నుండును.

మెడ :—పొట్టిగ, లావుగ, మందముగ నుండును.

మూపురము :—బాగుగా కండగలిగి పెరుగునదిగా నుండవలెను.

గంగడోలు :—మందముగానుండి రొమ్ముకవరకు వ్యాపించి యుండును. సన్నముగ పొట్టనంటువరకు వ్రేలాడుచుండును.

శరీరము :—దట్టముగానుండి, మంచి ఎముకలు గలిగియుండును.

వీపు :—పొట్టిగ, వెడల్పుగ, ఎత్తుపల్లములులేక సరిగానుండును.

తోక :—పొడవుగ నచ్చు వెంట్రుకలుగల్గి పెద్దదిగనుండును. అప్పుడప్పుడు నేలకు తాకుచుండును.

కాళ్ళు :—పొట్టిగ బలముగలిగి, మంచి ఎముకలుగలిగి యుండును. పాదములు చిన్నవిగ, పొట్టివిగ, గట్టిగనుండును.

రంగు :—ఎద్దులు బూడిదరంగుగానుండును. దట్టమైన బూడిదరంగు తలమీద, మెడమీద, మూపురముమీద నుండును. ఆవులలో చాలభాగము తెలుపుగానుండును. నాలుగు మోకాళ్లమీద బూడిదరంగు మచ్చలుండును.

ఎత్తు :—మూపురము వెనుకభాగమునుండి కొలిచినయెడల 44 లేక 48 అంగుళ ములవరకు నుండవలెను.

## ౯ మధురజాతి (Madhura Breed)

ఈ జాతినే పులికోలం లేక జెల్లికట్, కిల్‌కడ్, కిల్‌కట్ యని యందురు. ఈజాతి పశువులు చాలా చిన్నవి. మధురజిల్లాలో ఎక్కువగా నున్నవి. కంభం ప్రాంతములందు గూడ నివి చాలగానవగును. మధురదగ్గర అయ్యంగొట్టాయమం జక్కారు అను పెద్ద ఒకడుగలడు. అతనికి వేయిపశువులు గలవు. వానిలో కొన్నిటిని 1907 వ సం॥ లో మధురయొద్ద జరిగిన పశుప్రదర్శనములో ప్రదర్శించెను. వానియన్న కోడెదూడలు చిన్నవి. అందు మిక్కిలి బలముగలవిగను, లావుగల కాళ్ళతోను, కఠిన మైన పాదములతోను ఒప్పుచుండెను. భుజములు మెడ మొదలగు భాగములు మిక్కిలి శక్తివంతములైయుండి ఎటువంటి పనులకైనను బలముగలిగియుండెడివి.

---

తేలు చూడిమోసి పిల్లలుపుట్టిన వెంటనే చచ్చును.

ఆ కోడె నొక్కొక్కదానిని నూరురూపాయలు చెప్పెను. కాని ఆరకపు పశువులు 35 లేక 50 రూపాయలకంటె నెక్కువ చేయనేచేయవు. ఈజాతి పశువులు తదితర పశువులకంటె పరిమాణములో చిన్నవిగాని పనియందు మాత్రము చురుకుదనము గలిగి ఓర్పుతో నుండును.

## పందెములు (Races)

మధుర పరిసరప్రాంతపు గ్రామములలో ఈ చిన్న కోడెలను పందెములకొరకై ప్రత్యేకముగా కొంతమంది రైతులు మేపుదురు. పందెములు జరుగునపుడు మిక్కిలి ముదురురంగుగల గుడ్డను కొమ్ములనుండి క్రిందివరకు కప్పుదురు. పోట్లాటలు ఈ క్రింది విధముగా నుండును.

ఒక రంగుగుడ్డను కోడె కొమ్ములచుట్టును గట్టిగచుట్టి స్వేచ్ఛగా వదలిపెట్టుదురు. దానినట్లు వదలిపెట్టినతరువాత పలువురు మనుష్యులు పట్టుకొని పడవేసి దాని వెనుక కాళ్ళ రెంటిని ఆగుడ్డతో కట్టుదురు. ఇట్టిది జరిగినపుడు పశువు ఒక్కొకపుడు విజృంభించుటచేత మనుష్యులకు గాయములు తగులుటయేగాక మరణములుకూడ సంభవించును. అంత అపాయమైనఆట నందరు ప్రేమించుదురు. ఇట్టి పశువులను యజమాని ఇతర పశువులతో మేపక తానే స్వయముగా మేపుచుండును. తత్కారణమున ఇతరులను ఆ పశువు చూచినయెడల మీదకుదూకి పొడచును.

## మధురజాతి లక్షణములు

తల :—ముఖము సామాన్యపొడవుగా నుండి అందముగ నునుపుగ నుండవలెను.

నొసలు :—విశాలముగ నుండవలెను.

కొమ్ములు :—వంగటించుకొని వెనుకభాగమునకు వంకరలుతిరిగి సన్నని మొనలు దేరి యుండవలెను.

చెవులు :—నిక్కబొడుచుకొని పొట్టిగ నిడుపుగ నుండవలెను.

మెడ :—లావుగ పొట్టిగ నుండవలెను.

మూపురము :—పెరుగునదిగా నుండవలెను.

శరీరము :—బలముగలిగి మంచి ప్రక్కటెముకలతో కూడియుండవలెను.

వీపు :—విశాలముగ పొట్టిగ నుండి నడుము భాగమునకు రొమ్ముభాగమునకు మధ్య ఎత్తుగా నుండవలెను. తోకపొడవుగ, వెండ్రుకలకుచ్చుగలదిగ నుండవలెను.

గంగడోలు :—సన్నముగ పలుచగనుండి రొమ్ముభాగమువరకే వ్రేలాడుచుండవలెను.

---

ఒకఆవునకు నాలుగు, ఆరు దూడలు పుట్టుటకలదు.

కాళ్ళు:—బలముగ పొట్టివిగ ఒకదానితో నొకటి కొట్టుకొనకుండ విడిగ నుండవలెను.

రంగు:—సామాన్యముగా బూడిద రంగుగ లేక తెలుపుగ నుండవలెనుగాని తదితర రంగులతో కలసియుండరాదు.

## ౯ గుంసూరుజాతి (Gunsoor Breed)

గంజాంజిల్లాకు ఉత్తరభాగమునందు మాత్రము ఈజాతి పశువులు కనపడును. ఇవి మిక్కిలి చురుకుదనముగలిగి పనిచేయును. బండ్లులాగుట కెక్కువగా నుపయోగింతురు. గుంసూరు తాలూకాలోను ఆయా ప్రాంతములందును పచ్చికబయళ్ళెక్కువగానుండును. కాని అవి యెంత మేసినను తదితర పశువులతో సమానములు గావు.

### లక్షణములు

తల:—చిన్నదిగ, చదునుగల ముఖముగలిగి యుండవలెను.

నొసలు:—వెడల్పుగ, నేత్రములు విశాలముగ నుండవలెను.

కొమ్ములు:—లోపలికి గాని, ముందునకుగాని వంగియుండవలెను.

మూపురము:—బాగుగా పెరిగియుండవలెను.

శరీరము:—చతురముగా, దట్టముగా, మంచి రొమ్ముగలిగి, మంచి బలమైన నడుముగలిగి యుండవలెను.

గంగడోలు:—పలుచగా రొమ్మునుకవరకు వ్యాపించియుండవలెను.

తోక:—శీలమండలను దాటుచు అందముగ కొరడావలెనుండి చివర వెండ్రుకల కుచ్చుండవలెను.

పాదములు:—అందముగా గట్టిగా నుండవలెను.

రంగు:—పలుచగానుండు బూడిదరంగు కలిగి యుండును గాని అన్నిరంగుల పశువులుకూడ నుండును.

ఎత్తు:—మూపురము వెనుకభాగమున 42 నుంచి 46 అంగుళముల ఎత్తువరకుండును.

## ౧౦ బ్రాహ్మణజాతి (Brahmana Breed)

బ్రాహ్మణ పశువుయొక్క సాంప్రదాయము ఈవిధముగ నుండునని చెప్పుదురు. పూర్వమొక హిందూరాజు ప్రయాణముచేయుచు మార్గమధ్యమున అజాగ్రత్తతో చూడబడుచున్న కోడెదూడల గుంపునుజూచి సాక్షాత్తు భగవంతుడగు శివునియొక్క వాహన

అవుకడుపులో దూడతప్పుదారిలోనున్న సూత్రమునుపయోగించి తీయుము.

ములగు నందులు ఇట్లజాగ్రత్తతో చూడబడుచున్నవి గదాయని మనమ్మున నొచ్చుకొని అప్పటి నుండియు ఈ క్రిందివిధమున చేయునట్లు ఆజ్ఞాపించెను:—

సితృపరులందరు తమతమ బంధువులు చనిపోయినపుడు ఆగ్రామములోని మంచి తెలుపురంగుగల కోడెదూడను వెదకి దానిని ఈశ్వరార్పణముచేసి తగుపరి దూడ స్వేచ్ఛగా నెటువంటి పొలములోనైనను మేయుటకు అచ్చుపోసి ఆబోతులను విడచుచుండునట్లు ఏర్పాటుచేసిరి. కాని క్రమక్రమముగ దానియందుండు భక్తితగ్గి వీలైనంత తక్కువధరలో దొరకు నెట్టికోడెనైనను తీసికొనివచ్చి అట్లు ఆబోతులుగా చేయ మొదలిడిరి. ఈ ఆచార మిప్పటికిని గలదు. దీనిని బ్రాహ్మణజాతి కోడెయందురు.

## లక్షణములు

అచ్చుపోసి విడువబడు ఆబోతు సకల సల్లక్షణములుగలిగి ఉత్తమోత్తమమైన వృషభమైయుండవలెను. దీనినిగూర్చిన శాస్త్రసాంప్రదాయములు భారతాది గ్రంథములందును, సమస్త ధర్మశాస్త్రములందును ఉండుటచేతను, గ్రామములో చదువుకొన్న పురోహితుని అడిగిన అతను దానిని పుస్తకములనుండి చెప్పును.

## 11 సింధుజాతి (Sindhu Breed)

సింధుజాతి ఆబోతు

ఈజాతి పశువులు సింధుదేశమునందలి కరాచి, హైదరాబాదు పట్టణములందును సింధునది లోయలోను విస్తారముగా గానవగును. ఇండియాలోని పశుజాతులలో నిది మిక్కిలి స్వచ్ఛమైనట్టియు ప్రత్యేక లక్షణములు గలిగినట్టియు జాతులలో నొకటి.

ఈదేశమునగల పాడిపశువుల జాతులలోనిది విస్తారముగా లభించుచున్నది. సింధుదేశమున ఈజాతి పశువులు పాడికేగాక పాటునకుకూడ ననుకూలించును. ఎద్దులు తదితరజాతులంత చురుకైనవి గాకపోయినను నిలుకడగా పనిచేయును. కరాచీకి వెలుపల నిది పాడిజాతిగనే పరిగణింపబడుచున్నది. ఆపనికే దీనిని యభివృద్ధి చేయదగి యున్నది. అనేక శతాబ్దములనుండి ఈ పశువులు పెరుగుచుండిన ప్రదేశమున కితర ప్రదేశములతో సంబంధము లేకుండుటచేతనే ఈ పశుజాతి యింత స్వచ్ఛముగనున్నదని చెప్పవచ్చును. వాని నివాసస్థానమునుండి తదితరచోట్లకు దీసికొనిపోయి వివిధపరిస్థితుల యందుంచినను అలవాటుపడుట ఈజాతి మంచిలక్షణము.




సింధుజాతి ఆవు

## ఎగుమతి

ఇసుకఎడారిలో పుట్టి పెరిగినను ఈజాతి పశువులు తేమగనుండు రంగూనువంటి ప్రదేశములందుగూడ బాగుగా పెరుగుచున్నవి. స్వదేశమున నవి మేతకొరకు వెదకు

కొనవలసి యుండును. ఇప్పుడు సింధుజాతి పశువులు మెసపొటేమియా, బర్మా, ఫారోస్లజా, బెలూచిస్థానము, పశ్చిమోత్తర పరిహద్దురాష్ట్రము, మోరీసు, బోర్నియా, సింహాళము మొదలగు ప్రదేశముల కన్నిటికి ఎగుమతి యగుచున్నవి. మరియు నీదేశము నందలి మరి యేజాతి పశువులును ఇట్లు వివిధ పరిస్థితుల కలవాటు పడగలవని చెప్ప నలవికాదు.

అవి స్వాభావిక సిద్ధముగ కష్టమున కోర్చుట కలవాటుపడియున్నవి. అంటువ్యాధులు వాని కంతగాసోకవు. సింధుపశువులలో నితరలక్షణము లేవియు బయటపడకపోవుటచే నిది స్వచ్ఛమైనజాతిగ నెంచబడుచున్నది.

## సింధుజాతి లక్షణములు

తల :—కురచగను, నొసలు వెడల్పుగను, ఉన్నతముగను నుండును.

చెవులు :—పెద్దవిగనుండి కొంచెము వ్రాలియుండును.

కన్నులు :—పరిశుభ్రముగ, ఎడముగనుండును.

కొమ్ములు :—పరిమాణమునందును, వైఖరియందును పలువిధములుగ నుండును. కాని సామాన్యముగ కురచగ లావుగ నుండును.

శరీరము :—వెడల్పుగ మందముగ కురుచకాళ్ళపై నమర్పబడి యుండును.

గంగడోలు :—బొడ్డును వ్రేలాడుచుండును. రొమ్ము వెడల్పుగనుండును.

మూపురము :—మధ్య పరిమాణముగలిగి యుండును.

తోక :—పొడవుగ నల్లని కుచ్చుగలిగి అందముగ నుండును.

పొదుగు :—కొంచెము కిందగలిగి వ్రేలాడుచుండును.

చన్నులు :—పెదవిగనుండి సమముగ నమర్పబడియుండును.

ఎముకలు :—బలముగనుండును. చర్మము పలుచగనుండి. రోమములు మృదువుగ నుండును.

తూకము :—ఆవులు ఎద్దులుకూడ మధ్యపరిమాణము,తూనికయుగలిగియుండును.

ఆకారము :—కుదిమట్టమైన ఆకారమును అందమును గలిగియుండును.

## 12 నాగపూరుజాతి (Nagapur Breed)

ఈజాతి ఢిల్లీప్రాంతము నుంచి తేబడెను. నాగపూరు ఉత్తర హిందూస్థానములయం దక్కడక్కడకూడ గలదు. చూపులకు బలహీనముగా నుండును. గుఱ్ఱమంతపడిగా పరుగెత్తగలవు. ఈజాతి ఆవులు చాల మచ్చికగలవిగా నుండును. ధన

వంతులు ఈజాతి ఎడ్లను బండ్లుకట్టి సర్దాగా షికార్లు చేయుచుందురు. వీని రెండు కొమ్ములమధ్య ఉబ్బెత్తుగానుండును. తోక పొడుగుగానుండి పచ్చ నలుపురంగుగల వెంట్రుకలతో గుబురుగానుండును. మూపురము ఎత్తుగానుండి అందముగా నుండును. ఇవి 66 అంగుళముల యెత్తువరకు పెరుగును.

## 13 పంజాబుజాతి (Punjab Breed)

వీనినే షహివల్‌జాతి లేక మాంటుగొమెరిజాతి యందురు. ఇవి పంజాబులో పుట్టి అమృతసర్, లైలాపూర్, లాహోర్, కానెవల్, మధ్యలోను పెంచబడుచున్నవి. ఈజాతి పశువులు హిందూదేశములో నున్న జాతులకంటె చాల వన్నెకెక్కినవి. ఇచ్చటనుండు జాతి 1911 వ సంవత్సరములో కర్నల్ మెంట్సన్ వలన స్థాపింపబడి పోషింపబడుచున్నవి. ఈతను మిలిటరీ ఫారములన్నిటిలోను పరీక్షించి తెప్పించెడివాడు. 1912 వ సంవత్సరములో ఈ పశువులుమేయు ప్రాంతములందు కాలువలు కొలతలు త్రవ్వబడి పశువుల కనుకూలములేకుండజేసి గోధుమలు, ప్రత్తివిత్తులు, మొదలగునవి పండించుట మొదలిడిరి. ఈ జాతిని పోషించుటకుగాను కొంతమంది రైతులకు పంజాబు గవర్నమెంటువారు కొన్నిభూముల నిచ్చిరి.

ఈజాతి ఆవులు బాగుగా పాలిచ్చును. ఒక్కొక ఈతకు 7, 10, 16 వేల పౌనుల పాలిచ్చెడివి. ఒక్కొక ఈతకు 270 దినములవరకు సరాసరిలెక్క చూడగా పాలిచ్చెడి మంచిఆవు 4500 పౌనుల పాలనిచ్చెడివి. గిత్తలను రెండున్నర లేక మూడు సంవత్సరములమధ్య పనులు చేయించెడివారు. ఆవు నాలుగు సంవత్సరములలో నిచ్చెడి పాలు మంచివని చెప్పుదురు.

### లక్షణములు

తల :—కురుచగ, నొసలు వెడల్పుగ ఉన్నతముగనుండి కొంచెము ముందుకు వచ్చియుండును.

కన్నులు :—శుభ్రముగ, ఎడముగ నుండును.

మూతి :—వెడల్పుగ చెవులు పెద్దవిగ నుండి కొంచెము వ్రాలియుండును.

మెడ :—పొట్టిగ నుండును.

కొమ్ములు :—పరిమాణమునందును, వైఖరియందును పలువిధములుగ నుండును. కాని సామాన్య కురచగ, మందముగ నుండును.

శరీరము :—చిన్నదిగ, వెడల్పుగ, మందముగ, కురచకాళ్లపై సమర్పబడి యుండును. విశాలముగల ఎదుర్రొమ్ము కలిగియుండును.

---

బూటకపు పశువైద్యుల మాటల నమ్మకు.

గంగడోలు :—కండరములుగలిగి ముడతలు ముడతలుగా నుండి బొడ్డును వ్రేలాడుచుండును.

మూపురము :—మధ్య పరిమాణముగలిగి యుండును.

తోక :—పొడవుగనుండి వెంట్రుకలకుచ్చు నేలకుతాకునట్లు అందముగనుండును.

పొదుగు :—కొంచెము కండగలిగి వ్రేలాడుచుండును. ఎముకలు బలముగ నుండును. చన్నులు పెద్దవిగ సమానముగ నుండవలెను.

కాళ్ళు :—పొట్టిగ, బలముగనుండును. పాదములు చిన్నవిగ నుండును.

ఆకారము :—కుదిమట్టమైన ఆకారము, అందము కలిగియుండును.

రంగు :—ఎరుపు లేక నలుపు ఎరుపు కలసినవిగా నుండవలెను. అందముగ మృదువగు వెంట్రుకలుకలవిగా నుండును.

ఆవులపొదుగు, చనుమొనలు పెద్దవిగానుండును. ఆవుల వయస్సులో పెద్దదైన కొలది పొదుగు ఊగులాడుచుండును.

## 16 టార్పార్కర్‌జాతి (Tarparkar Breed)

ఇవి సింధుప్రాంతములందున్నవి. షహీవల్‌జాతితో కొంచెము పోలియున్నను సింధుజాతికన్నను కొంచెము పెదవిగ నుండును. ఈజాతి మిగుల సాధువైనది. బూడిద, తెలుపురంగు కలిగియుండును. 750 నుంచి 950 పౌనుల తూకముగలిగి యుండును. ఎద్దులు బరువులులాగును. రెండున్నర సంవత్సరముల వయస్సువచ్చినది అగాయితు పని చేయించుదురు. ఈనిన తరువాత పాలనిచ్చుకాలము 270 దినములవరకుండును. ఒక్క ఈతకు 260 నుంచి 350 పౌనులపాలవరకు నిచ్చును. ఈతకు మధ్య 100 దినములు పట్టిపోవును.

### లక్షణములు

తల :—పొట్టిగ ముఖమునిడుపుగ నుండి కండ బాగుగానుండును.

చెవులు :—నిడుపుగనుండును.

కొమ్ములు :—పొట్టిగ దృఢముగనుండును.

వీపు :—తిన్నగా వెడల్పుగా నుండును.

పిరుదులు :—ఏటవాలుగ తోక నేలనుఅనుకొని అందముగ కుచ్చుగలిగి యుండును.

పొదుగు:—ఈభాగము చక్కని పాలనరములుగలిగి చన్నులు సరియగుస్థానములలో నమరియుండి అందముగానుండును.

---

## 15 బొంబాయిజాతి (Bombay Breed)

ఈజాతినే గిరిజాతిలేక కతియవార్ జాతి అనియందురు. ఈజాతి పశువులు రాజాపుటానాలో పశ్చిమభాగమందును, బొంబాయి రాజధానిలో ఉత్తరప్రాంతము లందును, పంజాబునకు దక్షిణభాగములోను కూడ యున్నవి. ఈ ప్రాంతములందు తచ్చికబయళ్లు ఎక్కువగా నున్నవి. ఈజాతి మిగుల పౌరుషముగలది. క్రూరమృగముల చేష్టలు గలిగియుండుటచేత రైతులు వీనిని తమ యింటిదగ్గరనుంచి చాలా జాగ్రత్తగా మేపుదురు. మంచి ఆబోతుతో సంపర్కము చేయించినచో ఆవులు మంచి సంతతిగలిగి పాలెక్కువనిచ్చును. ఈజాతిలో నాలుగైదు ఆబోతులుచేరి భయంకరము లగు సింహములనుకూడ చంపును. పూర్వము ఈజాతి ఆబోతులు యుద్ధములయందు దుప యోగింపబడెడివి. దినమునకు 30 పౌనులు పాలునిచ్చెడి ఆవు అంబాలిడైరీ ఫారంలో గలదు. కతియవార్‌లో ఈజాతిని ముఖ్యముగా పోషించుదురు. కాంక్రీజుజాతి గుజ రాతీలోను, అహమ్మదాబాదునకు మధ్యగా 50 మైళ్ళ చుట్టుప్రక్కలలోనున్న ప్రదేశ ములలోను గలవు. ఈజాతి హాన్సిజాతిని పోలియుండును. ఇవి బరువులులాగుట కుపయోగించును. తెలుపు, బూడిదరంగు గలిగియుండును. ఈజాతి పరిశ్రమకు, వ్యవ సాయమునకు ప్రఖ్యాతిజెందినవి.

### గిరిజాతి లక్షణములు

చెవులు:—ఈజాతి పశువులకు చెవులు మిగుల పొడవుగానుండి వంగియుండును. స్వచ్ఛమైనజాతి పశువుల చెవులు ముడుచుకొనిన ఆకువలెనుండునని చెప్పుదురు. ఈ పశువుల చెవుల లోపలిభాగము ఎల్లప్పుడు పైకి కనపడుచుండును.

ముఖము :—ఈజాతి పశువులలో ముఖ్యముగా ఎద్దులకు నిరుష్టమైన ఎముకతో గూడిన నొసలుచే కన్నులు కప్పబడియుండుటవలన ముఖము నిద్రమత్తుతోనున్న ట్లగపడును. ఈపశువు నోటిభాగము సామాన్యమగు వెడల్పు గలిగియుండును. కన్నుల దిగువభాగము నుంచి ముఖము ఉండవలసిన దానికన్న సన్నముగ శుభ్రముగ నుండును. తల ముడుతలుపడి చివర ఆకువలె వ్రేలాడుచు లోపలిభాగము పైకి కనపడుచుండును.

వెన్ను :—బలిష్టముగను, సూటిగను నుండును. కాని వృద్ధాప్యము వచ్చిన పశువులవీపు వంగియుండును. ఈజాతి పశువులయందు తొంటిఎముక ఇతరజాతి పశు వులకన్న నిర్దుష్టముగా నుండును.

తోక :—పొడవుగానుండి కుచ్చుతో బాదాపు నేలనుతాకుచు కొరడావలె నుండును.

చర్మము :—అందముగా మృదువుగా నుండును. జాగ్రత్తగా పెంచని పశువు చర్మము మృదువుగా నుండదు.

---

ఇంగ్లీషు మందులైనా ఆయుర్వేద మందులైనా గుణము కనిపెట్టి వాడుము.

రంగు :—దాదాపు ఎఱ్ఱపురంగుగా నుండును. స్వచ్ఛమగుజాతి పశువులకు శరీర మంతయు రంగుగలిగి యుండును. ఇంకను రంగులలో మచ్చలుకూడ యుండును.

మెడ :—సామాన్యమగు పొడవుగలిగి సన్నముగానుండును. ఈజాతి పశువులు తలను పైకెత్తి యుండును.

మూపురము :—పెద్దదిగానుండి ఎగురుగానుండును.

గంగడోలు :—ఎక్కువగా విస్తరించక సామాన్య పొడవుగలిగియుండును.

కొమ్ములు :—మూలమందు నొసలుగలిగి వెనుకకు, బయటకు పొడుచుకొనివచ్చి తరుపరి పైకిపోయి లోపలికి వంకరతిరిగి చివరకొన ప్రదేశములు వెనుకకు తిరిగి యుండును.

## 16 భగ్నారిజాతి (Bhagnari Breed)

ఈజాతి పుట్టుకస్థానము బెలూచిస్థానములోని జకోబాబాద్‌కు ఉత్తరముగా నున్న "భాగ్" రాజ్యమున్ను, సింధు రాష్ట్ర పరిసరములలోనున్న ప్రదేశములును నయి యున్నవి. ఈప్రాంతము వృక్షహీనమైన ప్రదేశముగానుండి శీతోష్ణస్థితులయందు విపరీతమగు మార్పులు కలిగి యుండును. ఇచ్చట వ్యవసాయము "నారీ" నది వరదలమూలముగా జరుగుచుండును. ఇచ్చట వ్యవసాయకాలము చాల తక్కువగుటచే నీటిని సద్వినియోగ పరచుకొనుటకై పొలములను ఎత్తుగానుండు గట్టులను వేయుదురు. ఈగట్లపైన పశువులకు పుష్టినివ్వగల గడ్డిని పెంచుదురు. లేదా ధాన్యపుపైరు కంకతోగాని, పశువులకు ప్రత్యేకముగావేయు పైరుతోగాని పెంచెదరు. ఈజాతిలో రెండురకములు గలవు. (1) జకోబాబాద్ చుట్టును, నారీలోయలోను చిన్నజాతి భగ్నారీగలదు. (2) ఉత్తరముగా వ్యాపించియున్న ఎగువనారీలో పెంచబడుచున్న పెద్దజాతి భగ్నారీపశువులు గలవు. ఈజాతి ఆవులు పాడికి పెట్టినదిపేరు.

### లక్షణములు

తల :—ముఖము సామాన్యవెడల్పుగలిగి యుండును. ఈ పశువులు పొడవుగా నుండి బాగుగావంగిన ప్రక్కటెముకలతోను, బలమగు యెముకలతోను, కండరములతోను యుండును.

మెడ :—నిడుపుగానుండును. కురుచగా సొంపులుదేరిన చెవులుండును. బలిష్టముగా ఏటవాలుగానుండు పృష్ఠములు, నిడుపుగానుండు వీపు కలిగియుండును.

శరీరము :—పొడవుగ, దట్టముగ నుండును; శరీరపురంగు తెలుపుగ లేక బూడిదరంగుగా నుండి మెడ, మూపురము, భుజములయందు ముదిరినరంగు దాదాపు నలుపురంగుగా నుండును.

కాళ్ళు :— ముగా పొడవుగా నుండును.

అయినదానికి కానిదానికి బడాయి చూపించకు.

తోక :—పొడుగాటి కుచ్చుతో గుదికాలునకును, భూమికిని సగమెత్తువరకు పెరిగియుండును.

## 17 హల్లీకర్ జాతి (Hallikar Breed)

ఈజాతిపశువులు ముఖ్యముగా మైసూరుఎస్టేటులోని తుంకూరు, హాసన్ మరియు మైసూరుజిల్లాలోను పెంచబడుచున్నవి. ఈజాతిలో అనేకరకములుగలవు.



హల్లీకర్ జాతి ఆబోతు

వీనిలో కొంచెము మార్పుగలరకపు పశువులు మైసూరు రాజ్యమంతటిలోను, ప్రక్కనున్న రాష్ట్రములలోను, ఇంకకొన్ని ప్రదేశములందును దొరకును. ఇతరజాతులకు వీనికి కొమ్ములే పూర్తిగురుతు. ఉన్నతమగు నొసలే ఎక్కువ ఉన్నతమగు లక్షణము.

### లక్షణములు

తల :—మంచి ఆకారముగానుండి నల్లని ముట్టెతో అంతమొందును. పొడవుగానుండును.

నొసలు :—మధ్యభాగమున నాగటిచాలుమాదిరిగ నుండి దాని కిరుప్రక్కల ఉబికియుండును.

కొమ్ములు :—శిఖనుంచి వెనుకకు తిరిగియుండును. అట్లు కొంతదూరముపోయి చివరకు సన్ననిసూదులవలె అంతమొందును. ఆ చివరభాగము నలుపురంగుగా నుండును. అవి చివరనుంచి తలదగ్గరవరకు వచ్చునపుడు మంద మెక్కువగును. పశువు మేయు నప్పుడు దానికొమ్ములు మూపురముదగ్గర వరకు మెడను తాకును.

చెవులు :—పొట్టిగా నున్నితముగా నుండును.

గంగడోలు :—పలుచగానుండును. వెన్ను పొడవుగానుండును.

డెక్కలు :—పలుచగా, చిన్నవిగా నుండును.

తోక :—నల్లనికుచ్చుతో గుదికాళ్లవరకు వ్రేలాడుచుండవలెను.

రంగు :—ముఖమునందును, గంగడోలు పైనను, శరీరముయొక్క క్రిందిభాగము నను తెలుపుమిదిరంగు మచ్చలుండును.

## 18 దేవరకోటజాతి (Devarakota Breed)

ఇండియా గవర్నమెంటువారు ఈమధ్యనే కృష్ణాజిల్లాలో దేవరకోటపరగణా ప్రాంతములందుండు పశువులను పరిశోధించి దేవరకోట పశుజాతి యని పేరుపెట్టిరి. చల్లపల్లి రాజాగారి ఎస్టేటులో ఇట్టి సాంప్రదాయముగలజాతి గలదు. ఇటీవల బెజవాడలోజరిగిన అఖిలభారత పశుప్రదర్శనమువారు ఈజాతి పశువులకు మంచి బహుమానములొసగిరి.

ఈజాతి పశువులకు ఎరుపురంగుమీద తెలుపుమచ్చలుగాని, నలుపురంగుమీద తెలుపుమచ్చలుగాని యుండి అన్నిలక్షణములు సరిగానుండవలెను.

## 19 అలంబాడిజాతి (Alambadi Breed)

ఈజాతి కొండజాతి పశువులవలె నుండును. మైసూరుస్టేటునకు దగ్గరగానున్న మదరాసురాష్ట్రములోని ఉత్తర కోయంబత్తూరు జిల్లాలోను, ఉత్తర సేలంజిల్లాలోను కనుపించును. మైసూరుజాతిని పోలియుండును. అరణ్యములలో మేయును. ఈజాతి కోడెలను ఒక సంవత్సరము వయస్సులో పెద్ద ప్రదర్శనములలోపెట్టి కష్టపడి పనిచేయు ఎద్దులుగా తయారుచేసి రైతులకు అమ్ముదురు. కోడెలు చురుకుగాను, బలముగాను సాహసముగాను ఉండును. ఇవి బండిలాగుటకు మోటుపని చేయుటకు ప్రసిద్ధికెక్కినవి. ఇవి లాగుడునకుపయోగించుజాతి. ఈజాతి ఆవులుమాత్రము పాలునంతగా ఈయవు.

### లక్షణములు

తల:—సామాన్యముగా నుండును. నొసలు అందముగనుండును.

కొమ్ములు:—వెనుకకు తిరిగియుండును.

---

సారాంశము తెలిసికోలేరుగాని విమర్శించటానికి మొనగాళ్లు.

చెవులు:—పొడవుగానుండి నిక్కబొడుచుకొని యుండును.

కన్నులు:—విశాలముగ, మృదువుగ నుండును.

మెడ:—పొట్టిగ, మందముగనుండును.

శరీరము:—లోతుగ, ప్రక్కటెముకలు దట్టముగ, బలమైన భుజములు గలిగి యుండును.

వీపు:—అందముగనుండును.

తోక:—పొడవుగ చివరమచ్చగ నుండును.

కాళ్లు:—పొట్టిగ మంచి బలముగలిగి యుండును.

పాదములు:—గట్టిగ పెద్దవిగ నుండును.

చర్మము:—నలుపుగ లేక గోధుమరంగుగా నుండును.

## ౨౮ బరూర్ జాతి (Bargur Breed)

ఈజాతి పశువులు మద్రసురాష్ట్రములోని కోయంబత్తూరు జిల్లాలోని బర్గూరు కొండలలో విస్తారముగా నున్నవి. మైసూరుజాతిని పోలియుండును. కాని వానికన్న చిన్నవిగాను, ఎక్కువ సాంద్రముగాను యుండును. ఉబ్బిన నొసలు మైసూరుజాతి వలె స్పష్టముగా కనిపించవు. ఇవి చాలా అందముగా నుండును. ఇవి మూర్ఖజాతి యగుటవలన తర్ఫీతుచేయుట చాలా కష్టము. ధైర్యములోను, శక్తిలోను, సాహసించుటలోను, కదను త్రొక్కుటలోను, వేగములోను, ఉత్కృష్టమైనజాతి యందురు. ఈజాతి పశువులు ఎరుపుగను, ఎరుపులో తెలుపుగను, తెలుపులో ఎరుపురంగుగను, తెలుపులో బూడిదరంగుగను యుండును. ఆవులు పాలనంతగా నీయవు.

### లక్షణములు

తల:—అందముగా పొడవుగా ముట్టెవరకు వ్యాపించియుండును.

నొసలు:—ఉబికియుండును.

కన్నులు:—చూచుటకు భయంకరముగా నుండును.

చెవులు:—ఒకమాదిరి పొడవుగానుండి నిక్కబొడుచుకొనియుండును

మెడ:—పలుచగా మృదువుగానుండును.

గంగడోలు:—పలుచగా చిన్నదిగా నుండును.

శరీరము:—వంగి రొమ్ముముకలు దట్టముగా నుండును.

పాదములు:—దట్టముగ చిన్నవిగ నుండును.

రంగు:—తెలుపు, బూడిదరంగుగాని, ఎరుపు తెలుపు మచ్చలుగా గాని యుండును.

---

విద్వత్ లేని మిత్రవాళ్లను పశువైద్యానికి తీసికొనుటంత పొరబాటు మరొకటిలేదు.

## ౭। ద్యోనిజాతి Deoni Breed)

నైజాం రాజ్యపు పశ్చిమమునను, పశ్చిమోత్తరమునను ఈజాతి పశువులు విరివిగా నున్నవి. బొంబాయిరాష్ట్రములోని ధన్నిజాతిని పోలియుండును. ఎద్దులకు వ్యవసాయములో ఎక్కువ నేర్పరితనము గలదు. సాధారణముగా ఈజాతి కథియవార్‌లో నున్న గిరిజాతిని కొంతవరకు పోలియుండును. నైజాందేశపు ఆవులవలె ఈ జాతి ఆవులు పాలకు పేరుగాంచియున్నవి.

## ధన్నిజాతి (Dhanni Breed)

ఈజాతి పశ్చిమోత్తర రాష్ట్రములో అట్టక్, పంజాబులో జహీలమ్, రావల్‌పిండి ప్రదేశములలో పెంచబడుచున్నది. పశువులు అంత పెద్దవికాక సామాన్యముగా నుండును. చురుకులోను, దున్నుటలోను, ఎక్కువ ప్రాముఖ్యత వహించినవి ఈ పశు




ధన్నిజాతి ఆబోతు

వులు వర్షములు విస్తారముగాలేని ప్రదేశములందు పెంచబడుటవలన ధాన్యపుపైరు కంపతోగాని, వీనికి ప్రత్యేకముగా వేయబడిన పైరుతోగాని మేపెదరు. ఆవులు మాత్రము పాడికి పనికిరావు.

---

చదువులేదు : పశువైద్యమంతా నాకే తెలుసు నంటాడు మా మూర్ఖ శిష్యుడు.

## లక్షణములు

తల :—సామాన్యపొడవుగా నుండును. కొమ్ములు చిన్నవిగానుండి ఎత్తైన తలభాగమునుంచి ప్రక్కకు పైకి వంగియుండును.

చెవులు :—చిన్నవిగ, చురుకుగ నుండును.

మూపురము :—ఎద్దునకు తగినంత పెద్దదిగాలేని మూపురము ఎదురుగానుండును.

చర్మము :—వదులుగానుండక బిగువుగానుండును.

కాళ్ళు :—చక్కగానుండును.

శరీరము :—పశువునకు మించినపొడవు శరీరముగలిగి, పొడవుగల వెన్నుగలిగి యుండును. బాగుగా వంగిన ప్రక్కటెముకలుండును.

రంగు :—తెలుపు శరీరముపై నల్లని మచ్చలుగాని, ఎరుపు మచ్చలుగాని యుండును. ఈమచ్చలు కొన్ని పశువులయందు శరీరమంత సమానముగా నుండును. మరియు కొన్నిపశువుల శరీరమంతయు నల్లటి మచ్చలుండుటయే ముఖ్యలక్షణములు.

## 23 కిల్లారిజాతి (Killari Breed)



కిల్లారిజాతి ఆబోతు

బొంబాయిరాష్ట్రపు దక్షిణభాగములోనున్న షోలాపూర్, సతారా జిల్లాలలో పెంచబడు కిల్లారిజాతి పశువులు ప్రసిద్ధిజెందియున్నవి. అమృత మహల్ జాతినుండి వుద్భవించినను వాని యంత దట్టముగాగాని, చురుకుగాగాని, గుణములోగాని, మంచి ఎద్దులతో తులతూగ గలవిగాని వుండవు. ఉత్తర దేశమందలి బూడిద, తెలుపు పశువుల నెత్తురుకూడ వీనియందున్నది.

ఇవి కష్టపడి పనిచేయును. మేత కరవుగానున్నను ఓర్చుకొను స్వభావముగలవి. అవి నాగలిపనులకు, బండ్లులాగుటకు, ప్రసిద్ధి జెందియున్నవి.

## లక్షణములు

తల:—మైసూరు ఎద్దులవలె దట్టముగు తలయుండునుగాని అంత ప్రాముఖ్యముగ నుండదు. నొసలు సన్నముగానుండును.

కొమ్ములు:—తలపైభాగమునుండి పైకిపోవును.

గంగడోలు:—విస్తరించి యుండును.

తోక:—గుదికాలునకు కొంచెము క్రిందవరకువచ్చి నల్లనికుచ్చుతో వ్రేలాడుచుండును.

## ౭౪ కృష్ణవెల్లీజాతి (Krishnavelly Breed)

కృష్ణానదీ తీరప్రదేశమునను, బొంబాయి రాష్ట్ర దక్షిణప్రాంతములందును, హైదరాబాదు స్టేటునందును నల్లరేగడ భూములలోను ఈజాతి పశువులుండును. వీనిని రైతులు ధాన్యపు పైరుకంపలతోను, ప్రత్యేకముగా వేసిన పైరులతోను, మేపుదురు. ఎద్దులు మిగుల బలిష్ఠములుగ నుండి నెమ్మదిగ లాగుడుపనులకును, నల్లరేగడభూములలో బరువైన నాగలిపనులకు నుపయోగపడుచున్నవి. ఆవులు బాగుగా పాలిచ్చును. ఇవి ఒక్కజాతినుండి ఉద్భవించినవి కాకపోవుటవలన వీనిలో అనేక మార్పులు కనుపడుచుండును.

రంగునుబట్టియు, సామాన్యలక్షణములనుబట్టియు, ఈజాతి ఉత్తరపు బూడిద తెలుపు పశుసంతతియని తెలుపునుగాని జాగ్రత్తతో పరిశీలించిన మైసూరు పూర్వపు జాతి నెత్తురుకూడ వీనిలోనున్నట్లు తేలును.

## లక్షణములు

శరీరము:—పొడుగగా, లావుగానుండి వెడల్పుబలముగల రొమ్మును కలిగియుండును.

మెడ:—కురుచగా, బలముగా నుండును.

కాళ్ళు:— పొడవుగా నుండును.

---

రోగనిదానము తెలియక మందులుగుప్పే వైద్యులవలన ప్రయోజనములేదు.

తల:—ఉండవలసినదానికంటె చిన్నదిగానుండును. నొసలు సామాన్యముగా నుండును.

కొమ్ములు:—బయటవైపునకు వంకరతిరిగి చిన్నవిగా నుండును. కాని సామాన్యముగా సైజులోను, ఆకారములోను ఇవి మారుచుండును.

మూపురము:—బాగుగా విస్తరించి ఎదురుగా నుండవలెను.

చెవులు:—మొనలుదేరిన చిన్నచెవులుగానుండి ఎక్కువగా వంగియుండరాదు.

తోక:— గుదికాలునకు, నేలకు సగముదూరమువచ్చు నలుపురంగుగల కుచ్చు వెంట్రుకలతో సామాన్యపొడవుగ నుండవలెను.

## 25 మెహవతి (కోసి) జాతి (Mehavati Breed)

ఈజాతి ఆల్వార్ పశ్చిమప్రదేశములలోను, భరతపురపు ఎస్టేటులోను, పెంచబడు చున్నవి. హరియానాజాతికి వీనికి చాలా సంబంధమున్నది. కాని వీనియందు గిరిజాతి పశువుల రక్తమెక్కువగా నున్నది. ఇవి బండిపనులకు, దుక్కికి ప్రసిద్ధిజెందినవి.

సామాన్యముగా వీనిరంగు తెలుపుగానుండి తల, మెడ, భుజప్రదేశము, పృష్ఠభాగము ఒకమాదిరి నలుపుగా నుండును. అచ్చటచ్చట గిరిజాతి పశువుల రంగుకూడ కనబట్టుచుండును. హరియానా జాతికివలెనే ఈజాతి పశువుల కాళ్లుకూడ పొడవుగా నుండును. గాని వీని శరీరము వానియంత దట్టముగా నుండదు.

### లక్షణములు

తల:—నొసలు ఎత్తుగానుండును. ముఖము సన్నగా, పొడవుగా నుండును.

కొమ్ములు:—తల వెలుపలి భాగమునుండి వచ్చు కొమ్ముల చివరభాగములు వెనుకకు వంగుటకు ప్రయత్నించునట్లుగా నుండును.

శరీరము:—తేలిక కాళ్లతోనున్న పొడవుగల శరీరముండును.

గంగడోలు:—విస్తరించియుండును. మూపురము బాగుగా పెరుగును.

తోక:—గుదికాలునకును, నేలకును సగభాగమువరకుండి నల్లని కుచ్చుతో వ్రేలాడుచుండును.

## 26 నిమారిజాతి (Nimari Breed)

ఈజాతి నర్మదానదీతీరమున పెంచబడుచున్నది. నర్మదకు దక్షిణమునకున్న కిల్లారిజాతికిని, రాజాపుటానాలోనున్న గిరిజాతి పశువులకును ఈజాతి ఉద్భవించినది. ఇవి చురుకుగా పనిచేయుగల జాతియని పేరుగలదు.

---

పశువైద్యము చేసేవారందరిని రైతులోకకంటితో చూడాలి.

## లక్షణములు

తల :—ఎత్తైన నొసలుగలిగి ఒకమాదిరి పొడవుగానుండును.

చెవులు :—సామాన్యముగు పొడవు వెడల్పు గలిగియుండును.

కొమ్ములు :—తల బయటభాగములో పుట్టి వెలుపలికి పైకి వంకరతిరిగి చివర మొనలు లోపలకు తిరుగును.

శరీరము, వీపు :—పొడవుగానుండును. సామాన్యముగా వంగిన ప్రక్కఎముకలతో, వంగుచున్న పృష్ఠభాగములు కలవిగానుండును.

గంగడోలు :—సామాన్యముగా నుండును.

కాళ్ళు :—నిడుపుగా, శుభ్రముగా నుండును.

తోక :—నల్లనివన్నెతో నేలను తాకుచుండును.

## దజ్జాల్‌జాతి (Dajjal Breed)

ఈజాతి పంజాబు రాష్ట్రములోనున్న డేరఘాజీఖాన్ జిల్లాలో విస్తారముగా పెంచబడుచున్నవి. ఈజాతి భగ్నారిజాతినుండి ఉద్భవించినదే. నూరు సంవత్సరముల పూర్వము ఈజిల్లాలోనికి ఉత్పత్తికొరకై ఈజాతిపశువులు పెంచబడెను. క్రమేపి ఈజాతి ప్రసిద్ధికెక్కినవి.

ఈజాతి పశువు చాలావరకు దక్కన్ గారిజాతి లక్షణములుగా నుండును. ఇవి పంజాబులోని ఇతర ప్రదేశములందు లాగుడుపనులకు విస్తారముగా ఉపయోగపడు చున్నవి.

## గూలావ్‌జాతి (Goolao Breed)

ఈజాతి మధ్యపరగణాలలో ఎక్కువగానున్నది. సింధువారా జిల్లాలోను, వార్ధాలోను వీటిని ఎక్కువగా పెంచుదురు. కోడెలు చిన్నవయస్సున మేపు చాలనందున బలహీనముగా కనుపించును. బాగుగా మేపిన ఉపయోగమైనపనిచేయు ఎద్దులుగా తయారగును. ఆవులు మంచిపాలనిచ్చును.

## పొన్వార్‌జాతి (Ponwar Breed)

ఈజాతి పశువులు సాధారణముగా పిలిభిట్ జిల్లాలోని పెూరాబిల్‌లోను, ఖేరి జిల్లా పశ్చిమోత్తర భాగములలోను దొరకును. ఈజాతి పశువులు చురుకుగాను, పౌరుషముగాను యుండును వాటంతటవే మేయుట కిచ్ఛగించును. అయిదు సంవత్సరముల వయస్సు వచ్చును. లాగుటలో ఎద్దులు ప్రసిద్ధి. ఆవులు పాలకు శ్రేష్ఠమైనవి.

---

గాలిమంటయితే; ఊర మంటాడు మరొక పశువైద్యుడు.

## ౩౦ లోహానిజాతి (Lohani Breed)

ఈజాతి సరిహద్దు రాష్ట్రములో పశ్చిమోత్తరమున ఉన్న జిల్లాలలోను, బెలూచిస్థానములోని కలాయి ఏజెన్సీలోను యున్నది. పంజాబులోని డేరాయిస్మాయిల్ ఖాన్ జిల్లాలోకూడ కొద్దిగా కనుపించును. కొండ ప్రదేశములలో లాగుటకు ఈజాతి మంచిది. ఈజాతి పశువులు పాలు బాగుగా నిచ్చును.

కొండజాతి పశువులను పోలి చిన్నవిగానుండును. ఎరుపులో తెలుపుమచ్చలుగల రంగులోనుండును. ఆవులు రోజుకు పదిపౌనుల పాలవరకు యిచ్చును.

## ౩౧ హరియానాజాతి (Hariana Breed)

ఢిల్లీ రాష్ట్రములోను, పంజాబు రాష్ట్రములోని రోహతక్, హిస్సార్, గుర్గాన్ జిల్లాలోను ఈ జాతి పశువు లెక్కువగా నున్నవి. కలకత్తా తదితర పట్టణములకు హరియానా జాతి పశువులను పాడికొరకు ఎగుమతి చేయుచున్నారు. ఆల్వార్, భరతపూరు ప్రదేశములలో ఈజాతిని ఎక్కువగా ప్రేమించుదురు. త్వరగా దున్నుటకు, రోడ్లమీద బండ్లులాగుటకు ఈజాతి ఎద్దులు చాలా మంచివి. పాడికిమాత్రము చాలా మంచివి.

## ౩౨ కెన్వారియాజాతి (Kenwariya Breed)

ఈజాతి బుందేల్ ఖండ్, బందాజిల్లాలోని కెన్ నది పొడుగునను ప్రసిద్ధిగానున్నది. పన్నా రాజ్యములోను, బీజవర్, చర్ ఖారీ, అజగార్ స్టేటులోను, ఈజాతిని పెంచుచున్నారు. ఇవి బలిష్ఠముగ, తీవ్రముగ నుండు చిన్నజాతి పశువులు. ఆప్రాంతపు పనులకు ఈజాతి పనికివచ్చును. రోడ్లమీద బండ్లులాగుటకు, వ్యవసాయమునకు కెన్వారియాజాతి పశువులు ప్రసిద్ధిగాంచినవి.

## షహివాల్ జాతి

ఈజాతి పంజాబురాష్ట్రము సాగులోనికి తీసుకు రాకపూర్వము దక్షిణమున, మధ్య భాగములోనున్న మెట్టభూములలోను అడవులలోను నదిగట్లమీదను తిరుగుతూ మేస్తూ వుండెను. ఈ జాతి పశువులకు, ఉత్తర పడమర ప్రదేశములలో వున్న దేశీ భగ్నారీస్, హరియానస్, నాగోరీస్, ధన్నీసు జాతులకు, రకములలో కొద్దితేడా కన్పించుతూ వుంటుంది.

ఈజాతి సామాన్యముగా కొంచెము ఎరుపుతో కూడిన కపిలవర్ణముగలవిగాను, కొద్ది తెలుపుగాను వుండును. కొన్నిపశువులకు గోధుమవర్ణముగాను, కొన్నింటికి చాల భాగాలలో తెలుపు వుండును. అవి మామూలుగా పొడుగుగా నుండును. కాలు పొంచ

---

రెండవ పశువైద్యుడుంటే మా గ్రామ పశువైద్యునికి గిట్టదు.

గాను మందముగాను వుండును. కాని పాలుఇచ్చుటలో చాలామంచివి. వీటి చర్మము చాల అందముగా నుండును. ఈజాతి పాలుఇచ్చుటలో ప్రసిద్ధిచెందుటవలన నివి ఇతరప్రదేశాలకు పట్టణాలకు ఎక్కువగా ఎగుమతి చేయబడినవి. ఈజాతి ఎద్దులు నెమ్మదిగా చేసేపనికి మాత్రమే ఉపయోగము. బండి లాగుటలో మామూలుగా అంత మంచివికావు.

సహీవాల్ జాతి ఆవు

అవి వెడల్పాటి తల, లావుగాను కురచగాను వుండే కొమ్ములు, బరువైన శరీరము అందమైన చర్మము కలిగియుండును. మగవాటికి లావైన మూపురము వుండును. గంగడోలు పెదదిగానుండును. తోక భూమిమీద ఆనునట్టుగా బారుగానుండును. మరియు ఆవులకు విశాలమైన పొదుగుకలిగి యుండును.

## విదేశములందలి పశుజాతులు

### జెర్సీజాతి (Jersey Breed)

ఇంగ్లీషుఛానల్లోనున్న జెర్సీ అను ద్వీపములో ఈజాతి పశువులు గలవు. ఆయా రాజులీ ద్వీపములో నున్న పశుసంతతిని వృద్ధిచేయుదలచిరి. తదితర దేశముల నుండి యెవరైన ఆ చిన్నదీవికి పశువులను దెచ్చుకొనినయెడల వారికి దండన విధింప

బడెను. ఈ కారణములవలన అనేక శతాబ్దములనుండి ఈ చిన్నదీవుల పశువులు అన్యజాతి సంపర్కము లేక కేవలము స్వజాతిపశువులై జ్ఞాతిసంబంధముగలవి కావలసి వచ్చినవి. కాని మొదట నవి అంతగా పాలిచ్చెడివిగావు.

18వ శతాబ్దములో పెద్దరోగమను వ్యాధి యూరపుఖండములో పశ్చిమభాగములో వ్యాపించినది. కాని ఒక శతాబ్దమువరకు నీజాతిలో క్షతి యేమియులేదు. 1850 వ సంవత్సరమువరకు చిన్నచిన్న సంఖ్యలలో ఉత్తరమెరికావారు దిగుమతిచేయుట నారంభించిరి గాని 1870 వ సంవత్సరమువరకు అంత ఎక్కువ దిగుమతి లేదు. అప్పటినుంచి ఈజాతి ప్రతి సంవత్సరము చాలా అభివృద్ధిగాంచుచుండెడిది.

## జెర్సీజాతి ఆవులు

ఈ జాతి ఆవులు తెలుపురంగుగానుండును. వీనినే జింకపిల్లరంగు ఆవులందురు. కాని మొత్తముమీద ఒకటేరంగుగల ఆవులను కొనువారు చాలామంది యుండెడివారు. రంగుభేదములేకయే కొనుటగూడ జరుగుచున్నది. ఈ జాతి ఆవులు చాలా సుకుమారమైనవి. ఇవి చిన్నజంతువులగుటవలనను, సాధుత్వము గలుగుటవలనను, పెంచుటకు వీలుగా నుండుటవలనను, ప్రతిరైతు కావలెనని కోరుచున్నాడు. కాని వీనిని సరిగా పోషించకపోయినయెడల వీటికి కోపము, తామసము, ఎక్కువై అలిగి మేత, నీరు మానునట. యజమానుని పొడుచునట. పాలుసరిగా నీయక తిప్పలుపెట్టునట. అందుచేత నీజాతిని కొనినరైతు చాలా జాగ్రత్తగా పోషించును. ఇవి అంత ఎక్కువగాను, తక్కువగాను పాలనీయక సమానముగా నిచ్చుచుండును. ప్రపంచములోనున్న ఆవులలో జెర్సీఆవులతో సమానముగా నుంచిపాలిచ్చు ఆవులెక్కడనో తప్ప అంతటను కనపట్టవు. ఈజాతికి బెదురులేదు. చేపలు, ద్రాక్షపండ్లు, తవుడు, గడ్డి మొదలగునవి సాధారణముగా పెట్టబడుచుండును. చేపలు తినిన పశువుల పాలు దుర్వాసనగా నుండును.

## లక్షణములు

తల:—చిన్నదిగా, అందముగానుండును.

కన్నులు:—కాంతిగలిగి సాధుత్వమును జూపుచుండును.

చెవులు:—పొట్టిగనుండి కదలుచుండును.

కాళ్లు:—లేడికాళ్లవలె అందముగానుండును.

మూపురము:—ఏటవాలుగానుండును.

శరీరము:—తోకవైపు శరీరమంత విస్తరించి యుండును.

పొదుగు:—పాలతిత్తులు మిక్కిలి విస్తరించి చతురస్రరీతిగా వృద్ధిచెందునదిగా నుండును.

---

కీలెరిగి వాతపెట్టాలిగాని ఇష్టమువచ్చినట్లు పెట్టితే ఆ వైద్యునే కాల్చాలి "గౌతముడు"

## గెరన్సీజాతి (Guernsy Breed)

జెర్సీజాతికన్న ఈజాతి ఆకారములో పెద్దవై దృఢత్వముగల ఎముకలుగలిగి బలిష్ఠములుగా నుండును. వీనివలన తయారైన గోమాంసము చాల ప్రశస్తమైనది. ఈజాతిలో జెరన్సీ, ఆల్డర్నీ, సార్కు, హీరం, దీవులలోని పశువులుకూడ చేరియున్నవి. ఈ జాతికూడ ఇంగ్లీషు ఛానలులోనున్న జెరన్సీ ద్వీపములోనున్నవి. ఇవికూడ ఫ్రాన్సు నుంచి వచ్చినటులనే తెలియుచున్నది.

19 వ శతాబ్దములో జెర్సీ, జెరన్సీ ఆవులను ఇంగ్లండు దేశమునకు ఎగుమతి చేసి నపుడు రెండుజాతుల కంతభేదములేకుండ నుండెను. ఈ రెండుజాతులను కలిపి ఆల్డర్నీ నుంచి ఎగుమతి చేయుటవలన ఈపేరు వచ్చినదని తెలియుచున్నది. అక్కడ గొప్పరేవు పట్టణముండుటవలన ఎగుమతి యయ్యెడివట. ఈరెండుజాతులు ఉత్తరమెరికాకు ఎగుమతి చేయబడినపుడు మొదట యేజాతియైనది కనుగొనుట కష్టమైనదట. కాని కొంతకాలము నకు ఈరెండుజాతుల భేదములను తెలిసికొనుటచేత కలితిలేకుండ జేసిరి. దిగుమతి చేయ బడిన జెర్సీ ఆవులలో పోల్చిచూచినచో జెరన్సీ ఆవులు తక్కువగానుండును. ఈజాతి ఆవులు యునైటెడ్ స్టేట్సులోని కెనడాదేశములో ఎక్కువగానున్నవి. వీనిసైజు జెర్సీ ఆవులకంటె పెద్దవి. యుక్తవయస్సువచ్చిన ఆవులు 1200 పౌనులు తూగును.

### ఈ జా తి రం గు

శరీరమంతయు నొకటేరంగుగా నుండక తెలుపుమచ్చలుండును. గోధుమ, ఎరుపు, బూడిద, నలుపురంగులమీద తెలుపుమచ్చలు గలవియును, కొన్ని దేహమంతయు మచ్చలు గలవియును, చారలు గలవియును మంచివని యెంచుదురు. జెరన్సీ జాతివెన్న, రంగుగలిగి చిక్కగా నుండును. వారమునకు 10 లేక 12 పౌనుల వెన్నవరకు వచ్చును. ఒక్కొక్కఆవు సంవత్సరములో 700 నుంచి 750 గ్యాలనుల పాలవరకు యిచ్చు చుండును. జెరన్సీద్వీపములోనే 8 వేల పశువులుగలవు.

## షార్ట్‌హారన్‌జాతి (Shorthorn Breed)

ఈజాతి పశువులు 1800 వ సంవత్సరములో నార్తంబరులెండులోను, డర్‌హామ్ యార్కులోను, లింకోలన్‌లోను యెక్కువగా నుండెడివి. డర్‌హామ్, న్యూయార్కు లలో ఈజాతి వృద్ధిజెందినది. ఈజాతినే ఆరంభమున డర్‌హామ్‌జాతియని పిలచెడివారు. గ్రేటుబ్రిటనులో షార్టుహారన్‌జాతికి పేరువచ్చిన తరువాత ఉత్తరఅమెరికాలోను, యితర దేశములోను, డర్‌హామ్‌జాతియని పిలచుచుండెడివారు. హాలెండు దేశమునుంచి దిగు మతి చేయబడిన ఎద్దులవలన యిక్కడజాతి ఆవులను దాటించుచు పశుసంతతిని వృద్ధి చేసెడివారు.

---

వస్తుగుణాలు తెలియవుగాని బీరువాలనిండా మందులే.

## ఈజాతి రంగులు

ఈజాతికి ఎరుపు, తెలుపు, ధూమ్రము మున్నగు రంగులు స్వాభావసిద్ధముగా నుండెడివి. పాడిపశువులు ఎరుపురంగు కలిగియుండెడివి. తెలుపురంగుగల గిత్తలజాతి కూడ యెక్కువగా నుండెడిది. తెలుపురంగుగల గిత్తలను వెయ్యిగిన్నీలకు కొనుచుండెడి వారు. చారలు, మచ్చలుగలవి ఈషార్టారన్ జాతిలోలేవు. పశువుల పెదవులు, అంగిలి, నోరు, కనురెప్పలు, మున్నగునవి కండబట్టి ఎఱ్ఱపురంగు గలిగియుండవలెను. వెంట్రుకలు లేని శరీరభాగమున నలుపురంగుగాని, మబ్బురంగుగానియుండినచో సాన్యాము చేయరు. చర్మము తెలుపుగా నుండవచ్చును. ఈజాతి కొమ్ములు పొట్టివిగను, కొద్ది వంకరగను, ముందునకు ఏటవాలుగను నుండును. ఎద్దుల కొమ్ములకంటె ఆవుల కొమ్ములు నిడుపుగను అందముగను యుండును. నలుపురంగుగల కొమ్ములుగలిగిన ఆవులను సాన్యము చేయరు.

## ఈజాతి వంగసము

1800వ సంవత్సరములో నీజాతి నానాటికి వృద్ధిజెందుచుండెడివి. మంచిఎద్దుల చరిత్రలుగలిగిన పుస్తకములను అప్పుడప్పుడు ఈజాతిని పోషించు మహనీయులుదగ్గర నుంచుకొనుచుండెడివారు. ఈజాతిలో వన్నెకెక్కిన దూడలు వానితల్లులను పోలినవై యుండవలెను.

1737లో దూడగానుండి స్టడిబుల్ వంశవృద్ధికి కారణమైయున్నది. 1777లో పుట్టిన హుబ్బాక్ ఈ షార్టారన్ జాతికి మూలాధారమై వంశవృద్ధిజేసినది. ఛార్లెస్, రాబర్టుకోలింగు 1780లోనే ఈజాతిని మంచి ఉన్నతదశలోనికి తెచ్చిరి. మంచి వంగసము నేరి బాగుగా పోషించెడివారు. దేశమంతయు నీజాతినిగూర్చి విమర్శించి పోషించుటకు తగిన ప్రోత్సాహమిచ్చుటచేత వారిరువురిపేర్లు బయటపడవచ్చినవి. ఇందువలన ఈషార్టారన్‌జాతి యునైటెడ్ కింగ్డంలోనికెల్లను మంచి పేరుగాంచినది.

## బూత్పుషార్ట్‌హారన్‌జాతి (Butu Shorthorn Breed)

1900 సంllలో ఇద్దరు మహనీయులు ఈజాతిని వృద్ధిలోనికి తీసికొనివచ్చిరి. ఈజాతి పాలకంటె మాంసమున కెక్కువగా ప్రసిద్ధికెక్కినది. వేసవిలో పచ్చికయు, చలికాలములో ఎండుమేతయు, నీజాతికిమేపి బాగుగాబలిపించి అచ్చటకూడ అప్పుడప్పుడు వీనిచే పోటీపందెములు వేయించి గెలుపొందించి మంచిపేరులోనికి రాగలుగునట్లుచేసిరి. పొట్టికాళ్లుగలవి, నలుపురంగుగలవి, మంచికండగలవి, అగు ఈజాతిపశువులు మంచిపేరుతో నుండెడివి.

---

రోగనిదానము తెలియదుగాని గోడకు పెద్దబొర్రు.

## పాలిచ్చు షార్తారన్‌జాతి (Shorthorn dairy Breed)

జెయిట్సు షార్తారన్‌జాతి ఆవులు పాలిచ్చుటలో మిగుల ప్రసిద్ధిగాంచినవి. ఈజాతినుండి తీయబడిన పాలను సమీపముననున్న ఇస్త్రీలలో అమ్ముచుండెడివారు. దూడలకు పాలుతక్కువగానుంచి ఎక్కువగా పితుకుటవలన పశుజాతి కొంతవరకు క్షీణించినది.

గ్రేట్‌బ్రిటన్‌లోను తదితర మాగదేశములలోను ఈ పాడిపరిశ్రమ అభివృద్ధిలో నుండెను. రిచర్డు స్ట్రాట్టన్, జోగ్టేలర్, జాన్‌తోరంటన్ మొదలగు మహనీయులు ఈషార్తారన్‌జాతిని బాగుగా పోషించుచు 1900 సంవత్సరము మొదటిదశలో బాగుగా పాలిచ్చు ఈజాతి పశువులను బహుమానమిచ్చుచుండెడివారు. 1905వ సంవత్సరములో కొంతమంది కలిసి సంఘముగా నేర్పడి ఈజాతిని వృద్ధిలోనికి తెప్పించుటకు ప్రచారము చేసిరి. ఒక పెద్దమనిషిదగ్గర పాలుతీయించి పాలయొక్క శుభ్రతనుబట్టియు, తూకమునుబట్టియు వానికి బహుమానము లిచ్చెడివారు.

నాలుగు సంవత్సరముల ఆవు యీనిన మూడునెలలలోపుగా కనీసము 25 పౌనుల పాలనిచ్చిననేగాని బహుమానము లేక సర్టిఫికెట్టు పొందజాలదు. నాలుగు సంవత్సరములు అంతకు పైవయస్సుననున్న ఆవు కనీసము 8వేల పౌనుల పాలీయవలెను. నాలుగు సంవత్సరముల వయస్సుగల ఆవు ఆరువేలపౌనుల పాలీయవలెను. ఈ పాలయొక్క పరిమాణమును తేలికగా తెలిసికొనుటకుగాను రికార్డు తయారు చేయుదురు. కొన్ని కేసులలో పాలు నిత్యము కొలుచుట కష్టము. కొన్నిటిలో వారమున కొకసారి రెండు సార్లు కొలుచుదురు. ఈపైచెప్పిన పశువులు వంశపరంపరగా వచ్చినవి.

## నాన్‌పెడిగ్రి షార్తారన్‌జాతి
## (Non Pedigree Shorthorn dairy Breed)

ఇంగ్లండు ఉత్తరభాగములోను, క్షైషైరులోను ఈజాతి పెంచబడుచున్నది. ఇంగ్లండున కీశాన్యదిక్కుననున్న ఈజాతి పశువులను పోషించు మహనీయులు పాడి పరిశ్రమలో అజాగ్రత్త చేయుచుండెడివారు. ఎద్దులను ఎండిపోయిన ఆవులను మాంస పరిశ్రమకనియు, బాగుగా పాలిచ్చు ఆవులను పాడి పరిశ్రమకనియు రెండు భాగములుగ విడదీసిరి.

ఐర్లండులో నిప్పటికికూడ ఈజాతి పశువులున్నవి. నూరు సంవత్సరములక్రిందట లాంక్‌షైరునుండి ఇంగ్లండుదేశములో నితరభాగములనుండి తేబడిన లాంగ్‌హారన్సుజాతి పశువులు చాలావరకు వృద్ధిలోనుండెడివి. కాని క్రమేణ షార్తారన్‌జాతి ఎద్దులయొక్క వృద్ధి ఎక్కువగానుండెను. వ్యవసాయ డిపార్టుమెంటువారును, రాయల్ డూబ్లీసొసయిటీ వారును షార్తారన్‌జాతి ఎద్దులయొక్క వృద్ధిని బాగుగా వ్యాపింపజేసిరి. ఐరిష్‌షార్తారన్ జాతులు ప్రతి సంవత్సరము ఇగ్లండునకు స్కాట్లాండునకు విరివిగా పంపబడు చుండెడివి.

---

మా ఎద్దు చచ్చినా బ్రతికినా, డబ్బుముందుమాత్రము కట్టుకోవాలట.

## హియర్‌ఫోర్డుజాతి (Hereford Breed)

ఈజాతి ఇంగ్లండులో నేగాక ఆస్ట్రేలియా, దక్షిణ అమెరికాలలో నుండెడిది. మాంసము హెచ్చుగ తయారు చేయుటలోను, దూరదేశములకు ప్రయాణములు సునాయాసముగా చేయుటలోను, పచ్చిక యెచ్చట బాగుండునో అచ్చటనే నివాస మేర్పరచుకొని బాగుగా బలియుటచేతను, ఈజాతి పేరు గాంచినది. ముఖము, కడుపు, గొంతుక, కాళ్లలోపలి భాగము, తోకచివర, తెలుపుగను కొమ్ములు తెలుపు లేక బూడిదరంగుగను యుండును. ఈజాతి క్షయరోగమును బొందజాలవు. తీక్ష్ణమైన సూర్యరశ్మి కంటికి తగిలినపుడు వేడిమికి బెదరునంత సుకుమారత కలిగియుండును. అందుచేత గోధుమ రంగుగల కనుగ్రుడ్డున్న పశువును నాణ్యమును చేయుదురు. డెవన్‌సాసెక్సు జాతుల వలె దక్షిణ ఇంగ్లండులోనున్న రెడ్‌జాతినుండి ఈజాతి వచ్చియున్నది.

19 వ శతాబ్దమువరకు లాగుట కుపయోగించెడి ఎద్దులను బాగుగా పోషించెడి వారు. ఈ ఎద్దుల భుజములవద్ద ఎత్తుగలిగి ఆకారములో పెద్దవిగా నుండును. 18 వ శతాబ్దములో ఇంగ్లండుయొక్క మధ్యభాగమునను తూర్పుభాగమునను ఈజాతి ఎద్దులను కొని అమ్ముటలో ప్రసిద్ధిగాంచినవి. ఒక పోటీపందెములో ఈజాతికి, 185 బహుమానములును తదితరజాతుల కన్నిటికి 190 బహుమానములును ఈయబడెను.

## ఎబర్డీన్-ఏంగస్సు (Aberdeen Angns)

పోర్‌షాన్‌షైర్, యబర్డీన్‌షైరులోను ఈజాతి యుండెడిది. పోరుషాన్‌షైర్ కావు రస్తుడు హగ్‌వాట్సన్ అను పెద్ద వ్యవసాయకుడు ఈజాతినిగురించి కృషిచేయుచుండెను. అతని తండ్రి అతనికి ఈ నలుపుజాతిలోనుండి నాని ఆరు పశువులనిచ్చెను. దగ్గరనున్న మార్కెట్టులో నిటువంటివానిని ఖరీదుచేసెను. ఎబర్డీన్‌షైర్ కావుగస్తుడు విలియం మెకోంబా ఇతరులకంటె శ్రద్ధవహించి బాగుగా పనిచేసెను. ఈయన పోషించిన జాతులద్వారా రెండు బహుమానములు పొందెను.

1873 వరకు ఉత్తరమెరికాలో నీజాతి కనుపించెడిదికాదు. కాని దరిమిలా హియర్‌పోర్డు జాతివలె ఇప్పటివరకు ఉత్తరమెరికాలో నీజాతి పశువులుండుచున్నవి. స్కాట్లండుదేశములో పెరుగు ఈజాతి పశువులు పరిశ్రమలో మంచివి. మాంస పరిశ్రమకుకూడ ఈజాతి ఉన్నతమైనది. షార్ట్హారన్ హియర్‌పోర్డు జాతులంత పెద్దవికావు.

ఇవి పొట్టియగు కాళ్లుగలిగి చూచుట కందముగానుండును. వాని యాకారము నకు తగినంత తూకముగలవై యుండును. ఇవి గుండ్రని యాకారముగలిగి యొత్తునకు మించిన నిడుపుగలిగి ఎముకల నిర్మాణము అందమునిచ్చుచు తగినంత కండగలిగి నలుపు రంగుగానుండును. షార్ట్హారన్‌జాతి ఈజాతి పశువులను దాటుచుండెడివి. ఈజాతికి కొమ్ములుండవు. మాంసపరిశ్రమకు మాత్రము ప్రసిద్ధిగాంచినవి.

---

## దేవాన్‌జాతి (Devon Breed)

ఈజాతి సౌసెక్సుజాతిని పోలియుండును. ఎబర్డీన్, యాంగస్ జాతిమాదిరి నిర్మాణము గలిగియుండి మాంసపరిశ్రమకు మంచివిగా నుండెను. శరీరము ఎరుపురంగుగానుండి అచ్చటచ్చట మచ్చలుండును. ఆవుల కొమ్ములు పొట్టిగానుండి కొంచెము వంకరగా నుండును. ఎద్దుకొమ్ములు తిన్నగానుండి కొంచెము ఏటవాలుగా నుండును.

## బ్రిటిష్ హోల్‌స్టీన్‌జాతి (British Holstene Breed)

ఈజాతి ఆకారములోనించుమించుగ షార్టార్న్‌జాతియంత పెద్దవై పాడిపరిశ్రమకు అనుకూలమైయున్నవి. కపిల, నలుపు తెలుపు కలసినరంగు, తెలుపురంగు, నలుపురంగు, ఈజాతికి చెందియుండును. కాని వీనిరంగులు చూచుటకు ముచ్చటగా నుండును. తల నిడుపుగ పొడుగుగ నుండును. కొమ్ములు షార్టార్న్‌జాతికివలె ముందునకు వంగి చూచుటకు అందముగానుండును. మెడ సన్నముగనుండి పొడవుగానుండును.

ఇతరజాతులతో పోల్చిచూచిన యెడల వీనిరొమ్ము లోతుగా వెడల్పుగానుండి బాహుళ్యభుజముగలిగి ఇతరజాతుల రొమ్ములకు మించియుండును. కడుపు లోతుగలిగి విశాలమైనదిగా నుండును. హాలెండులోను అమెరికాలోను ఈజాతి యెక్కువగా నుండును. ఇతర ఇంగ్లీషుజాతులన్నిటికంటె ఈజాతి పాలెక్కువయిచ్చును. పాలు అంత రుచికరమైనవిగావు. ఈజాతి ప్రతిచోట యుంచినచో పాడిపరిశ్రమ కనుకూలముగా నుండును. ఈదేశములో నీజాతిని పాడిపరిశ్రమకును మాంసపరిశ్రమకును వాడుదురు.

## కెర్రీజాతి (Kerry Breed)

ఈజాతి తేలికగా చురుకుగా శుభ్రముగా అందముగా నుండును. చిన్నతల, అందమైన నిడుపైన శరీరము, చిన్నపిర్రలు, జీవకళగల కన్నులు గలిగియుండును. శరీరము నలుపురంగుగలిగి పొదుగుమీద తెలుపుమచ్చలుండును. ఎరుపురంగుగలవానిని ఈజాతిలో జేర్చుకొనెదరు.

ఈజాతి ఆవులు పాడికి శ్రేష్ఠమైనవి. వీనిపొదుగు చక్కగా నమర్పబడి విశాలముగా నుండును. సామాన్య మేతతిని పాలనిచ్చును. పాలిచ్చుటలో నితరజాతులకంటె వెన్నకెక్కువవి. ఈకెర్రీజాతి ఆవులు 36 పౌనుల పాలను అందునుంచి $3\frac{1}{8}\%$ వెన్నయు, 23½ పౌనుల పాలలో $4\frac{1}{8}\%$ వెన్నయు కలిగియున్నది. ఈజాతి ఆవులు 900 పౌనులను, ఎద్దులు 1000 పౌనులును బరువుకలిగియుండును.

---

సేద్యపువృత్తి చాలా పురాతనమైనది.

## డెక్స్టర్ జాతి (Dexter Breed)

ఈజాతి కేవలము నలుపురంగునుగాని, ఎరుపురంగునుగాని కలిగియుండదు. కెర్రీ జాతికన్న ఈజాతి గుంట్రని యాకారము కలిగియుండును. కాళ్ళు పొట్టిగానుండి మంచి బలముగనుండును. మెడ పొట్టిగ అందముగ నుండును. కొమ్ములు నిడుపుగ మందముగ నుండును. దీని పుట్టుకచరిత్ర సరిగా తెలియదు. ఇది బహుశా డెక్స్టర్ అను జాతివలన పుట్టించబడిగాని లేక లిమ్‌రిక్, కార్కు, సమీపప్రదేశములలో ఐరిష్ ఆవులవలన కెర్రీవృషభములతో దాటబడి పుట్టి వృద్ధిగాంచబడిగాని యుండవచ్చును. డెవన్, కెర్రీజాతుల మిశ్రమమువలన ఈజాతి కలిగినదని ప్రొఫెసర్ విలసనుగారు తెలిపిరి.

## ఫ్రెంచి కెనడియన్ జాతి (French Canadian Breed)

ఫ్రాన్సువారు కెనడాకు వలసవచ్చినపుడు తమతోపాటు ఫ్రెంచివారు కొన్ని ఆవులను తీసికొనివచ్చిరి. వీనినే ఫ్రెంచికెనడియన్ ఆవులందురు. మొన్నటివరకు వీనిలోకలితీ చాలా తక్కువ. కాని ఈమధ్య జెర్సీఆవులకును వీనికిని కలితీజరిగినది. ఆకారములో జెర్సీఆవులవలె నుండును. ఇవి బూడిదరంగు, నలుపురంగుగ నుండును. వీనికి తగిన తమేతలేనప్పటికీ తృప్తిపడునట. మిగుల చురుకుగానుండి ఎటువంటి శీతోష్ణస్థితినైనను సహించగలదు.

## డార్జిలింగుజాతి (Darjeeling Breed)

ఇవి ఇంగ్లీషుజాతివలెను, అడవిజాతివలెను కన్పించును. కొమ్ములు పొడవుగా నుండును. నలుపు ఎరుపు బటానీరంగుగా నుండును. దినమునకు నాలుగుశేర్ల పాల నిచ్చును.

## సౌత్‌డెవన్‌జాతి (South Devon Breed)

ఈజాతి కొన్నిపశువులు ఆకారములో పెద్దవిగ లేలికగ ఎరుపురంగుగలవై డెవన్‌జాతికి భేదించుచుండును. ఛానల్ దీవులలోనున్న తెలుపుఆవులను, ఆల్డర్నీస్ ఎద్దులతో దాటించెడివారు. అంతకుపూర్వము ఈజాతిని హేమ్సుఆవి పిలిచెడివారు. 30 సంవత్సరముల క్రిందటి వరకు ఈజాతులయెడ మంచి గౌరవముంచెడివారు. ఈజాతిని దగ్గరదేశములకు అనగా దక్షిణాఫ్రికా, దక్షిణ అమెరికా, యునైటెడ్‌స్టేట్సులకు పంపెడివారు. సంవత్సరములో 900 నుంచి 1000 గాలనుల పాలిచ్చును. ఇతరజాతులకంటె నివి పాలనెక్కువనిచ్చును.

ఈజాతి పశువులు శరీర పరిశ్రమలో పేరుగాంచెను. గ్రేట్ బ్రాంకర్ యొక్క ప్ర్యాన్‌సెస్‌స్లార్లీ అనునతడు ఈజాతిని ఆరంభములో పైకిదీసెను. తాను చూచినంతలో

వ్య. సాయము చేసకొనబడిగారిని కృషితుల, పేర్యగాంగ్రంగురు.

మంచివిగానున్న ఈజాతి పశువులను గాని పోషించెడివాడు. హాల్ భామునుండి ఈజాతి పశువులు విరివిగా యునైటెడ్ స్టేట్సునకు ఎగుమతిచేయబడు చుండెడివి. షార్టారన్ జాతు లంత యెక్కువగా అమెరికాలో ఈజాతిని పోషించెడివారుకారు. ఉత్తర దక్షిణామెరికా లోను, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికాలోను ఈజాతి యుండెడిది. ఈజాతి మధ్యరకముగా పాలనిచ్చును. మాంస పరిశ్రమకు ఎక్కువగను, పాడిపరిశ్రమకు తక్కువగను, ఈజాతులు పెంచబడెడివి. సన్నని తేలిక ఎముకలుగలిగి శరీరము చాల మృదువుగా నుండును. ఇవి మిగుల తెలివిగల జంతువులు. ఈజాతి ఎద్దులు బండ్లు బరువులు లాగును.

## సుస్సెన్‌జాతి (Sussen Breed)

ఈజాతి క్వెంటులోను, సర్రేలోను, సస్సెక్సులోను మాంసపరిశ్రమకు పెంచ బడుచుండెడివి. బ్రిటీషు పశుజాతులన్నిటిలోను ఆకారములో పెద్దవిగానుండెడివి. ఎరుపు రంగు గలిగియుండును. అవి తిను ఆహారమునుబట్టి కండగలిగినంత మాంసమును యిచ్చు చుండెడివి. ఇవి బరువులు లాగుటలో ప్రసిద్ధికెక్కినవి. అమెరికాకు, దక్షిణాఫ్రికాకు ఈజాతులు పంపబడుచుండెడివి. స్వదేశపు ఆవులను ఈజాతిఎద్దులు దాటుటచే ఈజాతి దూడలు పుట్టుటయు గలదు. సవిాపజిల్లాలలో ఈజాతి ఎద్దులవలన ఎక్కువగా పనుల చేయించుచుండెడివారు. ఇవి త్వరలో నశించుచుండెడివి.

## గేలోజాతి (Gallow Breed)

ఈజాతి 17 వ శతాబ్దమునుంచి పెరుగుచున్నది. స్కాట్లండు నైఋతిదిక్కు వీనికి పుట్టినిల్లయియున్నది. కర్క్‌డ్రైటు, విగ్టవున్, బ్రిటిష్‌దీవులు, ఇంగ్లండు మొదలగు ఉత్తరభాగములలో నివసించుచుండెడివి. వీనికి చలిగాలి చక్కగా సరిపడును. వీనికి తక్కువమేత మేసినను బాగుగా కండబట్టి బాగుగా వృద్ధిపొందుచుండెడివి.

ఈజాతికి కొమ్ములులేవు. నలుపురంగుగానుండును. ఈజాతిపశువు లిప్పుడుగూడ అక్కడక్కడ కన్పించుచుండును. తల మరచగను వెడల్పుగను కన్నులు పెద్దవిగను, శరీరము గుండ్రముగను మంచి నిర్మాణము కలదిగను కాళ్లు పొట్టిగను చర్మము బిరుసు గను వెండ్రుకలు మెత్తగను యుండును. ఈజాతి ముఖ్యముగా శ్రేష్ఠమైన మాంస మిచ్చుటచే పేరుగాంచినవి. ఈజాతిఆవులు దాటుటకు ముఖ్యముగా గణించబడినవి. వీనివంటి కొమ్ములులేని దూడలే పుట్టుచుండును. ఈజాతి కెనడా, ఉత్తరమెరికాలలో వృద్ధిగాంచబడినవి.

## వెస్టుహైలాండుజాతి (West Highland Breed)

ఈజాతి స్కాట్లండుయొక్క ఎత్తు ప్రదేశములలోను, వాని దీవులలోను నివసించు చుండెడివి. అన్ని ఇంగ్లీషు జాతులలోనికెల్ల నీజాతి శరీరములింప బొచ్చుగలదై, గట్టి

---

తనముగానుండును. ఇది సంకరజాతి, వీపుతిన్నగను, కాళ్లు కురచగను, ఎదురొమ్ము వెడల్పుగను, శరీరము గుండ్రముగను, గొమ్ములు అందముగను, కండ్లు పెద్దవిగను, ముఖము చిన్నదిగను, నలుపురంగుగానుండి తెలుపుమచ్చలుగను, అక్కడక్కడ పసుపు రంగుగను యుండును. కొమ్ములు బలముగలవై కొద్దిగా ముందుకు వంగియుండును.

ఎద్దులకన్న ఆవులకొమ్ములు త్వరగా పైకివచ్చును. కొమ్ములు నిడుపుగలవై యుండును. ఇవి గట్టి పరుసజంతువులగుటచే ఎటువంటి తక్కువమేత మేసినను బాగుగా పెరిగి త్వరలో వృద్ధిగాంచుచుండును. వీనికి శీతోష్ణస్థితి సరిపోనందువలనను, తక్కువ మేత తినుటవలనను, ఈజాతి ఆకారములో తదితరజాతులతో సరిపోక చిన్నవిగా నుండును. వీని మాంసము చాల ఉత్తమమైనది. త్వరలో వృద్ధిగాంచు షార్టాన్ మొదలగు జాతులతో వీని ఆవులను దాటించిన కొంతవరకు మంచి జాతిదూడలను కనుచుండును. ఇవి పాలు కొద్దిగా యిచ్చుచుండునుగాని ఒక దూడకుమాత్రము సరిపోవును.

## రెడ్‌పోల్‌జాతి (Redpoll Breed)

ఈజాతి నార్ఫోక్, సఫోక్ అను రెండు ప్రదేశములలో యున్నవి. పురాతనమైన ఎరుపురంగు కొమ్ములుగల నార్ఫోకు జాతియొకటి, కపిలవర్ణమైన సఫోకజాతి యొకటి ఈజాతిలోని భాగములు. కపిలవర్ణపుజాతి పాలు యిచ్చుటలో ప్రసిద్ధిగాంచినవి. నార్ఫోకుజాతి ఆకారములో చిన్నదిగనుండి మంచి అందము గలిగియుండును. త్వరగా పెరిగి యున్నతమైన మాంసము కలుగజేయును. ఈజాతి ఎరుపు రంగుగలిగి తోకచివర భాగము, పొదుగుభాగము తెలుపుగా నుండును. ముక్కు రంధ్రములు తెలుపుగానుండిన ప్రశస్తమని యెంచుదురు. నలుపురంగుగను, మబ్బురంగుగను, ముక్కురంధ్రములున్నచో మంచి దానినిగా పరిగణించరు. కొమ్ములు చూచుటకు అంత నాణ్యమైనవిగావు. రెడ్ పోల్ సంఘము గ్రేట్‌బ్రిటనులోను, ఐర్లండులోను 1888 లో నేర్పడెను. ఈజాతి గిత్తలను బాగుగా పెరుగనిచ్చి కసాయివానికి మాంసముకొరకు నొప్పగించుదురు. వీని మాంసము లండన్ మార్కెట్టులో ఎక్కువఖరీదునకు అమ్ముదురు. ఇవి పాడిపరిశ్రమకు పనికివచ్చుటచే దూరదేశములనుండి అన్నికంపెనీలకు ఎగుమతి చేయుదురు. యునైటెడ్ స్టేట్సులో గూడ ఈజాతి కనుపడును.

## ఎయిర్‌షైర్‌జాతి (Ayrshire Breed)

ఈజాతి 18వ శతాబ్దములో నుండెడిది. డచ్చిజాతులనుండి ఈజాతి వృద్ధిగాంచబడినది. ఈజాతి యితరజాతులతో పోలియుండదు. 300 సంవత్సరముల క్రిందట స్కాచ్ జాతులకు ఈజాతికి పోలికయుండెడిదికాదు. స్కాట్లండు నైరుతిదిక్కున అదివరకున్న గ్యాల్లోవేజాతిని ఈజాతి శరిమివేసి ప్రపంచమంతటిలో వ్యాపించినది.

ఈజాతి పాడికి ప్రసిద్ధికెక్కినది. చన్నులు చిన్నవిగానుండును. 1906 లో

---

దుక్కికాని చేను తాలింపులేనికూర వ్యర్థము.

చన్నులకొలత చూడగా 2½ నుంచి 3½ అంగుళములవరకు యుండెడివి. అంతకు పూర్వము 2 నుంచి 2½ అంగుళములవరకుండెడివి. అన్నిరంగులలోను తెలుపురంగున్న అచ్చటచ్చట తలకుదగ్గరగా ఎరుపు గోధుమవర్ణపు మచ్చలున్న గలదానిని నాణ్యముగా నెంచుచుందురు. కపిలవర్ణముగల జాతికూడ మంచిదికాదు. 800 నుంచి 1000 పౌనుల పాలిచ్చెడివి.

షార్టారన్ గ్యాల్లోవే జాతులను, ఈ ఎయిర్ షేర్ జాతిని, జెర్సీజాతితో పోల్చి చూచినచో ఎయిర్ షేర్ జాతి తల, దవుడలదగ్గర లోతుగను, కండ్లదగ్గర వెడల్పుగను యుండును. కొమ్ములు వెడల్పుగా నమర్చబడి పైకిపెరుగును. పొదుగుభాగము శరీరములో చక్కగా నమర్చబడి చూచుట కందముగా నుండును. డెన్మార్కునకు, యునైటెడ్ స్టేట్సునకు, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, దక్షిణాఫ్రికాకు ఈజాతులు విరివిగా పంపబడుచుండెడివి. ప్రపంచములో పాలుయిచ్చుటలో ప్రఖ్యాతిగాంచిన జాతులలో నిదియొకటి. ఈజాతికి యెటువంటి తక్కువవిలువగల మేతమేసినను పాలు మాత్రము ఎక్కువగా యిచ్చుచుండును. పాలుకూడా మంచిరకములలో చేరినవి. వీని పాలలో వెన్నకూడ తదితరజాతుల పాలలోకంటె నెక్కువగా నుండును.

## వెల్షుబ్లాకుజాతి (Welsh Black Breed)

ఈజాతి ఇతరజాతులను పోలియుండును. ఇది పురాతనమైనది. వేల్సులో నూరు సంవత్సరముల క్రిందటివరకు ఈజాతికి సంబంధించిన అనేకరకములగు పశువులు యుండెడివి. కాని యిప్పటిలో రెండు రకములుమాత్రముండి తదితర రకములు నశించెను. సౌతువేల్సులో ఈజాతి తక్కువగానుండి పాడిపరిశ్రమను వృద్ధిలోనికి తెచ్చినవి. ఈ నిర్మాణము చాల గట్టితనము మంచినడక గలిగియుండును. సామాన్యముగా అన్ని పనుల కుపయోగపడును. వీనిని కొని అమ్మి లాభము పొందెడివారు. వీని శవమును విలువగా నెంచెడివారు. వీని మాంసమును మొదటిరకముగా నెంచెడివారు.

ఆవులు పాలు బాగుగా యిచ్చెడివి. ఇవి బరువులు లాగుటకు నెక్కువగా నుపయోగించెడివి. సౌతు ఆఫ్రికాకు పంపబడుచుండెడివి. శరీరము నలుపురంగుగనుండును. పొదుగుకూడ నలుపుగ నుండును. తెలుపురంగు గలవాటిని నాణ్యము చేసెడివారుకారు. వీనికొమ్ములు బలముగలవై బాగుగా పెరిగి ఎద్దుల కొమ్ములకంటె దృఢముగలవిగా నుండును.

## లాంగ్ హారన్ జాతి (Longhorn Breed)

ఇంగ్లండునకు పడమరభాగమునను, లీసెష్టర్షైరు ప్రాంతములందును ఈ లాంగ్ హారన్ జాతి యుండెడిది. రెండువందల సంవత్సరముల క్రిందట ఈజాతి ఐర్లండు నుండి, షార్టారన్ జాతివలన తరుమవేయబడెను. లాంక్ షైర్ లోను యార్క్

మెత్తగా దుక్కియైన నేల వ్యర్థముకాదు.

షైర్‌లోను, క్రెవెన్ జిల్లాలోను ఈజాతి విశేషముగా నుండెడిది. డిష్‌లే కాపురస్థుడు రాబర్టుబెక్వెల్ వీనిని పోషించువారిలో ముఖ్యుడు. ఈజాతిలోని పశువులన్నియు ఆకారములో మార్పు గలిగియుండును. వ్యవసాయము చేయుటలో ఈజాతియెద్దులు ప్రసిద్ధిగాంచినవి. బెక్వెల్ 45 సంవత్సరములవరకు వీనిని శ్రద్ధగాపెంచి తగు ఏర్పాట్లు చేసి అతడవలంబించిన పద్ధతులను ఇతరులకు చెప్పినందున అతని రహస్యపు యేర్పాట్లు అతనితోనే అంతమొందెను.

19 వ శతాబ్దములో ఈజాతి చాల నశించెను. వార్విక్ షైర్ సెంటరులో నిప్పటికిని ఈజాతి పశువులు 500 వరకున్నవి. వీనికి కండ బాగుగానుండి ఇతర జంతువుల మించియుండును. వీనిరంగు ద్రాక్షపండురంగువలె నుండును. వీపుమీద తెలుపు చారయుండును. నిడుపులోను, కొమ్ముల ఆకారములోను, లాంగుహారన్ జాతికిని నలుపు వెండ్రుకలుగల షార్తారన్‌జాతికిని భేదము స్పష్టముగా గాన్పించును.

## దున్నలు — గేదెల జాతులు (Buffalloes and she Buffalloes)

ఈజాతులు మనదేశమున నుత్తరభాగమున యున్నవి. హిమాలయ పర్వత ప్రాంతములందును, అయోధ్య నుంచి బూటాను వరకును, వంగదేశమునుంచి పశ్చిమ




ముర్రాజాతి దున్న

తీరముననుండు తిరుహోట్ వరకున్న దేశములోను, బ్రహ్మపుత్రానది వ్యాపించినంత వరకుండు దేశములోను, బర్మాలోను మిక్కుటముగా నున్నవి. గేదెలు ఎక్కువగా

---

చాలుపై చాలుగా దున్నితే చచ్చు నేలకూడా పండును.

పాలిచ్చుటవలన ప్రతి పల్లెటూరులోను యున్నవి. దున్నలు బరువులుగల బండ్లులాగుటకును, భూములు దున్నుటకును వినియోగపడుచున్నవి. తెలుపు పశువులవలె నివి ఎండ తీక్ష్ణమును భరింపజాలవు. గేదెలు శరదృతువునందు పొల్లి వేసవికాలము సమీపించు సమయములో ఈనును. మచ్చికపడిన గేదెలు మూడు సంవత్సరములు వచ్చినతరువాత దూడలను బెట్టుచుండును. గేదె సాధారణముగా ఎనిమిదేసి దూడలవరకు పెట్టుచుండును. సాంప్రదాయమునుబట్టి కొన్ని గేదెలు ప్రతిసంవత్సరము ఈనును. తవుడు చిట్టు మున్నగు బలకరమగు వాతపదార్థములు ఎక్కువగా పెట్టుటవలన ఈవి త్వరలో పట్టిపోవును. ఎద్దులతోపాటు దున్నలున్న పాటునకు పనికివచ్చును. మదరాసు రాష్ట్రమునందంతటను ఇవి పాటుపడుచున్నవి. వీనికి లావుగ పొడవుగనుండు కొమ్ములుకలిగి వంకరతిరిగి అయిదారడుగుల పొడవు కలిగియుండును. రంగు సామాన్యనలుపుగను లేక లేతనలుపురంగుగను యుండును. వెంట్రుకలు తక్కువగానుండునుగాని ఒక్కొకభాగమందు మాత్రము వెంట్రుకల సమూహముండును. పల్లపుభూములు సాగున్నచోట వీనియొక్క యుపయోగ మెక్కువగానుండును. ఇవి నెమ్మదిగా నడచినను పొలము దున్నుటలోను, చెరకుతోటలు దున్నుటలోను, తదితరపనులు చేయుటలోను మిక్కిలి ప్రసిద్ధికెందినవి.

## తోడా దున్నలు (Toda Buffalloes)

నీలగిరికొండలకు పోవువారి కందరికి ఈదున్నలను గురించి తెలిసియేయుండును. అచ్చటనుండు ప్రతి తోడావాడు ఒకమందను కలిగియుండును. సామాన్యముగా నితర చోట్ల నుండువానికిని వీనికిని చాలా వ్యత్యాసముగలదు. ఈదున్నలు తలవంచుకొని నడచును. అవి అట్లునడచునపుడు చూచినయెడల భయంకరమైన పక్కివలె కనపడును. మొదటిభాగమందును, మెడభాగమందును, మూపురము వెన్నుభాగములందును వెంట్రుకలు దట్టముగానుండును. వానిని మనము అజాగ్రత్తగా సమీపించినయెడల అపాయము కలుగును.

అవి క్రొత్తమనుష్యులను చూడగనే తలపైకెత్తి కొంతదూరము వెనుకకు పరుగిడి మరల నిలబడి తాముచూచిన మనుష్యులవంక భయంకరముగ జూచుచు తలను పైకెత్తుచు వెళ్ళిపోయి ఇంకకొన్ని దున్నలను ప్రోగుచేసికొని ఆమనిషిని పొడచుటకై దండెత్తి వచ్చును. కొన్ని సమయములందు ఆసమూహమంతయును ఒక్కసారి మహోగ్రత జెంది తలలు క్రిందికివంచి అవి దేనినిచూచి కోపముగనుండునో దానిమీదకు దుమికి చంపివేయును. ఈరీతిగనే పెద్దపులి మున్నగు భయంకరమృగములు సముద్రతీరములందున్నపుడు ఈ దున్నలగుంపులు వానిమీదబడి చీల్చివేయును.

## ఉదకమండము

తోడాలు నీలగిరి పీఠభూమిమీద 800 సంవత్సరములనుండి నివసించుచున్నట్లు తెలియుచున్నది. దున్నలను గేదెలను పెంచి జీవించుటయే వారి వృత్తియైయున్నది.

---

కేసెడులోతుగా దుక్కిదున్నుటయు మూరెడెత్తు ఎరువుపెట్టుటయు సమానము.



శ్రీ రావి అంకినీడుగారి ఒంగోలుజాతి ఆవు — తెనాలి.



శ్రీ బోడపూడి భద్రయ్యగారి పందెపుగిత్త — చేబ్రోలు గుం. జిల్లా



కేళవాళీ గేదె



శ్రీ నూతక్కి వెంకటనారాయణగారి మంచిజాతి ఆబోతు. (చిలువూరు గుం. జి.)

బ్రిటిషుప్రభుత్వము రాకపూర్వము ఈజాతివారే ఆ వీరభూమికి ప్రభువులైయుండిరి. కాని వారు పచ్చికబయళ్లను మార్చివేసి "ఉదకమాండు" అనుపట్టణమును నిర్మించుటకు ప్రారంభింపగనే వీరిప్రభుత్వము నాశనమైనది. క్రొత్తగా జరిగిన సర్వేలెక్కలనుబట్టి ఒక్కొక్కతోడా మనిషికి 50 నుంచి 70 ఎకరములవరకున్నదని తెలియుచున్నది. ఈ భూమిమీద ఎకరమునకు రెండణాలశిస్తు కట్టెడివారు. ఈశిస్తుతప్ప వేరొండుశిస్తు లేదు.

## తోడాలుచేయు విచిత్రములు

తోడాలు వివాహములు నిశ్చయించుకొనినపుడు దున్నలను ఒకరికొకరు మార్చుకొందురు. అదియే వారిప్రమాణము. మరల వివాహము జరుగునపుడు మరొకసారి యట్లే మార్చుకొందురు. చచ్చినమనిషిని శ్మశానమునకు తీసికొనిపోవునపుడు కొన్ని దున్నలను కూడ తీసికొని వెళ్లుదురు. చచ్చినవానియందు ఆ పరిసర గ్రామములవారు గౌరవము జూపుదురు. దాని మెడలో నొక బొలుగు కట్టియుండును. శ్మశానమునకు వెళ్లిన తరువాత "మీరు వెళ్లుడు, వెళ్లుడు" అను పదముతో దున్నలను గోతిదగ్గరకు తోలినపుడు అచట నేడ్చువారందరును క్రిందనుండు దుమ్మును కొంచెము కొంచెము తీసికొని దున్నలమీద జల్లుదురు. తదుపరి దున్నల నన్నింటిని చంపుటకేమైన అభ్యంతర మున్నదాయని ఆశవము నడుగుదురు.

చనిపోయిన వారందరికి సంవత్సరీకము చేయుదురు. సంవత్సరీక మెందటిదినమున బలియొసంగుటకు నిర్ణయింపబడిన దున్నలను అవియుండు పశువుల కొట్టములనుండి ఒక సంవత్సరీకమునకు రెంటి మూడింటిని బలియిత్తురు. రెండవ దినమున పెట్టెతో కప్పబడిన శవవాహనమును బయటకుతీయుదురు. పశుశాలయొక్క ద్వారముబయట నొక పెద్దగొయ్యి త్రవ్విన తరువాత అచ్చటనున్న పౌరోహితుడు పూజావిధులు గావించును. తరువాత పూజారి పూలదండలతో అచ్చటకు తేబడిన దున్నలదగ్గరకువచ్చి వానిమీద విసరును. అప్పటికే యువకులచేత నానావిధకష్టములు పెట్టబడియున్న దున్నలు మార్గము కనపడక గల్లంతు చేయును. కాని వెంటనే పరుగెత్తుకువచ్చి బలియిచ్చిన పశువుల మొండెములను శవవాహనమువద్దకు ఈడ్చుకొనివచ్చి దాని ప్రక్కనుంచి అందరు నేడ్చుదురు. తరువాత జరుగుపని అతి భయంకరముగను క్రూరముగనుండును. ప్రభుత్వమువారీ పద్ధతిని నిషేధింతురని తోడాలు భయపడుచుందురు.

## గేదెజాతి

ఈజాతి గేదెలు బాగుగా పాలిచ్చును. పాలు రుచిగానుండును. ఇవి పాలకేగాని తదితర పనులకు పనికిరావు. ఉదయమున సూర్యోదయమునకు ముందే పాలు పితుకుదురు. రాత్రివేళ పశువులను కాపాడుటకు రాతితో గుండ్రముగ పెద్దగోడ కట్టియుం

దుక్కలో వెడల్పుచూచుకొనక లోతుచూచుకొనుము.

డును. అది చాలా బలముగను పశువుల సంఖ్యనుబట్టియు పెద్దదిగ కట్టబడియుండును. ఈగోడ మూడు నాలుగడుగులు ఎత్తుండును. వర్షాకాలమునందు పశుశాలకువచ్చు చలిగాలిని రానీయకుండ చిన్నచిన్న పొదలతో నాద్వారములు కప్పివేయుదురు. ఈ




ముర్రాజాతి గేదె

పశుశాలమీద నేవిధమగుకప్పుయుండదు. వానిని అన్నికాలములయందు వర్షములకు ఎండలకు విడిచిపెట్టుదురు. చిన్న దూడలను మాత్రము అతి జాగ్రత్తతో అన్ని కాలములందును కప్పువేసిన చావడియందు కాపాడుదురు.

## దక్షిణకన్నడపు దున్నల పందెములు

ఈ ప్రదేశమునందు జేయిన్‌బాంట్సు అనునొక హిందూజాతి తెగవారున్నారు. వారు చక్కనిదున్నలను పెంచుదురు. వానిలోకెల్ల అందముగలవి కొన్ని మంగుళూరు ప్రాంతమునందున్నవి. ఆ ప్రదేశములందుండు ఇతరపశువులు కొన్ని చిన్నవియగుటచేత అవి వ్యవసాయమునకు పనికివచ్చును. దున్నలను పోట్లాడించుటయనిన వీరికి మిగులప్రీతి. ప్రతి ధనవంతుడును కంబ్లఅను పవిత్రవంతమైన పొలమున ఈ దున్నల పోట్లాటలకై ప్రత్యేకస్థలమును వదలిపెట్టుదురు. ఈ పందెముల నుపయోగించు దున్నలజత అయిదు వందల రూపాయల ఖరీదుండును. వాని నెప్పుడైన అరుదుగ దుక్కికి నుపయోగించుదురు. అవి పరుగెత్తించబడినప్పుడు వానిచుట్టు మూగియున్నవారు ఆపరుగెత్తు రెండిం

---

గొఱ్ఱెలమంద కట్టుటకంటె లోతుగా దున్నుట మేలు.

టిలో నేది ఎత్తులనుదూకుచు పరుగిడునో దానినికనిపెట్టి గుర్తించుదురు. ఒక్కొకప్పుడు సుమారు ఇరువదిఅడుగుల ఎత్తుగల కటకటాలను నిర్మించుదురు. సామాన్యముగా నీ పందెములు 150 గజముల పొడవుగల తడియు బురదయు నీరును యుండు ప్రదే శమునందు వేయుదురు. వానిని తోలువాడు వలయుకండములను చేత బుచ్చుకొని 18 అంగుళముల ఎత్తును, 12 అంగుళముల వెడల్పునుగల బల్లనెక్కును. దానిమీద మరియొక బల్లయుండును. అంతట తోలువాడు ఒకకాలును చిన్నబల్ల మీదను, రెండవకాలును దున్నకువేయబడిన కాడికి తగిలించబడిన ఒక చిన్నబండి మీదనువేసి ఒకచేతితో కొరడాను, మరియొకచేతితో దున్నతోకను పట్టుకొనును. ఎట్టిపగ్గములను పుచ్చుకొనడు.

ఈరీతిగా ఆటాడబడుచున్నపుడు తోలువాడు తాను మొదట కాలువేసిన బల్లను ధ్వనిఅగునట్లుగ బలమంతయుజూపి ఆబల్లను గ్రుద్దుదు కొంచెము నీటిని బురదను తీసికొని తనచుట్టును ప్రిన్సు ఆఫ్ వేల్సు గౌను ఆకారముగా జల్లును. అప్పుడప్పుడు వాడు పడుచుండుటగలదుగాని భూమియంత బురదతో నీటితో కూరుకొని యుండు టచే దెబ్బమాత్రము తగులదు. ఆ చుట్టునున్నవారు ఒక్కొక్కప్పుడు కేకలువేసి అటుల నపుడు తోలువాడు కొన్ని చిత్రమైనపనులు చేయును. ఇటువంటి పెద్దపెద్ద ఆటలకు చుట్టుప్రక్కలనున్న గ్రామములనుండి సుమారు నూరుజతల దున్నలువచ్చును. ఆ చుట్టు ప్రక్కల షాహుకార్లు రాకపోయినను తమదగ్గరనున్న దున్నలను మాత్రము తోలి పెట్టుదురు.

## పర్లాకిమిడి దున్నలు, గేదెలు

గంజాంజిల్లాలో దేశిలేక మందజాతి, పెద్దకిమిడిజాతి, జిరంగిజాతి దున్నలు గలవు. ఈ జిల్లాలోని యుత్తరభాగములలోనున్న దున్నల, గేదెలకంటె నీ పశువులు పొడవుగ బలముగ నుండును. అవి ముదురు బూడిదరంగు కలిగియుండును. జిరంగిజాతి బర్రెలకంటె కొంచెము నలుపుగ నుండును. వేడిమినంతగా భరించజాలవు. ఎంత బరువు వేసినను శాంతముగ ఆయాసము లేక లాగును.

జిరంగి గేదెలు, పెద్దకిమిడిజాతి గేదెలు, పర్లాకిమిడిజాతి గేదెలంత పాల నీయవు. సామాన్యముగ ఈజాతి పర్లాకిమిడిలో నేతప్ప తదితరచోట్ల దొరకవు. దున్నలు వ్యవసాయమునకు ముఖ్యమైనవి. ఆ ప్రాంతములోని ఎద్దులు దున్నలు లాగినంత బరువు లాగలేవు. పర్లాకిమిడి ఎస్టేటురైతులు ఎద్దులకన్న దున్నలనే ఎక్కువగా నుపయోగించుదురు.

---

కళ్లు అటెగెనా గాదెలు సడును.

# ఆఱవ భాగము

# పశు పరీక్ష

## పశువుల కాపరి

“ముదమారగా దున్న మూపునగూర్చుండు
దొడ్డవారల యింటి బిడ్డవోలె
పచ్చికబీళ్లలో బసువుల బాలించు
ధరణినేలెడు క్షమాధవునిబోలి
బుఱ్ఱకు బంకంబుపూసి యీతలగొట్టు
ప్రకృతి శాస్త్రజ్ఞునిభాతి వేలి
కోకిల కెదురు ‘కూ కూ’ యని కూయుచు
నలరించు మేటిగాయకునిమాడ్కి

కోతికొమ్మచ్చులును బిల్లగోళ్లులాడు
సాటిలేనట్టి పిల్లవస్తాదురీతి
మురువుగొల్పగ గోచిని మూడిపెట్ట
కాలగతులెంచి పశువుల గాయు నతడు”

అడ్డులేనట్టి యానంద మనుభవించి
చింతలన నెట్టివో మది జేరనీక
హాయిగా గాలమునుబుచ్చు చనుదినంబు
ప్రభుతపచరించు బసువుల పాలకుండు॥

“పల్లెటూరు”

భారతదేశములో 8 లక్షల గ్రామములున్నవి. తెల్లవారునప్పటికి ప్రతిగ్రామము నుండి కనీసము 25 మందికి తక్కువగాకుండ పిల్లలు పశువులను కట్లువిప్పి మందలను బీడుభూములకు, కాలువగట్లకు, పొలములకు తోలుకొనిపోయి సూర్యాస్తమయము వరకు మేపుటో, కాపలాకాయుటో, కోతికొమ్మచ్చులాడుటో, గేదెలమీద నెక్కి స్వారిచేయుటో, మొండిమొలలతో కాలువలలో దూకి స్నానముచేయుటో కాల

---

అరక అరిగితే గరిశ నిరుగును.

యాపనము చేయుచుందురు. కనీసము 8 లేక 9 గంటలవరకు కాలక్షేపము జేయుచుందురు. ప్రతి కాపరికి ఒక తకిలీ యిచ్చి వడుకుట నేర్పిన అరగంటలో వచ్చును. పశువులను మేపుకొనుచు సరాగా అరగంటసేపు వడికిన గ్రామములలోని మంద బయళ్ళు, బీళ్లు తకిలీలమయమైపోవును. ఈరీతిగా మన దేశములో ప్రతిరోజు పశువులను కాచే కాపరులు ఒకకోటి అరువది లక్షలు తేలుచున్నారు. వీరంతా వడికిన నూలు ఖరీదు వేసిన దినమునకు పదిలక్షల రూపాయలు విలువగల నూలు లభించును. దీని సాలుసరి విలువ 36 కోట్ల రూపాయలుండును. ఈ మొత్తములో సగముధర వేసికొనినప్పటికి 18 కోట్ల రూపాయల విలువగల నూలు సంవత్సరమునకు దేశమొత్తముమీదగల కాపరులచేత గొడ్లకాపుకు భంగములేకుండ తయారు చేయ వచ్చును. ఇందువలన వారి సరదాకుకూడ ఎట్టిభంగములేదు. ఎంత తక్కువ వడికినా నెలకు ఒక పౌను సులభముగా వడుకుకొనవచ్చును. తన కుటుంబములోనివారికి యింక కొంత అందులోనుంచి ఈయ వచ్చును. ఈ గొడ్లకాపరులంత బీదరైతులు, వ్యవసాయకూలీలు, హరిజనులయొక్క కుటుంబములైయున్నారు గాన తకిలీపద్ధతిని ఆచరణలో పెట్టుదురుగాక.

## కాపరి అవలంబింపవలసిన పద్ధతులు

పశువులను మేపు కాపరి తెలివి, సుగుణగణము, పశువులయందు భూతదయ కలిగియుండవలెను. ఇంకను దొంగతనము, దుర్భ్యాసములుగలవాడుగా నుండరాదు. గ్రామాలలోనుండు పశువులకాపరులు వాటిని విడచిపెట్టి హాయిగా పరుండుటయో లేక యేపనిమీదనో షికారులుచేయుటయో గలుగుచుండును. అప్పుడా పశువులు యిరుగుపొరుగు రైతుల పొలములలోనికేగి అచ్చటనున్న మేతను తినుచుండగా, ఆరైతు ఆ పశువును చావగొట్టుటయో లేక ఎవరికి తెలియకుండ ఏ బందెలదొడ్డిలోనో పెట్టుటయో, ఏ దూరప్రదేశమునకో తరుముటయో జరుగుచుండును. కొందరు నౌకరులు పొలములకు తోలుకొని వెళ్ళి పాడిపశువులను దప్పలలో బంతులుకట్టి నూర్చుటయో లేక వర్షాకాలములో పొలములలో దమ్ముచేయుటయో లేక మేతలేని యే పోరంబోకలలోనో అటునిటు త్రిప్పి సాయంకాలమునకు యింటికితోలుకొని పోవుటయో కలుగుచుండును. కాబట్టి రైతులంతా తమ పశువులను కాయువారికి సరియగు క్రమశిక్షణ నిచ్చుదురుగాక.

## పశువుల వయస్సు కనుగొనుట

పశువుల వయస్సును పశువుల శరీరపరిమాణమునుబట్టియు, వాటి పండ్లనుబట్టియు కొమ్ములనుబట్టియు కనుగొనవచ్చును. ఒక సంవత్సరము లేక ఒకటిన్నర సంవత్సరము లేక రెండు సంవత్సరములు కలిగిన దూడలకు వాటి పరిమాణమునుబట్టియే వయస్సును కనుగొనవచ్చును. కొన్నికొన్ని పశువులు చిన్న వయస్సులోనే యుండవలసిన పరిమాణమునకన్న హెచ్చి పెద్దవయస్సుగలవానివలె కన్పట్టుచుండును. ఇట్టి విషయములు చాల

---

కట్టు మునలోదున్ని, నాగలి మొదలుతో చదును చేయుదురు.

అరుదుగ నుండును. కాని అనుభవశాలురు మాడలను చూడగనే వానియొక్క పరిమాణమునుబట్టి వాటి వయస్సు కనుగొందురు.

## కొమ్ములనుబట్టి పరీక్షించు సూత్రములు

పాడిపశువులయొక్క వయస్సు కనుగొనుటయందు మాత్రము వానియొక్క కొమ్ములే మనకు ముఖ్యాధారములు. కాని చాలాపశువులకు కొమ్ములను నరుకుట వలన వానియొక్క వయస్సును సులభముగా కనుగొనుట కష్టము.

పశువు పుట్టిన 1½ సంవత్సరము లేక 2 సంవత్సరములవరకు కొమ్ములు త్వరగ పెరుగును. తరువాత నెమ్మదిగా పెరుగుచుండును.

మూడుసంవత్సరముల వయస్సువచ్చినప్పుడు కొమ్ములయొక్క మొదలునందు ఒక గుండ్రని చారవంటి వలయమేర్పడును. అప్పటినుండి ప్రతిసంవత్సరము ఒక వలయము ఏర్పడును. ఆ వలయములు ఎద్దు కొమ్ములమీదకంటె ఆవుకొమ్ములమీద స్పష్టముగా కనపడును.

అయినను ఎద్దుయొక్క కొమ్ములమీదనున్న వలయములసంఖ్య రెండు కలిపిన యెడల దాని వయస్సును తెలిసికొనవచ్చును. పశువు కొమ్ములమీద నాలుగు వలయము లుండిన దానికి రెండు కలిపినయెడల ఆరు అగును. కావున ఆ పశువుయొక్క వయస్సు 6 సంవత్సరము లగును. ఈవిధముగా లెక్కించవలెను. కాని కొందరు బేరగాండ్రు తక్కువ సంవత్సరములున్నవని తెలుపుటకు పశువుల కొమ్ములను చిత్రికపట్టించుదురు. కాబట్టి జాగ్రత్తగా పరీక్షించి కొనవలెను.

## పండ్లనుబట్టి పరీక్ష

పశువునకు సామాన్యముగ క్రింది దౌడలయందు 20 పండ్లును, పై దవుడయందు 12 పండ్లును యుండును. క్రిందిదౌడకు ముందుభాగముననుండు పండ్లకు కత్తెరపండ్లందురు. పై దవుడయొక్కయు క్రింది దవుడయొక్కయు వెనుకపండ్లను దంతములందురు. కత్తెరపండ్ల సహాయముచేత పశువుయొక్క వయస్సు కనుగొనవచ్చును. ఆవుల పైదౌడయందు కత్తెరపండ్లుండవు. దూడకు పుట్టినప్పుడే చిగళ్ళలోనుండి కొంచెము కొంచెముగా పాలపండ్లు కనబడును. క్రమముగా ఆ పండ్లుపోయి స్థిరమగు పండ్లు వచ్చును. స్థిరమగుపండ్లు పాలపండ్లకంటె ప్రమాణమున పెద్దవిగ నుండును. పుట్టినపుడు దౌడయందు రెండుపాలపండ్లుండును. రెండవ వారమునకు 4ను, మూడవవారమునకు 6 న్ని వచ్చును. ఇట్లొక నెలలో 8 వచ్చును 6 నెలలవరకు ఈపండ్లు శుభ్రముగా సమానముగా నుండును. తరువాత రంగుమారి అరుగుట మొదలుపెట్టును. 8వ నెలలో మొదటనున్న రెండుపాలపండ్లు అరుగును. సంవత్సరమునకు 4 అరుగును. 15 నెలలకు 6 అరుగును. 2 సంవత్సరములకు 8 అరుగును. మధ్యనున్న రెండు పాలపండ్లూడి క్రొత్తవి వచ్చును. 3 సంవత్సరములకు 4 ను, 4 సంవత్సరములకు 6 ను, అయిదు సంవ

గడ్డిని తెగకొట్టేటట్టు దున్నరాదు.

త్సరములకు 8 పండ్లును వచ్చును. అచ్చటనుంచి మగల పండ్లూడును. ఈరీతిగా జరుగు పండ్లనుబట్టి వయస్సు కనుగొనవచ్చును.

## ప్రాచీన ఋషుల బోధ

ఆపస్తంబమహాముని గోజాతులనుగూర్చి చెప్పుట.

ప్రథమా గౌరకపిలా ద్వితీయా గౌరపింగళా
తృతీయా రక్తకపిలా చతుర్థా నీలపింగలా

మొదటిజాతి గౌరకపిల, రెండవజాతి గౌరపింగళ, మూడవది రక్తపింగళ, నాల్గవది నీలపింగళజాతి.

పంచమీ శుక్లపింగాక్షీ షష్ఠీతు శుక్లపింగళా
సప్తమీ చిత్రపింగాక్షీ అష్టమీం బభ్రురోహిణీ

అయిదవది శుక్లపింగాక్షిజాతి, ఆరవది శుక్లపింగళజాతి, ఏడవది చిత్రపింగాక్షి, ఎనిమిదవది బభ్రురోహిణిజాతి.

శ్లో॥ నవమా శ్వేతపింగాక్షీ దశమీం శ్వేతపింగళా
తాదృశాస్తే వ్యనడ్వాహః కపిలాస్తుప్రకీర్తితాః

తొమ్మిదవది శ్వేతపింగాక్షి, పదియవది శ్వేతపింగళజాతి. ఈరీతిగానే వృషభములకుగూడ కపిలాది జాతులుగా చెప్పబడినవి.

## ఎటువంటి వృషభములతో పనిచేయింపరాదు.

పరాశరమహర్షి బృహత్పరాశరసంహితలో చెప్పుట.

నాంగం వ్యాధిసంయుక్తం ప్రాణహీనంచ దుర్బలం
క్షుద్యుక్తం తృషితం శ్రాన్త మనడ్వాహం నవాహయేత్.

అవయవముల లోపములు గలిగినట్టిదియు, వ్యాధిగ్రస్తమైనట్టిదియు, హీనప్రాణము గలిగినట్టిదియు, బలములేనిదియు, ఆకలిగొనినట్టిదియు, అలసిపోయినట్టిదియు నగు ఎద్దును కొనరాదు. పని చేయింపరాదు.

## దృఢమైన అవయవములు, సుడులుగల ఎద్దే శుభము నిచ్చును.

వామావర్తై ర్వామే దక్షిణపార్శ్వేచ దక్షిణావర్తైః
శుభదా భవన్త్యనడుహో జంఘూభి శ్చైణక నిభాభిః.

---

ఎద అదను అయినప్పుడు వెలుగులోనయినా చల్లవచ్చును.

ఎడమవైపున ఎడమనుడి, కుడివైపున కుడినుడియు గలిగి లేడి పిక్కలవంటి పిక్కలుగల వృషభములు శుభము నిచ్చును.

వైడూర్యమల్లికాబుద్బుదేక్షణాః స్థూలనేత్రవర్ష్మాణః
పార్ష్ణి భిరస్ఫుటితాభిః శస్తాః సర్వేఽపిభారవహాః.

వైడూర్యము, మల్లికము, నీటిబుగ్గవంటి కన్నులు గలవియు, స్థూలమగు కనురెప్పలును, బ్రద్దలుకాని మడిమలు గల వృషభములు మంచివి. ఇవి బరువులనుకూడ మోయును.

నాసికమీద ముడుతలుండుట మంచిది.

ఘ్రాణోద్దేశే సవళిః మార్జారముఖః సితదక్షిణతః
కమలోత్పలలాక్షాభః సువాలధి ర్వాజితుల్యజవః.

నాసికమీద ముడతలుండినను, పిల్లిముఖమువంటి ముడతలుగలదియు, ఆముఖము కుడివైపు తెలుపుగ నుండినదియు, కలువతామరపువ్వు, లక్కరంగుగలదియు, మంచి తోకగలదియు, గుఱ్ఱమువంటి వేగము గలదియు నగు వృషభము శ్రేష్ఠమైనది.

గుఱ్ఱముతో సమానమైన వడిగల వృషభము శ్రేష్ఠమైనది.

లంబై ర్వృషణై ర్మేషోదరశ్చ సంక్షిప్త వంక్షణక్రోడః
జ్ఞేయోభారాధ్వసహో జవేఽశ్వతుల్యశ్చ శస్తఫలః

వ్రేలాడు వృషణములు గలది, మేకయుదరమువంటి యుదరముగలది, సంక్షిప్తమైన తొడల సందులుగలది, రొమ్ముగలది, ఎక్కువ బరువులు మోయునది, చాల దూరము నడచునది, గుఱ్ఱముతో సమానమైన వేగముగలదియు నగు వృషభము మంచి లాభము కలుగజేయును.

పెద్దముఖముగల వృషభమునకు హంసయని పేరు.

సితవర్ణః పింగాక్షః తామ్ర విషాణేక్షణో మహావక్త్రః
హంసోనామ శుభఫలో యూధస్య వివర్ధనః ప్రోక్తః

తెలుపురంగును, పచ్చని కన్నులుగలది, ఎరుపురంగు కొమ్ములు, రక్తపురంగు నేత్రములు, పెద్ద ముఖముగల వృషభమునకు హంస యని పేరు. ఇటువంటి వృషభము తన యజమానుని వేగముగా లక్ష్మీసంపన్నునిగ జేయును. ఆ యజమాని మందగూడ వృద్ధియగును.

---

భూమిని తాకు తోకగల వృషభము మంచిది.

భూస్పృగ్వాలధి రాతామ్రమవంక్షణో రక్త దృక్కకుద్మీచ
కల్మాషశ్చ స్వామిన మచిరా త్కురుతే పతిం లక్ష్మ్యాః

భూమిని స్పృశించు వాలము, వృషభమునకు దిగువ ముందర కాళ్ళమధ్యనుండు సలమాను, కన్నులు, మూపురము, ఎరుపురంగుగ నుండు వృషభము యజమానునికి లక్ష్మీ ప్రాప్తిని జేయును.

దేహమంత నొకరంగును ఒకకాలు తెలుపుగల వృషభము శ్రేష్ఠమైనది.

యోనా స్సితైక చరణో యథేష్టవర్ణశ్చ సోఽపి శస్తఫలః
మిశ్రఫలోఽపిగ్రాహ్యో యది నైకాంత ప్రశస్తోఽస్తి.

ఏ వృషభము యొక్క కాలు తెలుపుగానుండి శరీరమంతయు మరియొక రంగు కలదిగా నుండునో ఆ వృషభము మంచి ఫలము నిచ్చును. బాగుగా తెలుపుగా నుండక మిశ్రమ రంగుగా నున్నను శ్రేష్ఠమైనదిగా నుండును.

వృషభముయొక్క శరీర కొలతలు

పరిణాహో వృషముఖా దుదరేతు చతుర్గుణః
సకస్త్రిగుణోచ్ఛ్రంతు సార్ధత్రిగుణదీర్ఘతా.

వృషభముయొక్క ముఖమానముకంటె చతుర్గుణము, ఉదరముయొక్క చుట్టు కొలత, ముఖమానముకంటె త్రిగుణము, ముందరి డెక్క మొదలు మూపురముపరకు ఎత్తు సాఫు మూడున్నర గలిగియుండవలయును.

సప్తతాలో వృషః పూజ్యో గుణై రేభి ర్యుతో యది
తస్యాపినచలైర్మందస్సు వోఢా హ్యాంగసుందరః.

ఏడడుగులు ఉన్నతమైనను పైన చెప్పిన లక్షణములే, కలిగియుండినను, బొడ్డు యొక్క చలనము చేత మందగమనము గలదియు, బరువు బాగుగా మోయునదియు, అందమైన అవయవములు గలదియు

జాతిక్రూర స్సుపుష్టశ్చ వృషభ శ్రేష్ఠ ఉచ్యతే
త్రింశద్యో జనగంతావా ప్రత్యహం భారవాహకః.

ఇతర వృషభముల ధిక్కరించునదియు, బలిసినదియు నగు వృషభము శ్రేష్ఠము, పూజనీయమును నగును. ముప్పది యోజనములు ప్రతిదినము నడచునదియు

నూతిని నీవు రక్షించితే నూయి నీపాట్టను రక్షించును.

నవతాల్పసుదృఢ స్సుముఖో ష్ఠః ప్రశస్యతే
వృషస్యాష్ఠౌసితాదంతా చతుర్ధేబ్ధేఖిలాస్మృతా.

తొమ్మిది అంగుళ పాదవుగలదియు, మిక్కిలి దృఢమైనది, యోగ్యమైన ముఖము పెదవులు గల వృషభము చాల మంచిది.

## ఎట్టి వృషభములు మంచివికావు ?

వృషభో ప్యేవం స్థూలాతిలంబవృషణః సిరాతత క్రోడః
స్థూలసిరాచితగండ స్త్రిస్థాసం మేహతే యశ్చ.

స్థూలమై మిక్కిలి వ్రేలాడుచుండు వృషణములుగలదియు, ముందర జబ్బలమధ్య నరము లగపడుటయు, గండస్థలమువద్ద నరములు బయటపడుటయు, మూడుచోట్ల మేహాన మొనర్చునదియు,

## ఎక్కువగా శ్వాసను పీల్చు వృషభము మందను మాపును.

మార్జారాక్షః కపిలః కరటో వా నశుభదో ద్విజస్యేష్టః
కృష్ణౌష్ఠతాలుజిహ్వః శ్వసనో యూధస్య ఘాతకరః.

పిల్లికన్నులవంటి కన్నులుగలవి, కపిలరంగుగలవి, నగు వృషభములు మంచివి కావు. నలుపుపెదవులు, దౌడలు, నాలుకగలవియు, ఉచ్ఛ్వాసనిశ్వాసములు తరచుగా విడచునవియు నగు వృషభములు మంచివికాక మందలనుకూడ మాపును.

## పేడ ఎక్కువగావేయు వృషభమును విడిచిపెట్టవలయును.

స్థూలశకృన్మణిశృంగః సితోదరః కృష్ణసారవర్ణశ్చ
గృహజాతోఽపి త్యాజ్యో యూధస్య ఘాతకరః

విశేషముగ పేడ వేయునవియు, కొమ్ములచివర ఉండవలె నుండునవియు, తెలుపురంగుగల కడుపుగలిగి మిగిలిన శరీరము నలుపు ఎఱుపురంగులు కలిగియుండునవియు నగు వృషభము లింటబుట్టినను విడిచిపెట్టవలయును. మందలనుకూడ పాడు చేయును.

## నలుపురంగు మచ్చల వృషభముల కొనరాదు.

శ్యామకపుచ్ఛచితాంగో భస్మారుణసన్నిభో బిడాలాక్షః
విప్రాణా మపి నశుభం కరోతి వృషభః పరిగృహీతః.

---

లావులేని ఏను లేగలేని యావు నిష్ప్రయోజనము.

దేహమందంతట నలుపురంగు పువ్వులవంటి మచ్చలుగలవియు, భస్మమువలె ఎరుపురంగుగలవియు, పిల్లికన్నులవంటి కన్నులుగలవియు నగు వృషభములు మంచివి కావు.

యే చోద్ధరంతి పాదాన్ పంకా దివ యోజితాః కృశగ్రీవాః
కాతరనయనా హీనా శ్చ పృష్ఠత స్తే నభారసహాః.

తోలునపుడు బురదలోనుండి లాగుకొనునట్లు కాళ్ళీడ్చునదియు, చిక్కిన మెడ గలదియు, భయస్వభావ మగు కన్నులుగలదియు, తక్కువ ఆసనముగలదియు నగు యెద్దు బరువులు మోయజాలదు.

## మంచి గోవు లక్షణములు.

మృదు సంహతతామ్రోష్ఠా స్తనుస్నిచః తామ్రతాలుజిహ్వాశ్చ
తను హ్రిస్వోచ్చశ్రవణాః సుకుక్షయః స్పృష్టజంఘాశ్చః.

మృదువుగానుండి కలసిన ఎరుపురంగుగల పెదవులు, చిన్న పొత్తికడుపు, ఎర్రని దవుడలు, నాలుక, సన్నమై మృదువుగానుండి వాలక నిలువుగానుండు చెవులు, మంచి కడుపును, స్పష్టమైన పిక్కలు.

ఆతామ్రసంహతఖురా వ్యూఢోరస్కా బృహత్కకుద్యుక్తాః
స్నిగ్ధ శ్లక్ష్ణ తనుత్వగ్రోమాణః తామ్రతనుశృంగాః.

కొంచె మెరుపురంగు, ఒండొంటితో కలిసియుండు డెక్కలు, విశాలమైన వక్షము, గొప్ప మూపురము, నునుపై మృదువై సూక్ష్మమైయుండు చర్మము, వెండ్రుకలుగలవి, ఎరుపురంగుగల చిన్న కొమ్ములు,

తనుభూస్పృగ్వాలధయో రక్తాంతవిలోచనా మహోచ్ఛ్వాసాః
సింహస్కంధా స్తన్వల్ప కంబళాః పూజితాః సుగీతాః

నడచునపుడు భూమికి తగిలీతగలని తోక, కొసలు ఎరుపుగు జీరగల కన్నులు, ఎక్కువగా ఉచ్ఛ్వాసనిశ్వాసములు విడుచునవి, సింహమువంటి వెన్నెముకగలది, పెద్ద కుత్తుక గంగడోలు గల గోవులు శ్రేష్ఠములైనవి.

## ఆక్షేపణగల గోవులు

సాస్రావిలరూక్షాక్ష్యో మూషకనయనాశ్చ నశుభదా గావః
ప్రచలచ్చిపిటవిషాణాః కరటాః ఖరసదృశవర్ణాశ్చ.

---

గొఱ్ఱెల వెంట యేడాది, ఆవుల వెంట ఆఱేండ్లు.

ఎరుగార్చుచు రక్తముగలిగిన నేత్రములుగలవియు, ఎలుక కన్నులవంటి కన్నులు గలవియు, నగు గోవులు శుభములు కియవు. కదలుచున్న కొమ్ములు గలవి, చప్పి కొమ్ములుగలవి, కష్టముగ పాలు పితుకదగినవి, కాకి, గాడిదరంగుగలవి మంచివి కావు.

దశ సప్త చతుర్దంత్యః ప్రలంబ ముండాననా వినతపృష్ఠాః
హ్రస్వస్థూల గ్రీవా యవమధ్యా దారితఖురాశ్చ.

పది, ఏడు, నాలుగు దంతములుగలవి, పొడుగుగానుండు నోరు, ముట్టెగలవి, వంగిన పృష్ఠభాగముగలవి, పొట్టిగాను స్థూలముగానుండు గంగడోలుగలవి, సూత్న్మ మగు నడుముగలవి, బ్రద్దలైన డెక్కలుగలవి మంచివికావు.

శ్యామాతిదీర్ఘ జిహ్వా గుల్ఫైరతితనుభి రతిబృహద్భి ర్వా
అతికకుదః కృశదేహా నేష్టా హీనాధికాంగ్యశ్చ.

కపిలరంగుగలిగి మిక్కిలి పొడుగు నాలుకగలవి, పెద్దమూపురముగలవి, పరిమాణముకంటె తక్కువ అంగముకలవియు నగు గోవులు మంచివికావు.

## పశువునుకొని ఇంటికి తీసికొనివచ్చు చక్రము

| తిథి | వారము | నక్షత్రములు |
|---|---|---|
| పాడ్యమి | — | — |
| విదియ | సోమ | స్వాతి |
| తదియ | బుధ | — |
| పంచమి | — | పునర్వసు |
| షష్టి | బుధ | — |
| సప్తమి | గురు | శ్రావణము |
| దశమి | శుక్ర | ధనిష్ఠ |
| ఏకాదశి | — | — |
| ద్వాదశి | శని | — |
| చతుర్దశి | — | శతభిషము |

## ముక్కును కుట్టుట

తృతీయేఽహ్ని చతుర్థేవా యద్వైవోక్షా దృఢోభవేత్
తదా నసాతు భేత్తవ్యా నైవప్రాగ్ దుర్బలస్యచ.

---

దూడ దగ్గరనుంటేకాని పాలపశువు పనికిరాదు.

మూడవ దినమందుగాని, నాల్గవదినమందుగాని, వృషభము ఎప్పుడు బలముగా ఉత్సాహముగా నుండునో అప్పుడు ముక్కును పట్టవలయును. దుర్బలముగా నుండు నపుడు పట్టరాదు.

నాసావేధనకాలంతు ఖాదిరం వాధశ్శైశపం
ద్వాదశాంగుళకం కార్యం తజ్జ్ఞైస్త్రీణి సమేచవా.

ముక్కు కట్టుటకు చంద్రకర్రనైనను, ఇరుగుడుకర్రనైనను పండ్రెండంగుళముల పొడవుగలదానిని ఉపయోగించవలయును.

## పశువులను యాత్రలకు తీసికొనిపోవునపుడు ముహూర్తచక్రము

| తిధి | వారము | నక్షత్రములు |
|---|---|---|
| పాడ్యమి | సోమవారము | పూర్వాభాద్ర 3 వ పాదం |
| విదియ | మంగళవారము | జ్యేష్ఠ, ధనిష్ఠ |
| తదియ | — | — |
| పంచమి | బుధవారము | మృగశిర, రేవతి |
| సప్తమి | గురువారము | అశ్వని, విశాఖ |
| దశమి | శుక్రవారము | ఆశ్లేష |
| ఏకాదశి | శనివారము | — |

## గోక్రయవిక్రయ ముహూర్తచక్రము

ఈ దిగువ చక్రములోనున్న తిధులు, నక్షత్రముల ప్రకారము క్రయ విక్రయములు జరుపుటమంచిది.

| తిధి | వారము | నక్షత్రములు | |
|---|---|---|---|
| పాడ్యమి | సోమ | హస్త | అశ్వని |
| విదియ | మంగళ | పుష్యమి | పునర్వసు |
| తదియ | బుధ | రేవతి | కృత్తిక |
| చవితి | గురు | జ్యేష్ఠ | మృగశిర |
| పంచమి | శుక్ర | [illegible] | ధనిష్ఠ |

పశువుల పేడను పిడకలరూపముగా కాల్చుట బహునష్టము.

## పశువులను సంతలకు, యాత్రలకు తీసికొనివెళ్ళునపుడు ముహూర్తచక్రము

| తిథి | వారము | నక్షత్రములు |
|---|---|---|
| పాడ్యమి | — | అశ్వని, భరణి, కృత్తిక |
| విదియ | సోమవారము | మృగశిర, ఆరుద్ర, పునర్వసు |
| తదియ | — | — |
| పంచమి | మంగళవారము | పుష్యమి, ఆశ్లేష, మఖ |
| షష్టి | బుధవారము | — |
| సప్తమి | గురువారము | పూర్వాభాద్ర, హస్త 3 వ పాదం |
| దశమి | శుక్రవారము | — |
| ఏకాదశి | — | జ్యేష్ఠ, అనూరాధ |
| ద్వాదశి | శనివారము | — |
| త్రయోదశి | — | మృగశిర, శతభిషం, రేవతి |

## మంచి గోవు లక్షణములు

తల:—అంత పెద్దదిగ, అంత చిన్నదిగ నుండరాదు.

నొసలు:—విశాలముగ నుండవలెను.

కన్నులు:—సొగసుగానుండి మిగుల చిన్నవిగాగాని, చాల పెద్దవిగాగాని యుండక సామాన్యముగా నుండవలెను. గుంటలుపడక చక్కగా కనపడుచు శాంతి సూచకములయిన కళలుకలిగియుండుట మంచిది.

మెడ:—పొట్టిగ లావుగ నుండవలెను.

ముక్కు రంధ్రములు:—కోసుగా పొడవుగా నుండవలెను.

కొమ్ములు:—వెనుకవులిరిగి యుండవలెను. ముందుకు పొడుచుకొనివచ్చిన కొమ్ములుగల ఆవులతోగూడ కొన్ని మంచివియుండుటకూడ గలదు.

కాళ్ళు:—పొట్టిగ వంకరలేకుండ నుండవలెను. ముంగాళ్ళు వెడల్పుగలిగి కండ బట్టి యుండవలెను.

తోక:—సన్నముగా పొడవుగానుండి నేలమతగులునట్లుండవలెను. తోకచివర చక్కని పెద్దకుంచవలె యుండవలెను.

వీపు:—మూపురముప్రక్క కొంచెము పల్లముగా నున్నను వీపు చదునుగా నుండవలెను.

వెండ్రుకలు:—సన్నముగా మెత్తగా నిగనిగలాడుచు నుండవలెను.

---

ఒక జతపశువులకు సుమారు 60 చ॥ అడుగుల వైశాల్యమవసరము.

శరీరము:—పొడవుగా నుండవలెను. తోకవైపు శరీరము మూపురమునకు సమానమైన ఎత్తుండవలెను.

తొంటి:—విశాలముగా నుండవలెను.

తొడలు:—ఒకదానికొకటి యొరసికొని పోయినట్లుండక విడిగా నుండవలెను. ఇట్లున్నచో మంచి పొదుగేర్పడును.

అవయవములు:—వదులుగా విశాలముగా నుండవలెను. దానిపై కండ వ్రేలాడుచుండవలెను.

పొదుగు:—పెద్దదియై ముందునుండి వెనుకవైపునకు చాలావరకు వ్యాపించి పెద్ద సంచివలె నుండవలెను. పాలుతీసినతరువాత పొదుగు పూర్తిగా ముడతలు పడవలెను. మాంసపూరితములైన అనగా కండపొదుగులు అంత మంచివికావు. చూచుటకు అవి అందముగానుండును గాని పాల నంతగా ఈయజాలవు. కండపొదుగునుంచి పాలు తీసినతరువాత ముడుచుకొనినయెడల ఆ పశువు మంచిదికాదు.

స్తనములు:—నాలుగు సమానమగు దూరములో నుండవలెను. ముందువైపు స్తనములు వెనుకవానికంటె నిండుక పొట్టిగ నుండవలెను. మూడు, ఒకటి, చన్నులు గల పశువులంత శ్రేష్ఠమైనవికావు, కొరివి చన్నులుగలవానిని కొనరాదు.

## ఈదిగువ స్వభావముగల ఆవులుకూడ మంచివి-

పాలిచ్చు ఆవు అందముగా శాంతముగా తగినంత ఓపికతో మచ్చికతో నుండును.

పొడుచునవి బుసకొట్టునవి ఎగజేస్తుచుండును.

తొలుచూలు యీతయీనిన ఆవు చిరాకుగానుండును. లేత ఆవును కొనుటయే మంచిది. ఈయావు అయిదారు యీత లీనినప్పటికి అధర కమ్మువచ్చును. రెండవ ఈతకు పాల నెక్కువ యిచ్చును. ఈతలీనిన ఆవును కొనినచో సరిగా పాలీయక యీతలుడిగి పనికిరాలినదగును.

ఆవు లనేకరకములుగా పాలిచ్చును. కొన్ని నాలుగు మరికొన్ని ఎనిమిది సంవత్సరముల వరకు పాలనిచ్చును. నాలుగు యీతలుదాటినకొలది పాలుతగ్గును.

ఆవు వయస్సు వృద్ధియైనకొలది ఆహారమెక్కువగా తిని పాలు తక్కువగా నిచ్చును.

ముఖము, మెడ, భుజములు, తొంటి, కాళ్ళు వగైరా అవయవములమీద రక్షలు వేసిన ఆవులను కొనరాదు.

నెలలురాకమునుపే దూడలను పారవేయు పాడిపశువులను కొనరాదు.

---

వేపపిండి పశువుల ఎరువుకు సమానము.

## వృషభముల కుండవలసిన విషయములు.

తల:—పెద్దదిగా నుండవలెను.

చెవులు:—మృదువుగానుండి నిక్కబొడుచుకొని యుండవలెను.

కన్నులు:—అంత పెద్దవిగాగాక అంత చిన్నవిగాగాక మధ్యరకముగా నుండి లేడికన్నులవలె నుండుట మంచిది. రెండుకన్నుల మధ్యభాగము విశాలముగానుండి క్రమక్రమముగా ముక్కురంధ్రములవరకు కొనతేరియుండవలెను. కనుగ్రుడ్లు లోతుగా గాని మిడిగ్రుడ్లుగా గాని యుండక సాధుత్వము చురుకుదనము గలిగి చకచకలాడుచుండవలెను.

ముక్కురంధ్రములు:—పెద్దవిగానుండి తెరుచుకొనియుండవలెను.

దౌడలు:—ఎరుపురంగుకలిగియుండి దృఢముగా నుండవలెను.

కొమ్ములు:—సన్నముగా దృఢముగా నుండవలెను.

మూపురము:—పెద్దదిగానుండి పురుషచిహ్నము కలిగించునదిగాను, మధ్య వీపావలె గుండ్రముగా నుండవలెను.

మెడ:—బలముగలిగి తలవంచినపుడు కొలువవలె నుండవలెను. ఇంకను పొట్టిగ లావుగ దృఢముగా నుండవలెను.

వక్షస్థలము:—విశాలముగా నుండవలెను.

నాలుక:—సన్నముగా కాంతిగా నుండవలెను.

చర్మము:—నునుపుగా నుండవలెను. మూపురము మొదలు తోకముడివరకు మిట్టపల్లములులేక సమానముగా నుండవలెను.

కాళ్ళు:—నాలుగు కురచగానుండి గట్టి ఎముకలు గలిగి యుండవలెను. తొడలు బలముగలిగి నరములతో కూడియుండవలెను. డెక్కలు కఠినముగను నలుపుగను గుండ్రముగ విడివిడిగ నుండవలెను.

తోక:—భూమిపైకి వ్రేలాడునదిగ నుండవలెను.

గంగడోలు:—చిన్నదిగా నుండవలెను.

రంగు:—తెలుపుగానుండి మూపురము కొంచెము నలుపురంగుగా నుండవలెను. తెలుపురంగుగలవి శ్రేష్ఠమైనవి.

## కోడె లక్షణములు

మెడ:—కురచగా బలముగా నుండవలెను.

ముక్కురంధ్రములు:—కాంతిగా నుండవలెను.

కన్నులు:—విశాలముగా నుండవలెను.

---

దూడతీయగా మిగిలిన ప్రత్తిగింజలను పశువులకు మేపుదురు.

నొసలు:—వెడల్పుగ నుండవలెను.

చర్మము:—కుత్తుకక్రిందనుండి క్రింది పొట్టవరకు గంగడోలు వదులుగా నుండవలెను.

## గేదెకుండవలసిన లక్షణములు.

తల:—చిన్నదిగా నునుపుగా కండగలిగి యుండవలెను.

నొసలు:—విశాలముగా నుండవలెను.

కన్నులు:—చిన్నవిగా సొగసుగా నుండవలెను.

వెన్ను:—లోతుగా నుండవలెను.

కాళ్ళు:—వెనుకకాళ్లకంటె ముందుకాళ్ళు పొట్టిగా నుండవలెను.

కడుపు:—లోతుగా విశాలముగా నుండవలెను.

తోక:—సన్నముగా నుండవలెను. వెంట్రుకలు నలుపుగా బిరుసుగా నిక్కబొడుచుకొని యుండవలెను.

స్తనములు:—సమానముగు దూరములో నుండవలెను. పాలనరములు స్పష్టముగా కనపడవలెను.

కొమ్ములు:—పశువు నిలుచున్నపుడు మనము దానిమీద నీరుపోసినయెడల దాని ముందుకాళ్ళ డెక్కలమీద ఆ నీరు పడకుండ అడ్డముపచ్చునంతవరకు వంకరతిరిగి శరీరము వానుకొనియుండవలెను.

తోకక్రింద గుదస్థానముపైన గుండ్రని కణతులవలె కనిపించిన గేదెను కొనరాదు. వివిధరంగులతో కూడియుండు పొదుగుగల గేదెను కొనరాదు. భుజము పైభాగమున గుంటగానున్న గేదెను కొనుట మహాదోషము.

## దున్నకుండవలసిన లక్షణములు.

తల:—పొడవుగ బరువుగ నుండవలెను.

మూపురము:—చిన్నదిగానుండి వక్షస్థలము విశాలముగా నుండవలెను.

కాళ్ళు:—పొట్టిగ, బలముగలవిగ లావుగ నుండవలెను.

శరీరము:—పొడవుగ మిక్కిలి బలముకలిగి యుండవలెను.

కొమ్ములు:—నిలుచున్నపుడు మనము దానిమీద నీరుపోసినయెడల దాని ముందుకాళ్ళ డెక్కలమీద ఆనీరు పడకుండ అడ్డము వచ్చునంతవరకు వంకరతిరిగి శరీరము వానుకొనియుండవలెను. మంచిదున్నలను కొనవలెననిన వాని కొమ్ములను చూచి కొనవలెను. వాని కొమ్ముల అందమే శుభలక్షణమని గ్రహించవలెను. కొమ్ములు

ఎద్దునకు రోషము కలిగియుండుట ముఖ్యలక్షణము.

రెండును సమానమైన పొడవుగలవై వెనుకకు వంగి వానియొక్క రెండు మొనలు ఒక దాని నొకటి ఎదురుగా నున్నయెడల మంచిలక్షణమందురు. నాలుక బయటపెట్టి త్రిప్పుదానిని పామునాలుక యందురు గాన కొనరాదు.

## ఆక్షేపణగల లక్షణములు

1. ముఖమును నాగలివలె వంచుకొనియుండు పశువును కొనరాదు. పాటుపడక యజమానికి నష్టము కలిగించును.

2. పశువు నిలబడి కాళ్ళు ఎత్తిఎత్తి ముందువెనుకలకు ఊగుచుండునది యింట నున్న మహాదోషము. పశువులకు కీడు.

3. పశువు నిలబడి ఎడమ, కుడిప్రక్కలకు తలను ఆడించుచు ఊగుచుండును. ఈరీతిగా ఏప్రక్కకు ఊగినను యజమానికి నష్టమేగాకుండ పశుపీడ యుండునని వారీతమహర్షి తెలుపుచున్నాడు. దీనినే ఆసుపోయుట యందురు.

4. తోకక్రింద గుదస్థానమునకు దగ్గరగా రెండువైపుల మాంసము అధికముగ కూడుకొనియుండు గ్రంధులవలె కనిపించుదానిని కొనరాదు. ఇట్టివి యజమాని సుఖ సంపదల నశింపజేయును.

5. పశువు అంగిలి నలుపుగనున్నయెడల మహాదోషము. అట్టిదానిని యింట నుంచరాదు. అంగిలి ఎరుపుగానుండి ప్రక్కల నలుపురంగుగానున్న ఆక్షేపణలేదు. అంగిటిమధ్యగా నలుపుగానున్నను మహాదోషము.

6. పశువునోటినుండి ఎల్లపుడు నాలుకబైటికి పోనిచ్చుచు లాగుకొనుచు ఆడించు నది అశుభమును కలుగజేయుటయేగాక యజమాని ఎంత సిరిసంపదలతో తులతూగునో అంత దరిద్రుడగును. సమస్తసుఖముల పోగొట్టును.

7. వికయిన ధ్వని విన్నను వాద్యములు విన్నను నీలిరంగు గొడుగు చూచినను బెదురునట్టి ఎద్దును శత్రువులుకూడ కొనరాదు. ఇట్టిది యజమానికి సుఖము నీయకపోగా కష్టముల కలుగజేయును.

8. లేడికడుపువంటి కడుపుగలది ఎక్కువగా పాటుపడును. కాని బలముగాదు. శక్తిలేనిదిగా నుండును. గాన యిట్టివి మధ్యరకముగా నెంచవలెను.

9. కొంగకాళ్ళవలెనుండు పశువు వికృతాకారముగా నుండును. సత్తువ తక్కు వగా నుండి నడక మందముగా నడచును. ఇదియును మధ్యమ రకమే.

10. కాళ్లు పొడవు వంకరగల ఎద్దు బారుగానుండి పనిచేయజాలదుగాన కొన రాదు. క్రిందను వ్రణములుగలది నడచునపుడు వృషణములు వ్రేలాడుచు కొట్టుకొను చుండుటచే బలము తక్కువగా నుండును గాన కొనరాదు.

---

11. గేదెలమీద ఎక్కునది బలము రాదు. అవృంవక చూపునైన చూడదు. మనస్సు స్థిమితముండదు. పని సరిగా చేయదు. ఇట్టిదానిని దొడ్డిలో నుంచరాదు.

12. ఏ వృషభము ముఖము వెడల్పుగ నుండునో అట్టిది పాడుదని గ్రహించవలెను.

13. గుజ్జువు రొమ్ముగల వృషభము అంగహీనముగ కొంచెము బలహీనముగ నుండి తిన్నను. పశువు వెన్నుపూసలు వంగినయెడల సత్తువలేనిదై పనిలో మందముగా పోవును.

14. కాళ్ళు ఈడ్చునది నడకసాగక మిగుల మందముగా పోవును.

15. ఏ పశువు చెవులు మిక్కిలి పెద్దవిగా నుండునో అట్టిది సోమరిగ తక్కువ నడకగలదిగ నుండి పనిచేయజాలదు.

16. తోకవెండ్రుకల మచ్చ అధికముగనుండి చిన్నచెవులుగల పశువు సిరిసంపదలు కలుగజేయును.

17. ఏ ఎద్దునడు పిల్లగిట్టలు నడచునపుడు కాలికి కొట్టుకొనుచుండునో అట్టిది గిట్టలరాపిడివలన రక్తము కారుచుండును. ఇట్టిదానిని ఎవరు కొనరాదు.

18. అన్ని అవయవములు శరీరము గట్టిగానుండి పొడవు తక్కువగానుండు పశువు మిక్కిలి బలముగలదై సమస్తముగు పనిపాటలయందు పేరొందును.

19. ఏపశువుయొక్క నొసలు వెడల్పు పుష్టిగనుండునో అట్టిపశువు రూపము బలముగలదిగా నుండి మార్గమున మహావేగమున పోవును.

20. లేడికన్నులుగల పశువు మంచిదికాదు. గచ్చకాయ, గోరోచనము, పొగ గలసినట్టి రంగులుగల కన్నులు అశుభమును కలుగజేయును.

21. ఒకకన్ను గచ్చకాయరంగు మరొకకన్ను శ్యామ లేక గోరోచనపు రంగు గల కన్ను రెండవకన్ను నలుపురంగుగనున్న యెడల ఆక్షేపణ. ధనధాన్యముల నశింపజేయును.

22. పువ్వువేసిన కాయకాచిన కన్ను గ్రుడ్డుకారిన కన్నులుగలవి జబ్బుగా నుండవు. పిల్లికన్నుగల దానిని విడిచిపెట్టుము. కనుగొలుకులు తెలుపు నలుపు రంగుగా నున్న మహాదోషము. కనురెప్పలు నలుపు తెలుపురంగు కలసియున్న ఎద్దు అపకారి యని తలంచుము. ఏనుగు కన్నులవంటి కన్నులు (సూక్ష్మమగు కన్నులు) గలది పాడచును. దీని నేత్రములు కొంచెము ఎరుపుగానున్న మహాక్రోధము, చురుకుగలదిగా నుండును. ఈ లక్షణములుగలవి శుభము అశుభములగూడ కలుగజేయును.

23. గిట్టలు వ్యాపించినకాలది పంగగిట్టలుగా నుండును. ఇట్టిది నడక మందముగానుండి తటుచుండును. ఆక్షేపణయే.

---

పశువులు తిండిని బాగుగా తినుటకూడ ఒక మంచిలక్షణము,

24. గిట్టలు వెడల్పుగనుండి వంకరలు తిరిగి యుండినయెడల శక్తిలేనిదిగ నుండును. పలుచని గిట్టలది బలములేనిదిగా నుండి ఎండలో ఇసుకమీద నడువజాలదు. అరిగిన గిట్టగలది పుండ్లుపడును. తెలుపు ఎరుపు పింగళరంగులు కలసిన గిట్టలుగల పశువు పనిచేయజాలదు.

25. పశువు నడచునపుడు ముందు అడుగునకంటె వెనుక అడుగు ముందునకు వేయుచు నడచుచుండినయెడల ఆఎద్దు చాలామంచిది. గీరిపోయిన గిట్టలుగలది పైకి లేచిన గిట్టలుగలది మంచిది. సగముగిట్టలుగల ఎద్దు సరిగా నడువజాలదు. గిట్టలనుగుచ్చి నడచునది అంత మంచిదికాదు. కలిసిపోయిన గిట్టలుగలది పనిచేయజాలదు.

## కొమ్ముల శుభాశుభ లక్షణములు

1. కిరీటమువలె కొంచెము వెనుకకు వంగిన కొమ్ములుగల ఎద్దు అతివేగముగా నడచును.

2. సూదికొమ్ములుగలది శక్తిగలదిగా బాగుగా పోట్లాడునదిగ నుండును.

3. కత్తెరకొమ్ములు, లావుకొమ్ములు, గిన్నెకొమ్ములు, కురుచగా ప్రక్కలకు వాలినకొమ్ములు, తెలుపురంగుకొమ్ములు, నలుపురంగుకొమ్ములు, పసిడిరంగు కొమ్ములు, రాగిరంగు కొమ్ములు, శ్యామలరంగుకొమ్ములు, ఒంటెముచ్చకొమ్ములు, వెనుకకు వంగిన కొమ్ములు, గొర్రెకొమ్ములు, ముఖమువైపునకు వంగియుండుకొమ్ములు, లేడికొమ్ములు, ముందునకు వంగియుండుకొమ్ములు, లేడికొమ్ములు ముందునకు వంగినకొమ్ములు మొదటిలో 25 అంగుళముల పొడవుగల కొమ్ములుగల ఎద్దులు యజమానులకు శుభఫలముల నిచ్చును.

4. పెద్దవిగ పొడవుగ నిలువుగనుండు కొమ్ములుగల వృషభమునకు త్వరలో ప్యయు వచ్చును. చూచుటకు అందహీనముగ నుండును.

5. ఒక కొమ్ము ఆకాశమువైపునకు రెండవకొమ్ము ముందుముఖమువైపునకు యుండుదానిని మొంటి కొమ్మందురు. దీనిని కొనరాదు. యజమాని సుఖసంపదల నశింపజేయును.

6. ఒక కొమ్ము స్వర్గము వైపునకు రెండవకొమ్ము పాతాళమువైపునకు అనగా పైకి క్రిందికి జూచుచున్న కొమ్ములుగల ఎద్దు అశుభము గలిగించును. ఏ రైతు తనఇంట నుంచుకొనునో ఆ రైతునకు దుఃఖము కలుగజేయుటయేగాక సకల ధనములు చోరులు అపహరించుదురు.

7. ముందుకువంగిన కొమ్ములుగలది పనికిమాలినదగును. త్వరలో ముసలిదగును. దీనిపండ్లు గిట్టలుకూడ త్వరగా అరిగిపోవును. ఇది అశుభమును కలిగించును.

8. ఒకకొమ్ము విరిగినఎద్దు మధ్యమము.

---

కొన్నియావులు విస్తారముగా తిండితిని పాలు స్వల్పముగా నిచ్చును.

9. ఒకకొమ్ము పుట్టి రెండవకొమ్ము పుట్టకపోయిన ఎద్దు అశుభము కలుగ జేయును.

10. కొమ్ములుపుట్టక బోడిగానుండు ఎద్దు అంగహీనము గలదిగాన కొనరాదు.

11. కొమ్ములపైన పంగతలగానున్న ఎద్దును కొనరాదు. మహాదోషము.

12. పగిలినకొమ్ములుగలవి వ్యాధులు పుట్టునుగాన చికిత్సచేయవలెను.

13. ఎద్దుగాని బఱ్ఱెగాని రాత్రిఁబవళ్ళు కొమ్ములను గుంజలకు మేకులకు కొట్టునది అశుభము.

14. కొమ్ములుచివర తెలుపురంగుగలది మహాదోషము కలుగజేయును.

15. పెద్దకొమ్ములు గలది ఒకటి వెనుకకు మరొకటి ముందుకకు వంగిన కొమ్ములు గలది, ఎడమచెవిమీదకు వ్రాలినకొమ్ములుగలది, పొట్టేలుకొమ్ములుగలది, ఒంటికొమ్ము గలది, ముఖముమీద మధ్యగానుండు కొమ్ములుగలది, మూపురముమీదకు వాలినకొమ్ములు గలది, పగిలినకొమ్ములుగలది, వంకరకొమ్ములుగలది, పక్షులు నిద్రించుటకు వీలుగానుండు కొమ్ములుగలది ఆ యా యజమానులకు పలువిధములగా నష్టకష్టములు గలుగునని ఒక సంస్కృత పశుశాస్త్రము తెలుపుచున్నదిగాన తెలియదగినదైనది.

16. పశువులకొమ్ముల చివరభాగము తెలుపుగానుండి పొట్టురాలుటయు కొమ్ముల మొదటిభాగమునగాని చివరలనుగాని పేళ్ళుగా చీలికలుగా పగిలి రక్తమువచ్చిన వాటిని కొనరాదు.

17. ఒకకొమ్ము తోలుకొమ్ముగానున్నను రెండుకొమ్ములనుంచి మూతిభాగమువరకు కాటుకరంగు చారలుండినను ఆక్షేపణయే.

## వన్నెలనుబట్టి శుభాశుభ లక్షణములు

1. ఏవృషభమైనను ఒకకాలు తెలుపు దేహమంతయు తదితర రంగులతో కలసి యున్న యజమానికి శుభము కలుగజేయును. ఎక్కువ తెలుపుగా నుండక మిశ్రమ వర్ణముగా నున్నను ప్రశస్తమైనదిగా తలంచవలెను.

2. కలువరంగుగలది, తెలుపురంగుగలది, నువ్వులుబియ్యము కలిసిన రంగువలె మిశ్రమముగా నుండునది తన యజమాని మందను వృద్ధిచేసి లక్ష్మీసంపన్నునిగా జేయును.

3. సగభాగము నీలిరంగు సగభాగము తెలుపురంగుగల ఎద్దు తనయందు దోషము లన్నియు నశించి సకలశుభములను కలుగజేయును.

4. అన్ని అవయవములమీదను తెలుపురంగున్న పశువు శుభము కలిగించును. శరీరమంత తెలుపుగానుండి పసుపురంగుగల వెంట్రుకలు కొన్నియున్నయెడల అట్టి పశువు దున్నునపుడుమాత్రము మందమతిగ నుండును.

---

కొన్నియావులు తిన్నతిండిలో చాలాభాగము పాలుగామారును.

5. తోకక్రింద గుదస్థానము వరకు నీలిరంగువలె నున్న యెడల శుభములనిచ్చును. నేత్రములకు నాలుగుప్రక్కల కాటుకరంగు వెంద్రుకలున్న పశువు బలముగలదిగా నుండును.

6. కాటుకరంగు, నీలిరంగు కలిగి స్నాత్మ్నరోమములుగల ఎద్దు బల మధికముగల దిగా నగును.

7. ఏడుసురచలు, ఏడుఅవయవములలో నలుపురంగున్న ఎద్దు జయము గలిగించును.

8. పసుపుపచ్చరంగు వెంద్రుకలుగల ఎద్దు చురుకుదనము కలిగియుండును.

9. నొసలునుంచి ముక్కురంధ్రములవరకు ఒకవిధమగు ఆయుధమువలె గీతగా రంగున్న యెడల మంచిది.

10. శరీరమంతా తెలుపుగానుండి తోకమాత్రము నలుపురంగుగా నున్న యెడల అధికముగా పాటుపడును.

11. శరీరమంతా ఒకరంగుకలిగి తోకమాత్రము ఎరుపు రంగుగా నున్నను మంచిదియే.

12. సగము ఎరుపు సగము తెలుపు కలసిన రంగుగల ఎద్దు శుభమును కలుగ జేయును.

13. శరీరమంతా తెలుపుగ నలుపుగ మచ్చలున్న ఎద్దుకూడ మంచిదియే. వీపు మెడ, తోక నలుపురంగుగానున్న వృషభము చురుకుగా నడచును. అలసటయుండదు.

14. తెలుపు, నలుపు రంగుగల ఎద్దు మధ్యమముగా నుండును. ఎక్కువ ఎరుపు, ఎక్కువ తెలుపు రంగుగలది సోమరితనముగా నుండును. చిలుక కంఠమునందున్న మాదిరిగా తోక వెంద్రుకలు రెండువరుసలున్న ఎద్దు మహాదోషము.

15. కష్టురంగు పువ్వులుగలది, గజ్జిబట్టగలది చురుకుగనో మందముగనో యుండును. శరీరమంతా పంచరంగులున్న ఎద్దు మధ్యమము. గొర్రెరంగుగలది అశుభము. కాకిరంగుగలది దోషము. పువ్వులవలె మచ్చలుగలది మంచిది. కంచురంగు గలది బంగారుఛాయగలది శుభముల నిచ్చును. శరీరమంత బంగారురంగు కలిగి పాల వలె తెలుపుమచ్చలున్న ఎద్దు చాలా మంచిది. కోతిమైలది మధ్యమము. కత్తిబట్టది, పాలబట్టది, గజ్జిబట్టది, ఎరుపుబట్టది శుభముల కలుగజేయునని వృషకల్పద్రుమము తెలుపుచున్నది.

షరా:—శాస్త్రాధారములేకుండ వివిధరీతులుగా రంగులునడకలు స్వంతపేర్లు పెట్టి కొందరు వృద్ధడాంబిక వైద్యులు పద్యకావ్యముగా వచనముగా వ్రాయు చున్నారు. ఇట్లు వ్రాయుట పొరబాటు. వైద్యపద్ధతులలో అనుభవముండవచ్చునుగాని శాస్త్రాధారము అవుసరములని గ్రహించవలెను.

---

కొరుజొన్న మేసే కోడెకు కైలాసము కావలెనా,

# సుళ్ళపరీక్ష

## శుభమును కలుగజేయునవి

రానురాను సుళ్లనుగూర్చి రైతులలో చాలామందికి నమ్మకము తగ్గినది. కాని ప్రాచీన పశువైద్య సిద్ధాంతముల ననుసరించి సుళ్లను పరీక్షించి తీసికొనుటయే మంచిది. ఈదిగువ సూచించు సుళ్లను శాస్త్రానుసారముగా తెలిపితినిగాన ఇష్టమున్నవారు అమలులో పెట్టుటమంచిది. అనవసరపు తర్కములుచేయక మీకెంతవరకు నమ్మకముగలదో అంతవరకే ఆచరణలో పెట్టమని నా అభిప్రాయము.




సుళ్ళను తెలుపుచిత్రము

1. స్థానపుసుడి 2. ధాన్యపుసుడి 3. ఆసనపుసుడి 4. కవ్వపుసుళ్ళు 5. మూపుసుడి 6. నగరాసుళ్ళు 7. గొలుసుకట్టుసుడి 8. లక్ష్మీసుడి 9. భాషికపుసుడి 10. ఆసనపుసుడి.

### 1. స్థానపుసుడి (బ్రహ్మసుడి)

దీనినే బ్రహ్మసుడి యందురు. పశువు కొమ్ములకు నాలుగైదు అంగుళములు దిగువగా ముఖమందు ఈసుడి యుండును. ఈసుడి నొసటియందుండుటవలన స్థానపు

సుడి లేక తావుసుడి యని పేరువచ్చినది. ఈసుడిలేకుండ ఇతరసుళ్లున్నను అంత మంచిది కాదు. ఈసుడి లేకుండనుండు వృషభమును చూచినను వితంతువుముఖము చూచినను ఒక్కటియేయని తలంచవలెను. ఈసుడియున్న పశువు యజమానికి సర్వసంపదలు సమకూరును.

## 2. ధాన్యపుసుడి (విష్ణుసుడి)

పశువు మూపురము వెనుకభాగమున కొంచెము దూరములో (అనగా 12, 14 అంగుళములలోపల) వెన్నెముకభాగము తొలగక ముందుచూపులో ఈసుడియుండును. గంతకట్టునకు వెలుపలభాగమునను, వెన్నెముకకు ఒకప్రక్కను ఈసుడియున్న మధ్యరకమని గ్రహించవలెను. ఈసుడిగలఎద్దు యజమానికి సస్యాభివృద్ధి, కుటుంబవృద్ధి కలుగును.

## 3. ఆసనపుసుడి (మహేశ్వరసుడి)

వృషభముయొక్క ఆసనపు అడ్డఎముకనుంచి 4 లేక 5 అంగుళములకు దిగువగా ఈసుడి యుండును. ఈసుడి యుండుటవలన యజమానివంశము నదివలెపొంగును.

వృషభమునకుండు ఈ మూడుసుళ్ళ భాగములలోను బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లెల్లప్పుడు నుందురనియు, అట్టిఎద్దును కొనినరైతు కనకధన వస్తువాహనములతో తుల తూగుచుండుననియు అందుచేతనే శివుడుకూడ ఈసుళ్ళుగల వృషభమునే ప్రేమించె ననియు ప్రాచీన ఋషీశ్వరులు తెలిపిరి. ఈ మూడుసుడులలో ఏఒకసుడి లేకపోయి నను కొనరాదని ప్రాచీనశాస్త్రములు తెలుపుచున్నవిగాన నా యభిప్రాయముకూడ నంతియేయని తెలుపుచున్నాడను.

## 4. కవ్వపుసుళ్ళు

వృషభము రొమ్ముభాగమునకు దగ్గరగను, గంగడోలునకు ఇరువైపులను కవ్వపు ఆకారముగా ఈసుళ్ళుండును. రెండువైపుల నుండుటమంచిది. కుడివైపున ఒకసుడి యున్న (కుడినున్న కూర్పవచ్చును) కొనవచ్చును. ఎడమవైపున సుడియున్న (ఎద్దునకు మోసమని) మంచిదికాదని తెలిసికొనవలెను. ఈసుళ్లు ఏప్రక్కనున్నను అక్షేపణలేదని కొన్నిశాస్త్రములు తెలుపుచున్నవి.

## 5. మూపుసుడి

మూపురమునకు ముందుభాగమునగాని, వెనుకగాని, చివరగాని సుడియున్న మూపుసుడియని పేరు. అచ్చట వర్షపునీరు అర్రుమీదికి జారునట్లు సుడినిలిచియుండిన అట్టిపశువు త్రొక్కినభూమి చక్కగా ఫలించును.

---

ఏదో తెగులు రాబోవునని తలనుంచి తోకవరకు వాతలు పెట్టుట క్రూరము.

## 6. నగారాసుళ్లు

పశువు కడపటి బరిఎముకకు పైగా (గంతలోపల) వెన్నుపూసకు రెండువైపుల రెండుసుళ్ళున్నయెడల నగారాసుళ్ళని పేరు. ఆక్షేపణలేదు. ఆసనము మధ్యభాగము నను కాళ్ళ, చంకలలోను సుడులున్న మంచిది.

## 7. తెంపులేని రోమములు.

తోకమట్టనుంచి మధ్యనుగాని చివర వరకుగాని తెంపులేకుండ రోమములు ఎదురొక్కినియున్న గొలుసుకట్టందురు. ఈ సుడిగల పశువు యజమానికి జయము గలుగును.

## 8. లక్ష్మీసుడి.

గంగడోలునకు కొంచెముపైన, మెడకొకప్రక్కను ఈ సుడి యుండును. ఇట్టి సుడిగల పశువు యజమాని సకల భోగముల ననుభవించును. లక్ష్మీయను దేవత మహిమ ఎల్లరకు తెలిసిన విషయమే. ఇట్టి పశువులు అరుదుగా లభించును.

## 9. భాషికపు చుక్క

పశువు నొసటిభాగమునందు స్థానపుసుడి పైనగాని క్రిందగాని నెమలికన్నువలె ఒకదానిపై నొకటి దొంతరగా నిలువుగా నుండును. దీనినే భాషికపుచుక్క అందురు. ఈ చుక్కగలది సర్వసౌఖ్యముల ననుభవించుటయేగాక తన యజమానికి గూడ సర్వ సంపదల గూర్చును. వీటినే దొంతరసుళ్లందురు.

## 10. ఆసనపుసుడి.

ఆసనమునుంచి వృషణములవరకు నుండు భాగములో ఒకసుడియుండును. దీనినే ఆసనపుసుడి యందురు. ఈసుడియున్న యజమానికి జయము గలుగును.

## అశుభమును కలుగజేయునవి.

## 1. తొండపరీసుళ్ళు

తోకమట్టపైభాగమునగాని క్రింద భాగమునగాని, రెండు వైపులలో ఒక ప్రక్కగాని రెండుప్రక్కలనుగాని ఈ తొండపరీసుళ్ళుండును. పైభాగముననున్న తొండసుడి యనియు క్రిందిభాగముననున్న పరీకసుడియనియు అందురు. ఇవన్నియు ఆక్షేపణగలవి.

తోటకు వర్షము, దూడకు గడ్డి.

## 2. మూత్రపు సుడి

ఈసుడి పశువు పొట్టమధ్యభాగమున నుండు గీత మధ్యగా మూత్రకోశమునకు దగ్గరగా ముందుభాగమున నుండును. ఈ సుడికి మరొక గుర్తు కలదు. మట్టిని తీసికొని ఆసుడిమీద వేసి రుద్దినయెడల మూత్రము పోయును. ఇట్టి పశువును కొనిన రైతు సంసారము నాశనమగును.




1 తొండపరీసుళ్ళు, 2 మూత్రపుసుడి, 3 మధ్యసుళ్ళు, 4 సంకెళ్ళసుళ్ళు, 5 ముక్కంటిసుడి, 6 బొడ్డుసుడి, 7 భాషికపుసుడి, 8 గాడిసుళ్ళు 9 కత్తెరసుళ్ళు, 10 గూటపు సుళ్ళు.

## 3. మధ్యసుళ్ళు

ముందు రెండుకాళ్ళ లోపలిభాగమున సుళ్ళున్న మంచిది.

## 4. సంకెళ్ల సుళ్ళు

ఈ సుళ్ళు చెంద్రుకలతో కలసి కాళ్ళయందుండును. ముందు మోకాళ్ళమీద గాని, కాళ్ళకు వెనుక మోకాలి మడతనుంచి పిల్లగిట్టలు దాటకుండగాని, మోకాళ్ల పైభాగమున 8 లేక 10 అంగుళములవరకుగాని ఈసుళ్ళుండును. ఇట్టి సుళ్ళుగల ఎద్దు యజమానికి తప్పక కారాగృహవాసము కలుగును.

---

తులే ఎద్దే శోనె మోసేది.

## 5. ముక్కంటి సుడి

ఈ సుడి నొసటిభాగమున మూడు కోణములు గలిగియుండును. దీనినే శివుని యొక్క మూడవనేత్రమందురు. ఈ కన్ను తెరచిన అన్ని వస్తువులు భస్మమైపోవునట. కాబట్టి ఇట్టి యెద్దును యెవరును కొనరాదు.

## 6. బొడ్డుసుడి

బొడ్డుభాగమున సుడియున్న ఆక్షేపణలేదు.

## 7. భాషికపుసుడి

నేత్రములకు పైభాగమున నొసటియందు భాషికపు ఆకారముగానుండును. స్థానపుసుడికి రెండంగుళముల దిగువగా అడ్డముగా ఒకటి లేక రెండు సుళ్లుండును. ఈసుడిగల ఎద్దునుకొనిన రైతుకు భార్యా వియోగముగాని భార్యను తెచ్చుకొనుటగాని జరుగును. వివాహముకానివారు కొనవచ్చును.

## 8. గాడిసుళ్లు

మెడప్రక్కన సుడియున్న కందసుడియనియు, రెండువైపులనున్నదా వెనసుళ్లనియు, గంగడోలునకు క్రిందిభాగమున సుళ్లున్న గాడి సుళ్లనియు, రొమ్మునకు ఒక వైపున చంద్రుకలతోగూడిన ఒక సుడియున్న కవ్వపుసుళ్లనీ ఒక రకమనియు చెప్పుదురు. ఇవన్నియు ఆక్షేపణయేయని తలంచవలయును. ఎదరొమ్మునకు రెండువైపుల గాని ఒకవైపునగాని తుడిభాగమునందున్న సుడియున్నమంచిది. ఎడమవైపున్న ఆక్షేపణ.

## 9. కత్తెరసుళ్లు

పశువు ఆసనమునుంచి వృషణములవరకు పొడవగు ఈనవలెనుండును. ఈ యీనె అటునిటు తొలగకనుండిన మంచిది. ఈ యీనెకు రెండువైపుల రెండుసుళ్లుండి రెంటి యొక్కచూపు ఈనెకు అడ్డువచ్చినట్లు కన్పట్టిన కత్తెర సుళ్లందురు. ఇవికూడ ఆక్షేపణ యని గ్రహించవలెను.

## 10- గూటపుసుళ్లు

పశువు ఆసనమునకు రెండువైపులనుండు మొరడుల వెలుపల గూటపుసుళ్లుండును. కొన్నిటికి ఒకవైపున మాత్రమే యుండును. ఇవన్నియు ఆక్షేపణయే.

## తదితరసుళ్లు

పశువు వెన్నుభాగమున రెండు చంద్రుకలవరుసయున్న అశుభము.
తలనుంచి తోకవరకు రెండు పాములవలె సళువుగానున్న అశుభము.

---

ఎదురుపిఱ్ఱయొక్క పైభాగమున పాము పడగవలె సుడియున్న అక్షేపణయే. దీనిని నాగుసుడియందురు.

పశువుతోకమట్టక్రింద పేడవచ్చు మార్గమున రెండువైపుల పాము పడగవలె సుడియుండిన దోషము.

ఒకేసుడి రెండుగా ఒకదానిపైనొకటి నొసటి భాగముననున్న జంటసుడి యందురు.

ఈసుడిగల పశువు తన యజమానికి కష్టములు కలిగించును.

ఆర్తిమీద సుడియున్న దోషము

వెన్నుభాగమునకు రెండువైపుల డొక్కస్థానముపైన కురచగానుండు ఎముకల మీద సుడులున్న అక్షేపణయే.

పశువు కడపటి బరిఎముకనుంచి మూడవ నడుముపూసఎముక దాటకుండ వెన్ను భాగమునకు ప్రక్కగాగాని, మీదుగాగాని చీపురుకట్ట ఆకారముగా సుడియున్న పారక సుడియనిపేరు. ఇదికూడ అక్షేపణయే.

పశువు కడపటి బరిఎముకదాటి వెన్నుపూసకు రెండువైపులనుండు సుళ్లకు పాడె సుళ్లందురు. ఈ పశువుగల యజమానికి త్వరలో పాడె గట్టునంత ప్రమాదము వచ్చును.

వెన్నుభాగమునకు రెండువైపుల డొక్కస్థానమునకు పైన కురచగానుండు ఎముకలమీద సుడులున్న అక్షేపణయే.

వెంద్రుకలవరుస ఒకటి మెడటిభాగమునుంచి వెనుక వెన్నుమీదకు తిరుగక యుండును. దీనినే వరుస సుడియందురు. ధననష్టము కలిగించును.

కొమ్ముల చివరభాగమున తెలుపుగా చింతపువ్వు రంగుగల సుడియున్న పూతయందురు. అక్షేపణయే.

దేహమంతయు ఒక రంగుగలిగి యితర రంగులుగల మచ్చ ఎచ్చటనైనను యుండిన యెడల దానిని అగ్నిమచ్చ లేక ఒంటిమచ్చ యందురు. ఇట్టిది అశుభము. ఆ రంగుగల మరియొక మచ్చయున్న యెడల అక్షేపణలేదు. మరియొకమచ్చ లేనప్పటికి ఆ రంగుగల ఒక వెంద్రుకల వరుసయున్నను అక్షేపణలేదు.

పశువు శరీరమునకు రెండువైపుల ఇరువదియారు ప్రక్కటెముకలుండును. వాటిలో మొండిఎముక కనిపించిన మహాదోషము.

కొన్ని పశువులకు కడపటి బరిఎముక, దానిముందర బరిఎముకతో కలియక ప్రత్యేకముగానుండును. దీనినే మోటుబరి యందురు. అక్షేపణయే.

షరా:—ఇంకను అనేక రీతులుగా సుళ్లుగాని, గీతలుగాని అరుదుగా నుండ వచ్చును. మొత్తముమీద పశువులకు 55 సుడులుండును. అనేకమంది అనేక రీతులుగా ఈ సుళ్లకు మారుపేళ్లుపెట్టి పిలుచుదురు. గాన ముఖ్యమైనవాటినే పేర్కొంటిమి. చదువరులు గ్రహించుదురుగాక.

---

## ఏడవ భాగము

# ద్రవ్యజ్ఞానము

ఓషధులయొక్క స్వరూపములు, గుణములు, ఉపయోగములు మోతాదులు తెలిసికొనవలసిన అగత్యత ప్రతిరైతునకు, పశువైద్యులకు చాలా అవసరమైయున్నది. ప్రస్తుతకాలములో గ్రామములలో మామూలుగా పశువులకు వైద్యముచేయువారలలో చాలామందికి ఓషధులయొక్క గుణములుగాని, మోతాదులుగాని చికిత్సలుగాని తెలియక ఎవరి యిష్టము వచ్చినటుల వారు వాడుచున్నారు. అందు వలన తాత్కాలికఫలితము కనుపడినప్పటికిని తరువాత మూలికా ప్రభావముచే తదితర రోగములలోనికి దింపవచ్చును. కాబట్టి పశు సేవచేయవలెనని కోరికయుండువారు ద్రవ్యజ్ఞానమును చదివి అనుభవము సంపాదించవలెనని నాయభిప్రాయము. ఈ యుద్ధపరిస్థితులలో కాగితపు కరువువలన ముఖ్యమగు మూలికలను కొన్నిటినే తెలిపితిని గాన చదువరులు గ్రహించుదురుగాక.

### భూమిని పగల్చుకొని పుట్టునవి.

ఇవి నాలుగు విధములుగ నుండును.

1. ఓషధులు—ప్రతి సంవత్సరము పుట్టి ఫలించి నశించునవి.

2. వనస్పతులు—అనగా వృక్షరాజములు—పూవులు పూయకనే ఫలించు మఱ్ఱి, మేడి, జువ్వి, రావి మొదలగునవి.

3. వానస్పతులు అనగా పూవులు పూసి కాయలు కాచునవి—మామిడి, నేరేడు, దానిమ్మ మొదలగునవి.

4. వీరుధములు అనగా అల్లుకొనునట్టి తీగెలు- పొదలు మొదలగునవి.

---

## జాంగల దేశము

స్వల్పోదకము కలిగి పర్వతములు, మెడారులుగల దేశమునకు జాంగలదేశ మందురు. ఇది వాతభూయిష్టముగా నుండును. అందు జనించునవి వాతాధిక్యతగలవిగ నుండును.

## అనూప దేశము

జలాధిక్యముకలిగి వనము అధికముగనుండి యెండ తక్కువై నిర్మలమైన గాలి లేని దేశము. అందు జనించునవి కఫాధిక్యత గలవిగ నుండును.

## సాధారణ దేశము

వసంతాది ఋతులక్షణములు సక్రమముగ నడచుచు నిర్మలమైన జలాశయములు నిర్మలమైన గాలి తగినన్ని వృక్షములు గలది. ఇందు త్రిదోషములు సమముగ నుండును. కావున ఔషధములను జేయుటకు సాధారణదేశమునుండియే ఓషధులను సంపాదించ వలెను.

## ఓషధులను గ్రహించదగిన ఋతువులు

మార్గశిర పుష్యమాసములందు వచ్చు శరదృతువునందు ఓషధులు సరియైన రసములు కలిగియుండును గనుక సర్వరోగ నివారణార్థము ఈఋతువునందే ఓషధులను సంగ్రహించుట మంచిది. జ్యేష్ఠాషాఢమాసములందు వచ్చు గ్రీష్మఋతువునందు రూక్ష స్వభావముచేత రసహీనములై యుండును. వర్షాకాలమునందు అధికరసము కలిగియుండును గాన అంత గుణవంతములు కావు. విరేచనములకిచ్చు ఓషధులు తీక్ష్ణములై యుండవలెను గనుక వానిని గ్రీష్మకాలమునందే సంపాదింపవలెను.

## ఓషధులను గ్రహించకూడని స్థలములు

పుట్టలు, చెడుస్థలములు, జలముతో నిండియుండు ప్రదేశములు, స్మశానములు, చవిటినేలలు, మార్గమధ్యము, దుష్టజంతువులుండు స్థలములు, కాలినచోటులు, అతి మంచుగల స్థలములు, ఇటువంటి స్థలములందుండు ఓషధులను గ్రహించరాదు. ఇవి మంచిగుణములు ఈయకపోవుటయేగాక చెడుగుణముల నిచ్చును.

---

## సమూలాల సారములు

గుంటకలగర, కలబంద, చేదుపొట్ల, మోడి, నేలవేము, గ్రంధితగరము, చవ్యము, చిట్టీత, గలిక, గొంతెమగోరు, పులిచింత, పాదిరి.

## పచ్చివిగనే యుపయోగించవలసినవి

అడ్డసరము, బూడిదగుమ్మడి, పిల్లిపీచర, తిప్పతీగె, గోరింట, తామర కాడలు, మాంసము, అల్లము, తామరగడ్డ, కొడిశపాల, పెన్నేరు.

## స్వరసము

పచ్చిద్రవ్యములను సమకూర్చి పురుగులు, మన్నువగైరాలు లేకుండగ బాగుచేసి తెచ్చినవెంటనే నీరు కలుపకుండ త్రొక్కి వస్త్రములో వడియ గట్టిన రసము స్వరసము అని పిలువబడును. ఎండినయోషధుల చూర్ణమును గ్రహించి యందురెండింతలు నీరుపోసి రాత్రింబవళ్ళు మరునాడు ఆ ఉదకమును వడియగట్టుట మరియొకవిధమగు అంగరసమన బడును. పచ్చి వనమూలికలు దొరకనియెడల ఎండిన వానిని దెచ్చి వానికి ఎనిమిదిరెట్లు నీరుపోసి చతుర్థాంశముగ కాచవలయును. ఇట్లు కాచబడిన యంగరసము శృతమన బడును.

## కల్కము

## (Paste)

పచ్చిద్రవ్యమైన యెడల నీరు కలుపకయు, లేక ఎండు ద్రవ్యమైన యెడల తగి నన్ని నీళ్ళుపోసియు మెత్తగా ముద్దగ నూరబడినది కల్కము అనబడును.

## క్వాథము

రోగముల ననుసరించి ద్రవ్యముల నన్నిటిని లెక్కప్రకారము వేసి నలగగొట్టి కుండలోవేసి యందు తగినంత నీరుపోసి అగ్నితోకాచి దానిని వడియగట్టి కొంచెము వేడిగనున్నపుడే రోగ పశువున కిచ్చుదానికి క్వాథము లేక కషాయము (Decoction) అందురు. కషాయమును కుండలోనే కాచవలయును. అటులకాచినయెడల పైన మూత వేయరాదు. మూయబడిన కుండయొక్క క్రిందిభాగమునుండి ఆవిరినీరు పడుటవలన కషాయము చెడిపోవును. ఆయారోగములను బట్టి కషాయములలో తదితర ఓషధులు కలుపవలసి వచ్చినపుడు జాగ్రత్తగా త్రాసుతో తూచి వాడవలెను.

## హిమము

రెండుభాగముల ఔషధద్రవ్యములను నలుగగొట్టి చక్కగా ఒక కుండలోవేసి ఎనిమిదిభాగములనీరుపోసి చక్కగా పిసికి ఒకరాత్రి నిలువయుంచి మరునాడు ఆనీటిని

వడియగట్టుటయే హిమము లేక శీతకషాయము (Watery Extract) అని పిలువ బడును.

## పాంటము

ద్రవ్యమును వేడి నీటిలో వేసి పిసికి వడియగట్టగా వచ్చు కషాయమునకు పాంటము (Thin form of decoction) అందురు.

## జంగమద్రవ్యములు

అనగా ప్రాణముకలిగి కదలునవి:—మనుష్యులు, పశువులు, పక్షులు మున్నగునవి.

## సారాంశములు

త్రిఫలములు:—కరక్కాయ, తాడికాయ, ఉసిరికాయ.

త్రికటుకములు:—శొంటి, పిప్పళ్లు, మిరియాలు.

పంచలవణములు:—సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, కాచలవణము.

పంచకోలములు:—శొంటి, పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలము.

పంచాంగములు:—ఏ చెట్టుయొక్క చెక్క, ఆకు, వేరు, పండ్లు, పూలు యైనను.

పంచగవ్యములు:—గోమయము, గోమూత్రము, గోదధి, గోక్షీరము, గోఘృతము.

ఛాగపంచకము:—మేకపాలు, పెరుగు, మూత్రము, పురీషము, నెయ్యి.

పంచమూత్రములు:—ఆవు, గొఱ్ఱె, బఱ్ఱె, మేక, గాడిద మూత్రములు.

షడూషణములు:—పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంటి, మిరియాలు.

సప్తోపవిషములు:—జిల్లేడుపాలు, జెముడుపాలు, పొత్తికుంప, గన్నేరు, గురిగింజ, నల్లమందు, ఉమ్మెత్త.

పంచవల్కలములు:—మఱ్ఱి, రావి, జువ్వి, అత్తి, మామిడి వీని పట్టలు.

పంచపల్లవములు:—మఱ్ఱి, రావి, జువ్వి, మేడి, నేరేడు వీని చిగుళ్లు.

మహారసములు:—అభ్రకము, వైక్రాంతము, మాక్షికము, విమలము, శిలాజితు, మైలుతుత్తము, చపలము, కఫరి.

మహావిషములు:—వత్సనాభి, హారిద్రము, సక్తుకము, ప్రదీపనము, సౌరాష్ట్రికము, శృంగకము, కాలకూటము, హాలాహలము, బ్రహ్మపుత్రము.

శిరీషపంచకము:—దిరిశనచెట్టుఆకులు, పట్ట, పువ్వులు, పండ్లు, వేరు.

క్షీరాష్టకములు:—మనిషి, ఆవు, మేక, ఎనుము, గొఱ్ఱె, ఒంటె, ఏనుగు, గుఱ్ఱము వీనిపాలు.

---

శీతాకాలపువాన ఈశ్వరుణ్ణికూడా వణికిస్తుంది.



శ్రీ వేగేశిన కనకదుర్గ వెంకట సత్యనారాయణరాజుగారి
కపిలకోడె. (పాందువ్వ, ప. గో.)



పైవారి ఎద్దులజత



సాంప్రదాయంగల కంగాయంజాతి ఆబోతు



పాడి పరిశ్రమాలయం



శ్రీ బోడెపూడి భద్రయ్యగారి పండెపుగిత్త — చేబ్రోలు గుం. జి.

## దుంపలందు సారముగలవి

మంజిష్ఠ, చెంగల్వకోష్టు, కచోరములు, నేలగుమ్మడు, పసుపు, చల్లగడ్డ, తుంగ గడ్డలు, పిల్లిపీచర, సన్నరాష్ట్రము, అతివస, సుగంధపాల, అల్లము, నేలతాడిగడ్డలు, వస, భద్రముస్తలు, అడవికంద, తెగడ, చాగ, పుల్లదబ్బలి, అశ్వగంధ, చేమ, వేగిస.

## వేరులందు సారముగలవి

ములక, వాకుడు, ముయ్యాకుపొన్న, కోలపొన్న, బల, అతిబల, మహాబల, నాగబల, రాజబల, నాయుంట, చిట్టి, విషనొప్పి, ఉప్పి తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, వట్టివేరు, వట్టివేళ్ళు, దూలగొండి, అగుదొండ, ప్రొద్దుతిరుగుడు చెట్టు, చిరుగొద్ది, గోరింట, నల్లతెగడ.

## వ్రేళ్ళమీది పొట్టునందు సారముగలవి

నల్లతెగడ, రాస్న, చిత్రమూలము, బల.

## మానుమీది చెక్కయందు సారముగలవి

లొద్దుగ, తుమ్మ, పెద్దమాను, మానిసుపు, దేవదారు, లవంగచెక్క, కానుగ, మోదుగ, ఎలుమోదుగ, రేల, మఱ్ఱి, జువ్వి, రావి, మేడి మొదలగు పాలుగల చెట్లు, బూరుగ, కొడిశపాల.

## మానులోపల చేవయందు సారముగలవి

ఇప్ప, చందనము, రక్తచందనము, దేవదారు, చండ్ర, కాయఫలచెక్క, వేగిస, వేప.

## ఆకులందు సారముగలవి

గుంటకలగర, జిల్లేడు, ఇంద్రజవ, మణుగుడాము, ఉమ్మెత్త, కాకర, పొట్ల, వావిలి, పొన్నగంటి, బోడతరము, ఉప్పి, అడ్డసరము, గుండిగము, తుమ్మగ, తంగేడు, తెల్లజిల్లేడు, మోదుగ, తక్కెల, కూరనెల్లి, పులిచింత, తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, సత స్వతియాకు, గోరింటాకు, ప్రేంకణము, సహదేవి, విష్ణుక్రాంత, ఒద్ది, బుద్ధి, పాల, గరిక, బావంచి, చెంచలికూర, సదాప, ఎలుకచెవియాకు, పుచ్చ, వేప.

## పుష్పములందు సారముగలవి

సంపంగి, మొగలి, అశోకము, పాదిరి, పొన్న, భుజపత్రి, పొగడ, తురువింద, జాజి, మల్లె, వావిలి, మొల్ల, మునగ, రేల, సదాప, లవంగము, ఆరె, నందివర్ధనము, కలువ, దాసాని.

---

యముడు పక్కణ్ణి చంపితే ఏలము ముగ్గురిని చంపుతుంది.

## ఫలములందు సారముగలవి

ద్రాక్ష, ఖర్జూర, దానిమ్మ, అరటి, మారేడు, కొబ్బరి, పనస, మామిడి, నిమ్మ, పిరిగి, వెలగ, నారింజ, మాదీఫలము, చారపప్పు, దేవదారు, గురిగింజ, గంగరేగు, తీగెలయందు పుట్టు గుమ్మడి, బూడిదగుమ్మడి.

## విత్తులందు సారముగలవి

అన్నిరకముల పరిధాన్యములు, కందులు, పెసలు, మినుములు, శెనగలు, ఉలవలు, నువ్వులు, ఆముదములు, పొన్న, ప్రత్తిచెట్టు, తగిరిశె, చారపప్పు, వేప, పొగడ, అవిశె, మునగ, క్రానుగ, జ్యోతిష్మతి, గచ్చ, తెల్లగంటెన, మోదుగ, తక్కోలములు, మామిడి, జాజి, వాయింట, పిప్పళ్ళు, మిరియాలు, వాము, ధనియాలు, జీలకర్ర, చిల్లగింజలు, జీడివిత్తులు, కరక్కాయ, ఉసిరికాయ, తానికాయ, బావంచి, ఊడుగ, వాయువిడంగములు.

## క్షారమునందు సారముగలవి

తెగడ, చిత్రమూలము, జెముడు, క్రానుగ, ఎఱ్ఱగలిజేరు, తెల్లగలిజేరు, చవ్యము, అడ్డసరము, దుండిగము, పాదిరి, వేము, నేపాళము, జిల్లేడు, వావిడు, ములుమోదుగ, పిచ్చిపుచ్చ, గంటెన, అడవిపెసర, వావిలి, ఉప్పి, పసుపు, నిలి, మొగిలి, బోడతరము, ఉత్తరేణి, అడవివాయింట, తెల్లజిల్లేడు, వాయింట, నక్కవాయింట, నువ్వులు, నీటిగొబ్బి, నీటిప్రబ్బలి, శింశుప, మద్ది, దేవదారు, మునగ, మెంక్కపుచెట్లు, కామంచి.

## క్షీరసారములు

లొద్దుగ, తెల్లలొద్దుగ, జీడిచెట్టు, పెద్దజెముడు, ఆకుజెముడు, పచ్చగన్నేరు, జిల్లేడు.

## చెట్లజిగురునందు సారముగలవి

మాచిపత్రి, సర్జరసము, మహిసాక్షి, తురుష్కము, మోదుగ, బూరుగబంక, గుగ్గిలము, వేము, అతివస, రేల, తంగేడు, వెలగ, చంద్ర, ఇప్ప, వెణుతురు, ఇంగువ, మునగ, కాకిమారేడు, అహిఫేనము.

## అడ్డసరము (Adhatoda Vasica)

శ్లో॥ అరూశా వాసకో వాసా వృషా సింహముఖీ భిషక్,
సింహపర్ణీ వృషో వాసా సింహకోత్పాట రూపకః.

---

ప్రత్తిపంట పాడియావు కలవారికి కొదువయుండదు.

దీనికొమ్మలు ఒకదాని ప్రక్కనొకటి మొలచి పొదలవలె పెరుగును. దీనికొమ్మలు లేతగనున్నపుడు ఆకుపచ్చగను, ముదిరినపుడు తెలుపుగను ఉండును. దీని ఆకులు మామిడాకులవలె పొడవుగనుండును. గాని వెడల్పుగ నుండవు. పండుటాకులు పసుపు పచ్చగనుండును. మాఘఫాల్గుణమాసములలో నిది పూతపూయును. అప్పుడు కొమ్మల




చివర జూలువలె చిన్నచిన్న కోటియాకులు పుట్టి వానిలో తెల్లని చిన్నపువ్వులు పూయును. కాయలు కాయదు. దీనివేరు, ఆకులు, పువ్వులు ఔషధములలో వాడుదురు.

---

రాజాజులకు రాజదండము, రైతులకు నాగలి.

ఆయుర్వేద పశువైద్యులు దీని ఆకులను చెక్కను వాతరోగములకు వాడుదురు. ఆకు రసము విరేచనముల కట్టించును. వాతముల నన్నింటిని పోగొట్టును. పశువులకు కలుగు శ్వాససంబంధమగు రోగములకు చెక్కరసము, ఆకురసము బాగుగా పనిచేయును. ముద్ద వాతము వచ్చినపుడు రెండుగుప్పెళ్ళ ఆకులను గుండచేసి దానిలో ఒకతులం ఇంగువ, రెండుతులములు ఉప్పు కలిపి పెట్టిన తగ్గును. ఆకురసము తేనెతో కలిపి దగ్గులకు, పగర్పు నకు అప్పుడప్పుడు నాలుకకు నాకించిన తగ్గును. దీని ఆకుపసరు చలువచేయును. దీని ఆకులు చెక్కను కషాయముగా కాచి పశువులకు వచ్చు కల్లవాపులు, వాతనొప్పులు, దెబ్బలకు వాడిన బాగుగా పనిచేయును.

మోతాదు:—ఆకులం-10 తులము లవరకు.

## అవిసె (Linseed plant)

శ్లో॥ అగస్త్యో వంగసేనాహ్వో మధుస్రిగు ర్మునిం(ద్రుమః

ఇది ప్రసిద్ధమైన పెద్దచెట్టు. దీనిపువ్వులు పెదవిగానుండి ఎరుపురంగుగాని, తెలుపురంగుగాని ఉండును. కొందరు ఆకులను పువ్వులను వాడుదురు. దీనిచెక్క ఆకు రసము చేదుగనుండును. వేడిజేయును. పైత్యపుసద్దునకు ఆకుపసరు, పసుపు శరీరమున కంతటికి రెండుమూడు పర్యాయములు పట్టించినయెడల బాగుగా పనిచేయును. ఇంకను వాతనొప్పులకు, ఉబ్బురోగమునకుకూడ ఈపసరును శరీరమునకు పూయవచ్చును. నేత్ర రోగములకు ఆకుపసరుతో మిరియాలుగాని, శొంఠిగాని గంధముతీసి కలిపి వాడిన బాగుగా పనిచేయును. చర్మరోగములకు ఆకుపసరులో తగినంత ముద్దకర్పూరము కలిపి వాడిన పనిచేయును. అవిసెనూనె, గింజలుకూడ పనిచేయును.

## అల్లము (Ginger)

శ్లో॥ ఆర్ద్రికం శృంగిబేరం తన్మహౌషధ ముదాహృతం.

ఇది పసుపు మొదలైన మొక్కలజాతిలో చేరినది. అల్లమునుండియే శొంఠిని తయారుచేయుదురు. మనకు చీనా, జపాను దేశములనుండికూడ వచ్చుచున్నది. అల్లము కారముగా, పుల్లగానుండును. వేడిజేయును. జీర్ణ, శ్వాస సంబంధమగు రోగముల కన్ని టికి బాగుగా పనిచేయును. కడుపులోని వాయువును హరింపజేయును. అజీర్తి, దగ్గు, పగర్పుమున్నగు రోగములలో మంచిబెల్లము అల్లము సమానభాగములు తీసికొని నారింజకాయంత ప్రతిపూట పెట్టుచుండిన యెడల బాగుగా పనిజేయును.

మోతాదు :—1 తు మొదలు సేరువరకు.

---

దుక్కికొద్దీ పంట బుద్ధికొద్దీ సుఖము.

## అరటి (Plantain tree)

శ్లో॥ కదళీ గ్రంధినీ మోచా రంభా వీరా యాతచ్ఛదా,
కదళీవారణబుసా రంభా మోచా మహాత్ఫలా.

వీనిలో అనేకరకములుగలవు. కిరి గుంప, క్రొవ్వి, పొత్తి, అమలు, మున్నగు వాని రసము స్వాదుగ వెగటుగ నుండును. చలువచేయును. గుజ్జుకనము రక్తసంబంధమగు రోగములకు బాగుగాపనిచేయును. క్రొవ్వునను పిత్తములను కరుగును. ఆకురసము, దుంపరసము నేత్రవ్యాధులకు పనిచేయును. ఆకుల మార్గము వెన్నతో కలిపి అగ్రపువాపులకు, చర్మవ్యాధులకు ఉపయోగించిన బాగుగాపనిజేయును. అరటిపండ్లను మలబద్ధకముగా నుండువారలకు, ఎండరోగముగల పశువులకు బాగుగాపనిచేయును. దుంపరసము విరేచనముల కట్టించును. అరటిపువ్వులరసములో పెరుగుకలిపి యిచ్చిన పారుడురోగము కట్టును. ఆకరసమును నేత్రరోగములకు వాడవచ్చును.

మోతాదు :—దుంపరసము అర్ధ సేరువరకు.

## అతిమధురము (Liquorice root)

శ్లో॥ మధుయష్టి క్లీతనకం యష్టి మధు మధూలికా,
యష్ట్యాహ్వం మధుకం యష్టీమధూకం జలజామధు.

ఈ మొక్కలు పెషావరు, అరేబియా, సింధుప్రాంతములందు పెరుగును. ఇది ఆరడుగులఎత్తు పెరుగును. ఆకు గుండ్రముగ, చిన్నదిగ, ములగఆకంతే పరిమాణముగ నుండును. చెట్టంతయు నారగానుండును. సన్నని గుత్తులుగా పూవులుపూయును. పువ్వులకు వాసనయుండదు. ఆకును నలిపి. వెగటువాసనగానుండును. సన్యాసులు దీని ఆకులని యోగసిద్ధిపడయుదురు. వేరురసము చలువచేయును. నేత్రరోగములకు, చర్మవ్యాధులకు బాగుగాపనిచేయును. యష్టిమధుకమును దగ్గులకు, పగర్పునకు వాడవచ్చును. దీనిబెరడు ముంగు చేదుగనుండి తరువాత తీపిగనుండును. బెరడు పాలతో తగినంత బెల్లముకలిపి దగ్గులకు నాకించవచ్చును.

మోతాదు :—2 తులములవరకు.

## అక్కలకర్ర (Pellitory root)

ఇది గుల్మముగ పెరుగును. చామంతి ఆకువంటి ఆకులను, బోడతరపు పుష్పవంటి కాయయును కలిగియుండును. కాయఅంతయు పసుపుపచ్చగను, పైన ఎరుపురంగుగల బెరడును యుండును. దీని పూతలోనే గింజలుండును. దీనివేరునే అక్కలకర్రయందురు. ఆకుకూడ వేరువలెనే నమిలినయెడల చిమచిమ లాడును. ఇది వగరుగ కారముగ

---

దున్నేవాడు లెక్కచూస్తే నాగలి కూడ మిగులదు.

నుండును. వేడిజేయును. నరసంబంధమగు రోగములకు ఈరసము బాగుగాపనిచేయును. వాతరోగముల పోగొట్టును. గట్టికంతులకు గండఫెరోజాలో ఈ అక్కలకర్ర పొడి కలిపి పట్టీవేసిన త్వరలో పక్వమునకువచ్చును. నేత్రరోగములకు దీనిని ఇతర ఔషధములతో కలిపి వాడవచ్చును. జోరీగలు, కందిరీగలు పశువుశరీరమును కరచి దద్దురు పుట్టినయెడల నాముసుద్దతో ఈ అక్కలకర్ర గంధముతీసి కలిపి రాచిన తగ్గును.

మోతాదు :—2 తులములవరకు.

## అత్తి (Ficus Racemosa)

శ్లో॥ ఉదుంబరః క్షీరవృక్షో జంతువృక్ష స్సదాఫలః,
హేమదుగ్ధః కృమిఫలో యజ్ఞాంగ శ్శీతవల్కలః.

ఇది పెద్దవృక్షము. ఆకులు గుండ్రముగ, కొంచెము కోలగ మందముగ గరగర లాడుచుండును. చెట్టునుండి పాలుగారును. కాయలు గుండ్రముగ తీయగనుండును. వీటినే అత్తిపండ్లందురు. ఇవి పూవులు పూయకయే కాయలుపుట్టును. చెక్కరసము వెగటుగ తీపిగనుండును. వాతరోగములకు చెక్కరసము బాగుగా పనిచేయును. చెక్క పొడి కంతులకు, చర్మరోగములకు వేపనూనెలో కలిపిరాచిన పనిచేయును. అత్తిపండ్లను పిసికి మొండికంతులపైన వేసినయెడల పక్వమునకు వచ్చును.

మోతాదు:— చెక్కరసము సేరువరకు.

## అతివస (Root of Indian Atees)

శ్లో॥ అతివిషా శుక్లకందా విషా ప్రతివిషాపరా,
శ్యామకందా సితాశృంగీ భంగు రోపవిషాణికా.

ఈ అతివస తెలుపు, నలుపు, ఎరుపు అని మూడువిధములుగా నుండును. కాని గుణముమాత్రము సమముగా నుండును. అతివస కొంచెము చిరుచేదుగ, కారముగ నుండును. దీని గంధము కళ్ళవాపులకు పనిచేయును. దూడలకు కలుగు పాలదొమ్మలో దీనిని వాడవచ్చును.

మోతాదు:— తులమువరకు.

## ఆముదపుచెట్టు (Ricinis Communius)

ఈ చెట్టు చాల ప్రసిద్ధమైనది. ఇది చిట్టాముదము, పెద్దాముదము అని రెండు జాతులు. చిట్టాముదమునకు కాయలు, ఆకులు చిన్నవిగాను, పెద్దాముదమునకు పెద్దవిగా నుండును. గుణము సమానమే, కాని చిట్టాముదము మంచిది. వీనిలో పూవులలో

---

దుక్కి దున్నితే భూమికిశాంతము.

ఎఱుపు, తెలుపు భేదములు గలవు. ఆకులు వగరుగ చేదుగ, రుచిగనుండును. తల మాదకు శిరోవాతములకు ఆకులను వేసికట్టిన బాగుగా పనిచేయును. శిలామేహవాతమునకు ఆకురసము వాడవచ్చును. ఆముదపువేరు వాతరోగములకు నుపయోగించవచ్చును. ఆముదపుగింజలు విరేచనము గావించును. మామూలుగా పెట్టు దాణాదినుసులు మొదలగు బలవర్ధకౌషధములలో ఆముదపుపప్పును వేసిపెట్టుచుండిన యెడల వాతరోగములు, నేత్రరోగములు సంభవింపవు. ఆముదము విరేచనమును గలిగించును.

మోతాదు:— ఆముదము సేరువరకు.

## ఆవాలు (Indian mustard)

శ్లో॥ సర్షపః కటుకస్స్నేహః భూతఘ్నో రక్షితాఫలః,
తుస్తుభోన్యస్స ఉదిష్టస్సిద్ధార్థ శ్శ్వేతసర్షపః,
రాజికాచాసురీరాజీ సుతీక్ష్ణః కృష్ణసర్షపః.

ఆవాలలో ఎరుపు తెలుపు నలుపురంగులు గలవు. ఇంచుమించుగ మూడును సమానగుణములు గలిగియుండును. తెల్లావాలను ఔషధములలో వాడుదురు. వేడి చేయును. వాతరోగములలో విరివిగా వాడవచ్చును. వీనిని తరుచుగా జబ్బుపడిన భాగమునకు పట్లువేయుదురు. వీనిని పట్టువేయునపుడు వేడినీటితో కలిపి పట్టువేయవలెను. వాచియుండు ప్రదేశముపైన ఈ పిండితో పట్టువేసిన తగ్గును. పశువులకు న్యూమోనియా మున్నగు వ్యాధులు కలిగినపుడు ప్రక్కలమీదను, కడుపునొప్పికి పొట్టమీదను, గుండె, పేగులు వాచినపుడు ఆ యా ప్రదేశములమీదను పట్టువేయవలెను. ఇంకను వీటిని బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును. చురుకుగా పనిచేయును.

మోతాదు:—1 తులమునుంచి 2 తులముల వరకు.

## ఆరుదొండ (Capparis zeilamica)

శ్లో॥ ఆర్జటస్స్యాదార్తగళో బహుకంటః ప్రఫుర్షణః.

ఇది తీగ. కాయ గోలగ నుండును. పండిన ఎరుపుగ నుండును. కాయలు చేదుగ నుండును. ఈ ఆకుపసరు వేడిచేయును. దీర్ఘవాతములలో వాడవచ్చును. ఈ దొండ చిగుళ్లలో తగినన్ని మిరియాలు, జాజికాయ కలిపిపెట్టిన అతిమూత్రము తగ్గును. వాపులకు దీని పసరును వాడవచ్చును.

మోతాదు:— ఆకుపసరు అర్ధసేరు

## ఆకుజెముడు (Euphorba Nerufola)

శ్లో॥ దళస్నుహీంశ్యానజిహ్వా పత్రస్నుక్స్సు విరేచనీ.

జెముడు చెట్లలో ఆకుజెముడు, ప్లుల్లజెముడు, పలకలజెముడు మున్నగు అనేక రకములుగలవు. అన్నిటికి పాలు పూర్తిగానుండును. ఇంచుమించు సమానగుణములు

కలిగియుండును. ఆకుజెముడుకు సన్నని కొమ్మలును అరుదుగ చిన్ని ఆకులును యుండును. వేడిచేయును. కఫమును పోగొట్టును. విరేచనము గలిగించును. పశువులకు శ్వాసరోగము అందును సంధి పుట్టినప్పుడును దాని కొమ్మను దోరగా వేయించి రసముతీసి తగినంతగా త్రాగించిన యెడల శ్వాస కట్టును. ఇంకను ఈ కొమ్మరసములో వేపనూనె కలిపి అదురువాపు అడు కల్లవాపులకు ఉపయోగించవచ్చును.

మోతాదు:—పసరు అర్ధసేరువరకు.

## ఇంగువ (Assafoetida)

శ్లో॥ హింగుబాహ్లీకమత్యుగ్రం రామఠం భూతనాశనం,
అగూఢగంధాజరణం జంతుఘ్నం సూపభూషణం.

ఇవి 3, 4 అడుగుల ఎత్తుగాను పెరుగును. ఈ మొక్కలలో చాల రకములు గలవు. చెట్టువ్రేళ్ళను గాయపరచిన స్రవించెడి పాలు నిలువయుండుటవలన నలుపురంగుగ నుండును. దీనినే ఇంగువయందురు. కొందరు వ్యాపారులు దీనిపైన రంగుపూయుదురు. ఇది కొరువాసనగ, వెగటుగ, కారముగ నుండును. ఎక్కిలి వేడిజేసి ఆర్చును. శ్వాసకాసను, విరేచనముగాని యడచును. పశువులకు కలుగు అజీర్ణ శ్వాసరోగములకు బాగుగా పనిచేయును. ఈనిన వెంటనే 1 తులముల ఇంగువను సారాయిలో కలిపి వేడిజేసి త్రాగించిన మావియు పడిపోవును. ఇంగువను సారాయిలోగాని, స్పిరిట్‌లోగాని కలిపి పుండ్లకు రాచిన నెప్పులు తగ్గును. దీర్ఘకాల పుండ్లకు కర్పూరతైలములోగాని, ఆవిసనూనెలోగాని ఇంగువనుకలిపి త్రాగించిన తగ్గును.

మోతాదు:—4 తులముల వరకు.

## ఇండుపగింజలు (Clearing nuts)

శ్లో॥ కతకోంబుప్రసాదశ్చ ద్రవస్తిక్తఫల స్తథా.

ఈచెట్లు మునిడిచెట్టుకంటె పెద్దవి. ఇవి కొండలమీద బాగుగాపెరుగును. పండ్లనుతిందురు. గింజలు జిగటగనుండును. గింజల నరుగదీసి మడ్డినీటిలో కలిపిన యెడల స్వచ్ఛమైన నీరు పైకి తేలును. ఇంకను యీ గింజలను మనిచేసి పంచదారలో కలిపి పశువులకు కలుగు నేత్రరోగముల కుపయోగించవచ్చును.

## ఇప్ప (Bassia)

శ్లో॥ మధూకో మధుక స్తీక్ష్ణసారశ్చగుడపుష్పకః,
గోలాఫలోలోధ్రపుష్పోమధుకోష్ఠోమధుద్రుమః.

ఇది పెద్దవృక్షము. దీని ఆకులు గోలుగాకులవలెనుండును. దీని పూవులు పొగడ పూవులవలెనుండును. పువ్వులనుండి సారాయితీయుదురు. ఇంకను చమురుగూడ తీయు

దురు. ఆముదముకంటె చిక్కగానుండును. పువ్వులను ఎండబెట్టి పిండిగా జేయుదురు. ఇప్పనూనె వేడిజేసి ఆర్చును. ఈచెట్టు బెరడుగసము వాతరోగములకు, క్రిమిరోగములకు బాగుగా పనిచేయును. ఇప్పపిండి మోకాళ్ళవాపులకు తగ్గించును. ఇప్పపువ్వు పెద్ద రోగములకు పనిచేయును.

## ఉత్తరేణి (Achycanthes Aspera)

శ్లో॥ అపామార్గస్తు శిఖరీ కిణిహీ ఖరమంజరీ,
అధశ్శల్యశ్శైఖరికః ప్రత్యక్పుష్పీమయూరకః.

వీనిలో నలుపు తెలుపు ఎరుపు అను మూడురకములు గలవు. ఉత్తరేణి ఆకులు నూరి విరిగిన భాగములకు కట్టుకట్టిన ఎముకలు అతుకులు పట్టును. ఈ ఆకు పసరు కారముగ చేదుగ నుండును. జొన్నకలిలో ఆకుపసరుకలిపి త్రాగించిన మూత్రరోగములు, వాతరోగములు తగ్గును. ఆకునూరి రసముతీసి విషపురుగుల కాట్లకు నుపయోగించ వచ్చును. చర్మవ్యాధులకుకూడ పసరు బాగుగా పనిజేయును. ఉత్తరేణిని భస్మము చేసి తదితర మందులలో కలిపి చర్మవ్యాధులకు, జీర్ణరోగములకు వాడిన తగ్గును.

మోతాదు:—పసరు సేరువరకు.

## ఉమ్మెత్త (Datura)

శ్లో॥ ధత్తూరః కితవో ధూర్తో దేవతా మదనశ్వరః,
ఉన్మత్తోమాతులస్తూరీతరకః కనకాహ్వయః.

పువ్వులు ఆకులు పెద్దవిగనే యుండును. కాయలమీద ముండ్లుండును. కొన్ని జాతులకు ముండ్లుండవు. నల్లఉమ్మెత్త చాల శ్రేష్ఠమైనది. తెలుపు నలుపు పసుపు పూవులుగల చెట్లుగలవు. పచ్చపువ్వులది దొరకుట కష్టము. తక్కినవి దొరకును. ఆకురసము వేడిజేయును. ఆర్రువాపులకు, బెణుకులకు ఈ ఆకుపసరులో తగినంత వెన్న కలిపి మర్దనచేసిన తగ్గును. పశువులకుకలుగు వాతరోగములకు ఆకుపసరు బాగుగా పని చేయును. నల్లఉమ్మెత్త ఆకురసము విషపురుగుల కాట్లకు పనిచేయును. నుసిమిరికి ఈ ఆకుపసరుతో తగినంత గంధకముకలిపి రాచిన మాడిపోవును. కుండేటివెర్రి అను వ్యాధికి నల్లఉమ్మెత్తాకుపసరులో తగినంత ఉప్పు కలిపి యిచ్చిన తగ్గును. ఈ ఆకుపసరును ఎక్కువగా వాడరాదు. దీనిలో విషవస్తువు లెక్కువగానున్నవి. పసుపు పువ్వుల ఉమ్మెత్తను ధూర్తవైద్యు లెక్కువగా వాడుదురు.

మోతాదు:—పసరు అర్ధసేరువరకు.

---

[illegible]కూడయితేనేమి ము[illegible]లో ఈనితేసరి.

## ఉసరిక (Myrabolan tree)

శ్లో॥ ధాత్రీఫలాఽమృతఫలామలకంశ్రీఫలంశివం.

దీనిఆకులు, పువ్వులు కాయలు ఔషధములయం దుపయోగపడుచున్నవి. దీని చెక్క కాయలరసము వగరుగ పుల్లపుగనుండును. రసము చలువచేయును. పశువులకు కలుగు రక్త వాతరోగముల కన్నిటికి తదితర మందులతో కలిపివాడిన బాగుగా పని చేయును. పశువులకు కలుగు దొమ్మలకు త్రిఫలములు అనగా కరక్కాయ, తాడికాయ ఉసరికపప్పుతో కలిపినుక లిసి రెండుమూడు మోతాదులిచ్చిన తగ్గును. ఇంకను ఉసరిక పప్పు కషాయము ప్రత్యేకముగా విరేచనములు కట్టించుటకు ఈయవచ్చును.

మోతాదు :—6 తులములవరకు.

## ఊడుగ (Alangium Decapetalum)

శ్లో॥ అంకోలక స్తామ్రఫలః పీతసారోనికోచకః,
గుప్తస్నేహో విరేచీస్యాద్భాషితో దీర్ఘకీలకః.

ఇది సాధారణమైనచెట్టు. దీనియాకులు సన్నముగా రెండుమూడు అంగుళముల పొడవుగనుండును. తెలుపురంగుగల పూవులు పూయును. దీనికాయలు పచ్చిగనున్న పుడు నలుపుగను, పండినపుడు ఎరుపుగను ఈతకాయంత ఆకారముగలిగియుండును. దీని చెక్కరసము చేదుగనుండును. వేడిజేయును. విషపురుగుల కాట్లకు బాగుగా పని చేయును. పశువులకు కలుగు కడుపునొప్పి కామెర్లు చర్మరోగములకు ఈ చెక్కరసమును వాడవచ్చును.

మోతాదు :—చెక్కరసము ముప్పాతికసేరువరకు.

## ఏనుగ పల్లేరు (Pedalium Murex)

శ్లో॥ శ్వదంష్ట్రాస్వాలశృంగాట షడంగ క్షురకస్త్రికః

ఇది చిన్నచెట్టు. తెలుపుగనుండును. వర్షాకాలమునందు బాగుగాపెరిగి వేసవియందు మాడిపోవును. దీనిపువ్వులు నూవుపువ్వుల ఆకారముగలిగి పసుపుపచ్చగ నుండును. కాయలు గచ్చకాయలంత పరిమాణముగలిగి ప్రక్కలయందు నాలుగు ముండ్లుండును. దీనినే ఏనుగపల్లేరనియు, పెద్దపల్లేరనియు, వాడుదురు. ఇందు చిన్న పల్లేరొకటి కలదు. ఇది నేలప్రాకును. ఆకులు చింతాకులవలె నుండును. దీనిపువ్వులు చిన్నవిగ ఎరుపుగ నుండును. దీని కాయలకు నాలుగు జంటముండ్లుండును. గొల్లలు వీని ఆకులను పెరుగులో నీరుపోసి వేయుదురు. వెంటనే పెరుగు గట్టిపడును. దీని ఆకు, కాయ, రసము చలువచేయును. దీని ఆకుపసరులో బియ్యపునీరు కలిపియిచ్చిన కురమ

---

తల్లిని నమ్మినవాడు ధరణిని నమ్మినవాడు చెడడు.

యసురోగము శాంతించును. పల్లేరుకాయలనుమాడ్చి పొడిజేసి తులం సూరేకారంలో కలిపి సేయికలినీరుతో యిచ్చిన నీరుచురుకు, శిలామేహవాతము తగ్గును. ఆరంభములోనే చేయవలెను. శుక్లనష్టమునకు ఆకుపసరు పనిచేయును. పల్లేరువేళ్లరసము కూడ మూత్రరోగములకు పనిచేయును. ఆకు రసములో తగినంత నూనె కలిపి వాతనొప్పులకు మర్దన చేసిన తగ్గును.

మోతాదు:—ఆకురసము సేరు.

## కరక్కాయ (Terminalia Chebula)

శ్లో॥ శివాహారీతకీ పథ్యాచేతకీ విజయాజయా,
ప్రపథ్యాప్రమథామోఘా కాయస్థాప్రాణదామృతా,
[illegible] పూతనా [illegible],
పయస్థా సందిసిజ్ఞేయాశ్రేయసీరోహిణీతథా.

ఈ చెట్టు పెద్దవృక్షము. ఆకులు నూదంటుగ పెసుపుగ నుండును. విజయ, రోహిణి, పూతన, అమృత, అభయ, జీవంతి, చేతకి అని కరక్కాయలు ఏడు విధములుగ నుండును. విజయ కరక్కాయ సొరకాయవలె వృత్తముగ నుండును. రోహిణి కరక్కాయ గుండ్రముగ నుండును. పూతన కరక్కాయ చిన్నదిగ నుండును. అమృత కరక్కాయకు బీజము చిన్నదియు కండ మిక్కిలి మందముగ నుండును. అభయకు అయిదురేఖలుండును. జీవంతి బంగారురంగు కలిగి యుండును. చేతకికి మూడురేఖలుండును. విజయ సర్వరోగములందును, రోహిణి వ్రణరోపణమునందును, పూతన లేపవిధియందును, అమృత శోధనమునందును, అభయ నేత్రరోగములందును, జీవంతి సర్వరోగములందును, చేతకి చూర్ణయోగములందును వాడదగి యుండును. చేతకియను కరక్కాయ తెలుపు నలుపు భేదముచేత రెండురకములుగా నుండును. తెల్లచేతకి కరక్కాయ ఆరు అంగుళముల పొడవుగను, నల్లచేతకి కరక్కాయ ఒక అంగుళము పొడవుగ నుండును పై భేదములలో కొన్ని స్పర్శమాత్రమునను, కొన్ని దృష్టిమాత్రమునను, కొన్ని వాసనచూచినంత మాత్రమునను, కొన్ని తినినను విరేచనముచేయు స్వభావము కలదిగ నుండును. అన్నిటిలో విజయ కరక్కాయ మిగుల శ్రేష్ఠమైనది.

కరక్కాయ కండయందు మధురరసము, స్నాయువులయందు ఆమ్లరసము, తొడిమయందు చేదు, చర్మమునందు కారము, గింజయందు వగరు యిట్లు అయిదు రుచులు కరక్కాయ యందున్నవి. కరక్కాయ వగరుగా నుండును. చలువచేయును. వాత, రక్త, జీర్ణ, శ్వాసరోగముల కన్నిటికి ఈ కరక్కాయపొడి బాగుగా పనిచేయును కరక్కాయపొడి కవిరిపొడి కొబ్బరినూనెలో కలిపి గాయములకు పుండ్లకు వాడిన తగ్గును.

మోతాదు:— పొడి 6 తులముల వరకు.

---

ఎద్దులులేని సేద్యం చద్దిలేని పయనం.

## కలబంద (Aloe Barbadensis)

శ్లో॥ కుమారీ మండలామా౽తా౽గృహాకన్యాతిఫిచ్ఛిలా,
రసాయనీ కంటకినీ బహుపుత్రావనోద్భవా.




కలబంద యనునది యొక గుల్మము. మందమైన మట్టలును మట్టలలో మదపు వాసనగల గుజ్జును ఉండును. కాయ, ఆకు, వెన్ను మొదలగునవి లేవు. సర్వాంగసార

మైన మూలిక. వైద్యమునందు మట్టలనే ఎక్కువగా వాడుదురు. మట్టల రసం జిగటగా జిగలం సాగుచుండును. చలువచేయును. విరేచనము గావించును. బలవర్ధకౌషధములలో మట్టలనుంచి తయారగు ముసాంబరమును పొడిచి కలిపి వాడిన పనిచేయును. మట్టల రసములో పటిక గంధకము సమానభాగములు కలిపి చర్మరోగములకు, నలిగిన గాయములకు వేసిన తగ్గును.

మోతాదు:— ముసాంబరము. 5తులములవరకు

## కవిరి (Acacia Catechu)

[illegible] వస్తువు. దీనినే ఖైరసారము, కాచు అందురు. వెగటుగ, వగరుగ నుండును. చలువచేయును. విరేచనముల కట్టించును. చర్మరోగములకు నోటిపూతకు దీనిని తదితర మందులలో కలిపి ఇచ్చిన తగ్గును.

మోతాదు:—3 తులముల వరకు.

## కటుకరోహిణి (Hellibrous Niger)

శ్లో॥ కటుకీ రోహిణీతిక్తా చంద్రాంగా కటురోహిణీ।
మత్స్యపిత్తా పాండరుహా కృష్ణభేదీ ద్విజాంగికా।
అశోకా రోహిణీ మత్స్యా శకులాశకులాదనీ॥

ఇది తెలుపు నలుపు రెండురకములు. ఆకులు చేదుగనుండును. ఎక్కువ మోతాదుల నియరాదు. నల్లదానికంటె తెల్లకటుకరోహిణి చురుకుగ పనిచేయును. వేపచెక్కపొడి, యష్టిమధుకము, కటుకరోహిణి నీయుకలిపి కాచిన కషాయము బలవర్ధకౌషధముగా రక్తసంబంధమగు రోగములయందు వాడవచ్చును. కటుకరోహిణిని బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును.

మోతాదు:— $1\frac{1}{2}$ తులములవరకు

## కరివేప (Bergera koenigh)

శ్లో॥ కైడర్యోథ మహానింబో రావణో గిరినిమ్బకః.

ఈచెట్టు చెక్క, వేరు, చేదు, కారముగనుండును. ఆకు సువాసనగా నుండును. ఆకురసము చలువచేయును. విరేచనముల కట్టించును. గొడ్డుబోతుతనము గల పశువులకు ప్రతిదినము నాలుగు గుప్పెళ్ళవంతున ఉండచేసి వారము దినములు పెట్టిన చూలు నిలుచును. ఇంకను క్రిమిరోగములకు వాతరోగములకు వాడవచ్చును.

---

మృగశిర బిందిస్తే ముసలియెద్దు ఱంకెవేయును.

## కసివెంద (Cassia Occidentalis)

శ్లో॥ కాసమర్దః కర్కశస్స్యాద్ద్రంజనో గజర స్తథా.

ఇది చిన్నచెట్టు. భూమిపై ముప్పావుగజమువరకు పెరుగును. చెట్టంతయు వెగటు వాసనగా నుండును. దీని కాయలు పెసరకాయలవలెనుండును. పసుపుపచ్చని పూవులు పూయును. ఆకులు కొంచెము కోలగ మొనదేలక గుండ్రముగనుండును. ఆకురసము చేదుగనుండును. వేడిజేయును. వెన్నతో ఆకుపసరు కలిపి అరువాపులకు, పక్షవాతములకు ఉపయోగించవచ్చును. ఇంకను పసరు నేత్రరోగములకు చర్మరోగములకు బాగుగా పనిచేయును.

## కురాసానివాము (Black hembane seeds)

ఇది జీర్ణసంబంధమగు రోగములకు బాగుగాపనిచేయును. ఈ మొక్కలు గుబురుగా పెరుగును. ఈ వాములో మత్తును కలిగించు గుణము కలదు. గర్భవాతమునకు, దగ్గునకు, కడుపునొప్పికి, తదితరశూలలకును కొన్నిపువాలలో కలిపి త్రాగించిన బాగుగాపని చేయును. ఈ గింజలరసము తీసి కండ్లకు అంజనముచేసిన శిరోభారము తగ్గును.

మోతాదు:—4 తులములవరకు.

## కుప్పింటు (Acalypha Indica)

ఇది మూర్ఛారోగహారు చెట్టు తెలియంది. దీని ఆకులు కొంచెము కోలగానుండును. ప్రతిదొడ్డిలోను ఈ మొక్కలు మొలచును. ఆకురసము ఘాటుగానుండును. చర్మవ్యాధులకు బాగుగా పనిచేయును. మూర్ఛారోగహారు గుణములే దీనికిని గలవు. శ్వాసరోగములలో ఈ పసరును ముక్కురంధ్రములలో పోసిన బాగుగాపనిచేయును. ఆకురసములో సున్నముకలిపి గజ్జి, నుసిమిరికి వాడవచ్చును.

## కుంకుడు (Sanpindus)

శ్లో॥ అరిష్టకో గర్భపాతీ కుమ్భబీజశ్చ ఫేనిలః,
కృష్ణబీజో ర క్తబీజః పీతఫేనోర్థసాధనః.

ఇది పెద్దవృక్షము. ఆకులు కొంచెము కోలగ గుండ్రముగనుండును. కాయలు చిన్నవిగ పూవులు తెల్లగ గుత్తులుగనుండును. కాయలను నీళ్లలోనానిన నురుగువచ్చును. కాయలు చేదుగనుండును. వేడిజేయును. చర్మరోగములలోను, పేను, మిన్నల్లులు పుట్టినపుడును ఈ కాయల నురుగుతో శుభ్రము చేయుటమంచిది. పశువుల తోకలకుగలుగు నుసిమిరి, గురుజు మున్నగు వ్యాధులకు ఈ నురుగును పట్టించవచ్చును. దొమ్మలకు ఈ నురుగును త్రాగించిన తగ్గును.

---

పడమటకట్టు వేస్తే పాడియావు అంకెవేయును.

## కానుగ (Pongamia glabra)

ఈ చెట్టు నెక్కు, ఆమోసము వెగటుగా చేయగనుండును. ఈచెట్టుయొక్క సర్వాంగములు వెగటువాసనగ నుండును. వేసంగికాలమందు చిగురుపట్టి పూయును. పూత తెలుపు నలుపుగలదిగానుండును. కాయలు కొంచెము వంకరగ ఎల్లుబరువుగనుండును. ఆమరసము చర్మరోగములకు బాగుగాపనిచేయును. పుండ్లు పడిన పుండ్లను తదితర గాయములకు ఈగింజలనుండి తయారుచేయబడిన నూనెనువాడిన చక్కగా మానును. దీని ఆకులునూరి పురుగులుపడిన పుండ్లమీదకట్టిన పురుగులు చచ్చును. చెక్కరసము వాత రోగములకు యిచ్చిన తగ్గును. కానుగగింజను పెరుగుతోనూరి పురుగులుపడినపుండ్లకు కట్టిన మానును.

మోతాదు:—చెక్కరసము అర్ధసేరువరకు.

## కాకర (Momardica charantia)

శ్లో॥ కారవెల్లంకటిల్లంస్యా దుగ్రకాండం సుకాండకం.

ఇది తీగజాతిలోనిది. దీనిలో అనేకజాతులు గలవు. దీని ఆకులు చీలలుకలిగి సుమారు మూడంగుళముల వెడల్పుకలిగియుండును. పువ్వులు పసుపుపచ్చగనుండును. పెద్ద కాకరకాయలు గొగ్గులుకలిగి పొడవుగనుండును. పొట్టికాకరకాయలు గుండ్రముగ నుండును. పొట్టికాయలు మిగుల చేదుగానుండును. ఆమోసము చేదుగానుండును. వేడి జేయును. విషజంతువులకాట్లకు, నేత్రరోగములకు, చర్మవ్యాధులకు పనిచేయును. వాత రోగములకు పసరును తదితర మందులలోకలిపి వాడవచ్చును.

మోతాదు:—పసరు అర్ధసేరువరకు.

## కందదుంప (Areen Campanulatum)

గ్రామములోను పొలములందునుకూడ పండించును ఈకందగూడ అడవికందయొక్క గుణములను కలిగియుండును. అడవికంద వస్సుతో దుంప దీని మందును అంతమునుగ పనిచేయదు. మావివేయుని పశువులకు ఈదుంపను పులిచల్లతోగాని కలిపిటితో గాని కలిపి నూరి త్రాగించిన వెంటనే పడును.

మోతాదు:—6 తులములవరకు.

## గంజాయి (Cannabis sativa)

దీనినే జ్ఞానప్రతియందురు. ఈ చెట్టు రెండుగజముల యెత్తులోపుగ పెరుగును. పూవులు గుత్తులుగ పూయును. లేత మొక్కలను ఎలుకలు తినును. ఈ మొక్కలనుండి ఒక విధమైన నారయు, గింజలనుండి నూనెయు తయారుచేయుదురు. ఇది మత్తును కలిగిం

---

మన్ను వెళ్ళమండా దున్నితే వెన్ను వెళ్ళమండాపండును.

చును. పెద్దరోగము, పారుడు, రక్తవిరేచనములు మున్నగు రోగములలో దీనిని వాడిన బాగుగా పనిచేయును. చెవిమాటను గంజాయిఆకును నూరి రసముతీసిపోసిన తగ్గును. దీని విత్తులను కోళ్లకు తినిపించిన విస్తారముగ గ్రుడ్లనుపెట్టును. కొన్ని పక్షులకు తినిపించిన వానిరంగు మారును.

మోతాదు:—2 తులమువరకు.

## గచ్చ (Caesalpinia)

ఈచెట్టు పొదవలె పెరుగును. పొలము యొక్క ఆవరణలకొరకు చుట్టువేయుదురు. చెట్టంతయు చిన్న చిన్న ముండ్లతో నిండియుండును. ఆకులు చిరిసెన ఆకులవలె నుండును. కాని అంతదట్టముగా నుండవు. కాయలు గుత్తులుగుత్తులుగ ముండ్లతోడనుగలిగి యుండును. గచ్చగింజలో విషరూపమైన పప్పుండును. గచ్చపప్పు చేదుగ, వగరుగ, కారముగనుండును. శ్వాసరోగములలో ఈపప్పు బాగుగా పనిచేయును. దీనిఆకును కీరు వాపునకు, దూడల జంటబొడ్డునకు తదితర కల్లవాపులకు ఆముదముతో వేయించి కట్టిన బాగుగా పనిచేయును.

మోతాదు:—గచ్చపప్పు 3 తులములవరకు.

## గుంటకలగర (Eclipta prostrata)

శ్లో॥ భృంగరాజో భేకరాజో మార్కవః కేశరంజకః,
అంగారకో మహానీలో భృంగాహ్వాస్సూర్యవల్లభః,

నీటిప్రదేశములందు విశేషముగా మొలచు చిన్నమొక్క. ఇది నలుపు పసుపు తెలుపు పూవుల భేదము కలిగియుండును. ఇది సర్వాంగ సారమైన మూలిక. ఆకురసము చేదుగనుండును. శరీరమునందలి చెడునీటిని లాగివేయును. నేత్రరోగములకు శిరోరోగములకు పనిచేయును. చర్మరోగములకు తదితర మందులలలో కలిపి వాడవచ్చును. ఆకునూరి మలిమిడికి మిరియాల పొడితో కలిపికట్టిన తగ్గును.

మోతాదు:—అర్ధ సేరువరకు.

## గోగు (Cannabis Sative country)

శ్లో॥ పీలుశ్శ్వేతసహస్రాంశీ తీక్ష్ణకఃకరభప్రియః,
సహస్రాంగీ గుడఫల స్తత్ఫలం పీలుపీలుజమ్.

దీనిలో కేశనాళిగోగు, పుల్లగోగు, ధవాసరిగోగు, యెఱ్ఱగోగు మున్నగు రకములు కలవు. మెట్టచేలలో పెరిగిన పుల్లగోంగూర శ్రేష్ఠమైనది. సన్నని కాడవలె పొడవుగ

---

పాన్పుమంచిదిగాచూచి పశరమును కట్టిచేయవలెను.

పెంచును. ఆకులు పూవులు పుల్లగనుండును. పాలుపిడుచు దూడలకు అప్పుడప్పుడు గోంగూర పెట్టుట మంచిది. విరేచనము గావించును. వాపులకు, పంపరకు, బొడ్డుబ్బండ్లకు గోంగూర ఉడికించిగాని, ఆముదముతో వేయించిగాని కట్టిన పనిచేయును.

## గాడిదగడప (Aristolochia Bracteata)

ఇదియొకతీగ. నలుపుగలసిన ఆకుపచ్చరంగు గలదిగానుండును. దీనికాయలు లేత బుడమకాయంత యుండును. ఆకు గరుకుగ నుండును. అడవులయందును, కంచెలయందును విశేషముగా పెరుగును. దీనివేరు, కాడ, ఆకు చాల చేదుగనుండును. పసరు అతి వేడిజేయును. పశువులకు కలుగు వాతరోగములకు, సమస్తవాపులకు, బాగుగాపని చేయును. చర్మరోగములకు ఆకుపసరులో హారతికర్పూరము కలిపి నాలుగైదు పూతలు పెట్టిన తగ్గును. దూడలకు ఎలికపాములు, నులిపురుగులు పడినపుడు ఈ ఆకుపసరు పెట్టిన జాడించి విరేచనమగును. విషపురుగులకాట్లకు ఈ పసరు త్రాగించిన బాగుగా పనిచేయును.

మోతాదు:—పసరు అర్ధశేరు వరకు.

## గుగ్గిలము (Baellium)

గుగ్గిలపుచెట్టుయొక్క బంకకు గుగ్గిలమని పేరు. గుగ్గిలము ముక్కలుముక్కలుగ పచ్చగ ఎరుపురంగుగ నుండును. పరిమళముగలది. దీనిపొగ దేవతారాధనయందు ప్రశస్తముగ నుపయోగింతురు. రసవీర్యాగుణములు మహిసాక్షికి సమముగనుండును. గుగ్గిలము మెత్తగనలుగుచుగను ఉండును. శ్రేష్ఠమైన గుగ్గిలము నిప్పులోవైచిన చిటచిటమనును. ఎండలో నుంచిన కరగును. గోరువెచ్చని నీటిలోవైచిన ద్రవముగుటయేగాక పాలవలె తెల్లగా నగును. గుగ్గిలముయొక్క సారము మూడునెలలకు తగ్గిపోవును. గుగ్గిలము మలమూత్రముల వెడలించును. గడ్డలను కంతులను కరగించును. నీటితోనూరి పట్టువేసిన వాతనొప్పులు తగ్గును. దీనిని పొగవేసి ధూమపానము చేయించిన శిరోరోగములు తగ్గును. చర్మవ్యాధులన్నిటికి తదితరమందులలో కలిపివాడిన పనిచేయును. బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును. పండ్లపొడిలో దీనినివేసి వాడవచ్చును.

మోతాదు:—౩ తులములవరకు.

## చింత (Tamarind tree)

శ్లో॥ అమ్లికా చుక్రికా చించా తింత్రిణీ శుక్తిచంద్రికా.

చింతచెట్టు పెద్దవృక్షము. ప్రసిద్ధమైనది. దీని లేతఆకులు కాయలు-పండ్లు పుల్లగా నుండును. వేడిజేయును. చింతాకుపసరులో ఉప్పు, ఆముదపు పప్పు కలిపి చర్మరోగములకు వాడవచ్చును. ఆకుత్రొక్కి ఆముదముతో వేయించి బెణుకులకు మలిమిడికి వాడ

---

పట్టిగొడ్డుకు అరుపులెక్కువ; వానలేనిమబ్బుకు ఉరుములెక్కువ

వచ్చును. చింతగింజలను రుబ్బి విరిగిన ఎముకలకు గుడ్డతో కట్టుకట్టవచ్చును. చింత చెక్కను మసిచేసి ఆముదములోగాని వేపనూనెలోగాని కలిపి చెల్లి, గజ్జి, నుసిమిరికి వాడిన తగ్గును. చింతపండు చలువచేయును. పశువులకు కలుగు జీర్ణ, వాత, రక్తరోగము లలో చక్కగా పనిచేయును. విషములకు విరుగుడు పెట్టవచ్చును. పైత్యపుదద్దురునకు చేదుజీలకర్రతో ఈవులను కలిపి మర్దన చేయవచ్చును. మలబద్ధకముగా నున్నపుడు చింత పండుపులుసుతో ఉప్పుకలిపి పెట్టిన పారును. ఉంగిడికి పులుసు పనిచేయును.

మోతాదు:—చింతపండు అర్ధసేరు నవటాకువరకు.

## చిత్రమూలము (Plumbago Zeylanicum)

శ్లో॥ చిత్రకో హుతభుగ్వ్యాళో దారుణో౽హనోరుణః,
అగ్నిమాలీ హవిః పాచీ వహ్నినామా విశేషతః.

దీనికి గుండ్రని ఆకులుండును. దీనివేరు చిటికగొట్టిన మొదల పసుపుపచ్చగ నుండును. ఇది తెలుపు, ఎరుపు, నలుపు పువ్వుల భేదము కలిగియుండును. అల్పముగ దొర కును. ఎరుపు, నలుపు చిత్రమూలములు రెండు ఒకేగుణము కలిగియుండును. నలుపు చిత్రమూలమును ఆవులకు వాసనజూపినను లేక పాలలో వేసినను పాలు నల్లబడును. మలిమిడికి, బెణుకులకు చిత్రమూలముతో ఆముదము కలిపివేసిన, పుండుపడి తగ్గును. దీనిరసము పాకును. కావున తగిన మందులతో కలిపి లోపలికి ఈయవలెను. దీర్ఘ జీర్ణ రోగములకు దీనిరసముతో తదితరమందులు కలిపి యిచ్చిన తగ్గును. బలవర్ధకౌషధములలో కలిపి ఈయవచ్చును.

మోతాదు:—చిత్రమూలము 1 తులమువరకు.

## చేదుబీర (Plucketiana)

శ్లో॥ కోశాతకీశతచ్ఛిద్రా జాలినీ కృతవేదనా।
మృదంగఫలకాక్ష్వేళా ఘోంటకీ కర్కశచ్ఛదా॥

మంచిబీరవలెనుండును. రసము చేదుగ వెగటుగనుండును. నరములకు సత్తువ చేయును. తలతిరుగుడు, ధనుర్వాతము, దొమ్మ మొదలగు వ్యాధులకు యీపసరుపెట్టిన బాగుగా పనిచేయును.

మోతాదు:—పసరు అర్ధసేరువరకు.

## చేదుపొట్ల (Trichosanthes Cumecurina)

శ్లో॥ తిక్తోత్తమా బీజగర్భా పరా రాజపటోలికా,
జ్యోత్స్నాపటోలికాజాలీ నాదేయీ భూమిజంబుకా.

---

బందరుమామిడి మెరిస్తే బక్కగొడ్డునుగూడ మేపలేక అమ్మవలెను.

తీగ ప్రాకును. ఆకులు పొట్లఆకులవలె నుండక చీళ్ళులువేయును. కాయలు గుండ్రముగ చిన్నవిగ నుండును. పండినవెనుక ఎరుపుగానుండును. కాయపైన తెలుపుచారలుండును. ఆకురసము వగరుగా చేదుగానుండును. రక్తసంబంధమగు రోగములకు ఆకుపసరు బాగుగా పనిచేయును. చర్మవ్యాధులకు పసరును వాడవచ్చును. క్రిమిరోగములకు దీని పసరుతో కలిసీరు కలిపి ఈయవచ్చును.

మోతాదు:—పసరు అర్ధసేరువరకు.

## చేకొంశిత (A Medicinal plant)

దీనినే సేగుర్తాకు అందురు. ఇవి పొలములందును, దొడ్లలోను పెరుగులతలు. దీనిఆకు కందిచెట్టు ఆకువలెనుండును. వాతరోగములకు బాగుగా పనిచేయును. జొన్నకలితో ఈ ఆకుపసరు కలిపి పక్షమురినములు పెట్టిన వాతము హరించును.

మోతాదు:—ఆకు పిసెనుంచి అర్ధమణుగువరకు.

## జీలకఱ్ఱ (Cuminum Cyminum)

శ్లో॥ జీలకం దీర్ఘకం శుక్లమజాజీకణ జీరకం.

ఇది చిన్న మొక్క - దీని కొనలయందు గుత్తులు గుత్తులుగ పూచి పువ్వుగుత్తులలో గింజ లేర్పడును. దీనినే తెల్లజీలకఱ్ఱఅందురు. మామూలుగా గృహములందు వాడు జీలకఱ్ఱ యిదియే. దీనిరసము పుల్లగా స్వాదుగా నుండును. వేడిజేయును. జఠరదీప్తిని కలిగించును. రక్త, జ్వర, వాతరోగముల కన్నిటికి అమోఘముగా పనిచేయును.

మోతాదు;—4 తులములవరకు.

## జీడిగింజలు (Semecarpus)

శ్లో॥ భల్లాతకోనభో భల్లీ వీరవృక్షోగ్నివక్త్రకః,
ఆరుష్కర స్తథారూక్ష స్తపనోగ్ని ముఖీధనుః.

ఇది పెద్దవృక్షము. కొంచెము పొడవుగా వెడల్పుగా ఆకులుండును. నలుపు గింజలు, గుండ్రనిపండ్లు, తెలుపుగల మాను కలిగియుండును.

జీడిగింజలను నలుగగొట్టునపుడు జాగ్రత్తగా కొట్టవలెను. గింజలలో నుండు పొగ మనుష్యులకు సరిపడనిచో శరీరమంతయు వాచును. జీడిగింజలు వెగటుగ, చేదుగ, చమురు గలిగియుండును. పశువులకు వాతరోగములకు ప్రతిదినము నాలుగైదు తీసికొని తిను ఆహారములో కలిపి పెట్టిన నెమ్మదించును. పాడిపశువులకు పాలసేర్లు నాలుక సెలయగునప్పుడు ఈ గింజలను పులిచల్లలో నానబెట్టి త్రాగించిన నెమ్మదియగును. కాలు గొట్టు, తదితర మొండిగాయములకు జీడిని కాల్చి అంటించిన తగ్గును.

---

తూర్పునకాగ్రువేస్తే దుక్కిటెద్దు రంకవేయును.

## జిల్లేడు (Asclepias Gigantea)

శ్లో॥ అర్కస్సూర్యాహ్వయః క్షీరీ సదా పుష్పోవికీరణః

దీనిలో తెలుపు నలుపురంగుగల పువ్వులుగల చెట్లుండును. జిల్లేడు చిన్నచెట్టు. దీనికాయలు వంకరగ ఆకుపచ్చగనుండును. ఎండిన తరువాత కాయలోనుండి స్వచ్ఛమైన ప్రత్తివంటిదూది వెలువడును. చెట్టును త్రుంచినచో పాలుగారును. పాలకు మదపు వాసన [illegible]. తెల్లజిల్లేడు పూవు [illegible] మందముగ [illegible] తెల్లని [illegible]. ఇది ప్రసిద్ధమైనచెట్టు. [illegible] జిల్లేళ్లలో [illegible], తెల్లజిల్లేడు మిగుల శ్రేష్ఠము.

ఆకులు, వ్రేళ్ళు, పూవులు, పాలును నయితము [illegible]గానుండును. చాల వేడి కలిగించును. విరేచనముకూడ చేయును. జిల్లేడాకుల రసము వాపులకు శ్వాసరోగములకు చెవిరోగములకు పనిచేయును. జిల్లేడుపాలు నేత్రరోగములకు చర్మరోగములకు పని చేయును. ఆకుపసరు విషపురుగుల కాట్లకు పనిచేయును.

## తుమ్మ (Acacia Arabica)

ఇదియొక పెద్దచెట్టు. కొమ్మలకు సన్నని ముండ్లుండును. పసుపుపచ్చగను గుండ్రముగనుండు చిన్నపువ్వులు పూయును. పూవునకు అరంగుళము పొడవుగల సన్నని తొడిమయు, నలుపుగ, మందముగనుండు ప్రమానుపైపట్టయు, తెలుపు, నలుపు రంగులుగల జిగురును, సన్ననిపొడవుగ పలుచగనుండు కాయలును, జమ్మిఆకులవలె చిన్నవిగను ఉండును. ఇందు తెల్లతుమ్మ, నల్లతుమ్మ, కస్తూరితుమ్మ అని మూడురకములుగలవు. తెల్లతుమ్మమాను అంతయు తెలుపుగ బూడిదరంగుగ నుండును. పూవులుకూడ తెలుపుగ నుండును. కస్తూరితుమ్మ సాధారణమైనచెట్టు. ఇంచుమించు తెల్లతుమ్మవలె నుండును. దీనికాయ మిక్కిలిపొట్టిది. నల్లతుమ్మచెక్క వగరుగ వెగటుగనుండును. ఈ చెక్కరసము పొరుడు నోటిగాలిపుండ్లు మొదలగువానికి పనిచేయును. చిన్నదూడలకు కలుగు చర్మవ్యాధులకు పనిచేయును. పాలసేర్లు, గర్భవాతమునకు, పశువుఈనిన తరువాతను సేరు తుమ్మాకు పసరులో అర్ధసేరుపాలు, రెండుతులముల ఇంగువకలిపి త్రాగించిన తగ్గును. తుమ్మచెక్క పొడిచేసి రసికారుపుండ్లకు తడితడగాయములకు బాగుగా పనిచేయును, తుమచెక్క కషాయము నోటిపూతకు పనిచేయును. తుమ్మకాయలను పశువులకు పెట్టిన మిగుల బలము గలిగించును.

మోతాదు:—చెక్కరసము అర్ధసేరువరకు.

---

ఆశ్లేషకురిస్తే ముసలిఎద్దురంకవేయును.

## తురకవేప (Melia Azodirachta)

శ్లో॥ కిరాతకో నోగ్యనై పాలో నాడితిక్తో జ్వరాంతకః ।
కండు తిక్తోర్ధతిక్తస్సాన్యన్నిద్రా రిస్సన్నిపాతహా ॥

దీని ఆకులు వేపాకువలె [illegible] చేదుగనుండును. దీని వేరు [illegible] [illegible] చేదు [illegible] [illegible] కట్టి [illegible] చెలికి, [illegible] కలిపి [illegible] అవి చచ్చిపోవును.

మోతాదు:—ఆకురసము [illegible]

## తులసి (Ocimum vilosum)

శ్లో॥ తులసీసురసాగౌరీ భూతఘ్నీ బహుమఞ్జరీ.

తులసి గుండ్రముగ కొంచెము కోలగ వృక్షమువలె ఆకులుండును. కృష్ణతులసియని లక్ష్మీతులసియని రెండురకములు. కృష్ణతులసియాకులు నలుపుగను, లక్ష్మీతులసియాకులు పచ్చగనుండును. తక్కినవి సమానములు. వీని శిఖలందు వెన్నుపుట్టును. ఇందు సన్నని పువ్వులును, నలుపుగనుండు చిన్నగింజలు నుండును. తులసి మంచి సువాసనగలది. గృహస్థులు పరమపూజ్యముగ నెంచి గృహములందు వేసి పూజించుదురు.

తులసి కారముగ వగరుగనుండును; వేడిజేయును. శ్వాస, రక్తరోగములకు, బాగుగా వాడవచ్చును. ఆకుపసరును మిగుల తీవ్రసరోగములకు ముక్కురంధ్రములలో వేయవచ్చును. చర్మరోగములలో పసుపుతో గంధకము, హారతికర్పూరముకలిపి వాడిన తగ్గును. ఆకు నూరి దానిలో తగినంత కర్పూరము కలిపి పురుగులుపడిన పుండ్లమువేసిన పురుగులు చచ్చును.

మోతాదు:—ఆకుపసరు పావుసేరువరకు.

## తమలపాకులు (Betel leaves)

శ్లో॥ తాంబూలవల్లీ తాంబూలీనాగినీ నాగవల్లరీ ॥

తమలపాకుతీగ సన్నముగనుండును. దీనికి చెమ్మయు, చల్లదనము యుండవలయును. తీగనరికి పాతిన బ్రతుకును. ఆకులలో మూడునాలుగు రకములుగలవు. దీని ఆకు

రసము కారముగ నుండును. విరేచనము గావించును. వాతరోగములలోను, కడుపునొప్పి, రొంప, దగ్గు మున్నగు రోగములలోను ఆకుపసరు బాగుగా పనిచేయును.

మోతాదు:—ఆకులు 100 వరకు.

## తంగేడు (Cassia Auriculata)

గుబురుగా పెరుగును. పసుపుపచ్చని పూవులు పూచును. కాయ వంకరగ బద్దవలె నుండును. ఆకు చింతాకుకన్న రెట్టింపు పెద్దదిగనుండును. చెక్కరసము వగరుగ నుండును. ఆకురసము చెక్కరసము విరేచనములు కట్టించుటకు పనిచేయును. దూడలు పాలెక్కువగా త్రాగి పారుకొనిన యెడల తంగేడుచిగుళ్ళను పెరుగులో కలిపిపెట్టిన తగ్గును. పెద్దరోగములో పారుడెక్కువగా నున్నయెడల ఆకు చిగుళ్ళను నూరి కలినీటిలో గాని పెరుగులోగాని, నాలుగైదుసార్లు పెట్టినయెడల తగ్గును.

మోతాదు:—ఆకుపసరు అర్ధసేరువరకు.

## తిప్పతీగె (Tinosqora Cordifolia)

శ్లో॥ గుడూచీ కుండలీ ఛిన్నా వయస్థామృతవల్లరీ
ఛిన్నోద్భవా ఛిన్నరుహా మృతాజ్వరవినాశినీ
వత్సాదనీ చంద్రహాసా జీవంతీ చక్రలక్షణా.

ఇది యొకవిధమైన తీగ. డొంకలమీదను కంచెలమీదను ప్రాకును. దీనియాకులు యించుమించుగ తమలపాకును పోలియుండును. ఈతీగ గణుపులలో రెండువైపుల చిగురుపట్టి పెద్దతీగగా పెరుగును. దీనికి చిన్నచిన్న తెల్లనిపూవులును, ఐచ్చులకాయల వంటి కాయలును నుండును. పండ్లు నలుపురంగుగా నుండును. రామరావణయుద్ధంలో మృతులైన కపీశ్వరులను బ్రతికించుటకై దేవతలు వారిశరీరముల చల్లిన అమృతబిందువులు పడినచోట నీతీగ మొలచినదని యందురు. వేపచెట్లమీదకు ప్రాకుతీగలు మంచివందురు. ఈ తీగనుండి సత్తు తయారుచేయుదురు. తీగరసము వేడిజేయును. కారముగ, వగరుగ చేదుగనుండును. ఈతీగను పలుపుగాచుట్టి మరమతిగిలిన పశువుమెడలోవేసిన రోగము తగ్గును. ఇంకను వాతరోగములకు యీపసరు పనిచేయును. ఇంకను ఆకురసము గాయములకు, చర్మవ్యాధులకు, నరములు తెగినప్పుడు వాడిన పనిచేయును.

మోతాదు:—తీగరసము సేరువరకు.

## తవాక్షరి (Bamboo manna)

శ్లో॥ వంశజా వైణకీ క్షీరీత్వక్క్షీరీ వంశరోచనా,
తుగాక్షీరీ తుగావంశీ వంశక్షీరీ శుభా సితా.

---

ఉత్తర ఉరిమిమెరిసినా పాముతరిమి కరిచినా తిరుగదు.

వెదురుబొంగులను చీల్చినపుడు తెలుపురంగుగల పలుకు కొన్నిటిలో బయలు దేరును. దీనిచే తవాక్షిరియందురు వెగటుగా వగరుగానుండును. మూత్రరోగములలో దీనిని వాడవచ్చును. విరేచనముల కట్టించును. శుక్ల నష్టము కలిగినపుడు మంచిగంధముతో దీనిని యిచ్చినచో తగ్గును.

మోతాదు:—1 తులమువరకు.

## త్రిఫలములు

## (Cheboulic, Belleric and Emblic Myrabalams)

కరక్కాయ, తాడికాయ, ఉసిరికాయ అనువాటిని త్రిఫలములందురు. మూడు పాళ్ళు కరక్కాయలు, ఎనిమిది పాళ్ళు తాడికాయలు, పన్నెండు పాళ్లు ఉసిరికాయలు కలిపినచూర్ణము సమస్త రక్త జీర్ణవాత నేత్ర రోగములను బాగుగా పనిచేయును శిరో రోగముల పోగొట్టును. దొమ్మలను రూపుమాపును.

## త్రికటుకములు (Pepper, dryginger and long pepper)

శొంటి పిప్పళ్ళు మిరియాలు అనువాటిని త్రికటుకములందురు. ఇవి శ్వాస, పీనస రోగములకును, రక్తజీర్ణ వాతరోగములకును బాగుగాపనిచేయును. త్రికటుకములను మెత్తగానూరి వస్త్రఘాళితముపట్టి వెన్నలోగాని, తేనెలోగాని, కలిపి నేత్రరోగములకు పెట్టిన బాగుగా పనిచేయును. త్రికటుకములు జీర్ణశక్తిని గలిగించును. వేడిజేయును.

## తేనె (Honey)

శ్లో॥ మధుపుష్పాసవః పుష్పరసోమాక్షిక మీరితమ్.

తేనెలో నాలుగురకములు గలవు. భ్రామరము, పైత్తికము, క్షౌద్రము, మాక్షికముఅని నాలుగువిధములు. భ్రామరము తెలుపుగ నెయ్యిరంగుగలదిగ నుండును. క్షౌద్రము కపిలరంగుగనుండును. మాక్షికము తైలవర్ణముగ నుండును. భ్రామరమను తేనె తృప్తిచున్చును. తియ్యగనుండును. పైత్తికమను తేనె త్రిదోషముల ప్రకోపింపజేయును. క్షౌద్రమను తేనె గురుత్వము కలదిగనుండి శ్లేష్మమునుపెంచును. శ్రేష్ఠమైనది. మాక్షికమను తేనె రూక్షగుణము స్వల్పమగు గురుత్వముగలది మధురముగానుండును. వాతమును పెంచును. వ్రణచికిత్సయందు ఉత్తమముగనుండును. క్రొత్తతేనె అల్పగుణములను బహుదోషములను గలిగియుండును. కాచి వడియగట్టిన తేనె త్రిదోష హరముగను, పచ్చితేనె పులుపుగ త్రిదోషకారిగను నుండును. విషపుష్పములనుండికూడ తేనెను తేనెటీగలు చేర్చును. గాన తేనెను ఉష్ణముగ నుండునపుడుగాని, ఉష్ణముగనుండు పదార్థములలో కలిపిగాని వాడరాదు. అట్లు చేసినచో విషపమముగనుండును. గాన లేహ్యములందును, బలవర్థకౌషధములలోను వాడవలసివచ్చినపుడు చల్లార్చి వాడవలెను.

---

చదిదుక్కుంటుతర్వాత దున్నినవాడుపాపాత్ముడు.

## ధనియాలు (Coriander Seeds)

ఆకు నల్లివాసనగ నుండును. చిల్లులుచిల్లులుగల మృదువైన ఆకులును, గుత్తులు గుత్తులుగ తెలుపుగ చిన్నవిగనుండు పువ్వులును ఉండును. గింజలు గుండ్రముగ పరిమళముగ పచ్చిగ నున్నపు డాకుపచ్చరంగు, ఎండినపిదప గోధుమవర్ణము గలవిగ నుండును. ధనియపు మొక్కలకు కొతిమిరి మొక్కలనిపేరు. సోపుగింజలవలెనే ఇవియును పని చేయును. పశువులకు కలుగు అజీర్తి కడుపునొప్పి మొదలగు జీర్ణరోగములకును, బలవర్ధ కౌషధములలో, వాయువును పోగొట్టు ఔషధములలో కలిపివాడుదురు. ఇవి తీపిగ, వగరుగ నుండును. ధనియాలరసములో రేవల్చిన్నిరసము కలిపియిచ్చిన నిరుచురుకు తగ్గును.

మోతాదు:—ధనియాలు అర్ధసేరువరకు.

## దానిమ్మ (Punica Granatum)

శ్లో॥ దాడిమీ రక్తకుసుమా దంతబీజా శుకప్రియా,
మధురామ్లఫలో రక్తబీజకో రక్తపూరకః.

తియ్యదానిమ్మ, పులుపుతీపు కలసినదానిమ్మ, పులుపుదానిమ్మయని మూడు రకములుగలవు. దీని మానుచెక్క, వేరుచెక్క, ఆకు మొగ్గ పువ్వు లేతచిగుళ్ళు తొక్క వీనిరసము వగరుగనుండును. పాగుడు రక్తవిరేచనములలో ఈచెక్క రసముగాని లేత ఆకులనుగాని పెరుగుతోకలిపి మూడునాలుగు పర్యాయములు పెట్టినతగ్గును. ఈనిన తరువాత మానముతోట గుర్రాకునగల మస్తుపదము తినయెడల ఈచెక్క రసముతో కడిగిన వాసనతగ్గును. ఇంకను ఈ చెక్కపొడి పుండ్లు గారపట్టుటకు ఉపయోగించవచ్చును.

## దిరిసెన (Mimosa Sirissa)

శ్లో॥ శిరీషః ప్లవగోవిప్రపుష్పకవృక్షః కపీతనః,
మృదుపుష్ప శ్శ్యామవర్ణో భండీరశ్శంభినీఫలః.

ఇది పెద్దవృక్షము. దీనికొమ్మలు పెళుసైనవి. ఈచెట్టు శాఖోపశాఖలుగా పెరుగుటచే పందిరివలెఛాయాప్రధానముగాకూడ ఉపయోగపడును. కాయలుపలుచగా బద్దలవలె పొడువుగను, పూవులు కేసరములవలె నుండును గాని అంతకంటె కొంచెము పెద్దవి. పూవులకు కొంచెము పరిమళముండును. ఆకు మునగాకువలె నుండును గాని అంతకంటె కొంచెము పెద్దది. కాయలు 4 నుంచి 9 అంగుళములవరకు పొడవుండును. ఒక్కొక్కకాయలో పదిగింజలకంటె ఎక్కువయుండవు. దీనిచెక్క ఆకురసము వెగటుగ నుండును. వేడిచేయును. దీని వేరులను ఆకులరసమును వాత రోగములలో నుపయోగించు

---

దాయకట్టనిఆవు తన్నకమానదు.

మందులలోకలిపి వాడుదురు. దిరిసెనాకుపసరు, నరమూత్రము, పసుపు, నల్లేరుకలిపి గుండెవగర్పు దగులకు పెట్టిన తగ్గును. తెలియని రోగములకు ఈ ఆకుపసరు, పసుపు కలిపిపెట్టిన తగ్గును. ఈ ఆకుపసరు రక్తసంబంధమగు రోగముల కన్నిటికి బాగుగా పని చేయును.

మోతాదు:— ఆకు చెక్కరసము సేరువరకు.

## దూసరి (Cocculus Villosus)

శ్లో॥ ఛిలిహింటో మహామూలః పాతాళగరుడాహ్వయః.

ఇది తీగజాతి. వేరు మిగుల గాఢముగ నాటుకొనును. ఆకులు కొంచెము కోలగ చిన్నవిగ మిక్కిలి ముదురు ఆకు పచ్చరంగు గలవిగ నుండును. దీనికాయ చిన్నది. పచ్చిగ నున్నపుడు ఆకుపచ్చరంగుగను పండిన తరువాత నలుపు రంగుగ నుండును. ఆకురసము చలువచేయును. విరేచనము కలిగించదు. మూత్రమును వెడలించును. దూసరితీగను త్రాడుగాచుట్టి పశువులకు కురచరోగము వచ్చినపుడు మెడలోవేసిన తగ్గును. పశువులకువచ్చు మూత్రరోగములలో ఈ ఆకు బాగుగా పనిచేయును.

మోతాదు:—ఆకురసం సేరువరకు.

## దుష్టుపుచెట్టు (Odina Wodier)

ఇది తీగజాతి. ఆకుగిల్లిన అమితముగా పాలుగారును. ఆకులు గుండ్రముగ కొనదేలియుండును. పూవులు గుత్తులుగా తెలుపుగ అంకములుగ నుండును. ఇది మిక్కిలి వేడిజేయును. విరేచనము గావించును. దొమ్ములు కురుపు మొదలగు రక్తసంబంధమగు వ్యాధులకు బాగుగా పనిచేయును. ఈ తీగను పలుపుగాచుట్టి చలిజ్వరము తగిలినదాని మెడలోవేసిన తీగ ఘాటునకు తీవ్రజ్వరము తగ్గును.

మోతాదు:—పసరు అర్ధసేరువరకు.

## దొండ (Momordica Monadelpha)

శ్లో॥ బింబీరక్తఫలాగోళాతుండీ దంతచ్ఛదోపమా।
మధుపర్ణ్యా మహాద్రాళీ శ్లేష్మకృదోష్ఠధనాశినీ॥

దొండతీగ ద్రాక్షను. చేదుదొండ, తీయదొండయని రెండువిధములు. ఇంకను కాకిదొండ మురుదొండ, నాగదొండ, అను రకములుకూడగలవు. తియ్యదొండ దొడ్లలోవేసి పెంచబడును. చేదుదొండ అరణ్యములలో స్వయముగా మొలచును. దొండతీగనరికి పాలినబ్రతుకును. దొండకాయలు కొంచెముకోలగ గుండ్రముగ సన్నగ నుండును. పచ్చికాయలు ఆకుపచ్చగను పండినపుడు పగడమువంటి చక్కని ఎరుపు

తంగును కలిగియుండును. దొండాకు మీదు అంచులంకలదై మృదువుగనుండును. తీయ దొండకాయలను కూరవండుకొని తిందురు. ఆకురసము వేడిచేయును. ఆకుపసరును ఆవువాపులకు వెన్నలో కలిపిరాసిన బాగుగాపనిచేయును. శిరోవాతములకు ఆకుపసరును చెవులలోపోసిన తగ్గును. చర్మరోగములకు ఈపసరుతో ముద్దకర్పూరము కలిపి రాసిన తగ్గును. తీయదొండాకు రసమును రక్తసంబంధమగు రోగములకు త్రాగించిన పనిచేయును.

మోతాదు :—పసరు సేరున్నరవరకు.

## నల్లేరు

శ్లో॥ అస్థిసంహారకో వజ్రవల్లరీ క్రోష్టు ఘంటికా।
వజ్రాంగీ గ్రంథిమాంశ్చ వజ్రః ప్రోక్తస్త్వ దస్థిశృంఖలః॥

డొంకలమీదను, చెట్లమీదను ప్రాకుతీగ నాలుగైదు అంగుళముల కొకకణుపును, కణుపువద్ద ఆకులును ఉండును కాడ పలకలుగా నుండును. ఇందు రెండు మూడు నాలుగు పలకలుగల కాడలుండును. మూడు పలకలనల్లేరు కొన్ని భస్మములు చేయుటకు వాదవిద్యయం దుపయోగించుటకు పనికివచ్చును. నల్లేరుకాయలు పచ్చివి ఆకుపచ్చగ పండినవి నల్లగ గుండ్రముగ చిన్నవిగ కరివేప పండ్లంతయుండును. కాడలు మాత్రము ఔషధము వాడవలెను. దీనిరసము శరీరమునకు తగిలిన దురదపుట్టి దద్దురులేచును.

ఆకులు కాడలు దురదగలిగియుండును. వేడిచేయును. పశువులకు కలుగు ఉంగిడి విషపురుగులకాట్లు నల్ల తెవులు ఎడతెగనిపారుడు మున్నగు రోగములకు పనిచేయును.

మోతాదు :—నల్లేరురసము అర్థసేరువరకు.

## నల్లజీలకఱ్ఱ (Migella Sative)

ఈ మొక్కలు విస్తారముగా పంజాబు దేశమునందు పెరుగును. వీని ఆకులు చీలియుండును. పువ్వులు గుత్తులుగుత్తులుగా నుండును. ఇవి నలుపుగ మిరమిరలాడు చుండును. చేతితోనలిపి వాసనజూచిన గాటుగల సువాసన వచ్చును. ఇవి కారముగ నుండును. జీర్ణరోగములకు ఇవి బాగుగా పనిచేయును. కడుపుబ్బు అజీర్తి మలబద్ధకములకు వీటిని ఉపయోగించవచ్చును.

మోతాదు. —4 తులములవరకు.

## నల్లమందు (Opium)

ఇది గసగసాలమొక్కల కాయలనుండి తయారుచేయుబడును. నల్లమందులో జారణము, మారణము, ధారణము, సారణము అని నాల్గువిధములు. జారణము తెలుపు

---

గను, మారణము నలుపుగను, ధారణము పచ్చగను, సారణము చిత్రవర్ణముగను యుండును. ఇది విదేశీయమైన ఔషధము.

నల్లమందు చేదుగనుండును. మత్తును కలుగజేయును. మలమూత్రముల బంధించును. రక్తమును విరచును. పశువులకుకలుగు అతిసారము, రక్తాతిసారము, కడుపునొప్పి మొదలగు జీర్ణసంబంధమగు రోగములకు పనిచేయును. ఎద్దువాతముగల పశువునకు అర్ధశేరు ఆవుపాలలో ఒక అరతులముగాని పావుతులముగాని నల్లమందుకలిపి త్రాగించిన తగ్గును.

మోతాదు :—తులమువరకు.

## నల్లవుప్పి (Volkameria Inermis)

దీనివేరు అతులరసము చేదుగనుండును. ఇప్పిచెక్క రసము నాడీరోగములకు బాగుగా పనిచేయును.

## నీరుల్లి (Allium Cepa)

శ్లో॥ పలాండుర్ధవలాఖ్యశ్చ దుర్గంధో ముఖదూషకః.

ఇదియొక దుంపజాతి. ఎఱ్ఱగ, తెలుపుగ నుండును. ఈ దుంపనుండి సన్నముగ అర్ధగజము పొడవుగల గొట్టమువంటి కాడలు పుట్టును. కాడల చివర తెలుపు రంగుగల పూవులుపూచును. ఉల్లిగసము వెగటుగ నుండును. చలువచేసి ఆర్చును. రక్తశుద్ధిచేయును. నరములకు సత్తువనిచ్చును. వాత, శ్వాస నేత్రరోగముల కన్నిటికి ఇవి బాగుగాపనిచేయును. నిక్కళ్ళ గల పశువులకు పులిచల్లలో ఉల్లిగడ్డలు నానవేసి పెట్టిన శాంతించును.

మోతాదు:—నీరుల్లి సవాసేరువరకు.

## నేరేడు (Eugenia Jambolana)

శ్లో॥ మహాజమ్బూ రాజజమ్బూ మహాస్కంధాబృహత్ఫలా.

నేరేడుచెట్లలో నేరేడు, అల్లనేరేడు, జిన్ని, నేలనేరేడు కాకి నేరేడు, అని అయిదురకములుగలవు. నేరేడు పెద్దవృక్షము. ఆకులు కొలగ వెడదుగ, పచ్చికాయలు ఆకుపచ్చగ దోరకాయ కొంచె మెరుపుగ బాగుగా పండినది నలుపుగ నుండును. చెక్కరసము వగరుగ నుండును. రక్తమూత్రము విరేచనముల కట్టించును. చెక్కపొడి రసికారుపుండ్లకు పనిచేయును.

మోతాదు :— చెక్కరసము అర్ధసేరువరకు.

---

తప్పకపోయినా చప్పికొమ్ములఎద్దును కొనవలెను.

## నేలవేము (Cherayta)

శ్లో॥ కిరాతతిక్తః కైరాతో భూనింబో రామసేనకః.

మిరపమొక్కలవలె గుబురుగా పెరుగును. ఈ మొక్కయొక్క ప్రతిభాగము చేదుగనుండును. సమూలము వేడిజేయును: రక్త జీర్ణవాత విషరోగములన్నిటికి ఈ సమూలమంతయు పనిచేయును. బలవర్ధకౌషధములలో దీనిని కలిపి వాడుదురు.

మోతాదు :—పొడి 2 తులములవరకు.

## నువ్వులు (Sesamum Indicum)

శ్లో॥ తిలంఫలస్తైలఫల స్తిలపింజో పరస్మృతః। జాతినో వనజాతిస్స్యాత్॥

నువ్వులు కారముగ వగరుగ చేదుగనుండును. బలము గలిగించును. వేడి జేయును. నల్లనువ్వులు మంచివి. మూవిపడని పశువులకు అర్ధసేరుత్రొక్కి వేడినీటిలో కలిపి త్రాగించిన పనిజేయును. నువ్వులపిండిని వెన్నలో కలిపి పెత్యపుదద్దురునకు రాసిన పనిజేయును. నువ్వులు కల్లుబెల్లము కలిపి త్రొక్కి బలవర్ధకము దుక్కిటెద్దులకు పెట్టిన బాగుగాబలియును.

## పంచలవణములు (Five kinds of Salts)

సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, కాచలవణము, సముద్రలవణము అని అయిదువస్తువులుకలసి పంచలవణములనబడును. ఇవి ఉప్పగ రుచిగ నుండును. శరీరమును పోషించును. రుచిపుట్టించును. మలమును వెడలించును. వాతజీర్ణ రోగములకు బాగుగాపనిచేయును. ఆకలి బుట్టించును. బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును.

## పటిక (Alum)

సౌరాష్ట్రదేశపు గనులలోపుట్టు ఒకవిధమైన మన్నుగుడ్డలకు రంగువేయుటకు లోహములను స్వచ్ఛముగ ద్రవింపజేయుటకు ఉపయోగిచును. ఇందు పటిక, పుల్లిక అను రెండు రకములుగలవు. పటిక కొంచెము పచ్చగను, బరువుగను, నునుపుగను ఉండును. పుల్లిక తేలికగా తెలుపుగ పుల్లగ నునుపుగ నుండును.ప్రస్తుతము తెలుపుగ రాళ్ళవలె నుండుపటిక మనకు దొరకుచున్నది

ఇది వగరు కారము పులుపు రసములుగలిగియుండును. వేడిజేయును. రక్తము నాపును. విరేచనముల కట్టించును. నోటిగాళ్ళకు పటిక కటిని అప్పుడప్పుడు కడుగుచుండిన గారపట్టును. కంటిరోగములకు ఈ పటికకటిచుక్కలు వాడిన పనిచేయును. నోరు దుర్వాసనగానున్నపుడు ఈపొడితో కడిగిన రుచినిపుట్టించును. నోరుపాక్కినపుడు పూతకు ఈ నీరు బాగుగా పనిచేయును.

---

అవు చేలోమేస్తే; దూడ గట్టునమేయునా.

## పసుపు (Turmeric)

శ్లో॥ హరిద్రారజనీ గౌరీ రంజనీ వరవర్ణినీ,
పిండాపీతా వర్ణవతీ నిశావర్ణవిలాసినీ.

దుంప ప్రధానముగాగల మొక్క. ఆకులు పొడవుగ కొనదేలియుండును. ఆకులకు గూడ పసుపు వాసన గలదు. గెలవేసి పూవులు పూయును. ఇందు అనేకరకములు గలవు. ఇది వెగటుగ చేదుగనుండును. ఉద్రేకకారియు, బలకారియునగు వస్తువు. వేడి జేసి అరుగును. జీర్ణశక్తిని గలిగించును. బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును. చర్మవ్యాధులకు నేత్రరోగములకు మూత్రరోగములకును దీనిని వాడవచ్చును.

మోతాదు :— 2½ తులములవరకు

## పిప్పళ్లు (Piper Longum)

శ్లో॥ పిప్పలీ చపలాకృష్ణామాగధీ మగధాకణా,
విశ్వోపకుల్యావైదేహీ శౌండీస్యాత్తీక్ష్ణతండులా.

పిప్పలితీగ మలయాళము మున్నగు చల్లనిదేశములందు పుట్టును. ఆకులు ముదురు, తమలపాకు ఆకారముగ నుండును. తీగ ప్రాకును. పిప్పళ్లు చవురు గలిగియుండును. వేడిజేయును. రక్త, వాత, శ్వాస నేత్రరోగముల కన్నిటికి ఇవి బాగుగా పనిచేయును.

మోతాదు :—4 తులములవరకు.

## పొగాకు (Tobacco)

పొగచెట్లను శీతకాలముల పెంచుదురు. మూడుమాసములకు తయారగును. ఆకు సన్నముగ పొడవుగనుండును. పొడవైన వెన్ను వేయును. గింజలు మిక్కిలిసన్నముగ గసగసాలవలెనుండును. ఆకులు మిక్కిలి తీక్ష్ణముమైనవి. పొగాకుఅనియు దీనిని వాడుదురు. పొగాకు చేదు, కారముగా నుండును. వేడిగలుగజేయును. దీనిలో "నికోటిన్" అను విషపదార్థమున్నది. పొగాకుతోటలోనికి సామాన్యముగా పాము వెళ్ళదు. ఇది విషపదార్థము. చర్మవ్యాధులకు, నేత్రవ్యాధులకు, గాయములు, వ్రణములు మొదలగు వానికి అవసరము, ఆకుపొడి పనిచేయును.

## పెన్నేరు (Physalis Flexuosa)

శ్లో॥ అశ్వగంధాతురంగాహ్వా గోకర్ణ శ్చావరోహకః
వరాహకర్ణో వరదాబల్యా వాజీకరీవృషా.

---

కోటివిద్యల కంటె కోరుకొని పొలందున్నడం మంచిది.

అసలు గుండ్రముగ మృదువుగనుండును. ఇది వేరుప్రధానముగాగల మూలిక. దీనిపండ్లు ఎరుపుగ, గుండ్రముగ పగడమువలె నుండును. పండ్లలోని గింజలు మిక్కిలి సన్నముగ తెలుపుగనుండును.

దీని దుంప సువాసనగనుండును. చలువచేయును. వాతమును హరించును. దుంప రసము వెగటుగనుండును. ఇది దేహములోని మలమును వెడలించును. దగ్గు వాతము చర్మవ్యాధులకును దూడలకు అజీర్ణము చేసినపుడును ఈ దుంపరసము బాగుగాపనిచేయును.

మోతాదు:—పొడి 6 తులములవరకు.

## ప్రత్తి (Gossypium)

శ్లో॥ కార్పాసః పటశూలశ్చా చ్ఛాదనీ బాదరః పిచుః.

పశువులు పారుకొనినపుడును రక్తవిరేచనములకు ఈఆకుపసరుగాని ఆకుత్రొక్కు గాని మజ్జిగలోగాని పెరుగులోగాని కలిపీ [illegible] గాని కలిపి రెండుమూడు మోతాదు లిచ్చిన తగ్గును. కాయలరసము పాలలోకలిపి దగ్గులకువాడిన తగ్గును.

మోతాదు :—ఆకుపసరు ముప్పావిక సేరువరకు.

## బ్రహ్మదండి (Argemone Mexicana)

దీనినే పిచ్చిసాన చెట్టనియు, గాలిపుచ్చ యనియు, బలురక్కెస చెట్టనియు నందురు. ఇది పసుపుపచ్చని పువ్వులు పూసెడిచెట్టు, ఏటేట మొలచును. దీనిగింజల నుండి చమురుతీయుదురు. ఈ కొమ్మలనుండి వచ్చుపాలను దీర్ఘతలమూడలకు పని చేయును. ఇంకను బ్రహ్మదండి సమూలమునుదంచి రసముతీసి చర్మవ్యాధుల కుపయో గించిన బాగుగా పనిచేయును. ఇంకను ఈపసరు విషపురుగుల కాట్లకు పనిచేయును. ఆకును ఉడికించి కట్టిన కాళ్ళవాపులు తగ్గును. వేళ్లరసము నెరిడీకు పనిచేయును.

## బాడిద (Erythrina Indica)

శ్లో॥ పారిభద్రోనిమ్బవృక్షో రక్తపుష్పః ప్రభద్రకః
కంటకీ పారిజాతస్స్యాన్మందార కటికింశుకః.

ఇది పెద్దచెట్టు, మ్రాను తెలుపుగనుండును. తెలుపు ఎరుపు పూవుల భేదములు గలవు. తెలుపుది మంచిది. చెక్క ఆకురసము వెగటుగ కారముగ నుండును. వాత రోగములకు చర్మరోగములకు కర్ణరోగములకు రసము పనిచేయును.

---

గూనిదున్నకంటె గుడ్డిదున్న శ్రేష్టము.

## మిరప (Capsicum Annum)

దీనిపువ్వులు చిన్నవిగ తెలుపుగనుండును. పచ్చిమిరపకాయలు ఆకు పచ్చగ, పండినవి ఎరుపుగనుండును. ఇందులో పొట్టిమిరెప దేశవాళీమిరప సీమమిరప మొదలగు అనేకరకములు గలవు. ఎండుమిర్చి వేడిజేయును. నేరుపీటిలో మూడుగుప్పెళ్ల ఎండు మిరెపకాయలనువేసి ఉడికించి చేతితో పిసికి వడపోసిన కారపుపాలందురు. ఈపాలను రక్త వాత జీర్ణరోగములలో వాడిన బాగుగా పనిచేయును. కడుపునొప్పి దొమ్మ, కురప, ఇంక తెలియని రోగములకు ఈపాలు వాడిన పనిచేయును.

మోతాదు :—4 తులములవరకు.

## మెంతులు (Fenu Greek Seeds)

ఇదియొక చిన్నమొక్క. ఆకులు చిన్నవిగా కొంచెము గుండ్రముగ నుండును. ఆకు చేదుగనుండును. మెంతులు వేడిజేసి ఉర్చును. పశువులకు దూడలకు అజీర్తివిరేచనములు కడుపుబ్బు మున్నగు వ్యాధులలో పెరుగులో కలిపిపెట్టిన శాంతించును.

మోతాదు :—6 తులములవరకు.

## మిరియాలు (Black pepper)

శ్లో॥ మరిచంవల్లిజంతీక్ష్ణం మలినం శ్యామభూషణం.

తెల్లమిరియాలు, నల్లమిరియాలు అని రెండురకములు. మిరియపు తీగెలు మలయాళ దేశమునందు తిరువాన్కూరు తోటలయందు వేసి పెంచబడును. తీగెను ముక్కలుగా నరికి పాతిపెట్టుదురు. ఇవి మూడు సంవత్సరములకు పెద్దవై పంటకువచ్చును. మిరియపుతీగెల వెన్నునందు మిరియము లేర్పడును. పండుమిరియము లెర్రగనుండి ఎండిన పిదప నలుపుగనుండును. మిరియాలను నానబెట్టి పైపొట్టు తీసివేయబడినవి తెల్ల మిరియాలనియు, పొట్టు తీయనివి నల్లమిరియాలనియు చెప్పుదురు. గాని పుట్టుకతోనే తెల్లమిరియాలుండునని చెప్పుదురు. తెల్లమిరియాలు కనపడవు. మిరియాలు వేడి జేయును. ఇవి అన్నిరోగములలో అమోఘముగా పనిచేయును. రక్త, శ్వాస, జీర్ణ నేత్ర, వాతరోగములలో నుపయోగించెడి మందులలో కలిపి వాడుదురు.

మోతాదు :—3 తులములవరకు.

## మోదుగ (Butea Frondosa)

శ్లో॥ పలాశః కింశుకః కర్ణియాజ్ఞికో బ్రహ్మపాదపః,
క్షీరశ్రేష్ఠో రక్తపుష్ప స్త్రివృతస్సమిదుత్తమః.

---

అచ్చివచ్చినభూమి; అడుగిడేచాలును.

ఇది పెద్దవృక్షము. ఆకులు గుండ్రముగ ఒక తొడిమకు మూడుఆకులు విడివిడిగ నుండును. లేతఆకులు ఎరుపుగను ముదిరిన ఆకులు పచ్చగనుండును. కాయలు పొడవుగను కాయలలోని గింజలు బద్దలవలె గుండ్రముగను నుండును. గింజలపై పొట్టు ఎరుపుగ నుండును. మోదుగపువ్వు పసుపుపచ్చగ నుండును. తెలుపు, పసుపు, ఎరుపు, నలుపు రకముల పూలభేదములుగలవు. నలుపు, ఎరుపువి దొరకుటకష్టము.

మోదుగపువ్వు వెగటుగ కారముగనుండును. చలువచేయును. రక్త, జీర్ణ, వాత ములకు ఈ పువ్వును జొన్నకలితోగాని బియ్యపుకలితోగాని కలిపిపెట్టిన తగ్గును.

మోతాదు:—పువ్వు 4 తులములవరకు.

## ముష్టి (Nux Vomica)

దీనినే విషముష్టి, గాంజిముష్టి అందురు. ఆకులు గుండ్రముగ కాయలు నిమ్మకాయంత ప్రమాణముగలిగి గుండ్రముగను నుండును. పండినపుడు దీనిపండ్లు ఎఱ్ఱగ, అందముగ నుండును. దీనిలోని గింజలు గుండ్రముగ బిళ్లలవలె నుండును. ముష్టిగింజలు మహాచేదుగనుండును. ఈ గింజలనుండి చమురు దీయుదురు. ఈ గింజలపొడి విరేచనములు గావించును. బలవర్ధకౌషధములలో ఈ గింజలపొడి కలిపి వాడుదురు. రక్తమూత్రము, మలబద్దకము, పక్షవాతము మున్నగు రోగములకు ఈ గింజలపొడిని తదితర మందులలో కలిపి వాడిన బాగుగా పనిచేయును.

మోతాదు:—పొడి 1 తులమువరకు.

## మునగ (Moringa Pterygosperma)

శ్లో॥ శిగ్రుశ్శోభాంజనః కృష్ణగంధస్స్యాద్బహులచ్ఛదః,

ఇది సాధారణమైన వృక్షము. ఎరుపు తెలుపుగల పూవులు రెండు విధములు. ఇవిగాక నల్లపువ్వులమునగ కూడగలదు. ఇది అరుదుగ దొరకును. ఈ గింజలనుండి పరిశుభ్రమైననూనె తీయుదురు. దీని చెక్కరసము వేడిజేయును. దొమ్మ, నాలిదొమ్మ, గురక మున్నగు వ్యాధులకు బాగుగా పనిచేయును. ఆకును ఆముదముతో వుడికించి బొడ్డు వాపులకు బెణుకులకు కట్టిన తగ్గును. పువ్వులరసమును తేనెతోకలిపి కంటి పువ్వులకు రేజీకటికి పెట్టిన తగ్గును.

## మూర్కొండ (Acalypha Indica)

ఆకుయొక్క గుండ్రతనము కోలదనము భేదముచేత రెండువిధములు. గుండ్రఆకులది మూర్కొండఅనియు కోలఆకులది పిప్పింటఅనియు వాడుదురు. ఆకు రసము వేడి చేయును. పురుగులు పడినపుండ్లకు ఈ ఆకునువాడిన పురుగులు చచ్చును. పీనస మెంగ బంతి మున్నగువాటికి ఈ పసరును 10 చుక్కలు పోసిన వెంటనే తుమ్మును.

మోతాదు:—పసరు 1 తులమువరకు.

---

## రావి (Ficus Religiosa)

శ్లో॥ పిప్పలశ్శ్యామలోశ్వత్థః క్షీరవృక్షొగజాశనః,
హరివాసశ్చలదళోమఙ్గల్యోబోధి పాదపః.

ఇది పెద్దవృక్షము. మిగుల ప్రసిద్ధమైనది. చెక్కరసము వగరుగ నుండును. చలువ జేయును. చెక్కపొడి పుండ్లను పనిచేయును. మనిబాగులో చెక్కపొడికలిపి రసికారు పుండ్లను పట్టించిన మానును. చెక్కను నీటిలో నానవేసిగాని, కాచిగాని నోటిపూతలకు పుక్కిలింపు చేయించవచ్చును. రోగ పశువులకు కాచి చల్లార్చి ఈ వగరునీటిని పథ్యముగా పెట్టవచ్చును. పక్షవాతముగల పశువునకును, నోటినుండి వచ్చు కఫ్ఫలకును చెక్కరసములో ఆవుపాలు కలిపిపెట్టిన తగ్గును.

మోతాదు:—చెక్కపొడి 2¼ తులములవరకు.

## రేవల్చిన్ని (Roeum Emodi)

ఈ మొక్కలు హిమాలయ ప్రాంతములం దెక్కువగా పెరుగుచున్నవి. ఈ మొక్క వేరునుకోసి పైచర్మమును వలచి ఎండబెట్టుదురు. ఇది పసుపు పచ్చగనుండును. రసము చలువజేయును. వంటినీరు దీయును. విరేచనము గావించును. మలబద్ధకమును పోగొట్టును. మజ్జిగలో రేవల్చిన్ని కలిపి వాడిన మూత్రరోగములు పోవును.

మోతాదు:—రసము సేరువరకు.

## వస (Acoveus Calamus)

శ్లో॥ వచోగ్రగంధాగోలోమీ షడ్గ్రంధా జటిలామతా।
జటిలాశతపర్వాన్యాలోమశా హేమవత్యపి.

ఈ మొక్కల ఆకులనుండి తైలమును దీయుదురు. దుంప మదపువాసనగలిగి యుండును. సొంటివంటిది. వేడిజేయును. శిరోవాతములకు ఆవుపాలలో వసకలిపి త్రాగించిన పనిచేయును. వసపొడి పురుగులను చంపును. ఘాటయిన వాసనకొట్టును. ఆకలిని పుట్టించును.

మోతాదు:—వసపొడి 1 తులమువరకు.

## వాము (Ptychotis Ajown)

శ్లో॥ జవానీదీప్యకోదీప్యో దీపనీయాజవానికా ।
జవసాహ్వోగ్రగంధాస్యాజ్జవాహ్వోభూతదంబకః ।

---

వాముచెట్టు చాడుగల పొలములలో నేలమీద ప్రాకెడు చిన్న చెట్లుగ నున్నవి. కొన్నిచోట్ల జానెడెత్తువరకు పెరుగును. దీని శిఖరములందు గుత్తులు గుత్తులుగా పుష్పములు పూచి క్రమముగా పువ్వులలో గింజలేర్పడును. వాము జీర్ణకారియగు వస్తువు. జీర్ణరోగములకన్నిటికి బాగుగా పనిచేయును. బలవర్ధకౌషధములలో కలిపి దీనిని వాడవచ్చును.

మోతాదు:—వాము 6 తులములవరకు.

## వాయింట (Cleome Penlaphylla)

శ్లో॥ అజగంధా వస్తుగంధా కబరీపూతబర్బరా॥

ఇది చిన్న మొక్క, గజముయెత్తులోపుగ పెరుగును. చెట్టున కంతకు ఒకవిధమగు వెగటువాసనయు, తెల్లనిపూవులును, సన్నగా పొడవుగా నుండు కాయలును, కాయలలో నల్లని చిన్న గింజలును యుండును. ఇందు వాయింట, కుక్కవాయింటయని రెండుజాతులుకలవు. ఆకులు గుండ్రముగ చిన్నవిగ నుండును. ఆకుపసరు వేడిచేయును. చర్మరోగములకు, కర్ణరోగములకు బాగుగా పనిచేయును.

## వావిలి (Vitex Negundo)

శ్లో ॥ నిర్గుండీ శ్వేతకుసుమస్సింతుక స్సిందువారకః॥

ఇది పెద్దవృక్షము. మారేడాకులవలె దీనియాకులు మూడు చిల్లలుగ నుండును. తెల్లవావిలి ఊదారంగుగనుండును. ఈ చెట్టుక్రిందనుండు మట్టికూడ నలుపుగ నుండును. దీనికర్రతో అన్నము వండునపుడు, కలియబెట్టిన అన్నమంతయు నలుపుగ నుండును. దీనిపూవులుగుత్తులు కోలగనుండును. ఆకుపసరు వేడిజేయును. వాతరోగములలో అమోఘముగా పనిచేయును. పశువునకు వెన్నెముకకు వెనుక మొత్తలకు దెబ్బలు తగిలినపుడు, పుట్టమన్నుతో వావిలాకు ఉడికించి గోరువెచ్చనిది రెండు మూడు పర్యాయములు కొట్టినతగ్గును.

మోతాదు:—పసరు అర్ధసేరువరకు

## వేప (Melia Azadirachta)

శ్లో॥ నింబోనియమనోనేతారిష్టస్స్యాత్పారిభద్రకః,
సుతిక్తస్సర్వతోభద్రః పిచుమందః ప్రభద్రకః,
కుష్టదేహోదేవదత్తశ్చరవిసన్నిభ సూర్యకః.

ఇదియును పెద్దదియగు ప్రసిద్ధమైన వృక్షమైయున్నది. ఆకు చెక్క కాయ పుష్పము మున్నగునవి వైద్యమున నుపయోగపడుచున్నవి. దీనిసమూలమందలి యేభాగము

---

ఆవుల సాధుత్వమూ; బ్రాహ్మణుల పేదరికమూ లేదు.

చూచినను టక్కూలి కేడుగానుండును. ఈచెట్టునందు గాలిని శుభ్రముచేయు మంచి గుణముకలదు. చెక్కపొడి పుండ్లను మనిచేయును. వేపఆకు పసరులో తగినంత మంచి నూనె కలిపి గోమారులున్న పశువుల శరీరమునకు రాసి ఒకఅరగంట ఎండలో కట్టిన అన్నియు రాలిపోవును. చర్మవ్యాధులకు, గాయములకు చెక్కరసము బాగుగాపని చేయును. పాముకాటునకు వేపచిగుళ్లరసము పశువు ముక్కు రంధ్రములలో పిండిన తుమ్ములు వచ్చును.

మోతాదు :—చెక్కపొడి 3 తులములవరకు.

## వెల్లుల్లి (Allium Sativum)

శ్లో॥ గృంజనోన్యోమహాకందోదుర్జరోదీర్ఘపత్రకః.

వెల్లుల్లి ఘాటువాసన గలిగియుండును. ఆకులు సన్నముగ పొడవుగ నుండును. పులుపు అనురసము ఒకటితప్ప తక్కినరసములన్నియు కలవుగనుక దీనికి రసోనయని పేరు. తెలుపుగనుండును గనుక వెల్లుల్లియందురు. వెల్లుల్లిదుంపయందు కారము, ఆకుల యందుచేదు, కాడయందు వగరు, కాడచివర ఉప్పు, బీజములందు తీపిరుచులుండును. వెల్లుల్లి నీరుల్లివలెనే యుండును. వేడిచేయును. వెల్లుల్లిరసము పేగులలోని క్రిములను చంపును. దీనియందు త్రుళ్ళుజేయుగుణము కలదు. వాత, రక్త, జీర్ణ, చర్మ, నేత్రరోగముల కన్నిటికి బాగుగా పనిచేయును.

మోతాదు :—3 తులములవరకు.

## వెదురు (Bambusa Arundinacea)

శ్లో॥ వంశా వేదుః కీచకస్స్యాత్కర్మార స్త్వచి సారకః,
మస్కరశ్శతపర్వాచ కంటాలుః కంటకీతథా.

ఇదిపొద. పొడవుగా పెరుగును. వెదురు కర్రలను ఇండ్ల కుపయోగింతురు. ఆకులు సన్నముగా పొడవుగా నుండును. పూవులు తెల్లగనుండును. వెదుళ్ల మధ్య నుండి బియ్యమువంటి యొక పదార్థము ఒక్కొక్కప్పుడు వచ్చును. వెదురు చేదుగ పులుపుగ వగరుగ నుండును. ఆకులో శోతశోయు స్వభావముగలదు. ఆకురసము కారముగ చేదుగ నుండును. కసిమిరి, మొంగబంతి, తెలియని రోగములు, నల్లకప్పు మున్నగు వ్యాధులకు బాగుగా పనిచేయును. లేతయాకులలో కొద్దిగా మిరియాలు ఉప్పుచేర్చి తినిపించిన పశువులకు కలుగు విరేచనముల కట్టించును.

మోతాదు :—ఆకులు 8 తులములవరకు.

---

ఇంటివాడు గొడ్డుగేదె అంటే, పొరుగువాడు పాడిగేదెఅన్నట్టు.

## వెఱ్ఱిపుచ్చ (Citrullus Colocynthus)

ఇదియొకతీగ. పుచ్చతీగవలెనుండును. దీనికాయలు దబ్బకాయలంత యుండును. తీగఅంతయు అమితమైన చేదుగలిగి యుండును. కాయలలోని గింజలు నలుపుగ సన్నిడి గింజలవలెనుండును. కాయలు గుండ్రముగ నుండును. ఆకులపై తెలుపుచీర లుండును. ఆకురసము చేదుగనుండును. చర్మరోగములు నశించును. కాయలను వాత రోగములకు వాడుదురు.

## వాకుడు (Solanum Vacquini)

దీనినే చిన్నములక యందురు. నేలమీద ప్రాకును. ముండ్లుండును. ముండ్లు పసుపుపచ్చ వన్నెగలిగి తెలుపుగనుండును. నేలములక కాయలవలనే కాయలు కాచును. ఊదా తెలుపురంగుల పూవులుపూచును. తెలుపుపూవులది మంచిది. దీని ఆకులు వంగఆకులవలె నుండును, గాని వాటికన్న చిన్నవి. కాయలు చిన్నవిగ గుండ్ర ముగ నుండును. పండినపుడు పసుపుపచ్చగ నుండును. ఆకుపసరు వెగటుగ కారముగ నుండును. కాకజేయును. కొమ్మడొల్లలు నాసికారోగములు శిరోరోగములకు ఈపసరు పనిచేయును. కొందరు వైద్యులు పశువునకు కలుగుపుండులో పురుగులుపడినయెడల ఈచెట్లలో ఒక దానిని తీసివేయుదురు.

## సీతాఫలము (Anona Squamosa)

ఇది సాధారణమైనచెట్టు. దీనిఆకులు కోలగా బలమైన పసరువన్నె గలిగి మృదువుగానుండును. దీనిలోని గింజలు నలుపురంగుగ నుండును. పండ్లు పైభాగము బుడుపులు కలిగియుండును. గుజ్జు తెలుపుగ మధురముగనుండును. ఆకును తేళ్ళుగల రంధ్రములో పెట్టిన తేళ్లు బైటికి వచ్చును. ఆకురసము పురుగులు పడిన పుండ్లలో వేసిన పురుగులు చచ్చును.

## శొంఠి (Zingiber Officinale)

శ్లో॥ శుంఠి విశ్వౌషధం విశ్వం కటుభద్రం కటూత్కటం,
మహౌషధం శృంగిబేరం నాగరం విశ్వభేషజం.

అల్లమును సున్నపునీళ్ళలో ఉడకబెట్టి ఎండించిన శొంఠియగును. అన్నిమందుల కన్న యోగ్యమైనదిగాన మహౌషధమనియు విశ్వభేషజమనియు నందురు. కారము గలది కనుక కటుగంధియనియు, కఫమును హరించునదిగాన కఫాదిక యనియు, శరీరము నార్చునది గాన శోషణమనియు, దీనికీపేరు గలిగెను. శొంఠి వేడిజేయును, కారముగ నుండును. వాతజీర్ణరోగములకు అమోఘముగా పనిజేయును.

మోతాదు:—4 తులములవరకు

---

ఉత్తర మురిమిఉరిసినా; పాము తరిమిఉరచినా తిరగదు.

## సోపు (Pimpinella Anisum)

జీలకర్రవలెనుండునుగాని అంతకన్న పెద్దది; వడ్లగింజలో నాల్గవవంతు యుండును. సువాసనగానుండును. నమలిన తీపిగానుండును. జీర్ణశక్తిని కలుగజేయును. రక్తవాత జీర్ణరోగముల కన్నిటికి యిది బాగుగా పనిచేయును.

మోతాదు :—4½ తులములవరకు.

## హంసపాది (Vitis Pedata)

పొలములలో భూమినంటుకొని ప్రాకు ఒకజాతిమొక్క. ఆకులు పక్షియొక్క అడుగువలె గొగ్గులుగలిగి చిన్నదిగ నుండుటచే దీనికి హంసపాది యని పేరువచ్చినది. నూతులు చెరువులు మొదలగు ప్రాంతములందు ఎక్కువగా మొలచును. ఆకుపసరు చేదుగ స్వాదుగనుండును. చర్మవ్యాధులకు పనిచేయును. సాలెపురుగుల విషములకు కూడ పసరును వాడవచ్చును.



ఎక్కితే గుఱ్ఱపురౌతు; దిగితే కాలిబంటు.

# ఆంగ్లేయపశువైద్యవస్తుగుణదీపిక

## ఎనిమిదవ భాగము

ప్రస్తుతకాల పరిస్థితులనుబట్టి ప్రతిరైతు ఇంగ్లీషుమందులను గూర్చి తెలిసికొను టకు ఆసక్తి పడుచున్నాడు. పశువులకుకూడ ఇంగ్లీషుమందు లున్నవాయని ఆశ్చర్యపడే వారున్నారు. అందుచేత రైతులు, గ్రామములలో పశువైద్యముచేయు నాటువైద్యులు కూడ తప్పక ఈ వస్తుగుణ దీపికలోని సారాంశముల గ్రహించుదురుగాక. మీకు తెలిసి నంతవరకే ఇంగ్లీషుమందులు వాడవలెనుగాని తెలియకపోయినచో వాడుట మహాదోషము. మీరంతా ఇంగ్లీషుమందులను పశువులకు వాడమని నా యుద్దేశ్యముకాదు. ఆయుర్వేద పశువైద్య మూలికలకు ఇంగ్లీషువైద్య మందులకు వ్యత్యాస మెంతయున్నదో గ్రహించ గలందులకు ఈ గ్రంథములో తెలుపవలసి వచ్చినది. ఇంగ్లీషు వెటరినరీ వారు చేసే వైద్యము, వారి జెట్టుగుట్టులుకూడ గ్రహించుట మంచిదని నా యభిప్రాయము. ప్రతి రైతుకూడ ఈరెండు వైద్యములగుట్టు గ్రహించి ఏది చవుకగా నుండిన దానినే ఆచర ణలో పెట్టుకురుగాక.

### అమ్మోనియంక్లోరేడ్ (Ammonium Chloride)

ఇది తెలుపు రంగుగనుండి వెగటుగానుండును. సారాయిలోను వేడినీటిలోను కరగును. ఇది కాలేయ సంబంధమగు రోగములకు, రొంప, అజీర్తి, కామెర్లు, లివర్ రాట్, మున్నగు రోగములలో వాడుదురు. సాధారణముగా దీనిని నేలవేముతోను, నూరేకారముతోను కలిపి వాడుదురు. పైకి చల్లగానుండు లోషనుగా పొటాష్ నైట్రేట్‌తోగాని, సోడియంక్లోరేడ్‌తోగాని కలిపివాడుదురు.

మోతాదు:—పశువులకు ½ ఔన్సునుండి 1½ ఔన్సువరకు మాత్రమే.

### అమ్మోనియంకార్బనేట్ (Ammonium Carbonate)

ఇది ముక్కలుగానుండి ఘాటుగా తెలుపురంగుగా నుండును. విరేచనము గావిం చును. పొట్టలోని గాలిని తీసివేయును. ఇంకను విషజ్వరములకు, కీటకముల కాట్లకు, దగ్గునకు, రొంపకు, కడుపునొప్పికి, నెమరుపొట్ట అజీర్ణ ఆహారముతో దట్టమై యున్న పుడు పెద్దపేగులో మలము చిక్కుకొని పోయినపుడు దీనిని వాడవచ్చును.

మోతాదు:—½ ఔన్సునుంచి 1 ఔన్సువరకు.

---

ఎద్దు మోసినంత; గోనె పట్టినంత.

## అయొడీన్ (Iodine)

ఇది నలుపురంగుగ తళతళ మెరయుచు పొరలుపొరలుగా నుండును. ఇది విష పదార్థము. ప్రళ్ళ్యతండ జేయును. తత్వమును బాగుచేయును. దీర్ఘవాతములకు, అతి మూత్రమునకు, వాపులకు, బెణుకులకు, చర్మవ్యాధులకు పనిచేయును. లోనికి ఈయ వలసి వచ్చినపుడు జాగ్రత్తగా తదితరమందులతో కలిపి ఈయవలెను. వ్యాసులైన్‌లో గాని క్రొవ్వుతో గాని దీనిని కలిపి వాపులకు బెణుకులకు వాడవచ్చును.

మోతాదు :—30 నుంచి 60 గ్రెయినుల వరకు.

## అయిడోఫారం (Iodoform)

ఇది పసుపుపచ్చగ స్ఫటికమువలె మెరయుచుండును. దీనిలో బలమగు క్రిమి సంహారక శక్తిగలదు. గాయములకు చీముపట్టిన పుండ్లకు, కాలిన బొబ్బలకు చర్మ వ్యాధులకు బాగుగా పనిచేయును. ఆరుభాగముల బోరికుఆసిడ్‌తో ఒకభాగము అయిడోఫారం కలిపి వాడిన పుండ్లకు గాయములకు బాగుగా పనిచేయును. వ్యాసులైన్‌లో ఈపొడిని కలిపి ప్రళ్ళ్యపండ జేయుటకు మురికిగాయములకు పట్టించవచ్చును.

మోతాదు :—1 నుంచి 10 గ్రెయినుల వరకు.

## ఆర్సెనియస్ ఆసిడ్ (Arsenious Acid)

దీనినే తెల్లపాషాణ మందురు. ఇది మిగుల విషవస్తువు. తత్వమును బాగుచేయుటకు బలవర్ధ కౌషధములలో కలిపి వాడుటకు ఉపయోగపడును. చర్మముపైన రాసిన పొక్కును. చర్మరోగములకు కూడ వాడవచ్చును. కాని జాగ్రత్తగా వాడవలెను.

మోతాదు :—2 నుంచి 8 గ్రెయినుల వరకు.

## ఆసిడ్ బోరిక్ (Boric Acid)

దీనినే బోరిక్కామ్లమందురు. దీనిలో వెలిగారము కలియును. స్వచ్ఛముగ తెలుపురంగుగా నుండును. మంటలేని మందు. ప్రతిడాక్టరు దీని నెక్కువగా వాడును. ఈపొడి సూక్ష్మజీవులను వెంటనే చంపలేదుగాని వాటివృద్ధిని మాత్రము నాపును. దీనిని లోపలికిచ్చిన మూత్రవ్యాధులు తగ్గును. ఇంకను చర్మవ్యాధులకు నోటిపుండ్లకు బాగుగా పనిచేయును. తగినంత వ్యాసులైన్‌లో గాని క్రొవ్వులో గాని వెన్నలో గాని మైలతుత్తము $\frac{1}{8}$ భాగము గంధకము అరభాగము బోరికు ఆసిడ్ రెండుభాగములు కలిపి ఆరుగాళ్ళకు బెణుకులకు తదితర వాపులకు అప్పుడప్పుడు రాసి మర్దన చేసిన తగ్గును. ఈ పొడిలో చీముపట్టకుండనుండు గుణముకలదు. ఒక ఔన్సు డిస్టిల్డువాటరులో 30 గ్రెయినుల బోరికు ఆసిడ్‌ను కలిపి కంటి ఎరుపులకు, కండ్ల పుసులకు వాడవచ్చును. గొంతులో

ఎద్దు ఎండకులాగ; దున్న నీడకులాగ.

పుండు ఏర్పడినపుడు గ్లిసరైనులో ఈపొడిని కలిపి రాయవచ్చును. ఈ ఆసిడ్ ను లోపలికిచ్చిన 12 గంటలలోపలనే అందు సగభాగము మూత్రముద్వారా పడిపోవును.

## కాల్సియం క్లోరిడ్ (Calcium Chloride)

ఇది సున్నము నుంచి తయారగును. గాలితగిలిన ద్రవరూపముగా నగును. తెలుపు రంగుగల గడలుగానుండును. దీనిని చర్మవ్యాధులకు రసిగారు పుండ్లకు వాడుదురు. మావిని త్రోసివేసి వెటరినరీ డాక్టరు ఈ మందును తదితర మందులతో కలిపి ఇంజెక్షను యిచ్చుదురు. ఇంకను గాలిమంటుమీద వచ్చు కనిమిరికికూడ పనిచేయును.

మోతాదు:—1 నుంచి 2½ డ్రాములు.

## క్రిసాల్ (Cresol)

ఇది కొంచెము నలుపురంగుగా వాసనగా నుండును. పశువు మందమతిగ నున్నపుడు, పారుడెక్కువగా నున్నపుడు గంజిలో కలిపిపెట్టిన తగ్గును. శస్త్రసంబంధమగు లోషనుగా వాడవచ్చును.

మోతాదు :—½ నుంచి 2 డ్రా.

## జెంటియిన్ (Gentiana)

ఇది ఒకచెట్టువేళ్ళతో తయారగుపొడి. చేదు, రుచి, ఆకలి బలవర్ధకౌషధముగా పనిచేయును. ఇంగ్లీషువైద్యములో ఈపొడిని ఎక్కువగా వాడుదురు. కార్జముపై చురుకుదనము పుట్టించును.

మోతాదు :—2 నుంచి 6 డ్రాములు.

## జింకు క్లోరిడ్ (Zinc Chloride)

ఈ లవణము తెలుపుగానుండును. రక్తనాళములను ముడుచుకొనునట్లు చేయును. దుర్గంధగాయములను, కన్న శస్త్రము చేసిన తరువాతను, మాదలను, డెక్కగాయములను లోషన్ గాచేసి వాడిన బాగుగా పనిచేయును.

మోతాదు:—1 నుంచి 2½ గ్రెయినులవరకు

## జింకు సల్ఫస్ (Zinc Sulphas)

దీనినికూడ బలవర్ధ కౌషధములలోను, అతిసారమునకు, కంటివాపులకు, అవికికి, దుర్గంధ పుండ్లకు వాడవచ్చును.

మోతాదు:—2 నుంచి 3 డ్రాములు.

---

ఎద్దువలెతిని; మొద్దువలె నిద్రపోయినట్టు.



సాంప్రదాయముగల ఇంగ్లీషుజాతి గోవులు



గోసంరక్షణ సంఘము. తెనాలి



శ్రీ పె. క. వెం. సత్యనారాయణరాజుగారి పాడిగేద. పాండువ్వ (ప. గో.)



శ్రీ నిమ్మగడ్డ వెంకటసుబ్బయ్యగారి ఎద్దు—పెదగొట్టిపాడు (గుం. జి.)



శ్రీ కొండపల్లి సోమయ్యగారి నాగళ్ళు — వేట్లపాలెం (తూ. గో.)

## టర్పెంటైన్ (Oil of Turpentine)

దీనిని కర్పూరమునుండి తయారు చేయుదురు. ఇది స్వచ్ఛముగ నిర్మలముగ నుండి చురుకుదనము కలిగించును. నొప్పిని వాయువును పోగొట్టును. మ్రుళ్లిపండ జేయును. పైభాగమందువాడిన మంటగానుండును. న్యూమోనియా కడిమిరి, తెంగబంతి, పీనస మున్నగు రోగములలో దీనిని ఆవిరిరూపముగాచేసి వాడిన తగ్గును. చర్మముపైనుండు పురుగులను లోపలనుండు ఎలికపాములను చంపును. అన్నిరకముల బెణుకులకు నొప్పులకు పనిచేయును.

మోతాదు:—1 నుంచి 1½ ఔన్సులవరకు.

## టానికు ఆసిడ్ (Tannic Acid)

ఈ చూర్ణము కొంచెము బూడిదరంగుగానుండును. మాచికాయనుంచి తయారగును. ఒగరుగల వాసనగానుండును. గాలిక్ ఆసిడ్, టానిక్ ఆసిడ్ ఒకే పదార్థము నుండి తయారుచేయబడునుగాని గాలిక్ ఆసిడ్‌ను లోపలికి ఇచ్చెదరు. టానిక్ ఆసిడ్‌ను వాపుదలనొందిన భాగముల నుపయోగించుదురు. గొంతుకలోను, పంటిచిగుళ్లయందును, వాపుదలనొందిన భాగములకు గ్లిసరైనులో తగినంత కలిపిరాసిన తగ్గును.

మోతాదు:— 20 నుంచి 60 గ్రెయినులు.

## ఆంటిమోనియం టార్టారం (Antimonium Tartaram)

ఈ పొడి తెలుపుగానుండును. దీనిని పెద్ద పెద్ద మోతాదులిచ్చిన విషముగా వర్తించును. ముక్కుపీనసకు, యీమందును రక్తములోనికి మూడునాలుగు ఇంజెక్షన్సు యిచ్చిన తగ్గును. కాని జాగ్రత్తగా అనుభవముగల వైద్యునిచే యిప్పించవలెను. ఇంకను జ్వరములకు, జలుబులకు, వాపులకు, చర్మముపైన కలుగు మంటలకు పనిచేయును.

మోతాదు:— 1 నుంచి 6 గ్రెయినులు

## ఎక్స్ట్రాక్టమ్ బెల్లడోనా (Axtractum Belladonnae)

ఒకచెట్టుయొక్క లేత ఆకులనుండి లేత కొమ్మలనుండి వచ్చురసముతో తయారగును. నలుపురంగుగా మెత్తగా వెగటు వాసనగానుండును. విషజ్వరము, గురక కుత్తుకవాపు, జలుబు, నరముల సంబంధముగు రోగములకు యిచ్చిన బాధను తగ్గించును.

మోతాదు:— 1 నుంచి 2 డ్రాములు.

---

ఎద్దేమి యెరుగురా అటుకులచవి; గాడ్దేమి యెరుగురా గంధపుపొడి వాసన.

## ఎక్స్ట్రాక్టమ్ కన్నబిస్ ఇండికా (Extractum Cainnabis Indicae)

గంజాయి పొడి తయారగును. చురుకుదనము కలిగించును. నొప్పినితగ్గించి మత్తును కలుగజేయును. ధనుర్వాతము, నరములబలహీనత, వాతము, కడుపునొప్పి మున్నగు వాటికి పనిచేయును.

మోతాదు:— 2 నుంచి 4 డ్రా.

## క్లోరల్ హైడ్రెస్ (Chloral Hydras)

ఇది నిర్వర్ణముగా స్ఫటికములుగనుండును. దీనిలోకూడ మత్తును కలుగజేయు గుణముకలదు. నల్లమందువలెనే పనిచేయును. నీటిలోగాని జావలోగాని కలియును. కడుపుబ్బునకు, కడుపునొప్పికి పశువులోపల పిండముచెడినపుడు తీసివేసిన తరువాత దీనిని గంజితో కలిపి ఈయవచ్చును. ఇంకను వాతలు వేయునపుడు శస్త్రము చేయుటకు ముందు మత్తుమందుగా వాడవచ్చును.

మోతాదు:—½ నుంచి 1½ ఔన్సులవరకు.

## క్రియోసోట్ (Creosote)

ఇది కొంచెముబూడిదరంగుగనుండి ఒకవిధమగు వాసన కలిగియుండును. పైన రాసిన పొక్కుగుణము కలదు. దుర్వాసనను పోగొట్టును. క్రుళ్లకుండజేయును. చీద పొడు తగిలినపుడు వెటరినరీ డాక్టర్లు దీనిని జావలో కలిపి యిచ్చెదరు. వ్యాసులైనులో కలిపి చర్మరోగములకు వాడిన పనిచేయును.

మోతాదు:—1 నుంచి 1½ డ్రాము.

## కార్బాలిక్ ఆసిడ్ (Carbolic Acid)

ఇది స్వచ్ఛముగ గడ్డలుగనుండి కరిగిన తరువాత బూడిదరంగుగా నుండును. ఇది విషవస్తువు. పగరుగ సోకుడు పరిహారముగ నుండును. దీనిలో క్రుళ్లకుండనుంచు శక్తి గలదు. చర్మమునకు తగిలిన పొక్కును. బండబారును. చర్మరోగములకు గాయములకు ఒకపాలు కార్బాలిక్ ఆసిడ్, నూనె 15 భాగములు కలిపివాడిన పనిచేయును. ఇంతియె గాక దొమ్మ, గురక, జెబ్బవాపులకు ఒకడ్రాము తీసికొని సేరు గంజిలోగాని జావలో గాని ఆరంభములో యిచ్చిన తగ్గును. తగినంత వ్యాసులైనులో ఈ మందును కలిపి చర్మరోగములకు వాడిన పనిచేయును.

మోతాదు:—½ డ్రామునుంచి 1 డ్రామువరకు.

---

ఎనుబోతుమీద వానకురిసినట్లు.

## లెడ్ అసిటేట్ (Led Acetate)

ఇది తెలుపుగానుండి రక్తస్రావము నఁదును. దీనిని లోషనుగాచేసి గారపట్టుటకు, చల్లదనమునకు, నలుగుడు గాయములకు, వాపులకు, బెణుకులకు, కొమ్ములు విరిగినపుడు మంటను తగ్గించుటకు వాడవచ్చును. ఈ లోషనునే వైట్ లోషన్ అందురు. దీనిలో ½ వంతు జింకుసల్ఫేటు ఒక భాగము లెడ్ అసిటేట్‌ను కలిపిన తయారగును.

మోతాదు:—½ నుంచి 2 డ్రాములవరకు

## లిక్కర్ అమ్మోనియా ఫార్టస్ (Liquor Ammoniae Fortus)

ఇది స్వచ్ఛముగా ద్రవరూపముగానుండును. వాసనచూచిన ప్రమాదము కలుగును. కర్పూర తైలములో దీనిని కొదిగా కలిపి బెణుకులకు వాపులకువాడిన పనిచేయును. దీర్ఘ కడుపుబ్బులకు తదితర మందులతో కలిపి యిచ్చిన తగ్గును.

మోతాదు:—1 నుంచి 3 డ్రాములు.

## లిక్కర్ ఆర్సెనికాలెస్ (Liquor Arsenicalis)

ఈ ఔషధము కసిమిరి, వగరు మున్నగు శ్వాసరోగములకు వాడవచ్చును.

మోతాదు:—½ నుంచి 1 ఔన్సువరకు.

## సోడా బైకార్బనేట్ (Soda Bicarbonate)

దీనినే సోడాఉప్పు అందురు. తెలుపుగ చిరిచేగాగనుండును. కడుపునొప్పి కడుపుబ్బుశూలలు మున్నగు జీర్ణవాతరోగములలో బాగుగాపనిచేయును. బలవర్ధ కౌషధములలో కలుపవచ్చును. కాలిన స్థలములందు ఈపొడిని అద్దిన బాగుగా పనిచేయును. విషపురుగుల కాట్లకు ఈపొడిని పట్టించిన పనిచేయును.

మోతాదు:—1 నుంచి 3 ఔన్సులవరకు.

## సోడా సాలిసైలస్ (Soda Salicylas)

పొడి తెలుపుగా మెత్తగానుండును. ఇది వాతరోగములకు కీళ్లనొప్పులకు జ్వరములకు పనిచేయును. వెటరినరీవారు ఈ మందునే వాతనొప్పులకు బెణుకునొప్పులకు చర్మముక్రిందకు ఇంజెక్షన్ యిచ్చుదురు.

మోతాదు:—½ నుంచి 1 ఔన్సువరకు.

---

## సోడా సల్ఫస్ (Soda Sulphas)

ఇది తెలుపుగ మెరయుచుండును. పేగులయందలి గ్రంథులకు చురుకుదనము బుట్టించి విరేచనము గావించును. విరేచనమగుటకు, తత్వమును బాగుపరచుటకు వాడవచ్చును.

మోతాదు:—½ నుంచి 1 పౌనువరకు.

## స్పిరిట్ ఈథర్ నైట్రస్ (Spirit Ether Nitrous)

ఇది ఘాటుగానుండును. పొక్కును. ఇది జ్వరములకు, ప్రశాంతపడజేయుటకు, మూత్రము జారీయగుటకు, వాయువును హరింపజేయుటకు, చురుకుదనము కలిగించుటకు శిలామేహ వాతమునకు ఈ మందును నీటిలో కలిపి వాడవలెను.

మోతాదు:—½ నుంచి 1 ఔన్సు.

## స్పిరిట్స్ అమ్మోనియా ఆరోమాటికస్ (Spirits Ammoniae Aromaticus)

ఇది శరీరములోని పులుపును తగ్గించి జీర్ణశక్తి కలుగజేయును. ఆకలిని పుట్టించును. కడుపునొప్పి కడుపుబ్బరము మున్నగు వాటికి బాగుగా పనిచేయును.

మోతాదు:— 1 నుంచి 2 ఔన్సులు.

## సిల్వర్ నైట్రేట్ (Silver Nitrate)

ఇది తెలుపుగ గడ్డలుగ నుండును. దీనిని లోషనుగాజేసి వ్రణములకు కంటి తెలుపులకు కంటి పొరలకు వాడవచ్చును. కొయ్యగండలు పెరిగినపుడు ఈ మందును రుద్దిన తగ్గును.

మోతాదు:— 1 నుంచి 3 గ్రెయినులవరకు.

## సల్ఫర్ సబ్లిమటం (Sulphur Sublimatam)

దీనినే గంధకమందురు. ఇది తత్వమును చక్కబరచును. విరేచనము గావించును, క్రిమిని హరించును. చర్మరోగములలో పైకి లోపలికి వాడవచ్చును.

మోతాదు:—½ నుంచి 2 ఔన్సులు.

## హైడ్రార్జరీ అయోడైడ్ రుబ్రం (Hydrargyri Iodide Ruibrum)

ఈ పొడి ఎరుపుగా నుండును. ప్రతి డాక్టర్ వాడును. 4 భాగముల వ్యాసులైనులో 1 భాగము మందునుకలిపి గూటిగడ్డలకు, పంపరకు, అడ్రుపాపులకు, గట్టికంతు

ఏకునుగ్గు రేయరువాకసాగిస్తే; కాడిమోకులు దొంగలు యెత్తుకొని పోయినారట.

లను వాడిన పాక్కి పనిచేయును. ఒకేపర్యాయము రాసి వెన్న పైన రాయవలెను.

మోతాదు:— 1 నుంచి 6 గ్రెయినులు.

## ఫినైయిల్ (Phenol)

నలుపుగా వాసగానుండును. పురుగులుపడిన పుండ్లలో దీనిని దూదిలోముంచి పెట్టిన పురుగులుచచ్చును. పుండ్లుపట్టించిన పుండుపెద్దదగును. దుర్వాసనగానుండు నపుడు దీనిని లోషనుగా చేసివాడవచ్చును.

## టింక్చరు అయోడిన్ (Tincture Iodine)

ఇది ఎరుపురంగుగ నుండును. దీనిలో మిక్కిలి తీవ్రమగు శక్తిగలదు. నిమిషములో సూక్ష్మజీవులను చంపును. ఇది పుండునకు తగిలిన మంటగలుగును. ఈమందు ప్రతి ఆంగ్లేయ పశువైద్యశాలలోను యుండును. గాయములు తగిలినవెంటనే వాడరాదు. అట్లువాడిన చాలా మంటగానుండును. మందగుదికి దీనినే వాళిమునకు యింజెక నుయిచ్చుదురు. అయోడిన్ పావుఅవున్సు, పొటాషియంఅయొడైడ్ ఔన్సు, స్పిరిట్ 20 ఔన్సులు కలిపిన టింక్చర్ ఆయోడిన్ అగును.

మోతాదు:—1 నుంచి 3 డ్రాములు.

## టింక్చర్ జింజిబరిస్ (Tincture Zingiberis)

ఇది సొంటితో తయారగును. మన దేశములో పండిన ఓషధులను విశేషములను తీసికొనివెళ్లి పరిశోధించి వివిధరకముల టింక్చర్సును తయారుచేసి పంపుచున్నారు. దీనిని నీటిలో కలిపిన పాలవలెనగును. దీనిని వాతజీర్ణరోగములలో వాడిన బాగుగా పని చేయును.

మోతాదు;—2 నుంచి 4 ఔన్సులవరకు.

## టింక్చర్ ఓపియం (Tincture Opium)

దీనినే నల్లమందు ద్రావకమందురు. ఇది నలుపు ఎరుపు బూడిదవర్ణములు గలిగిన ద్రవపదార్థముగా నుండును. మత్తును కలుగజేయును. నిద్రను పట్టించును. నొప్పిని తగ్గించును. విరేచనములు, రక్తవిరేచనములకు బాగుగా పనిచేయును.

మోతాదు:—½ నుంచి 1 ఔన్సువరకు.

## టింక్చర్ అసఫటీడా (Tincture Asafoetida)

దీనినే ఇంగువ ద్రావకమందురు. నీటిలోకలిపిన పాలవలెనగును. పాడిపశువులకు తవుడు విస్తారముగా పెట్టుటచేత జీర్ణము కానప్పుడు ఒకఔన్సు మందును సేరు నీటిలో కలిపియిచ్చిన తగ్గును. మోతాదు;—1 నుంచి 2 ఔన్సులవరకు.

---

ఏనుగునెక్కినవాడు పుక్కకూతకు జడియడు.

## టింక్చర్ కార్డిమం (Tincture Cardimom)

దీనిని ఏలకులతో తయారుచేయుదురు. ఈ అరఖు ఆకలిని పుట్టించును. చిన్న దూడలు తెలుపుగా పారునపుడు దీనిని ఇంగువతో కలిపి యిచ్చిన పనిచేయును.

మోతాదు:—1 నుంచి 4 ఔన్సులవరకు.

## టింక్చర్ చైరేటా (Tincture Chiretta)

దీనిని నేలవేముతో తయారుచేయుదురు. చేదుగనుండును. బలవర్ధ కౌషధముల లోను, జ్వరములకు వాడవచ్చును.

మోతాదు:—1 నుంచి 2 ఔన్సులవరకు.

## టింక్చర్ జెంటైన్ (Tincture Gentian)

దీనిని బలవర్ధ కౌషధములలోను, వాత జీర్ణరోగములలోను వాడుదురు.

మోతాదు:—1 నుంచి 2 ఔన్సులు.

## టింక్చర్ నక్సువామికా (Tincture Nux Vomica)

విషముష్టి గింజలతో తయారగును. బలవర్ధ కౌషధములలోను పక్షవాతము అజీర్తి మలబద్ధకము మున్నగు వాటికి వాడవచ్చును.

మోతాదు:—1 నుంచి 2 ఔన్సులవరకు.

## పొటాషియం పర్మాంగనేట్ (Potassium permanganate)

ఇది ఊదారంగుగ పలుకులుగ నుండును. దీనికి అధికముగ క్రిమిసంహారకశక్తి గలదు. అందుచేతనే పశువులకు కలుగు గురక, దొమ్మ, పెద్దరోగము మున్నగు అంటు రోగములలో నీటిలో కలిపి లోపలికి యిచ్చుదురు. ఈ పొడిని నీటిలో కలిపినపుడు చంద్రకాంతివంటి ఎరుపురంగుగల ద్రవమేర్పడును. ఈ ద్రావకము ద్రవ్యములు పదార్థములతో చేరినపుడు ప్రాణవాయువు వెలువడి అది ఆ పదార్థములతో కూడి వానిని శుద్ధి చేయును. నూరు భాగముల నీటిలో ఒకభాగము పొడిని కలిపి శస్త్రచికిత్స చేసినపుడు తదితర పుండ్లను కడుగుటకు లోషనుగా నుపయోగపడును. శస్త్ర పరిముట్లను ఈ లోషనులో వేసిన నల్లబడును.

మోతాదు:—2 నుంచి 4 డ్రాములవరకు.

---

ఏలేవానియొద్దు పోతేనేమి; కాచేవానికన్న పోతేనేమి.

## పొటాష్ క్లోరస్ (Potash Chloras

ఇది నిర్వర్ణమగు పలుకులుగనుండును. పటికవలెనే యుదియును పనిచేయును. నీటిలో చక్కగా కలియును. నోటినుంచి నీరు కారునపుడు, దీర్ఘ పడిశమునకు, అగ్ని కత్తిరించిన తరువాత బాధగానున్నపుడు, నోరు పూచినపుడు, వాపుగ వాచినపుడు ఈ మందును లోపలికి బైటకు వాడవచ్చును. రెండువేళ్ల బెల్లముతోగాని తేనెతోగాని కలిపి ఈయవలెను.

మోతాదు:—½ నుంచి 1 ఔన్సువరకు.

## పొటాష్ బైకార్బనేట్ (Potash Bicarbonate)

ఇది తెలుపుగానుండును. నీటిలో కలియును. ఔషధముల కన్నిటికి యుండెడి గుణములు ఈ లవణమునందు దొక్కదానికే గలదు. ఇది వాతములకు, తత్వమును బాగు చేయుటకు వాపులకు ప్రశస్త సలములకు పనిచేయును.

మోతాదు:—½ నుంచి 1 ఔన్సువరకు.

## పొటాష్ నైట్రస్ (Potash Nitras)

సూరేకారమునుంచి తయారగును. తెలుపుగానుండి మెరయుచుండును. సుంచి చురుకుగల పదార్థము. రుచికి కారముగ చిరుచేదుగ నుండును. తత్వమును బాగుపరచును. జ్వరమును తగ్గించును. గంజిలోగాని జావలోగాని ఈపాడికి కలిపి దాహాముగా నీయవచ్చును. మూత్రరోగములలో బాగుగా పనిచేయును. వేసవికాలములో వేడిచేసినపుడు, శిరామేహ వాతమునకు, శేరుమాదకు, మేయునగనపుడు, చూడిపశువులమీదకు ఆబోతు ఎక్కగా మానము వాచినపుడు సూరేకారము పనిచేయును.

మోతాదు:—4 నుంచి 10 డ్రాములవరకు.

## ఫార్మలిన్ (Formalin)

ఇది ద్రావకముగానుండును. విషవస్తువు. తెల్లపునీటిలో కొన్ని చుక్కలు కలిపి కడుపునొప్పి, కడుపుబ్బులకు ఈయవచ్చును. కొమ్ములు విరిగినపుడు లోపునగా చేసి కట్టుకట్టిన మానును.

మోతాదు:—1 నుంచి 2 డ్రాములవరకు.

## మెగ్నీషియం సల్ఫేట్ (Magnesium Sulphate)

ఇది తెలుపుగనుండును. విరేచనము గావించును. తత్వమునందు మార్పు కలిగించును. దీనిని లోపునగాజేసి కీళ్లవాపులకు బెణుకులకు గాడవచ్చును. కడుపులోపల గాని తేలు నకో సొంటిపొడితో వేడినీరు కలిపి ఈయవలెను.

మోతాదు:—½ నుంచి 1 పౌనువరకు.

# శారీరశాస్త్రము

## తొమ్మిదవ భాగము

### పశు దేహ నిర్మాణము

### (Parts of the animal body)

పశు శరీరమునందలి వివిధభాగములను వివరముగా వర్ణించి, వానిస్వభావ ప్రయోజనముల దెలుపుటయే శారీరశాస్త్రముయొక్క పరమోద్దేశము. శరీరమంతటిని, అందలి భాగములను ఆరోగ్యవంతములుగా నుంచి జీవికి జీవిత సౌఖ్యమును గూర్చుటయే స్వస్థవృత్తముయొక్క పరమగమ్యము. కాబట్టి శారీరస్వస్థవృత్తముల కవినాభావసంబంధము కలదు. శరీరభాగముల ఆకారస్వరూపములను సూక్ష్మముగా వివరించునది అనాటమి (Anatomy) వాటి యుపయోగ ప్రయోజనములను, వాటి క్రియావిధానములను వర్ణించునది శారీరశాస్త్రము (Physiology). ఈరెంటి నిజపరిస్థితుల నెరింగి ఆరోగ్య సంధానముజేయు మార్గముల నెరిగించునది ఆరోగ్యశాస్త్రము లేక స్వస్థవృత్తము. శరీర నిర్మాణమునకై అస్థి, ఉపాస్థి, కండరము, నాడి, క్రొవ్వు, బంధకము, రక్తము ఏర్పరుపబడియున్నవి. ఇవి శరీరమంతటను వ్యాపించి ఎచ్చటనున్నను ఏకకార్య నిర్వాహణమే జేయుచుండును. ఇవిగాక శరీరమునందు అచ్చటచ్చట స్థిరములై విశేషకార్య నిమగ్నములగు భాగములుకూడ గలవు. ప్రతి రైతు ఈ చింతామణిలో తెలిపిన ప్రాథమిక పశుశరీరశాస్త్రములోని ముఖ్యాంశములను గ్రహించి నోరులేని పశువులకు పరోపకారము చేయుదురుగాక.

చతుష్పాద జంతువుయొక్క అస్థిపంజరములోని వివిధభాగములు పైపటమునందు చూడుడు. అస్థిపంజరము రెండుభాగములుగా విభజింపవచ్చును. ప్రక్కఎముకలు వెన్నెముకతో కూడుకొని యుండును. వెన్నెముక చిన్నచిన్న ఎముకలతో కూర్చబడి యుండు భాగమునకు పూస ఎముకయని పేరు. దానియొక్క చివరభాగముతో తలను, రెండవ చివరభాగముతో తోకను నిలబెట్టుచున్నది. ఈ వెన్నెముక నంతటిని చిన్నచిన్న భాగములుగా విభజించవచ్చును. వీనినిబట్టియే మెడ, రొమ్ము, పొట్ట, మున్నగు అవయవములు కూర్చబడి యున్నవి. పశుశరీరములో ఎముకలు ఒకటొకటిగా కార్టిలేజ్‌తో బిగించబడి యుండుటకు అస్థిపంజరమని పేరు.

అస్థిపంజరము శరీరములోని మృదువగు కండరములను చుట్టములవలె కాపాడును. అది పెద్దపెద్ద ఎముకలను కలిగియుండును. కాని అది కొన్ని భాగములలో గట్టిగా

---

మంచెడుగింజలకు కూలికిపోతే, తూమెడుగింజలు దూడతిన్నట్లు.




1, 2 లోపలి ముఖ్యజీర్ణావయవములు. 3. ప్రేవులు.

4, 5 సప్తపథ, ఉమ్మినీటి గ్రంథులు వగైరాలు. 6. దంతములు.

7, 8, 9, 10 పొట్టలోని భాగములు.



శ్రీ వేదళ్ల వెంకటసుబ్బయ్యగారి ముద్దులమూటగట్టు ఎడ్లజత.
పల్లెకోన (గుంటూరు జిల్లా)



మా ఆంధ్ర జాతీయ పశువైద్య కళాశాల విద్యార్థులు
శవపరీక్ష చేయుట.

నుండును. ఎముకలు అనేక ఆకారములుగా నుండును. పైన చూపించిన అస్థిపంజరము యొక్క భాగములను చూచిన ఎచ్చటెచ్చటెన్ని ఎముకలున్నవి విశదమగును. ఈ ఎము




1. ఎముకలగూడు 2. తలలోని భాగములు 3. దవుడ భాగములు

4. వస్తికము 5. పైదవుడభాగము 6. పండ్లు

7. మోకాలు 8. కాళ్లలోని భాగములు.

---

గొడ్లుకాచేవాణ్ని కొట్టనివాడున్ను, గొఱ్ఱెలకాచేవాణ్ని తిట్టనివాడున్ను లేడు.

కలెు సంధిబంధనములచేత కాళ్లకు కలుపబడి మెత్తని కండరములపైన ఒక చట్టమువలె కట్టబడియుండును. గర్భములోని పిండముయొక్క అస్థిపంజరము మొదటిలో వృద్ధిపొంది ఉపాస్థిని కలిగియుండును. ఉపాస్థిచివరకు ఎముకగా మారును. కాని కొన్నిచోట్ల ఉపాస్థి ఎముకగా మారదు. ప్రక్కఎముకలు హృదయమువారమందుండు అవయవము లను, తల ఎముకలు మెదడును, వెన్నెముక వెన్నుపామును అపాయము కలుగకుండ కాపాడుచున్నవి. అన్ని ఎముకలు కలసి శరీరమునకు ఆకారము నిచ్చుచున్నవి. కనుక శరీరమునకు ఆకారము దిట్టతనము నిచ్చుటయు, మెత్తని భాగములకు కండరములు ఆధార మగుటయు శరీరమందుండు మృదువగు అవయవములను కాపాడుటయు, శరీరమును కదల్చుటకు తోడ్పడుటయు అస్థిపంజరముయొక్క ముఖ్యోపయోగములై యున్నవి.

అస్థిపంజరమునందెన్ని యెముక లేయే స్థానములం దున్నవో తెలిసికొనుట మంచిది. పశువు నడచునపుడు పనిచేయునపుడును ఉపయోగించు ఎముకలు గుల్లగాను పొడవుగాను నిబ్బరముగాను ఉండును. ఇవి కాళ్ళయందుండును. వీనికి గుల్లఎముక (Hollow bones) లని పేరు. ఇది తేలికగను బరువుగను ఉండును.

శరీరములోపల మెత్తని పదార్థములను కాపాడు ఎముకలు వెడల్పుగ చదునుగ నుండును. వీనికి బల్లపరుపు ఎముక (Flat bones) లనిపేరు. ఇవి కపాలమం దుండును.

బరువును మోయుటకు ఆధారముగా నుండునవి మందముగ కడ్డీగానుండును. ఇవి వెన్ను పూసలందుండును. వీనికి వంకరఎముక (Irregular bones) లనిపేరు.

ఎముకలలో జంతుపదార్థము లోహపదార్థము ఉండును. ఈ రెండును బాగుగా కలిసియున్నను ప్రయత్నించిన విడదీయవచ్చును. ఎముకను నిప్పులోవేసి బాగుగా కాల్చిన యెడల అందుండు జంతుద్రవ్యముపోయి లోహపదార్థము మిగిలి బూడిదవలె రాలిపోవును. మరియొక ఎముకను తీసికొని పాత్రలో నుంచి అందు ఘాటైన పుల్లని రసము (Vinegar) ను పోసి నాలుగు దినములుంచిన అందలి లోహపదార్థము కరగి పోయి జంతుపదార్థమందును. అట్టిస్థితిలో ఎముక మెత్తనగును. దీనిని వంచి ముడికూడ వేయవచ్చును. పశుశరీరము ఎదిగిన కొలదిని జంతు పదార్థము తగ్గుచు ఎముకలు తేలిక యగును. కాబట్టి దెబ్బతగిలినయెడల నవి సులభముగా విరిగిపోవును. దూడల ఎము కలలో లోహపదార్థము తక్కువగ నుండును. అందువలన అవిత్వరగా విరుగవు.

ఎముకలన్నిటి యందును పై భాగమందు దంతమువలె తెలుపుగను గట్టిగానుండు పొరయొకటి యుండును. దీనినే గట్టిపొర (Dense tissue) యందురు. దీనిలోపల స్పంజివంటి మెత్తనిపొర (Spongy tissue) యుండును. ఇది ముఖ్యముగా ఎముకల చివరయుండును. గుల్లఎముకలను (Flat bones) బ్రద్దలు కొట్టిన యెడల మధ్య భాగ మున మూలుగ (Marrow) యను పదార్థముండును. దీనియందు రక్తనాళములు

దుక్కిటెద్దు దేశాంతరము వెళ్ళినట్లు.

గ్రొవ్వుతో నిండినకణములు ఎక్కువగానుండును. ఈ మూలుగ పసుపుపచ్చగా నుండి పైన చెప్పిన రెండు పొరల మధ్యనుండును. ఇది గుల్లఎముకలలో కడ్డీవలెనుండును. ఇది తినుటకు రుచిగా నుండును. బల్లపరుపు ఎముకలయందును వంకర ఎముకలయందును గుల్ల ఎముకలయందువలె పైన గట్టిపొర దానిక్రింద మెత్తనిపొర యుండును గాని మూలుగ ప్రత్యేకించి యుండక అది మెత్తని స్పంజివంటి పొరలలో నుండు అరలలో నిమిడి యుండును. ఇది ఎరుపురంగుగా నుండును. ఇది గుల్లఎముకలలో మూలుగంత బరువుగా నుండదు.

## తలయందుండు ఎకములు (The head and its Bones)

తల వెన్నెముక మొదటి భాగమునకు రెండు గుబ్బలుగల అస్థితో నమర్చబడి యున్నది. ఈ అస్థికొండైల్ అను పేరుతో పిలువబడుచున్నది. ఈ అమర్చబడియున్న అస్థికంధరము (Atlas) మూలగుచున్న రెండు రంధ్రములలో నమర్చబడియున్నది. దీనినే కంధరము లేక వెన్నెముకలోని మొదటిపూస యందురు. ఈ కంధరము అమర్చబడి యున్న కీలు బంతిగిన్నె కీలుయందురు. ఇది యిట్లుండి ఆ ప్రదేశములోనున్న కండర ముల వలనను స్నాయువుల వలనను స్వేచ్ఛగా తలను కదలించు శక్తిగలిగి యున్నది.

### పశువు కపాలమందుండు ఎముకలు.

| | | |
|---|---|---|
| లలాటాస్థి (Frontal bone) | — | 2 |
| పామంతాస్థులు (Parietal bones) | — | 2 |
| శిరఃపృష్ఠాస్థి (Occipetal bone) | — | 1 |
| కర్ణాస్థులు (Temporal bones) | — | 2 |
| జల్లెడఎముక (Ethmoid) | — | 1 |
| స్ఫీనాయిడ్ (Sphenoid) | — | 1 |
| పుట్టెమధ్య (Inter parietal) | — | 1 |

స్ఫీనాయిడ్, జల్లెడఎముక కపాలముయొక్క అడుగుభాగమునందే యుండును. శిరఃపృష్ఠాస్థిమధ్య 1 లేక 2 అంగుళముల వెడల్పుగల రంధ్రముగలదు. దీనిగుండ మజ్జ బయలుదేరి వెన్నెముకగుండ వ్యాపించును. కపాలమందున్న ఎముకలన్నియు ఒక దానితోనొకటి పెట్టె చెక్కలవలె అతుకబడియున్నవి. వీనిసంచులయందు రంపపు పండ్ల వంటి కోతలుండి ఒకదానిలో నొకటి యిమిడియుండును.

కపాలమనగా మెదడు కలిగి యుండును. ముఖమనగా కపాలమునకు ముందున్న భాగము. ఈ ముఖము మాక్కు కన్నులు నోరు దవుడలను కలిగియున్నది.

---

దున్నబోతే దూడలతోనూ; మేయబోతే అవులతోనూ.

క్రిందిదవుడ తప్ప లలాటాస్థి ఎముకలన్నియు మెదటిలో పెద్దవిగానుండును. పుట్టిన ముందునున్న ఎముకలన్నియు వెడల్పుగ బల్లపరుపుగ కుమిగూడి యుండుటవలన పుట్టి యొక్క ఆకారమేర్పడుచున్నది. మెదటిలోనున్న లలాటాస్థి నునుపుగానుండి ఆసిరమైన ఆకారముగల ఒకపదార్థమును కొమ్ములలోనికి (Horn Process) తీసికొని పోవు చున్నది. ఈ కొమ్ము రంధ్రముపైన కొమ్మఅను గట్టిపదార్థముచే కప్పబడి యున్నది. ఈ కొమ్ము పదార్థము చాలాచిక్కగానుండును.

## ముఖమునందుండు ఎముకలు (Nasal bones)

ముక్కు పొడవుగానుండును. ఇది రెండుభాగములుగా గదులవలె విభజింపబడి నది. వీటినే ముక్కుగదులు లేక అరలు అందురు. రెండు జిహ్వాములు (Nasal bones) గలసి ముక్కు ముక్కుదూలమగును. వీటి చివరభాగము ఉపాస్థి (Cartilage) తో చేయబడును. అందుచేత దెబ్బతగిలినపుడు ఈ ఎముకలు విరుగనేరవు. ముక్కు చివర భాగమున ఈ రెండు గదులు కలిసినచోట ఒకమెత్తని అతిసున్నితమైన ముట్టె అనునది కలదు. దీనిలో జల్లెడ ఎముక ఒకటిగలదు. ప్రతిముక్కుగదియును బయటికి సప్తపథ గుండను, నాసాపశ్చిమ ద్వారముగుండను ముక్కుదూలముల వలన తెరువబడుచున్నవి. రెండు ఎముకలు నత్తగుల్లవలె మెలికలుతిరిగి యుండును. ఇవి ముక్కులందుండును. ఇట్టి మెలికలవలన పీల్చుగాలి చాలాదూరము ప్రయాణము చేయవలసియుండుటవలన ఆగాలి యూపిరితిత్తులలో ప్రవేశించకపూర్వము వెచ్చనగును.

ముక్కు ఎముకలు, పై దవుడఎముకలు, ముందు దవుడఎముకలు గండాస్థి, కంటి ఎముకలు అంగుడు ఎముకలు మున్నగు ఎముకలు గుఱ్ఱములకు పశువులకు కుక్కలకు 18 వంతున ముఖము నందుండును. కన్నిటి ఎముకలు రెండుకండ్లయందుండు నీటి బిందువులను ముక్కులోనికి సన్నని కాలువలద్వారా తీసికొని పోవును. ఇందువలననే పశువు విచారముగా నున్నపుడు ముక్కునుండి నీరుగారుచుండును. ముక్కులో నాగలివలె ఎముకయుండి ముక్కును రెండు భాగములుగా చేయుచు దానిమధ్యభాగమును పొడవుగా నుండునట్లు చేయును. ఇది సరిగా ఎదుగని యెడల ముక్కు పొట్టిదగును.

ముఖభాగమందున్న ఎముకలలో రెండు దవుడయెముకలు కొన్నిటికి యెత్తుగా నుండును. రెండు పైదవుడ ఎముకలలోనే పై పండ్లు అమర్చబడియున్నవి. ఇవి కదలక సిరముగా నుండును. పశువు ఆహారము నములునపుడు క్రిందిదవుడ మాత్రము కదలును. అంగుడుఎముకలు అంగిటి భాగమునందుండును. క్రింది దవుడ ఎముకకు క్రింది పండ్లన్నియు అమర్చబడియున్నవి. ఈఎముక పైకి క్రిందికి ప్రక్కలకు గుండ్రముగ కదలు చుండును. గుఱ్ఱములకు 40 న్ని, పశువులకు 32 న్ను, కుక్కకు 42 పండ్లునుయుండును.

చెవిభాగమునందు సుత్తిఎముక, దాగలిఎముక, అంకవన్నెముక, గోళాకార ఎముకయను 8 ఎముకలు గుఱ్ఱములకు పశువులకు కుక్కలకు యుండును.

---

దూడచస్తే కమ్మలం ; యెనుముచస్తే నిమ్మళం.

## వెన్నెముక (The back bone)



మొండెమునందు: వెన్నెముక ప్రక్కఎముకలు, తొంటిఎముకలు భుజపుటెముకలు రొమ్మెముక మున్నగు ఎముకలుండును. మొండెమునకు ముఖ్యాధారమగు వెన్నెముక వెన్నుపూసలను ఒకదానిపైనొకటి అమర్చబడుటచే కలుగుచున్నది. దీనిలోని ఎముకలన్నియు చాలగట్టివై ఒకటితో నొకటి కూర్చబడియున్నను వెన్నెముక ఏవైపునకైనను వంగగలిగియుండును. చిన్న ఎముక లొక్కొక్క దానికిని పూసలకున్నట్లుగా మధ్యనొక రంధ్రముకలదు. ఒకదాని పైన ఒకటి అమర్చబడి నందున ఒక్కటే ఎముకగా నుండను. వీని పొడుగునను ఒకకాలువవలె త్రోవ యేర్పడియుండును. ఈ వెన్నుపూసలతో కూడిన వెన్నెముక మెడను నుండి తోకచివర వరకు వచ్చియున్నది. ఇది వాటియొక్క నడకలనుబట్టి కొన్ని భాగములుగా విభజింపబడియున్నది.

ఆ భాగములేవనగా:—మెడపూసలు, వీపుపూసలు, నడ్డిపూసలు, తొంటిపూసలు, తోకపూసలు అని అయిదు రకములుగా విభజింపబడియున్నవి. మెడపూసలు 7 వీపుపూసలు 13 తొంటిపూసలు 6 నడ్డిపూసలు 5 తోకపూసలు 18 లేక 20. వీటి నన్నిటిని మనము ఒక గణితముగా జ్ఞాపకముంచుకొనవలెననిన మె 7 వీ 13 తొ 6 న 5 తో 18, 20.

వెన్నెముకలోనున్న ఎముకలన్నియు వాటి స్థానములందు అవయవములనుబట్టి పిలువబడు చున్నవిగాని మొదటిది రెండవది ప్రత్యేక పేర్లను కలిగియున్నవి. మొదటిది

---

చేనుకు గట్టు ఊరికి కట్టు ఉండవలెను.

స్కంధర పూసయనియు రెండవది మేరువు పూసయనియు పిలుతురు. స్కంధరపూస తప్ప వెన్నెముకలన్నియు ఒకేరీతిగా నిర్మింపబడియున్నవి.

### వెన్నుపూస

ఈ పూస బాడీ (Body) ఆకారముగానుండును. ఇది వెన్నుపూసయొక్క అడుగుభాగమున నుండును. వెన్నుపూస రెండు పూసలతో సమర్పబడియుండి మధ్య కాలువవలె అమర్చబడి యుండుటచే వెన్నెముక యగుచున్నది. వెన్నుపూసలు ఒకదాని నొకటి కలసియున్నపుడు మధ్యను దిండ్లవంటి మెత్తని ఎముకపదార్థము (Cartilage) అమర్చబడి యుండును. అందుచేతనే వెన్నుముకను వంచుటకు వీలగుచున్నది.

### రొమ్ము ఎముక (Sternum)

ఇది బల్లపరుపుగానుండి రొమ్మును చదరముగా చేయుచున్నది. ఈఎముక అడుగు భాగమున వెడల్పుగను బల్లపరుపుగను యుండును. ఇట్లుండుటవలన రొమ్మునవు ఆకారము గలిగించుచున్నది.

### ప్రక్క ఎముకలు (Ribs)



ప్రక్క ఎముకలు

ఇవి హృదయ కుహరములోనున్న ముఖ్య అంగములను కాపాడుచున్నవి. ఈ హృదయ కుహరపు వెనుక భాగమునందు వెన్నెముకవలనను, క్రిందిభాగమునందు రొమ్మెముక వలనను ప్రక్కలందు ప్రక్క ఎముకలవలనను బిడాయించి యున్నది. ఈ ప్రక్కఎముకలు వంకరటింకరలుగా నుండును. ఇవి హృదయ కుహరపు గోడలనుంచి వంకరగా తిరిగి పంజరమువలె నుండును. ఇవి గట్టిగను వెడల్పుగను కుక్కిలి కఠినముగను యుండును. జంతువులయందు 13 జతల ప్రక్కయెముకలుయుండును. ఇవి హృదయకుహరపు రెండు ప్రక్కలనుండును. ఇంక నివి వీపుఎముకను అతుకుకొని యుండును. క్రిందిభాగమందు కడీలవలెనుండు ఉపాసుల చేత పెంపొందించుచుండును. మొదటి 8 జతల ప్రక్కఎముకలు కీళ్లచే నాతియొక్క మొనలవద్ద అతుకబడి యుండును. మిగిలిన జతలు రొమ్మెముకను అతుకుకొని యుండవు.

## కూపము (Pelvis)

దీనినే తొంటిఎముకల అస్థిపంజరమందురు. ఈఅస్థిపంజరమునుండి మలాశయము, మూత్రాశయము, పోవుచుండును. ఇది ఒకదానితో నొకటి సంబంధించని ఎముకలతో అడుగునను ప్రక్కలను తొంటి ఎముకలపై ప్రక్కల సమర్చబడియున్నవి. ఇంకను పశువు శరీరములోనుండు ప్రాణాధారమగు అవయవములు ఈ వస్తికమునందమర్చబడి యున్నవి.

## భుజపు ఎముకలు (Shoulder bones)

ఇది స్పష్టముగా తెలియుటకు అనేక తునకలుగా విభజింపబడి యున్నది. మొదటి భాగమును భుజపు కొనయందురు. ఇది అంసఫలకమను ఎముకచేత యేర్పడి యున్నది. రెండవదానిని బాహువుకొనయందురు. ఇది ప్రగడాసియొక్క అస్థిపంజరము. మూడవభాగము ముంజేయి. ఇది ప్రకోష్ఠికయొక్కయు కూర్పరాస్థికయొక్కయు అస్థిపంజరము వలన యేర్పడియున్నది. నాలుగవభాగము చతుష్పాద జంతువుయొక్క ముందరిభాగము. ఇది మానవుని చేతిని పోలియుండును. దీనిలో మోకాలు వేళ్లు, కరాంగుళ్యాధారాస్థులు మరియు నాలుగు వ్రేళ్లునుగలవు. భుజము ఎముకలు 2, పైచెయ్యి ఎముకలు 2 ముంజెయ్యి ఎముకలు 2 మోచేతి ఎముకలు 2 యుండును.

## అంసఫలకము (The Scapula)

ఈ ఎముక బల్లపరుపుగ త్రికోణముగ నెమ్మిభాగమునను ముందువైపున కండరములచేత సమర్చబడి యుండును. ఈ ఎముక పైభాగము రెండుభాగములుగా విభజింపబడినది. ఇవి కండరములను కాపాడుచుండును. భుజాస్థికలను కలిగియుండుటచే భుజకీలందురు.

---

వడ్లు గొడ్లు వున్నవాడిదే వ్యవసాయము.

## ప్రగడాస్థి (Humarus)

దీనినే భుజాస్థి లేక దండ ఎముకయందురు. ఇది పొడవుగానుండి చుట్టలువలె మెలితిరిగి పైకియుండును. ఇది భుజపుకీలునుంచి మోకాలిచిప్ప క్రిందవరకు వ్యాపించి యుండును. దండ ఎముకపైన మూడవభాగమున ఒక రంధ్రముండును. ఇది కండరము నకు సహాయకారిగా నుండును. మందముగల రెండు రంధ్రములు ముంగాలియొక్క కండరములకు సహాయకారిగా పనిచేయుచున్నవి.

## బంధధారాస్థి కూర్పరాస్థి (The Rodius and ulna)

ఇవి రెండును మోకాలుయొక్క ఎముకలు. ఈ రెండును ప్రగడాస్థిని అంటి యుండుట వలన వీటిలోపలికీళ్ళు ప్రత్యేకముగానుండును గాన ఛలనములేదు. మను ష్యులు కుక్కలు త్రిప్పునట్లు పశువులు త్రిప్పలేవు. బంధధారాస్థి కూర్పరాస్థికన్న పెద్దది. ఈ బంధధారాస్థి తిన్నగా మోకాలిచిప్ప పైవరకును, మోకాలి కీలు పైవరకును వ్యాపించియుండును.

## కూర్పరాస్థి (The ulna)

ఇది బంధధారాస్థియొక్క బీజాంకురము. ఇది సన్నగానుండి బంధధారాస్థి యొక్క పైభాగములో క్రిందకు అతుకబడియున్నది. ఈ కూర్పరాస్థియొక్క అడుగు భాగము లావుగానుండును. ఇది మోకాలు చిప్పయొక్క అస్థిపంజరము నేర్పరచు చున్నది.

## మణికట్టు (Carpal bones)

దీనిని జంతువులలో మామూలుగా కాలిముడుదు కీలందురు. ఇది మానవుని యొక్క మణికట్టును పోలియుండును. ఇది ఏడు ఎముకలను కలిగియుండును. ఈ యేడు ఎముకలలో రెండు ఎముకలు ఒకదానితో నొకటి కలసియుండును. అందుచేత ఆరు ఎముకలే కనబడుచుండును. ఈ ఏడు ఎముకలును అడ్డముగా రెండువరుసలుగా చేర్చబడి యున్నవి. ఈ రెండు వరుసలలో పైవరుస నాలుగు ఎముకలుకలిగియున్నది. ఈనాలుగు ఎముకలును బంధధారాస్థి, కూర్పరాస్థికి అడుగు భాగపు కొనను కీలుపెట్టి చేర్చబడి యున్నది. రెండవ వరుసయందు మూడుఎముకలు గలవు. ఇవి కరంగుళ్యాస్థులకు కీలుచే చేర్చబడియున్నవి.

## కరంగుళ్యాస్థులు (Metecarpal bones)

మానవునివలె పశువులకుగూడ కరంగుళ్యాస్థులు వ్యాపించియుండును. ప్రతి అస్థి ఒక ఎముకను కలిగియుండును. కాని పెద్దవాటిలో కొన్ని కరంగుళ్యాస్థులును

---

వాటిననుసరించి వ్రేళ్ళు యుండును. మొదటి అసి రెండవది అంతగా కనపడవు. అయిదవది మిక్కిలి చిన్నది. మూడు నాలుగు బాగుగా పెరిగి పెద్ద ఒక కరంగుళ్యాస్థిగా నగుచున్నది.

పశువుయొక్క కరంగుళ్యాస్థులు రెండుభాగములుగా విభజింపబడుచున్నవి. అందులో మొదటిది చిన్నదిగానుండును. దీనినే అయిదవకరంగుళ్యాస్థి (Splint bone) అందురు. రెండవది మూడునాలుగు అనులచే కలుపబడి పెద్దదిగా నగుచున్నది. ఈపెద్దది అరవరుల సంఘాకారముగా నుండి మణికట్టుపైగా వ్రేళ్లక్రింద వరకు వ్యాపించి యుండును. ఈ పెద్ద కరంగుళ్యాస్థియొక్క అడుగుకొన రెండు ముఖ్యమైన వ్రేళ్లను కలిగియున్నది. దీనివెనుక చివరకొననంటి నాలుగు చిన్నఎముకలుండును.

## వ్రేళ్లు (Fingers)

ఇవి మనుష్యుని చేతి వ్రేళ్లను పిల్లివ్రేళ్లను కుక్కవ్రేళ్లను పోలియుండును. మొదట వ్రేలు తప్ప పశువునకు కూడ నాలుగు వ్రేళ్ళుండును. ఈ అయిదువ్రేళ్ళలో రెండవది, అయిదవది ప్రథమముగా వచ్చినవి. రెండవది, మూడవది గిసకీలు యొక్క వెనుక భాగము. అనగా పెద్ద కరంగుళ్యాస్థితికి కడపటి మూడువ్రేళ్ళకును మధ్యగనుండును. ఈ రెండును గట్టిగానుండును. చిన్నవ్రేళ్లు యేమాత్రము పైవాటివలె శక్తిని కలిగి యుండవు. ఎందుచేతనన అవిబరువును మోయజాలవు. కాబట్టి ఒక్కొక వ్రేలు రెండు చిన్న వ్రేళ్లను కలిగియుండును. తక్కిన రెండువ్రేళ్ళు అనగా మూడునాలుగు వ్రేళ్ళు బాగుగా పెరుగబడి పుష్టిగానుండి శక్తిగలిగియుండును. ఇవి పెద్దకరంగుళ్యాస్థియొక్క చివరకొననుండి ముందునకును క్రిందికిని వ్యాపించి చిన్నచిన్నవిగ నుండును. ఒక్కొక పెద్దవ్రేలు ముఖ్యమైన అనులను కలిగియుండును. అవియే అంగుళ్యాను అనబడును. అవి మనుష్యుల అంగుళ్యానులవలె నుండును. పెద్దవ్రేలులో కీలుయొక్క వెనుక భాగమున ఒక అసిగలదు. ప్రతి ముఖ్యమైన వ్రేలుయొక్క పైభాగము మందముగల చర్మముతో కప్పబడియుండును. ఆచర్మమునె గిట్టలుగల పాదమందురు. దీనితోనే పశువుభూమిమీద నడచును.

## కాలి ఎముకలు (Bones of the legs)

ముందుకాలునకు 13 ఎముకలు వెనుక కాలునకు 15 ఎముకలు నుండును. వెనుక కాలుమాత్రము మనుష్యుని కాలియొక్క చివరభాగములో అర్ధ చంద్రాకారమును పోలి యుండును. ఈ కాలు పైభాగమున తొడ అనునది కలదు. ఈ తొడయొక్క అస్థి పంజరము ఊర్వస్థి (Femurl) ఎలనను మోకాలిచిప్ప (patella) వలనను ఏర్పడు చున్నది. ఊర్వస్థి శరీరమునందున్న ఎముకలన్నిటిలో నిది పొడవుగ బలముగలదిగా నుండును. మోకాలియందు దుచిప్పగలనుండి కీళ్లను దెబ్బతగులకుండ కాపాడును. కాలియొక్క అస్థిపంజరము జంఘిక (Tibia) జానుక (Fibula) ల వలన

---

బాపనసేద్యం ఎడ్లనష్టం; కాపులచదువు కాసులనష్టం.

యేర్పడుచున్నది. వెనుకకాలు చీలమండ ఎముకలు (Tarsal bones) ను పదిపాదాంగుళ్య ధారాస్థులు (Meta tarsal bones) ను, నాలుగు పాదాంగుళ్యాస్థులు (Phalanges) ను కలిగియున్నది.

## తొంటిఎముక (Hip Bone)

ఇది సరియగు ఆకారము గలిగియుండదు. ఇది తొంటియొక్క ఆకారమును యేర్పరచుచున్నది. దీనిచివరను త్రికాస్థికి ఎదురుగా కలసి కూపకము (Plevis) అను ఆకారము యేర్పడుచున్నది. త్రికాస్థి మంచి బలముగు కీలుచే సమర్పబడి యుండును. ఆకీలు వెనుకకాలును, ఎదురురొమ్ము భాగపు వెనుకకాలును కలుపుచున్నది. గర్భములోని పిండముయొక్క తొడఎముక మూడుభాగములు కలిగియుండును. మొదటిది ఘనకపాలమందురు. ఇది శ్రోణిఫలకముయొక్క పైభాగమున నుండును. రెండవది కలకందరాస్థి. ఇది క్రిందిభాగమునకు మందర పిండముతో కూడియున్నది. మూడవది భగాస్థి ముందు భాగమున నుండును. మంచి వయస్సులో నున్నపుడు ఈ మూడుభాగములు కలిసి ఒక ఎముకయగును. ఇవి కలియుచోట వంక్షణోలూఖల మొకటి యున్నది. ఆ భాగమందే ఊర్వస్థియొక్క పై చివరభాగము కలియును. జఘన కపాలముయొక్క మొదటిభాగము కూడ అచ్చట చేయుండును.

## ఊర్వాస్థి (Femur)

ఇది శరీరములోనున్న అస్థులకన్న చాలా బరువుగా నుండును. ఇది నిలువుగా నుండును. పై భాగమున ఇది తొంటికీలు వరకును క్రిందిభాగమున మరియొకకీలువరకును వ్యాపించియుండును. ఈ ఎముకయొక్క పైకొన గోళాకారముగల అస్థితో కలియును. దీని తల పైభాగమున ప్రవర్ధనము యుండును. ఇది మహాశిఖరమను (Trochantermasior) పేరుతో పిలువబడు కండరములతో కట్టబడియుండును. ఈ ఊర్వాస్థి లోపలి భాగములో అనగా తను క్రింద మరొక చిన్న ప్రవర్ధనము (Process) గలదు. దీనిని అఘుశిఖరమందురు. ఇంకను ఈ ఎముకచివరకొన వెనుకభాగమున అనగా, జంఘిక పై భాగమున రెండు అండాకారములుగల మహార్బుదములు గలవు. ఈ మహార్బుదముల మధ్యగా జంఘికపోవుచు రెండు మదరులచే ఆక్రమించబడి యున్నది. దీనినే అర్ధ చంద్రాకారమగు ఉపాస్థియందురు.

## పటలాస్థి (Patella)

ఇది మానవునియొక్క మోకాలిచిప్పనుబోలి సన్నముగా నుండును. జంఘిక యొక్క పైభాగమున పటలాస్థియుండును. మూడుచోట్ల నాడాలు బిగించినట్లు కట్టబడి యుండును. ఇంతియేగాక లోపల కండరములుండును. జంఘిక, జానుకయనునవి కాలులోపల నుండును. జంఘిక యనునది పెద్దదిగను త్రికోణాకారముగ నుండి పాదమూ

లాసీవరకును పెరుగును. జంఘికయొక్క పైభాగపు కొనతో జానుకయొక్క పైభాగపు కొన కలిగియుండును.

## కీళ్లు (Joints)

పశువుయొక్క అస్థిపంజరమంతయు చిన్నచిన్న ఎముకలతో కూర్పబడియున్నందున యిష్టమువచ్చినట్లు శరీరభాగములు వంగుటకు వీలగుచున్నవి. పెద్ద ఎముకలలోపల మూలుగను మెత్తని పదార్థముండును. ఒకఎముక మరియొకఎముకతో కలసియుండుచోటునకు కీలుఅని పేరు. ఈ కీళ్లలో కొన్ని కదలును మరికొన్ని కదలకయే యుండును. కీళ్లు సులువుగా చలించునపుడెల్ల చమురును స్రవింపజేయునట్టి చమురుతిత్తులు కీళ్ల నడుమనుండును. కొన్ని ఎముకలు స్థిరముగానుండక చలనములకు అనుకూలపడును. వీటిని కదలెడుకీళ్లు అందురు. వీటిలోనే జారెడుకీళ్లు, యనునవి యుండును. ఇవి మణికట్టు నందును, చీలమండలయందును యుండును. ఇంకను మడతబందుకీళ్లు యుండును. దవుడకీలు, ముంజేతికీలు, మోకాలుకీలు, వ్రేళ్లకీళ్లు చీలమండల కీలుకూడ మడతబందు కీళ్లందురు.

## బంతిగిన్నెకీళ్లు (Ball and socket Joints)

ఇవిస్నాయువుల అసలమధ్యగా నుంచబడక ఒక ఎముకలోనుంచి మరియొక ఎముకలోనికి పోవుచు కీలుచుట్టును తిరుగును. ఇట్లు తిరుగుటవలన ఆ ప్రదేశములో ఒక రంధ్రమేర్పడును. వ్యతిరేకముగానున్న ఎముకలు వీటిని తాకుచుండును. కాని అవి నునుపుగను పసుపురంగుగను, జారునవిగను యుండు ద్రవపదార్థముచే నిండియుండును. ఆ ద్రవపదార్థము సైనొవియల్ అను పలుచని చర్మముతో కప్పబడియుండును. ఈరీతిగా కీలుచుట్టును స్నాయువులు అడుగువరకును యుండును.

ఇంకను బొంగరపుకీళ్లు (Pivot Joints) యుండును. ఇవి మెడపూసలయందుండుటవలన అర్ధచంద్రాకారముగ త్రిప్పుటకు వీలుగానుండును. కాళ్లలోనుండుకీళ్లు పెద్దవిగనున్నను చిన్నవిగా నున్నను కదలుటకు వీలుగానుండును. కీళ్లజబ్బులు అనగా కీళ్ల వాపులు, కీళ్లనొప్పులు, తొడలందును మోకాలు కీలునందును పురుపులుండుట మున్నగు వాటినిగూర్చి ముందు తెలుపబడును.

## సంధిబంధనములు (Ligaments)

రెండు ఎముకలు కలియుచోట నవి కట్టబడియుండని యెడల వాని స్థానములందుండక అవి జారిపోవును. కాబట్టి కీళ్లుండెడిస్థానములందు ఎముకలను త్రాళ్లతో కట్టబడియుండును. వీటినే సంధిబంధనములందురు. ఇవి తెలుపుగను నారతో చేయబడి చాలా గట్టిగానుండును. వాటికి రబ్బరుగాసాగెడి శక్తి యుండుటవలన ఎముకలు కదలునపుడు అవికూడ కదలుచు ఇతర అవయవములకు దెబ్బ తగులకుండ కాపాడుచుండును.

---

పశువు 34 సెమ్ములువేసి గుటక మ్రింగుతుండట.

## శరీరములోనుండు మెత్తని భాగములు (The soft parts)

పశువు శరీరమందుండు మెత్తని భాగములకు అవయవములు (organs) అని పేరు. వీటిలోనొకటి గాని అనేకముగాని ఒకపనిని నెరవేర్చుచుండును. కొన్ని అవయవములు ఆహారమును జీర్ణముజేయును. మరికొన్ని పదార్థములు రక్తమును ప్రసరింపజేయుచుండును. ఇంక కొన్ని పనికిమాలిన పదార్థములను విసర్జింపజేయును. వీటివ్యాపారము ననుబట్టి ఇవి మండలములు (Systems) గా భాగింపబడినవి.

1. కండరమండలము (The Muscular system). ఇది శరీరఅవయవములకు చలనము కలిగించును.

2. జీర్ణమండలము (The Alimentary system). దీనియందు ముఖ్యముగా నోరు, జీర్ణాశయము, ప్రేవులు చేరియున్నవి. ఇవి ఆహారమును జీర్ణింపజేసి జీర్ణమైన ద్రవమును రక్తమునందు కలుపుచుండును.

3. రక్తప్రసరణ మండలము (The Circulatory system). దీనిలో గుండెకాయ, రక్తనాళములు, చేరియున్నవి. ఇవి శరీరమందు ప్రతి అవయవమునకు రక్తమును పోషణపదార్థమును తీసికొనిపోయి అక్కడ తయారగు కలుషమగు పదార్థములను తెచ్చుచుండును.

4. శ్వాసమండలము (The Respiratory system). దీనియందు ముక్కు శ్వాసనాళములు, ఊపిరితిత్తులు చేరియున్నవి. రక్తమునకు మంచిగాలి నిచ్చి యందుండు విషవాయువులను బైటికి త్రోసివేయును.

5. బహిష్కార్య మండలము (The Excretory system). దీనియందు ఊపిరితిత్తులు, చర్మము, మూత్రపిండములు, చేరియున్నవి. శరీరమందు తయారగు వ్యర్థపు పదార్థములన్నియు విడిచిపెట్టుచుండును.

6. నాడీమండలము (The Nervous system) దీనియందు మెదడు, మజ్జ నాడులుకలవు. ఇవి శరీరమందుండు అవయవములను యుక్తముగా చలింపజేయును.

## టిస్యూలు (Tissues)

పశువు శరీరములోనుండు వివిధభాగములన్నియు పనిచేయుటకు తగినట్లుగా నుండుటకు ఈ టిస్యూలుకూడ కండరములందును, నాడులందును, ఉపాస్థియందును, చర్మమునందును యుండును. ఈ టిస్యూలను సూక్ష్మదర్శినియంత్రము (Microscope) చూచిన ప్రాణముగల కణములను తెలిసికొనవచ్చును. ఇట్టి కణములు ఒకటిగాని అనేకముగాని వరసలుగానుండి దారమువలె నేర్పడును. దీనికే ఒకవిధమగు నారయందురు. ఇట్టి నారవంటి పోగులు అల్లుకొని కణముల నంటుకొని తగినపని చేయుచుండును. ఇట్టి కణముల సమూహామునకు ఇంగ్లీషులో టిశ్యూ (tissue) అందురు.

1. కండరసంబంధమగు టిస్యూ (Muscular tissue). ఇది వరుసగానుండు కణములతో చేయబడియుండును. నరముల సంబంధమగు కణములనుండి వచ్చిన ఆజ్ఞల వలన ఈకణములు సాగుచుండును.

2. నరముల సంబంధమగు టిస్యూ (Nerve tissue). దీనియందుండు కణములు మిగుల పొడవుగల శాఖలుండును. అనేక కణములనుండి బయలుదేరిన శాఖలు పెనవేసుకొని దారములవలె నేర్పడును. ఇట్టిదారములకే నాడులని పేరు.

3. ఆధారపు టిస్యూలు (Connective tissue). తక్కిన టిస్యూలవలె దీనియందుగూడ కణములుగలవు. ఈ టిస్యూ ప్రతిఅవయవమునందును యుండును. చర్మమందెక్కువగానుండి బాగుచేయును.

4. ఎపిథీలియల్ టిస్యూ (Epithelial tissue). ఇది ఆహారనాళమునకు లోపలభాగమందుండు తడిచర్మమందుండును.

5. కార్టిలేజినస్ టిస్యూ (Cartilaginous tissue). ఇది పెళుసుగానుండి సాగెడి గుణము కలదు. చెవులు, ముక్కురంధ్రములచివర, గొంతుకయందుండు నాళము దగ్గర ఈ టిస్యూయుండి మెత్తగా కనపడును. ఈ మెత్తనిపదార్థము ఉపాస్థియందురు.

## కండరమండలము (The Muscular system)

పశువుశరీరముపైనుండు చర్మమును తీసివేసిన ఎరుపుగానుండు మాంసముపైదనే కండ లేక కండరమనబడును. ఈకండరము ఆయా ప్రదేశములనుబట్టి రూపపరిమాణములయందు విశేష భేదముపొందుచు లెక్కకు రమారమి ఏడువందలకు పైబడియున్నవి. పైపటమునందు పశుకండరమండల ఫోటోను చూచిన యేయే భాగమునందు ఏయే కండరములున్నది తేటతెల్లమగును. ప్రతి కీలుదగ్గర మెత్తనిపదార్థముండును. కీలుకదలినపుడెల్ల యీ పదార్థము పొట్టిదగుటయు, లావగుటయు, గట్టిగానగుటయు కనబడును. దీనినే కండరమందురు. శరీరమందుండు అవయవములలోనుండు కండరపదార్థములనే కండరమండలమందురు. ఈకండరములు మాంసముతో చేయబడి కంటికగపడని సన్నని అతిసూక్ష్మములగు దారములుకొన్ని కట్టలుగాకట్టబడి వాటిపై పలుచని పొరచే కప్పబడియుండును. ఈ పొర కండరములకట్టనుండి రెండువైపులకు పొడవుగాపోయి అన్నియును జేరి బలమగుత్రాడుగా నేర్పడుచున్నవి. ఈత్రాళ్ళకుస్నాయువు లేక కండరబంధనములనిపేరు. ఈ బంధనములచే కండరములు ఎముకలకుకట్టబడును. ఇవి ఎంత లాగినను తెగవు. ప్రతి కండరములోనికి ఒకనాడియు, కొన్ని రక్తనాళములు పోవుచుండును. కండరములరంగు ఎరుపుగానున్నట్లు కనపడును. ఈ ఎరుపు నలువైపుల రక్తనాళములుండుటవలన కలుగుచున్నది.

---

దొమ్మలన్నిటిలో మిడిదొమ్మ చెడ్డది.

## కండరములచలనము (Muscular Action)

ఎముకలను వంచుటకు, సాగతీయుటకు, నిలబడుటకు కండరములు పనిచేయు చున్నవి. పశువులు స్వేచ్ఛగా కండరములను చలించునపుడు అవి సాధారణముగా ఒక




ఎముకను ఆధారము చేసికొని కదలును. బరువును లాగవలెననిన అనేకకండరము లొక టిగాజేరి చలనమును కలుగజేయుచున్నవి. మెడయొక్క వెనుకభాగమందుండు కండర

ములు ముడుచుకొనుటవలన తలపైకెత్తబడును. ముందు భాగమునందుండు కండరములు ముడుచుకొనుటవలన తలను క్రిందకుదించును. పిక్క కండరములు ముడుచుకొనునపుడు బలము ప్రయోగింపబడును. అప్పుడు పాదములనువంచును. తొడమీద కండరములు మోకాలునువంచును. ఈరీతిగా కండరముల చలనము కలుగుచుండును.

## కండరముల రకములు (The kinds of Muscles)

కండరములలో అనేకములు పొడవుగను గుండ్రముగను దళసరిగను యుండును. కండరములన్నియు నాడులమూలముననే చలించుచుండును. కండరములలో రెండురకములు గలవు. స్వేచ్ఛగానుండునవి, స్వేచ్ఛగానుండకుండునవి. స్వేచ్ఛాకండరములు అస్థిపంజరము నంటియుండి మెదడుయొక్క ఆజ్ఞలకు లోబడి పనిచేయుచుండును. స్వేచ్ఛగానుండకుండునవి ఊపిరితిత్తులు, గుండెకాయ, జీర్ణాశయము, ప్రేవులు మున్నగు అవయవములందుండును. పశువు నిద్రపోవునపుడు మేలుకొనునపుడు ఈ కండరములు వాటంతటనే పనిచేయుచుండును. పాదములు భూమిమీద ఆనియుండి జానుకజంఘికలను నిలువుగానుంచుటకు పిక్క కండరములు ప్రయత్నించును. తొడఎముకను మోకాలిమీద నిలబెట్టుటకు తొడవెనుక ముందునుండు కండరములు ప్రయత్నించుచుండును. సరిగావంచుటకు భుజకండరములు, వెన్నెముకమీద తలను నిలబెట్టుటకు మెడ ముందువెనుక కండరములును అమర్చబడియున్నవి. కన్నుదగ్గర కండరములు గుండ్రముగానుండును. ఏయే అవయవములు కదలుచుండునో వాటికి పెద్దవియు బలిష్టములైన కండరములమర్పబడియున్నవి. కాళ్ళలోనుండు ఎముకలచుట్టు గట్టికండరములుండును. తలలోను ముఖమందునుండు కండరములు పలుచగా ఒల్లపరువుగానుండి పెదవులయొక్కయు దవుడలయొక్కయు కనుబొమలయొక్కయు కదలికకు సహాయపడుచున్నవి. వీపు నడిపూస ప్రక్కఎముకల పైభాగమున పెద్దకండరములుండును. ప్రక్కఎముకలలో పలుచని కండరములుండును. ఈరీతిగా వివిధరకములుగా కండరములుండును.

## కండరములు పెరుగుట (Growth of Muscles)

పశువు శరీరమందు పనిచేయు అవయవములకు ఎక్కువయు, పనిచేయక విశ్రాంతిగానుండు అవయవములకు తక్కువయు రక్తము ప్రసరించునట్లు సృష్టియందేర్పాటు చేయబడియున్నది. అవయవములు పనిచేయునప్పుడు రక్తనాళములు పెద్దవియగుటవలన ఎక్కువ రక్తముపొందును. పనిచేయు కండరములు ఎక్కువరక్తమును పోషణపదార్థములను సంపాదించుటవలన వృద్ధియగుచున్నవి. పనిచేయుకండరములు పెద్దవిగ దృఢమైనవిగనుండును. పనిచేయనివి మెత్తగా చిన్నవిగా కాంతి తక్కువగనుండును. దూడ వయస్సునందే కండరములను బలపరచుటమంచిది. కాని చిన్నవాటితో మించినపనులు చేయించిన కండరములు అరిగి దూడ గిరసబారిపోవును. ప్రతికండరమునకు దానిపని

సరిగా నెరవేర్చుకొనుటకు తగినంత శరీరపరిశ్రమ ఈయవలయును. ఈకండరములమీద పుట్టు వ్యాధుల విషయమై ముందు తెలుపబడును.

## ఎముకలెదుగుట (Growth of bones)

ప్రతిఎముకను ఆవరించుకొని తెల్లనినారతో చేయబడిన పొరయుండును. రక్తనాళములు ఎముకలలో ప్రవేశించకపూర్వము ఈ పొరలో నవి యల్లుకొనియుండును. ఈ పొర తీసివేసిన యెడల ఎముక నెదుగనేరదు. ఈ పొరనుంచి క్రిందిఎముకభాగమును తీసినచో పోయిన యెముక తిరిగి నెదుగగలదు. కాబట్టి ఎముకలెదుగుటకు మూలాధారము రక్తమేయని గ్రహించవలెను.

## వికారరూపములు (Deformities)

పశువు శరీరమందుండు ఎముకలు దృఢముగానుండినను వక్రరూపమును బొందవచ్చును. శరీరమందలి యేభాగమైనను వికారరూపమును బొందినయెడల తనపనిని చక్కగా నెరవేర్చలేదు. ఇట్టివికారరూపములు అనేకరకములుగా రావచ్చును. ఎముకలకు వ్యాధులనుగూర్చి ముందు తెలుపగలను.

## జీర్ణమండలము (Digestive system)

### తరుగుట పూర్తియగుట

పశువు ప్రతిదినము అనేకపౌనుల ఆహారమును తీసికొనుచున్నప్పటికి అది బరువగుటలేదు. ప్రతిదినము దాని దేహములోనికి యెంతపదార్థము పోవుచున్నదో అంత పదార్థము తిరిగి మరల దేహమునుండి విడచుచున్నదని తెలిసికొనవలెను. దూడ పెరుగుచున్నను దినదినము వృద్ధియగు దేహముయొక్క బరువు, అది తీసికొను ఆహారముయొక్క బరువునకు సమానమగుటలేదు. ఇటుల దేహమునుండి బైటకుపోవు పదార్థములకే తరగుట యందురు. పశువులోపలికి తీసుకొను ఆహారపదార్థమే ఈ తరుగును పూర్తిచేయును. పశువు పాటునవుడెల్ల మేత కొరుకుచూచుచుండును. ఇందువలన దాని దేహములో తరుగుచున్నదని గ్రహించుచున్నాము.

## జీర్ణకోశము (Stomach)

నెమరువేయు జంతువులకు జీర్ణకోశము నాలుగుభాగములుగ విభజించవచ్చును. ఆహారముపోవు మార్గమును బట్టి వాటి నామములు నిర్ణయించబడినవి. 1 పెద్దపొట్ట 2 కానులపొట్ట 3 అరలపొట్ట 4 నాలుగవపొట్ట.

---

## పెద్దపొట్ట (Rumen)

జీర్ణమండలము పటములో జీర్ణకోశపు భాగములనుచూడుము. మొదటిదానినే పెద్దపొట్టయందురు. ఇది అన్నిటికంటె పెద్దది. పశువు తిను ఆహారము ఈతిత్తిలోనికి చేరును. ఈ తిత్తి లోపలిభాగమున ఒకవిధమగు పొరయుండును. ఇంకను ఇది ఏడు, ఎనిమిది ప్రక్కటెముకలమధ్యగా పస్తికమునకు వెనుకగానుండును. చిన్నపశువుల పొట్ట 20 నుంచి



జీర్ణకోశము

30 గాలనులును, మధ్యవయస్సుపొట్ట 25 నుంచి 35 గాలనులును, పెద్దపశువుపొట్ట 48 నుంచి 50 గాలనుల ద్రవపదార్థములవరకును పట్టును. దీనిలోపల కండరములు ఎల్లపుడు తేమగానుండును. ఈతేమగానుండు కండరములు వ్యాపించుటవలన దీనిలోనున్న పదార్థములు ఉండలుండలుగానగును. ఈ కండరములు లేనియెడల దానియొక్క వ్యాకోచనశక్తి నశించును. దానిలో ఆహారము జీర్ణమగు రసముతయారగును. కాబట్టి ఈపొట్ట ఆహారపదార్థమును నిలువయుండునదిగా నుపయోగపడును. బొగ్గు సంబంధమగు నత్రసంబంధమగు పదార్థములు దీనిలోనుండును.

## కౌనులపొట్ట (Reticulum)

దీనినే రెండవపొట్టయందురు. దీనిలోపలిభాగము కౌనులుకౌనులుగానుండును. నెమరువేయుటకు కావలసిన నీరు ఇందులోచేరును. ఇది పెద్దపొట్టకంటె మందముగా

---

ఆవులవలన మానవులకు క్షయవస్తుంది.

నుండును. నెమరువేయుటకు కావలసిన రసములు యిచ్చటజేరును. పెద్దపాట్టలోనున్న మేత ఈతిత్తిలోనికిజేరి ఉండలుండలుగానగును. ఈయుండలను పశువు నోటిలోనికి తెచ్చుకొని చక్కగా నమలిమ్రింగును. ఇంకను ఇనుపముక్కలు రాళ్ళు మున్నగు అన్యపదార్థములు ఈపొట్టలోజేరును. ఈతిత్తి అన్నిభాగములకంటె చిన్నదిగ అర్ధచంద్రాకారముగనుండి పెద్దపొట్టకు ముందుభాగమున నుండును.

## అరలపొట్ట (Omasum)

దీనినే మూడవపొట్టయందురు. ఇది పైరెండుపొట్టలనుండి విభజింపబడియున్నది. పశువుచే పూర్తిగా నెమరువేయబడిన ఆహారము ఈతిత్తిలో జీర్ణమగును. ఈపొట్ట కాగితమువలె పొరలుపొరలుగానుండును. ఈపొరలపై ఒకవిధమగు సూక్ష్మజీవు లంటియుండును. ఇంకనిది 7 నుంచి 11 వరకున్న ప్రక్కఎముకల మధ్యగాను కార్జమునకు కుడి ప్రక్కగను యుండును. కానులపొట్టకంటె కొంచెము పెద్దదిగానుండును. ఎండు పదార్థములన్నియు దీనిలోచేరును. ఇచ్చటనుంచి వచ్చు ఆహారపదార్థమంతయు ఆవిరియై పోవుచుండును.

## నాలుగవపొట్ట (Abomasum)

జీర్ణమైన మేత ఈపొట్టలోనికిజేరును. దీనిలోపలిభాగమునందు ఎరుపురంగుగల ముడుతలుండును. ఇచ్చటనే జఠరరసము పుట్టుచున్నది. ఇది పుల్లగ రుచిగనుండి రుచిని కలిగించును. నీరు మొదలగు ద్రవపదార్థములు పశువుమ్రింగిన వెంటనే ఈ పొట్టలో చేరును. 7 నుంచి 12 ప్రక్కఎముకలమధ్య ఈ పొట్టయుండును. ఈపొట్ట చివరనుంచి ప్రేవులు ఆరంభమగును. దీనికిని మొదటిపేగునకు మధ్య కంఠము (Pyloric ring) ఏర్పడియుండును. నెమరువేయుట అనగా తినినమేత ఉండలుండలుగా నోటికితెచ్చుకొని బాగుగానమలి మ్రింగుట. దీనినే నెమరువేయుటయందురు.

## నోరు (The mouth)

ఇదితొలుక పెట్టెకలెనుండి ముందు పెదవులతోను ప్రక్కలను దవుడలతోను పైభాగమునందు అంగుడుతోను అడుగుభాగమున నాలుకతోను అమర్చబడియుండును. నోటిలోపలి భాగమంతయు సూక్ష్మమైనట్టియు, మెత్తనైనట్టియు చర్మముతో కప్పబడి యుండును. ఈచర్మమునే తడిచర్మము (Mucous membrane) అందురు. దీని యందు నరములు, రక్తనాళములు యుండుటచేత పలుచని పొరగుండ రక్తము మెరయుచుండి నోటిభాగమంతటికి ఎరుపురంగునిచ్చును. దవుడలయందు పెదవులయందు తడిచర్మమేగాక కండరములుకూడ యుండును.

---

ఎనిమా చేసేవిధము తెలిసికోవాలి.

## నాలుక (The Tongue)

ఇది పశువునోటిలో నడుముభాగమున పరుపువలె దౌడలకు మధ్యగా నేర్పడి యున్నది. ఇది మూడుభాగములు గానుండును. 1 మూలము 2 మధ్యము 3 అగ్రము. మూలము నోటిద్వారమునకు దూరముగనుండి నాలుకను గొంతుకకు అంటియుండునట్లు చేయును. దీనిమధ్యముమధ్యభాగమే. దీని యగ్రము నోటిద్వారమునకు దగ్గరగనుండి పలుచని మెత్తనిపదార్థముతో చేయబడియుండును. నాలుక కండరపదార్థముతో చేయబడి యుండును. అందువలన నములునప్పుడు నానాముఖముల తిరుగుచుండును. నాలుక అకురాయివలె గరకుగానుండి పైభాగ చర్మమునందు కండరములుండును. ముందు భాగమునందుండు కండరములు కొనలు తేలి నిడువుగానుండును.

నాలుకవలన మూడుప్రయోజనములు గలవు. 1 పదార్థమును నములునప్పుడు దానిని క్రిందకు పైకి తిరుగవేయుచుండును. 2 పశువు అరచుటకు సహకారిగానుండును. 3 రుచిని తెలుపుట కుపయోగించును. నోటివలెనే నాలుకగూడ తడిచర్మముతో గప్పబడియుండును. నాలుక క్రిందిభాగమునందు ఈపొర మిక్కిలి నునుపుగా మృదువుగా నుండును. కాని పైభాగముమాత్రము గుట్టలవలె ఎగుడుదిగుడుగానుండును. వాటి మూలముననే పశువు రుచిని తెలిసికొనుచున్నది. నాలుకకు ముందుభాగమునందుండు కండరములవలన పులుపుతోపు వెనుకభాగమందున్న కండరములవలన ఉప్పు చేదు వస్తువుల రుచిని గ్రహించుచుండును.

## గ్రంధులు (Glands)

పశువు తిను మేత నోటిలో ప్రవేశించునంతలో అచ్చటికి ఉమ్మినీరువచ్చి మేతను తడుపుచుండును. ఆహారము నములునపుడును ఆహారమును చూచినప్పుడును, ఆహారపు వాసన తగిలినపుడును ఈ ఉమ్మినీరు నోటియందూరుచుండును. రక్తమునుండి తమకు గావలసిన పదార్థములను తీసుకొనుటకై గ్రంధులకుగలదు. ఈ గ్రంధులు మూడురకములుగ నుండును. 1 బాతుకలము పొందటిభాగమువలె సన్నముగ లోతుగనుండునవికొన్ని 2 సన్నని మూతిగలిగి గుండ్రని అంచులవలె నుండునవికొన్ని 3 పాముచుట్టలవలె చుట్టుకొనియుండునవికొన్ని యుండును. అవి చేయుపనినిబట్టి గ్రంధులు రెండువిధములుగా మారుచుండును. శరీరమునకు కావలసిన పదార్థములను తయారుచేయు గ్రంధులను స్వీకారగ్రంధులు (Secreting glands) అనియు, అక్కరలేని పదార్థములను వెలుపలకు త్రోసివేయు గ్రంధులు (Excreting glands) అందురు. స్వీకారగ్రంధులు రక్తములోనున్న కొన్ని పదార్థములను దీసికొని వాటివలన ఇతరక్రొత్తపదార్థములను తయారుచేసికొని దాచుకొనును. ఇంకను ఉమ్మినీటిగ్రంధులు, జాఠరరసగ్రంధులు, ఆంత్రరసగ్రంధులు, కాలేయము, వృక్కము, చెమటగ్రంధులు, మూత్రపిండములు అను రకములు గలవు.

---

పేరాటిడ్ గ్రంధి (Parotid glands) పశువు అరచునపుడు విసునపుడు ఈగ్రంధి స్రవించి కావలసిన తేమనిచ్చుచుండును. ఇవి చెవులకు దగ్గరగ క్రిందిదవుడ పైకి క్రిందికి వాడునట్టిచోటుననుండును. సబ్ మాక్సిలర్ గ్రంధి (Submaxillary glands) రెండు గ్రంథులు దవుడల క్రిందిభాగముననుండును. వీటినోళ్ళు నాలుకకు క్రిందనుండును. ఈగ్రంధులు రమారమి రెండంగుళముల పొడవు నాలుగు అవున్సుల బరువుయుండును.

సబ్ లింగ్వల్ గ్రంధి (Sublingual glands) ఈరెండు గ్రంధులు నాలుకకు క్రిందిభాగమునందుండును. ఇవి నాలుకక్రిందిదవుడతో నతుకబడియున్న యీలెవంటి భాగమున కిరుప్రక్కలనుండును.

ఉమ్మినీటివలన ఆహారమును తడిచేయును. నమలిన ఆహారమును జిగురుగా నుండవలెను. కట్టించుటకుపయోగపడును. ఆహారములోనున్న పిండిపదార్థములను చక్కెరగా మార్చును. ఉమ్మినీటిగ్రంధులు రక్తమునుంచి ఉమ్మినీటినితయారుచేసి నాలుక చివరభాగమునకు దగ్గరగాపోవుచుండును. ఈనీరు తేమను కలుగజేయుచుండును.

## సప్తపథము (Pharynx)

ఈభాగములోనికి ఏడుదారులుండుటవలన సప్తపథయను పేరువచ్చినది. చెవుల నుండి ముక్కులనుండి, ఊపిరితిత్తులనుండి జీర్ణకోశమునుండి ఏడుదారులుండుటవలన సప్తపథమని పేరువచ్చినది. ఇది గళ్ళమాదిరి సంచివలెనుండును.

## ఆహారనాళము (The gullet)

ఈనాళము తిత్తికగుండపోవును. ఇది పెద్దగొట్టములవలె నుండి మడతలుమడతలుగా నుండును. ఉమ్మినీటిగ్రంధులు, కాలేయము, వృక్కకము మున్నగునవి ఈ నాళము నంటియుండును. ఈనాళము పశువుతిను ఆహారపదార్థములను జీర్ణముచేయుటకు తగిన రసమును పుట్టించుచున్నది. ఈనాళము తడిచర్మములో గప్పబడి కొద్దిగ రసమును పుట్టించు గ్రంధులుగా తయారగుచున్నది. ఇంకను ఈనాళము నోరు, సప్తపథ, పొట్ట, ప్రేగులను కలిగియున్నది. పశువు పొడవు ఒకగజమైనయెడల ఆహారనాళము యొక్క పొడవు 20 గజములుండును. ఈనాళమునకు స్పర్శజ్ఞానమెక్కువగానుండి గొంతుకకు ఎడమప్రక్కగానుండును. మేత నీరు దానిగుండా పోవుచుండును.

## ప్రేవులు (Intestines)

జీర్ణకోశమునకు మొదటిపేగునకు మధ్య కంత మేర్పడి మొదటి పేగునుండి ముడ్డి వరకు పేగుండును. పశువుదేహ మెంతపొడవుండునో అంతవరకు 20 నుంచి 25 రెట్లు పొడవుగల పేగుండునని పశుశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. పేగులోపలపొర తడిచర్మముతోను, పైపొర కండరములతోను చేయబడియున్నది. కండరభాగములు గుండ్రముగ

---

ఆంధ్రదేశములో 56 పశువుల ఆస్పత్రులు గవర్నమెంటువారు స్థాపించారు.

పొడవుగనుండును. పేగులు ముడతలుపడి పాముచుట్టలవలె చుట్టుకొని కొద్దిసలములో నిమిడియున్నట్లు చేయబడియున్నవి. ఇంక నీ పేగులలో గ్రంథులు, వెంట్రుకలవంటి సన్నని గొట్టములు వేలకొలదిగా నుండును. పశువు పేడసరిగావేయక మలబద్ధకముగా నున్నపుడు పేగులలో వ్యాధియున్నదని గ్రహించవలెను.

## పెద్దప్రేగు (The large intestine)

ఈ పేగు చిన్నపేగులవలె చుట్టగానుండక వలయాకారముగా నుండును. దీని లోపలివైపు తడిచర్మముతోను పైవైపు కండరములతోను చేయబడియున్నది. జీర్ణమైన పదార్థములో మిగిలినట్టి శరీరమున కుపయోగించునట్టి పదార్థమునంతను ఎక్కువ నీటిని పెద్దపేగు గ్రహించును. ఇంకనిది చిన్నపేగుకంటె లావుగానుండును. పేడ సులభముగా బయలువెడలుటకు గాను పెద్దప్రేవులోని తడిచర్మము జిగురువంటి పదార్థము కలిగించును. పెద్దపేగుయొక్క కడపటి భాగమునకు పురీషనాళమని పేరు. పెద్దపేగు 35 అడుగుల పొడవుండును.

## చిన్నప్రేగులు (The small intestine)

ఇవి పాముచుట్టలవలె చుట్టుకొని కొద్దిసలములో ఇమిడియుండును. జీర్ణాశయములోవలె దీనిలోకూడ పొరలుండును. ఈ పొరలలో గ్రంథులుండి ద్రవమధికముగా స్రవించుచుండును. వీటిలోపలనుండు పొరతడి చర్మముతో చేయబడి గ్రంథులతో కూడియుండును. ఇంకను ప్రేవులు ముడతలు పడుటకు తగిన గ్రంథులును, వెంట్రుకల వంటి సన్నని వేలకొలది గొట్టములుండును. చిన్నపేగుల పొడవు 130 నుంచి 150 అడుగులవరకుండును. రెండంగుళముల మధ్యకొలత యుండును.

## జీర్ణరసములు

చక్కెరపదార్థములు:—ఇవి ఆహారములో తక్కువగానున్నచో రక్తవృద్ధి, శ్వాస, జీర్ణశక్తి మున్నగునవి సరిగా పనిచేయజాలవు. ఇంకను పిండిపదార్థములుగామారిన వెంటనే రక్తములో ప్రవేశించుచున్నవి. పశువు నెమరువేసిన మేత అరలపొట్టలోజేరి నారవంటి పదార్థముగానై అరలమధ్య జేరియుండును. మృదువైనది నీటిలో కలిసి నాలుగవపొట్టలోనికి జేరును.

క్షారరసము:—పైన చెప్పబడిన నాలుగవ తిత్తిలో నుత్పత్తియగు క్షారరసము యొక్క సహాయముచేత ఉమ్మి నీటివలన జీర్ణింపగా మిగిలిన పిండిపదార్థములును, మాంసకృత్తులును జీర్ణముకాని క్రొవ్వుపదార్థములును నాలుగువ తిత్తినుండి ఈ కోశము చివరయందుండు కంఠద్వారముగుండ మొకటి భాగములోనికి ప్రవేశించును.

---

ఆంధ్ర దేశములో 92 గురు సంచార పశువైద్యులున్నారు.

పైత్యరసము:— ఇది కార్జములో పుట్టును. కార్జము రక్తమునుండి కొన్ని పదార్థములను దీసికొని వానిని పైత్యరసముగా మార్చుచున్నది. ఇది ఈరసము కొవ్వుపదార్థములను జీర్ణముచేయుటలో మధురరసమునకు సహాయపడి విరేచనముకూడ చేయించును.

మధురరసము:— పిత్తాశయమునుండి బయలుదేరు పైత్యరసము మధురవాహిక అనెడి అవయవముచేత ఉత్పత్తిచేయబడిన మధురరసము రెండుగొట్టములగుండా పెందటి దానిలోనికిజేరి అచ్చటజేరియుండు మాంసకృత్తులుపిండి లవణపదార్థములు రక్తములో జేరుచున్నవి. మిగిలిన పదార్థములు ప్రేగులగుండ జారిపోవుచు అందుండెడి మంచిపదార్థములను రక్తములోనికి తీసికొనిపోవుచు మిగిలిన పదార్థములను విడచుచుండును.

జీర్ణరసము:— ఇది ఆహారకోశములోని జఠరరసగ్రంధులవలన. మారుచు మాంసకృత్తులను కరగించి గంజివంటి పదార్థము గా మారుచుండును.

ఆంత్రరసము:— ప్రేవులయందుండు తడి చర్మమునందు కొన్ని గ్రంధులుండును. ఆగ్రంధులు ఆంత్రరసమను ఒకపదార్థమును తయారుజేయును. ఈపనిలో జీర్ణముమగి యును. అన్నిపదార్థములను కరుగజేయును.

## కార్జము (The liver)

ఇది పశువు కుడిడొక్కలో కుడివైపుననుండి తెలుపురంగుగా నుండును. దానిపైన కఠినమగు పొర క్రమ్ముకొని యుండును. దీనియందు పైత్యరసము తయారగును. ఈ పైత్యరసము పసుపురంగు గలిగిన ఆకుపచ్చగానుండును. ఇది పులుపు పదార్థములకు వ్యతిరేక గుణములు కలిగియుండును. కాలేయము చేయుపని మరొకటిగలదు. విషపదార్థములను పశువు మ్రింగినపుడు ఇది కాపాడి అట్టి పదార్థములు రక్తములో చేరకుండ నాశనము చేయును. ఇంకను యిది రక్తమును పరిశోధించి దాని యందుండెడి విషమును పట్టుకొని రక్తమును విడచుచుండును. కార్జము 12 పౌనుల బరువుండును.

## పైత్యపుతిత్తి (Gall bladder)

కార్జములోని పైత్యపుతిత్తులు రక్తకేశ నాళికలలోనుండి తమకు కావలసిన పదార్థములను తీసికొని తమలో చేయబడిన లవణములతోను రంగులతోను చేర్చి పైత్యరసమునుచేసి కణములనుండి చిన్నకాలువగుండ పైత్యపుతిత్తికి పంపించి అచ్చట నిలువ చేయును. పైత్యపుతిత్తి 5 లేక 6 అంగుళముల పొడవుండును.

## ప్లీహము (The Spleen)

దీనినే బొరడిగుండె యందురు. ఇది కాలేయమునకంటె పలుచగ నునుపుగ నుండును. గొట్టములులేని గ్రంధులలో నిదియే పెద్దది. దీని పైభాగమున బిగువగు తెలుపు పొర క్రమ్ముకొని యుండును. ఇది డొక్కలో ఎడమభాగముననుండును. ఇది మెత్తగా

నుండు స్పంజివంటి పదార్థముతో చేయబడును. పశువు మేత మేసిన తరువాత పెద్దదిగా నగును. ఆహారము జీర్ణమైన తరువాత చిన్నదగును. జీర్ణరసములు పనిచేయునపుడు చిన్నదిగానుండి అవి పనిచేయక నిలచినపుడు చిన్నదగును. ప్లీహమును మనముకోసి పరిక్షించినచో నారవంటి పదార్థముతో చేయబడిన గొట్టములలోపల వ్యాపించియున్నట్లు కనపడును. ఈ గొట్టములమధ్యనున్న ఖాళీసలములు గుంజువంటి పదార్థముతో నింపబడియుండును ఈ గుంజుపదార్థమునకే ఎరడిగుంజు అందురు. ఇది దొమ్మ మున్నగు రోగములు సంభవించినపుడు ఆ విషమువలన దేహముచ కపాయము రాకుండ కాపాడును. ఈ కారణముచేతనే విషజాడ్యము సంభవించి చనిపోయిన పశువు ప్లీహము ఉబ్బియుండును. ప్లీహము 2 పౌనులబరువు 20 అంగుళముల పొడవు 6 అంగుళముల వెడల్పు 1 అంగుళము మందముయుండును.

## రక్తప్రసరణ మండలము (Circulation of blood)

పశువు రక్తము జలము వలె ప్రవహించెడి ద్రవపదార్థము. ఇది జలముకంటె చిక్కగను బరువుగను ఉండును. దీనియందనేక పదార్థములు తేలుచుండును. రక్తమునందు నీరు ఖనిజపదార్థములు బొగ్గుసంబంధమగు పదార్థములు ఉండును. ఇంకను ఎర్రకణములు, తెల్లకణములని రెండురకములుండును.

## ఎఱ్ఱకణములు (Red corpuscles)

రక్తము ప్లాస్మాయను పేరుగల పలుచని శుభ్రమైన పదార్థమును కలిగియున్నది. ఈ ప్లాస్మా (Plasma) లో చిన్నవగు కణములుండును. రక్తకణములు రెండురకములు. మొదటివి ఎఱ్ఱకణములందురు. ఈ కణములు గుండ్రముగను చదునుగను మధ్యభాగము పలుచగను చుట్టును దళసరిగను ఉండును. ఈకణములలో ఇనుము అను లోహముండును. ప్రాణవాయువుతో సమ్మేళనమందిన యీఇనుము పశువులోపలికి పీల్చు గాలిలోని ప్రాణవాయువును గ్రహించుకొని శరీరమంతటను సంచారముచేయుచు దేహోష్ణమును నిలుపుచు ప్రాణములను కాపాడును. ఈ ఎర్రకణములలో ఇనుమను లోహపదార్థముండుటవలననే రక్తములోకూడ ఈపదార్థముండును. ఇవి రక్తముతో కొట్టుకొనిపోవునపుడు నాణెముల దొంతరలవలె నేర్పడి ప్రవాహ వేగమువలన ఒకదానినొకటి త్రోసికొనుచు వాని యాకారమును మార్చుకొనుచు తిరిగి వెనుకటిస్థితిని బొందుచుండును. రక్తములో ఈ ఎర్రకణములు 50 లక్షలవరకుండును.

## తెల్లకణములు (White Corpuscles)

ఇవి ఎర్రకణములకంటె కొంచెము పెద్దవిగానుండును. వాటంతటవియే జీవించియున్నంతవరకు వాటియాకారము మార్చుకొనుచుండును. ఈకణములలో పసుపుపచ్చని పదార్థముండును. ఆపదార్థమునే హెమోగ్లోబాను అందురు. ఇది ప్రాణవాయువును

---

దొమ్మలకు కొర్రగంజే పథ్యము.

పీల్చుకొని టిస్యూలకిచ్చుచుండును. ఈకణములు గొప్ప వైద్యునివంటివి. పురుగులుగాని అన్యపదార్థములుగాని రక్తములో చేరినపుడు ఈకణములు వాటిని అడ్డగించి నిర్మూలము చేయును. దెబ్బలుతగిలిన గాయములవెంట నెత్తురు కారునపుడు ఈకణము




1. రక్తప్రసరణమండలము 2. తలలోని రక్తనాళములు 3. గుండె 4. ఆహారకోశములోని రక్తనాళములు 5. ప్రేగులలోని రక్తనాళములు 6. కాళ్ళలోని రక్తనాళము.

---

గుఱ్ఱమునకు 100 నుంచి 102 డిగ్రీల వేడియుండును.

లచటికిపోయి మార్గనిరోధము చేసి నెమ్మదిగ పుండ్లను మాన్పును. శరీరమందు విషపదార్థము లెక్కువగయున్న ఈకణములకు బలముతగ్గును. ఎఱ్ఱకణములకంటె తెల్లకణములు చాలా తక్కువగానుండును. అనగా నూటికి 2 నుంచి 10 వరకు యుండును.

## హృదయము లేక గుండె (The Heart)

ఇది గోపురపు ఆకారముగా బోలైన కండరములు కలిగిన అవయవమైయున్నది. హృదయమును ఆవరించుకొని హృత్కోశము (Pericardium) అనబడుతోలుసంచి యొకటి యుండును. హృత్కోశము గుండెకు సంరక్షణ నిమిత్తముండుటయేగాక దాని యందుఊరెడు ఒకవిధమైన ద్రవ్యమువలన గుండెలు కొట్టుకొనునపుడు రాపిడిలేకుండ జేయును. గుండెకాయ శ్వాసకోశముల రెంటి మధ్యను, క్రింది భాగమున రొమ్ముయెముకకు సమీపమున ఎడమ ప్రక్కను, వ్రేలాడుచుండును. దాని వెడల్పగు భాగము కొంచెము కుడివైపుగా మీదికియుండును. మొనతేలినభాగము ఎడమవైపున క్రిందికి యుండును.

గుండెకు రెండు ప్రక్కలను హృత్కోశము అంటుకొనును. హృదయము నాలుగు గదులుగా విభజించబడినది. కుడి ఎడమ కర్ణికలు పైభాగమునకు, కుడి ఎడమ జఠరికలు క్రిందిభాగమునకు యుండును. ఈగుండె ముడుచుకొనుట వలనను, తెరచుకొనుట వలనను యీ గుండెలోనున్న నెత్తురు శరీరములోనున్న అన్ని అవయవములలోనికి పోవును. ఈ గుండెకు గదులుండుటవలననే రక్తప్రసరణ జరుగుచున్నది. హృదయము ఉబికినపుడు రక్తము సిరలలోనుంచి ధమనులలోనికి పోవును. హృదయము ముడుచుకొనునపుడు రక్తము జఠరికలలోనుంచి ధమనులలోనికి పోవును. గుండెబరువు 4 నుంచి 6½ పౌనులబరువుండును.

## ధమనులు, సిరలులోని రక్తము

ధమనులలో మంచిరక్తము ప్రవహించును. సిరలలో చెడురక్తము ప్రవహించును. రక్తము ప్రవహించునపుడు అన్నవాహికలలోని జీర్ణించిన పదార్థమును, ఊపిరితిత్తులలోని ప్రాణవాయువును తీసికొనిపోయి శరీరమునందు ప్రతిభాగమునకు సరిసమానముగా పంచును. అదియునుగాక టిస్యూలనుంచి మూత్రపిండములకు బహిష్కరింపబడును. మరియు ఊపిరితిత్తులనుంచి అపరిశుద్ధవాయువునుకూడ బహిష్కరించును. రక్తముచేత తీసికొనబడిన ప్రాణవాయువు శరీరములో నున్న టిస్యూలన్నిటికి సమానముగా తీసికొని వెళ్లును. ఆటిస్యూ (Tissues) లలో ప్రాణవాయువు చెడిపోయిన పదార్థములను కాల్చివేయును. కాల్చివేయగా ఆప్రాణవాయువు అంగారక్షారవాయువుగా మారిపోయి ఊపిరితిత్తులలోనికి తీసికొనిపోబడి బైటికి విడువబడును. ఇదివరకు టిస్యూలలో ప్రాణవాయువుచే కాల్చబడిన చెడుపదార్థములు మంచిరక్తముతో వేరుచేయబడి మూత్రపిండములోనికి పంపబడి మూత్రరూపముగా బైటికి పోవును.

---

అవునకు 101½ నుంచి 102 డిగ్రీల వేడియుండును.

కొద్దిసేరును కొద్ది చెడుపదార్థమును చెమటరూపముగా శరీరములోనుంచి బైటకి పోవును. రక్తనాళములలో రక్తము రెండువిధములుగా ప్రవహించును. 1 శ్వాసకోశసంబంధమైన ప్రవాహము. 2 క్రమ ప్రకారమైన ప్రవాహము. మొదటి దానిలో రక్తము హృదయమునుండి ఊపిరితిత్తులకు మరల వెనుకకు ప్రవహించును. రెండవదానిలో రక్తము హృదయమునుంచి శరీరములోనున్న టిస్యూలన్నిటికి (ఊపిరితిత్తులలోని టిస్యూలుతప్ప) మరల హృదయమునకు ప్రవహించును శ్వాసకోశసంబంధమైన ప్రవాహములో కుడిజఠరికలోని రక్తము ప్రప్రథమములోనికిన్ని తరువాత ఊపిరితిత్తులలోనికి పుపుససిరలచే గుమికూడబడును. తరువాత పుపుససిరలచే (Pulmonary veins) తేబడిన రక్తము యెడమ కర్ణికలోనికి పోవును. ఈ ఎడమకర్ణికలోనుంచి ఎడమ జఠరికలోనికిన్ని, తరువాత బృహద్ధమని (Aorta) లోనికిని పంపబడును. అనగా క్రమప్రకారమైన ప్రవాహములోనికిని తరువాత శరీరములోని టిస్యూలకును, ఆటిస్యూలనుంచి రక్తము క్రమక్రమముగా సిరలలోనికిని, తదుపరి కుడికర్ణిక లోనికి తిరిగి వచ్చును. ఈ కుడికర్ణికలోనుండి అది కుడి జఠరికలోనికిని తరువాత నది పుపుసధమనిలోనికి కొట్టబడును.

## ధమనులు, సిరలు (Arteries, Veins)

ధమనులు మిక్కిలి దృఢముగా, రబ్బరువలె సాగునవిగనుండును. ఇంక నివి మృదువైన గోడలను కలిగియుండును. ఇవి హృదయమునుండి శరీరములోని వివిధభాగములకు రక్తము తీసికొనిపోవుటకు ఉపయోగించుచున్నవి. ధమనులు ఎల్లపుడు రక్తముతో నిండి ఉబికినట్లుండును. సాధారణముగా ఎక్కువ రక్తము ఈఉబికిని ధమనులలోనికి పంపబడినయెడల హృదయము కొట్టుకొనునపుడును ఈ ధమనులయొక్క గోడల మృదుత్వముచే అవి ఉబుకును. ఈ ఉబుకునకే "హృదయపుదెబ్బ" యనబడును. కొన్ని పెద ధమనికలలో చర్మముక్రింద "నాడి" యుండును.

సిరలు పలుచనిగోడలను కలిగి రక్తమును టిస్యూలనుండి హృదయమునకు తీసికొని పోవును. కాలిభాగములోనున్న ఎక్కువ సిరలు మూతలు కలిగియుండును. ఈమూత లుండుటవలన సిరలలోని రక్తము ఒకేమార్గములోనికి పారుదలగుటకు వీలుండును. ఒకే మార్గమున గుండెకు ధమనులను సిరలను కలుపు కేశనాళికలను సన్నని కాలువలున్నవి. ఈ కేశనాళికలయొక్క గోడలు పలుచగా మృదువుగానుండును. కొన్ని కేశనాళికలు గలసిన ఒక టిస్యూ తయారగును. ఈ కేశనాళికల గోడలద్వారా ప్రాణవాయువు జీర్ణించిన యాహారము రక్తమునుంచి టిస్యూలకుపోవును. అప్పుడే టిస్యూలలోనున్న బొగ్గుపులుసుగాలి చెడుపదార్థములు రక్తముతీసికొని చెడురక్తముగా నగుచున్నది. ప్రాణవాయువు చెడురక్తముతో పీల్చబడి బొగ్గుపులుసుగాలి బైటకు విడిచిపెట్టబడును.

## రక్తప్రసరణము

శ్వాసాశయధమని చెడురక్తమును కలిగియున్నది. ఈ ధమని కుడిజఠరమునుంచి ఊపిరితిత్తులలోనికి శుభ్రపరచుటకు చెడురక్తమును తీసికొనిపోవును. ఆరక్తము హృదయ

---

గొడ్డుకు 104 లేక 105 డిగ్రీల వేడియుండును.

మును దాటగనే రెండు భాగములుగా విభజింపబడును. ఒకభాగము కుడిఊపిరితిత్తి లోనికి మఱియొకభాగము ఎడమ ఊపిరితిత్తి (left lung) లోనికిపోయి అచ్చటనుంచి చిన్నచిన్న రక్తనాళములుగా విభజింపబడి కేశనాళికలగువరకు పోవును. తుదకు వాయు గోళములచుట్టు ఈరక్తనాళములు తయారగును. ఈ రీతిగా రక్తము ప్రాణవాయువుతో సంబంధించును. తరువాత ప్రాణవాయువును ఊపిరితిత్తులు తీసికొని బొగ్గుపులుసుగాలిని తడిచెమ్మను ఇచ్చుట కేశనాళికల గోడలవద్ద జరుగును. ఈరీతిగా పరిశుభ్రము చేయ బడిన రక్తము సిరలగుండా శ్వాసకోశములలో తయారగును. తదుపరి పరిశుభ్రమైన రక్తము ఎడమ కర్ణికలోనికి తీసికొనిపోవును. ఎడమ కర్ణికనుంచి పరిశుభ్రమైన రక్తమును బృహద్ధమని శరీరములోనున్న టిస్యూలకన్నిటికి పంపబడును. ఆటిస్యూలకు రక్తము ప్రాణవాయువు నిచ్చి వాటినుంచి బొగ్గుపులుసుగాలిచే చెడురక్తముగా తయారగును. బృహద్ధమని ఒక పెద్ద రక్తనాళము. ఇది ఎడమ జఠరికనుంచి పరిశుభ్రమైన రక్తమును తీసికొనిపోయి శరీరమున కంతకును వ్యాపింపజేయును.

## నాడి (Pulse)

వైద్యులు పశువుశరీరారోగ్యమును తెలిసికొనుటకు తోకమట్టక్రిందను, దౌడ వద్దను చేతితోపట్టుకొని చూచుదురు. ఇట్లు పట్టుకొనునపుడు చేతికి ఒకవిధమైన శబ్దము తట్టును. ఇట్టిచలనము ధమనులగోడ లుబ్బుట వలనను, తిరిగి యథాస్థితిని పొందుట వలనను కలుగుచున్నది. దీనినే నాడియందురు.

## చురుకైన రక్తప్రసరణమువలన లాభములు:—

శరీరమందు పుట్టు కల్మషపదార్థములు త్వరగా విసర్జింపబడును.

శరీరమందు అధికముగానుండు క్రొవ్వు కరిగిపోవును.

కండరములకు పోషణ బాగుగా జరిగి అవి బలముగను గట్టిగను పెద్దవిగను వృద్ధి పొందును.

శరీరావయవము లన్నియు మంచి రక్తమును మంచి పోషణనుపొంది ఆరోగ్యస్థితి యందుండి వాటివాటి పనులను సరిగా చేసికొనగలుగును.

## రక్తమెందుకు ప్రసరణ చేయవలయును?

పశువు శరీరమందలి టిస్యూలు (Tissues) పోషింప గలుగుటకు కావలసిన పదార్థమంతయు రక్తమువలననే కొనిపోబడుచున్నది. ఈ టిస్యూలకు కావలసిన యాహారమును తీసికొని వచ్చుటకు రక్తము, పశువు తినెడి ఆహారమును జీర్ణింపజేయు అవయవములగుండను గాలిలోనుండి ప్రాణవాయువును తీసికొనివచ్చుటకు శ్వాసాశయములు (Lungs) గుండను, ప్రయాణము చేయవలసియున్నది. ఇంతేగాక శరీరమందలి

---

పశ్వాదుల $100\frac{1}{2}$ లేక $101\frac{1}{2}$ డిగ్రీల వేడియుండును.




1. హృదయము 2. ఊపిరితిత్తులు 3. కుడిభాగపు ఊపిరితిత్తిపైభాగము 4. కుడి భాగపు ఊపిరితిత్తి లోపలిభాగము 5. ఎడమభాగపు ఊపిరితిత్తిపైభాగము 6. ఎడమ భాగపు ఊపిరితిత్తిలోపలిభాగము 7. కార్జము, పైత్యపుతిత్తి 8. శ్వాసకోశము, శ్వాస నాళము 9. కుడివైపు మూత్రపిండముపైభాగము 10. కుడివైపు మూత్రపిండము లోపలి భాగము 11. గొరడి.

కలుషపదార్థములను బయటకు బంపివేయుటకు అట్టి పదార్థములు తయారుచేయు అవయవముల (చర్మము, మూత్రపిండములు మొదలగువాని) ద్వారా రక్తము ప్రవహించవలసియున్నది. కావున రక్తము శరీరమంతయు ప్రయాణము చేయవలసిన విధి ఏర్పడుచున్నది. రక్తప్రసరణమునకు సాధనమైనవి గుండె, ధమనులు, కేశనాళికలు, సిరలు. వీని సమూహమునకు రక్తప్రసరణ మండలము (The circulatory system) అని పేరు.

## శ్వాసమండలము (The respiratory system)

### ఊపిరితిత్తులు (The Lungs)

హృదయమునకు హృదయమనెడి గాలిపోనిపెట్టెలో శ్వాసాశయము నిమిడియున్నవి. ఈపెట్టె పైభాగమున వెన్నెముకవల్లను, ప్రక్కలయందు ప్రక్కటెముకల (Ribs) వల్లను, ముందుభాగమందు రొమ్మెముక (Sternum) వల్లను ఆవరింపబడినది. ఈ ఉదరమందు హృదయము ఆక్రమించుకొనిన భాగముగాక తక్కినదంతయు ఊపిరితిత్తులు ఆక్రమించుకొని కుడివైపున నొకటియు, నెడమవైపున నొకటియు నుండును. వీని పైక రెండుగా చీలుచోట కలిసి ద్రవసహితమైన తెల్లని పొరచేత క్రమ్మబడియుండును. వీనిలో అడుగుపొర తిత్తులనంటియుండును. ఇవి కమ్మగవాని కొలిమితిత్తులవలె నుండును. ఈ ఊపిరితిత్తులలో రక్తకేశనాళికలను, గాలిగొట్టములును, రబ్బరువంటి మాంసపదార్థములు నుండును. ఇవి బహిష్కారావయవములలో నొకటి. ఇవి ప్రాణవాయువును పీల్చును. చెడుగాలిని విడిచిపెట్టును. ఊపిరితిత్తులు 7½ పౌనుల బరువు యుండును.

### శ్వాసనాళము (Bronchia)

గాలిగొట్టము పశువుదేహములో రెండుగా చీలియుండును. వాయునాళములు శాఖోపశాఖలుగా ప్రసరించి యుండును. వాయునాళములు ఎల్లప్పుడును వాయువు నిమిత్తమెదురు చూచుచుండును. కాబట్టి వాయునాళములలో ప్రవేశించిన గాలి క్రమముగా వాయునాళముల నిండించును. ఇది పశువు గొంతుకవద్దనుండి ఆరంభమై ఊపిరితిత్తులవద్ద రెండుగాచీలును. శ్వాసనాళము 20 అంగుళములపొడవు ½ అంగుళము వర్ధము 2 అంగుళముల వెడల్పు యుండును.

### శ్వాసపద్ధతి

పశువు ముక్కులగుండా కొంతయును, నోటిగుండా కొంతయును, బుగమూలముగా కొంతయును ప్రాణవాయువు పీల్చుటకలదు. అది నురుగుదబ్బలలో అనగా ఊపిరితిత్తులలో చేరియుండును. దేహమంతట వ్యాపించి నలుపువర్ణముగా మారియుండు అశుద్ధరక్తము హృదయమునకు నలుపురక్తము తీసికొనిపోవు రక్తనాళముద్వారా, కుడివిలమునుండి ఊపిరితిత్తులలో ప్రవేశించగనే బుసగుండా అచ్చటచేరియుండిన ప్రాణవాయువు దానిని శుభ్రపరచి మెరుపురంగుగా మార్చును. ఇట్లు అశుద్ధరక్తము శుభ్రము

---

ఎద్దు 24 గంటలలో 480 టొన్నుల మూత్రముపోయును.

కాగానే దానిలోని విసర్జన వస్తువులు నీటియావిరితోగూడ బుసగుండా వెలుపలికి వచ్చును. సురక్షితముగానుండు పశువులకు నిముషమునకు 15 మొదలు 18 వరకు శ్వాసములు ఆడును. ఊపు లోపలికిపోయి మరల వెలుపలికి వచ్చునది ఒకశ్వాసగా నెంచవలెను.

## ఉచ్ఛ్వాసము (Inspiration)

ఉచ్ఛ్వాస నిశ్వాసములద్వారా హృదయకుహరము పెద్దదగుటకును, ముడుచుకొనుటకును శ్వాసయనిపేరు. పశువు ప్రక్కయెముకల మధ్యనుండు కండరములలో పైభాగమందలి కండరములు ముడుచుకొనుటవలన ప్రక్కయెముకలు పైకిలేచును. పిమ్మట ముడుచుకొనును. ఈరీతిగా హృదయకుహరము పెద్దదియగును. దీనితోగూడ ఊపిరితిత్తులు పెద్దవగును. పిమ్మట వాయువు గొట్టములగుండాపోయి ఊపిరితిత్తులను నింపును.

## నిశ్వాసము (Expiration)

రబ్బరు స్థితిగలిగియుండిన హృదయకుహరముయొక్క గోడలును, ఊపిరితిత్తులను ముడుచుకొనును. పైనుండు కండరములు యథాస్థితియందుండును. ప్రక్కయెముకలలోపలి కండరములు ముడుచుకొనును. ప్రక్కయెముకలు క్రిందికి దిగివచ్చి హృదయకుహరమును చిన్నదిచేయును. వాయువు గాలి గొట్టములగుండా వెలుపలికి వచ్చును.

## నాడీమండలము (The Nervous System)

నాడి అనగా సన్నని నూలుదారములను పోలియుండెడికట్ట. ప్రతిదారము చమురుతో నిండిన సన్నని గొట్టమును పోలియుండును. ఈ చిన్నదారములు చర్మవిశేషము వలన కట్టబడియున్నవి. ఇదియేనాడి. దీనికి స్వతంత్రముగా ఆజ్ఞలను కలుగజేయుశక్తి లేదు. స్పర్శనాడులు, జ్ఞాననాడులు, చలననాడులు, మిశ్రమనాడులు అను రకములు గలవు. అన్ని ఇంద్రియములనుండి మెదడునకు వార్తలను గొనిపోవు కొన్నినాడులు గలవు. ఇవి శబ, స్పర్శ, రస, రూప, గంధములను మెదడునకుగొని పోవుచు, జ్ఞానమును గలిగించుచుండును. గాన వీనికి జ్ఞాననాడు (Sensory Nerves) లని పేరు.

బాహ్యవ్యాపారము లనుకూలపడెడు ప్రతి కండరమునకు మెదడునుండి ఆజ్ఞలను గొనిపోయి సాధారణముగా అట్టి కండరములయందు చలనమును బుట్టించు నాడులకు చలననాడులు (motor nerves) అందురు.

ఒకప్పుడు నాడులలోనుండు సన్నని దారములయందు జ్ఞాననాడులు, చలననాడులు కూడ కలిసియుండును. ఇట్టి నాడులకు మిశ్రమనాడులు (mixed nerves) అని పేరు. ఇట్టివి శరీర మందనేకములు గలవు.

---

జ్వరముతగిలిన పశువుమూత్రము పసుపుపచ్చగా వేడిగా నుండును.

## మెదడు

పశువు మెదడు చదునుగను, నునుపుగను ఉండక, ముడుతలుపడియుండును. ఇట్లుండుటవలన రక్తవాహికలనుండి ఎక్కువ రక్తము ప్రవహించుచుండును. అందువలన




1. నాడీమండలము 2, 3 కాళ్లలోని నరములు 4 చెవిలోని నరములు 5 తలలోని నరములు 6 వస్తికపు ఎడమభాగమునందుండు నరములు 7 మెదడు 8 మెదడులోని నరములు.

---

పోషణపదార్థ మెక్కువగా మెదడు సంపాదించును. మెదటిలో ఒకవిధమైన రసముండును. అది యుండుటవలన దెబ్బతగిలినప్పుడు అంతగా నొప్పికలుగదు. మెదడుబరువు 16 నుంచి 17 ఔన్సుల బరువుండును.

## పెద్దమెదడు (Cerebrum)

ఇది పశువు శిరస్సునందు కపాలకుహరమునం దెక్కువ స్థలము నాక్రమించుకొనును. ఈమెదడు లేనియెడల పశువునకు ఆలోచన, జ్ఞాపకశక్తి యుండవు. ఇది ఇంద్రియ జ్ఞానమునకు ఆధారము. ఇదిలేనియెడల పశువుచూడలేదు. వినలేదు. వాసనయు రుచియు తెలియదు స్పర్శజ్ఞానము కలుగదు. ఇంక నిదిలేనియెడల శరీరమందలి కండరములను చలించునటుల చేయలేదు.

## చిన్నమెదడు (Cerebellum)

ఇది పెద్దమెదడుకంటె చిన్నది. ఇది నడిపించుటకును, పరుగెత్తించుటకును సహాయపడును. ఇది చెడిపోయినయెడల పక్షవాతము కలుగును.

## మజ్జాముఖము (Medulla oblongata)

దీనిని వెన్నుపాముయొక్క లావుపాటి మొదలని చెప్పవచ్చును. దీనికి అపాయము కలిగినవెంటనే మరణము సంభవించును. ఊపిరితిత్తులయొక్కయు, హృదయముయొక్కయు, కండరములును, మేతదినుసులు మ్రింగునపుడు చలించునట్టి కండరములును దీనియొక్క ఆజ్ఞవలననే పనిచేయుచుండును.

## వెన్నుపాము (The spinal cord)

ఇది వెన్నెముక పెట్టెలోనుంచబడి దెబ్బతగులకుండ భద్రపరచబడియుండును. దీనిలో కొన్నిరకముల పదార్థములుండును. ఇది లేనియెడల ఇంద్రియ జ్ఞానము, ఇచ్ఛాధీనమైన చలనము కలుగదు. మెదడునకును, మెదడునుండి పోవు జ్ఞానవార్తలను, చలనవార్తలను దీనిగుండా పోనిచ్చునది. ఇది 65 లేక 67 అంగుళముల పొడవు. 16 లేక 17 ఔన్సుల బరువుయుండును.

## మూత్రపిండములు (Kidneys)

ఇవి పశువువెన్ను పూసలకును, లోంటియెముకలకును నడుమగా వెన్నెముకకు ఇరుప్రక్కలను చెరియొకటియు నుండును. మూత్రపిండమును బద్దలుగా కోసిచూచినయెడల విస్తార రక్తనాళములుండి యెరుపురంగుగా నుండును. ప్రతిపిండముయొక్క లోపలిభాగము పల్లముగానుండి వెలుపలికి ఉబ్బెత్తుగా నుండును. ప్రతి పిండముయొక్క గుంట భాగమందుండియు మూత్రనాళమును ఒక గొట్టముండును. మూత్రపిండములు మూత్రమును తయారుచేయును.

---

మలబద్ధకముగల పశువుపేడ గట్టిగా నుండును.

రక్తములోనుండి మూత్రమును తీసికొని రెండుగొట్టముల ద్వారా ఉచ్చబుడ్డ లోనికి పంపుట వీనియుద్యోగమై యున్నది. ఈరెండు గొట్టములగుండా మూత్రము బొట్లుబొట్లుగా ఉచ్చగుండములోనికి పడుచుండును. మూత్రపిండములు రక్తమును శుభ్రముచేయును. వేసవి కాలమందును, పశువుబాగుగా కష్టించి పనిచేయు నపుడును, రక్తములోనినీరు చెమటరూపమున చర్మమువలన తీసివేయబడును. అప్పుడందుచే మూత్ర పిండముల పని తక్కువగా నుండును. మూత్రపిండములు 20 లేక 25 ఔన్సులబరువును, కుడి పిండము 8 అంగుళములుండి 4 అంగుళములపొడవు 3 అంగుళముల వెడల్పును, ఎడమపిండము ఒకటి రెండంగుళములుండును. వృషణముల బరువు 10 లేక 12 ఔన్సుల బరువుండును. వట్టలసంచములు 10 అంగుళములుండును.

## మూత్రకోశము (Urethra)

ఇది ఆసనము వద్దనుండు పురీషనాళమునకు దగ్గరగా నుండును. మూత్రముతో నిండియుండిన యెడల నిది ఉబ్బియుండును. లేనియెడల తగ్గియుండును. మూత్రకోశము వంపుగా నుండును. అందువలన శిలామేహానాళము సోకినపుడు కడ్డీ యెక్కించుటకు ఆవంకర యుండుటవలన వీలులేదు. శస్త్రము చేయవలసి వచ్చిన యెడల వంపుదగ్గరనే చేయవలెను. మూత్రకోశము పొడవు 3 అడుగుల పొడవు యుండును.



ఆవు 9 లేక 9½ మాసములలో ఈనును.

# పశురోగ విజ్ఞానము

## పదియవ భాగము

శ్లో॥ నమామి ధన్వన్తరిమాదిదేవం సురాసురైర్వన్దితపాదపద్మమ్।
లోకేజరారుగ్భయమృత్యునాశం దాతారమీశం వివిధౌషధీనామ్॥

"చరకసంహిత"

ఆదిపురుషుడైనట్టియు, దేవతలచేతను, రాక్షసులచేతను నమస్కరింపబడిన పాదపద్మములుగలిగినట్టియు, లోకమునందు వృద్ధాప్యముయొక్కయు, రోగములయొక్కయు భయమును, మృత్యువును నశింపజేసినట్టియు, సమస్త ఓషధులయొక్క జ్ఞానమునిచ్చినట్టియు, ప్రభువైనట్టియు ధన్వంతరిని ప్రార్థించుచున్నాడ.

### ప్రాచీన ఆయుర్వేద పశువైద్య చరిత్ర

ఇటీవల నేను ఇండియా గవర్నమెంటు ఎగ్రికల్చరల్ రీసర్చి కౌన్సిల్ స్టాండింగ్ కమిటీ మీటింగునకు ఢిల్లీపోయినపుడు ఈదిగువ సంక్షిప్తచరిత్రను ఇండియా గవర్నమెంటువారు పశువైద్య పత్రికలో ప్రకటించగా ప్రకటించుచున్నాను. భారతీయుల సకలవిజ్ఞాన శాస్త్రములకు వేదములు మూలాధారములు. పాశ్చాత్యహైందవులనుండి పెక్కువిషయములు తెలిసికొనిరనిన యతిశయోక్తికానేరదు. కాని క్రమక్రమముగా వేదములలోని విషయములు స్వయముగా గ్రహించి వ్యాపింపజేయుట యసుగంటినది. రానురాను పెక్కువిషయములను గ్రీకులు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు, జర్మనులు ప్రచురించిన గ్రంథములనుండి మనవారు నేర్చుకొని కుడను ఈవిజ్ఞానమంతటికి వేదములే ప్రమాణగ్రంథము అని గ్రహించి వానికి తగిన గౌరవమిచ్చుట తమవిధియని గ్రహించుచున్నారు.

ఆయుర్వేదములో మానవులకు సంబంధించిన వైద్యవిషయములును, పశువైద్య విషయములునుగలవు. ఆయుర్వేదము ప్రత్యేకముగా మనుష్యులకు వచ్చురోగములు వాని చికిత్సనుగురించి మాత్రమేలేదు. దానిలో పశువైద్య విషయములు పూర్తిగా వివరింపబడినవి. జంతువుల అస్థిపంజరము, వానిలక్షణములు, రోగములు, వానిచికిత్స, మొదలగు పెక్కువిషయములుగలవు. ఇవిగాక పశుశరీరశాస్త్రము, ప్రతిఅవయవముల లక్షణములు, కొమ్ములు, చర్మము, తోక, కన్నులు, చెవులు, డెక్కలు, నోరు, ముక్కురంధ్రములు, గంగడోలు మొదలగునవియును, పశువులకు కలిగెడు రోగములు వాని చికిత్సావిధానము మొదలగునవియునుగలవు.

---

గుఱ్ఱము 11 లేక 12 మాసములలో ప్రసవించును.

ప్రతిజంతువును మనము జాగ్రత్తగా పరీక్షించుచుండినచో స్వాభావసిద్ధముగ కొన్ని రోగములను కుదుర్చుకొను జ్ఞానము వానికి సహజముగ భగవంతునిచే కలుగ జేయబడినదని గ్రహింపగలము. వాంతిచేసికొనుటకు కొంచెము కొంచెముగా గడ్డిని వాంతి చేసికొనును. కడుపునొప్పి పోగొట్టుకొనుటకు కొన్ని చెట్లయాకులు భుజించును. ఆదేవిధముగా లేళ్ళు, దుప్పులు గాయములు మాన్పుకొనుటకు కొన్నిచెట్ల ఆకులను రాచుకొనును. కొన్ని జంతువులు వైద్యమున నుపయోగించు ఆకులను మూలికలను ఇతర చెట్లఆకులనుండి వేరుచేయగలవు. మేకలు వైద్యమునకు పనికివచ్చు కొన్ని యాకులు, వేళ్ళు గ్రహింపగలిగినట్లు మన పూర్వగ్రంథములలో గలవు. ఆర్యులు మన దేశములోనికి వచ్చినప్పటినుండి పశుశస్త్రచికిత్స విరివిగానున్నట్లు తెలియుచున్నది. పూర్వపురోజులలో యుద్ధము పరమావధిగా నెంచబడుచుండెడిది. యుద్ధములో గుఱ్ఱములకును, ఏనుగులకును సైనికులకును అస్త్రశస్త్రములవలన కలిగిన గాయములకు కట్లు కట్టుటకును, చికిత్సచేయుటకును మన పూర్వులు పశువైద్య విద్య నేర్చియుండెడివారు. చారిత్రక విషయములనుబట్టిచూడ హిందూదేశములో పశువైద్యమునుగూర్చిన విద్య ఋగ్వేదకాలమునుండి అనుస్యూతముగా కొద్దిగనో గొప్పగనో వ్యాప్తిలోనున్నట్లు కన్పట్టుచున్నది. ఋగ్వేదకాలము 200-1400 బి. సి. రానురాను, హిందూదేశములో పూర్వవిజ్ఞాన మడుగంటుచున్నది. బౌద్ధయుగమువాడు ఏవిధమైన జంతువధ చేయబడలేదు. జంతువుల కేవిధమైన బాధకలుగలేదు. ప్రజలకు జంతువులకు వైద్యశాలలు వానికి సంబంధించిన పాఠశాలలు స్థాపించుట జరిగినది. అశోకచక్రవర్తికాలములో పశువైద్యము చాలా ప్రబలముగానుండెను. ఆకాలమున తక్షశిలలోగల వైద్యపాఠశాలలు ప్రపంచ ప్రఖ్యాతిని బడసినవి.

సుశ్రుత చరకులు మానవవైద్యమునకెట్లు పేరువడసిరో పశువైద్యమునకు శాలిహోత్ర, పాలకాప్య, అనువారలు ప్రఖ్యాతిబడసిరి. యూరపుఖండమున గేలనుకును అంత ప్రఖ్యాతిలేదనిన ఆశ్చర్యముకాదు. మహమ్మదీయులు హిందూదేశమునకు వచ్చిన తరువాత యూనానివైద్యము క్రమముగా వృద్ధిపొంది ఆయుర్వేద మడుగంటినది. కాని మన పూర్వులవైద్యజ్ఞానము ఇప్పటిశాస్త్రరీత్యాచూచిన పునాదివంటిదని నవీనశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇటీవలి పరిశోధనలు గ్రీకు దేశములనుండియును, ఫినీషియా, క్రీటు, బాబిలోనియా, ఈజిప్టుదేశములనుండియును క్రమముగాసింధులోయలో నివసించు ప్రజలనుండియును విజ్ఞానముసంపాదించినట్లు సూచించుచున్నది. పురాణగాథలలిఖించిన మహాభారతములో రోగపీడితులైన ప్రజలను, పశువులను నిరోగులుగ జేయుటకు ఆయుర్వేదమును ప్రజలకు బోధించుటకు బ్రహ్మధన్వంతరిని సృజించినట్లు చక్కని కథగలదు. హిందూ పురాణకథలలోను గ్రీకు పురాణకథలలోను ఒకేవిధమైన కథలుగలవు. దాని వలన గ్రీకులు హిందూదేశము వచ్చినపుడు హైందవ పురాణగాథలనుండి యీకథలను గ్రహించినట్లు తెలిసికొనవలెను. మన పురాణములలో అశ్వినీకుమారుల జననము చదివిన తెలియును. గ్రీకుగాథలలో క్రూనోను, పిలిరాయను సముద్రదేవతను ప్రేమించెను. తన

గేదె 10 లేక 12 మాసములలో ఈనును.

భార్య కామెయం దనూయలేనందువల్ల యాదేవతను "క్రూకోరన" అను కుమారుడు కలిగెను. భారన సగము మనుష్యరూపము సగము గుఱ్ఱమురూపము కలిగియుండును. మన కథలలోగూడ సంగాదేవిని సూర్యుడు ప్రేమించునట్లును, వాని తీక్షతను భరింపలేక గంగాదేవి యాడగుఱ్ఱమైనట్లును తరువాత నామె సూర్యునివలన "నిసత్య, దస్ర" లను కవలలను కన్నట్లును అశ్వినికుమారులు ఆయుర్వేదమును ఆ కవలలయందుంచినట్లును కలదు.

క॥ విరటుని పట్టణమందున
వరసహదేవుండు తంత్రిపాలకుడయితా
సురభులకు జేసె నీక్రియ
లరయగ నాచంద్రతారకంబుగ వెలయున్.

"భారతము"

ప్రథమమున ఇంద్రుడు "దధియాన్చియను" ఋషికి పశువైద్య విద్య నేర్పినట్లును, ఆ ఋషినాశ్రయించి ఇంద్రుని మోసగించి అశ్వినికుమారులు నేర్చుకొన్నట్లును, తరువాత వారే పాండురాజుయొక్క రెండవభార్యయగు మాద్రికి నకులసహదేవులై జన్మించినట్లును భారతములో కలదు.

సీ॥ వంజలనైనను వలనేర్పడగనొక
భంగి జేపగజేసి పాడిగొనగ
బడుగులనైనను బాటించి పరికించి
గోమునమెయి గండక్రొవ్వుదేర
డెవులుగొంటులనైన దీర్చి సంకటముల
కోపిముందటియట్ల రూపుసేయ
నట్టిలనైనను నన్నువైన వెఱపున
ముట్టయుంటగబట్టి కట్టి విడువ

ఆ॥ వె॥ బిదుక గదుపునేర్ప బెదురువాపగనీరు
మేపుగలుగు నెడల మెలగవెలవ
మెకమునరయమ్రుచ్చు మెలగినగొట్టంగ
నేర్తు బసికి జాల్రగూర్తునేను.

"భారతము"

---

గేదె 10 లేక 12 మాసములలో ఈనును.

ఇంకను పూర్వజన్మములో వీరు అశ్వములకు పశువులకు సంబంధించిన సకల విషయములను గూర్చియు, ఆవులను గూర్చియు తెలియునని నకులసహదేవులు విరాటకొలువులో చెప్పిరి బ్రహ్మవైవర్త పురాణములో వైద్యక సారస్యమను గ్రంథమును నకులుడును, "వ్యాధిసింధువిమర్దన" అను గ్రంథమును సహదేవుడును రచించినట్లు చెప్పబడెను. కాని ఈ గ్రంథములు ప్రచారములో కనపడుటలేదు. శిథిలమై యుండవచ్చును. "అశ్వచికిత్స" అను గ్రంథము నకులుడు రచించిన వ్రాత ప్రతి గలదని ఉమేశ చంద్రగుప్త కవిరత్న యను వారు ప్రచురించియుండిరి. ఇదేరీతిగా నలచక్రవర్తికి అశ్వవిద్య పూర్తిగ తెలిసియున్నట్లు పురాణములలో గలదు. బొంబాయి రాజధానిలోగల కొన్ని పుస్తకభాండాగారములందు నలునిచే రచింపబడిన కొన్ని వ్రాతగ్రంథములున్నవని బండార్కర్ అను వారు తెలిపియుండిరి. ఈ పురాణవిషయము ఆధారము జేసికొని "సర్కార్" పశువైద్యము పురాణమునకు పూర్వమే హైందవులకు తెలిసియున్నట్లు చెప్పియుండిరి

1. అశ్వవిద్య, 2. పశువిద్య, 3. హస్తివిద్య. ఋషి శాలిహోత్రుడు బ్రహ్మ వలన తాను విద్యనెట్లు సంపాదించినది; పూర్వము గుఱ్ఱములకు రెక్కలున్నట్లును, ఇంద్రుని ప్రార్థనచే శాలిహోత్రుడు రెక్కలను ఛేదించినట్లును మొదలగు విషయములు శాలిహోత్ర శాస్త్రములో వివరింపబడెను. ఇదేవిధముగ పూర్వము ఏనుగులకుకూడ రెక్కలున్నట్లును, దీర్ఘతప ఋషియాశ్రమములో ఏనుగులు చాల వృక్షములను నాశనము చేసి ఆశ్రమవాసులకు భీతికలిగించుటచేత ఆయన శాపమువలన రెక్కలుపోయి నట్లును గలదు. రోమపాదుని యాశ్రమమున "పాలకావ్య"యను గొప్పవిద్వాంసుడు గలడు. ఆయన తన పూర్వజన్మము వలన మచ్చిక చేయుట వానిరోగములు కుదుర్చుట మొదలగు విషయములు తెలిసికొనెను. ఆయన హస్తి ఆయుర్వేద విద్యనేర్పుచుండెడి వాడు.

## పశువైద్య ప్రారంభకాలము

చారిత్రకముగ పై విషయముల సూచనలను పురస్కరించుకొని పశువైద్య విషయ ప్రారంభ మెచ్చటయని నిర్ధారణ చేయుట సులభముకాదు. వ్యాధి మానవులయొక్కయు పశువులయొక్కయు ఆయురారోగ్యముల నిర్బంధించుచున్నది. వ్యాధిని అరికట్టుటలోనే వీరి జీవితము సగము వ్యర్థమగుచున్నది. కావున మానవులు ప్రపంచములో నొక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు వలసపోవుచుండెడివారు. అట్లు పోవునపుడు వారు జంతుజాలమును, పచ్చికబీడులను విశేషముగా నెక్కడకలవో ఆప్రదేశమునకు బోవుచుండెడివారు. పూర్వపు ఇండో ఆర్యనులు మధ్య ఆసియాను వదలి హిందూదేశము నకు వలసవచ్చినపుడు వారి మేకలు గొఱ్ఱెలు పశువులను కూడ తీసికొని వచ్చియుండిరి. వారికి తెలిసియుండిన ప్రథమ చికిత్సా విజ్ఞానముతో ఆర్యావర్తమున ప్రవేశించిరి. వీరు వేదములనుండి ప్రథమ విజ్ఞానము సంపాదించియుండిరి.

---

గొఱ్ఱె 21 వారమునకుగాని ప్రసవించదు.

ఋగ్వేద, యజుర్వేదములలో వారికి వారి జంతువులకు అనగా ఎద్దులు, మేకలు, గొఱ్ఱెలు, గుఱ్ఱములు పశువుల ఆరోగ్యము కాపాడుకొనుటకు సంబంధించిన ప్రార్థనలు తదితరశ్లోకములుగలవు. కాని పూర్వులు పూర్తిగా దేవతలమీద భారమువేసి చికిత్స చేయక యుండెడివారు. పూర్వులు రోగములు పిశాచములవలనను, రాక్షసుల వలనను కలుగునని నమ్మెడివారు. సీసము, నూనెంటురాయి, రక్షరేకులు, తాయెత్తులు, రోగముల నివారణనిమిత్తమును, తగులకుండుటకును ఉపయోగించెడివారు. ఈ రోజులలోకూడ పాడిపశువులకు దృష్టిదోషమును తొలగించుటకు త్రాళ్లను వేయుచుందురు. అథర్వణవేద కాలములో పశుచికిత్సకును, మనుష్యులకును, రోగనివారణమునకు మూలికలు, ఆకులు ఉపయోగించుచుండినట్లు నిదర్శనములుగలవు.

ఒక్కొక్క రోగమునకొక్కొక్క మూలికగలదు. ఆదేవిధముగ పెక్కురోగములకు పెక్కుమూలికలున్నట్లు గ్రంథములవలన తెలియుచున్నది. సోమ, కుస్తా, మంజాం, ఆరుంధతి, త్రియంబక, వక్న, విష్ణ, భేషజ, జంగిడ, మొదలగు నోషధులు అనేక విధములగు వ్యాధుల కుపయోగపడినవని అథర్వణ, యజుర్వేదములలో నున్నట్లు తెలియుచున్నది. వీని సగము రోగముల కుగుర్చును. ఈ కాలములో సాధారణ ఉపయోగములో నున్న ఓషధులెవ్వి యనగా "గాడిదగడప, వ్రజవల్లి, నేలవేము, బోడతరము, తిప్పతీగె, చిత్రమూలము తెలికపిండి" మొదలగునవి. వీనిని మన పశువుల కాపరులు అవసరముకొలది ఉపయోగించుచుందురు. ఆవులు గొడ్డుబోతులగుట, ఆకస్మికముగ వట్టిపోవుట, నెత్తురుగ పాలిచ్చుట, పొట్టలు వేలాడుట, మొదలగు దుర్గుణములు దై సంబంధమని నమ్మెడివారు.

అథర్వణవేదములో క్రిమిరోగములగూర్చి విస్తారముగాగలదు. కండ్లు, ముక్కు, పండ్లు, ప్రేగులు వీనిలో క్రిములుచేరి వింతవింత రోగములు కలిగించును. ఇవన్నియు జంతువులకు సాధారణముగ సోకువ్యాధులు. కటుకక్షు, విశ్వరూప, సరంగమార్జున, కుకూచి, మొదలగు క్రిములు మూత్రతిత్తులలోనుండును. వీటిని నివారించుటవసరము లేని యెడల రోగములను కలిగించును. ఇవిగాక దోమలు, బొరిగలు, గోమారులు, మసకఆను ఈగలు పశువులకుట్టి అనేక విధముల బాధపెట్టును. ఇట్టివిలేమండ మాడలకాలలందు పొగబెట్టుచుండెడివారు. పశువులకు బెణుకులు, గాయములు తగిలినపుడు వాని నివారణోపాయములుగూడ పూర్వగ్రంథములు తెలుపుచున్నవి.

## పశువైద్యుల పలుకుబడి

పరాశర సంహితప్రకారము పశువైద్యులకు పూర్వకాలములో మంచి గౌరవము పలుకుబడి యుండెడిది. శాస్త్రజ్ఞానము తగినంత అనుభవము లేక వైద్యము చేయువారిని దండించెడివారు. సంపూర్ణ బాధ్యతవహించి పశువైద్యుడు చికిత్సచేయని యెడల శిక్షకు పాత్రుడగునని మనుధర్మశాస్త్రము తెలుపుచున్నది. ఎవరైనను పశువుయొక్క

కుక్క 2 నెలలకు, పిల్లి 60 దినములకు ప్రసవించును.

అవయవములకు గాయములు కలుగజేసినను, నెత్తురు చిమ్మునట్లు గాయపరచినను వాని కుదుర్చుటకగు వ్యయమంతయును హానికలిగించినవారే భరించవలసి యుండునట్లు మనుధర్మ శాస్త్రము తెలుపుచున్నది. ఎవరైన నొక ఆవును చంపినయెడల దాని రక్తము పరీక్షచేసి దానికి రోగమున్నది లేనిది తెలిసికొనెడివారు. అట్టి గోవునకు చేయవలసిన కర్మవిధానము వేరుగానుండెడిది. చనిపోయిన జంతువుయొక్క రక్తమును రాతిమీదపోసి ఆ రక్తమును కుక్కలు కాకులు త్రాగినయెడల నారోగ్యవంతమైనదనియు, త్రాగనియెడల నా రక్తము చెడ్డదనియు నిర్ధారణచేసెడివారు. పశువులకాపరి యాధీనమునందుంచబడిన పశువులను జాగ్రత్తపెట్టవలసిన బాధ్యత పశువులకాపరిది. దానిలో నేదైన పారిపోయినను, ఇతరులు దొంగిలించినను, దానికొరకు భర్తీయియ్య పశువుల కాపరివిధిగా నుండెడిది. ఒకవేళ ఆవుగాని దూడగాని గేదెగాని వాని కాపుదలలోనున్న యే పశువుగాని చచ్చిపోయిన యెడల దానితోలూను చెవులు తోక చర్మము తీసికొనివచ్చి యజమానికి చూపి చవలసి యుండెడిది. ఇదిగాక సాధారణముగ పశువులకువచ్చు సామాన్య రోగముల కుదుర్చుకొనుటకు తగిన ఔషధులను పశువులకాపరి తెలిసికొని యుండవలెను. ఈవిధముగ పశువులనుగూర్చి జాగ్రత్త తీసికొనబడినట్లు మనువు, పరాశరుడు, ముఖ్యోపాధ్యాయ్యుడు మొదలగు వారివలన తెలియుచున్నది.

## శరీరావయవములస్వరూపము

యజ్ఞయాగాదులందును బలులందును పశువులను అర్పించెదరు. అవయవ స్వరూపము నిపుణతతో మంచివాడిగల ఆయుధముతో విడదీయుటలో ఇప్పటి వైద్యులకున్న కౌశలము పూర్వపువారికిలేదు. వారు మోటుగాచేసెడివారు. కాని యజ్ఞయాగాదుల కుపయోగించు పశువును నోరు ముక్కు చెవిమూసి ఊపిరాడకుండ చేసి చంపెడివారు. పూర్వము మహాఋషులు దర్భనుమంత్రించి పశువుమీద వేసినతోడనే అది అసువును వదలెడిది. పూర్వపు వ్రాతలలో పశువులవిషయమున శరీరములో నేభాగ మెచ్చట యున్నది, దాని యాకారము హిందువులకు పూర్తిగా తెలిసినటుల కన్పట్టుచున్నది. అర్చకులు బలులు చేయించెడివారు. వారు కోయుటయందు నిపుణతకలవారినే ఏర్పరచెడివారు. ఈబలి ఎట్లు జరుపవలెనో, శరీరవయవముల నెట్లు విడదీయవలెనో అధర్వణవేద, ఐత్రేయబ్రాహ్మణ, యజుర్వేద, తైత్తిరీయ, శతపథబ్రాహ్మణ, వాజసనేయ సంహిత, మైత్రేయసంహిత, మొదలగువానియందు వ్రాయబడినది. పశువుయొక్క ప్రతి అవయవము, దానివర్ణన, ఆభాగమే దేవతకు ప్రీతియో, దేని కర్పించవలెనో వ్రాయబడినది. బాహ్యదృష్టివలననే చాలాభాగములు గోచరించుచుండును. నోరు, తల, కన్నులు, చెవులు, కాళ్లు ఇవిగాక శ్వాసనాళము, ఊపిరితిత్తులు, పెద్దమెదడు, మిశ్రమనాడులు, కార్జము, పైత్యపుతిత్తి, ప్లీహము, వంగియున్న ఎముకలు, రక్తప్రసరణమార్గములు, గొంతుమార్గము మొదలగునవి యెచ్చట యెట్లుండవలసినసంగతులు విపులముగా వర్ణింపబడి సంఖ్యారూపముతో జెప్పబడెను.

---

పశువు నాడి నిమిషమునకు 50 నుండి 60 వరకు కొట్టుకొనును.

## పశువైద్య ఆధారములు

వ్యక్తిగతముగా వేదకాలమునుండియు రాజులు పశువైద్య విజ్ఞానమును మన దేశములో వెదజల్లుటకు పాఠశాలలుపెట్టి విద్యార్థులను తయారుచేసి పశువైద్యశాలలను, ఉద్యోగులను ఏర్పాటుచేసినట్లు సంస్కృత గ్రంథములు తెలుపుచున్నవి. రాజులకు చతురంగబలములు అత్యవసరము. అందు అశ్వదళము, హస్తిదళము రెండును రాజునకు భుజములవంటివి. ఇదిగాక జంతువులశాఖయు పరిపాలనశాఖలో నొకటియుండెను. వైద్యవిద్యాశాలలలో జంతుశాస్త్రముకు సవగీయభాగముగ నున్నట్లును, ఆత్రేయులవద్ద పశువైద్యవిద్యార్థులు నేర్చుకొనినట్లును చరక సంహిత తెలియజేయుచున్నది.

చంద్రగుప్తమౌర్యునికాలములో (322-298) కౌటిల్యునిచే రచింపబడిన అర్థశాస్త్రమునందు పరిపాలనలోగల వివిధశాఖలలో జంతువుల పెంపకపుశాఖకు ప్రాముఖ్యమీయబడెను. అశోకచక్రవర్తి మనుష్యులకును జంతువులకును తన రాజ్యమంతటను పశుచికిత్సాశాలలు స్థాపించెను. ఇతడు బి. సి 273-233 కాలమువాడు. 161 బి. సి లో సింహళమునందు దుత్తగామిని అనువాడు సైన్యములో సైనికులకొరకును, ఏనుగులకొరకును, అశ్వములకొరకును వైద్యుల నియమించినట్లు తెలియుచున్నది. కనిష్కునికాలములో (120-160 ఏ. డి) పశువైద్యశాఖలో మంచి అభివృద్ధిలోనున్నది. 9 వ శతాబ్దములో శుక్రనీతియందు రాష్ట్రములో వివిధములైన పెంపుడుజంతువులకు సంబంధించిన వివిధతరగతుల అధికారుల నియమించినట్లు తెలియుచున్నది. 13 వ శతాబ్దములో హంసదేవుడు (జైనమతస్థుడు) మృగపక్షిశాస్త్రమను గ్రంథమును జినపురకాలగుడగు శీనదేవుని యాజ్ఞానుసారముగా ప్రకటించెను. 8 వ శతాబ్దములో సింధురాష్ట్రమును ఆర్యులు జయించినపుడు హిందూవైద్యవిజ్ఞానమును హిందూదేశమంతటను యితరదేశములకుగూడ వ్యాపింపజేసిరి. ఆవులు, ఎద్దులు, కుక్కలు, కోళ్ళు, మేకలు, గుఱ్ఱములు, ఏనుగుల లక్షణములనుగూర్చి బృహత్సంహితలో అనేక అధ్యాయములుగలవు. అగ్నిపురాణములోగూడ గలవు. జంతువులయొక్క గుణములు వానిని జాగరూకతతో పెంచువిధానము, రోగములకుచికిత్సరీతి, మొదలగు విషయములగూర్చి వంగదేశమున ప్రప్రథమమున ప్రారంభించినట్లు తెలియుచున్నది.

## పశువులకు మందులు

ఏదేశములో గోవునకు పవిత్రమైనదిగను, ఆర్థికముగను అగ్రస్థానము ఈయబడినదో ఆ హిందూదేశములో పశువుల వైద్యవిషయముపై చాలతక్కువగా కన్పట్టుచున్నది. కాని గోరక్షణ, గోశాలలుయుంచు విధముగా చికిత్సావిధానములనుగూర్చి పైనుదహరించిన గ్రంథములలోను, ఆయుర్వేదమందు పెక్కుచోట్లను విపులముగా చెప్పబడినది. పాండవులలో సహదేవుడు గోశిక్షనుగూర్చి పుట్టుకతోనే నేర్చినట్లు నకులసహదేవులు అశ్వినీకుమారులనియు దానివలన వీరికావిద్య యుండినట్లునుగలదు.

---

గుఱ్ఱము నాడి నిమిషమునకు 36 నుంచి 40 వరకు కొట్టుకొనును.



శ్రీ గుంటుపల్లి సూర్యనారాయణగారి 'సర్దాఎడ్లప్రభ' పెదగొట్టిపాడు.



శ్రీ కాకర్ల కాకుళస్వామిగారి ఎడ్లజత—పెదముత్తేవి (కృష్ణా జిల్లా)



శ్రీ బెల్లం రాఘవయ్యగారి ఎద్దులజత, కేశవర్పాడు- గుం. జి.



శ్రీ రావెళ్ల వెంకట్రామయ్య చౌదరిగారి బెంగుళూరు పశు ప్రదర్శనములో రు 116
తీసికొన్న ఎడ్లజత, జుజ్జవరం - కృ. జి.



శ్రీ వంకమామిడి వెంకటసుబ్బారావుగారి ఎడ్లజత, వరహాపురం - గుం. జి.

కాని సహదేవుడు రచించిన గ్రంథమున్నట్లు కనపడుటలేదు. అగ్నిపురాణములోను, పరాశర, అత్రి, సంహితలలోను, గృహసూత్రములలోను, మత్స్యపురాణములోను, వృషోత్సర్గలోను గోవులకు సంబంధించిన విషయములు పెక్కుచోట్ల చెప్పబడెను. చరకుడు ఆదర్శముగా నొకగోవును వైద్యశాల ఆవరణయందుంచవలెననియు దాని దూడలన్నియు బ్రతికియుండవలెననియు, దూడలు చిన్నతనమునందే చనిపోయిన తల్లి గోవు అనారోగ్యముగలదని భావింపవలయునని చెప్పియుండెను.

అశోకుడు తనకాలములో ఎడ్లను బుడ్డలు మతపర్వదినములలో కొట్టగూడదని శాసించెను. మంచి యాబోతులను పెంచుటకు సగుపాయములను కల్పించి ప్రజలను ప్రోత్సహించెను. ఈవిషయమును గురించి కాత్యాయనశ్రౌత సూత్రములు, కౌటిల్య వాక్యములుగూడ తెలియజేయుచున్నవి. పశువైద్య విషయములకు సంబంధించిన ముఖ్య విషయములు, పశుపాలకులకు పశువుల కాపరులకు తెలిసియుండుట ఒకవిధముగా నుండెడివి. అట్లె కర్ణాకర్ణి వీరి వంశపరంపరగ పశువులకాపరులు తెలిసికొనెడివారు.

వ్యాధులునివారణ:—శాలిహోత్రము, చరకసంహిత మున్నగు గ్రంథములలో సాధారణముగ పశువులు, అశ్వములు, గజములు, ఏవ్యాధులకు లోనగునో వానికి చేయవలసిన విధానము వివరింపబడినట్లు ఇదివరకు వ్రాయబడినది. శరీరమునకును ఇతర అవయవములకును కన్ను, ముక్కు, చెవులు, కడుపునకు వివిధమగు రోగములుసోకును. వీనినే జ్వరము, దొమ్మ, వాపులు, సంధివాతము, మొదలగు పేరులుగలవు. వాని కన్నిటికి తగు చికిత్స ఆయుర్వేదములో వివరింపబడెను. సాధారణముగ మనుష్యుల కుపయోగింపబడు నౌషధములు జంతువులకుగూడ నుపయోగించును. ఈదిగువ వస్తువులు పశువైద్యమున కుపయోగించును. కరక, తాడి, శొకరిక, అమ్ల, గుగ్గిలము, వేప, ఆవాలు, ఆవనూనె, సైంధవలవణము, మిరియాలు, పిప్పళ్లు, తమలపాకులు, మొదలగునవి అవసరమునుబట్టి వాడుచుండెడివారు. వీనికితోడు ఆవుమూత్రము, పాలు, నెయ్యి, తేనె ఉపయోగించెడివారు. శస్త్రచికిత్సకూడ చేయబడినట్లు గలదు. రక్తలంవేయుట, కొన్ని అవయవములను కోసివేయుట, తిరిగి కట్టుట మున్నగు విషయములు సుశ్రుతములో తెలుపబడెను.

## ముగింపు

పైవిషయములు పూర్వము భరతఖండమునందు పశువైద్య మెట్టిప్రాముఖ్యత నీయబడినదో నిరూపణ చేయబడినది. ఆగ్రంథములు చరిత్రకొరకుగాని వైద్యవిషయములు విధానము గ్రహించుటకుగాని నవీన పశువైద్యులు అన్వేషించిన బాగుండును. విద్య స్వీకరించుటలో నది యేగ్రంథములో ఏభాషలో ఎప్పుడు వ్రాయబడినను అవశ్యత గ్రహింపబడవలెను.

## పశుజాతులు - వాని స్థానము

హిందూదేశములోగల పశుజాతులెచ్చటనుండి తీసికొని రాబడినవో, యీ జాతులు పూర్వమెచ్చట నభివృద్ధిగానుండెడివో తెలిసికొనుట చాల చిత్రముగానుం

---

మేక నాడి నిమిషమునకు 60 నుంచి 70 వరకు కొట్టుకొనును.

డును. గాని క్రీ.పూ. 3000 సంవత్సరములనుండియు, ఆవు, గేదె, గాడిద, గొఱ్ఱె, మేక, పంది, ఒంటె, పిల్లి, కుక్క, గుఱ్ఱము మొదలగు జంతువుల నిండ్లలోనే పెంచుట వాడుక కలదు. ఇవి యన్నియు పెంపుడు జంతువులు. యిరోపా, ఉత్తరఆసియాలలోగల ఆవులకును ఎడ్లకును మూపురములు లేవు. హిందూదేశములో పెంచబడు ఆవులకు, ఎద్దులకు, ఆబోతులకు మూపురములు గలవు. సింధునది లోయప్రదేశములలో రెండు జాతులుగలవు. 1. పొడుగుకొమ్ములు ఎక్కువ మూపురములుగలవి 2. పొట్టి కొమ్ములు చిన్న మూపురములుగలవి. సాధారణముగా సింధు, ఉత్తరఘూర్జరము, రాజపుత్రస్థానము నందు బూడిద తెలుపురంగుగల ఆవులు విశేషముగాగలవు. చిన్నమూపురము, చిన్న ఆకారముగలవి మధ్యరాష్ట్రములలో గలవు. ఆర్యులు హిందూదేశమునకు రాకపూర్వమే పైనుదహరించిన జాతిపశువులు వృద్ధిగాగలవు. సింధునది యుపనదియగు గోమల్ ప్రాంతమందును శ్రీకృష్ణుడు తిరిగిన ప్రదేశములగు మధురానగరప్రాంతములు, బృందావనము లందును, సింధునదీ పరిసరప్రాంతములందును, ఎక్కువ పాలిచ్చునటువంటివి, బలముగలవి, అందముగలవియగు ఆవులు, ఆబోతులు, ఎద్దులు విశేషముగా పెంచబడుచుండెడివని హుయాన్ త్సాంగు వ్రాతలవలన తెలియుచున్నది. మార్కోపోలో పర్షియన్ సింధుశాఖా ప్రాంత తీరప్రదేశములందు మరియొకజాతి ఎద్దులు గోవులు గలవని వ్రాసియుండెను.

ఆహారము:— అగ్నిపురాణములోనుంచి వృషభములను తయారుచేయుటకు మాష, నువ్వు, గోధుమ, నెయ్యి, వెన్న, ఉప్పు వీనితో మిశ్రమమైన పదార్థము మామూలు ఆహారముకాక వేరుగా పెట్టవలెను. హార్యుని ఆస్థాన- వృషభములకు ఈ దిగువవిధముగు ఆహారము పెట్టెడివారు. ¼ భార పచ్చిక 1¼ భార వట్టిగడ్డి, 1 తులం తెలికపిండి, 10 అఢకాలచిట్టు, 5 పలముల ఉప్పు, తులం పండ్లతొక్కలు, 1 ద్రోణము బార్లీ, ¼ అఢక పెరుగు 1 ద్రోణంపాలు ¼ అఢకసారాయి 1 ప్రస్థనెయ్యి, 1పలముఅల్లం ఐనిఅక్బరీయములో ఏనుగులకు బియ్యముగాని ధాన్యముగాని గడ్డిలోచుట్టి పెట్టవలెను. 5 సేర్ల పంచదార 2 సేర్ల నెయ్యి అర్థమణుగు బియ్యం మిరియాలు కలిపిపెట్టవలెను. ఇవిగాక అడవులలోని ఆకులు దుంపలు పెట్టవలెనని వ్రాయబడెను. సాధారణముగా పశువులకు గడ్డి, ఉలవలు, కీరు, చిట్టు, చమురుగింజలపిండి ముఖ్యమైన ఆహారము.

శాలలు:— కృషిసంగ్రహమను గ్రంథముప్రకారము పశువులపాక 55 మూరల చతురముగలిగి యుండవలెను. దూడలశాలలు పడమరవైపున నుండవలెను. పశుశాలలో విషక్రిములు చేరకుండుటకు దేవదారు, వక్క, పండ్లతొక్కలపొడి, గుగ్గిలము, ఇంగువ, ఆవాలు కలిపిన పొడుము కలిపి పొగవేయుటవలన చాల ఆరోగ్యముకలుగును. ఆవు లున్న శాలలో మేకలనుంచరాదు. గుఱ్ఱపుశాలగుఱ్ఱమునకు రెండురెట్లుండవలెను. నాలుగుద్వారములు మధ్య ఖాళీసలముండవలెను. గుఱ్ఱములు దొర్లుటకు తగిన ఖాళీ యుండవలెను. ఏనుగులకు వానియెత్తునుబట్టి రెట్టింపు స్థలముండవలెను. అనగా ఏనుగు నడుముపైనుంచి యొకత్రాడును రానిచ్చి రెండువైపుల నేల తగులునట్లు చేసి దానికి రెండురెట్లుండవలెను.

---

పశువు నిమిషమునకు 16 నుంచి 24 సార్లు శ్వాసవిడచును.

ఈజంతువుల యభివృద్ధికొరకు వాని యారోగ్యము కాపాడుకొనుటకొరకు వానికి తగిన సౌకర్యములు సమకూర్చుటకు చంద్రగుప్తుడొక యధికారశాఖను నియమించెను. వ్యవసాయమున నుపయోగింపబడు ఎద్దులు దున్నలు గుఱ్ఱములు మొదలగువానితో ఎంతకాలము పనిచేయింపవలసినది, ఎంత విశ్రాంతి ఈయవలసినది మొదలగు విషయములగూర్చిన పదతులు చట్టముగలదు. పైవిషయములగూర్చి అత్రిసంహితలో వివరింపబడెను.

## రోగవిజ్ఞానసూత్రములు

యఇమేకులీనాః పర్యవదాతశ్రుతాః పందృష్టకర్మాణో
దక్షాః శుచయో జితహస్తా జితాత్మానః సర్వోపకరణవన్తః
సర్వేన్ద్రియోపపన్నాః ప్రకృతిజ్ఞాః ప్రతిపత్తిజ్ఞాస్తేప్రాణా
నాభిసరా హన్తారో రోగాణాం॥

మంచికులమునందుపుట్టి, స్వచ్ఛమగు శాస్త్రజ్ఞానము, అన్ని కర్మలయందు అనుభవజ్ఞానము, సమర్థత, శుచిత్వము, హస్తవాసి, ఇంద్రియ నిగ్రహము గలవారు, అన్నిపరికరములను సంపాదించినవారు, అన్ని ఇంద్రియములతో నున్నవారు, ప్రకృతుల నెరింగినవారు, వెంటనే ప్రతిక్రియ చేయగలవారు రోగములను నశింపజేసి ప్రాణముల నిచ్చువారగనుందురు.

అతో విపరీతో రోగాణామభిసరా హన్తారః ప్రాణానాం
భిషక్ఛద్మప్రతిచ్ఛన్నాః కణ్టకభూతాలోకస్య ప్రతిరూపకత్యక్త
ధర్మాణోరాజ్ఞాం ప్రమాదాచ్చరన్తి రాష్ట్రాణి తేషామిదం
విశేష విజ్ఞానం భవతి॥

పైన చెప్పబడిన లక్షణములకు విపరీతములగు లక్షణములు కలవారు రోగములను వృద్ధిచేయుచు ప్రాణములను హరింపజేయుదురు. అట్టివారు లోకమును వంచించుటకు వైద్యవేషమును ధరించి రాక్షసభూతులై ద్రోహమును కలిగించుచు ధర్మమును విడచి రాజులయొక్క అజాగ్రత్తవలన దేశములందు తిరుగుచుందురు.

భిషక్ఛద్మ ప్రవిశ్యైవం వ్యాధితాంస్తర్కయన్తితే
వీతంసమివ సంశ్రిత్య వనే శాకున్తికో ద్విజాన్॥

పిట్టలను పట్టువాడు అడవియందు వలవేసి పిట్టలకొరకట్లు నిరీక్షించుచుండునో అటులనే వైద్యవేషమును ధరించినవాడు రోగులనిమిత్త మిట్లుండును.

---

గుఱ్ఱము నిమిషమునకు 10 నుంచి 13 సార్లు శ్వాసవిడచును.

శ్రుతదృష్టిక్రియా కాలమాత్రాజ్ఞాన బహిష్కృతాః
వర్జనీయాహి తే మృత్యోశ్చర న్త్యను చరా భువి॥

శాస్త్రము, కర్మదర్శనము, చికిత్స, కాలము, పరిమాణము, వీని సంబంధమగు జ్ఞానము లేనివారు మృత్యువునకు అనుచరులై లోకమున తిరుగుచుందురు. కాబట్టి వీరిని విడిచి పెట్టవలయును.

వృత్తిహేతోర్భిష జ్మానపూర్ణాన్ మూర్ఖవిశారదాన్
వర్జయేదాతురో విద్వాన్ సర్పాస్తే పీతమారుతాః॥

జీవనిమిత్తము వైద్యవేషముతో కూడిన వారును, మిక్కిలి మూర్ఖులునగు వైద్యులు వాయుభక్షణమును చేసిన సర్పములతో సమానముగనుందురుగాన అట్టివారిని కూడ విడిచిపెట్టవలెను.

పాణిచారాద్యథా చక్షురజ్ఞానాద్భీత భీతవత్
నేర్మారుతవశేవాజ్ఞో భిషక్చరతి కర్మసు॥

అంధుడు తెలిసికొనక పోవుటవలన చేతులతో తడుముచు భయపడుచు ఏరీతిగా తిరుగుచుండునో, నావ గాలిచే కొట్టబడినపుడు ఏరీతిగా సంచరించునో ఆరీతిగనే తెలియని వైద్యుడుకూడ సంచరించుచుండును.

యదృచ్ఛయా సమాపన్న ముత్తార్య నియతాయుషమ్
భిషజ్మానీ నిహన్త్యాశు శతాన్య నియతాయుషామ్॥

నిర్ణీతమైన ఆయువుగల ఒకరోగిని దైవవశమున జీవింపజేసి వైద్యుడనని తలంచుచు నియతములేని ఆయువుగల వందలకొలది జీవములను జంపుచున్నాడు.

“చరకసంహిత”

మైత్రీ కారుణ్య మార్తేషు శక్యే ప్రీతిరుపేక్షణమ్
ప్రకృతిస్థేషు భూతేషు వైద్య వృత్తిశ్చతుర్విధా॥

సమస్త భూతములయందు మైత్రి కలిగియుండుట, బాధపడుచున్నవారియందు కరుణగలిగియుండుట, శక్తమైన వ్యాధిని చికిత్సించుటకు ప్రయత్నించుట, మరణము పొందుటకు సిద్ధముగనున్నవారిని చికిత్స చేయక నుపేక్షించుట అని వైద్యవృత్తి నాలుగు విధములుగ నుండును.

తస్మాచ్ఛాస్త్రేర్థ విజ్ఞానే ప్రవృత్తే కర్మదర్శనే
భిషక్ చతుష్టయే యుక్తః ప్రాణాభిసర ఉచ్యతే॥

---

మేక నిమిషమునకు 25 నుంచి 30 సార్లు శ్వాసవిడచును.

శాస్త్రము నభ్యసించుట, అర్థము తెలిసికొనుట, లక్షణములను తెలిసికొనుట, కర్మలనుచూచుట స్వయముగ నాచరించుట ఈనాలుగింటితో కూడిన వైద్యుడు ప్రాణ భాస్కరుడని (పోవుచున్న ప్రాణములను నిలుపునని) చెప్పబడును.

వ్యాధే స్తత్త్వ పరిజ్ఞానం వేదనాయాశ్చ నిగ్రహః
ఏతద్వైద్యస్య వైద్యత్వం న వైద్యః ప్రభురాయుషః॥

వ్యాధియొక్క తత్త్వమును సంపూర్ణముగా తెలిసికొనుటయు, రోగియొక్క బాధను శమింపజేయుటయు, అనునవియే, వైద్యునియొక్క వైద్యతత్వమై యున్నది. కాని ఆయువునకు వైద్యుడు ప్రభువుగాడు.

భిషజాదౌ పరీక్షేతరుగ్ణ స్యాయుః ప్రయత్నతః
తతఆయుషి విస్తీర్ణే చికిత్సా సఫలాభవేత్॥

వైద్యుడు ముందుగ రోగియొక్క ఆయువును అతిప్రయత్నముతో పరీక్షించవలెను. ఆయుస్సుదీర్ఘముగా నున్నచో చేయు చికిత్స ఫలించును.

సర్వే ద్రవ్యమపేక్షన్తే రోగిప్రభృతయో యతః
• వినావిత్తం న భైషజ్యం చికిత్సాంగం తతోధనమ్॥

రోగి మొదలుకొని ఎల్లరకు ధనముయొక్క అవుసరముగలదు. ధనముపెట్టి కొన నిదే ఔషధము దొరకదు. అందువలన ధనముకూడ చికిత్సాంగ మగుచున్నది.

జాతమాత్రః చికిత్స్యస్స్యాత్ నేక్ష్యోల్పతయాగదః
వహ్నిశత్రువిషైస్తుల్య స్స్వల్పోపి వికరోత్యసౌ॥

వ్యాధిపుట్టిన వెంటనే చికిత్స చేయవలెను. వ్యాధి అతిస్వల్పముగా నున్నదని అశ్రద్ధచేయరాదు. స్వల్పముగా నున్నప్పటికి అగ్ని, శత్రు, విషములతో సమానమైన దగుటచేత వికృతిని కలుగజేయును. కనుక వ్యాధి పుట్టినవెంటనే చికిత్స చేయవలెను.

రోగమాదౌ పరీక్షేత తతోనంతరమౌషధం
తతః కర్మ భిషక్ పశ్చాత్ జ్ఞానపూర్వం సమాచరేత్॥

వైద్యుడు ముందుగా రోగిని పరీక్షింపవలయును. అటు తరువాత నా రోగము నకు తగిన ఔషధమును విచారింపవలయును. ఇట్లు విచారించిన తరువాత మంచిరోగ జ్ఞానముగలవాడై ఏయే రోగములకట్టి చికిత్సాపద్ధతుల నవలంబించవలెనో, ఎట్టి ఔష ధము నియవలెనో బాగుగా విచారించి చికిత్స చేయవలెను.

---

పెద్దరోగము 2 నుంచి 8, 12, 30 దినముల వరకు[illegible]యుండును.

యస్తురోగవిజ్ఞాయ కర్మాణ్యా రభతే భిషక్
అప్యౌషధ విధానజ్ఞ స్తస్యసిద్ధిర్య దృచ్ఛయా॥

ఎవడు రోగముయొక్క నిదానము తెలియక చికిత్స ప్రారంభించునో, ఔషధోప యోగవిధానము తెలిసినవాడైనప్పటికి వానికి చికిత్సయందు అయితే అగుటయో, లేనిచో లేకపోవుటయో కలుగును.

భేషజం కేవలం కర్తుం యో జనాతి న చామయం
వైద్యకర్మ స చేత్కుర్యాద్వధమర్హాతి రాజతః॥

మరియు ఎవడు ఔషధమును చేయుట మాత్రమే తెలిసికొని, వ్యాధిని తెలిసి కొనక వైద్యము చేయునో అట్టివాడు రాజుచే వధింపబడుట కర్హుడగును.

యస్తు కేవల రోగజ్ఞో భేషజేష్వ విచక్షణః
తం వైద్యం ప్రాప్య రోగార్తాస్యాద్యథా నేర్నావికం వినా॥

ఎవడు కేవలము రోగము నే తెలిసికొని కర్మలయందు నేర్పరిగాడో అట్టివైద్యుడు రోగివద్దకుబోయి (భయముగలవాడు యుద్ధమునకుపోయి కంగారు పొందునటుల నే) కంగారుపడును.

యస్తు రోగ విశేషజ్ఞ స్సర్వ భైషజ్య కోవిదః
దేశకాలవిభాగజ్ఞ స్తస్య సిద్ధిర్న సంశయః॥

ఎవడు రోగములయొక్క విశేషజ్ఞానముగలవాడో, సమస్తమైన ఔషధోప యోగములు దెలిసినవాడో, దేశముయొక్కయు, కాలముయొక్కయు, విభాగముల తెలిసినవాడో అట్టివాడు చేయు చికిత్స సంపూర్తిగా సిద్ధించును.

ఆదావం తేరుజాం జ్ఞానే ప్రయతేత చికిత్సకః
భేషజానాం విధానేఽతతః కుర్యాచ్చికిత్సితమ్॥

వైద్యుడు రోగములను మొదటినుండి చివరవరకు తెలిసికొనుటకు ప్రయత్నించ వలెను. ఆటుతరువాత ఔషధోపయోగ విధానమును తెలిసికొని చికిత్స చేయువలెను. రోగముయొక్క పేరు తెలిసికొనవలెనని హెచ్చుకాల మూరుకొనరాదు.

యేన కుర్వంత్స సాధ్యానాం చికిత్సాం తే భిషగ్వరాః
అతో వైద్యైః శ్రమః కార్యః సాధ్యాసాధ్యాపరీక్షణే॥

---

దొమ్మరోగము 12 గంటలనుంచి 2, 3 దినముల వరకుండును.

అసాధ్యములైన వ్యాధులకు ఏవైద్యులు చికిత్స చేయరో వారే వైద్యశ్రేష్ఠులు. అందువలన వైద్యులు వ్యాధులయొక్క సాధ్యాసాధ్యత్వములను అతికష్టముగ పరిశ్రమ చేసి తెలిసికొనవలెను.

శీతేశీతప్రతీకారముష్ణే తూష్ణనివారణం
కృత్వాకుర్యాత్క్రియాం ప్రాప్తాం క్రియాకాలం న హాపయేత్॥

వ్యాధిశీతప్రధానమైనపుడు శీతమునకు చికిత్సయు, ఉష్ణప్రధానమైనపుడు ఉష్ణ నివారక చికిత్సయును చేయవలెనుగాని చికిత్సాకాలమును గాత్రమును దాటించరాదు.

అప్రాప్తేవాక్రియాకాలే ప్రాప్తే వాన క్రియాకృతా
క్రియాహీనాతిరిక్తా చ సాధ్యాప్యాసి న సిధ్యతి॥

చికిత్సించవలసిన కాలము గానప్పుడు చికిత్సించినను, సరియగు చికిత్స జేయవలసిన సమయమున చికిత్స చేయకపోయినను, హెచ్చుగా చికిత్సించవలసినపుడు తక్కువగా చికిత్స చేసినను, తక్కువ చికిత్స చేసినపుడు హెచ్చుగా జేసినను కూడ వ్యాధిసాధ్యమైనప్పటికి సిద్ధించజాలదు.

క్రియాయాస్తుగుణావేక్షే క్రియామన్యాం ప్రయోజయేత్
పూర్వస్యాం శాంతవేగాయాం న క్రియాస కరోహితః॥

చేసిన చికిత్సవలన ఫలములేకపోయినయెడల మరొకక్రియను మొదటిచికిత్సయొక్క శక్తితగ్గిన తరువాత నుపయోగించవలెను గాని రెండు చికిత్సలను కలిపి చేయరాదు.

న చైకాంతేన నిర్దిష్టే శాస్త్రే నివిశతే బుధః
స్వయమప్యత్ర భిషజా తర్కణీయాం చికిత్సితా॥

పండితుడైన వైద్యుడు కేవలము శాస్త్రమునందు జెప్పబడిన విధానముపై నమ్మియుండడు. స్వయముగా వైద్యుడు కూడ సంపూర్ణముగా నాలోచించవలయును.

"భావప్రకాశిక"

## పశువైద్యులు

పూర్వకాలమున ఆకు అలములు తినుచు విరాగులై సంచరించువారు గోసాయిలు. గోసాయిలు సాధారణముగా తమ సహజవృత్తులతో జీవించుచు వైద్యము చేయుట ఒక గౌరవముగ నెంచుచుండెడివారు. వారికి వైద్యశాస్త్రాభ్యాసము ప్రధానవృత్తి కాక పోవుటచేత దానియందు వారికి అభిరుచి తరతరములనుండి తగ్గుచూ వచ్చినది.

---

గురకరోగము 12 నుంచి 24 గంటలవరకుండును.

తెలిసి తెలియని పశువైద్యులనేకులున్నారుగాని వ్యాధినిర్ణయము తెలియక పశువులను చంపుదురు. మీదు మోటువైద్య మెక్కువగా చేయుదురు. మన దేశములో నచ్చటచ్చట మిక్కిలి తెలివిగల అనుభవముగల పశువైద్యులున్నారుగాని వారు తదితరులకు మాత్రము చెప్పరు. ఏపశువునకైన వ్యాధి సంభవించినప్పుడు తాము స్వయముగ యెవరికి తెలియకుండ నేయాకుపసరునో తెచ్చి పోయుదురు. ఈరీతిగా తమగుట్టును బయట పెట్టక వైద్యమును వృద్ధిలోనికి రాకుండ నాశనము చేయుచున్నారు. మనకు అనుభవ పశువైద్య శాస్త్రము సరియైనది లేకపోవుటవలననే సరియగు చికిత్సలు దొరకుటలేదు.

కొందరు రోగనిదానము గ్రహించక తను యిష్టమువచ్చిన మందుల నుపయోగించి పశువులను చంపుచున్నారు. నాకు ఇరువది సంవత్సరములనుంచి ఈ వైద్యములో ప్రవేశమున్నది. ఈ వైద్యపరిశోధన కొరకు కొన్ని వేలరూపాయలు ఖర్చుపెట్టి, ఎన్నో గ్రంథములు పరిశోధించి తంటాలు పడుచున్నప్పటికి ఇంకా చాలా అనుభవము కావలెనేమోయని అప్పుడప్పుడు సందేహపడుట తటస్థించుచుండును. కాబట్టి శాస్త్రజ్ఞానము గలిగిన అనుభవము చికిత్సలు చేయువాడే వైద్యుడనిపించుకొనును.

## వైద్యులవలన ప్రమాదములు

శాస్త్రము తెలియని వైద్యుడు యముదూతయని పెద్దలుచెప్పిన వాక్యమునందు చాల నిజముగలదు. కొన్ని వందలరూపాయల ఖరీదు చేయుగల పశువునకు ఏ విషజాడ్యమైన సంభవించినప్పుడు ఆరైతుపడు ఆతురత ఇంతింతయని చెప్పుటకు వలవిగాదు. శాస్త్రజ్ఞానము గలిగి పశువైద్యము తెలిసినవారు గ్రామములలో చాల తక్కువగా నుందురు. రైతునకు గతిలేక ఆవైద్యులనే రప్పించి చికిత్సలు చేయించుదురు. ఇది చాల పొరబాటు. రైతులు తమ మూఢవిశ్వాసముచేతను, వేరొకవైద్యుడు అపకాలమందు రాబోవు సందర్భములను తెలిసికొనక కనపడిన ప్రతి యాకుపసరును వనమూలికలను వ్యాధి సంభవించిన పశువులకు పెట్టుటచే వెంటనే ఆపశువు ప్రాణమును కోల్పోవుచున్నది. ఇంకను కొందరు మోతాదు తెలియక ఎక్కువమోతాదుల నిచ్చెదరు.

## రైతుల ఆతురత

మన రైతుసోదరులు తమ పశువులకు జబ్బురాగానే వెంటనే పోవలెనని గ్రామములోనున్న పూర్వవైద్యులను రప్పించెదరు. కాని ఈవైద్యులలో కొంతమంది అతి గర్వముగానుందురు. వారియింటిచుట్టు తిరిగినప్పటికి ఒక్కొక్క సమయములో రారు. రైతు నిరుత్సాహముచెందును. ఒకవేళ ఆ వైద్యుడువచ్చినను అనుకబెట్టుగానుండి తానే గొప్ప మహాదేవుడన్నట్లు నటించుచుండును. ఇట్టివారితో వైద్యముచేయించుట పొరబాటేగాకుండ ఆరైతునకుకూడ మహాపాతకము చుట్టుకొనును. శాస్త్రజ్ఞానము మిగుల అనుభవముండిన భూతదయగలవారి చేతనే వైద్యము చేయించుదురుగాక.

---

జబ్బువాపు 48 గంటలవరకుండును.

ఏవైద్యునితో తమపశువులకు మీరు చికిత్సలు చేయించుచుందురో ఆతనితోనే చికిత్స ఆఖరువరకు చేయించవలెనుగాని మఱొకరితో చేయించరాదు. ఇట్లు చేయించుటవలన ఉభయభ్రష్టత్వము గలుగును. కొందరు భూతవైద్యుల రప్పించెదరు. మరి కొందరు మంత్రవైద్యుల రప్పించెదరు. ఇంకా ఎన్నిరకాల తంత్రవైద్యముల చేయించెదరు. ఎంతమందియున్నను అనుభవము, శాస్త్రజ్ఞానముగలవారిచేతనే వైద్యము చేయించవలెనని నాకోరిక.

## తెలిసి తెలియని చికిత్సలను చేయరాదు.

పశువునకు రోగమైన రోగిని మెదల ఆరోగ్యమునకు నిదానము జాగ్రత్తగా పరీక్షించి చికిత్సజేయవలెను. పశువులు నోరులేనిజంతువులు గాన మనుష్యులే బాగుగా వానిని పరీక్షించి తగిన సదుపాయములు చేయవలెను. కొందరు వైద్యులు దొమ్మను కురుమయనియు, కురుమను దొమ్మయనియు చెప్పి చేతగాని చికిత్సలు చేయుచుందురు. కాబట్టి భూతదయాపరులగు పశువైద్యులు తగినంత శాస్త్రజ్ఞానము గలిగి చాల అనుభవముతో చికిత్స చేయవలెను గాని “రైతులు నీవంటి మహావైద్యుడులేడు” అనగానే ఆరోగము పోవలెనని హెచ్చుచేయించుచుందురు. కాని వైద్యమంతా నాకే తెలియునను గర్వముతో తెలిసి తెలియని మందులపోసి చంపరాదు. అట్లు చంపిన నీకేగాక నీకుటుంబమునకుకూడ మహాపాతకము చుట్టుకొనును.

వ్యాధియొక్క గుణములను తెలిసికొనిన తరువాత చికిత్సలం చేయుట సులభము. ఇంతియేగాక కొందరువైద్యులు గ్రంథాలుచదివి అనుభవములేక చికిత్సలు చేయుదురు. మరికొందరు డబ్బుసంపాదనకొరకై టెట్టుగుట్టులతో రైతుల నేడ్పించుదురు. ఇట్టి వైద్యులను విసర్జించుటయే మంచిది. కొందరు వైద్యులు తమ శాస్త్రమే ప్రపంచములోనున్న శాస్త్రములకంటె మించినదని ఏదోవిధముగ ఋజువుపరచుటకు ప్రయత్నించుదురు. ఇట్టి అభిమానము కొంతవరకు యుండవలసినదేగాని మంచిచెడ్డల నుపయోగించక కాబట్టిన కుండేటికి మూడుకాళ్లేయను వారికి క్రొత్తవిషయములు బోధించుట చాల కష్టము.

నిండుకుండ తొణకదుగాని శాస్త్రజ్ఞానములేని వైద్యులు తడితడాలకంటె గంభీర వాక్యములు పలుకుచు అన్నివ్యాధులు తామే కుదర్చగలమని చెప్పుదురు. మరికొందరు అమోఘమైన పశుసేవ చేయుచుందుమని, విఱ్ఱవీగుచు తదితరులను దూషించుచుందురు. మరికొందరు గ్రంథములను వ్రాయుచున్నామని తప్పుడు మోతాదులు వ్రాయుచు వస్తుగుణముల తెలుపకనున్నవారుకూడ గలరు. కాబట్టి శాస్త్రజ్ఞానము, అనుభవముగలవాడే సరియగు పశువైద్యాచార్యు డనిపించుకొనును.

---

కురము 2 నుంచి 8 దినముల వరకుండును.

## వైద్యములో గలుగుచుండు మార్పులు

మనదేశములో కాలపరిస్థితుల ననుసరించి రోగములుకూడ పలువిధములుగా మారుచున్నవనుటలో నతిశయోక్తిలేదు. నేను ఇంతవరకు 25 పశువైద్య గ్రంథములు వ్రాసితిని. ఎన్నో విషయములు పరిశోధనచేసితిని. ఎంతోమంది విద్యార్థులకు నేర్పితిని. ఎన్నో పశువులకు చికిత్సలు చేసితినిగాని నిరంతరము వైద్యములో మార్పులు చెందుచునే యున్నవి. ఇప్పుడు మనము చేయుచున్న పశువైద్యపద్ధతి మరియొక నూతనరూపమునకు రావచ్చును.

పూర్వము పెద్దరోగము (రింక) అనురోగమును రాకుండజేయుటకు జెనుము పాలటీకాలను వేసియు, జొన్నకలి, తతితర ఔషధములు పెట్టి ఆరోగములను నిర్మూలనము చేసెడివారు. ఇప్పటి కాలపరిస్థితులనుబట్టి ఈ రోగవిధానమంతయు మారి నూతనరూపముగా దేశమంతటను వ్యాపించి రైతుల నాందోళన పరచుచున్నది. కాబట్టి పరిస్థితులను బట్టి వ్యాధులుకూడ మార్పుజెందునని ముఖ్యముగా గ్రహించవలెను.

## ఆంగ్లాయుర్వేద ఔషధముల వ్యత్యాసములు

ఆయుర్వేదౌషధములలో మిక్కిలి పరమోత్కృష్టమగు వస్తువులనేకములున్నవి. మిక్కిలి ప్రయోజనకరమగు వస్తువులు అతివిశేషముగా హిమాలయప్రాంతములందు దొరకును. పూర్వమునుండియు ఆయుర్వేదౌషధములే మిక్కిలి ప్రసిద్ధిగా నుండెను. కాని నాటిమహిమ గ్రహించి ఆచరణలో పెట్టు పశువైద్యులు చాలాతక్కువగా నున్నారు.

ఎటువంటి బీదరైతైనను తనపశువునకేదైన రోగముసంభవించినపుడు కొంత పైకము తీసికొనివెళ్ళి వస్తువులను తవ్వికొనిరావలసిన గతిపట్టినది. పూర్వమెచ్చటచూచినను వనమూలికలుదొరికెడివి. ఏవ్యాధికిచికిత్సచేయవలెనో ఆవస్తువులను సంపాదించి చికిత్సలు చేయుచుండెడివారు. ఆపసరులలోకూడ అనేక సుగుణములున్నవి.

ఆంగ్లేయఔషధములకంటె ఆపసరులలో మంచిగుణములు కలుగు. మనదేశములో నుత్పత్తియగు నేలవేము, సొంటి, విషముష్టివగైరా ఓషధులను విదేశీయులకు తీసికొనివెళ్ళి అల్కహాలులో కలిపి శుద్ధిచేసి సీసాలలో పోయుటవలన చూపులకు అందముగా నుండుటచే ఆమందులగిరాకీ చెప్పనక్కరలేదు. ఇప్పటి యుద్ధపరిస్థితులవలన మన ఆయుర్వేదమూలికల ప్రభావమెంతవరకున్నదో ఎల్లరకు తెలిసియేయున్నది.

పశువైద్యముచేయు ఆంగ్లేయపశువైద్యుల ఆయుర్వేద సలహాలడిగిన వారెంతగా తెలియవందురు. కాబట్టి ప్రతివైద్యుడు ఆంగ్లాయుర్వేదౌషధముల గుణములరెండింటిని తప్పకగ్రహించవలెను. దేశకాలానుగుణ్యముగ నిప్పటిపరిస్థితులనుబట్టి ఆంగ్లేయౌషధములే ప్రచారమునకు వచ్చుచున్నవి. ప్రభుత్వాదరణ లేకపోవుటచే ఆయుర్వేదపశువైద్య మభివృద్ధి గాంచుచుండుటలేదు.

---

గాలికుంటు 24 గంటలనుండి 10 దినముల వరకుండును.

## వైద్యుడు దెలిసికొనవలసిన వ్యాధిచరిత్ర

రోగనిర్ణయమునకిదియొక ముఖ్యసాధనము. ముఖ్యముగా రోగపశువు ప్రస్తుతము అనుభవించుచున్న బాధలును, రాత్రింబవళ్లు ఎట్టివేళలయందు బాధ లధికమగునో, రోగపశువునకు చలనమువలనగాని, ఉష్ణశీతలము లకారణముల వలనగాని, మరియేయితర కారణములవలనగాని, అధికమగుట, ఉపశమనము కలుగుచుండునో ముఖ్యముగ కనుగొనవలసిన అంశములై యున్నవి. ఇదివరలో పొందిన బాధలును, అస్వస్థత యెంతకాలము నుంచి యున్నదియు, ప్రారంభములో నేవిధముగ గలిగి, ఏరీతిగా అప్పటికి మారియున్నదియు సవిస్తరముగా దెలిసికొనవలయును.

పశువును పరీక్షించినవెంటనే వైద్యుడు పశువుయొక్క యజమానునిగాని, పశువుల కాపరినిగాని అడిగి [illegible] గూర్చి తెలిసికొనవలెను. ఒక్కొక్కప్పుడు కొన్నికొన్ని విషయములలో కొందరికి అనుభవము లేకపోవుటచేత సరియగు చరిత్రకూడ తెలిసికొనుట దుర్లభము. అంతియేగాక పశువులకాపరి అజాగ్రత్తవలనగాని లేక లోపము వలనగాని పశువునకు వ్యాధి కలుగుచుండును. కాబట్టి ఆ కాపరిచెప్పు అన్ని విషయములను పూర్తిగానమ్మక వానిని బాగుగా నొక్కించి అడుగవలెను. తుదకు అతనిని భయపెట్టియైనను నిజమైన కారణములను తెలిసికొనవలెను.

ప్రస్తుతము యజమాని స్వాధీనములో ఆపశువు ఎంతకాలమునుండి ఆరోగ్యముగ నున్నదో, ఎంతకాలమునుండి బాధపడుచున్నదో యిదివరకెప్పుడైనను ఆపశువు యేరోగముచేతనైన బాధపడినదోయను విషయములు జాగ్రత్తగా ముందు తెలిసికొనవలెను. వైద్యుడు తనయొక్క చిత్తుపుస్తకము పై రోగపశువుయొక్క యజమానిపేరు, పశువు రోగలక్షణములను వ్రాయవలెను. వైద్యమే వృత్తిగాగలిగి పశువైద్యాలయము లేర్పరచుకొనువారు ఒకేదినమున పెక్కు పశువులను పరిశీలించి ఔషధనిర్ణయమునకు పొరబడకుండ వ్రాసికొనవలెను.

రోగపశువుయొక్క కాపరిచెప్పిన సంగతులవల్లనే రోగనిర్ణయ మొనర్చుటకు వలనుపడదు. వైద్యుడు వ్యాధిగ్రస్తమునందు గాన్పించు తదితర లక్షణములనుకూడ కనిపెట్టి జాగ్రత్తగలిగి రోగమును నిదానించవలెను. రోగనిదానమునందే వైద్యునియొక్క శక్తి సామర్థ్యములు తెలియదగియుండును.

### లక్షణములను కనుగొనుట

పశువునకు వ్యాధసోకినదిలగాయతు కనబడుచున్న లక్షణములనుగూర్చియు, యింకను ఆపశుశాలలోనున్న పశువు లేయితరవ్యాధులవలననైన బాధపడుచున్నవో లేవో మొదలగునవి జాగ్రత్తగా తెలిసికొనవలెను. సామాన్యముగా మేతతినుచున్నదియు లేనిదియు పనిచేయుటకు యిష్టమున్నదియు లేనిదియు తెలిసికొనవలెను.

---

క్షయ 10 దినములనుంచి కొన్నివారముల వరకుండును.

శరీరోష్ణము రాత్రింబవళ్ళు విడువకుండుట, పారుడు మున్నగునవి యున్నవి లేనివి శరీరావయవములనుండి వెలువడెడి చెమట, మలము, మూత్రము, శ్లేష్మము మున్నగునవి వానివాసన, రంగు, మొదలగునవియును, రక్తప్రవాహ సంచారవిధమును తెలియజేయు నాడియొక్క స్థితిని, ముఖము, నాలుక, నేత్రములు, ముక్కురంధ్రములు, పెదవులు మొదలగువాటి లక్షణములును, ఆడపశువైనచో శరీరస్థితి, చన్నులు, పొదుగు, గర్భకోశము మున్నగువాటినిగూర్చియు పరీక్షింపవలయును.

మనముచూచుటకు ముందు ఆపశువునకు ఏచికిత్సలుచేసిరో, యేవిషపుమందు లిచ్చిరో, ఇచ్చినమందులు ఇంక ఎంతికాలమువరకు నిలువయుండునో, ఇదివరకు చికిత్స చేసిన వైద్యులు ఈపశువునుగూర్చి ఏవిషయములు చెప్పిరో ఆ విషయములను విపులముగా తెలిసికొనవలెను.



## రోగముల పరీక్షింపవలసిన సాధారణాంశములు

కడుపునొప్పి విషయములో ఏసమయమునందు ఆనొప్పివచ్చినదో, లేక విడువకుండ వచ్చుచున్నదో, అదివచ్చునపుడు ఎట్లు బాధపడుచున్నదో, ఆనొప్పి ఆగిఆగివచ్చుచున్నదో, లేక విడువకుండవచ్చుచున్నదో, తెలిసికొనవలెను. దగ్గుగాని, చీమిడిగాని కారుచున్న యెడల అదియెప్పటినుండి పడుచున్నదో తెలిసికొనవలెను.

కల్లవాపు 3 నుండి 18 దినముల వరకుండును.

పేగులు సరిగాపనిచేయుచున్నది లేనిది, మూత్రము తక్కువగాగాని ఎక్కువగా గాని పోయుచున్నదో, మూత్రపురంగు ఏరీతిగానున్నదియు గ్రహించవలెను. ఇంకను ఆడపశువైనయెడల చూడిదైనదియు లేనిదియు, విరేచనము గట్టిగా మెరుపుగానున్నదో పలుచగానున్నదో, పశువునకు మందు ఉపయోగించినవెంటనే దగ్గువచ్చుట, ఆయాస పడుట మున్నగునవి జరుగుచున్నవేమో తెలిసికొనవలెను.

## అవయవములను పరీక్షించుట

నాడికొట్టుకొనుట, శీతోష్ణస్థితి, ఉచ్ఛ్వాసనిశ్వాసములును, ఏమైన బంకతో గూడి పొగలుపడుచున్నదియు, దగ్గు వచ్చుచున్నదియు, కడుపులో నేమైననొప్పి యున్నదియు, చెవులనుగూర్చియు, పొట్టలోని యితరభాగములను గూర్చియు విడి విడిగా పరీక్షింపవలెను. ఇంతియగాక ఊపిరితిత్తులను, హృదయకోశమును పరీక్షించు చుండవలెను. కడుపునొప్పి మొదలగుపొట్ట సంబంధమగు వ్యాధులు సంభవించినప్పుడు మలాశయములను పరీక్షించుటవసరము.

పశువు ఒక్కొక్కప్పుడు ఒకే అవయవమునకు జెందిన రోగములవలన బాధపడు చుండును. అట్టి విషయములందు చివరకు ఒకేవిధమగు లక్షణములు కనబడవు. ఇతర అవ యవములందుకూడ ఈఅవయవముల దీర్ఘరోగముచే కొన్నికొన్ని నష్టములు కలుగవచ్చును. ఇట్టి వ్యాధిమూలముననే పశువులు ఎక్కువగా చనిపోవును. ఒక్కొక్కప్పుడు దీర్ఘమగు మూత్ర సంబంధమగు వ్యాధులచేతగాని, ఆడపశువులైనయెడల లోపలపిండము తిరిగి అడ్డము తిరుగుటవలనగాని, హృదయరోగమువలనగాని పశువు ఆకస్మికముగా చనిపోవు టయుగలదు.

## వ్యాధిని నిర్ధారణచేయుట

ఒక్కొక పశువు విషయములో ఆయారోగములనుబట్టి మనము వెంటనేగాని, చాలా కాలమైనపిమ్మటగాని రోగనిర్ధారణ చేయజాలము. అట్టి సమయములందు అప్పుడు కనబడు రోగ చిహ్నములనుబట్టి దానికి చేయవలెను. పీడితమగు పశువును చూచినవెంటనే వ్యాధియని తెలిసికొనినవెంటనే దానికితగిన చికిత్సచేయుటగాని లేక వెంటనే దానిని తొలగించుటగాని మనకు వీలగును.

మన అనుభవ పశురోగలక్షణ శాస్త్రమునుబట్టి పశువునకు లోపలిభాగమందున్న అవయవములకు యేవిధముగా సరియైన మార్గమునకు తిసికొనివచ్చుటకు వీలగునో తెలిసి కొనవచ్చును. జ్వరమానమునుబట్టి జ్వరపుహెచ్చుతగ్గులను, మలమూత్ర విసర్జనములనుబట్టి రోగనిర్ణయమును కనుగొనవచ్చును.

---

మంచివానికి ఒకమాట : మంచిగొడ్డుకు ఒకదెబ్బ.

## రోగమునకు పేరు వెంటనే పెట్టరాదు.

వైద్యుడు పశువును చూచినవెంటనే వ్యాధిపేరు చెప్పరాదు. ఎందుచేతనన రైతులలో కొందరు పామరులుందురు. ఏకీతోష్ణనిత్యవలననైన పేరు చెప్పిన వ్యాధిమరొక వ్యాధిగా పరిణమించినయెడల ఆపామరులగు రైతులు వైద్యులను దూషించుచుందురు. ఆవైద్యునకు యేమి తెలియదనికూడ చాటుదురు. కాబట్టి రోగనిదానము గ్రహించి పేరు పెట్టుటమంచిది. కొన్నికొన్ని రోగములలో గుణలక్షణములు ఆరోగకారణమును కూడ తెలిసికొనునంత అస్పష్టముగ నుండును. అటివిషయములందుగూడ మనము రోగ లక్షణములను పరీక్షించి, రోగనిర్ణయము బాగుగాచేసిన తరువాత సాధ్యమైనంత మంచి చికిత్సచేయుటకు ప్రయత్నించవలయును. ప్రతిరోగమునకు మనము నిశ్చయమైనఔషధ [illegible] చికిత్స [illegible] జాలముగాన వెంటనే రోగమునకు పేరుపెట్టరాదు.

## మందులిచ్చుటకుపూర్వము గ్రహించవలసిన విషయములు

రోగపీడితమగు పశువునకు మందీయవలెనన్న ఆరంభములో ఆవ్యాధియొక్క గుణమును, లక్షణములను తెలిసికొనవలెను. రోగనిర్ణయమును, రోగలక్షణములనుబట్టి చేయవలెను. స్వానుభవముమీదకూడ రోగకారణమును తెలిసికొనవచ్చును. రోగనిర్ణయముచేసిన తరువాత ఆపశువుపడుచున్న బాధనుమాన్పి దాని జబ్బును పూర్తిగా పోగొట్టి దానిని పూర్వస్థితిలోనికి తెసికొనివచ్చుటకు వలయు చికిత్సలనుగూర్చి ఆలోచింపవలయును. ఒకొక్కొక్క వ్యాధివిషయములో మనము రోగనిదానము గ్రహించి వెంటనే ప్రథమ చికిత్సచేసి ఆబాధను నివారించవచ్చును. ఇదిముఖ్యముగ చికిత్సలలో నొకటి. కొన్నికొన్ని విషయములలో మనము రోగకారణమును గురించి వెంటనే ఎక్కువగా తెలిసికొనక పోయినను ఆరోగమువలన కలిగిన బాధను మాన్పుటకై చికిత్సకై ప్రయత్నించవలయును.

## వ్యాధియొక్క నడకనుగురించుట

నోరులేని పశువువ్యాధియొక్క ముందునడకను గుర్తించుటకు మిగుల అనుభవము, మంచిబుద్ధి, కుశలతయు కావలయును. వ్యాధియొక్క ముందునడకను సరిగా చెప్పగలుగుటకు వ్యాధియొక్క సహజగమనమును జక్కగా దెలిసినవాడై ఆరోగ్యముయొక్క సహజ తత్వమును యెరిగినవాడై తానుపయోగించు గుణములను శక్తులను గ్రహించుటయందు మిగుల అనుభవముగలవాడునై యుండవలెను.

వ్యాధియొక్క ముందునడకనుగూర్చి వైద్యుడు తనంతటతాను పశువుయొక్క యజమానికి చెప్పరాదు. ఎవరైన అడిగినయెడల స్పష్టముగా తెలిసియున్న సంగతి మాత్రము చెప్పవచ్చును. అనుమానముగానున్న సంగతిమాత్రము చెప్పుటలో బహు

పెసరకు తూర్పుగాలి : పసరునకు నోటిగాలి.

ముగా తెలిసినప్పటినుండియు దానికేవిధమగు పని చేయకుండ విశ్రాంతి నీయవలెను. శస్త్ర చికిత్సాసంబంధమగు రోగములయందు జ్వరమువచ్చినచో అదివానికి ముఖ్యచిహ్నము. నరముల సముదాయము ఎక్కువగా పనిచేసినప్పుడు ఉండవలసిన పరిమాణముకన్న ఉష్ణము తక్కువయుండిన అది అపాయచిహ్నము. పశువుయొక్క శీతోష్ణపరిమాణము కనుగొనవలెననిన ధర్మామీటరును దానియొక్క మలాశయములో పెట్టి ఆధర్మామీటరుయొక్క మంచిచెడ్డలను అరనిమిషమునుండి మూడునిమిషములవరకు వుంచినయెడల జ్వరమెంతయున్నది తెలియును. ధర్మామీటరుయొక్క పాదరసముండుచోట (గుచ్చి) పశువుయొక్క పేగుకు సంబంధించిన పొరలను తగులునట్లు జాగ్రత్తగా వెళ్లునట్లుగ త్రోయవలెను. అంతవరకు పోనీయనియెడల శీతోష్ణపరిమాణము తెలియదు.

## ఉష్ణతాపక యంత్రపుకొలతలు

పశువుయొక్క ఉష్ణోగ్రతను పరీక్షించుదానికి ఉష్ణతాపకయంత్రము (ధర్మామీటరు) అందురు. ఉష్ణతాపకమనగా వాయువుయొక్కయు, జలముయొక్కయు, రక్తద్రవ్యములయొక్కయు ఉష్ణోగ్రతను పరీక్షించుట. ఉష్ణముయొక్క ముఖ్యధర్మము విస్తరించుట. శీతలముయొక్క ముఖ్యధర్మము ముడుచుకొనుట. ధర్మామీటరుయొక్క క్రిందిభాగమున ఉబ్బుగానుండుదానిలో పాదరసమునుబోసి గొట్టములోని గాలినంతయు దీసివేసి పైభాగమున సెగజూపిమూయుదురు. ఆగాజుగొట్టము పొడుగువరుస శీతోష్ణ పరిమాణ అంశములు డిగ్రీలుగ విభజించెదరు అంకెలను గీసెదరు. ఆధర్మామీటరు పైన కచ్చితమైన కొలతలును వీలగునట్లు అంకెలవరుస 93 నుంచి 110 వరకు విస్తరించి పదిభాగములుగా విభజింపబడియుండును. ప్రతిరైతువద్ద నీధర్మామీటరుండుటవసరము. రోగపశువుయొక్క శరీరోష్ణమును ధర్మామీటరుతో దినమునకు రెండు మూడు పర్యాయములు కొలువవలెను.

ఉదయము 6 గంటలనుంచి 9 గంటలవరకు

సాయంకాలము 5 గంటలనుంచి 7½ గంటలవరకు

కొలుచుటమంచిది. అవుసరమునుబట్టి మధ్యకాలములోకూడ కొలువవచ్చును. చెవిదగ్గరగాని, ఎదరొమ్ములోగాని, ఆసనములోగాని, కాలికి గంగడోలునకు మధ్యగాని, జ్వరముయొక్క పాదరసభాగమును 4 లేక 5 నిమిషములుంచి కొలువవలెను. ఆసనములోకంటె తదితరభాగములయందు పెట్టి చూడబడిన యుష్ణము ఒకడిగ్రీతక్కువగ యుండును. కనుక తదితరభాగములందు పెట్టిచూచినపుడొక డిగ్రీ అదనముగా కలుపుకొని లెక్కచూడవలెను. జ్వరముకొలుచునపుడు రెండుమూడు నిమిషములుంచి చూడవలెను.

---

అంటుబొడ్డు ఆవురల ఎద్దువు : జారుబొడ్డు చనుకట్టుఆవువు.

## జ్వరమానము

ఆరోగ్యస్థితిలో పశువు శరీరముయొక్క వేడిమి 102 డిగ్రీలుండును. అంతకు యధికముగనున్నను, తక్కువగనున్నను అనారోగ్యమని యెరుంగవలెను. పశువునకు సామాన్యముగా జ్వరమున్నచో సామాన్య ఉష్ణము 100 డిగ్రీలకుపైగా పాదరసము ప్రవహించును. సామాన్య గుర్తుకు అనగా 101 డిగ్రీలకు తక్కువగా పాదరసము దిగిన యెడల పశువు నిస్త్రాణస్థితిలోను, వాతములోనున్నదనియు తెలిసికొనవలెను.



జ్వరమానము

107, 108 పైనయున్నచో దారుణమైన వేడియని గ్రహించవలెను. 104 నుంచి 105 వరకు దీర్ఘకాలము నిలబడియున్నచో ప్రమాదము రానైయున్నదనియు, 102 నుంచి 104 వరకున్న సామాన్య జ్వరమనియు భావింపవలయును. 95 డిగ్రీలవరకున్న అధికఅపాయమనియు అంత్యదశయనియు తెలిసికొనవలెను. పశువుయొక్క ఉష్ణము కొలిచినతరువాత థర్మామీటరు క్రిందివైపునకు జాడించి దానిలోని పాదరసమును సామాన్యపు గుర్తుకంటె క్రిందికిదింపి వేడినీటితోగాని, తదితర ద్రావకములలోగాని కడుగవలెను.

---

ఎక్కువ వెలపెట్టి కుడ్డను : తక్కువ వెలపెట్టి గొడ్డుకొనరాదు.

## నాడి, శ్వాస, ఉష్ణము, తెలుపు పట్టిక

| జంతువు | నాడి నిమిషమునకు | శ్వాస | టెంపరేచరు |
|---|---|---|---|
| గుఱ్ఱము | 35_45 | 10_12 | 100_102 |
| ఎద్దు | 50_60 | 12_16 | 101_101½ |
| దున్న | 45_50 | 20_25 | 100_101 |
| గొఱ్ఱె | 70_80 | 30_40 | 102_104 |
| మేక | 60_70 | 25_30 | 101_103 |
| కుక్క | 70_95 | 15_25 | 101_105 |
| దూడ | 65వరకు | 12_16 | 102_104 |
| కోడి | 65వరకు | 8_12 | 102_103 |

## ఉష్ణము తగ్గిపోవుట

చెమటపట్టని జంతువులను చర్మముపైన ఎక్కువరోమములుగల జంతువులను వేడి ప్రదేశములలోగాని వేడిగాలి ఎక్కువగాతగులు ప్రదేశములలోగాని యుంచినయెడల వానికి ఆవేడి లోపలప్రవేశించి అపాయము కలుగజేయును. ఈవిషయములో చెమట రంధ్రములుగల పశువులను అట్టి ప్రదేశములలో నుంచినను ఏవిధమగు కష్టముకనుపించదు. దానికి కారణములు చెమటరంధ్రములనుండి చెమట బయలుదేరి పైనసోకు వేడిమిని ఆపివేయును. అదే కారణముచేత గుఱ్ఱము ఎంతదూరమైనను వేడిమివలన అపాయము లేక చెమటరంధ్రముల సాయముచే పరుగిడుటకు శక్తిగలదై యుండును. ఎద్దు అటుగాక గుఱ్ఱమువలె ఎక్కువదూరము పరుగెత్తిన యెడల చెమటరంధ్రములు లేకపోవుటచేత ఉష్ణము లోపలికి ప్రవేశించి ఎక్కువనష్టము కలిగించును.

ఏ పశువైనను మిక్కిలి చల్లని ప్రదేశములోనుంచినయెడల కొంతసేపటికి దాని యొక్క సహజ వుష్ణతతగ్గిపోయి చలిచే ఆవరింపబడి కొంతసేపటికినిద్రించును. అటులనే యూరకుండిన యెడల కొంతసేపటికి ప్రాణనష్టముకూడ కలుగును. అప్పుడు మనము దానిని 96 డిగ్రీలవేడిమి యున్నప్పుడైనను ప్రయత్నించవలెను. శీతలముచే పశువు బిగిసి పోయినయెడల అది సరియగు స్థితికివచ్చుట, బ్రతుకుట చాలకష్టము.

పశువులకు తగినంత ఆహారము పెట్టకపోవుటవలన కూడ ఉష్ణత తగ్గును. చల్లని ప్రదేశములలోని జంతువులు ఆహారము ఎక్కువగాతినును.

## హృదయపరీక్ష

పశువుప్రాణమునకు హృదయము. శ్వాసకోశము లును ముఖ్యాధారములగుటచేత వాని సంరక్షణార్థము సర్వేశ్వరుడు వెన్నెముకచేతను, ప్రక్కటెముకలచేతను, రొమ్ము

వంశ మెరిగి వనితను : పన్నెయెరిగి పశువును సంపాదించాలి.

ముకచేతను ఒక పేటికను నిర్మించి వానియందు పదిలపరచియున్నాడు. పశువు ఎక్కువ పాటుపడుకొలదిని గుండె ఎక్కువపనిచేయునని తలంచవలెను. ఈపని చేయుట మనము వదలినయెడల మనముచేయు చికిత్సలలో చాలపొరపాటులు కలుగును. అట్లు చేయని యెడల పశువు ఆకస్మికముగా చనిపోవుటయు గలుగును.

## స్టెతస్కోపుతో పరీక్షించుట

గుండె యొస్థానమునందున్నదియు తెలిసికొనుటకు స్టెతస్కోపుఅను ఒక పరికరమున్నది. దీనిని పశువుహృదయస్థానము నందుంచి దాని కమర్చబడిన గబ్బరుగొట్టముల రెండింటిని రెండు చెవులయందు జొనిపియుంచి పరీక్షించినచో రెండువిధములగు లబ్ డబ్, లబ్ డబ్ అను శబ్దములు వినబడును. ఈ పనిముట్టు నుపయోగించి హృదయములోని ధ్వనులను తెలిసికొనుటవలన చాలా లాభముండును. పెద్దపేగు సంబంధమైన ధ్వనులను గూడ గుర్తింపవచ్చును.

ఈ పనిముట్టును చాలాజాగ్రత్తగా నుంచవలెను. గాని దానినుపయోగించు ఫలితము త్వరగా మాత్రము చెప్పరాదు. మిక్కిలి అనుభవముగల పశువైద్యుడే ఈ స్టెతస్కోపుతో పరీక్షించవలెను గాని తదితరులు పరీక్షించినను లాభములేదు. కొందరువైద్యులు ఈ పనిముట్టు చేతిలోనుండిన చాలునని డాంబికముతో నటునిటు త్రిప్పుచుందురు. ఒకొక్కప్పుడు దీనినుపయోగించునప్పుడు అది వెంట్రుకలకు తగిలిగాని లేక చర్మము యొక్క కదలిక మొదలగువాని వలనగాని ఒకవిధమగు ధ్వనికలుగును. ఆ ధ్వనిని మనము హృదయసంబంధమగు ధ్వనిగ భావింపక మిగుల మిగుల అతిజాగ్రత్తగా పరిశీలింపవలెను.

ఈ విధమగు తప్పులే ఊపిరితిత్తుల వలన ధ్వనికలిగినప్పుడుగాని పేగులయొక్క కదలికచే కలిగిన ధ్వనులవలనగాని వైద్యులు తప్పుత్రోవను పోక జాగ్రత్తగా పరిశీలించుచుండవలెను. ఈ పరికరము నుపయోగించుటలో అనుభవమున్నయెడల ఇట్టి కష్టము లుండనేరవు. ఆ పశువునకు చుట్టుప్రక్కల నిశ్శబ్దముగా నుండవలెను. రోగనిర్ణయము చేయుటకు ముందు ఒకేసారి ఆపరికరము నుపయోగించి ఫలితము చెప్పుటకన్న కొంచెము ఆగి ఆగి పరీక్షించిన పిమ్మట రోగనిర్ణయము చేయుటమంచిది.

## నాడి

రక్తనాళములలో రక్తము కదలుటయే నాడి లేక ధాతువు కొట్టుకొనుట యందురు. పశువు కుడి ఎడమలనుండు క్రింది దవుడలకు లోపలిభాగమునను కాలి యొక్క రక్తనాళములదగ్గరను, కాలిచీలమండల వెనుకవైపున వెంట్రుకలుండెడు ఉబ్బెత్తు భాగములోను, తోకమట్ట మొదటిభాగములోను ధాతువును చూడవచ్చును. బొటనవ్రేలుగాక చేతియొక్క నాలుగువ్రేళ్ళచేత శుద్ధరక్తనాళములుండు ఎముకలకు వేసి అదిమి చూచిన ధాతువు స్పష్టముగా కొట్టుకొనుట తెలియును. నాడి మనవ్రేలు

---

పశువుల విరివి : పంటకు లేట.

నకు తగులుటకు కారణమేమన హృదయకోశ మెల్లప్పుడును వికసించుటయు, ముడుచు కొనుటయు జరుగుచుండును.

సుఖముగానుండు గొడ్లకు ఒక నిమిషమునకు 45 నుంచి 60 వరకును ఇంతకు హెచ్చు తగ్గులుండిన ఆ జంతువు అనారోగ్యముగా నున్నదనియు గ్రహించవలెను.

## రక్తనాళముల కదలిక

రక్తనాళముల కదలికను డాక్టర్ బర్డొన్‌సాండరస్‌దొరగారు దుర్భిణీయంత్ర సహాయముచే కనుగొనినప్రకారము నాడియొక్క కదలిక ఈదిగువ రీతిగానుండును. హృదయకోశము ముడుచుకొనుటకు ఆరంభింపగనే హృదయ పార్శ్వమునందు పెదరక్త నాళమునందుండు రక్తముకదలుటకు ప్రారంభించును. జఠరికభాగము అనగా ఆకలి పుట్టించు భాగముకూడ ముడుచుకొనునపుడు రక్తపుపోటు అనగా కదలిక హృదయ కోశమువద్దనుండు ఒక గుండ్రనితిత్తికి తగులును. జఠరిక ముడుచుకొనునపుడు రక్తపు పోటు హృదయమువైపునకు పోవును. ఈప్రతిరక్తపు కదలిక రక్తప్రవాహమువైపునకు నిమిషమునకు 90 అడుగుల వేగమువంతున ప్రవహించును.

నాడియొక్క కదలిక పైనచెప్పిన రెండు కదలికలవలన దుర్భిణీయంత్రముపెట్టి పరీక్షించగా ఈక్రిందివిధముగా నుండునని తెలియుచున్నది. మొదటిరక్తపు కదలిక గుండెకు నిలువుగా పైకిపోవుటచేతను, రెండవది క్రిందికి దిగుటచేతను నాడియొక్క కదలిక కలుగును. ఒకటితరువాతనొకటి నెమ్మదిగా క్రిందికిని పైకిని తిరుగుటచేత నాడి కూడ నెమ్మదిగాదిగును. ఒకకదలికకు మరియొకకదలికకు మధ్యనుండు విశ్రాంతి సమయ మును కనుగొనుట హృదయము ముడుచుకొనుటలనుబట్టి సరిగా కనుగొనవచ్చును. ఎటు లన ఒకకదలిక జఠరిక ముడుచుకొనునపుడు గలుగు గట్టితనమువలన యేర్పడును. రెండవ కదలిక హృదయమునకు ఎడమపార్శ్వమునందుండు పెద్దరక్తనాళముయొక్క మడత ముడుచుకొనుటచేత బిగువుగలిగియుండును.

## కదలికల స్వయంకృషి

ఈరెండుకదలికలు కొన్నికొన్ని విషయములలో ఇతరవిషయములకన్న అవియే స్వయముగా తేటతెల్లముగా తమకదలికను తెలియబరచును. ఈవ్యత్యాసములకు కార ణము వానివానికి సంబంధించిన పొడతలు చాలపని చేయవలసియుండును. అదియునుగాక హృదయము కదలుటకు కారణము ఆకస్మికముగా రక్తనాళములు ముడుచుకొని నందువలన గలుగు బిగువుతనమైయున్నది.

జఠరిక ముడుచుకొనుట ప్రారంభమైనతోడనే నెత్తురుగొట్ట సముదాయమంత యును, ఆ నాళములలోనుండు కదలికయు ఒకేసారిగ అతిత్వరితముగా హెచ్చిపోవును. ఆరంభములో రక్తనాళములు రక్తప్రవాహములకు లోనుగాక సరియగు స్థితిలోనికి

---

పదిదుక్కులకు తరువాత దున్నినవాడు పాపాత్ముడు.

వచ్చును. ఈ కదలికలకు మధ్యనుండు విశ్రాంతి సమయము నాళములలో రక్తము పూర్తిగా ప్రవహించనపుడు ఎక్కువగ నుండును. రక్తప్రవాహపు వడి హెచ్చినపుడు విశ్రాంతిసమయము తగ్గును.

## నాడిని తెలిసికొనుట

వ్యాధిని తెలిసికొనుటకును, చికిత్స చేయుటకును ముందుగా నాడిని పరీక్షింపవలయును. ఈ నాడి పశువు హృదయము నుండి శరీరమంతటను రక్తము వ్యాపింపజేయు శుద్ధరక్తనాళములలోని రక్తప్రవాహమువలన కలుగుచుండును. ఆరోగ్యస్థితియందు ఈ నాడి దెబ్బలసంఖ్య పశువువయస్సునుబట్టి మారుచుండును.

పశువుయొక్క రోగచిహ్నములను కనుగొనువారు నాడి కొట్టుకొనుటను గూర్చి బాగుగా పరీక్షింపవలయును. ప్రతిరోగ విషయమున నాడిని, హృదయమును పరీక్షించనియెడల రోగలక్షణములను కనుగొనుటకుగాని, తరువాత చికిత్సచేయుటకుగాని మిక్కిలి కష్టమగును. అప్పుడప్పుడు నాడియందు కలుగు మార్పులను బట్టి అది ఒకటని వెంటనే తలంపరాదు. హృదయ పరీక్షయైన తరువాత నాడిని పరీక్షించిన యెడల రోగనిర్ణయము నకు కొంతవర కుపయోగించును.

## నాడికొట్టుకొనుటలో వ్యత్యాసములు

చాలారోగములలో నాడికొట్టుకొనుటకు గల భేదములనుబట్టి రోగముయొక్క ముఖ్యలక్షణములను తెలిసికొనవచ్చును. హృదయమునుండి రక్తనాళములలోనికి పోవు రక్తప్రవాహముచే ఈ నాడి కొట్టుకొనుట జరుగును. పశువు ఆరోగ్యస్థితి యందున్నపుడు తన హృదయమును ముడుచుకొను నపుడెల్ల నాడి కొట్టుకొనుటయని యిదివరకే చెప్పబడెను. మొట్టమొదట చేసిన హృదయపరీక్షను బట్టి నాడి ఆగి ఆగి కొట్టుకొనుచున్నదో లేక తరచుగా ఆగక కొట్టుకొనుచున్నదో పూర్తిగా ఆగిపోవు స్థితిలోనికి రానున్నదో తెలిసికొనవచ్చును. నాడి యెక్కువ కొట్టుకొనుటను బట్టి అదియొక రోగ లక్షణముగ గైకొనరాదు. కారణమేమన క్రొత్తమనిషి పశువుయొద్దకు వచ్చినపుడుగాని నెమరు వేసినవెంటనేగాని నరములు సరియగుస్థితిలో లేకపోవుటవలనగాని, ఏదైనా మొదలగునవి చేసినప్పుడుగాని నాడి క్రమము తప్పి కొట్టుకొనును.

## త్వరగా కొట్టుకొనుట

పశువు సరియగు ఆరోగ్యస్థితియం దున్నప్పటికన్న ఎక్కువపర్యాయములు కొట్టుకొనుటయే త్వరగకొట్టుకొనుట యనబడును. మంచి ఆరోగ్యవంతములగు కొన్ని పశువులు మాత్రము వానినాడి మామూలుగా కొట్టవలసిన వేగముకంటె కొంచెము త్వరగ కొట్టుకొనును. జీర్ణమునకు సంబంధించిన అవయవములు అలసియున్నపుడు, పనిచేయుటకు ఎక్కువైనపుడును నాడిత్వరగా కొట్టుకొనును. జ్వరముయొక్క ప్రారంభదశ యందుకూడ నాడి తీవ్రముగా కొట్టుకొనును.

---

## నెమ్మదిగా కొట్టుకొనుట

ఈనాడియొక్క నడకయందియు పైనచెప్పిన త్వరితనాడియొక్క నడకకు వ్యతిరేకము, నాడి నెమ్మదిగా కొట్టుకొనుటయన పశువు ఆరోగ్యస్థితియందున్నపుడు కొట్టుకొను పరిమితికంటె తక్కువగా కొట్టుకొనుట. మెదడు సంబంధమగు రోగములవలనను, రక్తప్రవాహ లోపమువలన కలిగిన జబ్బులవలనను నాడి నెమ్మదిగా కొట్టుకొనును.

ఈనాడి విషయములో సామాన్యపు నాడి ఒకసారి కొట్టుకొనుటకు పట్టుకాలము కన్న దీనికిపట్టుకాలము తక్కువైయుండును. కాని సామాన్యపునాడి 45 సార్లు కొట్టుకొనవలసియుండినయెడల త్వరితనాడి 50 సార్లువరకు కొట్టుకొనును. సామాన్యపునాడి నిముషమునకు 45 పర్యాయములు కొట్టుకొనును. దీనికి కొంచెము మధ్యస్థ్య ఆగుటయే.

## శ్వాస

ఆరోగ్యవంతమగు పశువు గాలిని మెల్లగను దీర్ఘముగను పీల్చుట విడచుట జరుగుచుండును. పశువు అయాసముగానుండు సమయమునందును, పనిచేయుచున్న సమయమునందును ఆవలించుట దగ్గుట మొదలగు గుర్తులు కనబడును. శ్వాసకోశము వేడిగానుండును. జ్వరమువచ్చినపుడు అది విడచుగాలియును దానిశరీరము వేడిగానుండును. స్టెతస్కోపుతో చూచినయెడల ఉచ్ఛ్వాస నిశ్వాసములు పీల్చుటలో గలుగు భేదములు తెలియును. శ్వాసపీల్చునపుడు గలుగు శబ్దము తూములోనికి గాలి జొరబడునపుడుండు శబ్దమువలె వినబడును. ఊపిరివదలునపుడు ఇంత శబ్దముండదు. ఊపిరితీయునపుడుండు శబ్దము విడచునపుడుండు శబ్దమునకంటె మూడునాలుగు రెట్లెక్కువగానుండును.

## త్వరగా పీల్చుట

చాలావ్యాధులయందు పశువుగాలిని త్వరగాపీల్చును. అట్లుపీల్చుటకు రక్తప్రవాహమునుబట్టియు, ప్రవాహ అవశ్యకతనుబట్టియు జరుగుచుండును. అతిదేహపరిశ్రమ చేసినపుడు రక్తము త్వరగా ప్రవహించుచు గాన త్వరగా గాలినిపీల్చును.

## కష్టముగా పీల్చుట

కష్టముగా గాలినిపీల్చుకొనుటకూడ వ్యాధియొక్క ముఖ్యలక్షణమే. అదిఅనేక కారణములవలన గలుగుచుండును. ఊపిరితిత్తులయొక్క వాపులకు కారణము ఉచ్ఛ్వాస నిశ్వాసముల వాపుటయే. అట్లు అగుటవలన బాధకూడనుండును. శ్వాస మనకు వినబడకపోయినంతమాత్రమున నే పశువునకు వ్యాధియున్నదని చెప్పుటకష్టము. ఒక్కొక వ్యాధిసోకినపుడు పశువు గాలిని అతిత్వరితముగను, మిక్కిలి వేడిగనుపీల్చును. గాలిని కష్టముగపీల్చునపుడుగూడ ఒకవిధమైన వ్యాధికి రోగచిహ్నమని భావింపవచ్చును.

---

ఊరిముందర చేనైనా, తలవపట్టు అయినా మరియొకరికొంద్ర దున్నుకొనంటుందివిద్దు.

## ధ్వనియుతమగు శ్వాస

దీనినే గురకయందురు. ఇది పెదవునందు పుట్టినవ్యాధివలన కలుగును. ఉచ్ఛ్వాస నిశ్వాసములు స్పష్టముగను బలముగను త్వరితముగను యున్నంతవరకు అపాయము వెంటనే యుండదు. కాని ఉచ్ఛ్వాస నిశ్వాసములయొక్క బలము, త్వరితము తగ్గగనే ప్రసరణము ముఖ్యమైనది హృదయరోగమై యున్నది. ఈసమయములో అపాయము కలుగునని గ్రహించవలెను. ఊపిరితిత్తులు జబ్బుగనున్నచో ఊపిరి చురుకుగను, నిగపముగనున్నచో మందముగను దీసికొనును. ఆరోగ్యవంతమగు పశువు ఊపిరి సమశీతోష్ణముగనుండును. రోగపశువు విడచు గాలి చల్లగనున్నచో కష్టసాధ్యము. ఊపిరిదీయుట కష్టముగానుండి గురకశబ్దము ఊపిరితిత్తులయందు వినిపించినయెడల ఊపిరితిత్తులలో శ్లేష్మమున్నదని గ్రహించవలెను.

## ఆరోగ్య లక్షణములు

పశువు సుఖస్థితియందుండునపుడు గుంపులో కలిసి మెలసి వలసినపుడు మేత మేయుచు కాలమెరిగి నెమరు వేయుచుండును.

చెవులు మాటిమాటికి ఆడించుచు నిక్కపొడుచుచు ఆనందముతో నుండును.

ముక్కు మూతి కాంతిగనుండి చెమ్మగలిగి యుండును.

కన్నులు నిర్మలముగ కాంతిగ నుండును.

చర్మము మృదువుగనుండి వెంట్రుకలు చర్మముమీద వ్రాలి యుండును.

పశువు ఒకదాని నొకటి నాకికొనుచు కాలోచితముగ పేడవేయును. ఆ పేడ మెత్తగానుండును.

మూత్రము ధారాళముగా నొప్పిలేకుండ పోయును.

యజమానియందు ఉత్సాహముగా నున్నానని ఒక విధమగు ప్రేమదృష్టిని చూపించును.

ఏ అవయవమునందును వాపుగాని మంటగాని లేకుండును.

పశువునకు ఆకలికలుగుట, సరిగా పీల్చుట, బాగుగా పేడవేయుట మొదలగునవి సక్రమముగా జరుగుచున్నయెడల ఆరోగ్యముగా నున్నదని గ్రహించవలెను.

## అనారోగ్య లక్షణములు

కొమ్ములు వెచ్చగను, మూతిని చెమ్మలేక, మూత్రము పసుపురంగువలె కొంచెము కొంచెము పోయుచు పేడగట్టిగా వేసి, మేతనూని మిక్కిలిదాహముగొని, మందవిడిచి దూరముగాపోయి నల్లకప్పువేసి యుండినయెడల అనారోగ్యముగా నున్నదని గ్రహించవలెను. ఇంకను శరీరము వెచ్చగను, పొడిగాను నుండుట, ఆకలిమందగించుట, మలబద్ధకము నిస్సత్తువ మొదలగు లక్షణములుకూడ కలిగియుండును.

---

ఆవుకు తోలుచూడు : గేదెకు పాలుచూడు.

## ముఖపరీక్ష

ముఖము పశువుశరీరమునకు అద్దమువంటిది. ముఖలక్షణములను బట్టి శరీరమందలి రుగ్మతలను దెలిసికొనవచ్చును. శ్వాససంబంధమగు వ్యాధుల యందు ముఖము మూడుచు కొని ఆందోళనలను జేయును.

రక్తసంబంధమగు రోగములందు పెదవులు ముఖము వెలవెలబారును.

వాతసంబంధమగు రోగములందు ముఖము కాంతి హీనముగా నుండి మంచి లక్షణములే కలిగియుండును. శరీరము మెరుపుగానుండును.

మూత్రసంబంధమగు రోగములందు ముఖము కాంతి హీనముగా నుండును.

మేహసంబంధమగు రోగములందు ముఖము వికారరూపముగా నుండి నేత్రములలో దోషముండును.

## నేత్రపరీక్ష

పశువు నేత్రములు ఎరుపురంగుగానుండి పుసులు కట్టుచుండిన మొసల రోగ మనియు, నేత్రములు పసుపురంగుగ నున్న కామిల రోగమనియు కన్నులవాచి నీరు గారుచున్న వాతరోగమనియు గ్రహించవలెను.

## నాలుక పరీక్ష

పశురోగనిదానమునందు నాలుక పరీక్షయవసరము. పశువు నాలుకను లాగి బాగుగా చూచునట్లు చేయవలెను. మంచి వెలుతురునకు తీసికొనివచ్చి వైద్యుడు ఎదు రుగా నిలబడి నాలుక పైభాగమంతయును జాగ్రత్తగా పరీక్షించవలెను. సామాన్య ముగా పశువులలో కొన్ని నోరు తెరువనియక నానాచిక్కులు పెట్టును. అట్టి సమయ ములో జాగ్రత్తగకట్టివేసి బలవంతముగా లాగి పరీక్షించవలెను. నాలుకయొక్క ఆకా రము, పైజ, ప్రక్కభాగములు ఎట్లున్నది తెలిసికొనవలెను. నాలుక మందముగా నున్నదో, పలుచగానున్నదో, వ్రేలాడుచున్నదో కనుగొనవలెను. నాలుకయొక్క పైభాగము మెత్తగా, కాంతిగానున్నదా? లేక ఎండియున్నదా? పాచిబట్టి వాసన వేయుచున్నదా? రంగు ఏరీతిగానున్నది పరీక్షింపవలయును. దీనినిబట్టి ముఖపరీక్ష, దంతపరీక్ష చేయవలెను.

రక్తసంబంధమగు రోగములలో నాలుక ఎరుపురంగుగానుండి పలుచబారి శాథగానుండును, వాతరోగములలో నాలుక మొద్దుగా తెలుపుగా ఒకవిధమగు వాస నగానుండును. ఇట్టిసమయములలో దంతములచుట్టు పాచియుండును. అంగిటి ముండ్లు పెరుగును. జీర్ణరోగములందు నాలుకపాచి తెలుపుగా, కొంచెము వాసనగా, మెత్తగా నుండును. మలబద్ధకముగానున్నపుడు నాలుకమీద పాచికట్టును.

---

పశువులకుకూడ వాత, పిత్త, కఫము లున్నవని తెలిసికొనుము.

## మలపరీక్ష

పశువు శరీరములో ఆహారము జీర్ణమునొంది సారరూపముగను, కిట్టరూపముగను ప్రేగులలోనున్నపుడు సారభాగము రసాయనములు మున్నగు నాళములద్వారా హృదయమునకు తీసికొని పోబడును. మిగిలిన కిట్టభాగము ద్రవ్యశూన్యమై గట్టిపడి పేడరూపముగ బయటకువచ్చును. ఇట్లు సక్రమముగా రాకపోయిన పశువు పలువిధరోగముల పాలగును.

ప్రతిదినము ఎన్నిసార్లు పశువు పేడవేయుచున్నది, పేడరంగు, వాసన ఎట్లున్నది కనుగొనవలెను. పేడచల్లగా, దుర్గంధముగ జిగటగ నున్న వాతరోగమనియు, గట్టిగా, వేడిగా, మెఱుపుగా, వంటలువంటలుగా నున్న కాకరోగమనియు, మిక్కిలి పలుచగ, తోకక్రింది చేసనంటుకొని కొనను గజ్జ్యనగా నున్న జలుబు రోగమనియు గ్రహించవలెను.

## మూత్ర పరీక్ష

మూత్రపిండములకు సంబంధించిన కొన్నివ్యాధులకు మూత్రపరీక్ష చేయు రోగలక్షణములు కనుగొనుటకు ముఖ్యసాధనము. కాని రోగనిర్ణయము చేయుటకు పూర్వము ప్రతివైద్యుడును ఒకగాజుపాత్రలో ఆవ్యాధిగలపశువుమూత్రముపోసి దానిలో ఒకచుక్క మహాద్రావకమును వేసి దీపపుబుడ్డిమీదగాని, స్పిరిట్ ల్యాంపుమీదగాని కాచవలెను. కాచినపిమ్మట మూత్రముమీద ఒకవిధమైన పదార్థము తేరుకొనును. తేరుకొనిన పదార్థముమీద ఆద్రావకపుబొట్టువేసినపుడు అది కరుగనియెడల పశువునకు శుక్లనష్టమున్నదని తెలిసికొనవలెను. అది విరిగినయెడల జబ్బులేదని గ్రహించవలెను.

ఒకగ్లాసులో మహాద్రావకపుబొట్లు ఒకటిగాని రెండుగాని వేసినతరువాత కొంచెము మూత్రమును గ్లాసులోపలిభాగపు ప్రక్కన అంటుకొని జారునట్లుపోయవలెను. ఆ మహాద్రావకమును ఈ మూత్రము కలిసినచోట ఒకవిధమగు తెలుపుపదార్థము వలయాకారముగా నేర్పడును. ఈపదార్థముయొక్క ఘనపరిమాణము ఆమూత్రములో శుక్లమేగాక తదితరపదార్థములుకూడ కలిసియుండును. ఈరెండవవిధానమే రూఢిగా తెలుపును. అదియే శ్రేష్టము.

## రంగునుబట్టి వ్యాధులు నిర్ణయించుట

సామాన్య మూత్రస్వభావము లేత ఎరుపురంగుగగాని, పలిరంగుగగాని, యుండును. ఒక్కొకప్పుడు ముదురు ఎరుపురంగుగానుండును. నలుపురంగుగానున్నచో వ్యాధి ఎక్కువగా నున్నదనియు, పలుచగానుండి కొంచెము తెలుపుగానున్న వాతరోగమనియు, పసుపుపచ్చగానుండి కొంచెము తెలుపుగానున్న వాతరోగమనియు, పసుపుపచ్చగానుండి ఎక్కువవేడిగానున్న జ్వరమున్నదనియు, మాంసము కడిగిననీరువలెనున్న మూత్రము వెంట రక్తము పోవుచున్నదనియు గ్రహించవలెను. మూత్రము పోయునపుడు భూమిమీద నురుగు బాగుగాకట్టును. ఏవ్యాధియు లేని పశువు మూత్రము తెలుపురంగుగానుండి అంతవేడియుండదు.

---

# భేషజకల్పము

## పదునొకండవ భాగము

ఓషధీర్నామరూపాభ్యాం జానతే హ్యజపా వనే
అవిపాశ్చైవ గోపాశ్చ యే చాన్యే వనవాసినః.

అరణ్యములందగు మేకలను గొఱ్ఱెలను ఆవులను మేపువారును, వనములందు నివసించు వారును, ఓషధుల యొక్క పేర్లను, వాటియాకారములను తెలిసికొని యుందురు.

ననామజ్ఞానమాత్రేణ రూపజ్ఞానేన వాపునః
ఓషధీనాం పరాం ప్రాప్తిం కశ్చిద్వేదితు మర్హతి॥

నామములను, రూపములను తెలిసికొనినంత మాత్రమున ఓషధులయొక్క సంపూర్ణజ్ఞానము నెవడును పొందజాలడు.

యోగవిన్నామరూపజ్ఞస్తాసాంతత్త్వవిదుచ్యతే
కింపునర్యో విజానీయా దోషధీః సర్వథా భిషక్॥

నామములను రూపములను తెలిసికొని ప్రయోగించు విధమును తెలిసికొనిన వాడు ఓషధులయొక్క తత్వములను తెలిసినవాడని చెప్పబడును.

యోగమాసాం యో విద్యాద్దేశ కాలోపపాదితమ్
పురుషం పురుషం వీక్ష్య సవిజ్ఞేయో భిషక్తమః॥

ఏ వైద్యుడు ఓషధులను సర్వవిధముల తెలిసికొనునో వాడు ఓషధులయొక్క తత్వమును తెలిసిన వాడని వేరుగ చెప్పవలయునా? ఎవడు ప్రతిమానవుని పరీక్షించి దేశకాలముల ననుసరించి ఓషధులయొక్క ప్రయోగమును తెలిసికొనునో వాడు భిషగ్వరుడుగ నుండును.

యథావిషం యథాశస్త్రం యథాగ్నిరశనిర్యదా
తథౌషధమ విజ్ఞాతం విజ్ఞాతమమృతం యథా॥

---

పాడి పశువును మిక్కుటముగా మేపరాదు.

తెలిసికొనకుండ ప్రయోగింపబడిన ఔషధము విషమువలెను శస్త్రమువలెను అగ్నివలెను పిడుగువలెనుండును. తెలిసికొని ప్రయోగింపబడిన ఔషధము అమృతము వలెనుండును.

ఔషధం హ్యనభిజ్ఞాతం నామరూప గుణైస్త్రిభిః
విజ్ఞాతమపి దుర్యుక్తమనర్థాయోప పద్యతే॥

నామరూప గుణములు ఈ మూడింటితోడను తెలిసికొనబడని ఔషధమును, తెలిసికొనియు సరిగా ప్రయోగింప బడని ఔషధము హానికలిగించును.

యోగాదపి విషం తీక్ష్ణముత్తమం భేషజం భవత్
భేషజం చాపి దుర్యుక్తం తీక్ష్ణం సంపద్యతే విషమ్॥

తీక్ష్ణమైన విషముగూడ సరిగా ప్రయోగింపబడినచో శ్రేష్ఠమైన ఔషధముగను, ఉత్తమమైన ఔషధముకూడ సరిగా ప్రయోగింపబడనిచో తీక్ష్ణమైన విషముగనగును.

తస్మాన్న భిషజాయుక్తం యుక్తిబాహ్యేన భేష్యజమ్
ధీమతా కించిదాధేయం జీవితారోగ్య కాంక్షిణా॥

అందుచేత జీవితమును ఆరోగ్యమును కోరునట్టి బుద్ధిమంతుడు యుక్తి తెలియని వైద్యునిచే ప్రయోగింపబడిన ఔషధము కొలదిగాకూడ గ్రహింపరాదు.

"చరక సంహిత"

సర్వాణ్యేవ చాభిన వాన్యన్యత్రమధు ఘృత గుడ పిప్పలీ
విడంగేభ్యః తేషాను సమ్మృత్తావతి క్రాన్తవత్సరాణా దదీతేతి॥

తేనె బెల్లము పిప్పలివాయు విడంగములు వీటిని విడిచి మిగిలిన వన్నియౌషధు లను నూతనములగువాటినే యుపయోగించినచో బలముగలవగును. తేనె మున్నగునవి చాలా పాతవియయినచో మిక్కిలి బలముగలవగును. అంతపాతవి దొరకనిచో నొక సంవత్సరము బూర్వపువైనను తీయవచ్చును. కాని ఒకసంవత్సరమునకు లోపుగా తీసినవి పనికిరావు. అనగా బలములేని వగుననిభావము.

"సర్వావయవసాధ్యేషు పలాశ లవణాదిషు
వ్యవస్థితో న కాలోస్తి తత్ర సర్వవిధీయతే"॥

---

దుక్కిటెద్దునకు బలకరమగు పదార్థములు పెట్టుము.

వేళ్ళు మొదలగు సర్వాతయవములను ఉపయోగించు నౌషధులను, ఆకులు, లవణములు మొదలగునవియును నియమిత కాలములేకుండ సర్వకాలములయందును దీసిన నుపయోగించును.

"విగన్ధేనా పరామృష్ట మవిపన్నం రసాదిభిః
నవం ద్రవ్యం పురాణం వా గ్రాహ్యామేవ వినిర్దిశేత్॥

దుర్గంధములేనివియు, రసాదులచే విపత్తును పొందినవియు, నగు ద్రవ్యములు క్రొత్తవిగానున్నను పాతవిగానున్నను గ్రహింపవచ్చును.

"ధూమవర్షానిలక్లేదైః సర్వర్తుష్వనభిద్రుతే
గ్రాహయిత్వా గృహే న్యస్యే ద్విధినౌషధసంగ్రహమ్॥"

పొగ, వర్షము, గాలి, తేమ, ఇవి యేఋతువునందును సోకకుండ గృహమునందు ఔషధసంగ్రహములను యథావిధిగాజేసి యుంచవలెను.

ప్లోతమృద్భాణ్డ ఫలకశఙ్కువిన్యస్త భేషజమ్
ప్రశస్తాయాం దిశి శుచౌ భేషజాగారమిష్యతే॥

వస్త్రఖండములు, మట్టికుండలు, పలకలు, కొయ్యలు, వీనియందుంచబడిన మందులకు నీరు తేమ సోకకుండ పరిశుభ్రముగాను చి మూర్పు లేక వృత్తగదిమ్కలందుంచినచో శ్రేష్ఠతనొందునవిగా నుండును. ("సుశ్రుత సంహిత")

ఊర్ధ్వ మాచ్ఛాదితే దేశే వస్త్రాదిద్రావ్యతేతథా
గృహేవా నిర్జనే పూతే భేషజం కారయే ద్బుధః॥

ఊర్ధ్వభాగమున నాలుగు పార్శ్వములయందు వస్త్రాదులచే కప్పబడియుండెడి ప్రదేశమునగాని, పవిత్రగృహమునగాని, జనసమూహములేని గృహమునగాని ఔషధములు చేయవలెను.

ఊర్ధ్వేముఖై శ్శిలాపుత్రైశ్శిలాయాం మర్దయేత్సదా
తదాహి ద్విగుణం వీర్యం స్యాదీశానముఖో యది॥

ఔషధములు నూరు రాతిని ఊర్ధ్వముఖముగా నుంచవలెను, ఈశాన్యముఖమున గూర్చుండి ఔషధమును ఖల్వమున మర్దించినదానికి ద్విగుణవీర్యము గలుగును.

"అనుపానమంజరి"

---

దూడలకు మలబద్ధకము లేకుండ కాపాడుము.



## ఔషధములు త్రాగించు విధానము

ఔషధములు త్రాగించునపుడు పశువుయొక్క తలను కొంత ఎత్తిపట్టుకొని నోరు తెరచి ఒక్కొక్క గొట్టమువంతున గాని అరగొట్టము వంతున గాని త్రాగింపవలెను. మందులు పోయునపుడు జాగ్రత్తగా పశువునోరు తెరచి నాలుక నొక్కిపెట్టి యుక్తిగా పోయవలెను. పశువుయొక్క తలను, మందుపోయుటకు వీలుగ నుండునట్లు ఎత్తిపట్టి పశువు అటునిటు తూలకుండునట్లు చూచి మందుత్రాగించవలెను. కొన్ని పశువులు అల్లరిచేయుచు, అరచుచు క్రిందపడును. అట్లు పడుటవలన పశువునకు అపాయము కలుగుటయేగాక ఆహారనాళమునకు దవుడలకు దెబ్బలు తగులును. కాబట్టి మందులు త్రాగించునపుడు జాగ్రత్తగా పశువును చూచుచుండవలెను. దగ్గునట్లు పశువు కనబడినచో పట్టువిడచి దగ్గనిచ్చినతరువాత మందు నోటిలో పోయవలెను. వ్యాధిగల పశువునకు ఒకేసారి ఆహారమంతయు పెట్టరాదు. కొంచెముకొంచెముగా పెట్టవలెను. ద్రవరూపముగల మందులుగల సీసాలను (Bottles of Liquid medicines) చేతిలో కుదిపి త్రాగించవలెను. పాత్ర అడుగుభాగమున మడ్డియున్నచో దానిలో కొంచెము నీరుపోసి త్రాగించవచ్చును. దీర్ఘ (Colic) వ్యాధులకు తప్ప ఆకస్మిక వ్యాధులకు ఎక్కువగా మందులను

---

కండ పొదుగుగల పశువు అంత మంచిదికాదు.

వాడరాదు. అట్లు వాడినయెడల పశువునకు ప్రాణాపాయము కలుగును. పశువు మిక్కిలి బలహీనముగానున్నయెడల ఆహారము తినుటకుగాని త్రాగుటకుగాని లేవదీయరాదు. అది లేవలేదను యుద్దేశముతో శరీరముపై దెబ్బలు కొట్టరాదు. త్రాళ్లతో నటునిటులాగరాదు. బలవంతముగా నటునిటు త్రోయరాదు. పరుండనిచ్చియే నెమ్మదిగా ఆహారము పెట్టవలెను. అన్నివ్యాధులయందును ముఖ్యముగ తీవ్రదశ (Predomining stage) యందున్నపుడు కఠిన పదార్థములను మాత్రము వాడరాదు.

ఇంతియేగాకుండ మందులు శరీరములోనికిపోయి త్వరగ జీర్ణము కావలెననిన ద్రవరూపముగు మందు (Liquid of medicines) అను పోయవలెను. మందు వృథాగా పోకుండునట్లు చేయుటకును నెమ్మది నెమ్మదిగ కొంచెముకొంచెముగా వెదురుగొట్టము లతో పెట్టవలెను.

## వెదురుగొట్టములు ఉపయోగించుట

సామాన్యముగా పల్లెటూళ్లలోని రైతులు వెదురు గొట్టములతోగాని ఇత్తడి గొట్టములతోగాని మందులు పోయుదురు. ఈ గొట్టములు నునుపుగ వెడల్పుగ అంచు పొడవు లేకుండునట్లుగ తయారు చేయించి వాడుట మంచిది. గొట్టములు గరుకుగ చివరభాగము సూదిమొనవలెనున్నచో పశువుఅంగిటికి నాలుకకు గ్రుచ్చుకొని గాయములు (Wounds) పడును. కాబట్టి గొట్టములు నునుపుగనుండి చివరభాగము వెడల్పుగ నుండుటమంచిది.

గొట్టములను వాడునపుడు లోపల పురుగులు, చేళ్ళు, బూజు పగ్గరాలు లేకుండ చూచి మందులుపయోగించవలెను.

## సీసాలను ఉపయోగించుట

గొట్టములకంటె సీసాలతో పోయుటకూడ మంచిపద్ధతియైయున్నది. ఇట్లు పోయుటవలన పశువునోటిభాగమునకు అపాయములు రావు. సీసాను నోటిలోనుంచి పోయునపుడు అది బ్రద్దలుకాకుండ చూడవలెను. తలను మెడకు సమానముగ ఎత్తి పెట్టవలెను. మందులనువాడు సీసాలు కొంచెము పొడవుగ నుండవలెను. మందులను త్రాగించునపుడు అజాగ్రత్తగానుండిన యెడల అనేకవిధములగు ప్రమాదములు సంభవించును.

## సాంక్రామికవ్యాధులలో మందులు త్రాగించుట

## (Administration of medicines in contagious diseases)

పెద్దరోగము, కురమ, గాలికుంటు మున్నగు వ్యాధులలో అవుసరమున్నపుడే మందులనియవలెనుగాని అనవసరముగా నెల్లవేళలనీయరాదు. అంటువ్యాధులుగల పశువు

---

అంటురోగముగల పశువును దూరముగా నుంచుము.

లకు వాడు గొట్టములు, సీసాలు, తదితరపాత్రలు ప్రత్యేకముగా నుండవలెను. అప్పుడప్పుడు వగరునీటితో పనిముట్లను కడుగుచుండవలెను. వైద్యుడు చెప్పినరీతిగా పథ్యాపథ్యములు చేయించుచుండవలెను. అవసర మున్నపుడు ముక్కురంధ్రముల ద్వారా మందుల నుపయోగించవచ్చును.

## తత్వములనుబట్టి మందులు వాడుట

## (Administration of medicines according to constitution)

కొన్నిపశువులు ఆశ్చర్యకరమగుగుణములు కలిగియుండును. కొన్ని పశువులు మందును సరిగా జీర్ణముచేసికొనును. మరికొన్ని అట్లుగాక మందులనుసరిగా జీర్ణముచేసికొనక సరియైనఫలితముకలుగనీయవు. కాబట్టిఒక్కొక్కప్పుడొకే [illegible] వాడినను ఆపశువుయొక్క తత్వమునుబట్టి వానిఫలితము కనబడును. దీనినే పశువుయొక్క గుణతత్వము లందురు. ఒక్కొక్కప్పుడు పొక్కు (Blisters) మందులు వాడినప్పుడు అతిగా పనిచేసి కొంచెము నష్టము కలిగించును. కొన్ని పశువులకు విషపుమందులు పెట్టినను జీర్ణము చేసికొని ఎట్టిహానికి పాలుగావు.

## పశువుయొక్క వయస్సునుబట్టి మోతాదులు వాడుట

## (Dosage according to age)

కొందరు వైద్యులు మందులను సుమారుగ తూచకుండగనే వాడుదురు. ఇది చాల పొరపాటు. మోతాదు ఎక్కువపడవచ్చును. లేక తక్కువపడవచ్చును. కాబట్టి తగుజాగ్రత్తవహించి సరిగామాది మోతాదులను వాడుట మంచిది. పెద్ద పశువులకంటె చిన్నపశువుల విషయమై చాల జాగ్రత్తగా వాడవలెను. విషపుమందులను మాత్రము అతిజాగ్రత్తగా వాడవలెను. బలముగల పశువులకు మోతాదు నెక్కువ చేయుటవసరము.

## మోతాదుల నిర్ణయము

మనుష్యులకు వాడు మోతాదులకంటె పశువులకు నెక్కువగా నీయవలెను. మనము నోటిద్వారా పోసినమందు ఒకమార్గమునుంచి మరియొకమార్గమునకు పోవుచు చాల ఆలస్యముగా నాలవపొట్టలోనికి చేరును. కాబట్టి ఆవిధముగా వాడబడు మందులు చాల ఆలస్యముగ పనిచేయును. అదియునుగాక ఆమందు నాలుగవతిత్తిలోనికి పోయి పనిచేయునప్పటికి అప్రాంతములందుండు జీర్ణముకాని పదార్థమంతయు ఆమందు చేయబోవుపనికి అడ్డగించుచుండును. అందుచేతకూడ నోటిద్వారా వాడినమందులు వ్యాధిని చాల ఆలస్యముగ శాంతింపజేయును.

పశువులయందు మానవులకంటె చురుకుదనము తక్కువగ నుండును గాన పెద్దపెద్ద మోతాదులుగా విరేచనముల మందుల (Purgatives) నీయవలెను. అట్లు యిచ్చిన

---

రోగము లన్నిటిలో శురక ప్రమాదకరమైనది.

యెడల అది పుందమతిగా నుండుటచేత భరించుకొన గలిగియుండును. మోతాదుల హెచ్చుతగ్గులనుబట్టి మందులు పనిచేయును. భేది ఉప్పు కొంచెముకొంచెముగా యిచ్చిన యెడల విరేచనము సరిగాకాదు. ఈయవలసిన మోతాదుకంటె తక్కువ యిచ్చినయెడల దానివలన నేమియు ఫలితము కనబడదు. అప్పుడు వైద్యుడు గ్రహించి మరల మందు యిచ్చునప్పుడైనను తగిన మోతాదు నిచ్చునెడల ఫలితము కలుగును.



ఔషధనిర్ణయము చేయుటకు సాధనములు

ఏవ్యాధి కేమందుగునీయవలెనో నిర్ణయించుటయె ఔషధనిర్ణయము (Prescription) అనబడును. పశువైద్యులందరును తమయొద్ద నొకపుస్తకము నుంచుకొని దానిలో తాము యేయే పశువునకు యేయేసమయమునందు ఏవ్యాధికి ఎంత మోతాదు నిచ్చినది, లేనిది విడివిడిగ వ్రాసుకొనుచుండవలెను. శస్త్రము చేసినప్పుడు యేరీతిగ చేసినది, యేమందులు వాడినది వ్రాసికొనవలెను. దినమునకు వారమునకు సంవత్సరమునకు యేయేవ్యాధులలో యెట్టి చికిత్సలు చేసినది ఎన్ని చచ్చినవి మున్నగు విషయములు ప్రత్యేకముగా ఒక బుక్కుమీద వ్రాసియుంచవలెను. ఇతర గ్రామములకు వెళ్ళినపుడు ఒక ప్రత్యేక బుక్కు యుంచుకొనవలెను. పైవిషయము లన్నియు వ్రాసికొనిన యెడల తా నేపైన మందులు

---

నూతికొవాతముగల పశువునకు వెంటనే చికిత్స చేయుము.

వాడుటలోగాని లేక మందులు యిచ్చుటలోగాని తప్పుచేసినయెడల దిద్దుకొనుటకు వీలుండును. రోగనిర్ణయము చేయుటయే దుర్లభము. అట్లు చేసినప్పటికి ఆ రోగము నకు యేవిధమగుమందు వాడవలెనో జాగ్రత్తగా పరిశీలింపవలయును.

## ఔషధములను కలుపుట

ఔషధములను ఉపయోగించునపుడు జాగ్రత్తగా పరిశీలించి సరియైన మోతాదు (Dose) తీసికొని కలిపి పశువున కీయవలెను. లేనియెడల నష్టము హానియు కలుగును. రోగనిర్ణయము స్పష్టముగా గ్రహించినతరువాత ఆచికిత్స చేయవలసిన విధానము బాగుగా అర్థమైనయెడల ఎక్కువ మందులను కలుపవలసిన అవుసర ముండదు. ఒకొక్కప్పుడు వైద్యుడు తాను అనేకమందులను కలిపియిచ్చినచో వ్యాధికుదురునని తలంచి అట్లు కలిపి యిచ్చును. డాబుసరి చేయును. కాని దానివలన లాభము కలుగకపోవుటయేగాక నష్టము కలుగుటయో హాని కలుగుటయో సంభవించును. కావున మందులను ఇచ్చుట యందు అనుభవముండవలెను. ఇట్టి మందులను కలుపుటకు కొంతవరకైనను జ్ఞానము యుండవలెను.

## ఘనపదార్థములను వాడుట

మందులను ఉపయోగించువిషయములలో బాగుగా తెలిసికొనియుండి అనుభవము కూడ కొంతవరకు సంపాదించియుండవలెను. ద్రవపదార్థములుగాక ఘనపదార్థములువాడు నపుడు మాత్రల గూపమున [illegible] లో మందు వాడుటకు పూర్వము పశువులోపలి భాగమున నున్న తక్కువపదార్థమంతయు వెడలగొట్టి తరువాత మందు నుపయోగింపవలెను. అనగా విరేచనములకు మందీయవలెను. ఇదివరకువలెగాక ఇప్పుడిపుడే నూతనరకముల మాత్రలు, టానిక్సు (Tonics) వచ్చుచున్నవి. ఇవి పశువుమ్రింగుటకు వీలగు పరిమాణము కలిగి వానిపైన ఒకవిధమగు పదార్థముచే కప్పబడియుండును. ఘన పదార్థములను మెత్తగా నూరియో, లేక నీటిలో నానవేసియో, ఔషధములలో కలిపి వాడుట మంచిది.

## రసములు (Tastes)

తీపి, పులుపు, ఉప్పు, చేదు, కారము, వగరు అని షడ్రసములు. తీపి, పులుపు, ఉప్పు వాతతత్వమునకును; చేదు, వగరు కారము శ్లేష్మతత్వమునకును వైరుధ్యమును కల్పించును. వగరు, చేదు, తీపి రసములు పిత్తవ్యాధుల శమింపజేయును. ఉప్పు, పులుపు, కారము పిత్తరసము ఎక్కువగా నూరునటుల జేయును.

తీపి (Sweet) పుంస్త్వమును వృద్ధిపరచును. పాల నెక్కువచేయును. కన్ను లకు చలువజేయును. శ్లేష్మమును నెక్కువగా బుట్టించును. దీనినే మధురరసము లేక స్వాదురసమందురు.

---

పులుపు (Sour) దీనినే ఆమ్లరసమందురు. ఉష్ణమును గలుగజేయును. వాతరోగముల పోగొట్టును. మలబద్ధకమును హరింపజేయును. జీర్ణశక్తిని కలిగించును.

ఉప్పు (Salt) దీనినే లవణరసమందురు. ఎముకలకు బలము కలిగించును. పిత్త శ్లేష్మముల హరింపజేయును. విరేచనము గావించును. క్రిమిని చంపును.

కారము (Pungent) దీనినే కటురసమందురు. ఇది ఉష్ణకారిగా నుండును. రక్త రోగములను హరింపజేయును. పాలను తగ్గించును. జఠరాగ్ని కలిగించును. దీనినే ఊషణరసమందురు.

చేదు (Bitter) దీనినే తిక్తరసమందురు. రక్తరోగముల తొలగించును. విష పురుగుల కాట్లకు పనిచేయును.

వగరు (Astrigent) దీనినే కషాయరసమందురు. ఇది గాయములను మాన్పును. విరేచనముల కట్టించును. చర్మము మృదువుగా నుండునటుల జేయును.

## ఔషధములు చేయుట

## (Preparation of medicines)

వ్యాధికి తగినమందును తయారుచేసి అవసరమగు నెడల కొన్ని వనమూలికలను దానితో కలిపి ఒకే మందుగా చేయుదానికి ఔషధము (Medicine) అనిపేరు. ఇది అనుభవముమీదనే చేయవలెను. వైద్యుడు మందులను చేయుటలో కూడ జాగ్రత్త వహించి యుండవలెను గాని వాటిని ఉపయోగించునపుడు అతి జాగ్రత్తతో నుండవలెను. ఔషధములు చేయుటలో పూర్వపద్ధతికి ఇప్పటిపద్ధతికి చాల వ్యత్యాసముగలదు. పూర్వమువలె యేమూలికల నుండియో లేక యే యితర పదార్థములనుండియో మనము స్వయముగ మందును తయారు చేసికొన నవుసరములేదు. రసాయన శాస్త్రజ్ఞులే మనకు మందులలో నుండు మురికిని తీసివేసి వాటిని సరియగు స్థితికి తెచ్చిపెట్టుచున్నారు. కాని పశువైద్యులు అవసరమునకు ముందు ఒక్కసారిగ మందులను తయారు చేసికొనవచ్చును. అట్లు చేసినయెడల ఆకస్మికముగ వచ్చు వ్యాధులకు కాలయాపన చేయక త్వరత్వరగ చేయుటకు వీలుగనుండును. ఆకుపసరులను ఒకపూటకంటె నిలువ యుంచరాదు. అట్లుంచిన యెడల పశువులకు మరియొక క్రొత్తవ్యాధి కలుగవచ్చును.

## లేపనము చేయుట

## (Application to the skin)

ఔషధములను కలిపి వ్యాధిగల ప్రదేశములందు ఉపయోగించుదానికి లేపనము అందురు. కొన్నిమందులను ఆముదముతోగాని, వ్యాసులైనుతోగాని, వెన్నతోగాని కలిపి పశువుయొక్క అస్వస్థభాగమునకు ఇంకునటుల రుద్దవలెను. ఇంకను వాపులను

---

రేజీకటిగల పశువును చీకటిలో నుంచుము.

తగ్గించుటకుకూడ ఈ లేపనము బాగుగా పనిచేయును. లేపనము రోగముల నశింప జేయును. ఎక్కువగా లేపనము చేసినచో శరీరకాంతిని పెరచును.

## క్షారకర్మ

## (Application of caustics)

వ్రణమును గాలించు మందులను రాచుటకే క్షారకర్మ లేక పొక్కుమందులు వేయుట యందురు. కత్తులను కోయుట కంటె క్షారౌషధములను వాడుటే ప్రాశస్త్య మగు నెంచుదురు. జిల్లేడు, చిత్రమూలము, ఆవాలు మున్నగువానిని ఉపయోగించుదురు. ఇంతియే గామండ ఉత్తరేణి దంటుమని, పరిగడ్డిమని, మున్నగువాటిని క్షారౌషధము లుగా తయారుచేసి లోపలికికూడ వాడవచ్చును,

## సీసాలపైన చీట్లు

## (Lables upon bottles)

మందులుండు ప్రతి సీసాపైనను ఆమందుయొక్క పేరును ఆచికిత్సాలయము పేరును వరుసనెంబరును ఒక చీటిమీద వ్రాసి అతికించవలెను. ఏదైన విషపుమందు (Poisonal medicine) ఉన్నయెడల ఆసీసాకు ప్రత్యేకముగా ఒకరంగుకాగితము మీద దానిపేరు వ్రాసి అతికించవలెను. కొంచెము విషసంబంధమైనట్టియు ఘాటయినట్టియు మందు లను పశువు యజమానునికి వాడుట కిచ్చినప్పుడు ఇవ్వవలసిన మోతాదులకంటె ఎక్కువ వాడినయెడల అపాయము (Danger) కలుగునని చీటివ్రాసి దానిమీద అతికించి యజ మానునికిగూడ నొక్కిచెప్పవలెను. వివిధములగు తైలములు, ద్రావకములు, చూర్ణములు, కషాయములు యున్న సీసాలకు వివిధరంగుల చీటీలు అంటించిన యెడల వైద్యులు తొందరపనులమీద నున్నపుడుగూడ పొరబాటు పడుటకు అవసరముండదు. విషసంబంధ మగు మందుల నన్నిటిని యితరమందులతో కలిపియుంచక ప్రత్యేకభాగమునందుంచ వలెను.

## పనిముట్లను శుభ్రముగా నుంచుట

సీసాలనుంచు బీరువాలను వారముదినముల కొకసారి పరిశుభ్రము చేయుచుండ వలెను. బీరువాలయందు అద్దములను శుభ్రముగా తుడుచుచుండవలెను. రంధ్రములుపడిన సీసాలను తీసివేయవలెను. ప్రతిదినము నుపయోగించుమందులను, పనిముట్లను ప్రత్యేక ముగా ఒకబీరువాలో నుంచవలెను. శస్త్రము చేయు పనిముట్లను కొలతగ్లాసులను ఉప యోగానంతరము పరిశుభ్రముగా కడిగి తిరల నుపయోగించుటకు సిద్ధపరచుకొన వలెను.

---

మందు పోయునప్పుడు దగ్గకుండ చేయుము.

## లేహ్యములు

## (Electuary)

పశువునాలుకతో నాకించి చప్పరింపజేసి తినిపించు వానికి లేహ్యములందుము. ఔషధ ద్రవ్యములను మంచిబెల్లము, కల్లుబెల్లము, తేనె మున్నగు మధురద్రవ్యములతో చేర్చి చప్పరింపజేయ దగినవిగ తయారుచేయబడు ఔషధములకు లేహ్యములు (Electuary) అందురు. వీటిలో కొంచెము పలుచగ తయారుచేయబడు ఔషధములు కూడ కలవు. లేహ్యములను జేయుటకు ఔషధచూర్ణము, బెల్లము, ద్రవము, తేనె, ఇతర ద్రవ్యములు కావలసియుండును. ఇంకను ఇందులో వేయబడు చూర్ణములు (Powders) అన్నియు వస్త్రగాళితములుగనే యుండవలెను.

లేహ్యములను తయారుచేయుటకు జిగురు వచ్చునట్లు తయారుచేయబడిన పాకముఅవసరము. లేహ్యములను జేయుట యందుగాని, యేయితరఔషధములను జేయుట యందుగాని పనిచేయు వైద్యుడు పనివారలును వివిధమైన చర్మరోగములు లేని వారుగను, చేతులు పరిశుభ్రముగ కడుగుకొనిన వారుగను నుండవలెను.

## వెంటవెంటనే మందులువాడుట

## (Repeated doses)

ఔషధములు వాడినయెడల అవి చేయుపని మంచి ఫలితముతో కూడుకొని యుండును. కొన్ని మందులను ఒకసారికంటె మరియొకసారి ఎక్కువ యిచ్చినయెడల వానివలన లాభమేమియు కలుగదుగాని పశువుమాత్రము ఓర్పు వహించును. పాషాణము అను విషపుమందును తక్కువయేగదాయని కొద్ది కొద్దిగ వాడినను కొంతకాలమువరకు యేవిధమగునష్టము కనపడదు. కాని కొంతకాలమునకు ఆకస్మికముగా ప్రమాదము సంభవించును. అప్పుడు మరల జాగ్రత్తగా పశువును బరిశీలించి తగిన విరుగుడుమందు అను వాడినయెడల దానిని అపాయస్థితినుండి కాపాడవచ్చును.

## తూనికలు, కొలతలు

## (Weights & Measures)

ఔషధములు తూచుటయందు బహు ఖండితములుగా నుండవలెను. పశువులకు రెండునుంచి 3 ఔన్సులకంటె నెక్కువగ తూచుట యెన్నడును సామాన్యముగ దటసించదు. కొన్ని విషయములలో డ్రాముపరకు మాత్రము తూచుటయు మరికొన్ని విషయములలో గ్రెయినుపరకు మాత్రము తూచుటయు తటస్థించుచున్నది. ఈ తూనికకొరకై ప్రత్యేక త్రాసులుండును.

---

ఔషధములు కొలుచుట తేలికయైనపనియే యైనప్పటికిని దీనియందును జాగ్రత్తయు నలవాటును యుండవలయును. ఈ కొలతలు గుర్తుపెట్టుటకు గాజుగ్లాసులు అమ్మబడును. ఆ గ్లాసుల కిరువైపుల కొన్ని గుర్తులు వేసియుండును. కొలతిగ్లాసును ఎడమచేతియొక్క బొటనవ్రేలునకును, పిమ్మటి రెండువ్రేళ్ళకును మధ్యగా బట్టుకొని కంటితో సమానమైన యెత్తునకు దీసికొని రావలెను. ఏ సీసాలోనుండి మందును పోయవలెనో ఆ సీసాను కుడిచేతితో పట్టుకొని దానియొక్క మూతను ఎడమచేతి చిన్నవ్రేలుతో బట్టుకొని యుండవలెను. ఈ మూత నీప్రకారము బట్టుకొనుటకై కొంతవరకు నలవాటు కావలయును. కాబట్టి అట్లు జేయుటలో జారవిడిచి దానిని పగులగొట్టు అపాయమునుండి తొలగుటకుగాను కొలుచునపుడు దానిని విడిగా నుంచుట యుత్తమము.

## ఔషధము లిచ్చువేళలు

## (Times of Administration of medicines)

వైద్యుడిచ్చినమందులను యజమాని చాల జాగ్రత్తగానుంచి ప్రతిదినము నిర్ణయ కాలమునకు పశువుకు బలవంతము చేయక సాధ్యమైనంతవరకు అది యిష్టముతో గ్రహించునట్లు చేయవలెను. కొన్నికొన్ని మందులు పశువులకు ఉదయమునను, కొన్నిటికి మేత మేసినతరువాతను, మరికొన్నిటికి మేత మేయునపుడును, మరికొన్నిటికి ఎల్లవేళల ఈయ వలసి యుండును.

## ద్రావకములను కలుపుట

చిన్నదూడలకు ద్రావకములు కలిపి వాడవలసి వచ్చినపుడు కొన్ని షరబతుల వంటి తీపిపదార్థములు కలిపి యిచ్చినయెడల అది ప్రీతితో త్రాగును. కర్పూరతైలము మొదలగు వెగటువస్తువులు వాడవలసి వచ్చినపుడు పాలు మున్నగువానిలో కలి త్రాగించవలెను. సీసాలలో పోసియుండు మందులు ఒక్కొక్కపుడు అడుగున పేరు కొని యుండునుగాన మందును వాడునపుడు సీసాను బాగుగా కదల్చి పేరుకొనిన దానిని బాగుగా కరుగజేసి తరువాత వాటిని వాడవలెను. అట్లుగాకపోయినయెడల సరియైన మందు అంతయు అడుగున పేరుకొని పోవుటచేత పైనయుండు సారహీనభాగమును వాడుటచే యిసుమంతయును లాభముండదు.

## శీతోష్ణస్థితినిబట్టి మందులు చేయుపని

నిద్రను కలుగజేయునట్టి మత్తుపదార్థములు చల్లని ప్రదేశములలోకంటె వేడిగానుండు ప్రదేశములలో త్వరగా పనిచేయును. పచ్చికమీద ఆధారపడు పశువులకు ఇతర జంతువులకన్న మత్తుమందులు త్వరగా పనిచేయును.

---

విరిగిన భాగమును జాగ్రత్తగా కట్టుకట్టుము.

## ప్రేగులలో మందులు చేయుపని

పశువునకు విరేచనములకు మందిచ్చినతరువాత అది లోపలకు పోయి ప్రేగుల (Intestines) లో నుండు మలమునంతయూ బయటకు పోవునట్లుచేయును. ఈక్రింద చెప్పినరీతిగా పనిచేయును. పశువు జీర్ణము జేసికొనగా ప్రేగులలో మిగిలిన పిప్పిని ఈ విరేచనపుమందు బయటకు పోవునట్లు చేయును. ఉప్పుగానుండు విరేచనపుమందు ఆహారనాళములోని ద్రవము హెక్కువజేయును. భేదిమందులను కొన్నిరకములుగ తయారుచేయుటకు పశువైద్యశాస్త్రజ్ఞులు (Veterinary doctors) ప్రయత్నించిరి గాని అవి నేటివరకు సిరపడి యుండలేదు. ఈ క్రింద చెప్పిన భేదిమందులను చాల మంది పశువైద్యప్రవీణులు మంచివిగ సెలవిచ్చుచున్నారు.

ఆముదము, నేపాళనూనె, అవిసెనూనె, సామాన్య భేదిమందుగా వాడవచ్చును. ఇవి త్వరితముగ నెమ్మదిగ విరేచనముల కలుగజేయును. ఆముదమును సామాన్యముగా పశువులకే వాడుదురు. కాని దానిని దూడలకుకూడ వాడవచ్చును. భేదిమందులను వాడినయెడల ప్రేగులలో నిలువయున్నదానిని బయటకు త్రోసివేసి ఆ భాగమును ఖాళీచేసి శుద్ధిపరచును. నేపాళనూనె, దుష్టుపాలుపసరు, గురిగింజవేరు, ఆకుపసరు మున్నగునవి ప్రేగులపైనుండు కండరములను బాగుగా ముడుచుకొనునట్లు చేయును. ఆ మందులు వాడినప్పుడు అప్పుడప్పుడు బాధ కలుగును. వీని నియమంచిన మోతాదు కంటె ఎక్కువ యిచ్చినయెడల కొంచెము నష్టము కలుగును.

## మోతాదులిచ్చు క్రమము

గుఱ్ఱమునకు 1 మోతాదు, పశువునకు 1½, గొఱ్ఱెలకు మేకలకు $\frac{1}{8}$ వంతున ఈయవచ్చును. గుఱ్ఱమునకు మూడేండ్లున్నపుడును, పక్కడు ఒక సంవత్సరమున్నర, పశువులకు గొఱ్ఱెలకు రెండేండ్లున్నప్పుడును పూర్తిమోతాదు ఈయవచ్చును.

ఒక నెలనుంచి మూడునెలలవయస్సు గల జంతువులకు పూర్తిమోతాదుమాత్రమే ఈయవలెను. జంతువు పెద్దదగుకొలది మోతాదు క్రమముగ హెచ్చించవచ్చును. వేడిగల ప్రదేశములలో ప్రమాదముగు అనగా విషముగు వనమూలికల మోతాదును తగ్గించి వాడవలెను.

## నస్యములు

## (Using Snuffs)

ఔషధములను ముక్కురంధ్రములలో పిండుట, ముక్కురంధ్రములతో పీల్పించుట అనుదానికి నస్యకర్మ (Snuff for inhalation) అందురు. తొంగబంతి, పీనస, రొంప మున్నగురోగములకు త్రిఫలచూర్ణముతో పీల్పించి తుమ్ములు వచ్చునట్లు చేయవలెను.

---

ఇంకను శిరోవాతము, మూర్ఛ, ఘ్రాణేంద్రియశక్తి నశించుట, ఊర్ధ్వశ్వాసరోగము మున్నగువాటికి నస్యకర్మ చేయింపవలెను. ముక్కులలో పురుపులు, ముక్కుమాద, ముక్కుపీనస మున్నగు వ్యాధులలో ఆవుపసరులు, కారముగల ద్రవపదార్థములు పిండ వచ్చును. నస్యములు చేయించుట విషయములలో రోగ నిదానము గ్రహించి అవసరా నవసరములనుబట్టి ఉపయోగించవలెను.

## ధూమము (Using smokes)

పొగను ముక్కురంధ్రములగుండ నోటిగుండ పీల్పించుదానికి ధూమము అందురు. రొంప, ఊర్ధ్వశ్వాసరోగము, న్యూమోనియా. క్షయ, ఉబ్బసము, ముక్కులనుండి నీరు గారుట, ముక్కురంధ్రములలో దుర్గంధము, దవుడలు బిగబట్టుట, మెడనరములు బిగ బట్టుట, దంతములు దుర్బలములుగ నుండుట, తుమ్ములు, వనికిపాట్లు, శిరోరోగములు మున్నగువానికి ధూమపానము నుపయోగించుట మంచిది. ఒక్కొక్కసారి మూడు నాలుగు పర్యాయములు పీల్పించవలెను. సాంబ్రాణి, కర్పూరతైలము, యూకలిప్టస్ ఆయిల్, ముద్దకర్పూరము, వసపొడి మున్నగునవి పొగకు వాడవలెను.

హృదయము, మెడభాగము శిరస్సుభాగములు ధూమమునకు స్థానములు. అధికముగగాని అకాలమునందుగాని ధూమము చేయించినచో నేత్రరోగములు మొదటి రోగములు సంభవించును. పశువునకు విరేచనములకు మందిచ్చినపుడు, ఎనిమా చేసి నపుడు, విషసంబంధమైన పదార్థములు తినినప్పుడు, చూడిగానుండు పశువులకు ఆకలి, దప్పికగానున్నపుడు, కంతులు, గాయములు, శస్త్రము, మున్నగు వానియందు ధూమ పానము చేయరాదు. శిరస్సునందును, ముక్కురంధ్రములందును, నేత్రములందును దోషముయున్నచో ముక్కురంధ్రముల (Nostrils) గుండను, కంఠము నాశ్రయించి యున్నచో నోటిగుండను ధూమము పట్టించవలెను.

## అంజనము
## (Eye salve)

కన్నులలో కలికము వేయుట, కాటుకవలె మందును కండ్లలో పెట్టుట మున్నగు వాటికి అంజనము అందురు. పశునేత్రాంజనము నేత్రములకు హితకరమైనదిగ నుండును. అందువలన దానిని ప్రతిదినముకు నేత్రములయం దుపయోగింపవలయును. నేత్రముల యందలి దుష్టజలమును స్రవించిపోవుటకు వారము లేక పక్షముదినములకు ఒకసారి నేత్రములయందు ప్రయోగింపవలయును. నేత్రములు తేజస్వరూపములుగ నుండునుగాన వానికి శ్లేష్మము వలన భయము కలుగుచుండును. అందువలన శ్లేష్మహరమైన కర్మను చేసినచో నేత్రములకు నిర్మలత్వము కలుగును. నీరు స్రవించిపోవుటచే దుర్బలముగ నుండి దృష్టికి సూర్యునివలన బాధకలుగుచుగాన పగటియందు తీక్ష్ణమైన అంజనమును

---

నిమిషమునకు 34 నుంచి 40 వరకు నెమర్లు వేయును.

నేత్రములయం దుపయోగింపరాదు. అందువలన స్రవింపజేయు నట్టి అంజనమును రాత్రియందే ప్రయోగింకవలయును. నిర్మలమైన ఆకాశమునందు చంద్రునివలె నిర్మలమైన నేత్రములయందు దృష్టి అడ్డులేనిదై ప్రకాశించును. నేత్రరోగములకు, మందమతి, శిరోభారము మున్నగు వ్యాధులకు అంజనముచేయుట మంచిది.

## గండూషము

కషాయములు మున్నగు ద్రవపదార్థములను నోటికి, నాలుకభాగమునకు పుక్కిలింపు చేయుటకు గండూషము (Gargles) అందురు. నోటిలో పరుపులు లేచినపుడు, విషపువస్తువులు తినినచో పొక్కినపుడు, కఫరోగములయందు, నోరు దుర్గంధముగా నున్నపుడు పటిక, మాచికాయ, తుమ్మచెక్క, నేరేడుచెక్క మున్నగు కషాయములను వాడవచ్చును. ఇట్లు వాడినయెడల దవుడలకు బలముకలుగును. జిహ్వేంద్రియము (Tongue)రసములను బాగుగా తెలిసికొనును. ఈ ఆహారమందు రుచికలుగును. ఆహార నాళము (Alimentary canal) ఎండదు. పెదవులు (Lips) పగులవు, దంతములు క్షీణింపవు.

## శిరోమర్దన

## (Application to the head)

పశువు రెండుకొమ్ముల మధ్యను, భాషికవు నూడిపడ్డను, మచ్చిలిగుంటపడ్డను తైలము పూసి చేతితో మర్దనచేయుటను శిరోమర్దనమందురు. శిరస్సునందు తైలమును పూసినచో పుర్రెఎముకల (The head and its bones) కు అధికమైన బలము కలుగును. వెంట్రుకలు దృఢమైనవగుల్లుకలవిగ నుండును. ఇంకను ఇంద్రియములు నిర్మలముగనుండును. చర్మము మంచి కాంతి గలిగియుండును. నేత్రమునకు చలువచేయును. పునులు తగ్గును. నల్లపశువులకు చమురు పూయుటవలన తోలు, శరీరము గట్టిపడి మంచి చర్మము కలదిగనుండును. మరియు వాతమువలన బాధపొందదు. కష్టములను వ్యాయామమును (Exercise) సహించును. అన్నిపశువులకు వాతమువలన వేడిమివలన నేత్రములకు జబ్బు చేసినపుడు చిట్టాముదము గోరువెచ్చగాకాచి మెదడునకు మర్దన చేయుట మంచిది.

## వేడికాపులు తీయుట

## (Application of heat to the skin)

పశువునకు దెబ్బలు తగిలినపుడు, బెణికినపుడు, వాపులకు, వాతనొప్పులకు, నరములసంబంధమైన రోగములకు, శరీరములో నుండు స్వేదనము (చెమట)ను తీయుటకు, వేడికాపులు తీయుట మంచిది.

---

మాదలన్నిటిలో కొమ్ముమాద ప్రమాదమైనది.

ఇసుకనుగాని ఉప్పునుగాని కాచి గోనెపట్టాలోగాని, మరకగుడ్డలోగాని వేసి కాపులు తీయవచ్చును. ఎక్కువవేడిగా నుండునట్లు కాచక సమానవేడిలో నున్నప్పుడే కాపులు తీయవలెను. ఇంకను నూనెనుకాచి నిమ్మకాయలో కాపులు తీయవచ్చును. నీటిలో తురకవేపాకు, గాడిదగడపాకు వేసి సలసల కాగనిచ్చి గోరు వెచ్చనినీటితో వాతరోగములకు శరీరమంతటికి దినమునకు రెండుమూడుపర్యాయములు పట్టించవచ్చును. ఎక్కువగా వేడికాపులు తీయరాదు. అట్లు తీసినచో శరీరములోనుండు భాగములు కమలును. అవసరమున్నపుడు తైలములు రాచికూడ వేడికాపులు తీయవచ్చును.

## చూర్ణములు (Powders)

కొన్ని మందులను చూర్ణముల రూపమున పశువునకీయవలసియుండును. చూర్ణములయందుపయోగింపబడు మూలికలన్నియు సాధ్యమైనంతవరకు క్రొత్తవిగను, పుచ్చనివిగను, తమ స్వరూపస్వభావములు కలవిగను నుండవలెను. ఆ యా చూర్ణములకు చెప్పబడిన వస్తువులను భాగముల ప్రకారము ప్రత్యేకముగాతూచి ఏకముగకలిపి రోటియందుంచి వెడల్పుమూతిగలపాత్రకు వస్త్రమును గట్టి దానిద్వారా పాత్రిలోనికి పడునట్లు చూర్ణద్రవ్యములపై నాలుగు వ్రేళ్ళతో సరిగానొక్కి త్రిప్పుచు వస్త్రగాళితము చేయవలెను. వస్త్రముపైన మిగిలిన మొరుమును మరలదంచి మరల ఆవిధముగనే వస్త్రగాళితము చేయవచ్చును.

చూర్ణము మెత్తగానున్నకొలది శ్రేష్ఠముగానుండును. కాబట్టి వీలునుబట్టి దళసరి బట్టయందే వస్త్రగాళితము చేయవలెను. మిరియాలు, పిప్పళ్ళు మొదలగు కొన్నివస్తువులు పూర్తిగా చూర్ణముగాక మిగులును. కాన ఆ యా భాగముల ప్రకారము తూచి ఏకముచేసి తరువాత చూర్ణముచేసినచో భాగములయందు వ్యత్యాసమువచ్చును. అందువలన వస్తువులను ప్రత్యేకముగా చూర్ణముచేసి భాగముల ప్రకారము తూచి ఏకముగా కలుపవలెనని కొందరందురు. కాని ఇట్లు చేసినచో ఎంతబాగుగా కలిపినను వస్తువులను ఏకముగా కలిపి పిమ్మట చూర్ణము చేయునప్పుడు కలియునట్లు సరిగా కలియజేరవు.

చూర్ణద్రవ్యములయందు పెద్దవిగా నుండు వానిని ప్రత్యేకముగా నరికి చిన్నవిగా చేయవలెను. వేళ్లు, పట్టలు, తిప్పతీగె మొదలగు పచ్చిద్రవ్యములను ఎండించియే చేయవలెను. బెల్లము, ఎండుకొబ్బరి మున్నగువాటిని మెత్తగాదంచి చూర్ణముచేసి కలుపవలెను. ఏఓషధులైనను దంచకుండ నిల్వయుంచినయెడల సంవత్సరమువరకు వాడుకొనవచ్చును. వానినే చూర్ణించినయెడల రెండుమాసములకుపైన గుణము (Virtue) తగ్గిపోవును. సిద్ధమైన చూర్ణములను సీసాలలోగాని పింగాణిజాడీలలోగాని క్రొత్తరేకు డబ్బాలలోగాని పోసియుంచవలెను. లవణములు క్షారములు ఆమ్లరస పదార్థములు కలసిన ఔషధములు ఎటువంటివైనను రేకు డబ్బాలలో పోయరాదు. చూర్ణములన్నియు

---

వాతములన్నిటిలో శిలామేహ వాతము తగ్గుట కష్టము.

రెండు మాసములకుపైన నిర్వీర్యములగునుగాన తరువాత వాడకూడదు. పైకి చూచుటకు కొన్ని తుట్టెలుకట్టును. కొన్ని తుట్టెలు కట్టుచున్నను గుణవంతములుకావనితీసివేయవలెను.

లవణములు (Salts) కలసినచూర్ణములు వర్షాకాలము నందు చెమ్మగాలి తగిలి మెత్తబడి నల్లబడును. అట్టి సమయములందు దానిని ఎండబెట్టినచో స్వరూపమును బొందును. చూర్ణములు కొంచెము ప్రాతబడినప్పుడును, గడ్డలుకట్టినప్పుడును కూడ ఎండించి నలిపి వస్త్రగాళితమును జేసినచో స్వరూపమును జెందును.

మనము మందులను కలుపుటయందు ఏయే చూర్ణము యెంతెంత కావలసి యుండునో సరిగా తూచి తరువాత వానిని కలుపవలెను. వివిధచూర్ణములను కలిపిన తరువాత పశువుల కీయవలసిన మోతాదుల ప్రకారము వాటినిభాగించిశుభ్రమైన కాగితములలో పొట్లములుకట్టి ఈయవలెను. పశువునకు ఈయగా మిగిలిన చూర్ణము సీసాలోగాని శుభ్రమైన అట్టపెట్టెలోగాని యుంచి మూతవేయవలెను. చూర్ణములలో విషసంబంధమగు చూర్ణములు కలిపినపుడు పశువునకువాడు మందుయొక్క మోతాదును బట్టి దానిని జాగ్రత్తగా త్రాసులో తూచి కలుపవలెను. సాధ్యమైనంతవరకు అవసరమైన దానికంటె ఎక్కువ చూర్ణమునుకలిపి నిలువయుంచరాదు. అట్లు ఎక్కువ మిగిలి యుండుట తటస్థించినను దానిని పొడిప్రదేశములో జాగ్రత్త పరచవలెను.

## రసములపుట్టుక

మధురరసము భూమియుదకముల చేతను, ఆమ్లరసము భూమి, అగ్ని, వాయువుల చేతను, లవణరసము ఉదకము, అగ్నుల చేతను, వగరురసము వాయువు, అగ్నుల చేతను, తిక్తరసము ఆకాశము, వాయువుల చేతను, కషాయరసము భూమి, వాయువుల చేతను, ఈరీతిగా పంచభూతములలో రెండేసి కలియుటవలన ఒక్కొక్కరసము పుట్టుచున్నది.

## గుణము(Virtue)

లోపలకుగాని, బయటకుగాని వాడినయెడల ఒకముఖ్యమగు ఫలితము కలిగించునట్టి ఓషధియొక్క స్వతస్సిద్ధలక్షణమునకే గుణముఅని అందురు. భూమియందు గురుత్వమును, ఉదకమునందు స్నిగ్ధమును, అగ్నియందు తీక్ష్ణమును, వాయువునందు వేగమును, ఆకాశమునందు లఘుత్వమును ఈరీతిగా పంచభూతములకు అయిదుగుణములు కలిగియుండుటయేగాక ఈ గుణములయందె యితరగుణ సంచయములును కలిసి యున్నవి.

## శక్తి (Power)

ప్రతిపదార్థముయొక్క శక్తిని తెలిసికొనుట ముఖ్యము. ప్రపంచ మంతయును సూర్య చంద్ర వ్యాప్తమగుటచేత ద్రవ్యాశ్రితమైన శక్తులు తరచుగా ఉష్ణముగ శీతల

---

నిమిషమునకు 45 నుంచి 50 వరకు నాడి కొట్టుకొనును.

ముగ నుండును. ఉష్ణమును కలిగించునవి శిరోభారము, మందమతి, చెమట, మంటను కలిగించును. శీతమును కలిగించునవి రక్తమును వృద్ధిజేయును. శోడినణచును. రక్తసంబంధములగు వ్యాధులలో వాడవచ్చును.

## రసధాతువులు చెడుట

రసధాతువు చెడినపుడు పశువునకు ఆహారమునందు ఇష్టములేకుండుట, రుచిని తెలిసికొనలేకపోవుట, శరీరము బరువుగ నుండుట, నొప్పులుగనుండుట, అకాలమునందే శరీరము ముడుతలు పడుట, శరీరము కృశించుట, మున్నగు లక్షణములుండును.

రక్తము చెడినపుడు దొమ్మ, గురక, జబ్బవాపు, చర్మవ్యాధులు అనగా తీట, ఏనుగగజ్జి, నుసిమిగి, రక్తచెల్లి కలుగును.

మాంసము చెడినపుడు కణుతులు [illegible] ఎముకమీదనే ఎముక పెరుగుట, పంటిమీదనే పన్ను పెరుగుట, దంతములయందును ఎముకలయందును పగులగొట్టబడుచున్నట్లు బాధ, శూల జనించుట, చర్మమునందు దోషములు జనించుట, కలుగును.

మిక్కిలి స్థూలముగ నున్నట్టియు, మిక్కిలికృసించి నట్టియు, శిథిలముగనున్న మాంసము ఎముకలు కలిగినట్టియు, దుర్బలముగనున్నట్టియు స్వల్పాహారమును కలిగి నట్టియు, స్వల్పమగు శక్తినికలిగినట్టియు, పశుశరీరములు వ్యాధులను సహింపజాలవు. ఈలక్షణములకు విపరీతలక్షణములుంకల శరీరము వ్యాధులను సహింపగలుగును.

## మాత్రలు (Pills)

మాత్రలను చేయుటయందు మింగుటకు వీలగు పరిమాణము గలిగియుండవలెను. పదార్థములు గలియునటుల జిగురు, బెల్లము, ఆముదము, వ్యాసులైను మొదలగు వస్తువులు ఉపయోగింపవలెను. నిమ్మ, నారింజ, వెలగకాయలంత మాత్రలను ఉపయోగించునపుడు పశువులకు కోపము తెప్పింపకుండ దానినాలుకను పట్టుకొనవలెను. అప్పుడు కుడిచేతి మూడువ్రేళ్లతోను మాత్రనుగట్టిగ పట్టుకొని తనచేతిని అంగిటివరకు పోనిచ్చి ఆమాత్రను విడిచి నెమ్మదిగా చేతిని లాగుకొని, నాలుకవిడిచిపెట్టవలెను. మాత్ర లోపలికి పోయినది లేనిదినిచూచి దానితలను వదలిపెట్టవచ్చును. కొన్నికొన్ని వ్యాధులలో మాత్రను లోపలికిపోవునట్లు చేయుటకు కొంచెము నీరు గొంతుకలో పోయవచ్చును.

మనము మాత్రవేయుటకు చేతిని లోపలికి పోనిచ్చునపుడు మన చేతిని కొరకనీయకుండ దానినోటిలో యేదైన గుండ్రని పదార్థము (కఱ్ఱవంటిది) పెట్టవలెను. అట్లు పెట్టినచో పదార్థము నోటిలోపల కొంతభాగము చుట్టుకొనిపోవునుగాని అంతకంటె ప్రమాదము జరుగదు. మాత్రను నోటిలో చితుకనీయకుండ జాగ్రత్తగా అంగిటిలో వేయవలెను. కాని అది నోటిలోనే చితికినయెడల పశువు దానిని మ్రింగదు. ఇక ముందు కూడ అట్టి మందులను వాడినయెడల అది మ్రింగక దగ్గి అరచును. అట్టి వేళలయందు ఆమాత్రలను తడిపి నీటిమూలమునగాని, ఆహారమూలమునగాని పశువునకు ఈయవలెను.

# పశువులను పడగొట్టుట

## పండ్రెండవ భాగము

గ్రామాదులలోనుండు రైతులు తమ పశువులకు వ్యాధులు వచ్చునపుడుగాని, తదితర కారణములవలనగాని పశువులను పడగొట్టవలసియుండును. పడగొట్టుటలో ననేక సులభమార్గములు గలవు. పశువులు నోరులేని జంతువులుగాన చాల జాగ్రత్తగా త్రాళ్ళు గట్టి నెమ్మదిగా పడవేయవలెను. మానవులైనచో వారంతటవారే యేమందైనను త్రాగుదురు. పశువులు అట్లుత్రాగక గంతులువేయును. మరికొన్ని పొడుచును. మరికొన్ని కరచును, తన్నును. కాబట్టి ఎంతచిన్న పశువునైనను నలుగురైదుగురు పట్టుకొని సూత్రముతో పడవేయవలెను. పడవేయకుండ చేయు చికిత్సలు కొన్నియును, పడగొట్టిచేయు చికిత్సలు కొన్నియును గలవు గాన ఏయే రోగములలో నేయే సూత్రములతో నుపయోగించవలెనో గ్రహించి జేయవలెను. పశువులను పడగొట్టుటను గూర్చి నాకు తెలిసినంతవరకు ఈ దిగువ నుదహరించుచున్నానుగాన చదువరులు గ్రహించుదురుగాక.



### పడగొట్టుటలో గమనింపవలసిన విషయములు

వైద్యుడు దూరముగానుండవలెను. రైతులతోనే సాధ్యమైనంతవరకు పడగొట్టించవలెను. అంతకు వీలులేనిచో పడగొట్టు సూత్రములను చెప్పి చేయించవలెను. వైద్యుడు మిగుల బలిష్ఠముగ నుండి పిరికితనము లేక ఆ పశువుయొక్క గుణములను గ్రహించి

---

కోటివిద్యలు కొండ్రకు లోపలనే.

తానే స్వయముగా పడగొట్టవచ్చును. పడగొట్టిన తరువాత కాళ్ళను కట్టవలసి వచ్చినపుడు మిక్కిలి జాగ్రత్తగా కట్టవలెను. పశువు నిలబడు నపుడుగాని పడుకొనినపుడుగాని వెనుక కాళ్ళదగ్గర నిలుచుండరాదు. అట్టిసమయములందు పశువుచాలా కోపముగా నుండును. ఆ పశువు కోపము పట్టజాలక వెనుకకాళ్ళతో తన్నుటకు ప్రయత్నించుచుండును. అజాగ్రత్తగా నున్నయెడల అది మనుష్యుని ముఖముమీదగాని పొట్టలోగాని మూత్రకోశములోగాని తన్నును. కాబట్టి వైద్యుడుగాని తదితరులుగాని దగ్గరకు పోకుండ వెనుకకాళ్ళను నెమ్మదిగా త్రాడుతో లాగుకొని నాలుగుకాళ్ళు కట్టవలెను. అట్లు కట్టునపుడు పశువు తన కాళ్ళతో కట్టుమనిషి చేతులను నొక్కును. లేక తలవంచి కట్టునపుడు తలమీదకూడ తన్నవచ్చును.

పశువును పడవేసిన తరువాత కాళ్ళను కట్టకపూర్వమే పడినదని కొంచెము సేపున్నతరువాత వెంటనే లేచును. తలభాగముతో మనుష్యులనువిసురును. అట్టిసమయములందు అపాయకరములైన దెబ్బలు తగులును. పశువు పడినవెంటనే తోకను లోతొడ గుండాతీసికొని పట్టుకొనవలెను. దీనినే మడితోకయందురు. పశువును పడవేసిన తరువాత తలను నొక్కిపట్టునపుడు చెవులను బాగుగా తనిఖీచేయువలెను. తలక్రింద చెవి పడినలిగినపుడు చెవిభాగమందలి నరములన్నియు నలుగును. అందువలన కాలు చెల్లపోవును. అందుచేతనే మనపెద్దలు పశువు పడగనే చెవిచూడమందురు.



## పశువును పడవేయు సూత్రములు

### ప్రథమసూత్రము

ఒకసన్నని మెత్తని త్రాడుగాని మోకుగాని తీసికొని ఒకచివర కొమ్ములకుగాని తలకు తగిలించు చికమారునకుగాని, మెడకుపెట్టుపలుపునకుగాని తగిలించి మూపురముపై

నుంచి ముందరకాళ్లక్రిందనుంచి పైకి చివరకొసలాగి వెన్నెముకమీదుగా తోకరడు దగ్గర నుంచి వెనుక కాళ్లమీదుగా వృషణముల దగ్గరగా త్రాటిని ఉచ్చువేసి ఇద్దరు మనుష్యులు లాగిపట్టిన వెంటనేపడును. అట్టి సమయములందు జాగ్రత్తగా అది పడి పోవునపుడు మనుష్యులు ఆనుకొని దెబ్బతగులకుండ నెమ్మదిగా పరుండబెట్టవలెను. లేనిచో జబ్బగాని ప్రక్కయెముకలుగాని విరుగవచ్చును. ఇట్టి ప్రమాదములు జరుగు చుండును.

## ద్వితీయపద్ధతి

పశువును సరిగా నిలబెట్టి ముందు తలకు త్రాడుగట్టి చేతితో పట్టుకొని యుండు టగాని లేక గుంజకుగాని స్తంభమునకుగాని కట్టియుంచవలెను. తదుపరి యిదివరకు చెప్పిన మాదిరిగనే రెండుభాగములందును ఉచ్చులువేయగ మిగిలిన త్రాటిని పడిపోవు భాగపుకాలి పిల్లడెక్కను ఉచ్చువేసి నెమ్మదిగా చేతితో లాగుచుండినయెడల పడి పోవును. ఈ సూత్రము చాలా తేలికగా నుండును.

## తృతీయపద్ధతి

పశువులను పడగొట్టకుండ 3 గజములబారు గజము వెడల్పుగల స్తంభములో 10 లేక 8 కట్టలు రెండువైపుల రెండు బలమైనవి పాతవలెను. పశువుయొక్క తల భాగమును ముందుపాతిన సందటి స్తంభమునకు కటి కట్టలమధ్యగానుంచి అటునిటు కదలకుండ వెనుకకాళ్లను పగ్గముతో వెనుకగుంజకుకట్టి తగిన చికిత్స చేయవలెను. ఇంకను పశువు కట్టలమధ్యనుండియు కూడ గలంతు చేసినయెడల మరొక మోకుగాని మెత్తని త్రాడుగాని ఎగుచుట్టు గట్టిగా త్రిప్పిచుట్టి చికిత్స చేయవచ్చును. ఇంకను కట్టలు అటు నిటు కదలుననియు పశువు బయటకు పోవుననియు ఉద్దేశ్యమున్నయెడల కట్టలకు అడ్డ ముగా 2 లేక 3 చోట్ల బలమగు గట్టిబద్దలు కట్టవచ్చును. ఈ కట్టలు నునువుగను బుడు పులు లేకుండగను ఉండవలెను. కట్టలకు తారుపూయుట మంచిది. పశువులను పడగొట్టు సూత్రములు రైతులలో చాలమందికి తెలియును. అయినప్పటికి ప్రాథమిక పశుచికిత్స చేయువారికి అవుసరమని తెలిపితిమి.

## గేదెలను దూడలను పడగొట్టుట

ఇదివరకు చెప్పిన జంతువులను పడగొట్టుటకంటె గేదెలను దున్నలను పడగొట్టుట చాలాకష్టము. ఈజాతివి మహా క్రూరస్వభావముగలవి. అందుచేత ముందుకాళ్లకు వెనుక కాళ్లకు బంధములువేసి ఒక సన్నని మెత్తని త్రాడుతీసికొని రెండువైపుల రెండుకొనస లుంచి నెమ్మదిగా యిద్దరు మనుష్యులు లాగవలెను. అట్లు లాగుటవలన పశువు క్రమేపి ఒరిగి పడిపోవును. ఈ పద్ధతివలన పశువునకు అపాయము కలుగదు. పడిపోవునపుడు

---

అడుగడుగున నిక్షేపం.

యిద్దరు మనుష్యులు పడిపోవు భాగమునకు ఆనుకొని పరుండబెట్టవలెను. తదుపరి తలను నొక్కిపెట్టవలెను. గేదెగాని, దున్నగాని చాల పొగరుగనుండి అంకెకు రానప్పుడు మెడగ్రాడుగాని, సికమారుగాని వేసి నొక్కిపెట్టవలెను. వాటికొమ్ములు సూదులుగా నుండుటవలనను ఒక విధమగు గోరోచన ముండుటవలనను మిక్కిలి పొగరుగలవై మనుష్యులనుకూడ చంపును. బంధములు విడిచినప్పుడు మనుష్యులమీదపడి పొడుచును. జాగ్రత్తగా ఆలోచించి పడగొట్టవలెను.

ఎంతో ప్రమాదము వచ్చినపుడు ఆవులను గేదెలను పడవేయవలెనుగాని మాటి మాటికి పడవేయుట చాల ప్రమాదము. ఎందుచేతనన వాని ఆహారకోశములు నిండుగా నుండును. రక్తమెల్లప్పుడు పాలుగా మారుచుండును. పొదుగు ఎల్లపుడు బరువుగా నుండవలెను. నోరు ఎల్లపుడు ఆడించుచుండవలెను. కనుక యిటువంటి సుకుమారజంతువులను మాటిమాటికి పడవేయరాదు. పడవేసినను ఎక్కువకాల ముంచరాదు. పశువునకు కుడితిపెట్టిగాని కడుపునిండ నీరు త్రాగునపుడుగాని పాలుతీయుచుండ నున్నపుడుగాని పశువును పడవేయరాదు. దూడలనుకూడ సాధ్యమైనంతవరకు కాళ్లను కట్టకుండనే కాళ్లు నొక్కిపట్టి చికిత్స చేయవలెను. ఎందుచేతనన వీటికాళ్లు చాలా సున్నితముగా నుండును. బిగించి కట్టినచో తిమ్మిరియెక్కుటయో నరములు తెగుటయో ఎముకలు విరుగుటయో తటస్థించును. పైనచెప్పిన జంతువులను పడవేసిన తరువాత తోకను మాత్రము కాళ్లమధ్యగాతీసి డొక్కమీదుగా ఆనించి పట్టుకొనవలెను. ఇట్లు చేసినచో పశువు కదలజాలదు. దీనినె మడితోకయందురు.

## మందులు త్రాగించుట

పశువులకు వెదురుగొట్టముతోగాని యిత్తడి గొట్టములతోగాని వెడల్పుగల సీసాలతోగాని పోయుట చాలామంచిది. పశువులను నిలబెట్టిపోయుట చాలామంచిది. స్తంభములకుగాని బండికిగాని పశువుతల యెత్తుగాగట్టి నోరు తెరచి నాలుక నొక్కిపెట్టి నెమ్మదిగా జారవిడువవలెను. చాలామంది గొట్టముతో పోయునపుడు దానిమూతి పొడిచియు ముక్కురంధ్రముల గ్రుచ్చియు అంగిటి నాలుకను పొడిచియు నానాబాధలు పెట్టుదురు. మరికొందరువానికి ఊపిరిఆడకుండగనే గొట్టములతో మందులు పోయుదురు. అట్లు పోయుటవలన పొలమారి ఊపిరాడక ప్రాణాపాయముకూడ కలుగును. వెదురు గొట్టములకు బుడుపులుగాని గరకుగాని పేడుతేచుటగాని యుండరాదు. అట్లుండిన పోయునపుడు లోపలి భాగమునందు పుండ్లుపడి పశువును బాధించును. సీసాలతో పోయునపుడు మూతి కొంచెము వెడల్పుగను పొట్టలావుగను ఉండునటుల చూచి పండ్లకు తగులకుండ జాగ్రత్తగా రెండుపెదవులుకలియు భాగమందుపెట్టి నెమ్మదిగా జారవిడవవలెను.

కొందరు రైతులు గేదెలకు దున్నలకు పెద్దఆవుదూడలకు మందులు పోయునపుడు మెడ పలుపులు గొంతుకకుపెట్టి స్తంభమునకు కట్టి బంధమువేయక దగ్గరగా

---

పోయుదురు. ఇట్లుపోయుట వలన పలుపు మెడకు చుట్టుకొని కుత్తుకను నొక్కి గ్రుడ్లు తేలవేయును. కాబట్టి జాగ్రత్తగా పోయవలెను. మందులు పోయునపుడు జాగ్రత్తగా నుండనిచో పొలమారి కొన్నిరోజులు పశువు బాధపడును. మరికొన్ని చచ్చును.

## ఎనీమా చేయుట

ఎనిమా చేయుటలో వివిధరకములు గలవు. సామాన్యముగా మందుల నిచ్చియే విరేచనముల గావింపవచ్చును గాని శీతలమిజేసిగాని, అతివేడిజేసిగాని రక్తసంబంధమగు వ్యాధుల వలనగాని పాడిపశువులకు దాణావస్తువులు విస్తారముగా మేపినపుడు బల హీనత వలన మలములోపలనుండి బయటకురాక బాధపడుచున్నపుడుగాని శీతాకాలములో దూడలు పాలు త్రాగుటలో ఎక్కువతక్కువల వలన [illegible] మలము [illegible]ట్టును. పెద్దరోగములో 107 డిగ్రీల జ్వరమున్నపుడు మలము పోగొట్టుటకు ఎనిమా చేయవచ్చును. ఏయే వ్యాధులలో ఎనిమా చేయవలెనో వైద్యుడు జాగ్రత్తగా ఆలోచించి చేయవలెను.



సామాన్యముగా ఎద్దు, ఆబోతు, దున్న, గేదె మొదలగు జంతువులకు ఎనీమా చేయునపుడు నాలుగు దుక్కిటికాళ్లను తీసికొని రెంటికి రెంటికి లంకవేసి ముందరి భాగమందు రెండు కొడులను వెనుక డొక్కలభాగమందు, రెండు కొడులను క్రిందగా పోనిచ్చి గట్టిగా నొక్కుమనిచెప్పి తలకు త్రాడువేసి గుంజకుకట్టి సరియగు పొజిషన్‌లో నుంచి పశువైద్యాచార్యుడు ఎనీమా చేయవలెను. కొన్ని పశువులను పడగొట్టి ఎనిమా చేయవలసియుండును. జాగ్రత్తగా పడగొట్టి ఎనీమా చేయవలెను.

---

తల్లిని నమ్మినవాడు ధరణిని నమ్మినవాడు చెడడు.

## ఎనీమాకు ముందు పరీక్షించవలసిన విషయములు

పశువు భయపడుచున్నదియు లేనిదియు కాళ్ళను భూమిమీద ఆనించినదియు లేనిదియు చెవుల మొదళ్ళను పరిశీలించి చల్లగానున్నవో వేడిగానున్నవో కనుగొనవలెను. పశువు అటునిటు ఒరగుచున్నది లేనిది కనుగొనవలెను. ఒకవేళ మూత్రముపోయునప్పుడు ఆ ధారమీద మనకాలుపెట్టి వేడిగానున్నది లేనిది కనుగొనవలెను. ముందు థర్మామీటరు ఆసనములోపెట్టి ఎంతజ్వరమున్నది కనుగొనవలెను. 100 డిగ్రీల జ్వరమున్న ఎనీమాచేయరాదు. బలహీనముగానున్నపుడు మలమున్నదని గ్రహించినపుడు ఎనీమా చేయరాదు. బలహీనముగానున్నపుడు మలమున్నదని గ్రహించినప్పుడు ఎనీమాచేయక చేతికి ఆముదమురాసి మలమును తీయవలెను.

## ఎనీమాచేయుటకు నియమములు

1. ఎనిమాచేయునపుడు రోగపశువు ఉంచవలసినపద్ధతి
2. ఎనీమాచేయు నీటియొక్క స్వభావము
3. ఆనీటియొక్క ఉష్ణధర్మము
4. ఎంతనీరు వాడవలసినది ఒకేసారి పేగులో ఉండవలసిన నీటిపరిమాణము
5. ఆనీటిని ఎంతఒత్తిడితో ఎక్కించవలసినది
6. ఎనిమా ఎంతవడిగా చేయవలసినది
7. లోనికి నీరు ఎక్కించేటప్పుడు ఆసనమును నొక్కుచున్నదా లేదా?
8. లోనికి ఎక్కించినతరువాతనీరు ఎంతసేపు ఉంచవలెను.

## నీటియొక్క ఉష్ణము

నీటివేడి హెచ్చుగానుండరాదు. మిక్కిలి చల్లనినీటిని వాడరాదు. మామూలు శీతోష్ణములోనే యుండవలెను. ప్రేగులయందు అమ్లము, శ్లేష్మము, గాలి ఎక్కువగానున్నపుడు వేడినీటినే వాడవలెను. అప్పుడైనను ఆనీటిని ప్రేగులలో నిలువయుంచుటకు పొట్టబాధయు నుండరాదు. జ్వరములలోను గర్భపాతములలోను కొంచెము గోరువెచ్చని నీటినే వాడవలెను. చూడిపశువులకు ఎనిమా చేయునపుడు వాటి ఉదరములు సున్నితముగా నిండుగానుండును. అందువలన ఎనీమా చేసిననీరు ఎక్కువకాలము నిలువవు. కాబట్టి చూడిపశువులకు ఎనిమా చేయుటకు గోరువెచ్చని నీటినే వాడవలెను. మిగుల చన్నీటిని వాడరాదు. రైతులలో చాలమంది పశువులకు ఎనిమా చేయుటనిన ఆశ్చర్యముతో చూచుచుందురు. కొందరు ఎనీమాచేసిన నీరు లోపలనే యుండునని భయపడుదురు. వైద్యుని అనుభవముతో ఎనిమాచేయును కాబట్టి రైతులు భయపడనవసరములేదు.

---

## ఎనీమాచేయు పద్ధతులు

పశువులకు నాలుగు పైంటులుగాని 6 పైంటులుగాని 8 పైంటులుగాని (పైంటు అనగా అరసేరునీరు) నీరుపట్టు ఎనీమాడబ్బా లుపయోగించవలెను. చిన్న పశువులకు 2 లేక 4 పైంటులడబ్బా లుపయోగించవలెను. ఈ డబ్బాలకు 2 గజముల రబ్బరు గొట్టములు తగిలించవలెను. పశువును నిలబెట్టిగాని పరుండబెట్టిగాని డబ్బానిండ నీరుపోసి మనుష్యుని ఎత్తుగా పట్టుకొనుమనిచెప్పి పశువుకంటె గజముఎత్తు మట్టములోనుంచి ట్యూబును ఆసనములోనికి నెమ్మదిగా ఎక్కించవలెను. ఎక్కించిన తరువాత పశువు ముక్కుచుండును. అట్లుముక్కుటవలన రబ్బరుగొట్టము లోపలికిపోక బయట నేయుండును. అట్టి సమయములందు మనము ఆ చివరరబ్బరును చేతి కొనిచే నెమ్మదిగా ఆసనములోనికి పోనిచ్చి చక్కిలిగింతపెట్టి మలప్రేగువరకుపోనిచ్చి గొట్టమును తేలికగా నొక్కవలెను. అప్పుడు నీరులోపలి ప్రేగులన్నిటికి చిమ్మును. ఆ ప్రేగునిండిన తర్వాత బయటకు వెడలి గ్రక్కును. అప్పుడు ట్యూబునుతీసివేసి దూరముగానుండి మలము ఎంతపడుచున్నది ఏరంగుగానున్నది దానిలో జీర్ణముకాని గింజలుగాని పురుగులుగాని జిగురుగాని రక్తముగాని యున్నదేమో పరీక్షించవలెను. ఇంకను మలినమున్నదని అనుమాన మున్నపుడు మరల నీరెక్కించవలెను. ఈరీతిగా మలినముపోవువరకు రెండుమూడుసార్లు చేయవలెను. ఎనిమా చేయునపుడు వైద్యుడు బట్టలమీద పడకుండా జాగ్రత్తగా నుండవలెను. ఎప్పటికప్పుడే సబ్బునీటితో చేతులను శుభ్రముచేసికొనుచుండవలెను. రబ్బరు ట్యూబులో పేడ ఇరుకుకొనినచో కడిగి మరల యెక్కించవలెను.

## వేడినీటితో ఎనిమాచేయుట

రైతుల ఆతురతనుబట్టియు పశువులబాధనుబట్టియు వేళకు సరియైన వేడినీరు దొరకక పోవుటవలనను ఎనిమాచేయుటలో లోటుండవచ్చును. చన్నీళ్లనే మాత్రము ఎనీమా చేయరాదు. ఇట్లు చేయుటవలన ప్రేగులకు చురుకుదనము లేక శీతలముగా నుండును. కాబట్టి అంత వేడిగాకుండ గోరువెచ్చని నీటితో ఎనిమా చేయవలెను.

## సబ్బునీటితో ఎనీమాచేయుట

సన్‌లైటు సోపుతోగాని బోరాక్సులైట్ సోపుతోగాని అత్తరులు కలువని మెత్తని సోపుతోగాని ఎనిమా చేయవచ్చును. 100 భాగముల నీటిలో 10 భాగముల సబ్బును కలిపి ఎనీమా చేయవచ్చును. మిక్కిలి మలబద్ధకముగానుండి పేడ దుర్వాసన వేయునపుడు గోరువెచ్చని నీటిలో సబ్బుకలిపి ఎనిమా చేయుట మంచిది.

---

గంపెడిచ్చిన తనకు గరిటెడిచ్చును.

## తైలములతో ఎనీమాచేయుట

పశువునకు 107 డిగ్రీల జ్వరముండి ముడ్డితీపుండి బాధపడుచున్నపుడు 50 భాగముల నీటిలో 5 భాగముల గ్లిసరైన్ గాని క్యాస్టరుఆయిల్ గాని లేక చిట్లాముదముగాని కలిపి నెమ్మదిగా ఆసనములోనికి ఎక్కించుచు మలము కరుగనిచ్చి తీసివేయుచు ఆనీటిని ఎక్కించవలెను. లోపలనున్న చెడుపదార్థమంతయు కదలి బయటికి త్రోసివేయును. శీతాకాలములో దూడలు పాలు ఎక్కువతక్కువలనుబట్టి మలబద్ధకముకలిగి పేడవేయుటకు బాధపడుచుండును. ఇంకను మలము పడుటకు గొంతూ నోటినుండి గాడిదగడప ఆముదమువగైరా పోయుదురు. అట్లు పోయుటవలన అతివేడిజేసి మలము పిట్టముగట్టి రక్తములో జీర్ణించి మెడవిరగదీసికొని చనిపోవును. అట్టి సమయములలో ఈ ఎనిమాచేయుట మంచిది.

## మలమును చేతితోతీయుట

నీటితో ఎనిమాచేయుటకు వీలులేనప్పుడు, పశువు రోగముచే బలహీనతజెంది లోపల వేడిలేనపుడు నీటిని ఎక్కించకుండ ఆముదముగాని గ్లిసరైన్నుగాని చేతికి రాచుకొని ఆమలమును నెమ్మదిగా తీయుటమంచిది.

## వాతలువేయుట

మనదేశములో ననేకులు తమపశువులకు ఏవ్యాధి వచ్చినను ఆరంభములోనే వాతలు (రక్షలు) వేయు ఆచారముకలదు. వ్యాధులు లేకుండగనే వరహాకాల్పులు పిఠాపురంకాల్పులని కాల్చుదురు. ఇట్లుకాల్చుట చాలా పొరపాటు. వాతలు వేయుట మహాపాతకము. పశువు చచ్చినను బ్రతికినను వాతలు వేయరాదని చెప్పుదురు. ఇట్లు వాదించుటకూడ తప్పనియె నా ఉద్దేశ్యము. మానవవైద్యములో ఇంగ్లీషు పశువైద్యములో కూడ కొన్నివ్యాధులకు తప్పక వాతలు వేయవలెననియున్నది. వైద్యములో అనుభవములేనివారు తర్కించినను లాభములేదు. పశువునకు గూర, దొమ్మ, కుంటేటివెర్రి మున్నగు రోగములలో ఆ యా రోగలక్షణములను బట్టి వాతలు వేసినచో మందులకంటె నెక్కువపని చేయును. కొన్ని రోగములలో ఎన్నిచికిత్సలు చేసినను లాభము కన్పట్టనప్పుడు వాతలవలన తగ్గుటకూడ గలదు.

సామాన్యముగా పశువులకు సంభవించు రోగములలో చాలావరకు ఏచికిత్సయు లేకుండగనే తగ్గిపోవును. ఇటువంటి వ్యాధులకుగూడ వాతలు వేయుదురు. అనవసరముగా రోగనిదానము గ్రహించక వాతలువేయరాదు. ఈ చికిత్సయందు రెండువిధానములు గలవు. అందులో నొకటి పశువునకే కీలునకైనను, కన్నునకైనను నొప్పిచేసినపుడు ఆ స్థలమునందే కాల్చుట, రెండవది పశువు ఏదోనొక రోగమును పొందినపుడు

---

కరువుమానుప కుంట మిడతలమానుప మంట.

గాని లేక యేకారణముచేతనైన కృశించినప్పుడుగాని దాని తత్వమును బాగుచేయు నుద్దేశములో శరీరమంతయు కాల్చుదురు. ఈ రీతిగా కాల్చుట చాలా పొరబాటు.

## వాతలనుగూర్చిన వివరములు

ఈగ్రంథములో రైతులకు విపులముగా తెలియులాగున ఆయా రోగముల వాతలను గూర్చి తెలిపితిని. వాతలు వేయుటలో అనేకమంది అనేకరకములుగా వేయుదురు. "కీలెరిగి వాతపెట్టమని" పెద్దలు చెప్పుదురు. కొందరు వారియిష్టప్రకారము ఎచ్చట వాపున్న అచ్చటనే కాల్చుటకూడ జరుగుచుండును. మరికొందరు జబ్బు రాగానే కాల్చుదురు. అట్లుగాక మా అనుభవ చికిత్సలు చేసి ప్రాచీన గ్రంధముల పరిశీలించి ఈ గ్రంధములో తెలిపితిమి. పశువు శరీరములోనుండు రక్తనాళములు, నరములు మున్నగునవి పరీక్షించి వాతలు పెట్టవలెనుగాని అనవసరముగా పెట్టిన ఆపశువు బాధపడుటయేగాక తదితర జబ్బులు రావచ్చును.



వాతలువేయు పద్ధతులు

వాతలువేయుటకు ముందు సమానమగు స్థలము చూడవలెను. అచ్చటనే 10 గజములు దూరములో పిడకలతోగాని బొగ్గులతోగాని దాలివేసి ఆదాలిలో వాతలువేయు

కోటివిద్యలుచేసినా కొలఅచ్చితె కొలవవలెకాదు.

పనిముట్లను నిప్పుఅంటించవలెను. ఆనిప్పునకు దగ్గరగా తేలికగా పశువులుగాని గడ్డి మొదలగునవిగాని యుంచరాదు. కాల్చునప్పుడు ఒకవిధమగు దుర్వాసన వేయును. ఆవాసనను పీల్చరాదు. పనిముట్లు ఎఱ్ఱగా కాలిన తరువాత గోనెగుడ్డతో పనిముట్లను పట్టుకొని గుర్తులుపెట్టినచోట కాల్చవలెను.

పశువులకు వాతలుపెట్టుటకు పూర్వము సుద్దతోగాని సిరాతోగాని ఈ గ్రంథమునందు చెప్పినరీతిగా గీతలుగీసి వాతలుపెట్టవలెను. పనిముట్లు సరిగా కాల్చకుండ వాతలు వేసినప్పుడు అవి బాగుగా కాలినవో లేవో చూడవలెను. అట్లుకాలనియెడల వాటిని తీసి మరల బాగుగా కాలినవాటిని తీసికొనిరావలెను. పశువు కదులుచున్నదా, దగ్గుచున్నదా, ముక్కుచున్నదా మొదలగునవి గ్రహించవలెను.

వాతలువేయుటకు తరుచుగా కొడవళ్ళు గడ్డపారలు దువ్వాలు వాడుదురు. ప్రత్యేకముగా వాతలువేయుటకు పనిముట్లు చేయించుకొని యుంచుట మంచిది. ఉక్కుచే చేసినపనిముట్లు మంచివి. పనిముట్లు పదునులేనివిగను కోణములు లేనివిగను సమానమగు బరువుకలిగినవిగా నుండుట మంచిది.

వ్యాధిచేనున్న పశువునకు అగ్నిని చూపించరాదు. అట్లు చూపించిన యెడల దానికొకవిధమగు భయము, కంపము కలిగి సరిగా పండుకొనజాలక గంతులువేయును. ఈగంతులు వేయుటవలన ఇంకను రోగము హెచ్చగును. కాబట్టి తటాలున తీసికొని పశువును నెమ్మదిగా పడగొట్టి కాళ్ళుగట్టి ఎఱ్ఱగాకాలిన పనిముట్లచే వాతలువేసిన పశువునకేమియు అపాయమురాదు. వ్యాధిముదిరిన తరువాత కాల్చిన చనిపోవును.

వాతలువేయుమనిషి తదితరులతో మాట్లాడక పనిముట్లపిడులు గోనెగుడ్డతో పుచ్చుకొని వాతలువేయవలెను. కాల్చినచోటనే కాల్చక ఎక్కువసేపు పరుండబెట్టక పశువుయొక్క మంచిచెడ్డలు అనగా వాతలువేయునపుడు పశువు ఏమిచేయుచున్నది తెలిసికొనుచు కాల్చవలెను. దానిదగ్గర ప్రత్యేక మొకరిద్దరు మనుష్యులనుంచి పనిముట్లు బాగుగా కాలుచున్నది లేనిది తనిఖీచేయుచుండవలెను. వాతలువేయు మనిషి కట్టు పంచెలు గట్టిగాకట్టుకొని చెంగులను తొడవరకు దోపవలెను. చొక్కా తొడుగుకొనరాదు. కాలుచున్నపనిముట్లు పశువుదగ్గరకు తెచ్చునపు డెవరిని ఆయా భాగములం దుంచక దూరముగానుంచవలెను. వాతలువేసిన పనిముట్లను పనిఅయిన తరువాత బురదలోగాని పేడలోగాని గ్రుచ్చవలెను.

## వాతలు వేయవలసిన వ్యాధులు

చర్మము మాంసము సిరలు, స్నాయువులు సంధులు వీటియందు వాతముండి మిక్కిలి తీవ్రమగుబాధ కలుగజేయునపుడును, వ్రణము ఎత్తుగానుండి కఠినముగ తిమ్మిరిగ నుండు మాంసము కలదిగా నుండునపుడును, కణుతులు, బెణుకులు, చర్మము, కొమ్ములు

---

అచ్చివచ్చిన భూమి అడిగెడే చాలును.

తిరుగుట మొదలగువాటిలో నరలు తెగినపుడు రక్తనాళములు తెగి రక్తమెక్కువగా కారునపుడు అగ్నికర్మ అనగా రాక్షసవైద్యము చేయవలెను. వైద్యుడు గ్రంథి మున్నగు వ్రణముల పొట్టి పొడవు మున్నగు ఆకారములను పరీక్షించి చుక్కలుగాని నిలువు అడ్డ గీతలుగాగాని కాల్చవలెను. రోగపశువుయొక్క మర్మములు, బలము, బలహీనత, వ్యాధి, ఋతువు బాగుగా పరిశోధించి వాతలు వేయవలెను.

శరీరపు సహజరంగు మారి ఎక్కువగా కాల్చబడి బొబ్బలుపుట్టుచున్న యెడల దానిని ప్లుష్టమందురు. తీవ్రముగు బొబ్బలులేచి పీకుచున్నట్లు బాధ మంట పోటు ఎక్కువ వాపు కలిగి చాలా కాలమునకు గాని తగ్గని యెడల దుర్దగ్ధమనబడును. కాలిన తాటి పండురంగు కలిగి మిక్కిలి ఎత్తు లోతుగలుగక చర్మము మాంసము నరలుస్నాయువులు సంధ్యస్థిసాహ లక్షణములతోగూడి యుండినది సమానముగా కాల్చబడినదని తెలిసికొనవలెను. మాంసము వ్రేలాడుట, శరీరము సడలుట, నరలు, స్నాయువులు, సంధులు, అస్థులు మున్నగు భాగములు బాధకలుగుటయు చెడిపోవుటయు అధికజ్వరము ఎక్కువమంట, ఎక్కువ దాహము మున్నగు ప్రమాదములు సంభవించును. ఈ లక్షణములు ఎక్కువగా కాల్చుటవలన కలుగును. ఇట్టిస్థితిలో గాయము త్వరగా మానదు. మానినప్పటికి సరియగు రంగురాదు.

## ముంతకాల్పులు

కొందరు పశువైద్యులగు లంబాడీలు తమ మందలలోనున్న పశువులకు ముంతకాల్పులు వేయుదురు. పశువునకేరోగము వచ్చినను కీళ్లనొప్పులకు బెణుకులకు తగిన తగ వాపులకు ముంతకాల్పులు కాల్చుదురు. ముంతకాల్పులనగా చిన్నముంతగాని మట్టి పిడతనుగాని ఇటుక పిడతనుగాని తెచ్చి మూతిభాగము అగ్నిలోపెట్టి తీసి వెంటనే ఆభాగముతో గుండ్రముగా వాతలువేయుదురు. ఈరీతిగా ఆయాభాగములకు తగిన పిడతలు తీసికొని కాల్చుదురు. ఈ పద్ధతి అవసరమైన రోగములకు కాల్చవచ్చును.

## వాతలుమానుటకు మందులు

వాతలు వేసిన పుండ్లమీద ఈగలు వాలకుండ వేపనూనె రాయవలెను. అప్పుడప్పుడు ఆముదమును రాయుచుండవలెను. పుండ్లకు నీరుగాని తేమగాని సోకనీయరాదు. కాకులు పొడవకుండ కాపాడవలెను. నీలిమందు కొబ్బరినూనెలో కలిపి అప్పుడప్పుడు రాయవలెను. లేక వెన్నలో పటికపొడిగాని కవిరిపొడిగాని కలిపి రాయవలెను.

## పాశ్చాత్య వైద్యపద్ధతి - ఇన్‌జెక్షన్సు

ఇన్‌జెక్షన్ అనుపదము సామాన్యముగా ఏ భాషలో చేరినదో బోధపడుటలేదు గాని దేశమంతయు సర్వసామాన్యముగా వాడుకయైయున్నది. ఇన్‌జెక్షన్ - ఇన్=

---

చెకుముకురు అలిమదురు ఉండవలయును.

లోనికి - జెక్షన్ జొనుపుట. - ఇన్‌జెక్షన్ అనగా శరీరములోనికి యంత్రసాధనముచే ఔషధముగాని మరి యే యితరపదార్థమునుగాని ప్రవేశపెట్టు విధానమునకు ఇన్‌జెక్షన్ అని వాడుచున్నారు. ఈమాటకు సరియైనపదము గానరాదు. ఆయుర్వేదములో సూచీముఖ ప్రయోగమని వృద్ధవైద్యులు తెలుపుచున్నారు. శరీరభాగములోనికి అనగా సూదివంటి ఏ యితరపని ముట్టు (పిచికారి) తోగాని చర్మములోనికి లేక మాంసములోనికి రక్తనాళములలోనికి ఔషధమును పంపుటకు ఇన్‌జెక్షన్ యందురు. ఈ ఇంజెక్షన్లలో రెండు రకములుగలవు. 1 చర్మమూలక మార్గముల ద్వారా రక్తములోనికి ఔషధములు ప్రయోగించుట. 2 ఆసనముద్వారా లేక మూత్రస్థానము (యోనిగాని లేక మూత్రద్వారముల) ద్వారా ఔషధముల ప్రయోగించుట. ఈ రెండువిధముల ప్రయోగమునకు ఇన్‌జెక్షన్ అని వాడవచ్చును. ప్రస్తుతము వైద్యులు ఆసన మార్గముగుండా ప్రవేశపెట్టు సాధనమునకు ఎనీమా (ఎనిమాస్) అని వాడుచున్నారు. ఈ ఇన్‌జెక్షన్ అనుమాట ఏ భాషలోని దైనను వైద్యశాస్త్రమున సుప్రయోగింపబడు పదముగాన దీనినే ఇన్‌జెక్షన్ యనియు ఆయుర్వేదమున సూచీవ్యధనమనియు పిలుచుచుందురు.

## ఆయుర్వేదపద్ధతి - ఇన్‌జెక్షన్

పూర్వకాలమున చేయబడు ఇన్‌జెక్షన్లు (సూచీవ్యధ) సులభపద్ధతిగా నుండెడిది. అనగా కొంచెము మోటుపద్ధతిగా నుండెడిది. ప్రస్తుతకాలములో ప్రభుత్వమువా రామోదించి ప్రతి సంవత్సరము పుట్టిన చంటిబిడ్డలకు చేయుచున్న టీకాలను (సూచీవ్యధనము) ప్రత్యక్షముగా అందరు చూచుచునే యున్నారు. కొన్నివందల సంవత్సరములకు పూర్వము ఆయుర్వేద ప్రభృతులు కనిపెట్టిన మార్గములనే నేటికి ప్రాక్ ప్రతీచీ వైద్యసాంప్రదాయముల రెండుతెగలవారున్ను మార్గదర్శకములే అయియున్నవి.

ఆంగ్లేయ పశువైద్యులు (వెటరినరీ డాక్టర్సు) యిప్పటికి ఈపద్ధతి ప్రకారము పశువులకుకూడ టీకాలు వేయుచున్నారు. ఇక మానవులకు ప్రాచీనకాలమునుండి పచ్చబొట్టను సూచీవ్యధ యిప్పటికిని అమలులోనున్నది. ప్రాచీనులు అనేక పరిశోధనలచే రోగములు గుర్తించుటయు, ఆయారోగముల నన్నిటికి ఉపయుక్తమగు ద్రవ్యములు, ప్రయోగ విధానములు, ప్రయోగించు పనిముట్లు (యంత్రశస్త్రములు) మొదలగు మార్గములన్నియు శిలాశాసనములవలె యనేక గ్రంథములువ్రాసి యిప్పటికిని స్మృతిజీవులై యున్నారు.

మనుష్యులకును జంతువులకును వ్యాపించు సకలరోగములకు ప్రాధాన్యముగా త్రిదోషములు (వాత, పిత్త, కఫ) ప్రధానములై ఆహార విహారభేదముల చేతను, శరీరము ప్రకృతిభేదములచేతను వేరువేరు లక్షణములతోను వేరువేరు నామములతోను చికిత్సింపబడుచున్నది. ప్రాచీనాయుర్వేద చికిత్సా విధానములన్నియు మనుష్యులకు వలనే జంతువులకు ఉపయోగింపబడును. ఇప్పుడిప్పుడే పశువులకుకూడ ఆయుర్వేద

---

చేనులో చేను కలిసినా జాగాలో జాగా కలిసినా పోనివ్వకూడదు.

ఇంజెక్షన్స్ యిచ్చు పరిశోధనలు తెనాలి పశువైద్యకళాశాలవారు ప్రయత్నించుచున్నారు. ఈ కారణముచేతనే ఆంగ్లేయ వైద్యులు కొన్ని జంతువులనుండి తయారుచేసిన మాంసరసము రక్తము చీము మొదలగు పదార్థములు మనుష్యులకు టీకాల రూపమునను, ఇన్‌జెక్షన్ రూపమునను నోటిద్వారా ప్రయోగించుచున్నారు.

పూర్వము అపరధన్వంతరియగు చరకాచార్యులు రోగములందు ఉపయుక్తౌషధమును రక్తమునందు ప్రవేశింపజేసినయెడల జీవించునని చెప్పియుండిరి. ఆరీతిగనే పూర్వశాస్త్రమే నేటికిని ఆచరణమై ఆంగ్లాయుర్వేదీయులకు ప్రధానకర్తవ్యమైయున్నది. ఆంగ్లేయులు ప్రస్తుతము చేయుచున్న ఇన్‌జెక్షన్సులకు పూర్వము టీకాలను చర్మముగీచి అచ్చటి రక్తమందు ఔషధద్రవ్యమును ప్రయోగించుచు క్రమముగా పరిశోధనలచే ఆయుర్వేదీయ సూచీముఖశస్త్రమను పనిముట్టు(సిరంజి)తో పశువులకును యితర జంతువులకును మనుష్యులకు ఇన్‌జెక్షన్స(సూచీముఖప్రయోగము)చేసిరి. ప్రాచీన చరకాదులు చెప్పియున్నట్లుగనె ఔషధములను రక్తమునందు ప్రవేశపెట్టుట కనుకూలించునట్లుగా ద్రవరూపముగా మార్చి నవీనులు వాడుచున్నారు. ప్రస్తుతము వాడుచున్న ఇన్‌జెక్షన్సు విధానముగా నుపయోగించు సీరములుకూడ ద్రవరూపముగనే తయారుచేయుచున్నారు. ఇట్టిసీరములు పశువుల కత్యంతోపయోగమగునటుల గ్రహించి రసాయనశాస్త్రజ్ఞులగు ప్యాస్టియరుదొర చంబరులాండుదొర రౌప్సదొర యను వీరుమువ్వురు కొన్ని జంతువులనుండి పరిశోధనలు చేసి సీరములను కనిపెట్టియున్నారు. ఇట్టిరసములు పశురక్తమునందు ప్రవేశించగనే శరీరమంతయు వ్యాపించి త్వరలో గుణమిచ్చును. పెదరక్తనాళములోనికి ఎక్కించిన త్వరగా పనిచేయును. సిరలలో ఎక్కించిన అంతకంటె ఆలస్యముగను కండరములలోని ఎక్కించిన కొంత ఆలస్యముగను చర్మములోని ఎక్కించిన మరికొంతఆలస్యముగను వ్యాపించును. కాబట్టి ప్రాచీన సిద్ధాంతముల ననుసరించియే నేటికిని ఆయుర్వేద పశువైద్యులు వెటర్నరీ వారిచ్చు ఇన్‌జెక్షన్సు మారుగా జెముడుపాలు మంచినూనె కలిపి పశువులకువచ్చు చీడపార్లు దొమ్మగుటక మున్నగు అసాధ్యరోగములకు తగుపాటి వెదురుగొట్టముతో ఆయా రోగనిశోధక స్థలములందు టీకాలువేయుట ఇప్పటికి అందరికి విశదమైయున్నది. ఇట్లే యింకను అనేకవిధములుగా ఆయుర్వేద తంత్రకారులు ఇన్‌జెక్షన్ ప్రయోగములు వ్రాసియున్నారు.

కాబట్టి ఆంగ్లాయుర్వేద పద్ధతులు రెంటికిని ఎంతమాత్రము భేదము కాన్పించదు గాని ఆంగ్లవైద్యమందు వాడు మందులు మాత్రము కొంచెము భేదముగ కాన్పించును. అయినను ఆమందులన్నియు మన భారతదేశమందు ఉత్పత్తియగు మూలికలవలననే తయారుగాబడుచు ప్రభుత్వాదరణముచే ఎక్కువ ప్రాముఖ్యత వహించుచున్నవి. మద్రాసు గవర్నమెంటువారు ఆయుర్వేద పశువైద్యముపైన తెనాలి ఆంధ్రజాతీయ పశువైద్య కళాశాలపైన సవతితల్లి ప్రేమజూపుచుండినందున ఆయుర్వేద పశువైద్యము సంపూర్ణ సౌష్ఠవము నొందజాలకున్నది. ఈవిషయమై తగినప్రయత్నములు జరుగుచున్నవి.

---

అగ్రేవాపి సాంద్రవాపి గోపోష్మీ,బీజసంగ్రహీ సాయంప్రాతః క్షేత్రదర్శీ ప్రశియుపినశ్యతి.

## ఆయుర్వేద పశువైద్యాచార్యులు విదేశీయౌషధములు నిరభ్యంతరముగా వాడవచ్చును.

ప్రాచీన కాలమునాటి ఆయుర్వేద పశువైద్యము నేడు సంస్కరింప బడవలసిన కాలాలు వచ్చినవి. కాలముకూడ దీనికి అనుకూలముగానున్నది. ప్రజలుకూడ ఆయుర్వేద పశువైద్యముపట్ల సుముఖులై యున్నారు. ఇపుడు నూటికి తొంబది మందికి ఆయుర్వేదపశువైద్యముపట్ల ఆదరణము కలుగుచున్నది. ప్రాచ్య ప్రాచీన వైద్యములలోనుండు రహస్యములనెల్ల విమర్శించుచున్నారు. ఆంగ్లవైద్య వెటరినరీ డాక్టర్లు చేయు ఇంజెక్షన్సు, ఆయుర్వేద భాగమగు శల్యతంత్రము (శస్త్రచికిత్స) లోని ఉపకరణములని విశాల హృదయులగు మా పాఠకులకు బోధపడుచున్నది. నాదగ్గర సుమారు 200 మంది పశువైద్యాచార్యులు తర్ఫీదైరి. నేను చెప్పు పశువైద్య విద్యకూడ ఇంగ్లీషు, ఆయుర్వేద పశువైద్యచికిత్సలే. రైతులందరకుకూడ ఈ చికిత్సలు తెలిసికొనవలెనని కోరిక. ఇంజెక్షన్సు యిచ్చుటలో కొంతమంది వైద్యులు ధనార్జన కొరకు రైతులను మోసపుచ్చుచున్నారు. ధగధగ మెరిసే డిస్టిలు వాటరు ట్యూబుతో నాటకమాడే డాక్టర్లను ఎంతోమందిని చూచితిని. అందుచేత ప్రతిరైతుకూడ ఏ డాక్టరు వచ్చిన మందుల పేర్లు, ఇంజెక్షన్సు పేర్లు అడిగి తెలిసికొనవలెను. ఏమైన మోసాలున్న తక్షణమే వారి పైవారికి తెలిపి తగినచర్య తీసికొనవలెనని నా కోరిక.

పూర్వము చరకుడు స్వదేశీయ, విదేశీయ భేదము లేశమాత్రము వైద్యులుగాని వైద్యేతరులుగాని తలంచరాదనియు, మానినగే మందని సెలవిచ్చియున్నారు. గాన ఆయుర్వేద పశువైద్యాచార్యులందరు ఏ యే సమయములలో ఏ యే ఔషధములవలన రోగనివారణ కాగలదో అట్టి మందులను ఇంజెక్షను నున్నను వాటిని తెలిసినంతవరకు వాడవచ్చును. తెలిసి తెలియని చికిత్సలు చేసిన శిక్షకు పాత్రులగుదురు.

### ఇంజెక్షన్సు

పశువులకిచ్చు మందులు జీర్ణకోశముగుండపోయి అచ్చట జీర్ణించి క్రమముగా ఆహారసారములో కలిసి రక్తములోనికి పోయి గుణమిచ్చుట అందరికి తెలిసిన విషయమే. ఈఇంజెక్షన్సును జాగ్రత్తగా రోగనిదానములను గ్రహించి శారీరశాస్త్రము భాగములను గ్రహించి చేయవలెను. ఇప్పటి నవనాగరికత పరిస్థితులనుబట్టి లోపలకు మందులను యిచ్చినను యివ్వకపోయినను డాక్టరు యింజెక్షన్ యిచ్చినాడంటే వ్యాధి తగ్గునదనే రైతుల నమ్మిక. ముఖ్యముగా అంటువ్యాధులకు ఇంజెక్షన్సు అవసరము. రోగపశువు ఆహారము లోనికి తీసికొనలేని స్థితియందున్నపుడు వ్యాధి ఉద్రేకముగానుండి ఔషధము జీర్ణించి రక్తనాడులలోనికి వచ్చి పనిచేయు నంతటి విరామములేనప్పుడు ఇంజెక్షన్ చాలాఉపయోగించును.

1. హైపోడెర్మిక్ ఇంజెక్షన్:- చర్మముక్రింద మందు విడచునది.
2. ఇంట్రమస్కులర్ ఇంజెక్షన్:- మాంసకండరములలోనికి మందుపంపుట.
3. ఇంట్రవీనస్ ఇంజెక్షన్:- రక్తనాళములోనికి మందుపంపుట.
4. ఇంట్రస్పైనల్ ఇంజెక్షన్;—దండినాళములోనికి మందుపంపుట.

ఈరీతిగా పలువిధముల ఇంజెక్షన్సు గలవు.

# అంటు వ్యాధులు

## పదమూడవ భాగము

### పశువైద్య సూత్రములు

పశువు నోరులేని జంతువుగాన మనుష్యులే దానిని బాగుగా పరీక్షించి తగిన వైద్యాది సదుపాయములు చేయవలయును.

పశువుశరీరమునకు ఎముకలే ఆకారమును కలుగజేయును. ఎముకలులేనిచో పశువు ఒకమాంసపుముద్దగా నుండును. శరీరమునందు చాల కోమలములు, సుకుమారములు నగు మెదడు, వెన్నెముక, హృదయము, ఊపిరితిత్తులు మున్నగు అవయవములు ఎముకల గూళ్ళలో నమర్పబడియున్నవి.

పశువునకు మంచి ఆకలిపుట్టుట, సరిగా ఊపిరిపీల్చుట, బాగుగా పేడవేయుట మొదలగునవి సక్రమముగా జరుగుచున్నచో ఆ పశువు ఆరోగ్యముగా నున్నదని గ్రహించవలెను.

పశువులు సుఖస్థితియందుండునపుడు గుంపులో కలసిమేసి, వలసినపుడు మేత మేయుచు, కాలమెరిగి నెమరువేయుచుండును. చెవులు మాటిమాటికి ఆడించుచుండును. ముక్కు మూతి చెమ్మగలిగియుండవలెను. కన్నులు నిర్మలముగను, కాంతిగనుండును. చర్మము మృదువుగనుండును. వెంట్రుకలు చర్మముమీద వ్రాలియుండును. పశువులు ఒకదాని నొకటి నాకుకొనుచు కాలోచితముగా పేడవేయును. ఆ పేడ మెత్తగా నుండును. ధారాళముగా మూత్రము పోయును. ఏ యంగమందును వాపుగాని, పుంటు గాని లేకయుండును. ఈ లక్షణములన్నియు సుఖజీవితమును తెలుపును. అట్లుండక మందవిడిచి, దూరముగాపోయి నల్లకప్పు వేసికొనియుండిన యెడల ఆ పశువు అనారోగ్యముగానున్నదని గ్రహించవలెను.

కొమ్ములు వెచ్చగాను, ముక్కు ఎండి మూతి చెమ్మలేక వెచ్చగానుండి మూత్రము పసుపురంగువలె కొంచెము కొంచెము పోయుచు, పేడగట్టిగా వేసి మేతమాని మిక్కిలి దాహముగొనియుండెనేని అట్టి పశువునకు జ్వరము తగిలినదని గ్రహించవలెను.

పశువు ప్రాణమునకు గాలి ముఖ్యాధారము. అదిలేనిదే ఒకనిమిషమైనను జీవింపలేదు. సర్వావస్థలయందును పశువులు గాలి పీల్చుచుండును. అట్టి గాలి పరిశుద్ధమైనదిగా నుండవలయును.

పశువు ఆహారములేకుండ కొన్నిదినములవరకుండగలదు. గాని, దాని శరీరశక్తి నశించి అవయవముల బలము క్షీణించును.

---

బడిలేని చదువు వెంబడిలేని సేద్యము కూడదు.

పశువు గాలి సరిగ పీల్చకపోవుటచేతనే శరీరమందు ప్రాణశక్తి క్షీణించును. అప్పుడే పలువిధరోగముల పాలగును.

నిలువయుండిన గుంటలో నీరుగాని, మురుగునీరుగాని పశువులను త్రాగనీయరాదు. అట్లు త్రాగనిచ్చినచో అవి పలువిధముల సంకటముల పాలగును.

జడ్డు, రక్తము, సొలి, మూత్రము, పుసులు, చెమట, చీమిడి, చొంగ మొదలగునవి అపరిశుద్ధములు.

పశువును కష్టపెట్టి పనిచేయించిన వెంటనే నీరు త్రాగించరాదు. అట్లు త్రాగించినయెడల ఆరోగ్యముచెడును.

పశువులను ఎండ వానలకు పాలుగానీయక కాపాడుచుండవలెను. ఆహారవిహారములయందును, పాటుపనులను, పశువులను మిగుల జాగరూకతతో చూచుచుండవలెను.

పశువులకొట్టము గొప్ప భూమిమట్టము చుట్టుప్రక్కల కంటె నెత్తుగానుంచి ఏటవాలుగా మలమూత్రాదులు క్రిందికి జారునట్లుగా [illegible] వేయవలెను.

చలిగాలి తగులకుండునట్లు పశువులకు తగినకొట్టములు కట్టించవలెను. కిటికీలు చాలినంత వెలుతురు వచ్చునట్లుగా నుండవలయును.

కొట్టములలో నీరు, ప్రొక్కుడుగడ్డి నిలువయుండరాదు. ఆ యెరువునంతను పశువులుండు స్థలమునకు చాలదూరముగా లోతైనగోతులు త్రవ్వి, వానిలో వేయించవలెను. ఇట్లు చేయుటచే దోమలు మొదలగునవి రాజాలవు.

పశువుకొట్టముల గోడలకు సంవత్సరమున కొకసారి సున్నము కొట్టించిన యెడల విషక్రిములు చేరజాలవు.

వ్యవసాయమునకు పనికివచ్చు పశువులను తదితర పశువులలో చేరనీయక ప్రత్యేక స్థలములందు కట్టివేసి చక్కగా మేపవలయును. వారముదినముల కొకసారి పశువులను నీళ్లతో శుభ్రముగా కడుగుచుండవలెను.

పశువులు క్రిక్కిరిసి యుండునట్లు చేయరాదు. ప్రతి పశువునకు పరుండుటకు స్థలము విశాలముగా నుండవలెను. పశువులదగ్గర గోతులలో ప్రబ్బు తీసివేయుచుండవలెను.

పశువుల కొట్టములు శుభ్రముగా నూడ్చుచుండవలెను. గొడ్లకు చిట్టు, తవుడు మున్నగు నాహారపదార్థములు పెట్టుటకు పేడబూసిన బుట్టల నుపయోగించవలెను.

ప్రక్కపశువు తగులకుండునట్లు పలుపులు కురచగా నుండవలెను. లేనిపక్షమున పశువు లొకదాని నొకటి రాచుకొని పొడుచుకొని త్రాళ్లు తెంపుకొని అల్లరిచేయును.

గుంజకును గుంజకును మధ్య నాలుగడుగుల దూరముండవలెను. పలుపులు కొంచెము పొడుగుగా నుండినగాని పశువులు పండుకొనునపుడు లేచునపుడు వీలుగా

నుండదు. గుంజల పాతుటకంటె గాడిలో బైలలో నిడుపరి గుంజలనుర్చి వానికి పలువుల తొన్నెలు పెట్టుట మంచిది.

పశువులతో కలను విరువగూడదు. అందుచే పశువులకు కోపము కార్శ్యము కలుగును. లేనిచో అవి మొద్దుబారిపోవును.

జబ్బుగానున్న పశువులకు తగినంత మేత మేపవలయును. గంజి, జావ, పచ్చిమేత మొదలగునవి పెట్టవలయును. ఇంతియే కాక ఆ పశువును నీడగలస్థలమునందుంచి సారవంతమైనట్టియు సులభముగా జీర్ణమగునట్టియు ఆహారమును పెట్టుచుండవలెను.

జబ్బుగానున్న పశువులకొట్టములోని అడుగుభాగమును పారతో గీకించి మరల క్రొత్తమన్ను పోయించి దిమ్మిసతో కొట్టించవలెను.

అంటువ్యాధులు సోకిన పశువులను ప్రత్యేకస్థలము నందుంచి చికిత్సలు చేయుచుండవలెను. రోగముతోనున్న పశువుల మలమూత్రాదులు ప్రతిదినము తీసివేసి అచ్చటి చెత్తనుకాల్చి శుభ్రము చేయవలెను.

ఆ పశువుల పేడతో పిడకలు చేయరాదు. ఊడ్చిన స్థలమందు ఫినైల్ గాని, కర్పూరతైలముగాని చల్లవలెను.

అంటువ్యాధిగల పశువు చనిపోయినచో నూరినిగా ప్రవచేకోయి చక దూరముగా తీసికొనిపోయి సున్నము, ఉప్పువేసి పాతి పెట్టించవలెను.

రోగముతో నున్నపశువులకు దగ్గరగానుండు వ్యవసాయసామగ్రులు (గుంజలు, గాడి) మొదలగు పనిముట్లు సున్నపునీటితో చక్కగా కడగవలెను.

ఔషధము త్రాగించునపుడు పశువుయొక్క తలను ఎత్తిపట్టుకొని నోరు తెరచి ఒక్కొక్క గ్రుక్కవంతున త్రాగించవలెను.

దగ్గునట్లు పశువుకనబడెనేని పట్టువిడిచి దగ్గనిచ్చిన తర్వాత మందు నోటిలో పోయవలెను. లేనియెడల ఊపిరి గొట్టములోనికి మందుపోయి దగ్గలేక కొన్ని పశువులు మృతినొందును.

పశువుల పుండ్లను శుభ్రముగా నుంచవలెను. దినమునకు రెండుసార్లు వేడినీటితో కడిగిన తర్వాత గాయములకు కట్లు కట్టవలెను.

చాలా పెద్దగాయములుగాని, కాలిపుండ్లుగాని యున్నయెడల వానికట్లను బలవంతముగా నొకేసారి తీయరాదు. అట్లు తీయుటచే గాలిలోనుండు సూక్ష్మజీవులు ప్రవేశించి పురుగులు పడును. కట్లు రసితో అంటుకొనినయెడల వానిమీద వగరునీరుపోసి తడిపి మెల్లగా తీయవలెను.

పశువుల నెంతశుభ్రముగానుంచిన నంతఆరోగ్యముగా నుండునని మన కొల్లరకు

---

పదిజనములు పుండ్లైవానికి జరుగును ; ఒంటివానికి యముభాధే కాని సేద్యము కాదు.

తెలిసిన విషయమే కాబట్టి ప్రతికృషీవలుడు వానిని శుభ్రముగా కడుగుచు మంచిస్థితి యందుంచుట అత్యంతావసరము.

వేసవికాలములో వారమునకు రెండుసార్లును శీతాకాలములో నెలకొకసారి యును పశువులను చెరువులలోనికి, గుంటలలోనికి, పారుచున్న నదులలోనికి దింపి శుభ్రముగా కడిగి శరీరము ఆరునంతవరకు ఎండలో త్రిప్పవలయును.

పాడిగొడ్లను శీతాకాలమునం దెక్కువగా నీటితో కడుగరాదు. ఎండలు కాయుచున్న సమయములోనే కడుగవలెను. ఆరునెలలకు తక్కువగానుండు దూడలను కడుగరాదు.

మంచిపశువుల శరీరము బ్రష్‌తో తుడిచినయెడల గోమారులు, పేలు, మిణ్ణలులు మున్నగునవి పట్టక శుభ్రముగా నుండును. పశువులను బహిరంగ ప్రదేశములలో శరీర పరిశ్రమ కలుగుటకు త్రిప్పుచుండవలయును.

దీర్ఘవ్యాధులకు తప్ప ఆకస్మిక వ్యాధులకు ఎక్కువగా మందులను వాడరాదు. అట్లు వాడినయెడల పశువునకు ప్రాణాపాయము రాగలదు.

పశువు మిక్కిలి బలహీనముగా నున్నయెడల, ఆహారము తినుటకుగాని, త్రాగుటకుగాని లేపదీయరాదు. అది లేవలేదను నావేశముతో శరీరముపై దెబ్బలు కొట్టరాదు. పరుండనిచ్చియే నెమ్మదిగా ఆహారము పెట్టవలెను.

అన్ని వ్యాధులయందును ముఖ్యముగా తీవ్రదశయందున్నప్పుడు కఠినపదార్థముల నాహారముగ వాడుట మానివేసి ద్రవపదార్థములను మాత్రమే వాడవలెను.

వ్యాధిగల పశువులకు ఒకేసారి ఆహార మంతగా పెట్టరాదు. కొంచెము కొంచెముగా పెట్టుచుండవలెను.

పశువును చీకటిగదిలో నుంచరాదు. తీక్ష్ణమైన వెలుతురు అవసరము. అట్టి వెలుతురు పశువుమెదడునకు అవసరమైనట్టియు, అత్యధికమైనట్టియు చురుకుదనము బుట్టించును.

పశువు అనారోగ్యముగ నున్నట్లు తెలిసిన వెంటనే దానికి విశ్రాంతి నీయవలయును. అట్లు విశ్రాంతి ఇచ్చినయెడల పశురోగము త్వరగా నెమ్మదించును.

రోగము నెమ్మదించినతరువాత పశువును నీటితో శరీర మారునంతవరకు చక్కగా కడుగవలెను.

రోగము నెమ్మదించిన తరువాత పశువును కొట్టములోనుండి బయటికితీసిన తరువాత కొట్టపుగోడలను లోషనునీటితో కడుగవలెను.

ఒక గ్రామమునందు అంటువ్యాధి ప్రారంభించినపుడు రోగముసోకిన పశువులను ప్రత్యేకముగానుంచి, తగినంత చికిత్స చేయవలెను.

---

ఎంచిన ఎరువేదిరా అంటే ఎజమాని పాదము.

సుఖముగా నుండు పశువులను ఉదయము సాయంకాలములందు పరీక్షచేసి జాడ్యము సోకినట్లు అనుమానముగా నున్నవాటిని ప్రత్యేకముగా నుంచవలెను.

కల్మషములు పశువుశరీరముమీద నిలిచియున్న యెడల అవయవములు సరిగా పనిచేయక గజ్జి, తామర, నుసిమిరి, పొడ మున్నగు చర్మబాధ్యులు పుట్టును.

గేదులకు మంచినూనెగాని, వ్యాసులైనుగాని, చర్మమునకు పూసి స్నానము చేయించిన చాలా ఆరోగ్యముగానుండి పాలు బాగుగా నిచ్చును.

పాడి పశువులకు తవుడు ఎక్కువగా మేపరాదు. అట్లు మేపినచో వాతరోగములు ప్రారంభమై పశువుల కపాయము కలుగజేయును.

చనిపోయిన పశువులను కొందరు పాతివేయుదురు. కాని మనుష్యులవలెనే పశువులనుగూడ కాల్చుటయం దెట్టి ఆక్షేపణయులేదు.

పాతివేయు గోతులుమాత్రము 10,12, అంగుళుల లోతునకు తక్కువనుండరాదు. చచ్చిన జంతువులను పారవేయు శ్మశానములు కాపురముండుస్థలములకును జలాశయములకును సాధ్యమైనంత దూరముగా నుండవలెను.

కళేబరములను నదులలో పారవేయుటయు శిఖరములపై వదలివేయుటయు దుర్గంధమునకు మూలకారణము లగుటయేగాక అనేకరోగములకు కారణములగును.

అంటువ్యాధులను రెండువిధములుగ గెంచవచ్చును.

1. ఒక పశువునుండి మరియొక పశువునకు శరీరముయొక్క అస్వస్థతాభాగస్పర్శవలననేగాని మరియే విధముగను వ్యాపింపనొందదు.

2. వాయుమార్గమునగాని, జలమార్గమునగాని వ్యాపినొందును.

కొన్ని అంటువ్యాధులందు ప్రత్యేకములగు సూక్ష్మజీవులు పశువుశరీరమునందు ప్రవేశించిననేగాని లేకపోయిన యెడల వ్యాధులుకలుగనేరవు.

ప్రతివ్యాధియును కొంతనియమితకాలము పశువు శరీరము నాశ్రయించి యుండును. ఈ నియమితకాలము అనేక కారణములను బట్టి వ్యాధిగలపశువులయందు మార్పుగ నుండవచ్చును.

చచ్చినవాటిని కోయువారలనుగాని, అంటుసోకియుండు స్థలములలో దిరుగు కుక్కలనుగాని, కాకులనుగాని మంచిపశువు లున్న ప్రదేశములకు రానీయరాదు.

అంటురోగము గ్రామమునందంతటను వ్యాపించి యున్నపుడు అలసటను గలిగించు పనులను పశువులచే చేయించరాదు.

రైతులు తమ మూఢవిశ్వాసము చేతను, వైద్యుడు సమయమునకు దొరకక పోవుటచేతను ఆపత్కాలమందు రాబోవు ఆపదలను తెలిసికొనలేక కనబడిన ప్రతి

---

విత్తనము మళ్ళితే వ్యవసాయముమానరాదు.

యీదుపసరును వ్యాధి సంభవించిన పశువులకు వాడుటచే వెంటనే ఆపశువు తనప్రాణములను కోల్పోవుచున్నది.

రైతులలో కొందరు భూతవైద్యులను రప్పింతురు. మరికొందరు, దురాయి కట్టింతురు, మరికొందరు మంత్రములను పెట్టింతురు కాని పశువైద్యులలో నిటువంటి వారు పూర్వకాలమం దుండెడివారని నమ్మవచ్చునుగాని ఇప్పటికాలస్థితుల ననుసరించి నమ్ముటకు వీలుగాకున్నది.

నోరులేనిపశువు వ్యాధియొక్క ముందునడకను గుర్తించుటకు మిగులఅనుభవమును, మంచిబుద్ధి కుశలతయును గావలయును.

వ్యాధియొక్క ముందునడకను సరిగా చెప్పగలుగుటకు వైద్యుడు సహజగమనమును జక్కగా దెలిసినవాడై, ఆరోగ్యముయొక్క సహజతత్వమును ఎరిగినవాడై తానుపయోగించు ఔషధములయొక్క గుణములను, శక్తులను, గ్రహించుటయందు మిగుల అనుభవముగలవాడునై యుండవలెను.

వ్యాధియొక్క ముందునడకనుగూర్చి వైద్యుడు తనంతట తాను పశువు యజమానికి చెప్పరాదు. ఎవరైన అడిగినయెడల తెలిసియున్న సంగతిమాత్రమే చెప్పవలెను. అనుమానముగా నున్నసంగతి చెప్పుటయందు బహుజాగ్రత్తగా నుండవలెను.

వైద్యులు చెప్పుసంగతులు సాధ్యమైనంతవరకు ఆశను పుట్టించునవిగా నుండవలెను. స్పష్టముగా పశువునకు మరణము సంభవించు స్థితియందు వైద్యుడు తానెరిగిన సంగతి నంతయు స్పష్టముగా యజమానునకు చెప్పవలెను.

పశువుయొక్క దేహతత్వము తెలియువరకు మందులు కొద్దికొద్ది మోతాదులతో వాడుట మంచిది.

చూడిపశువుల విషయమై తగినంత శ్రద్ధతీసికొని లక్షణములు గ్రహించి తగిన మందీయవలయునుగాని, ఇతర పశువులకువలె ఈపశువులకు మందు లీయకూడదు.

అన్ని మందులలోను కలియు వస్తువులు క్రొత్తవిగను, పరిశుభ్రమైనవిగను చేర్చవలెను. ప్రాతవస్తువులు, నిస్సారమైనట్టియు పుచ్చిపోయినట్టియు మూలికలను వాడరాదు.

## సూక్ష్మజీవులు

పశువుల వ్యాధు లనేక విధములుగా నుండును. కొన్ని వ్యాధులు అవయవములు తమ తమ నియమిత వ్యాపారమును నెరవేర్చని కారణమున కలుగును. మరికొన్ని శీతోష్ణస్థితి భేదములవలన కలుగును. పెద్దరోగము, దొమ్మ, గురక, కురదు మున్నగు రోగములు ఒక పశువునుండి మరియొక పశువునకు అంటుకొను రోగములు. ఇవి కంటికి కగుపడని సూక్ష్మజీవులవలన కలుగుచున్నవి. వృక్షములలో ఒక్కొక్క చెట్టునకు ఒక్కొక్క

దున్నేవాడు లెక్కచూస్తే నాగలికూడా మిగలదు.

జాతి బీజముండును. ఆబీజము ఏప్రదేశమున బడిన నా ప్రదేశమునందు మొలకెత్తి దాని నుండి ఆవృక్షమే మొలచును. అటులనే అంటువ్యాధులకును ఒక్కొక్క వ్యాధి వ్యాపింపజేయుటకు సూక్ష్మజీవులు (Micro - organisms) బీజములగుచున్నవి. ఒక జంతువునుండి వేరొక జంతువునకు వ్యాప్తమగువ్యాధి అంటువ్యాధి యనబడును. ఒకటే విధమగు లక్షణములు కలిగిన రోగము ఒకటేవిధమగు సూక్ష్మజీవివలన కలుగుచున్నట్లు దృఢపడినది. పెద్దరోగపు విత్తనము నాటిన శరీరమున పెద్దరోగపు లక్షణములే కన బడును గాని గుదకలక్షణములు కనబడవు. ఒక పశువునుండి మరియొక పశువునకు అంటువ్యాధి వ్యాపించవలె ననినచో ఈక్రింది పరిస్థితు లనుకూల పడవలెను.

1 వ్యాధిని కలుగజేయుటకు తగిన తీవ్రతగల సూక్ష్మజీవుల సమూహము.

2 వ్యాధిని కలిగించుటకు చాలినన్ని సూక్ష్మజీవులను ఒక ప్రదేశమునుండి మరొక ప్రదేశమునకు గొని పోగల సాధనము.

3 సూక్ష్మజీవులు సులభముగ ప్రవేశించుటకు అనుకూలమైన శరీరక్షేత్రము.

పై పరిస్థితు లెంతపూర్తిగా అనుకూలపడిన అంతత్వరలో తగినంత తీవ్రతతో వ్యాధి ఒక పశువు నుండి మరి యొక పశువునకు వ్యాపింపగలదు.

## అంటువ్యాధుల వ్యాపకము

ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు అంటువ్యాధులు వ్యాపించుటకు ఆ ప్రాంతములందు కలుగు మనుష్యసంచారము, జంతుసంచారమును కారణములు. పశువులు మేతకొరకు దూరదేశములకు పోవుట. చచ్చినజంతువుల మాంసమును మాదిగ వాండ్రు వేరొక ప్రదేశమునకు తీసికొని పోవుట, కాకులు, కుక్కలు అంటుజాడ్యము గల జంతువుమాంసమును ఎత్తుకొని అక్కడక్కడ పారవేయుట, అంటువ్యాధులు గల పశువులను సంతలకు తీసికొనిపోవుట, చచ్చినపశువులను పాతిపెట్టక నదులలో పార వేయుట మున్నగు కారణములవలన అంటువ్యాధులు వ్యాపించుచుండును.

## సూక్ష్మజీవులజాతులు

సూక్ష్మజీవులలో కొన్నిరకములు వాయుప్రసారముగల స్థలమునందే జీవింప గలవు. కొన్ని గాలిలేని స్థలములందే జీవించును. కొన్ని ప్రాణములుగల భాగములనే తిని బ్రతుకును. కొన్ని క్రుళ్ళిననిర్జీవ పదార్థములనే తినును.

చీమునుకలిగించు సూక్ష్మజీవులు

క్షయనుకలిగించు సూక్ష్మజీవులు

దొమ్మనుకలిగించు సూక్ష్మజీవులు

పెద్దరోగమునుకలిగించు సూక్ష్మజీవులు

---

వ్యవసాయము వెర్రివానిచేతి రాయి సమానము

ధనుర్వాతమును కలిగించు సూక్ష్మజీవులు.

ఇవి తమ కనుకూలమగు పరిస్థితులు కలుగువరకును నిద్రావస్థలోనుండి, పరిస్థితు లనుకూలించినవెంటనే విజృంభించి రోగమును వ్యాపింపజేయును. సూక్ష్మజీవి సామాన్యముగ కంటికి కనబడక పెక్కురెట్లు పెద్దదిగ గోచరింపజేయు సూక్ష్మదర్శనిలేక భూతదర్పణము (Microscope) సహాయమున మాత్రమే కనబడును. వీని శరీరపరిమాణము అంగుళములో 1/3570—1/450 భాగము మాత్రముండును. ఇవి వాతావరణమునందును, నీటియందును, ఆహారపదార్థములందును, నేలపై పొరలలోనుండు మట్టియందును జీవించుచుండును. పశువు శరీరముపైనను, జీర్ణకోశమందును కూడ సూక్ష్మజీవు లుండును. ఒక్కొక్కజాతిసూక్ష్మజీవికి ఒక్కొక్కగుణము కలదు. కొన్ని దుర్వాయువు లను కలిగించును. కొన్ని దుర్వాయువులను క్రుళ్లునట్లు చేయును. కొన్ని క్రుళ్ళిన పదార్థములను తిని వానిని శుభ్రపరచును. కొన్ని శరీరమునందు వ్యాపించుచు రోగమును కలిగించును. కొన్ని తాము కదలకుండనే విషమును శరీరమున వ్యాపించుటకు విడుచును. మరికొన్ని పాలు పెరుగు సారాయి మొదలగునవి పులియజేయును.

సూక్ష్మజీవులు శరీరమున ప్రవేశించుట




ఎర్రకణములు, తెల్లకణములు, క్షయ, గాలికుంటు దొమ్మ, పెద్దరోగములను కలిగించు సూక్ష్మజీవులు.

శరీర చర్మము పైభాగమున నున్నంతవరకు సూక్ష్మజీవులు ఎట్టివానిని కలిగింపజాలవు. ఏదోయొకరీతిగా అవి శరీరములోపల ప్రవేశించినప్పుడే రోగమును కలుగ

తల్లిదే వలపక్షము ధరణిదే వలపక్షము.

చేయును. సూక్ష్మజీవులు శరీరమున ప్రవేశించుటకు ఈ దిగువ మార్గములుగలవు.

గాయములద్వారా, నోటిద్వారా, శ్వాసకోశములద్వారా, శరీరమందలి పలుచని పొరలద్వారా.

కొన్ని సూక్ష్మజీవులు వీనిలో నేదోయొక మార్గముననే ప్రవేశించును. మరి కొన్ని రెండు మూడు మార్గముల ప్రవేశించును.

## గాయములద్వారా ప్రవేశించుట

పిచ్చికుక్క కరచుటచేతను గలుగు వ్యాధికి కారణమగు సూక్ష్మజీవి గాయము ద్వారా ప్రవేశించును. దొమ్మరోగములను గురకరోగమును కలిగించు సూక్ష్మజీవియును. గాయముద్వారా ప్రవేశించును. ధనుర్వాతమును కలిగించు సూక్ష్మజీవియును గాయము ద్వారా ప్రవేశించును. ధనుర్వాతమును కలిగించు సూక్ష్మజీవియు పశువులలో చీము పుట్టించు సూక్ష్మ జీవియు నిట్లే ప్రవేశించును. జ్వరమును కలిగించు సూక్ష్మజీవి దోమల వలన ప్రవేశించును.

## శ్వాసకోశములద్వారా ప్రవేశించుట

సూక్ష్మజీవులు ఊపిరితోపాటు శ్వాసకోశములలో ప్రవేశించి వానియందలి పలుచని పొరలలో నివాసమేర్పరచుకొని రోగమును కలిగించును. గాలివలన వ్యాపించు మశూచి విషజ్వరము మున్నగువ్యాధులు వానికి కారణములగు సూక్ష్మజీవులను ఊపిరిచే పీల్చుటవలననే కలుగును.

## పలుచని పొరలద్వారా ప్రవేశించుట

పశువు నోటిలోపలను మర్మావయవములందును ఆసనద్వారమందునుగల మృదువైన పలుచని పొరలద్వారా గాయములేకున్నను సూక్ష్మజీవులు లోనికి ప్రవేశించి రోగములను కలిగించును. కంటిలోని పలుచని పొరలలో సూక్ష్మజీవులు చేరుటవలన కండ్లకలకయు, ముక్కురంధ్రములందు సూక్ష్మజీవులు ప్రవేశమువలన పీనసరోగమును కలుగును.

## నోటిద్వారా ప్రవేశించుట

ఆహారపానీయములతో సూక్ష్మజీవులు నోటిద్వారా జీర్ణకోశమున ప్రవేశించి వ్యాధులను కలిగించును. వీనిలో పెద్దరోగము, పారుడు, రక్తవిరేచనములు, సూక్ష్మజీవుల సంపర్క మనేకవిధముల కలుగవచ్చును. పెద్దరోగముచే బాధపడిన పశువు మలమూత్రములలో తత్కారణములగు సూక్ష్మజీవులు రోగమువిడిచిన కొంతకాలమువరకును విసర్జింపబడు చుండును. వీనిచే జలాధారములు సంకరము కావచ్చును. మలమూత్ర

---

ములపై వ్రాలిన ఈగలు దోమలు సూక్ష్మజీవులను తోడ్కొనివచ్చి జావ, గుగ్గిళ్ళు పచ్చి గడ్డి మున్నగు ఆహారపదార్థములందును చేర్చును. క్షయవ్యాధి గల ఆవుల పాలద్వారా ఆవ్యాధి సూక్ష్మజీవులు పాలనాహారముగా గొనుచున్న పిల్లల శరీరమున ప్రవేశించి క్షయవ్యాధిని కలుగించును.

## సూక్ష్మజీవులు శరీరమును విడుచుట

ఒక పశువు శరీరములో ప్రవేశించి వ్యాధిని కలిగించు సూక్ష్మజీవులు తిరిగి శరీరమున నుండి వెలువడిన గాని ఇతర పశువుల శరీరములను వ్యాపింప జాలవు. సూక్ష్మజీవులు శరీరమును విడుచు మార్గములు:—

1 నోరు, కండ్లు, ముక్కు, ఊపిరితిత్తులు వీనినుండి వెలువడు ద్రవములద్వారా. 2 విరేచనములద్వారా. 3 మూత్రముద్వారా. 4 పురుపుల రసిద్వారా.

మశూచికము, పెద్దరోగము వచ్చునపుడు శరీరము నందు పుండలు పొక్కులు పలుచబడి, ఎండి, పొక్కులై వానినుండి వెలువడు పొప్పర్లు గాలిలో ఎగురును. ఈ పొప్పర్లలో నసంఖ్యాకములగు సూక్ష్మజీవులుండును. దొమ్మ, గురక సోకినపుడు ఊడలు కఫముతో సూక్ష్మజీవులు వెడలి గాలిలో జేరును. క్షయపశువుల చొంగ కఫము ఎండి గాలిలో దుమ్ముతో కలసి ఎగురునప్పుడు దానిలో ననేక సూక్ష్మజీవు లుండును.

ఏరీతిగానైనను రోగపశువుల శరీరమునుండి బహిర్గతములగు సూక్ష్మజీవులు తిరిగి ఆరోగ్యవంతములగు పశువుల శరీరములందు వెంటనే ప్రవేశించవచ్చును. లేదా కొంత కాలమట్లేయుండి బయట జీవించుచుండవచ్చును. అనుకూల పరిస్థితులలో సూక్ష్మజీవులు నిరంతరము వృద్ధిజెందుట కవకాశములు గలిగియున్నవి. పశువు మరణించినపుడు తగిన యాహారములేక సూక్ష్మజీవులు నశించును. రోగము కుదిరినప్పుడును సూక్ష్మజీవుల బలముతగ్గి చాలవరకు నశించును. కొన్ని సూక్ష్మజీవులు పరిస్థితు లనుకూలముగా లేనప్పుడు గుడ్లుగా మారి పరిస్థితు లనుకూలపడువరకు నట్లేయుండును.

## సూక్ష్మజీవుల కనుకూలమగు స్థితిగతులు

### వేడిమి (Heat)

శీతోష్ణముల ఆధిక్యము సూక్ష్మజీవుల జీవనమున కనుకూలముకాదు. కొంచెము వెచ్చదనము సూక్ష్మజీవుల వృద్ధికావశ్యకము. ఎంతవేడిమి వానికనుకూలమో అంతటి శరీరోష్ణముగల జంతువులందే అవి వృద్ధిచెందును. దొమ్మసూక్ష్మజీవుల గ్రుడ్లు సీలుచేసిన గొట్టములలో 22 సంవత్సరములు బ్రతికియుండెనని పాస్టర్ (Pasteur) అను శాస్త్రజ్ఞునిచే కనిపెట్టబడెను. కొన్నిజాతుల సూక్ష్మజీవులు మరికొన్ని జాతుల సూక్ష్మజీవు

అన్నిపండించిన కాపువానికి అన్నం కరువు.

అతో కలిపినప్పుడు నశించును. సూక్ష్మజీవుల గ్రుడ్లు 130 డిగ్రీలవరకు ఉష్ణముగల వేడి నీటిని సహించి జీవింపగలవని రుజువు పడినది. నీరుచల్లారిన పిదప గ్రుడ్లు తమకవచము లను చీల్చుకొని సూక్ష్మజీవులుగా విజృంభించును. కావున సూక్ష్మజీవుల నశింపజేయు నుద్దేశముతో నీటినిమరుగ బెట్టునపుడు అరగంటవరకైనను మరగించవలెను. గోరువెచ్చగా నీటిని కాచుటవలన ప్రయోజనము లేకపోగా వాని కనుకూలమగు ఉష్ణమును కలిగించి అవి వృద్ధిజెందుటకు సహాయపడు చున్నాము.

## చెమ్మ (Humidity)

ఏమాత్రమును చెమ్మలేక మిక్కిలి పొడిగానుండు పదార్థములందు సూక్ష్మజీవులు వర్ధిల్లజాలవు. సూక్ష్మజీవులు తమ చుట్టునున్న పొరలద్వారా ఆహారమును ద్రవ రూపమున పీల్చును. కాబట్టి సూక్ష్మజీవులు అభివృద్ధికి వేడిమివలెనే కొంత చెమ్మయు నావశ్యకము.

## వెలుతురు (Light)

సాధారణముగా సూక్ష్మజీవులు అన్నియు చీకటిలో బాగుగా పెరుగగలవు. కొన్నిటికి కొంత వెలుతురు ఆవశ్యకము. కాంతిగల వెలుతురులో ఏజాతి సూక్ష్మ జీవియు బ్రతుకజాలదు.

## ప్రాణవాయువు (Oxygen)

కొన్ని సూక్ష్మజీవులు ప్రాణవాయువులేనిదే బ్రతుకజాలవు. మరికొన్నిటికి ప్రాణవాయువు అపాయకరము - పైవిషయములనుబట్టి అనుకూలపరిస్థితు లేర్పడనంత కాలము సూక్ష్మజీవులు నీటియందును, భూమియందును, గాలియందును, జీవించియుండ గల వని స్పష్ట మగుచున్నది. సూక్ష్మజీవుల గ్రుడ్లు మాత్రము పరిస్థితులు ప్రతికూలించి నను ఎండవానలను, శీతోష్ణములను లెక్కచెయ్యక బ్రతికియుండి అనుకూల స్థితిగతు లేర్పడినవెంటనే సూక్ష్మజీవులుగామారి విజృంభించును. తొలకరించిన వెంటనే దోమలు, గురకలు వ్యాపించుట కిదియే కారణము.

## అంతర్గతకాలము (Incubation Period)

ఏదైన బీజము నాటినప్పుడు అది వృద్ధిపొంది మొలకయగుటకు కొంతకాలము పట్టును. బీజమున కాహారపోషణ బాగున్నచో అది బ్రతుకును. ఆహారసమృద్ధిలేని బీజము నశించును. సూక్ష్మజీవులు రోగపశువుల శరీరములనుండి ఏయే విధముల బహిర్గతము లగునో, ఏయేస్థితిగతులలో అవి జీవింపగలవో, ఏవిధముగ నవి శరీరములో ప్రవేశిం చునో పైన తెలుపబడినది. వృక్షబీజములవలె సూక్ష్మజీవులును శరీరములో ప్రవేశించి నంత కాలము వరకును శరీరములో పెరిగినపిదపనే రోగలక్షణములు కనబడును.

---

కోరుగింజలు కొంగులోకి వచ్చును.

సూక్ష్మజీవుల ప్రవేశ సమయము మొదలుకొని రోగలక్షణములు కనబడువరకును గల మధ్యకాలమునకు అంతర్గత కాలమని పేరు. అంతర్గతకాలము కొంచెము హెచ్చుతగ్గులతో ఒక్కొక్క సూక్ష్మజీవి కొక విధముగ నియమితమై యున్నది. ఈకాలము నందు శరీరమున ప్రవేశించు సూక్ష్మజీవుల సంఖ్య ననుసరించియు రోగమును నిరోధించుటకు శరీరము నందుగల పటుత్వము ననుసరించియును స్వల్పమగు వ్యత్యాసములు కలుగుచుండును. దుర్బల శరీరము సూక్ష్మజీవుల కనుకూలమగు క్షేత్రము. ఎక్కువ సంఖ్యగల సూక్ష్మజీవులు దుర్బలమగు శరీరమున ప్రవేశించునపుడు త్వరలో రోగలక్షణములు కనబడును. బలమైన శరీరమున స్వల్పసంఖ్యగల సూక్ష్మజీవులు ప్రవేశించినచో రోగము కలిగించుటకు వలయు శక్తిగలిగి యుండవు. ఈ ప్రక్కనున్న పట్టిలో అంతర్గత కాలమును, వ్యాధికుదిరిన తరువాత అంటుతనము పూర్తిగా పోవువరకు రోగ పశువు నితర పశువులతో కలియకుండ బహిష్కరించవలసిన కాలపరిమితియు తెలుపబడినవి.

## పశుజాతికి హానికలుగజేయు యీగలు

ఈగలు మూడు జతలకాళ్లను, ఒక జత రెక్కలను కలిగియుండును. వాటి పుట్టుక అవి పెట్టే గ్రుడ్లు పొదగబడుటవల్ల కలుగును. ఈ లార్వే ఆకారములో కోణాకారముగయుండి తల చివర సూదిగయుండును. ఆ తలపైన రెండు కొంకెపు



గోమారులు, మిన్నల్లులు జోరీగలు, పేలు, తుండీగలు.

మూగిరి దవడశంఖులను కలిగియుండును. ఈ లార్వే, అవి బాగుగ పెరిగేవరకు కొన్ని రోజులు ఆహారమును ఎక్కువగా తీసుకొని తదుపరి తిండిమానివేసి పిల్లలగును. నిండుగా పెరిగిన లార్వే యీ మార్పుకొఱకు కొన్ని అంగుళములు భూమిక్రింద

ప్రావను. కొన్నిరకముల యీగలలో ఆడుయీగలు గ్రుడ్లుపెట్టక లార్వేనే చేయును. ప్యూపలు (నిద్రావస్థ) దశలోవున్న గూడులో లార్వే యీగగా మారి ఆ గూడు బ్రద్దలుచేసుకొని బయటికివచ్చును. ఆ ప్రకారము ప్యూపలు గూడునుంచి మొగ ఆడ యీగలు యీవిధముగా బయల్పడి వాటి జీవితమును జరుపుకొనుచుండును.

## ఈగలను రెండు విధములుగా విభజింపవచ్చును

1. కొన్ని యీగలు కరచి రక్తము పీల్చువవి. చాలమట్టుకు యీ రకము యీగలు నీళ్ళలో వుత్పత్తియగును.

2. మరికొన్ని యీగలు కరువకుండా జంతువుల శరీరముమీది వుండ్లరసినిగాని, ఎండిన వుండ్లరసినిగాని లేక మర్శ్యపదార్థములనుగాని ఆహారముగా చేసుకొనును. అవి ఎరువులో కుళ్ళిన మాంసాదులలో లేక జీవించియున్న జంతువుల కండరములలో ఉత్పత్తియగును.

1. కరచి రక్తముపీల్చు యీగలలో ముఖ్యమైనవి :—

దోమలు, జోరీగలు, తుండీగలు, అడవియీగలు మరికొన్నిరకపు నుసములు అనునవి. దోమలు మరికొన్ని నుసుములు అనునవి రక్తముపీల్చి కొంతవరకు జంతువులను హింసించినప్పటికిన్ని సాధారణముగా పశుసముదాయమునకు హానికరమైనవికావు. అయినను వాటిలో కొన్నిరకములు చర్మపురుగులను, కుక్కలలో 'గుండెపురుగును' వ్యాపింపజేయును. ఒకరకపు దోమలు పాండుజ్వరమును, బోదజబ్బులను, మలేరియా జ్వరమును మనుష్యులకు కలుగజేయును.

శాల యీగ చాలామట్టుకు యింటి యీగను పోలియుండును. అయితే దానికి చర్మమును పొడిచి రక్తమును పీల్చుటకు చాలినంత పొడవైన ముక్కుకలదు. అది చెమ్మగావుండు జీవపదార్థములో అనగా కుళ్ళిన పచ్చగడ్డిలోను, ఎండుగడ్డిలోను లేక శాల యెరువులోను పెరుగును. దాని గ్రుడ్లు గుంపులు గుంపులుగా వేయబడును. అవి సూక్ష్మమైన తెల్లని పురుగులు లేక లార్వాగా మారును. అవి యెరువు మొదలైన జీవపదార్థములను షుమారు వారంరోజులు ఆహారముగా చేసుకొనును. తదుపరి యెండిన యెరువులో గాని లేక యెరువులకు కొంతదూరములోనుండు నేలలోగాని పిల్లలగును. రమారమి వారము, పది రోజులలో నిద్రావస్థనుంచి పెద్ద మొగ, ఆడయీగలు బయల్పడును. అనుకూలమైన పరిస్థితులలో గ్రుడ్లు యీగలు అగుటకు కనీసము 12 రోజులు పట్టును.

శాల యీగలు పశువులను, గుఱ్ఱములను మరి యితర జంతువులనుకూడ బాధించును. అనికొన్ని సమయములందు మనుష్యులనుకూడ కరచును. వాటి కాట్లు దురద పుట్టించుటయేగాక దొమ్మ, పాండు మరి యితర జబ్బుల క్రిములనుకూడ వ్యాపింప

సంసారి తిరిగి చెడును : జోగి తిరగక చెడును.

చేయును. ఇవి గుఱ్ఱముల పొట్టలోనుండు పురుగులనుకలుగజేయుటకు మధ్య పెంపుడు పురుగులుగా ప్రవర్తించును.

సాధారణపు యింటి యీగలుకూడ ఆ పురుగులను పెంపుచేయుటకు పెంపుడు పురుగులుగా ప్రవర్తించును. గుఱ్ఱములు అవ్యక్తముగా యిట్టి యీగలను మ్రింగుట వలన అట్టి అంటును పొందుచున్నవి. ఈ యీగల పొట్టలో లార్వే పురుగులు క్రిములగుచున్నవి.

మరియొక యీగ కలదు. అది కాల యీగకన్న చిన్నది. అది కొమ్ముయీగ అనబడును. అవి పశువుల కొమ్ముల మొదలులలో గుమిగూడును. వాటికాట్లు దురదను పుట్టించును. అట్టి దురద పాడియావులలో పాలను తగ్గించును. అవి తాజా అవుపేడలో పెరుగును. అవి యెట్టి జబ్బులను వ్యాపింపజేయునో తెలియకున్నది.

గుఱ్ఱపు యీగలు అని పిలువబడే జోరీగలు పెద్దవై లావుగాయుండును. అవి కాల యీగలకన్న షుమారు 4, 5 రెట్లు పెద్దవి. వాటికి సుమారుగా పెద్దతలకలదు. చాలావాటిలో వాటి జీవితములో కండ్లు పొగసైన రంగులో వుండును. ఆడవి, వాటి భయంకరమైన నోటిలోని కొటుభాగములతో కఱతో రక్తముపీల్చునవి కాని, మొగ వాటికి నోటిలో అట్టి కరచెడి భాగములులేవు. అవి కాయపదార్థరసములపై జీవించును. ఈ యీగలు వాగులు, చెరువులు, గుంటలు లేక పైరుపంటతోవున్న పొలము మొదలైన నీళ్లలో పెరుగును. నీళ్లమీదకు వంగివున్న ఆకులమీద లేక చిన్న కొమ్మలమీద గ్రుడ్లుపెట్టును. ఈ గ్రుడ్లు వారం, వారముపైగా పొదగబడి వాటినుంచి లార్వే నీటిలోనికి వెలువడి నీటిలో జీవనముచేయును. అవి నీటిలోనుండు జీవులమీద అనగా దోమలు, మరి యితర లార్వేలను ఆహారముగా జేసుకొని పెంపొందును. అవి నిండుగా పెరిగిన లార్వే అగుటకు 4 మొదలు 6 నెలలు పట్టును. తదుపరి ప్యూపెలు మారుటకు చెమ్మనేలలోనికి లేక కుళ్ళు ఆకుపదార్థములోనికి ప్రాకును. ప్యూపెలు పొదుగుటకు 2 మొదలు 6 వారములు పట్టును. గ్రుడ్డావస్థనుంచి పెద్దయీగ అగుటకు సుమారు ఆరునెలలు పెట్టును.

ఈ జాతిలో 3 రకముల ఈగలుకలవు. అవియేవన :—

1 టబానస్, 2 హెమటోపోటా, 3 మరియూ కైసాప్స్. ఇవి అన్ని చాల నొప్పికలుగజేయు కొట్లు చేయును. అందువల్ల జంతువులకు చాలా దురద కలుగజేయును. వాటివల్ల కలిగిన గాయములనుంచి రక్తము కారును. అందువల్లనె యెక్కువ యీగలు జంతువు నావరించినయెడల గమనింపవలసినంత రక్తనష్టము కలుగును. ఇట్టి యీగలు పొండు, దొమ్మ యితర అంటువ్యాధులను పశువులకు, గుఱ్ఱములకు వ్యాపింపజేయునని తెలియుచున్నది. గుఱ్ఱములలో నిల్వ నీళ్ళజ్వరము యీ యీగలవల్ల రాగలదు. జోరీగలవల్ల కలిగిన పుండ్లమీద యింటి యీగలు వ్రాలును. ఏలనన,

వాటికి ఆ పుండ్లనుంచి స్రవించు రక్తము ఆహారమగును. ఈ యీగలు ఆ పుండ్లను ఇతర చెడుపదార్థములతో అంటచేయును.

అడవి యీగలు లేక "గుడ్డి యీగలు" అని ఒకప్పుడు పిలువబడేవి చర్మపు మాత్రకలిగియూ, వాటికొమ్ముభాగము తెల్ల పింగాణీ మబ్బురంగుపై చుక్కలుకలిగి వున్నట్లు కనుబడును. వాటికి రెక్కలుకలవు గాని చూడగా అవి యెగురుటకు బదులుకైన చెదర గొట్టబడినప్పుడు అది వాలియున్న పశుశరీరముయొక్క ఒక భాగమునుంచి మరియొక భాగమునకు మాత్రము మారును.

ఈ యీగలు పూర్తిగా పెరిగిన లార్వేని పెట్టును. అవి తిరిగి తక్షణమే పొడుగు గింజలమాదిరి ప్యూపలు అవును. పూర్తిగా పెరిగిన యీగ యీ 'ప్యూపా' లేక నిద్రావస్థనుంచి 10 మొదలు 20 రోజులలో బయటకు వచ్చును. అడవి యీగకు సంబంధించిన మరి ఒకమాదిరి "కెడ్" అని "మెలోఫేగస్" అని పిలువబడే యీగ గొర్రెలమీద చూడబడును. "కెడ్" అనువాటికి రెక్కలులేవు. ఈ కెడ్లు లార్వేని పెట్టును. అవి గొర్రె ఉన్నిమీద ప్యూపలు అగును. అడవి యీగలు రక్తము పీల్చును గాని సాధారణముగా పశువులకు జబ్బు వ్యాపింపచేయవు. అయినప్పటికి అవి జంతువులకు చాల రొష్టు కలుగజేయును. "కెడ్" అనేవి మాత్రము వున్నికి నష్టము చేయును. మరియూ జబ్బు కలుగజేయని రక్తపు క్రిమిని గొర్రెలయందు వ్యాపింపజేయును.

2. కరుపని యీగల సముదాయములో చేరినవి "మాగెట్" యీగలని పిలువబడును. ఈ యీగల జీవితచరిత్ర ముఖ్యముగా అన్నివిషయములలో నొకటే. మరి కొంటి తేడాలువున్నా అవి యీ దిగువ నుదహరింపబడును. ఈ యీగల లార్వేలు జంతువులకు నష్టము కలుగజేయుటలో తోడ్పడును. అవి "ఫ్లెబోజ్ మాగెట్" లేక "మియాసిస్" అని వాడుకతో పిలువబడేస్థితిని కలుగజేయును. "మాగెట్" యీగలను 2 భాగములుగ విభజింపవచ్చును. అనగా అవి ఆహారము గైకొనుటకు నోళ్లను కలిగియున్నవి, మరియూ అట్టి నోళ్లను కలిగియుండనివి. మొదటిరకములో పచ్చనిబుడ్డి యీగ, వూదాబుడ్డి లేక మామూలు వూదెడు యీగ, కండ యీగ మరియూ మరపురుగు యీగ అనునవి చూడబడును.

రెండవ రకములో "బాట్" యీగలు అనగా గొర్రె ముక్కురంధ్రపు యీగ "వార్బులు" యీగ మరియూ "బాటు" యీగ అనునవి చేరియున్నవి. "లుసీలియా సెరికేటా" అనే ఆకుపచ్చని బుడ్డిమాదిరి గొర్రెలమీద యీగయొక్క శరీరము చాల యెక్కువ సొగసైన కాంతికలిగిన ఆకుపచ్చ, మెరుపురంగుగలదై యున్నది. ఈ యీగ మురికిఅయిన వున్నిలో తోక క్రిందిభాగము మొదలైనచోట్ల పెంపొంది చాలా దేశములలో గొర్రెలకు నష్టముకలుగచేయుచున్నది. ఒక్కొక్క యీగ 40, 50 గుంపులవరుసన 500 గ్రుడ్లు పెట్టును. ఆ గ్రుడ్లు గోధుమరంగుకలవై తెల్లని లార్వేగా మారును. అందు ప్రతివాటికి సూది మొనవంటి తల చివరన రెండు నల్లని కొంకెపు దవడలుండును

దున్నగలిగితే మన్ను ముట్టవలెను.

కలవు ఈ లార్వేలు చాల చురుకుగాయుండి గొఱ్ఱెలయొక్క చర్మపు ముడ్తలలోనూరి అందువల్ల కలిగే రసములు, రసిపదార్థములమీద జీవించును. అవి యీ రసపదార్థములతో కడుపు నింపుకొని సుమారు ఆరు రోజులలో నిండుగా పెరిగి క్రిందపడి నేలలోనికి ప్రాకి ప్యూపలుగా మారును. ఎదిగిన యీగలు సుమారు 2 వారములు, ఆలోపుగా ప్యూపలనుంచి వెలికివచ్చి వాటి జీవితచక్రమును జరుపుకొనును.

ఆటుతర్వాత ముఖ్యమైనది "ఊదా బుడ్డి" లేక మామూలు "ఊసుడుయీగ" అయివున్నది. అది మెరుపైన ఊదారంగు దేహముమకలిగి "పచ్చబుడ్డి" యీగకంటె పెద్దదైయున్నది. ఈ యీగ మాంసపు అంగళ్లయందునూ, వంటయిళ్లయందునూ "జుం" అని మోతపెట్టుట తరుచు వినుచున్నాము. ఇదికూడ గొఱ్ఱెలయందు పురుగులను పుట్టించును. దీని ఆడ యీగ మలుగులపైన లేక యితరచోట్ల మలమూత్రములవల్ల మురికి కాబడిన ఉన్నిపై గ్రుడ్లుపెట్టును. మాంసపుయీగ "సార్కొఫేగా" అనునది బ్లో యీగయంతగాక దానికి కొద్దిగా మించినదైయుండును. అది సీసపురంగునుబోలి దాని పొట్టభాగమున నల్లని బూడిదరంగు గీతలతోను రొమ్ముభాగమున అడ్డగీతలుకలదై యున్నది. ఈ యీగలు గ్రుడ్లకు బదులు ప్రాణముతోవున్న లార్వేను లేక పురుగులను పెట్టును. అదికూడ గొఱ్ఱెలయందు పురుగులను పెట్టుటలో ఊదాబుడ్లవలె ప్రవర్తించును. "బ్లూబాటిల్" లేక కండయీగయొక్క పురుగులు గొఱ్ఱెలకు బదులు కుళ్లు మాంసమును లేక రొచ్చును కోరును. ఆ రెండు రకముల యీగల లార్వేలు పైభాగములమీద జీవించునవై, ఎంతమాత్రము చర్మముక్రిందికి దూరవు కాని, మలినమై అట్ట గట్టుకొన్న వున్నిక్రిందకుప్రాకి అచ్చటనుండు మురికిమీదజీవించును. మామూలుగా అది నేలలో ప్యూపెలుఅగుటకు రాలిపోయిననూ చాలమట్టుకు అవి వున్నిలోనే ప్యూపెలు అవును.

వాటి జీవితచరిత్ర ముగించుటకు దాదాపు "పచ్చబుడ్డి" తీసుకొను కాలము తీసికొనును.

మరపురుగు యీగ ఈ విషయములో సాధారణముగా పుండ్లమీద పురుగులను పెట్టును. మరియు కొన్ని సమయములయందు జంతువులయొక్క శావ్యాయుదుకు అవయములకు పట్టును. చాలమట్టుకు యీ యీగలకు చెడిన మాంసాములయందు వృద్ధివించుటకు ప్రీతికలదు. కాని కొన్ని ఆధారభూతములైన జీవజంతువుల పుండ్లపై వృద్ధివించును. ఈ దేశములో ఆ రెండవ రకము "క్రిసోమైయా బెజ్జియానా" అనునది ముఖ్యఉదాహరణము. ఈ యీగ యెట్టిరకము జంతువునైననూ పట్టుకొని చర్మముమీద పురుగు పెట్టును. గాయములోకాని, చర్మముమీదగాని పురుగులు చాల దురదకలుగచేయును. అందుచేత ఆవిధముగ పీడించబడిన పశువులకు తగినంత విశ్రాంతియూ లేదు. మరి సరిగా మేతమేయవు. ఈ ప్రకారము కాళ్లకండరములలో నష్టముకలుగచేసి పీడించబడి

పండని చేల పందుము దున్నే దానికంటే పండే చేల కోదము చాలును.

నందువల్ల కొన్ని పశువులు ఒకటి లేక చాలా కాళ్లుకుంటును. జంతువులు పురుగులువష్ట భాగమును ఒక గుంజవుగాని, తడికగాని రుద్దుకొనును. అందువల్ల రక్తమువచ్చును. గొఱ్ఱెలలో సత్తువతగ్గును. మరియు ఉన్ని తగ్గును. ఇతర జంతువులుకూడా చిక్కిపోవును. ఇట్టి పురుగు పట్టుటవెంటనే నష్టకారి కాకపోయినను, ఆర్థికముగ చాల నష్టము. అందుచేత ఇట్టి నష్టముకలుగకుండ చేసికొనుట అవసరము.

## సాధారణముగా యిట్టి యీగలవల్ల నష్టముకలుగకుండచేయు పద్ధతులు యిట్టివి

1. ఇట్టి యీగలు పొట్టపేగులు, కళేబరములమీద నుద్భవించకుండ అట్టి పదార్థములను పాతివేయవలయును.

2. ఈగలు అందు పెంపొందకుండా పశ్లు ఎరువులను చేరనియ్యవద్దు. ఇట్టి ఎరువును ఏ రోజుది ఆ రోజు వెంటనే పొలములలో పల్చగా విరజల్లవచ్చును, ఇందువల్ల అది ఎండిపోవును. అందుచేత యీగలు అందుపై చమ్మలేనందున ఉద్భవించజాలవు. ఈ ఎరువును గుంటలలో పోగుచేసేయెడల దాని నెరలలో యీగలు పెంపొందకుండా దానిని గట్టిగా అదిమివేయవలెను. ఈ ఎరువుమీద ఒక వరుసమట్టి, యీగలు వాలకుండా జల్లవలెను. బాగా అదిమివేసిన ఎరువు కుళ్లిపోవునప్పుడు వచ్చే వేడి అవిరికి యీగలు పెంపొందజాలవు.

3. ఈగలను వలవేసి పట్టుకొని చంపవలెను. ఈ పనికొరకు అనేక రకముల వలలు కలవు. వాటిని కొద్దిఖరీదుతో చేయవచ్చును.

4. ఈగలను రానీయకుండ చేసే కొన్ని మందులను గొఱ్ఱెల శరీరముమీద మరి యితర జంతువులమీద పూసిన యీగలను రానియ్యకుండ చేయును. వేపనూనె హారతికర్పూరము కలిపిన నూనె, తారుకలిపిన నూనె మొదలైనవి యీగలు రాకుండ తిర్చి పూయవచ్చును. ఒకభాగము పాషాణమునకు 400 భాగములు నీళ్లు చొప్పున కలిపిన లోషనులో గొఱ్ఱెలను ముంచుట చాల మంచిది. అట్లు తయారుచేయుటకు అనుకూలముగా పొడిగా మందులు బజారులో దొరకును. వాటిని ఎట్లుపయోగింపవలెనో వాటిపై వ్రాసియుండును.

ఆహారము తినుటకు నోటిభాగములేని యీగలను 'బాట్' యీగలని అందురు. అవి ఆధారభూతములైన పురుగులను పుట్టించును. అవి జీవజంతువుల కండరములు మొదలైనవాటిలో పెంపొందును. ఇందులో మూడు ముఖ్యమైనవి. ఒకటి గొఱ్ఱె ముక్కురంధ్రపు యీగ. అది మామూలుగా గొఱ్ఱెలకు పట్టును. రెండు "వార్బలు" యీగ "హైపొడెర్మాలీనియేటివ్" అనునది పశువులకు పట్టును. "హైపొడెర్మా

సంసారి బీద ; భూమి బీద.

క్రాసై" అనునది మేకలను పట్టును. మూడవది "బాట్ ఫ్లై" అనునది గుర్రములను పట్టును.

గొర్రె ముక్కురంధ్రపు ఈగ హిందూదేశములో చాలాచోట్లలో యున్నది. ఇది మామూలుగా ఇంటి ఈగకన్న చాల పెద్దది. పసుపురంగు తల, ఇటికరంగు, రొమ్ముభాగము బూడిదరంగు, పసుపు, నలుపురంగు చుక్కలుకలిగిన పొట్టభాగము కలిగి యున్నది. చూచుటకు అది వెంట్రుకలుకలిగి వెలిసిన పసుపురంగుగా యుండును. ఆడయీగ మొగయీగను కలిసిన తర్వాత దాని పొట్టలో గుంపులుగుంపులుగా గ్రుడ్లను పెట్టి పిల్లలనుజేయును. అది తర్వాత గొర్రెలమందలపై వ్రాలి వాటి ముక్కురంధ్రములలో లార్వే పిల్లలను వుంచును. ఈ పద్ధతిలో ఒక గొర్రెనుంచి మరియొక గొర్రె మీదికి ఎగిరినపుడెల్ల దాని ముక్కు రంధ్రములో ఒక లార్వే పిల్లను వదలును. ఈ ఈగల జింహానాదమును గొర్రెలు గుర్తించి భయముచెంది తుమ్ముచూ, చీదుచూ అటునిటు పిచ్చియెత్తినట్లు పరుగిడును. అవి అప్పుడప్పుడు నేలకు వాటి ముందుకాళ్లకు ముక్కును రుద్దుకొనును. ఈ ఈగల బాధకు అవి తలలను గుంపిగూర్చుకొని వాటి ముక్కు ద్వారములను దాచుకొనును. ముక్కు రంధ్రములో పెట్టబడిన పురుగులు మృదువైన కండరముద్వారా పైకిప్రాకి తలయొక్క రంధ్రభాగములలో చేరియుండును. ఇచ్చట అవి 8, 10 మాసములు ఆహారము తినుచూ పెరుగుచుండును. ప్రతి పురుగు దాని శరీరముమీద ముళ్లవరుసలను ఒక జత బరువైన దవడకొంకులను కలిగివున్నది. అది పుట్టించే దురదమంటలవల్ల కలిగే రసములమీద జీవించును. ఒక గొర్రె దాని తల రంధ్రములలో పెద్ద పురుగులని పిలువబడే వాటిని రెండు లేక యెక్కువగా కలిగియుండవచ్చును. అట్టి సందర్భములో గొర్రెలు చూపించే గుణములు పురుగుల సమూహమును బట్టి వుండును. కొద్ది పురుగులున్నపుడు ఒక లేక రెండు ముక్కురంధ్రములలోనుంచి కొంచెము చీమిడికారటము అప్పుడప్పుడు గట్టి తుమ్ము రావడముగా యుండును. పురుగులు చాలాయున్నయెడల తలవూపు, ముట్టెతో ముందుకాళ్లు రుద్దుకొనుట, ఎక్కువగా ముక్కునుంచి చీమిడికారుట, ముఖమువాచుట మరి ఒకప్పుడు ముక్కులనుంచి రక్తము కలసిన చీమిడివచ్చు గుణములు కన్పించును. అటువంటప్పుడు గొర్రెలు గుండ్రముగా తిరుగును. మరియూ నడచునప్పుడు ముందుకాళ్ల అడుగులను మామూలుకన్నా ఎత్తుగా వేయును. వాటిని బెదరగొట్టినపుడు క్రింద పడిపోవును. ఇట్టి తీవ్రమైన గుణములవల్ల గొర్రెలు చిక్కిపోవును. మరికొన్ని చచ్చియూ పోవును. లేనియెడల కొంతకాలము ఈ విధముగా జబ్బుగావుండి తదుపరి గుణములుతగ్గి తిరిగి ఆరోగ్యస్థితికి మరలుట ప్రారంభించును. దీనికి కారణము ఆ పురుగులు పెద్దవై పట్టువదలినప్పుడు బయటికి వదలివేయబడును. నిండుగా పెరిగిన పురుగులు క్రిందపడి కొన్ని అంగుళములు దూరము మట్టిలో ప్రాకి అచ్చట ప్యూపేలు అవును. 5, 6 వారములలో పెద్ద ఈగలు ప్యూపేలు స్థితినుంచి వెడలి తిరిగి వాటి జీవితము ప్రారంభించును.

---

కాపువాని బీదరికము వానిపంటే చెప్పుతుంది.

ఈ యీగలు ముక్కురంధ్రములలో లార్వేని పెట్టకుండచేయుటకు ప్రతి గొర్రె ముక్కురంధ్రములపై కొంచెము తారుసుపూయుట చాలా మంచిపద్ధతి. గొర్రెమందలు బాస్టీగావున్నపుడు వాటి ఆహారగోళములు (తొట్టెలు) లో అవి మేయునపుడు తారు ముట్టెలకు అంటులాగున మార్గములు గ్రహింపవలెను.

"వార్బులు" యీగలు సామాన్యమైన పెద్దవిగను, నిండుగను రోమములు కలిగినవై వుండును. వీటి పొట్టభాగము లేత పసుపురంగు రోమములతోను, వెనుకభాగము నారింజ, పసుపురంగు రోమములతోను వాటిమధ్య నల్లని వెంట్రుకలచారలతో కప్పబడి వుండును. రొమ్ముభాగము వెలిసిన పసుపు లేక ఆకుపచ్చ మిళితమైన పసుపురంగుగా వుండును. పశువులు గొర్రెలవలె ఈ యీగల జింహానాదము విని వాటిబాధ తప్పించుకొనుటకు బెదరి పరుగిడును. ఇట్లు పరుగిడునప్పుడు వాటిలో వాటికి దెబ్బలుకూడ తగులుట తటస్థించును. ఈగలు ఆదేమాదిరిగా విడువకుండ పశువులను పీడించును. మరికొన్ని సమయములందు గుర్రములవపట్టి వాటి కాళ్లగుత్తులమీద వెంట్రుకలపై గ్రుడ్లను అంటించును. ఒక ఆడయీగ 4, 5 వరుసలుగా ఒక్కొక్క వెంట్రుకమీద దాదాపు నూరు గ్రుడ్లనుపెట్టును. ఆ గ్రుడ్లనుంచి 3 రోజులలో లార్వే అనునవి బయల్పడి వెంట్రుకలమీదుగా క్రింది చర్మములోనికిదిగి ప్రాకి దానిలో జొరబడును. అవి తదుపరి చర్మముక్రిందుగా తిరిగితిరిగి చివరకు వీపుచర్మము క్రిందిభాగము చేరును. ఇచ్చట ఒక్కొక్క లార్వే చిన్న "వార్బుల్" అనే కాయగా మారును. అట్టి కాయపై చర్మమును తొల్చుకొని తన వెనుకభాగమును చొరజేసుకొని గాలిని పీల్చుకొనును. ఈ లార్వే వాటి దవడశంఖముల చేతను వాటి దేహముపై వెంట్రుకల చేతనూ కలుగజేయు దురదవల్ల కలిగే దేహారసములను ఆహారముగా జేసికొనును. కాళ్లగుత్తులపైని వెంట్రుకలమీద నుంచి వెడలిన 8, 9 మాసములలో యీ లార్వే నిండుగ పెరుగును. పెరిగిన లార్వే కాయల బెజ్జములగుండా బయల్పడి నేలమీద పడును. అవి తర్వాత కొన్ని అంగుళములు నేలక్రింద ప్రాకి నిద్రావస్థలోనుండు ప్యూపలు అవును. ఒకటి, రెండు మాసములకు యీ నిద్రావస్థనుంచి నిండుగా పెరిగిన యీగ బయల్పడి పై జెప్పబడిన పాడుపనులను జరుపును. గూడలు, లేతపశువులు, మేకలు తర్చు పీడింపబడును. ఆవులలో క్షీణస్థితి, పాలుతగ్గుట తప్ప మరి ప్రాణనష్టము యీ లార్వేవల్ల కలుగదు. కాని చర్మములలో బెజ్జములుపడుటవల్ల చర్మములకు చాల నష్టము కలుగుచున్నది. వాటినుంచి యీగ లుద్భవించకుండ జేయుటకు యీ లార్వేలను జంతువుల వీపులనుంచి తప్పించి నశింపచేయుటకు చికిత్సలనేకములు కలవు. అందరు రైతులు సమూహముమీద ఏకీభవించి పురుగులనుంచి పెద్దవి బయుటకు రాకముందు పురుగులను క్రిందపడకపూర్వమే చంపుటవలన అట్టి మార్గము లుపయోగకరములగును. ఇట్లు పట్టుదలతో చేసిన యెడల 'వార్బుల'నెవి చాలమట్టుకు రాకుండ తగ్గింపబడును, అందువల్ల చాల నష్టము తొలగింపబడును. ఇట్టి అంటుఆయిన పశువుల వీపులను కడుగుటకు చాల రకముల మందులు

చేతిలోగాని చేలో లేదు.

చెప్పబడియున్నవి. ప్రపంచములో కొన్ని ప్రాంతములలో చర్మముక్రింది లార్వేని సబ్బు, డెర్రిసువేరు, కషాయము కలిపిన మందుపూతలవల్ల జయప్రదముగ చంపగలిగినారు. దక్షిణ హిందూదేశమున "వార్బులు" యీగలు ఇంతవరకు వున్నట్లు కనుపడలేదు. గాని ఉత్తర హిందూదేశములో చాల ఎక్కువగ వున్నవి.

" బాట్ " అనే యీగ గుర్రములు, గాడిదెలు మొదలైనవాటికి పట్టును. దాని పురుగులు గుర్రపు పొట్టకు, ఒక్కొక్కప్పుడు పేగులకు పట్టును. ప్రతి యీగ ఇటుకరంగు మిశ్రితమైన పసుపువన్నె కలిగి వెంట్రుకలతో వుండును. ఆడదాని పొట్టవెనుకభాగము దానిపై లోనికి వంగియుండును. ఈ యీగలు కొంతమట్టుకు తేనెటీగలను పోలియుండును. గర్భిణి ఆడయీగ గుర్రములమీద వాలుచూ తరుచు కాళ్లకు తిమీదికి, భుజగూడు మీదికి ఎగిరి అచ్చట వెంట్రుకలమీద ఒక గ్రుడ్డును వదలును. ఇట్టి సమయమున గుర్రము బెదిరి అటునిటుపోవును. అవి శాలలో యున్నయెడల జారిపడి గాయము పొందవచ్చును లేక పచ్చికబయళ్లమీదవున్నయెడల విచ్చెక్కినమాదిరి పరుగిడవచ్చును. జంతువు నాకుకొనినప్పుడు లేక శాలలో ఏవస్తువునకో తన శరీరమును రుద్దుకొనినపుడు ఆ గ్రుడ్లు పొదుగును. లార్వేలు చర్మమునకు దురద పుట్టించుటవలన నాకివేయబడును. అవి మ్రింగివేయబడును. లేక నోటిలోని మృదువైన కండరములోనికి చొరబడి తిరుగుచూ చివరకు పొట్టలోనికి చేరును. ఈ " బాట్సు " అని పిలువబడే లార్వేలు ఒక జత దవడశంకులను కలిగివుండి వాటితో పొట్టలోని మృదుకండరమును పట్టుకొని వుండును. మరియూ అవి వాటి దేహముమీద ముళ్లవెంట్రుకలను కలిగి యున్నవి. పొట్టలో అవి మామూలుగా గుంపులుగుంపులుగా పట్టియుండును. అవి దురదపుట్టించే రసపదార్థములమీద ఆహారమున కాధారపడి దాదాపు 7, 9 మాసములు పెరుగును. అటుపిమ్మట వాటి పట్టువదలి లద్దెతో బయటపడును. అవి నేలమీదపడిన వెంటనే కొన్ని అంగుళములు మట్టిలోదూరి అచ్చట నిద్రావస్థచెందును. అనగా ప్యూపేలు అవును. పెరిగిన యీగలు యీ నిద్రావస్థనుంచి 6, 8 వారములలో బయల్పడి జీవితచరిత్రను తిరిగి జరుపును. ఈ లార్వేలు పొట్టలో ఎక్కువగా వున్నప్పుడు జీర్ణశక్తిని భంగపర్చవచ్చును. ఇట్టిది జంతువుల బలహీనతకు కారణము గావచ్చును. కొన్ని లార్వేలు పేగులలోనుంచి పోవునప్పుడు తిరిగి ముడ్డిభాగమునకు పట్టుకొని దురద కలుగజేయును. ఈ పురుగులను జంపుటకు రూఢియైన ఒక ఔషధము "కార్బన్ డిసల్ఫైడ్"ను తగు మోతాదులో చిన్న మాత్రలుగా వాడుటయైయున్నది. లద్దెలో లార్వేపడినపుడు వాటిని కాల్చివేయవలెను. గుర్రమును తర్చు మాలిష్ చేసినయెడల లార్వేలను నోటిలోనికి చేరనివ్వవు.

ఉత్తర హిందూదేశములో ఒంటెలకు ముక్కురంధ్రపు యీగ పట్టును. ఈ యీగ గొర్రె ముక్కురంధ్రపు యీగను పోలియుండును. ఈ దేశములో ఏనుగులకు తరుచు వాటి పొట్టలో "బాట్స్" పట్టును. దీనికి సంబంధించిన యీగ "కబ్బా

చేతిలో వున్నదిగాని చేలో లేదు.

ట్రియా మెలిపెంటస్" అనే నల్లయీగ. ఇది దంతముల కోరలు మొదలలో గ్రుడ్లు పెట్టును. ఈ "బాట్స్" గుర్రములలో మాదిరి ప్రవర్తించును.

చివరకు అన్ని "బాట్స్" యీగల లార్వేలు మనుష్యులకుకూడ పట్టి చర్మము క్రింద ప్రాకుడు పురుగులను కలుగజేయును అను విషయము తెలుసుకొనుట ముఖ్యమై యున్నది. మరిపురుగు యీగ మనుష్యులలో తర్చు పురుగులు పుట్టించును. మరి యొక రకపు మాంసపు యీగయొక్క లార్వే పేగులకు పురుగులు పుట్టించును. అందుచే యీ యీగలను తగ్గించుటకు అవి పెంపొంది పాడుచేయకుండు ప్రతికూల మార్గముల నవలంబించి అందువల్ల ఆర్థిక నష్టమును తొలగించుట అవసరమైయున్నది.

## హిందూదేశమునందు వ్యాప్తిలోనున్న పరాశ్రయ జీవులను నశింపజేయు క్రమ విధానములు.

ఇతర జంతువుల శరీరాంతరములందు నివసించు జీవులను పరాశ్రయ జీవులు (Entozoal parasites) అని యందురు. అట్టి జంతువులను గృహస్థులు (hosts) అని పిలుతురు. ఈ పరాశ్రయ జీవులు ఆ గృహస్థునామ జంతువులనుండి ఆహారమును ఆశ్రయమును పొందుచున్నవి. ఈ పరాశ్రయ జీవులుగూడ జంతుకోటికి జెందినవే. ఇవి తామవలంబించిన జీవిత విధానమునకు అనువగు ప్రత్యేక శారీరక వికారముల నొందినవి. ఈ జీవులు ఏకకణయుతములుగా నుండిన నుండవచ్చును. అపుడు వానికి ప్రొటోజో (ఆదిజీవులు protozoa) అని పేరు. లేదా అవి అనేక కణ సంయుతములుగాకూడ నుండవచ్చును. అపుడు దానికి మెటాజోవా (బహుకణా జీవి Matazoa) అని పేరు. పరాశ్రయ జీవుల మిధున జీవిత దశలు (Sexual stages) మాత్రము. ఏజంతు శరీరమున గోచరించునో దానిని అంత్య గృహస్థు (Final host) అనియు ఏజంతు శరీరమున వాని క్రిగు జీవిత దశలు గోచరించునో వానిని మధ్య గృహస్థులు (Intermediate hosts) అనియు పిలుతురు. ఆరోగ్యముగనున్న జంతువులకు పరాశ్రయ జీవన వ్యాప్తి ఏకాయెకీనిగాని మధ్యవర్తులగు జంతువులద్వారాగాని జరుగవచ్చును. అంత్యగృహస్థునందు గోచరించు రోగలక్షణములు పరాశ్రయ జీవులసంఖ్య వాని లక్షణములు శరీరమునందలి వ్యాపించురీతి, గృహస్థునకును ఆజీవులకును కలిగిన కలయిక మొదలగువాని మీద ఆధారపడియుండును. కావున వానిని నిరోధించుటకు సరియగు మార్గము నవలంబింపవలెననిన చో ఆయాజీవుల జీవిత దశాచరిత్రలను అలవాటును తెలిసికొనుట చాల నవసరమైయున్నది. క్రిమ్యాకార పరాశ్రయ జీవుల (Helminth parasites) జీవిత చరిత్రలో అండస్థితికిని అంటుగా వ్యాపింపగల క్రిమిస్థితికిని మధ్యగల కాలము మిక్కిలి విషయమైనది. ఆకాలమున దాని జీవిత దశాపరిణామజ్ఞానము వానిని నిరోధించుట కవసరమగు మార్గమును సూచించును.

---

## (౨) ఏకకణజీవులు (protozoa.)

ఈ ఏకకణజీవులు జంతువుల రక్తమునందును కణజాలమునందును నివసించును. మనము పెంచెడి జంతువులను అందు ముఖ్యముగ పశువులను పీడించునవి. ఇందు ముఖ్యముగ మూడు రకములున్నవి.

1. ఫిరోప్లాజ్మా జీవులు యెఱ్ఱని మూత్రపు జ్వరము (Red fever) లేక గోమారి జ్వరము (Tick fever) ను కలిగించును. రక్తమునందు శిథిలములైన అరుణ కణములలోని జీవులు గోచరించును. ఈ రోగము వచ్చిన జంతువునకు జ్వరము కామెరలు ఎఱ్ఱని మూత్రము మొదలగు లక్షణములు గోచరించి ఏడు మొదలు పది రోజులలో చనిపోవును. ఇట్టి జంతువునకు ట్రైఫన్‌బ్లూ (Tryphanblue) అను చౌకరకపు మందు చికిత్సార్థముపయోగపడును.

ఈ ఓషధియొక్క ద్రావణమును రోగమువచ్చిన జంతు శరీరములోనికి సూది ద్వారా ఎక్కించవలెను. వీనికి సంబంధించిన మధ్యమ గృహస్థులు గోమారులు (Ticks) గోమారులు:—అందు ముఖ్యముగ ఆడు గోమారులు. జంతువుల శరీరమునకు అంటిపెట్టుకొని రక్తమును పీల్చుచు రెండు మొదలు నాలుగు రోజులవరకు నుండును. అవి సంతృప్తిగా రక్తపానముచేసిన యనంతరము జంతువులను వీడి క్రిందపడి భూమిలోను పాకలలోనుగల నెరదలలోనికి ప్రాకిపోయి యచట గ్రుడ్లనిడును. ఆ గ్రుడ్లు పగిలి క్రిములగును. ఈ క్రిములకు గోమారి అంకురములు (seed ticks) అని పేరు. ఇవి మరల జంతువుల నాశ్రయించి రక్తపానము చేసి పడిపోవును. అపుడు చర్మ విసర్జనముచేసి కీటకముగా (Nymph) మారును. ఇటుల నేకసారులుచేసి అసలు గోమారుగా మారును. ఈ యవస్థాంతర కాలమున నివి పరాశ్రయ జీవులను సంగ్రహించి పశువులకు వానిని వ్యాపింపజేయును. కావున జంతువుల శరీరముమీద నున్నపుడును నేలమీద నెరదలలో నున్నపుడును ఈగోమారులను నాశమార్పవలెను. అందుకుగాను నూటికి 25 చొప్పున సోడియాపాషాణముగల ద్రావణమును ఆ జంతువుల శరీరముపై పిచికారీ చేయవలెను, లేదా అట్టి ద్రావణముగల తొట్టెలలో జంతువులను దింపి స్నానమాడించవలెను. జంతువులుండెడు పాకలయొక్క గోడలను నేలను గీకి ప్రోవుచేసి తగులబెట్టవలెను. వాని నెరదలను గానుగ సున్నముతో పూడ్చివేయవలెను. పచ్చిక బయళ్లలో గోమారులు ప్రబలినచో ఒక సంవత్సరమువరకును పశువులనందులోనికి పోనీయకున్నచో ఆ గోమారులు తిండిలేక చచ్చును. అట్టినేలపై సున్నమునుగాని ఉప్పునుగాని చల్లవలెను. లేదా ఆ గడ్డిని తగులపెట్టవలెను. చేయవలసిన పద్ధతి గోమారులు వ్యాపించిన నేలయొక్క గుణమునుబట్టియుండును. ఒక యకరమునకు ఒక టన్ను సున్నముగాని అరటన్ను ఉప్పుగాని సాధారణముగ కావలెను. ఒక సంవత్సరము ఒక చోటను మరియొక సంవత్సరము మఱియొక

---

¹ నూటికి గింజలులేక కారముట్లులేక సేద్యముచేసేది చెడ్డరోత.

చోటను పచ్చికను పెంచుట మంచి పద్ధతి యింకుటవలన గోమారులు తిండి లేక చనిపోవును.

2. ట్రిపానోజోములు ఏకకణజంతువులు. రోగబాధిత జంతువుల రోషరసము నందివి గోచరించును.

హిందూదేశమునందలి పెంపుడు జంతువులకు(Surra)అనురోగమును కలిగించును. ఈ రోగబాధితములగు జంతువులు—అందు ముఖ్యముగ గుఱ్ఱములు—హెచ్చు జ్వరమును కలిగియుండి పాలిపోయి, ప్రేలాడు భాగములు వాచి, నాలుగు మొదలు ఆరు వారములలో చనిపోవును. కొన్ని పశువులు రోగలక్షణము లేమియు లేకుండగనే హఠాత్తుగ చనిపోవును. ఈ పరాశ్రయ జీవియొక్క జీవితచరిత్ర సరిగా తెలిసికొనబడి యుండలేదు. కాని జోరీగ (Tebanus) దీనికి వాహకమనియు రోగమువచ్చి చచ్చిన జంతువునుండి ఆరోగ్యముగానున్న జంతువులకు ఆ జీవులను చేర్చునదియు తలపబడు చున్నది. ఈ యీగలు సాధారణముగ ఉదయమునను సాయంకాలమును చురుకుగ పని చేయును. కావున సర్రారోగపీడితమగు ప్రదేశములందలి జంతువులు—ముఖ్యముగ గుఱ్ఱములు—సూర్యాస్తమయానంతరమును సూర్యోదయ పూర్వమునను తిరుగుచుండవలెను. ఈ యీగలు మురికి గుంటలలోను నీటిలోను గ్రుడ్లను పెట్టును. కావున గుంటలను ఎండనిచ్చి నీటిలో పెరిగెడి మొక్కలను పెరికివేసినచో అందివి గ్రుడ్లను పెట్టవు. బేయరు కంపెనీలో 205 లేక నాగనాల్ అనుమందున్నది. ఇది రోగనిరోధకమును రోగనివారకమునుకూడనైయున్నది. దీనిని పశు చికిత్సా పట్టభద్రుడు (Veterinary graduate)సిరలలోనికి ఇంజక్షను చేయవలెను.

3. కాక్సిడియా అనునవికూడ ఏకకణజంతువులు. ఇవి జంతువుల ప్రేవులలో గల పొరలలో జేరియుండును. ఇవి జంతువులయొక్క—ముఖ్యముగ లేగదూడల యొక్క—ప్రేవులకు హానిని కలిగించి అజీర్తి విరేచనములనుగాని నెత్తురు విరేచనము లనుగాని గలుగజేయును. ఈ రోగబాధితములగు జంతువుల మలములో రోగజీవుల సోపలుండును. గాన ఆమలమును తగులబెట్టినచో రోగవ్యాపన మరికట్టబడును. రోగ బాధితములగు జంతువులు మేసెడి పచ్చికబయళ్ళను దున్నుటవలన, రోగనివారకమగుటయే గాక పచ్చికకూడ బాగుగాపట్టును. ఈ రోగమునకు తగిన చికిత్స యింతవరకును కనుగొనబడలేదు.

## (బి) బహుకణజీవులు (Metazoa)

అంతర పరాశ్రయములగు ఈబహుకణజీవులను రెండు తెగలుగ విభజించవచ్చును. (1) బల్లపరుపుగనున్న పురుగులు. (2) గుండ్రని పురుగులు. బల్లపరుపువానిలో (Flukes), ఎలుకపాము (Tape worms).

## 1. Flukes.

కాలేయమునందలి పైత్యరస వాహికయందుగాని కాలేయమునందును ప్రేవుల లోను గల శిరలలోగాని ముక్కునందలి శ్లేష్మపు పొరలోగాని ప్రేవులలోని కణుద్వ్య రంధ్రములలోగాని ఇవి నివసింపవచ్చును. ఇవిమామూలు liver fluke అంతయుండి పైత్య రసవాహికలో అడ్డుపడి కాలేయముయొక్క పనిని క్రమ రహితము చేయును, లేదా యివి చిన్నవిగానుండిన నుండవచ్చును. నెత్తురులోనున్న యీపురుగుల గ్రుడ్లు శరీరమునుండి పైకివచ్చునపుడు అవి చొచ్చుకొనిపోవు కణజాలములకు చాల నపాయమును కలిగించి రోగ కారకములగును. రోగపీడితములగు జంతువులకు అవసరమునుబట్టి టార్టారు ఎమిటిక ఆన్టిమోనీ, మగ ఫెర్న (Fern) యొక్క రసము కార్బన్ టెట్రాక్లోరైడు మొదలగు ఔషధముల నియుదురు. ఈ ఫ్లూకుల జీవితచరిత్రలు ఒకేతీరుననుండును. వీని వ్యాపకమునకు మధ్య గృహస్థుగా మంచినీటి నత్తలుండవలెను. మలమునుండిగాని చీమిడి మొదలగు నాసికా పదార్థములనుండిగాని బహిర్గతములగు వీని గ్రుడ్లు మంచినీటిని జేరి పగిలి పిల్లలై తమ కనువగు నత్తలను జేరును. వానిలోనివి ఆరు వారములలో కోశావస్థనొంది నీటిలో పడిపోవును. ఒక పురుగునుండి వేలకొలది కోశము (larvae) లుద్భవించును. వీనిచే నావరింపబడిన నత్త ఒకటి రెండు వారములవరకు అనుదినము ను ఈ కోశములను విస్తరించుచుండును. ఈ కోశములు బాగుగ నిదగలవు. యివి నీటిలోగల మొక్కల నంటిపెట్టుకొని చిరకాలము నిలుచును. పశువులు ఆ మొక్కలను తినినపుడు వానిలోనికిపోవును. మరికొన్నిరకముల కోశములు చేపలు, పీతలు మొదలగు జలచరములను జేరి నిలిచి వానిని తినినవారిలోనికి ప్రవేశించును. మరికొన్ని రకముల కోశములు నీటియందుండి అందుజొచ్చిన జంతు శరీరములోనికి జొచ్చుకొనిపోవును. లేదా అది త్రాగు నీటివెంట కడుపులోనికిపోవును. కావున వీనివ్యాప్తి నరికట్టుటకు వీనిజీవిత దశలలో నేదే నొకదానికి భంగము వాటిల్లజేయును. త్రాగుట కుపయోగించెడి నీటిలో సంచరించు నత్తలను నశింపజేయుటే ఇందుకు ఉత్తమోత్తమ మార్గము. మంచినీటిలో నివసించు నత్తలు అందున్న మొక్కలను తిని జీవించును. కావున ఆనీటిలోని మొక్కలను తీసివేసినచో నత్తలు మాడిచచ్చును. మైలతుత్తము మిక్కిలి హ్రాస్వముగ నున్నను నత్తలకు ప్రాణహాని చేయును. జంతువులకు బలకరమగును. కావున ఒక గుప్పెడు మైల తుత్తమును పొడిగాగొట్టి నీటియంచులందు చల్లినచో నత్తలు చచ్చును. మరొకవిధముగా గూడ చేయవచ్చును. నీటిలో సున్నమును కలుపవచ్చును, లేదా త్రాగుటకుపయోగించు నీటిని వేరుగా పాత్రలలో 48 గంటలకాలము నిలువచేయవచ్చును. ఈ రెండు విధానములవలననుగూడ కోశములు చనిపోవును. కావున ఆనీటిని త్రాగినచో రోగములురావు.

---

ఒంటిఎద్దు సేద్యం వరిగాలు నొప్పి.

## 2. ఏలుగు పాములు (Tape worms)

ఈ పురుగుల శరీరము టేపువలె పొడవుగనుండును. ప్రతి పురుగునకును ఒక తలయును దానికి కొక్కెమును పీల్చుటకనువగు గొట్టములుండును. మిగిలిన శరీర భాగమున ఉంగరములవంటి భాగములు కలవు. సాధారణముగ ఈ పరాశ్రయ జీవుల జీవితచరిత్ర సంపూర్ణమగుటకు మధ్య గృహస్థొకటి అవసరము. ఈ పురుగులపొడవు




కొన్ని మిల్లీమీటర్లు మొదలు కొన్ని మీటరులవరకు నుండును. ప్రతిభాగము నొక ప్రత్యేక జీవి, ద్విలింగసంయుతము (అనగా మగదియును ఆడుదియునుగూడ). అది బీజ భరితమైనపుడు పక్వమైన దందురు. పక్వమైన యనంతరము యాభాగములు విడిపోయి మలముగుండ విసర్జితములగును. అచట యాయాభాగములు ఖిలమగును. అచట గడ్డియున్నచో వానియందు బీజములు గడ్డికి అంటును. నీరున్నచో నీటిలోకలిసి మలినముచేయును. ఈ బీజములను జంతువులులోనికి గ్రహించినపుడు యచట పగిలి క్రిములై ప్రేవులగోడలకు రంధ్రముచేసి కాలేయము, ఊపిరితిత్తులు, మెదడు మొదలగు అవయవములజేరి యచట చిన్నవో పెద్దవో పురుగులుగానై వానియందలి కణజాలమును నాశనముచేయును. అట్టి యవయవములు సక్రమకార్య నిర్వహణములేనివై జంతువునకు హానిచేయును. మానవులకుకూడ ఈ బ్లాడరుపురుగుల బాధకలుగుచుండును. ప్రతి బ్లాడరు పురుగులోను ఒకటిగాని రెండుగాని ఎలుగుపాము తలలుండును. ఈ పురుగులున్న మాంసమును భుజించునపుడు బ్లాడరు అరగిపోవును. తలలు విడిగానుండి ఆంత్రముల ప్రక్కలకు అంటుకొని పెద్దపురుగుగా పెరుగును. ఇట్టి పురుగులలో చాల

---

వెలిపాలమును వెథవపిల్లను విడవకూడదు.

రకము అను కుక్క అంత్యగృహస్థని తెలిసికొనుట చిత్రమగు విషయము. వీనిలో చాల వరకు పురుగుల వ్యాపనమునకు పశువులమధ్య గృహస్థులవలె నుపకరించుచున్నవి. అంత్య గృహస్థకార్యమున కలుగు బాధకంటె మధ్య గృహస్థ కార్యమున కలుగుబాధ హెచ్చు. ఒక ఉదాహరణమును చూడుము. కుక్కలలో గోచరించు మల్టిసెప్సు యనబడు నొకరకపు ఏలుగుపాము బ్లాడరుపురుగు దశను గొర్రెలలో గడుపును. ఆ బ్లాడరు పురుగు గొర్రెయొక్క మెదడులో నుండవచ్చును. దానివలన తల దిమ్ము (Gid) కలుగవచ్చును, లేదా మరణముకూడ రావచ్చును. కాని గొర్రెల ప్రేవులలో గోచరించు మొనిజయా యనబడు పెద్ద పురుగులవలన యిట్టి బాధకలుగుటలేదు. అంతేకాక జంతువుల ప్రేవులయందున్న ఏలుగు పాములను చికిత్సజేసి విముక్తినొందింప వచ్చును. కాని అవయవముల కణజాలమునందున్న బ్లాడరుపురుగులను పోగొట్టుటకు తగిన చికిత్సావిధానము లేనేలేదు. కావున వీనికి విరుగుడు నిరోధకమునమాత్రము కలదు. కుక్కలను పచ్చిక బయిళ్లలోనికి రానీయకున్నచో గడ్డిగాని నీరుగాని యాయాపురుగుల బీజములతో మలినముగాక యుండును. అట్టి చోటులందుండెడి పెంపుడు కుక్కలకు అప్పుడప్పుడు ఏలుగుపాములు నచ్చుటకు మందిచ్చుచు వానిమలమును తగులబెట్టుచు నుండవలెను. పెరిగి పెద్దవగు ఏలుగుపాములను విసర్జింప జేయుటకు మగపెన్ఫెరయొక్క రసము పోకకాయ పొడుము, దానిమ్మవేరు మొదలగునవి పనికివచ్చును. ఈ పురుగుల బీజములతో మలినమైన పచ్చికబయిళ్లను దున్నుట పల్లపు స్థలములలో గడ్డిని మేయకుండ జేయుటయునుగూడ ముఖ్యము. కసాయి గృహములందు పారవేసిన మాంసాదులను తినుటవలన కుక్కలకు యీ పురుగులంటును, కావున ఆ మాంసాదులను బాగుగా ఉడికించి అందలి పురుగులను చంపిన తరువాతనే కుక్కలకు పెట్టవలయును.

## 3. గుండ్రని పురుగులు (Round worms).

జంతువుల శరీరమున జేరి జీవించెడి గుండ్రని పురుగులలో అనేక రకములున్నవి. యిందు కొన్ని జంతువులకు యకాయకిని సంభవించును. చిట్టుమన్న గుడ్లను మ్రింగుట వలనకాని భూమిమీదనున్న కోశములు చర్మముగుండనో కఫపుపొరలగుండనో శరీరమున ప్రవేశించుటచేతగాని యీ జీవులు జంతువుల శరీరమున జేరును. యిందుకు ఉదాహరణముగ అస్కారిస్ యనబడు పొడవైన గుండ్రగనుండు పురుగులను కొంకిపురుగులను (Hook-worms) హెమోన్కస్ యనబడు తీగపురుగులను (wire-worms) కలవు. ఇది పశువులను గొర్రెలను బాధించును. ప్రేవులలోనుండెడి సమస్త పురుగుల బీజములును మలముతో బహిర్గతమగును. అస్కారిస్ పురుగుల ప్రతి బీజమునుండియు పది రోజులలో గాని అంతకుమించిన కాలమునగాని ఒక భ్రూణము తయారగును, కాని గ్రుడ్లు పగులవు. ఈ భ్రూణస్థితియందు బీజములు కొన్ని నెలలవరకును లేదా సంవత్సరముల వరకును వుండగలదు. ఈలోపుగ సూర్యరశ్మిగాని తగిలినచో మాత్రము చనిపోవును.

ఇట్టి భ్రూణాండములచే మలినమగు నీటినిగాని యాహారముగాని స్వీకరించునపుడవి ప్రేవులలోజేరి పగిలి కోశములుగానై యాంత్రమధ్యములను జొచ్చి కాలేయము వూపిరితిత్తులద్వారా పైకిపోవును. అనంతరమవి ప్రేవులను మరలజేరి పెద్ద పురుగులుగా నగును. పైన పేర్కొనబడిన అంతర్గమనము వలన కోశములోజొచ్చిన యవయవము లకు మిక్కిలి హాని వాటిల్లుచున్నది. తీగ పురుగులవంటి వానిలో గ్రుడ్లు బాహ్యము ననే పగులును. పొలములలో తగు తేమయున్నచో యాకోశములు నాలుగు రోజులలో వ్యాపనశక్తిమంతములగును. ఈ కోశములు తడిగడ్డిపై నెగబ్రాకుచుండును. అపుడా గడ్డితో వీనినిగూడ జంతువులు మ్రింగును. ఒక పక్షము దినములలో నివి ప్రేవులందు పెద్ద పురుగులుగానగును. క్రొత్తగా ని పురుగులచే నాక్రమింపబడిన జంతువుల మల ములో వీని బీజములు మూడు వారములలోపున గోచరించును. కావున భ్రూణాండములు గాని కోశములుగాని జీవింప సమర్థములుగా నుండవలెననిచో తేమ యవసరమని తెలియుచున్నది. ఇట్టి తేమ పల్లపు నేలలలోను, బురద నేలలలోను, నీటిగుంటల అంచు అందు నుండును. కావున గుంటలు యెండునట్లుచేసి అందలి మొక్కలను పెరికివేయవల యును. అపుడందలి కోశములు జంతువుల నంటుకొనుటకు వీలుండదు. మరికొన్ని గుండ్రని పురుగులు జీవితచరిత్రను సంపూర్ణముగావించుకొనుటకు మధ్యగృహస్థు అవసర మగుచున్నవి. ఈ మధ్య గృహస్థునకివి సంభవించుటకు మూడు మార్గములున్నట్లు తోచుచున్నది.

(a) వీని గ్రుడ్లను మధ్య గృహస్థు తినవచ్చును. ఉదా: కుక్కల కంఠములం దుండెడి వ్రణములలో గోచరించు ఎఱ్ఱపురుగుల గ్రుడ్లు వానిమలముతో విసర్జితముల గును. ఆమలమును పేడ పురుగులును బొద్దింకలును తినును. అపుడా గ్రుడ్లు వానిలో పొదగపడి కోశముగానగును. ఆ బొద్దింకను కుక్క తినునప్పుడు యా కోశములు కుక్కనుపట్టి పీడించును.

(b) మలముతో విసర్జితములగు గ్రుడ్లు పొదగబడును. ఆ కోశములు మధ్యగృహస్థు నొకదానిని పొందును. గుఱ్ఱపు కడుపులో హబ్రోనెమా యనబడు పరాశ్రయ జీవులుగలవు. వాని గ్రుడ్లు గుఱ్ఱపులద్దెతో విసర్జితములై పెంటప్రోవులను జేరును. అచట నవి కోశములుగా మారును. ఈ పెంట పురుగులలోనే ఈగలను జోరీగలనుగూడ గ్రుడ్లు పెట్టును. ఈగ గ్రుడ్లు పెట్టినపుడు వచ్చుపురుగులను (Maggots) హబ్రోనెమాయొక్క కోశములు యాహరించును. అనంతరము ఈగ పురుగులు పరిణామమునంది ఈగలుగ మారును. ఈ యీగల శరీరమునందును నోటి లోను హబ్రోనెమాయొక్క కోశములుండును. ఈ యీగల నోటినుండి కోశములు గుఱ్ఱముయొక్క శరీరమునజేరును; ఆభాగమును అది నాకుకొనినచో ఆకోశములు అశ్వగర్భములుచేరును; లేదా ఆ యీగలను గుఱ్ఱము తినినచో వానితోగూడి కోశ ములను దానిగర్భమునజేరును. అప్పుడవి గుఱ్ఱమునుపట్టి పీడించును.

---

తండ్రి సేద్యం కొడుకు వైద్యం కూడు మధ్యం.

(c) కొన్ని పురుగులు (Filaria) బోదకాలు పురుగులు గ్రుడ్లకు బదులు కోశములను జంతువుల కణజాలములో నిడును. అవి రక్తమునుజేరి దానితోబాటు శరీరమున ప్రసరించుచుండును. నెత్తురు త్రాగెడు దోమవంటి మధ్యగృహాన్ని నెత్తురుతో గూడ వానిని గ్రహించును. ఈ కోశము దోమశరీరమున వృద్ధినొంది దాదాపు మూడు వారములలో దానితొండమును జేరును. దోమ కరచినపుడు జంతు శరీరోష్ణముచే నాకర్షింపబడి తొండమునుండి బహిర్గతమై జంతు శరీరమునజొచ్చి తమవృద్ధి కనువగు యవయవమును జేరును.

తీగపురుగుల (Namatodes) వ్యాప్తి నరికట్టుట కవలంబించవలసిన మార్గములు వేరువేరుగా నున్నవి. వాని నీక్రింద వివరించుచున్నాను :—

1. అంత్యగృహాన్ని శరీరముననుండగనే పెద్దపురుగులను నశియగు మందుల సహాయమున హతమార్చవలయును. అందుకుగాను జంతువుయొక్క మలము మొదలగు వానిని పరీక్షించి దానిని పొందియున్న పురుగు ఏ జాతిదో నిర్ణయించి తగుచికిత్స జేయవలయును. యీ కార్యము ఒలుపుగా (Dry) నుండెడు కాలమున చేయుట మంచిది.

కాల్చిన సోడియం, సాన్టోనైన్, నెమ కాప్స్యూలులు మొదలగు ఔషధములను సాధారణముగా నిందుకు వాడెదరు.

2. గ్రుడ్లను కోశములనుగూడ అంత్యగృహానునందున్నపుడె నశింపజేయవలయును. బోదకాలు మొదలగువానికి టార్టారు ఎమిటిక్ ఆంటిమంజాను మొదలగు వానిని నెత్తురులోనికి ఇన్జక్షన్ చేయుదురు.

3. వ్యాప్తిగాంచెడు కోశములను భ్రూణాండములను శరీరమున జారకుండచేయవలయును. గుండ్రని పురుగు వ్యాపించుచున్నదను అనుమానమున్నచో పచ్చికస్థలమున నున్నమునుచల్లి దున్నవలెను. అపుడు భ్రూణాండములు నశించును. కోశములు గడ్డిపైనున్న వనుకొనినచో గడ్డిమీద మందు ఎండిపోవువరకు పశువులను యా గడ్డిని మేయనీయరాదు. పల్లపు ప్రదేశములందును బురదనేలలలోను గుంటల అందునందును పశువులు మేయకుండ చూచుటమంచిది.

ఒక సంవత్సరము ఒక పొలమును మరుసటి సంవత్సరము మరియొక పొలమును మేతకొరకు వేరుచేయుట మంచిపద్ధతి. పశువులసంఖ్య తగ్గినచో అవి మేసెడు స్థలము విశాలముగానుండును గనుక రోగవ్యాప్తి తగ్గును. మధ్య గృహస్థులను నశింపజేయవలెను లేదా వానికి రోగబీజవ్యాప్తి లేకుండ చూడవలెను. ఎరువులను సరిగా తొలగింపవలెను. వర్షము తక్కువగానుండెడుచోట్ల ఎరువును ఎండనిచ్చి ప్రోవుచేయవచ్చును. లేదా ఒకచోట దగ్గరగా ప్రోవుచేయవలెను. అందువలన దానితో జనించు ఉష్ణమువలన అందలి గ్రుడ్లును కోశములును చచిపోవును. ప్రోవుమీద క్రొత్తగా ఎరు

బాపన సేద్యం బడుగుల నష్టం ; కాపుల చదువు కాసుల నష్టం.

వును వేసినపుడెల్ల కొంత మట్టినిగూడ చల్లవలెను. అందువలన ఈగలు గ్రుడ్లు పెట్టవు. వానపాము, లద్దిపురుగులు, జోరీగలు మొదలగు మధ్య గృహస్థులసంఖ్యను తగ్గించు యత్నములు జేయుచుండవలెను. ఈ జంతువులకును వాని పరిసరములకునుగల సంబంధమునుగూర్చి పరిశోధనచేసి వానిసంఖ్యలను తగ్గించు నేర్పాటు చేయుచుండవలెను.




క్షయ, న్యూమోనియా, గాలికుంటు, పాలజ్వరము, నోటిగాలి, పెద్దరోగము మున్నగు వ్యాధుల లక్షణములు చూపించు ఫొటో.

---

పడుచుల సేద్యం పయిటికి రాదు.

## అంటువ్యాధు లెంతకాల ముండునది తెలియజేయు పట్టిక.

| వ్యాధి పేరు | అంతర్గతకాలము | వ్యాధి నిర్ధారణయగు దినము | పశువును బహిష్కరింపవలసిన కాలము |
|---|---|---|---|
| పెద్దరోగము | 2 దినములు మొదలు 8, 12 వరకు | జ్వరమువచ్చినతరువాత మేత మేయకుండుట | పారుడు సాంతముగా కట్టిన వారము దినములవరకు |
| దొమ్మ | 2 మొదలు 3 దినములు | నోటివెంట చొంగ పడుట | పశువు మేత తినువరకు |
| గురక | 24 గంటలు | గురకపెట్టుట | సామాన్యముగా చికిత్స కు లొంగదు |
| జబ్బవాపు | 2 దినములు | జ్వరముతగిలి వాపుకనబడుట | పశువు మేతతినువరకు |
| కురము | 2 మొదలు 5 దినములవరకు | అతితీవ్రమైన జ్వరము కలిగి కాళ్ళుపట్టుపట్టుట | పశువు మేత తినువరకు |
| గాలికుంటు | 24 గంటల నుండి 7 దినములవరకు | తీవ్రమైనజ్వరము, పుండ్లుపడుట | పుండ్లు మాని మేత తినువరకు |
| క్షయ | 10 దినముల నుండి కొన్ని వారముల వరకు | దగ్గు, కళ్ళపడును | దగ్గుకట్టువరకు |
| మశూచి | 3 నుండి 5 దినముల వరకు. | తీవ్రమైనజ్వరము, రసి కుండలుపోయుట | పొక్కులన్నియు ఊడి పోయిన తరువాత ఒకవారము వరకు |
| కల్లవాపు | 3 నుండి 18 దినములవరకు | వాపులు వాచును. | వాపులు తగ్గి మేత మేయువరకు |

మంచి మేపుగల జంతువులు పరాశ్రయజీవుల బాధలేకుండునట్లు పరిశోధనలవలన తెలియుచున్నది. అందును కొన్ని ఖనిజలవణము లవసరము. ఏదైన యీపచ్చిక బయలులలో నట్టిలవణములు తక్కువయున్నచో ఆయా లవణములను ఆయా పశువులకు ప్రత్యేకముగా యివ్వవలయును. నెలలో కొరవడిన లవణమందు జంతువులచే నాకించుట మంచిపద్ధతి. ఎదిగిన పశువులకన్న లేగదూడలకు పురుగులబాధ హెచ్చునను సంగతి అందరకును తెలియును. కావున వానికి ఆబాధలేకుండుటకుగాను సరియగు నహార మిడుట చాల అవసరము. పాకలలోకట్టి మేపబడుజంతువులకు గడ్డి మొదలగువానిని ఎత్తుగానున్న స్థలములందుంచి మేపవలెను. గడ్డిగాని నీరుగాని క్రిందుగానున్నచో వానిమలముతో గలసి మలినమై రోగకారణమగును.

షరా:—వెటరినరీ డిపార్టుమెంటువారు ప్రకటించిన కరపత్రములనుండి తీసికొనబడెను.

## పెద్దరోగము (Renderpest)

దీనినే పెద్దరోగము, టింక, చీడపారుడు, సరకు, కలరా, అమ్మవారు, గొట్టాలమ్మ, విషజ్వరమని ఆయాదేశభాషలను, వాడుకపేర్లనుబట్టి పేర్కొనుచుందురు.




పెద్దరోగము

ఆ॥ వె॥ కాకతగిలి మేత కడుపార గోరక
కన్నులందు పుసియు గప్పువడును
క్రమ్మర కడుసొక్కి గజగజలాడంగ
రీతిచెడియు బసువు రిత్తవడును॥



శ్రీ పట్టికూటి నాగయ్యగారి
సాంప్రదాయముగల గొప్పజాతి గిత్తలు (బండలాగుటలో మొనగాళ్లు)
మందూరు (తెనాలి తాలూకా)



శ్రీ యెర్రా వెంకటసుబ్బయ్యగారి పాడిగేద (తెనాలి)





శ్రీ కోగంటి శివయ్యచౌదరిగారి పాలదూడలు
అందములో చాల బహుమతులు పొందినవి — తెనాలి.

## స్వభావము-వ్యాపకము

మానవజాతికి కలరా యెటువంటిదో పశుజాతికి ఈ పెద్దరోగమటువంటిది. పశువులకు సంభవించు వ్యాధులలో నిది ప్రమాదకరమైనది. ఈ వ్యాధి ఒకవిధమగు సూక్ష్మజీవుల వలన కలుగుచున్నది. ఈ సూక్ష్మజీవులు సాధారణముగా గాలి మూల మున పశువు శరీరములో ప్రవేశించును. దొమ్మ గురక జబ్బవాపు మున్నగు వ్యాధులను కలిగించు సూక్ష్మజీవులవలెగాక ఇవి మరొక విధముగానుండును. ఈ వ్యాధిని కలిగించు సూక్ష్మజీవులను నీడలోనుంచిన రెండు దినముల వరకు బ్రతుకును. ఈ జీవులకు సూర్యోష్ణత సోకినపుడు 12 గంటలలోపుగా చనిపోవును. ఈ సూక్ష్మజీవులు వ్యాధి తగిలిన పశువునుంచి రెండు ఫర్లాంగులదూరము వరకు వ్యాపించును. వ్యాధి తగిలిన పశువు రక్తమందును, మాంస కండరములందును. పేగులయందును, ఎముకలయందును ఈ జీవులాక్రమించుకొనును. కనుక జబ్బులోనున్న పశువుల మలమూత్రములు విసర్జించిన ప్రదేశములందెల్లెడలను ఈవ్యాధి వ్యాపించును. అందువలన జబ్బుగానుండు పశువులను మంచిపశువులనుంచి విడదీయవలెను. రైతులలో చాలామంది ఈ వ్యాధి ఏరీతిగా కలుగుచున్నది? తగిన చికిత్సలేమి? పూర్వమునుంచి ఈ వ్యాధి గ్రామము లోనికి రాగానే జాతరలెందుకు చెయుదురు? అను పలువిషయములు తర్కించు చుందురు.

18 వ శతాబ్దములో ఆసియాలో ఈ వ్యాధిని కలిగించు సూక్ష్మజీవులను కను గొనిరి. తరువాత టర్కీ, సైబీరియా, ఆఫ్రికా, హంగాడ, ఈజిప్టు, యూరప్‌వరకు వ్యాపించెను. 1711 లో ఈ వ్యాధి పరిష్యాలో సోకి కొన్నికోట్ల పశువులు చచ్చినవి. 1714 లో ఫ్రాన్సుదేశమంతట వ్యాపించెను. 1870 లో జర్మనీయుద్ధము జరిగినపుడు నాతుయూరపునకు వ్యాపించెను. 1865 నుంచి 1866 వరకు గ్రేట్‌బ్రిటలోనున్న కసాయి దుకాణములద్వారా ఎక్కువగా వ్యాపించెను. ఆ సమయములో నూటికి ౬0 వరకు మరణించెను. హిందూదేశమునకు ఆ పై ప్రదేశములనుంచి వచ్చినటుల తెలియుచున్నది.

ఈ వ్యాధి నెమరువేయు జంతువులకే తరచుగాసోకుచుండును. ఇంకను కోళ్లకు, కుక్కలకు, పందులకు, దుప్పలకు, పక్షులకు సోకును. ఈ వ్యాధినిగూర్చి 18 సంవత్సర ములనుండి నాకు మిగుల అనుభవముగలదు. ఈ వ్యాధినిగూర్చి నేను స్థాపించిన పశువుల అస్పత్రి, ఆంధ్రజాతీయ పశువైద్య కళాశాలతరపున నేను నా శిష్యకోటి తగిన పరిశోధనలు జరుపుచునేయున్నారము. కాని పదిసంవత్సరముల నాటికి ఇప్పటికి వైద్య ములో కొన్ని వ్యత్యాసములు వచ్చినవి. పూర్వము చనిపోయినన్ని పశువులు చచ్చుట లేదు. అంతకు ఎక్కువగా చచ్చినవనిన రైతుల అశ్రద్ధయేగాని మరొకటిగాదు. నేను రచించిన పశువైద్యగ్రంథాలమూలమున ఆంధ్రదేశములోనున్న రైతులలో చాలమంది శాస్త్రసమ్మతముగా చేయుటవలనను, నా శిష్యుల అస్పత్రుల సహాయములవలన

---

బాపల సేద్యము కాపుల సమారాధన.

ఈ వ్యాధినిగూర్చి ప్రచారముసాగినది. అమ్మవారికి బలులు ఘటపుఘండ, ఊరేగింపులు మా ప్రచారమువలననే తగ్గినవి. ఏ గ్రామములలోనో తప్ప ఇప్పటి కాలపరిస్థితులలో బలులు చాలావరకు ఆగిపోయి పూజాపిధులతో మ్రొక్కుబడులు చెల్లించుకొనుచున్నారు. ఇంకను యిప్పటి కాలపరిస్థితులలో ఈ వ్యాధికి గ్రామజాతరలుచేసి జంతువులను బలులునిచ్చుచున్నారనిన అంతకంటెమూర్ఖతలేదు. కాబట్టి రైతునాయకులంతా ఈవ్యాధి గ్రామమునకు రాగానే ఈ దిగువ చూపించు విషయములను గ్రహించి తగిన సేవ చేయుదురుగాక.

## వ్యాధిసోకు విధానము

ఈ రోగములోనుండు పశువులను మంచిపశువులు నాకుటచేతను, రోగపశువు యొక్క మలమూత్రములు, చొంగపడిన మేతపగ్గాలు మంచిపశువులు తినుటచేతను, తగిలిన పశువుకుల కుపయోగించు తొట్లు, మట్టిపాత్రలు మున్నగునవి మంచిపశువులకు వాడుటచేతను, మాదిగవాండ్రు తమ బంధువులకు ఈ వ్యాధితగిలిన పశువుల మాంసమును పంపించుటచేతను, ఈ వ్యాధి తగిలిన గ్రామములద్వారా మంచిపశువులను సంతలకుగాని బంధువుల యిండ్లకుగాని తోలుకొని వెళ్లుటచేతను, గ్రద్దలు కోళ్ళు కుక్కలు కాకులు మొదలగు అల్పజంతువులు ఈ వ్యాధిచే చనిపోయిన పశుమాంసము నచ్చటచ్చట తినుచు విడచుట చేతను, వ్యాధిగల పశువులను స్టీమర్లలోనుంచి తదితర ప్రాంతములకు పంపుటచేతను, చచ్చిన పశువులను పాతిపెట్టకపోవుటచేతను, ఈవ్యాధి సోకిన ఆవు, గేదె మున్నగు పశువులను మగపశువులు దాటుటచేతను ఈవ్యాధిసోకును.

ఈ వ్యాధి గేదెలను దున్నలను ఎక్కువగా బాధించును. ఒక్కొక సమయములో రైతునకున్న నల్లపశువులన్నియు చని పోవుటయు కలదు. ఎద్దులు ఆవులకు ఈ వ్యాధి సోకిన ఆరంభములో తగిన సలహా తీసికొని చికిత్సచేసిన నిరభ్యంతరముగా తగ్గును. ఈ వ్యాధితగిలిన పశువుల చర్మముపైన దద్దురు దద్దురుగా ఒకవిధమగు పూతపూసినట్లుండిన ఆ పశువులకంతే ప్రమాదము రాజాలదు.

## లక్షణములు

ఈ వ్యాధిసోకిన పిమ్మట బయటకు కనపడుటకు 3 నుంచి 8 దినముల వరకు పట్టును. కొన్ని జంతువులకు 10, 15, 30 దినములవరకు పట్టును. రైతులలో చాలమంది పారుడుపుట్టిన తరువాత వైద్యులకు చూపించుదురు. ఈ పారుడు పసుపుపచ్చగానుండి, రక్తకండలు పడుచు ముడ్డితీపుగానుండి పదేపది విరేచనములగుచు గబ్బులవాసన కొట్టుచున్నపుడు అట్టిపశువు బ్రతుకుట చాల కష్టమని గ్రహించవలెను. మిగుల అనుభవము గల వైద్యుడున్నగాని ఇట్టి ప్రమాదస్థితిలో సరియగు చికిత్స చేయజాలడు. మన రైతులలో అధిక చాదస్తముగలవారున్నారు. ఏ వెంకయ్యో ములగచెక్కరసం ఉప్పు

కలిపిపెట్టగా తగ్గునని చెప్పగానే అదే మాదిరిగా అందరు నమ్మి చేసేవారు, ఇప్పటి కాలపరిస్థితులలోకూడ నున్నారు. ఇట్లుచేయుట చాలా పొరపాటు. ఆపశువునకు జ్వర మున్నదా? లేక ఎక్కువ విరేచనములగుట వలన శీతలమునకు వచ్చినదా? ఏమైన ముక్కుడున్నదా? ఏ యే వస్తువులు పెట్టిన వేడివచ్చును? ఏ మందులు పెట్టిన విరేచ నములు కట్టును? మున్నగువిషయములు గ్రహించి ఓషధుల గుణములు తెలిసికొని చికిత్స చేయవలెను. అందరు చెప్పిన వైద్యసలహాలతో పోవద్దని నా యభిప్రాయము.

మొదటి-అవస:— ఈ వ్యాధి సోకినవెంటనే 105, 106, డిగ్రీలజ్వరముండును. మనుష్యులకు పెట్టు ధర్మామీటరునే పశువుల ముడ్డిలో పెట్టిన తెలియును, అరమేత మేయుచుండును. ముఖ్యముగా దగ్గుండును, కొన్నిటికి యుండదు. చెవులనుండి రసి కారును. తలనిటునటు కొట్టుకొనుచుండును. కనుగొలుకులు సూక్ష్మముగా చిట్లి పుసులు కట్టును. కొన్ని కండ్లనుండి నీరుగార్చును. మలము గట్టిగా వేయును. గుండె తీవ్ర ముగా కొట్టుకొనుచుండును. పాడిపశువులైన వెంటనే పాలుఎండిపోవును. కొన్నికండ్లు కనురెప్పలు ఎర్రబడును. ఈ ప్రథమావసలోనే రోగ్యపుట్టిన ఆ పశువు బ్రతుకుట కష్టము. కావున జాగ్రత్తగా పరిశీలించి రోగ్యము పోగొట్టు నదుపాయములు చేయ వలెను.

రెండవ అవస:— పశువు నోటిలోపల ఎరుపుగా కంది పొక్కులుపొక్కులుగా నుండును. ఈ అవసనుంచి మేత నీరు మానును. చెవులను వ్రేలాడవేయును. క్రమేపి జ్వరము తగ్గును. ముక్కులనుండ చిక్కని చీమిడి నోటిగుండ చొంగపడుచుండును. ముక్కులను శుభ్రముగా కడుగనిచో పుండ్లు పడును నోటిలోపలనుంచి ఒక విధ మగు దుర్వాసన వేయుచుండును. ప్రథమావసలో నేమక్కిటెద్దులను బండిపనిగాని నాగలి పనిగాని చేయించిన ఆపశువులకుకూడ ప్రమాదముకలుగును. నా అనుభవముమీద ఇట్టి పశువులకు ఎతో అనుభవచికిత్స చేసినగాని తగ్గవు శరీరమందేభాగమందైన ఈ రెండవ అవసలో ఒకవిధమగు వాపులుపుట్టును. ఈ వాపులు మెత్తగాగాని, గట్టిగాగాని యుండును. క్రమేపి కనుగొలుకులు ఒరిసి పుండ్లుపడును. ఆపశువులైనయెడల శరీరము మీద పుండ్లుపడి ఎరుపురంగుగానుండును. దీనినే మసూచిపూశ యందురు. కండ్లనుండి కారు నీరు పగరుగ కారముగ నుండును. దాహ మెక్కువగును. ఆకలి నిలిచిపోవును. నాడి తీవ్రముగాకొట్టుకొనుచుండును. విరేచనరంగు పులుసువాసనగ కొద్ది పసుపురంగు గానుండి దినమునకు రెండుమూడు పర్యాయములు పోవుచుండును.

మూడవ అవస:— ఈ అవసలో పశువు చాలా కృశించి చాలా విచారకరముగా నుండును. వ్యాధి ముదిరిన కొలది విరేచనముల రంగుమారి దుర్వాసనగానుండును. ముడ్డిలోపల తెంద్రుపుట్టి ముక్కుచుండును. జ్వరము క్రమేపితగ్గుచుండును. ఈ సమయ ములో జ్వరము తగ్గకుండ విరేచనములును కట్టించు నదుపాయముల చేయవలెను. ఉచ్ఛ్వాసనిశ్వాసముల నాటంకపరచుచు దగ్గునింపజేయును. పసుపురంగు నీరువలె పదేపదే

బాపన సేద్యం భత్యపు చేటు.

పారుచుండును. ఎప్పటికప్పుడు పశువుపారిన భాగమందు నున్నపూనీటిని చిక్కగా కొట్టవలెను. ఆ స్థలమును పరిశుభ్రము చేయవలెను.

నాలుగవ అవస్థ:—పశువుశరీరము, కాళ్లు, ముఖములరంగుమారి ముడతలు పడును. శరీర వేడితగ్గి శీతలములోనికి వచ్చును. మూత్రకోశముచెడును. నాలుక తెలుపు-పసుపుకలిపిన రంగుగానుండును. నోరంతయు, ఆరిపోయి, దాహ మెక్కువగును, కొన్ని దాహమును కోరవు. ప్రేగులు అరచుచుండును. కాళ్లనరములు లాగుచుండును. పశువు నిలబడుచు లేచుచు బాధపడుచుండును. దేహమంతయు శీతలములోనికివచ్చును. కను గుంటలు విడదును. పెట్టిన మందులు మలముగుండా పోవుచుండును. కండలు కండలుగా కొద్దిగా పారుచు బలిమిముకలు బయటపడి నిరసించి మరణించును. కొన్ని పశువుల తత్వ మునుబట్టి పైలక్షణములలో మార్పులుండుటయు గలదు. కాబట్టి జాగ్రత్తగా చికిత్స చేయుటమంచిది.

## సంరక్షణ

ఈ వ్యాధికి ఔషధములకన్న సంరక్షణ చేయుటయే ముఖ్యము. రైతులలో చాలామంది పశువులను చలిగాలిలోనుంచుదురు. మరికొందరు ఎండలో కట్టుదురు. ఇంక కొందరు పెంటకుప్పలందును, గాలి వెలుతురులేని చోటులందుకట్టుదురు. ఈవ్యాధి వర్షాకాలమునం దెక్కువగను, వేసవికాలమునందు తక్కువగను ప్రబలుచుండును. వర్షమునను తడియనీయక ఆ యాకాలపరిస్థితులనుబట్టి జాగ్రత్తగా కాపాడవలెను. ప్రతి గంటకు ముక్కులను నోటిని పటికనీటితో గాని, ఇతర వగరుపదార్థములతోను కడుగుచు ఈగలు వాలకుండ కాపాడుచు దాహము కావలెనని కోరికయున్న అరగా కాచిననీరు పెట్టుచు అప్పుడప్పుడు ముక్కురంధ్రములను మంచిమానెయ రాయుచు మలమూత్రములను తీసివేయుచు, కట్లను పరిశుభ్రము చేయుచు, ప్రక్కలను కాసలను మంచిపశువులను దగ్గరకు రానీయకుండ కాపాడుచు, విరేచనములకున్న పుకు తీసివేసి నేలను పాటి మట్టితోగాని సున్నముతోగాని జల్లి శుభ్రముచేయుదురు, కాపాడుచున్న మొదల తగ్గిపోవును.

## ఆయుర్వేద చికిత్స

ఈ వ్యాధిసోకిన వెంటనే కనుగొనుట కష్టము. ఎంతో అనుభవమున్నగాని కను గొనజాలము. జబ్బురాగానే కండ్లకాలుపులు ఒరిసినవా? పశువు అప్పుడప్పుడు నల్లకప్పు వేయుచున్నదా? పశువు పనిచేసి వచ్చినదా? బాధవలన పండ్లుకొరుకు చున్నదా? చూడిపశువైనచో లోపల పిండముతిరుగుచున్నదా? దగ్గు అప్పు డప్పుడు వచ్చుచున్నదా? తీవ్రముగానున్నదా? చెవుల మొదట మున చేతిగుప్పిళ్లతో పట్టుకొని వేడిగానున్నదా? సమశీతలముగానున్నదా? చల్లగానున్నదా? ఆదివరకా పశువునకు యేయేపదార్థములు పెట్టినారు? పాడిపశువులైన పాలన్నియూ ఎండిపోయి

నవా ? దూడయున్న పాలు కుడిపినారా ? గ్రామములో ఎన్నిచోట్ల ఈ వ్యాధి గలదు. మన్నగు ప్రశ్నలన్నిటికి సమాధానము తెచ్చుకొని చికిత్సచేసికొనుట మంచిది.

ఆరంభములోనే వ్యాధిసోకిన అనుమానమున్నపుడు తేలికగా సబ్బునీటితో ఎనిమా చేయుటమంచిది. ఈ ఎనిమావలన లోపలి మలమంతపోవును. కాని జ్వరము లేక పోయిన ఏనీమాచేయరాదు. ఏనిమా చేయుటకు నీకు అవకాశములేనియెడల ఈ దిగువ చికిత్సలలో నేదో నొకదానిని చేయుము. చూడిపశువులకు ఏనిమాచేయరాదు. మందులను కూడ ఎక్కువగా వాడరాదు. చింతపండుపులుసుసేరు, ఉప్పు 6 తులములు కలిపి తగిలిన వెంటనే ఒక్కపర్యాయమే పెట్టుము. లేక సొంటి 1తు, వాము అరగుప్పెడు మోదుగ పువ్వు 1½ తు, ఉప్పు 3 తు, బియ్యపునీరు సేరుకలిపి ఒకపర్యాయమే త్రాగించవలెను.

లేక ఉదయముపూట 100 న్ను సాయంకాలము 100 న్ను తమలపాకులకు మంచినూనెరాసి తినిపించవలెను.

లేక వెల్లుల్లిపాయలు 2 తు, వాము 4 తు, పుప్పు 4 తు, చింతపండుపులుసు అర్థసేరు కలిపి నూరి త్రాగించవలెను.

లేక వెదురాకు అరగుప్పెడు, నేలవేము 1 తు, నల్లేరువ్రేళ్లు 1 తు, తెల్లఆవాలు 1 తు, బియ్యపునీరుసేరు కలిపి త్రాగించవలెను.

లేక నేలవేము 2 తు, మోదుగపువ్వు 6 తు, నువ్వులనూనె అర్థసేరు కలిపి త్రాగించుము.

లేక నల్లేరుకాడల రసము 3 తు, వెల్లుల్లిరసము 4 తు, నువ్వులనూనె అర్థసేరు కలిపి త్రాగించుము.

లేక ముండ్లనుతీసివేసిన నాగజెముడును త్రొక్కి ముండ్లనుతీసివేసి దానిలో సొంటి మిరియాలు, కరక్కాయలు, తాడికాయలు, ఉసిరికపప్పు ఒక్కొక్కటి 2 తులములు తీసికొని చూర్ణము చేసి మెత్తగాత్రొక్కి ఈ మందునే మూడు భాగములుచేసి ఉదయ, మధ్యాహ్న, సాయంకాలములందు అర్థసేరు కలినీటితో పెట్టవలెను. పై మందు లన్నియు వ్యాధిసోకిన ప్రథమ ద్వితీయ అవస్థలలో ఒకటి రెండు మోతాదులకంటె పెట్టరాదు.

ఈ వ్యాధియందు పశువులకు శీతలము రానీయకుండ కాపాడవలెను. చాలామంది సారాయిని వ్యాధి ప్రారంభించిన లగాయితు వాడుదురు. ఇది చాల పొరపాటు. ఏ వెంకయ్యో మాపొద్దుకకు నాలుగు డ్రాముల సారాయి వాడితినిగాన మీ పశువులకు కూడ వాడమని సలహాయిచ్చును. ఇట్టి సమయములో పశువులన్నిటికి సారాయి వాడే వారుకూడనున్నారు. అనవసర ఖర్చుతప్ప అంతమాత్రమునకే తగ్గదు. ఏ వేళలో సారాయి పెట్టవలెనో ముందు తెలుపబడును.

---

కంపెనీ వ్యవసాయం ఖర్చులకే చాలదు.

## పారుచున్న పశువులకు చికిత్స

పశువు వ్యాధిసోకిన తరువాత పేడమామూలుగా పారుచున్నదా? లేక పశువురంగుగా గాని, రక్తజీరతోగాని, పారుచున్నదా? రోజుకు ఎన్నిసార్లు పారుచున్నది? పారుచున్నపుడు ముక్కుడు, ముడ్డి తీపుయున్నదా? దాహమున కన్నిపర్యాయములు లాగుచున్నది? మున్నగు విషయములు పరీక్షించవలెను.

దినమునకు రెండుమూడు పర్యాయములు పారుచున్నయెడల పచ్చితుమ్మచెక్క, పచ్చినేరేడుచెక్కను తెచ్చి నీరుపోసిత్రొక్కి సేరు చిక్కనిరసము వచ్చునట్లుగా త్రొక్కి దానిలో సేరు లేక అర్ధసేరు కలినీరు (అనగా బియ్యముకడిగిన నీరు) కలిపి ఈమోతాదునే రెండువేళల పెట్టవలెను. ఈ చికిత్సకుగూడ పారుడు కట్టనిచో మరొక మోతాదు ఈయవచ్చును.

లేక దానిమ్మ చిగుళ్లను 15 తులములు తెచ్చి మెత్తగానూరి అర్ధసేరు పెరుగుతో పెట్టవలెను. లేక పైశిప్రత్తి ఆకురసము సేరు, మజ్జిగ అర్ధసేరు కలిపి కాచిపెట్టవలెను. లేక నేలతంగేడాకును కచ్చపచ్చగాదంచి సేరుమజ్జిగలో కలిపి త్రాగించవలెను. ఈ చికిత్సలన్నియు విరేచనములు తీవ్రముగానగుచు లోపల జ్వరము తగ్గకుండ నున్నపుడు విరేచనములుకట్టువరకు మూడునాలుగు పర్యాయములువరకు పెట్టవచ్చును. ఈ మందులు పెట్టునపుడు విరేచనములు కట్టినచో వెంటనే ఆపవలెను. లేనిచో మలబంధము కలిగి పశువునకు వగర్పు పుట్టును. ఇంకను దేహమంతయు మిగుల వేడిగానుండి విరేచనములగుచున్నపుడు అరటిదూపను మానెకు నీటిలోవేసి దంచి రసముతీసి దానిలో తవ్వెడు జొన్నపిండికలిపి కాచి చల్లార్చి పెట్టవలెను. లేక తంగేడాకు పసరు సేరు, పెరుగు అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

ఎన్నిమందులు పెట్టినను పారుడు కట్టనపుడు వరిపిండి సోలెడు, హారతికర్పూరము ¼ తులము, పాలుసేరు, కవిరి 2 తు, కలిపి త్రాగించవలెను.

లేక సీమసున్నం 4 తు, కవిరి 2 తు, మాచికాయలు 1 తు, నల్లమందు ¼ తు, గంజాయిపత్రి ¼ తు, వరినూకలజావ సేరు కలిపి పారుడు తగ్గువరకు ఒకటిరెండు మోతాదులు ఈయవలెను.

## వేడిమిని కలిగించు మోతాదులు

కొంతమంది రైతులలో చెడుఅలవాట్లు గలవు. తమకు రోగవిషయము తెలియదు. ఏమైన మందు ఖర్చుఅగునేమోయని దొరకినమందులెల్ల పెట్టిందురు. వివిధరకముల వైద్యులను పిలిపించుదురు. వారుచెప్పే నమ్మకములన్నిటిని విని తప్పో ఒప్పో చేయుచుందురు. మరికొందరు గ్రంథములో చూచితిమి. వ్యాధి కుదరలేదు. ఏమి గ్రంథములని చప్పరించుదురు. ఈరీతిగా అనేకవిధముల రైతులున్నారు. ఇట్టి రైతులకు చెప్పవలసిన

---

గడ్డగడ్డకు పుట్టెడు నీళ్ళు త్రాగి అయినా రెడ్డే సేద్యము చెయ్యవలయును.

సలహాలేమన మీకు అనుభవమున్న చేసికొనుటమంచిది. అనుభవము లేకపోయినా వ్యాధి ప్రారంభమునుంచి ఏవైద్యునితో చికిత్స చేయించుదురో చివరవరకు ఆవైద్యునితోనే చికిత్స చేయుటమంచిదిగాని ఆ వైద్యుని రప్పించాము తగ్గలేదు మరొకవైద్యుని పిలిపించాలి, ఇంకొక వైద్యుని పిలిపించాలి అనే ఆతురత పనులు చేయక జాగ్రత్తగా నోరులేని పశువులకు చికిత్స చేయించమని నా అభిప్రాయము. గ్రంథములు వ్రాసిన పశువైద్య గ్రంథకర్తలమీదకూడ దాడిస్తు వారున్నారు. ఆ గ్రంథము లెంతవరకు పనిచేయును ? ఆ గ్రంథములలోని సారాంశము తెలిసికొని ఇంకను అనుభవముమీద తదితర మందులు కలుపుకొని పని చేసికొనవచ్చునా ? గ్రంథములోని మందులే ఉపయోగపడునా ? అను విషయములను గ్రహించి మీకు తెలియకపోయిన దగ్గర వైద్యులను, అనుభవముగల వారితో సంప్రదించి చేయుటమంచిది. పశువు శరీరమంతా చల్లబడి ఎక్కువగా విరేచనము అగుచున్నపుడు ఆపశువు బ్రతుకుట చాలాకష్టము. కాని సారాయి 3 డ్రాములు, ముద్ద కర్పూరము ½ తు కలిపి ఒక మోతాదు యిచ్చుటవలన వేడిరావచ్చును. లేదా పిప్పర్ మెంటు ఆయిల్ అరవైచుక్కలను సేరు గోరువెచ్చని నీటిలోకలిపి ఒక్క మోతాదే త్రాగించవలెను. లేదా స్వచ్ఛమగు నువ్వులనూనె మూడు గొట్టములు త్రాగించుము లేదా కాడజెముడు ఆకురసమును పొంగించి అరగొట్టము త్రాగించుము. ఈ మోతాదులకు వేడిరానిచో ఆ పశువు బ్రతుకుటకష్టము.

## కల్లవాపులకు, పుండ్లకు చికిత్స

కొన్ని పశువుల శరీరముమీద యేభాగమందయినను గట్టిగాగాని, మెత్తగాగాని వాపులుపుట్టును. ఈ వాపులు నెలరోజుల వరకుకూడ యుండవచ్చును. ఒక్కొక్క సమయములో ఎన్ని మందులురాసినను తగ్గక రక్తముపట్టిన తరువాత తగ్గుటయుగలదు. ఆ వాపులమీద చవుడు సున్నముకలిపి చుక్కలు పెట్టవలెను. లేక చేదుజీలకర్ర అరతులము ఆవపిండి అరతులము దుష్టపాకుగాని గాడిదగడపాకు పసరుగాని 10 తులములుకలిపి అప్పుడప్పుడురాసిన తగ్గును. లేక హారతికర్పూరము పావుతులం, కొబ్బరినూనె 6 తులములు తీసికొని గోరువెచ్చగాకాచి వాపులకు పట్టించి వేడినీటికాపులు కాయవలెను.

రావిచెక్క, తుమ్మచెక్క వేసి కాచిన వగరునీటితో నోటిని అప్పుడప్పుడు కడుగుచుండవలెను. లేక సేరు గోరువెచ్చని నీటిలో అరతులము పటికవేసి కలిపి అప్పుడప్పుడు నోరును కడుగుచుండవలెను. ద్రవ్యజ్ఞానములో చెప్పిన ఓషధులను మీ అనుభవముమీద వాడవచ్చును.

## చూడిపశువులకు చికిత్స

సామాన్యముగా చూడిపశువులకు ఈ వ్యాధి తేలికగా తగిలినతప్ప బాగుగా తగిలిన బ్రతుకుటకష్టము. తేలికగాతగిలి బ్రతికినను తప్పక ఈసుకొనిపోవును. కాబట్టి పైన చెప్పిన చికిత్సలనే చేయుచు జాగ్రత్తగా సంరక్షణచేయుచుండవలెను. ఈవ్యాధిచే

---

పశువులు కాచేవాడు పాటుకు అక్కరకు రాడు.

మాసములు వచ్చిగాని రాకగాని పిండమునకు పశువునకు అపాయమువచ్చిన ఈ దిగువ లక్షణములుండును. పశువు సొమ్మసిల్లును. శరీరమంత జిగటవంటి దుర్గంధముపుట్టును. గర్భమునుండి రక్తమువంటి ద్రవముస్రవించుచుండును. మూత్రము మైల ఎక్కువగా పడుచూ, ఆయాస పడుచుండును. ఈ సమయములో అనుభవముగల వారిని రప్పించి పిండమును లాగించవలెను. తరువాత వెన్నెముకకు, తొంటిభాగమునకు పుట్టమన్ను వావిలాకు పసరుకలిపి ఉడికించి పట్టువేయవలెను. మానమును వగరునీటితో కడుగుచుండవలెను వెంటనే లోపలికి 3 డ్రాముల సారాయినిగాని, సేరుపాలలో 4 తులముల మంచి యింగువ, అర్ధసేరు తుమ్మాకు ఉండకలిపి గోరువెచ్చగా కాచిపెట్టవలెను. చలిగాలిలోను, వర్షములోను యుంచరాదు. సూతికావాతము రాకుండ కాపాడవలెను. ఎక్కువ మైలపడుచున్నపుడు కరివేపాకు ఉండ నిమ్మకాయంత అంగిటిలో ఒక మోతాదువంతున రెండుమూడురోజులు పెట్టుము. రోగలక్షణములు తగ్గుచుండిన కాచిన నీరు అర్ధగా పెట్టుము. లేతపచ్చిగడ్డిని కొద్దికొద్దిగా పెట్టుము. మూడు దినములకొక పర్యాయము ఒక కొబ్బరికాయను సేరునీటిలో త్రొక్కి పాలుతీసి వానిలో 3 తులముల వేయించి విసరిన మెంతిపిండి, 3 తులముల ఉప్పుకలిపి పెట్టుము. తెలికపిండి కొద్దికొద్దిగా ప్రతిరోజూ పెట్టుటమంచిది.

## పథ్యము

రైతులలో చాలమంది వ్యాధితగిలిన పశువులకు నీరు, మేత పెట్టరాదని చెప్పుదురు. మరికొందరు నీరు పెట్టుట బొత్తిగా మానివేయుటవలన ఆహారనాళము ఎండి మరణించుచున్నవి. ఇప్పటి కాలపరిస్థితులలో "పశువుపోతే బ్రతుకుపోవురా" యను సిద్ధాంతముతో ఎట్టి చిన్నపశువునకైనను తగు జాగ్రత్తగా చికిత్సలు చేయుచున్నారు. ఈ పదిసంవత్సరములలోపల ఇట్టి శ్రద్ధపశువులకు అంతగాలేదు. ఇప్పుడిప్పుడే ప్రతిరైతు పశుసంబంధమైన విషయములను గ్రహించవలెనను ఆసక్తితోనున్నాడు. నేను ఈ చింతామణిని 1933 లో ప్రకటించినప్పటికి ఈ గ్రంథముచూచి అనుభవముతో చికిత్సలుచేసి రైతుల గౌరవమును పొందిన వారెందరో మన ఆంధ్ర దేశములో నున్నారు. వారున్ను అడుగు సలహాలు చికిత్సలు చూచిన నాకు అత్యంతానందము కలుగుచున్నది. కొంతమంది రైతులు గ్రంథమున్న పశువైద్యము వచ్చునాయని ప్రశ్నలు వేసే వారున్నారు. వీరికి శాస్త్రజ్ఞానముతో నున్న గ్రంథములో కొన్ని కాకపోయిన మరి కొన్ని ప్రాథమిక చికిత్సకైన ఉపయోగ పడునని తెలియదు. నేను ఎన్నో గ్రామములు తిరిగితిని. వివిధరకముల రైతులను చూచితినిగాని ఇంకను అచ్చటచ్చట అనూయాపరులు, తెలిసితెలియని ప్రశ్నలువేయుట, పెద్దగర్వముతో నుండుట, రైతునకు మించిన జ్ఞానము పశుసేవలో నున్నదని గర్వించుట, మున్నగు విషయములెన్నో గలవు. గాన మీరుకూడ జాగ్రత్తగా పశుసేవ చేసి కాపాడుదురుగాక.

---

**మదుంవారమడి అయినా కావలెను, మాటకారి మొగుడు అయినా కావలెను.**

పెద్దరోగముగల పశువులకు నూకలజావ పెట్టిన ఆహారకోశము శీతలములోనికి వచ్చునని భయపడుదురు. గాని పదేపదే విరేచనములగుచు శరీరమంతా శుష్కించి నీటి కొరకు ఆహారముకొరకు ఎదురు చూచునప్పుడు సేరుజావలో రెండు లేక మూడు డ్రాముల సారాయి కలిపి అప్పుడప్పుడు యిచ్చుటమంచిది. ఆహారవిషయములో మొదటి దశ రెండవదశ సగములో అరమేత మేయునుగాన ఆహారము పెట్టనవసరములేదు. నూకలజావలోగాని జొన్నజావలోగాని తేలికగా జీర్ణమగు గుణముకలదు. ఈ జావ పెట్టుటవలన పశువు నిస్త్రాణకెందదు. లోపల దండిగానుండును. అతిఎక్కువగాను పెట్టరాదు. నిలువయున్నజావను త్రాగించరాదు. ఈ వ్యాధిగల పశువులకు ద్రవ పదార్థములుతప్ప గట్టిగానుండు పదార్థములను పెట్టరాదు. నీటివిషయములో వ్యాధి సోకినది లగాయతు నెమ్మది యగువరకు తుమ్మచెక్కగాని, రావిచెక్కగాని, వేసి సలసల కాగిన తేలికకషాయమును చల్లార్చిపెట్టుటమంచిది. ఈ కషాయమును పెట్టుటవలన నీరు అరగా త్రాగును. పేగులు నోరు గారపట్టును. పారుడుకూడ గట్టిపడును. నా అనుభవము మీద ఈ కషాయమే బాగుగా పనిచేయుచున్నదని తెలుపుచున్నాను. ఇంకను వేడిజేసి చల్లార్చిన నీటిలో కొద్దిగా పసుపువేసి పెట్టవచ్చును. వ్యాధి తిరిగిన తరువాత కూడ జావ, వగరు కషాయములు తేలికగా తయారు చేసి పెట్టవలెను. రోగమునుండి తేలిన పశువులను పక్షము దినములవరకు మందలో కలుపరాదు.

## ఈ వ్యాధిని ఆపుటకు మార్గములు

గ్రామములో ఈ రోగము రాగానే జాడ్యము తగిలిన వాటిని తక్షణమే మరొక చోట కట్టవలెను. కొంతమంది రైతులు దేవుడుంటే ఎచ్చట కట్టివేసినా ఫరవాలేదని తీగలు తీయుచు పశువుమీద ప్రేమలేక మాట్లాడుదురు. మనిషికి కలరారాగానే అమ్మో నాయనోయని గుండెలు బాదుకొనుచుందురు. అంత తాపత్రయమే నోరులేని పశువులకుకూడ యుండునని పాపము వీరికి తెలియదు. చూడండి మంచిపశువును జబ్బు పశువులోనుంచండి, అది యెంతబాధపడునో జాగ్రత్తగా చూచిన తెలియును. కొట్టి తప్పక జబ్బుపశువులను విడదీయవలెను. జబ్బుపశువులున్న స్థలమునకు సంబంధించిన కొట్టపుగోడలు, కొలటి తొట్లు శుభ్రముగానుంచవలెను. రోగపశువులకు చికిత్స చేయువారుగాని, అంటుసోకియుండు స్థలములలో తిరుగు కుక్కలు కాకులనుగాని మంచి పశువులున్నచోటుకు రానీయరాదు. చచ్చిన పశువులనుమాత్రము కోయించక పది పండ్రెండడుగుల లోతున పాతి పూడ్చుటమంచిది.

## ఆంగ్లేయ చికిత్సలు

కొంతమంది రైతులు మననాటుచికిత్సలు చాలాయుండగా ఈ ఇంగ్లీషుమందులు మనకెందుకయ్యా ! అని ప్రశ్నించేవారున్నారు. ఇప్పటి కాలపరిస్థితులనుబట్టి అన్ని రకముల వైద్యసేవను గ్రహించి ఏది యుపయోగకరముగానుండునో దానినే స్వీకరించ

తుని నా ముఖ్యసలహా. నేను ఎంతోమంది గవర్నమెంటు పశువైద్య డాక్టర్లను, వారి పై ఆఫీసర్లను పరిశోధన ప్రొఫెసర్సును స్వయముగా చూచితిని. వారి వైద్యము కూడ మా చికిత్సాలయమునందు ఆచరణలో పెట్టి చేయుచున్నాను. ఈ వైద్యమువలన ఎంతవరకు ఉపయోగము రైతులకు పశువులకు యున్నదో ఈ గ్రంథములో తెలుపుచున్నాను. గవర్నమెంటు పశువైద్యులు గ్రామములోనికి వచ్చి యిచ్చు సలహాలనుకూడ గ్రహించండి. ఏదిమీకు ఉపయోగముగానున్న దానినే మీరు సందేహములేకుండా వారిని అడుగుట మంచిది.

ఈ వ్యాధిసోకిన వెంటనే క్రిసాల్ 1 తులము తీసికొని సేరు నూకలజావలో పెట్టవలెను. లేక పొటాషియం పర్మాంగనేట్ అను పొడి నీటిలో చిక్కగా కలిపి రెండు మూడు దినములు వరుసగా యిచ్చిన లోపలక్రిమి నశించి వ్యాధితగ్గును.

లేక కార్బాలిక్ ఆసిడ్‌ను 60 చుక్కలు తీసికొని సేరు నూకలజావలో కలిపి పెట్టవలెను. ఈ రీతిగా మరికొన్ని చికిత్సలుగలవు.

పారుడెక్కువగానున్నయెడల క్యాంఫర్‌డైన్‌నుగాని, క్లోరడైన్‌గాని అరఔన్సు వరకు నీటిలో కలిపి రెండుమూడు పర్యాయములీయవలెను.

లేక కాచు 2 డ్రాములు, ఛాకుప్రిపేటా 2½ తు, సినమన్ 2 డ్రాములు, జింజర్ 2 డ్రాములు సేరు గంజిలో కలిపి ఒకటి రెండు పర్యాయములీయవలెను.

లేక గాల్సుపౌడర్ 3 డ్రాములు, ఓపియం 2 డ్రాములు, ఆనిసీడ్ 2 ఔన్సులు గంజిసేరు కలిపి ఈయవలెను.

నోటిపుండ్లకు:— పొటాష్‌క్లోరస్ ½ ఔన్సు తేనెగాని, బెల్లముగాని తగినంత నోటికి రాయవలెను. లేక పొటాషియం పర్మాంగనేట్ లోషనుగాని ఆలంలోషన్‌గాని అప్పుడప్పుడు నోటిని కడుగుచుండవలెను.

## పెద్దరోగమునకు టీకాలు

గవర్నమెంటు వారిచే ఈ వ్యాధికి కనిపెట్టబడిన టీకాలను ఈ వ్యాధి మంచి పశువులకు రాకుండ టీకాలు వేయించుట మంచిదని నా ముఖ్యసలహా. కాని అన్ని ప్రాంతములందును ఒకేపర్యాయము ఈ వ్యాధి వచ్చినపుడు మందు తాత్కాలికముగా దొరకక ఏ నెలకో వచ్చుటవలన రైతులకు పశువులకు కష్టముగానున్నది. గాన గవర్నమెంటువారు అన్ని ప్రాంతములకు అందుబాటులో నుండునట్లు ఆయుర్వేద పశువైద్య డాక్టర్లనుకూడ ఛార్జియిప్పించి ఈ రోగనివారణకు పూనుకొందురుగాక.

---

బావిక్రిందదున్ని బ్రతికినవాడు, చేనిక్రిందదున్ని చెడినవాడు లేడు.

## దొమ్మరోగము (Anthrax)



**దొమ్మ**

సీ॥ పసరంబు గజగజ వణకి పోవుచునుండు
కన్నీరుగార్చుచు కానుపించు
నల్లకప్పునుగప్పి యుల్లాసము దొలంగి
చెవులకు నిసుమంత చేవదప్పు
ముక్కురంధ్రములలో నక్కిన చెమ్మంత
మంట తగిలినట్టు మాయమౌను
కఫము బైటకుతన్న కడుపుబ్బరమునొంది
నాల్కజాఱవిడచి నగిలిపారు

కంఠమందువాపు కడువేగమొందంగ
నాసనంబునుండి యమితగతిని
నెత్తురల్లవిడచి నుత్తలపడిచావ
దొమ్మరోగమండ్రు దొడ్డవారు ॥

### స్వభావము - వ్యాపకము

రైతులలో చాలామంది ఈ వ్యాధి విషయమై సరిగా తెలిసికొనజాలరు. దొమ్మ రోగమునుగూర్చి అనేకమంది అనేకరీతులుగా పేర్లుపెట్టి పశువులను వివిధ చికిత్సలు చేయుదురు. పశువులకు సంభవించు రోగములన్నిటిలో దొమ్మ మిగుల హానికరమైనది. ఇది ఒక జంతువునుండి మరొక జంతువునకు సోకు రోగమైయున్నది. ఎంతో అనుభవ

---

ఇసుక నేలదున్ని బాగుపడినవాడు బంక నేలదున్ని చెడినవాడు లేడు.

మున్నగాని ఈ వ్యాధిని కనిపెట్టజాలడు. పెద్దరోగము తగిలిన పశువువలె ఎక్కువ కాలముండక గంటలప్రకారము చచిపోవును. అందుచేత రైతులు ఆతురతపడుచుందురు. పెద్దరోగమంత తీవ్రముగా అన్నిపశువులకు సోకదు. ఈ వ్యాధిని కలిగించు సూక్ష్మ జీవులు మట్టిలో కలిసి పదిసంవత్సరములవరకు జీవించియుండును. ఈ సూక్ష్మజీవుల గ్రుడ్లను సీలుచేసిన గొట్టములో పెట్టి కాపాడగా 22 సంవత్సరములవరకు బ్రతికినవని లూయీ పాస్టర్ దొరగారు తెలిపిరి. పల్లపు నేలలోనుండు గడ్డివేళ్లను ఈ సూక్ష్మజీవు అంటుకొనియుండి పశువు మేయునపుడు ఆగడ్డితోగూడ శరీరములోనికి ప్రవేశించిన తరువాత ఈ వ్యాధిసోకును. ఎఱ్ఱలు విశేషముగానుండు నేలలో ఈ వ్యాధి ఎక్కువగా నుండును. ఈ జాడ్యపు విషాంకురములు మనుష్యులకుండు గాయములగుండ ప్రవేశించిన రాచపుండ్లు, చెడువ్రణములు కలిగించును. ఈ వ్యాధిగల పశువును చికిత్సించు వైద్యుడు చాలా పరిశుభ్రముగానుండి జాగ్రత్తగా చికిత్సచేయవలెను.

చచ్చిన జంతువులను కాల్చక, పాతిపెట్టకపోవుట చేతను, ప్రవహించు కాలువల లోను, నదులలోను కళేబరములను పారవేయుట చేతను, ఈ వ్యాధిచే బాధపడు పశువు దగ్గరనున్న మలమూత్రాదులు మున్నగునవి బాగుచేయక అచ్చటనే యుంచుట చేతను, ఈ రోగపశువు నెత్తురుమీదను, తదితర స్థానములందును ఈగలువ్రాలి అవి మంచి పశువుల పుండ్లమీదను గాయములమీదను వ్రాలుట చేతను ఈ వ్యాధి ఎక్కువగును. చూడి పశువులకు ఈ వ్యాధి తగిలినను, లోపలిపిండమునకు మాత్రము తగలదనియు, అచ్చట విషజీవులను చంపు పదార్థమొకటిగలదని పశుశాస్త్రజ్ఞులు తెలిపియుండిరి. ఈ వ్యాధి పశువులకు, గుఱ్ఱములకు, గాడిదలకు, మేకలకు, పందులకు సోకును. దొమ్మరోగముచే చనిపోయిన పశువు చర్మములద్వారా, కంబళ్లద్వారా, ఎరువులద్వారా ఈ వ్యాధి రావచ్చును. ఐరోపా, ఇండియా, సౌత్ ఆఫ్రికా, అర్జంటయినా దేశములలో ఈ వ్యాధి తగిలి చాలా పశువులు మరణించినవి. ఈ వ్యాధి తగిలిన పశువులలో నూటికి 90 వరకు చనిపోవును. 1845 లో అయివెర్టుదొర ఈ వ్యాధిని కనుగొనెను. ఈ సూక్ష్మజీవి 1.5 నుంచి 4.0 పొడవు, 1.0 నుంచి 1.5 వెడల్పుగలిగి గొలుసు ఆకారముగా నుండును.

## లక్షణములు

పశువు ఆరోగ్యముగ నుండినట్లేయుండి అకస్మాత్తుగా చనిపోవుటయు గలదు. అట్లుగాక లక్షణములు కనపడినయెడల జంతువునకు తీవ్రమైన జ్వరము (106, 107 డిగ్రీల వేడిమి) యుండును. పశువు గజగజవణకును. కన్నులనుండి నీరు గార్చుచు దీనముగా చూచుచుండును. కన్ను ముక్కు నోరు మున్నగువానిలోపలి చర్మపు పొరలు ఎక్కువగా కందియుండును. నాడి తీవ్రముగా కొట్టుకొనుచుండును. కన్నులు, ముక్కు, కొమ్ములు, పాదములు చల్లగానుండును. వల్లకప్పువేయును. కాళ్లు గనులుపట్టి నిలువలేక తూలుచుండును. చెవులను వ్రేలాడవేయును. ముక్కులయందు చెమటయుండదు.

చేనుచేసి చెడలేను ; చెడ్డచేసి బ్రతుకలేదు.

ఆయాసమెక్కువగానుండును. నోటినుండి సీరు కొద్దికొద్దిగా పడుచుండును. లోపలికఫము బైటకు తన్నుచుండుట చేత నాలుకను జారవిడచును. కడుపుబ్బును, నెత్తురు విరేచనములు కొద్దికొద్దిగా నగును. క్రమేపి తూలుచు కండ్లలో నిస్సత్తువ యేర్పడి క్రిందబడి మరణించును. ఈ వ్యాధి 24 గంటలనుంచి 48 గంటల వరకు యుండవచ్చును. లేక ఈ లోపుగనే చచ్చుటయుగలదు.




ఈరీతిగా మూతిమీద మూడుగీతలు, మచ్చినగుంటలో ఒకచుక్క,
తోకమట్టక్రింద ఒకగీత పెట్టవలెను.

## ఆయుర్వేద చికిత్స

ఆరంభములోనే ఈ వ్యాధిని కనుగొనిన మూడు డ్రాముల సారాయిని పెట్టవలెను. లేక సేరునీటిలో రెండుగుప్పెళ్ళు ఎండుమిరెపకాయలువేసి సలసల కాగనిచ్చి పిసికి, వడపోసి కాఫీ త్రాగునంత వేడితో నున్నపుడు త్రాగించవలెను.

లేక ముద్దకర్పూరం అరతులం, మంచిబెల్లం 10 తులములు, కొట్టుపసుపు 1 తులము మెత్తగానూరి ముద్దచేసి ములగచెక్కరసముతో పదునుచేసి పెట్టుము.

లేక సొంటి 3 తులములు, పిప్పళ్ళు మిరియములు 6 తులములు, కరక్కాయలు 3 తులములు, ఉసరికపప్పు 2 తులములు, కొట్టుపసుపు 3 తులములు, కలిపి మెత్తగానూరి సేరు చింతపండు పులుసుతోగాని, సేరున్నరబియ్యపు కలితోగాని ఒక్కమోతాదే ఈయవలెను. లేక వెల్లుల్లిపాయలు 10 తులములు, పసుపు 3 తు, ఉప్పు 10 తు, తెల్లతుమ్మచెక్క రసము సేరు, మేకమూత్రము అర్ధసేరు కలిపి, కాచి పెట్టవలెను. ఈ రీతిగా 6 గంటలకొక పర్యాయము చేయవలెను.

---

ముడిదున్ని మహారాజైనవాడు చేనుదున్ని చెడినవాడు లేదు.

లేక సొంటి, పిప్పళ్ళు, మిరియాలు ఒక్కొక్కటి 4 తులములున్ను, దిరిసెనాకు పసరు సేరు, మేక పంచితము అర్ధసేరు, కలిపి రెండుగొట్టముల వంతున మూడుసార్లు ఈయవలెను.

లేక నల్లఉలవలను వేయించి నరమూత్రములో పెట్టిన తగ్గును.

పథ్యము:— వ్యాధితగ్గువరకు నీరు ఆహారముపెట్టరాదు. వ్యాధితగ్గిన నాలుగు దినముల వరకు కాచిననీరు, కొర్రజావ, వగైరా పెట్టవచ్చును.

## మిడిదొమ్మ

దీనినే గుండెదొమ్మ, తిరుగుడుదొమ్మయని చెప్పుదురు.

## స్వభావము - వ్యాపకము

గ్రామములలో పశువైద్యము చేయువారు ఈ దొమ్మలకు వివిధ రకములుగా పేర్లు పెట్టి చికిత్సచేయుదురు. ఇప్పటి కాలపరిస్థితులనుబట్టి సాధారణముగావచ్చు దొమ్మలనే ఈ చింతామణిలో ప్రకటించితిని. ప్రతిలక్షణమునకు వివిధదొమ్మలపేర్లు పెట్టుట పొరపాటు. మన ఆయుర్వేద పశువైద్యములో దశరథ మహారాజుకాలములో "శాలిహోత్ర కావ్య" యను ఘన పశువైద్యుడొకడు గలడు.ఆతని వైద్యములోకూడ దొమ్మలనుగూర్చి కొద్దిగా వర్ణించెను. ఈ చింతామణిలో తెలిపిన రోగలక్షణములలో నున్నవేగాక పశువులయొక్క తత్వములనుబట్టి, ఆయా కాలపరిస్థితులనుబట్టి ఇంకను కొద్దిగా మార్పులు కలుగవచ్చునుగాన వైద్యుడు పశువుయొక్క తత్వమునుబట్టి రోగనిదానము గ్రహించి చికిత్సచేయుట మంచిదిగాని ఈ చింతామణిలో లక్షణాలన్ని లేవేయని అనుమానించరాదు.

జీర్ణకోశము తగినంత పనిచేయకపోవుటచేతను, రక్తహీనతవలనను, అజీర్తివలనను, ఎక్కువగా ఎండలో పనిచేయుచుండుటవలనను, గుండె అదురుటవలనను ఈవ్యాధి వచ్చును. లేదా ఒకటి రెండు దినములకు తరువాత తీక్షణమగు గుణములుపుట్టి మృతినొందును. చక్కగా కండబట్టి బలిసియుండు గిత్తలకు, కోడెదూడలకు తరచుగా ఈ వ్యాధిసోకును. ఈవ్యాధి తగిలిన పశువు బ్రతుకుట చాలాకష్టము. అందువలననే మిడిదొమ్మయని పేరువచ్చినది.

## లక్షణములు

ఆరంభములో మందమతిగానుండుచు అరమేత మేయుచుండును. ముఖ్యముగా నల్లకప్పువేయును. జ్వరముకూడ తీవ్రముగానుండును. గుండె చెడిపోవును. ముక్కురంధ్రముల పైభాగమున వాపుపుట్టి క్రమముగా పెద్దదగును. మెదటిలోనికి నెత్తురు విశేషించి పోవుచుండును. వాపు పెద్దదయినకొలది ఊపిరిపీల్చుట కష్టముగానుండును.

---

తలకట్టు అంటూవుంటే ఎలాటి కొష్టైనా పెట్టవచ్చును.

చొంగ ముక్కులనుండి నోటినుండి ఎక్కువగా పడుచుండును. ఒక విధమగు గురక పుట్టును. కండ్లువాచును. పశువు దీనముగాచూచుచు కన్నీరు కార్చుచుండును. చనిపోవు ముందు వెఱ్ఱిచూపు చూచును. నడుముమీద నొక్కిన క్రుంగును. కొన్ని రక్తమూత్రము పోయును. మరికొన్ని పారకొనును. వాపుగురక ఎక్కువై మరణించును.

## చచ్చిపోయినతరువాత లక్షణములు

నోరు దుర్వాసనగానుండును. నాలుక లావుపారును. వాపు బురబురలాడు చుండును. కండ్లనుండి నీరుగారుచుండును. మూతిమీద వాపుకోసి చూడగా పసుపురంగు గల ద్రవము కనపడును. ఈ ద్రవము విషపురుగులతో కూడుకొని యుండును. గుండె ఎరుపుగా కందియుండును. పేగులను చీల్చిచూడగా నీలిరంగుగా నుండును.

## చికిత్స

ఆంగ్లేయవైద్యులు దొమ్మరోగమనునది ఒక్కటియేతప్ప తదితర దొమ్మలులేవని వారి యభిప్రాయము. మన ఆయుర్వేద సిద్ధాంతరీతిగా వివిధరకములుగలవని మన గ్రంధ కర్తలు తెలుపుచున్నారు. చాలమంది వైద్యులు రక్తసంబంధమగు వ్యాధులన్నిటిని దొమ్మని చెప్పుదురు. ఏయే దొమ్మ ఏయే లక్షణములతో నుండునో రోగనిదానము గ్రహించి చికిత్సలు చేయుదురుగాక. ఏదోకవ్యాధి తగ్గగనే అన్ని దొమ్మలను తగ్గించ గలనని డాంబిక వైద్యులు చేయువారచ్చటచ్చట నున్నారు. ఇట్టివారిమీద తగు చర్య తీసికొనెదరుగాక.

ఈ మిడిదొమ్మకు ముఖ్యమగుగుర్తు మూతిమీద వాపే యైయున్నది. తరువాత ఈ వ్యాధి ముసలి పశువునకు వచ్చినదా? లేక యుక్తవయస్సులో నున్నదానికి వచ్చినదా? ఆలక్షణములెట్లున్నవి? ఎంతకాలములో మరణించును? ఏయే మందులు ఆలక్షణములకు వాడవలెను? ఏమైనా ఆవాపుమీదగాని తదితర అవయవముల మీద గాని కాల్చవలెనా? కాల్చేపనిముట్లు? ఎంతకాలముపట్టును? ఈ వ్యాధి ఎంతకాల ముండును? దగ్గరలో ఈవ్యాధికి సంబంధించిన మందులేమియున్నవి. మున్నగు విష యములన్నియు పరీక్షించి చికిత్స చేయవలెను. పశువ్యాధి ముదిరిపోయి చివరలక్షణము లున్నపుడు కాల్చవద్దు. ఏ చికిత్సయు చేయకుండుటమంచిది. ఈ వ్యాధిలో వాతలు వేయుట అవసరమని తోచిన, దొమ్మవ్యాధుల ఫొటోలో చూపించిన రీతిగా కీలెరిగి వాతలు పెట్టుటమంచిది.

వాపుపుట్టకపూర్వమే నాలుగుడ్రాముల సారాయిలో 1 తులము ముద్దకర్పూ రము, 2½ తులముల పిప్పళ్ల చూర్ణము కలిపి ఒక్క మోతాదే యీయవలెను.

లేక వెల్లుల్లిపాయలు 10 తులములు, పసుపు 3 తు, ఉప్పు చేరెడు, కరిధూపము 2 తు, ములగచెక్క రసము అర్ధశేరు మేకపంచితము సేరు కలిపి ఒక్కపర్యాయమే త్రాగించవలెను.

---

నహి తస్మాత్ ఫలంతిస్య సుకృష్టా దూష రాదివ.

లేక నీరు ఆవుపాలలోగాని, నీరు గోమూత్రములోగాని 4 తులముల పసపొడి కలిపి కాచి కాకిత్రాగునంత వేడిలో నున్నపుడు త్రాగించవలెను. గుటకవేయ నపుడు లాభములేదని గ్రహించవలెను.

లేక సొంటి 2 తు, మిరియాలు 1 తు, పిప్పళ్ళు 1 తు, ఆవాలు 1 తు, వెల్లుల్లి రసము 3 తు, మాలగచెక్కరసం పావుసేరు, పసుపు 2 తు, ఎండుమిర్చిపొడి 2 తు, తీసికొని మెత్తగానూరి సేరున్నర గోరువెచ్చని నీటిలో కలిపి ఒక్కమోతాదే ఈయవలెను.

లేక మూడు గుప్పిళ్లు ఎండుమిరప కాయలు, గుప్పెడు మరంజీవాము లేక వాము, తులముసొంటి మెత్తగానూరి రెండుసేర్ల నీటిలోకలిపి కాచి గోరువెచ్చగా నున్నపుడు త్రాగించవలెను.

షరా:— ఒక్కొక్కవ్యాధికి ఇన్ని చికిత్స లెందులకాయని అనుమానపడు వారున్నారు. పల్లెగ్రామములలో అన్నిరకముల వస్తువులు అందుబాటులో నుండుటకష్టము. అందుచేత మీకు ఏవస్తువు దొరుకునో దానినే తెచ్చి చికిత్స చేయుదురుగాక. ఈ వ్యాధి తగ్గిన తరువాత రెండులేక నాలుగుదినములవరకు కాచిననీరు, కొర్రగంజి పెట్టినతరువాత అనుభవముమీద అనుపానములు వాడవలెను. మూతిమీద వాపునకు మాత్రము నూరే కారము2 తు, ఆముదము 10 తు, కర్పూరం 1 తు, పుగాకుపొడి 1 తు. నూరి పట్టువేయవచ్చును.

## నెరడు దొమ్మ

ఈ వ్యాధి పాటుపడు పశువులకు తరచుగా వచ్చుచుండును. పశువు దేహములో నెరడుగుండె గలదని శరీరశాస్త్రములో తెలుపబడెను. పశువునకు మత్తు పదార్థములను పెట్టుటచేతను, ఎండయనక వానయనక పశువును విరామములేక పనిచేయించుటచేతను, ప్రతిదినము చలిగాలిలో, వర్షములో కట్టుటచేతను, మలపదార్థములు పేగులలో చిక్కు కొనుట చేతను, పశువు ఎల్లప్పుడు దీర్ఘశ్వాసను తీసికొనుటచేతను, చాలాకాలమునుంచి నిలువయున్న గడ్డి, దాణాదినుసులు తినుటచేతను ఈ వ్యాధి వచ్చును. ఈ వ్యాధి 24 గంటలనుంచి 7, 10, 30 దినములవరకుండును.

## లక్షణములు

పశువు శరీరము ఒక విధముగు మెరుపురంగుగానుండును. అప్పుడప్పుడు నల్లకప్పు వేయును. నెరడుగుండెలో చెమునీరుజేరి వాపుగానుండును. వ్యాధి ముదిరినకొలది అరమేతమేయును. నీరు తృప్తికరముగా త్రాగదు. దగ్గుకూడయుండును. నెరడు వాపు హెచ్చినకొలది పశువు శుష్కించును. బరివిముకలుబ్బును. ఎదరములు సరిగా కొట్టుకొనవు. కడుపులో ఒకవిధమగు నొప్పియుండి అప్పుడప్పుడు మూల్గుచుండును. ఇంకను

---

పల్లం దున్నినవాడు పల్లె కెక్కినవాడు వొకటే.

అప్పుడప్పుడు వెన్ను విరచుచుండును. నోటివెంట చొంగపడుచుండును. క్రమముగా పశువు రొమ్మున కడ్డముగా ఈ వాపు విస్తరించి ఊపిరాడక చనిపోవును.

## చికిత్స

ఈ వ్యాధిగల పశువును అనుభవముగల వైద్యునకు చూపించవలెను. ఈ వ్యాధికి ఆరంభమునుంచి చికిత్స చేయవలెను. జీర్ణము కలుగజేయు ఆహారమును పెట్టవలెను. చురుకుదనము, రక్తవృద్ధియగు సందులను పెట్టవలెను. చలిలోను, ఎండలోను పశువును యుంచరాదు. బరిఎముకల సందునను, ఎదరాలలోను కట్టెతోగాని చిరుతతోగాని కొట్టుటమంచిది. వ్యాధి ప్రారంభమునుంచి మోదుగపువ్వు 2 తు, ఉప్పు 3 తు, జొన్న కడుగు సేరు కలిపి మెత్తగారుబ్బి దినమున కొక మోతాదువంతున పక్షము దినములు పెట్టవలెను. లేక దిరిసెనచెక్కరసము సేరు, నేలవేముపొడి 3 తు, తురకవేపాకు గుప్పెడు, బ్రహ్మదండివేళ్లు గుప్పెడు కలిపి మెత్తగా త్రొక్కి మూడు దినములకొక మోతాదు ఇచ్చుచుండవలెను.

లేక వెదురాకు 2 గుప్పిళ్లు, నేలవేము 2 తు, సొంటి 2 తు, పిప్పలిమోడి 2 తు। దిరిసెనవ్రేళ్ల పొడి 2 తు, పిప్పళ్లు 2 తు, మిరియాలు 2 తు, వాయింటచెట్టు సమూలం తెచ్చి శుభ్రపరచి పొడిచేసి కలిపి ఒకకుండలోవేసి 6 సేర్లు నీరుకలిపి సలసల కాచి వడపోసి పూటకు మూడుగొట్టముల వంతున వారము దినములు పెట్టవలెను.

లేక దిరిసన చెక్కరసము సేరు, ఆవుపాలు పావుసేరు, మోదుగపువ్వు 2 తులములు కలిపి దినమున కొక మోతాదువంతున వారము దినములు త్రాగించవలెను.

లేక నల్లఉప్పివేరుపొట్టు, సున్నము, ఉడకబెట్టి నిమ్మకాయంతచేసి నాలుగు దినములు పెట్టవలెను. ఇంకను వివిధరకముల చికిత్సలు గలవుగాని అనుభవములోనున్న వెవాటినే వాడుడు. నీరుకాచి దాహముగా నీయవలెను. తెలికపిండిని పెట్టవచ్చును. వాతముచేయు దాణాలను పెట్టరాదు.

## నీటిదొమ్మ

ఈవ్యాధికూడ ప్రమాదము కలిగించును. చలిగాలి ఎక్కువగా సోకుటవలనను, రక్తములో జలభాగమెక్కువగా నుండుటవలనను, ప్రత్యేకముగా రక్తములోనే ఈ విషసంబంధమైన పురుగులుండుటవలనను, చాలినంత సూర్యరశ్మి లేకపోవుటవలనను, పశువును ఎక్కువగా పనిచేయించుటవలనను, ఎల్లప్పుడు పశువును బాధించుటచే కలుగు మనో విచారమువలనను ఈ వ్యాధికలుగును.

## లక్షణములు

ఆరంభములో పశువుశరీరము సమశీతోష్ణముగానుండును. మలబద్ధకమేర్పడును. శరీరకాంతితగ్గి పశువు నల్లకప్పు వేయును. మూత్రపురంగు తెలుపుగా నుండును. వేడి

తరీ అంటే వరీ అంటారు వరీ గొంతుకు వురీ.

తగ్గుచుండును. ఉచ్ఛ్వాసనిశ్వాసములయందు ఆయాసమేర్పడును. అన్ని లక్షణముల కంటె ముఖ్యముగా ఈవ్యాధి ప్రారంభించినది లగాయతు నోటినుండి చొంగ ఎక్కువగా పడుచుండును. రక్తమంతయు పాడయి నీటిరూపముగా వెడలుటవలన నీటి దొమ్మయను పేరువచ్చినది. ఈ సమయమునందు చెవులు వ్రేలాడవేయును. కనుగ్రుడ్లు బయటపడవచ్చును. ముఖకాంతి తగ్గును. స్మారకముతప్పి వెంటనే చనిపోవును.

## చికిత్స

ఈవ్యాధి ప్రారంభమైనవెంటనే మూడు లేక నాలుగు డ్రాములసారాయితో అర్థసేరు దుష్టపాకు పసరుకలిపి త్రాగించుము.

లేక వెల్లుల్లి 8 తులములు, మరంజీవాము 5 తు, కొట్టుపసుపు 2½ తు, వస 1 తు కలిపి సేరు కొరవునీటిలో కలిపి త్రాగించుము.

లేక చేదుజీలకఱ్ఱ 4 తు, వేపాకు గుప్పెడు, మిరియాలు 4 తు, మప్పింటాకు 4 తులములు, పసుపు 2 తు కలిపి ఉండచేసి ములగచెక్క రసముతో తడిపిపెట్టుము.

లేక ఇంగువ 4 తులములు తీసికొని అరసేరు నీటిలో నానవేసి దానిలో మేకపాలనుగాని, ఆవుపాలనుగాని కలిపి కాచి కాఫీత్రాగునంత వేడిమిలోనున్నపుడు త్రాగించుము.

లేక ఉప్పుచేరెడు, వావిలాకుపసరు సేరు, మిరియాలు 2 తు, కలిపి త్రాగించుము. లేక తమలపాకులు రెండువందలు, ఇంగువ 3 తు, ముద్దకర్పూరము పావుతులము, తాటిబెల్లం 8 తులములు మెత్తగాదంచి ఉండచేసి పెట్టవలెను.

లేక వాము 10 తు, కరిఘూపము 3 తు, ఆముదపువేళ్లరసం అర్థసేరు, కొరవుపాలు సేరు కలిపి త్రాగించుము.

ఇంకను వైద్యునియొక్క అనుభవముమీద వస్తుగుణములు తెలిసికొని రోగలక్షణములను బట్టి మార్చుకొనవచ్చును. వ్యాధి తగ్గినతరువాత కాచిన నీరు పెట్టవలెను.

## చలిదొమ్మ

ఈ వ్యాధి తొలకరి వర్షములు కురిసిన తరువాత పఱ్ఱనేలల యందును, బురద నేలయందును ప్రబలును. దోమలు మిక్కుటముగా కరచుటచేతను, మురికి నీరు పులిసి వాసనకొట్టు నాణాలు, కుడితి త్రాగుటచేతను, విషసంబంధమగు గాలిపీల్చుట చేతను, ఏకారణము చేతనైన జీవసత్వము తగ్గుటచేతను వ్యాధిరావచ్చును.

## లక్షణములు

పశువునకు ఆరంభములో 106, 107 డిగ్రీలజ్వరముండును. చలిచే వణకుచుండును. నల్లకప్పువేయును. వెన్ను కాళ్లు అస్వస్థత నొందును. నాలుక తెలుపుగా

---

మడి బీద రయితు బీద.

నుండును. ఎదరముకలు త్వరితముగా కొట్టుకొనును. చలివలన పండ్లు కొరుకుచుండును. మూత్రము బిగబట్టి పోయును. కడుపుబ్బరముగా నుండును. వ్యాధిముదిరిన కొలది నోటివెంట చొంగపడుచుండును. నాలుక జారవిడచును. కఫము పెరుగును. పలుచగా పారును. క్రమేపి పశువు శుష్కించి చనిపోవును.

## చికిత్స

మూడుద్రాముల సారాయిలో అర్థశేరు దుష్టపాకు పసరు త్రాగించుము.

లేక శొంటి, పిప్పళ్ళు, మిరియాలు సమాన భాగములు తీసికొని సేరు కొరవు పాలలో కలిపి త్రాగించుము.

లేక గోమూత్రము అర్థశేరు, నరమూత్రము అర్థశేరు కలిపి త్రాగించుము.

లేక ఇంగువ 3 తులములు, ఆవాలు 2 తు, వెల్లుల్లి 4 తు, పసుపు 2 తు, దుష్టపాకు గుప్పెడు, తాటిబెల్లం 8 తు, కలిపి ఉండచేసి పెట్టుము.

లేక కురాసాని వాము గుప్పెడు, నల్లఉప్పు 3 తులములు, వెల్లుల్లి 8 తు, నేలవేము 3 తు, త్రిఫలములు 6 తు, ఎండుమిర్చి గుప్పెడు కలిపి త్రొక్కి 2 సేర్ల నీటిలో వేసి కాచి వడపోసి గోరువెచ్చనిది త్రాగించుము.

లేక కరక్కాయలు, ఉసరికపప్పు, సొంటి, పిప్పళ్లు, మిరియాలు ఒక్కొక్కటి 4 తులముల వంతున పొడిజేసి గేదె పేడ రసములో కలిపి కాచి వడపోసి త్రాగించుము.

ఈ రీతిగా అనుభవముమీద ద్రవ్యజ్ఞానము గ్రహించి దగిన అనుపానములతో ఈయవచ్చును.

## నాలిదొమ్మ

ఈ వ్యాధికూడ ప్రమాదకరమైనది. పశువు బాగుగా నున్నట్లేయుండి చివర దశలో దు[illegible]ములుపుట్టి ప్రమాదము కలిగించును. పశువు నాలిగానుండుటవలన నే నాలిదొమ్మయని పేరువచ్చినది. ఇది పది, పదునైదు రోజులవరకు యుండును. పశువు నదు చలిగాలి తరచుగా తగులుట వలనను, విపరీతముగా తవుడు కృత్రిమ పదార్థములు మేపి పనిచేయించకపోవుట వలనను, మలబద్ధకముండుట వలనను ఈ వ్యాధి కలుగును.

## లక్షణములు

ప్రారంభములో తీవ్రముగా జ్వరముండును. దగ్గు తక్కువగానుండును. మూత్రము పసుపురంగుగా పోయును. నల్లకప్పువేయును. నోరు వాసనగానుండును. నోటినుండి ముక్కులనుండి చీమిడివంటి పదార్థము పడుచుండును. పశువు మందమతిగా నుండి వ్యాధి ముదిరినకొలది తలనూపుచుండును. పొట్ట పుబ్బరముగానుండును. క్రమేపి మేత నీరు తగ్గించును. కనుగుంటలు విడచును. వ్యాధి ముదిరినకొలది మలము దుర్వాస

---

కడా ముడిదాని కటారి పోటుకంటే పెందటి ముసివాని ఏసుపోటు మేలు.

నగానుండి రంగుమారును. పండ్లుకొరుకుచుండును. అపానవాయువులు విడదుచుండును. కన్నులు ఎఱుపురంగుగానుండును. పశువు క్రమేపి శుష్కించి మరణించును.

## చికిత్స

ఆరంభములోనే రోగనిదానమును గుర్తించి తాడికాయలు 3 తు, ఉసరికపప్పు 2 తు, కరక్కాయలు 1 తు, పిప్పళ్లు 2 తు, సొంటి 2 తు, ఒరిజూలు 1 తు. చింతపండు నిమ్మకాయంత మెత్తగనూరి రెండుసేర్ల గేదెపేడరసములో కలిపి కాచి వడపోసి త్రాగించుము.

లేక వెల్లుల్లి 10 తు, మునగచెక్కరసం అర్ధసేరు, త్రికటుకములు 4 తు, ఆవాలు 4 తు, ఎండుమిర్చిపొడి 3 తు, మెత్తగానూరి సేరు కారపుపాలతో కలిపి త్రాగించుము.

లేక మోదుగపువ్వు 4 తు, జొన్నకలి సేరు కలిపి త్రాగించుము.

లేక ధనియాలు సోలెడు కురంజీవాము గుప్పెడు, జీలకర్ర 2 తు నేలవేము 3తు. ఉప్పుచేరెడు కలిపినూరి సేరు జొన్నకలితో పెట్టుము.

లేక మూడు డ్రాముల సారాయిని త్రాగించుము.

ఇంకను అనుభవముమీద వస్తుగుణములుమార్చిపెట్టవలెను.

## దొమ్మలకు ఆంగ్లేయ చికిత్స

దొమ్మలన్నిటికి కార్బాలిక ఆసిడ్ $\frac{1}{4}$ తు, నూకలజావగాని, బియ్యపుగంజిగాని సేరు కలిపి ఒక్కమోతాదే త్రాగించుము.

లేక క్రియోసోట్ $\frac{1}{2}$ తు, నూకలజావ సేరు కలిపి త్రాగించుము.

లేక ఫినైల్ $\frac{1}{2}$ తు, వరిగంజి సేరు కలిపి త్రాగించుము.

## ముఖ్యమగు సలహా

దొమ్మ రోగములకు అనుపానము విషయమై జాగ్రత్తగానుండవలెను. అకస్మిక దొమ్మలకు నీటిని పెట్టక లంకణములు చేయించుచు కొఱ్ఱజావ పెట్టుచుండవలెను. తదితర దొమ్మలకు కాచిననీరు అర్ధగా పెట్టును క్రమేపి ఎక్కువ పెట్టుచుండవలెను. ఈ దొమ్మల విషయమై అనేకమంది అనేక రీతులుగా చికిత్సలు చేయుదురు. రోగనిదానము, వస్తు గుణములు గ్రహించి తన అనుభవముమీద వాడవచ్చును. సహదేవ పశువైద్యములోని చికిత్సలుకూడ మంచివియేగాని దానిలోనున్న మూలికల పేర్లు మోతాదులు, రోగముల పేర్లు తెలియక చాలామంది బాధపడుచున్నారు. కాబట్టి మీకెంతవరకు తెలియునో అంతవరకే చికిత్స చేయవలెను. గాని అయినదానికి కానిదానికి చికిత్సచేసి నోరులేని పశువులను చంపవద్దు.

---

చెరువు ఓడు ఊరు పాడు.

## గాలికుంటు ( Foot and Mouth Disease )




దీనినే కాలుకుంటు, గాలిగాళ్లు, నోటిగాళ్లు, కాలినోటిగాళ్లని వివిధరకములుగా పిలుచుచుందురు.

ఆ॥ వె॥ కాలిగాళ్లొదవగ కడు బొబ్బలుండగా
కాకతగ్గి పశువు కష్టపడును
గిట్టలందు పుండ్లు గట్టివై పెరగుచు
పురుగులుండ మరియు ఖురములూడు

కం॥ నోటికి గాళ్లగు పసికిని
నోటిని ముక్కునను నాల్కనుండును బబ్బొల్
చీటికి మాటికి నట్టల
బీటులు వారియు మరింత వెతగలిగించున్॥

గీ॥ తమిద సంకటిలో తిలతైలమునిచి
గొట్టములు మూడుపూటకు బెట్టుచున్న
పుండ్లకును నుల్లితైలమ్ము బూసిరేని
గాలికుంటులు మాను నిక్కముగ॥

కం॥ నీరుల్లియు జొన్నన్నము
సారంబగు పెసరపప్పు ఘ్మృతలిపసుపున్
కూరిమి పిసికి బెట్టిన
ఘోరంబగు గాలికుంట్లు కుదరగ జేయున్॥

## స్వభావము-వ్యాపకము

ఇది తీవ్రమైన అంటువ్యాధి. ఈ రోగము దేశమునందంతట అప్పుడప్పుడు శీతోష్ణస్థితి గతులనుబట్టి వ్యాపించుచుండును. రైతులకు మంచిపనుల కాలములో ఈ వ్యాధి వచ్చినపుడు వారు పడు ఆతురత ఇంతయని చెప్పనలవికాదు. ఈ వ్యాధి పందులకు గొఱ్ఱెలకు మేకలకుకూడ వచ్చును. ఇది బహువేగముగా వ్యాపించెడిరోగము. 1764 వ సంవత్సరములో నార్వేలోను 1887 నుంచి 1897 వరకు యూరప్‌లోను, అచ్చటనుంచి రష్యాకు వ్యాపించెను. 1919 లో అన్ని ప్రాంతములందును వ్యాపించెను. మన హిందూదేశమునకంటె విదేశములో ఈ వ్యాధి సోకిన పశువులనుగూర్చి తగిన చికిత్సల కొరకు ఆతురతపడుచుందురు. అచ్చట శీతోష్ణస్థితిగతుల ననుసరించి చాలా పశువులు మరణించును. ఈ మధ్య బెంగుళూరు కంటోన్మెంటుకు మిగుల ఖరీదుగల ఆవులను విదేశమునుంచి తెప్పించుచుండగా గాలికుంటు తగిలి వెంటనే మరణించినవి. మన శీతోష్ణస్థితిగతులు సరిపడక అతి ఉష్ణము వలన మరణించినవని ఒక వెటరినరీ పత్రిక తెలిపినది. అందుచేతనే ఇంగ్లీషువారి పశువైద్యమునకు మనదేశములోని పశువైద్యమునకు వ్యత్యాసములు చాలాగలవని నా యభిప్రాయము. మన మూలికలంతేపని ఇంగ్లీషు మందులు సరిగాచేయవు. తాత్కాలికచికిత్సకు మాత్రము పనిచేయును.

ఈ గాలికుంటును కలిగించు సూక్ష్మజీవులు పశువు రక్తములోను బొబ్బలయందును ఉండును. ముఖ్యముగా ఒక జంతువు నుండి మరొక జంతువునకు సోకును. ఈజాడ్య సంబంధమగు విషము, మేత, నీరు, గాలిమూలమున దేహములో ప్రవేశించి నాలుగు దినములు దాగియుండి అయిదు లేక ఆరవనాడు బయటపడును. ఒకసారి రోగము దగిలిన తరువాత తొమ్మిదినెలలవరకు ఈ వ్యాధి రాజాలదు. ఒకవేళ వచ్చినను తేలికగా తగులును. ఈ వ్యాధి కొన్నిటికి నోటికిని, మరికొన్నిటికి పాదములకును రావచ్చును.

లేదా నోటికి ముందుసోకి పాదములకు తరువాత రావచ్చును. ఈ వ్యాధి పశువును చంపకపోయినను రైతుయొక్క పనికి అడ్డువచ్చును. కొండప్రదేశములలోనుండు పశువులకు ఎక్కువగా సోకును. ఇంకను పశువులకొట్టములు, రైలువాగనులు, గాడి తొట్లు మున్నగునవికూడ ఈ వ్యాధి వ్యాపింపజేయుటకు ఆధారములై యున్నవి. గొఱ్ఱెపిల్లలకు, కుక్కలకు, పందులకు, దూడలకు కూడ తమతల్లుల పాలనుంచి వచ్చును. కోళ్ళకు, గుఱ్ఱములకు, దుప్పులకు, ఒంటెలకు సోకును. మేత నీరు గాలిమూలమునను, రోగపశువుదగ్గర పనిచేయు పరిచారకుల మూలమునను, పాలుపితికెడు వారి మూలమునను, కుక్కలు,పిల్లులు,ఎలుకలు, పక్షులు ఈగలు మున్నగువాని మూలమునను, రోగపశువులను సంతలకు, కసాయిదుకాణములకు తోలుకొని వచ్చుట మూలమునను ఈవ్యాధి వ్యాపించుచున్నది. ఈ వ్యాధిని కలిగించు సూక్ష్మజీవి 15 మైళ్ళ విస్తీర్ణమువరకు పోగలదని శాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు.

---

తొలకరిని చెరువునిండినా తొలిచూరి కొడుకుపుట్టినా లాభం.

## లక్షణములు

పశువునకు ఆరంభములో 106, 107 డిగ్రీలజ్వరముండును. నల్లకప్పువేయును. మూతి చెమ్మలేకయుండును. నోటినుండి చిక్కని చొంగపడుచుండును. కాళ్ళు చెవులు వేడిగానుండును. అరమేతమేయును. కొద్ది మలబద్ధకముండును. పెదవులతో చప్పరించును. నోటిలోని చర్మము పొర ఎఱ్ఱుపుగా కందియుండును. నాలుకమీదను నోటిలోపలను, పెదవులలోను, నాలుగ పొట్టలోను, దవుడలలోపలిభాగమందును గిట్టల సందునను, కండ్లలోను, కొమ్ములలోను, పాడిపశువు పొదుగుమీదను చిన్నచిన్న బొబ్బలు కనపడును. ఇవి కందిగింజలంత పరిమాణముగలవై చితికి గనికారును. కాళ్ళడెక్కలమధ్య ఈపుండ్లు రెండుమూడు కలిసి అట్టకట్టుకొనును. వీటినిశుభ్రముచేయనిచో పురుగులుపడిదుర్వాసనవేసి డెక్కలూడిపోవును. ఈవ్యాధితగిలిన పశువును ఎండలో నుంచిన కనిమిరి తగులును. కొమ్ములను శుభ్రము చేయనిచో కొమ్ములూడిపోవును. పాడిపశువులకు ఈ పుండ్లు లేచుటవలన పాలు తగ్గును. కండ్లను నోటిని తదితర అవయవములమీద లేచెడి పుండ్ల విషయమై సరిగాచూడనిచో అచ్చట పురుగులుపడి పశువును బాధించును.

## చికిత్స

జాడ్యమును తగిలిన పశువును ఎండలోనుంచరాదు. ఈవ్యాధికికూడ సంరక్షణతో ముఖ్యమగు చికిత్స. ఈవ్యాధిసోకిన పశువులను, వాని చుట్టుప్రక్కలనుండు ప్రదేశములను శుభ్రపరచవలయును. పశువులకొట్టములు పరిశుభ్రముగా నుండుటకు పేడకలిపిన నీటినిగాని సున్నపునీటినిగాని జల్లుచుండవలయును. పాలిచ్చుపశువులను, లేగదూడలను బలహీనమగు పశువులను జాగ్రత్తగాచూచి తగిన సంరక్షణ చికిత్స చేయుచుండవలెను. పాడి పశువులకు తగిలినతరువాత దూడలను పాలుకుడుపరాదు. అట్లుకుడిపిన అవి మరణమునకు సంప్రాప్తమగును. ఈ వ్యాధి తగిలిన పశువును బురదలో దింపరాదు. పుండ్లకు మట్టిని చవుడును కొట్టరాదు. ఇట్లుచేయుట వలన డెక్కలు కొటుకవేసి చాలాకాలము కుంటుగా నేర్పడి పశువును బాధించును.

ఆరంభములోనే నూరేకారము 2 తులములు, వేడినీరు సేరు కలిపి త్రాగించిన జ్వరముతగ్గి పుండ్లు తేలికపడి బాధతగ్గును.

లేక యూకలిప్టస్ ఆయిల్ ½ తు, వేడినీరు సేరు కలిపి త్రాగించుము.

లేక ఉప్పు4తు, నేలవేము 2½తు, మంచిబెల్లం సవాసేరు కలిపి నూరి నాకించుము.

లేక పెసరుపప్పు అర్థశేరు, పేలపిండిసోలెడు, మంచినూనె సవాసేరు కలిపి పెట్టుము.

లేక తమిదెజావ అర్థశేరు, మంచినూనె సవాసేరు కలిపి త్రాగించుము.

---

తక్కలి మరవలుపారితే తక్కలు కూడువల్లవు.

లేక నీరుల్లిపాయలు 10 తులములు, జొన్నఅన్నముశేరు, పెసరపప్పు అరసోలెడు, పసుపు 2 తు. కలిపి పెట్టుము.

ఇంకను రైతు అనుభవములోనున్న వాటిని వాడవచ్చును.

## పుండ్లకు చికిత్స

కవిరిపొడినిగాని మాచికాయ పొడినిగాని పటికపొడినిగాని తుమ్మచెక్క లేక వేపచెక్కవేసి కాచిన చిక్కని కషాయమునుగాని తీసికొని రెండుమూడు సేర్ల నీటిలో కలిపి నోటిపుండ్లకు అప్పుడప్పుడు పుక్కిలింపు జేయించిన గారపట్టును. ఇంతియే గాకుండ తుమ్మచెక్క కషాయమును ప్రతిరోజు కాలిపుండ్లు, తదితరపుండ్లు కడుగుట కుపయోగించుట మంచిది. కాళ్లకు గాలిసంటు తగిలిన వెంటనే మీగడలో తగినంత పసుపు కలిపి అప్పుడప్పుడు డెక్కల భాగములకు రాసినచో పుండ్లు అంతగా పడక త్వరగా మానును. లేక సిలిమందును కొబ్బరినూనెలో కలిపిగాని, నవాసాగరమును నీటిలో కలిపిగాని, గానుగనూనెగాని రాసిన తగును. ఈ రీతిగా వస్తుగుణములను తెలిసికొని అనుభవముమీద వాడవచ్చును.

పురుగులుపడి పశువు బాధపడుచున్నపుడు మాత్రము ఫినైల్‌ను కొన్ని చుక్కలు వేసి కట్టుకట్టిన పురుగులు చచ్చును. సాధారణముగా రైతులలో చాలమంది పురుగులు లేని పుండ్లకుకూడ గాయముమానునని పిస్తారముగా పోయుదురు. అట్లుపోయుట వలన పశువునకు జ్వరము ఎక్కువై పుండుపెద్దదై పశువు కృశించును గాన జాగ్రత్తగా వాడవలెను. లేక సీతాఫలపుఆకు, సున్నము, పుగాకుపొడి మెత్తగానూరి పురుగులున్న పుండుకు పట్టించిన పురుగులుచచ్చును. లేక బారిజపాకు పసరు గుప్పెడు, ఉప్పు 2 తు, మిరియాలు 1 తు మెత్తగా పాలతోనూరి పట్టించుము. లేక పొగాకు, కరిధూపము, పొట్లాకు, రాతిసున్నము, సారాకు తగినంత తీసికొని మెత్తగానూరి పట్టించుము. లేక వసపొడిని పట్టించుము.

## ఆంగ్లేయ చికిత్స

పొటాష్ నైట్రస్ 2 తు, కామన్‌సాల్టు 2 తు, చైరేటా 1 తు, కలిపి నూకల గంజిలోగాని మంచిబెల్లపు నీటిలోగాని ఒకటిరెండు మోతాదు లీయుము.

లేక యూకలిప్టస్ ఆయిల్ $\frac{1}{2}$ తు, వేడినీరుసేరు కలిపిత్రాగించవలెను.

లేక పొటాష్ నైట్రస్ 2 తు, మాగ్నల్ఫు $\frac{1}{4}$ పౌను వేడినిరుసేరు కలిపి త్రాగించుము.

ఆలంలోషనునుగాని పొటాషియం పర్మాంగనేట్ లోషనునుగాని నోటిపుండ్లకు కాళ్ళపుండ్లకు అప్పుడప్పుడు కడుగుచుండవలెను.

లేక పొటాస్‌క్లోరస్‌ను తగినంత లేనెతోగాని బెల్లముతోగాని నోటిపుండ్లకు రాయవలెను. కాలిపుండ్లకు కాపర్ సల్ఫేటు లోషనునుగాని ఫినైల్ లోషనునుగాని జింకుక్లోరేడ్ లోషనునుగాని రాయవలెను. ఈగలబాధ ఎక్కువగానున్న వేపనూనెను గాని కిరసనాయిల్ కొబ్బరినూనె కలిపిగాని రాయవలెను.

పుండ్లకు జింకుఆక్సయిడ్ 2భాగములు, బోరిక ఆసిడ్ 1భాగము, అయిడోఫారం $\frac{1}{20}$ భాగము కొబ్బరినూనెగాని వ్యాసులైనుగాని 8 భాగములు కలిపి పట్టించవలెను. ఇంకను పుండ్లకు టించర్ అయోడిన్ గాని టింక్చర్ బెంజాయిన్‌నుగాని కార్బాలిక ఆయిల్‌నుగాని వాడవచ్చును.

## పథ్యము—హెచ్చరిక

పాలిచ్చెడి పశువులు ఎండిపోవును. చూడి పశువులు ఈదుకొనిపోవును. దుక్కి ఎద్దులు డొక్కలు పడగును. వగర్పు పుట్టును గాన ఆరంభములోనే జాగ్రత్తగా చికిత్స పోషణ చేయవలెను. మనుష్యుల శరీరముమీద నుండు గాయములకు ఈపశువు చొంగ తగిలినను, ఈ వ్యాధి తగిలిన పాడిపశువుల పాలు త్రాగినను, చంటిపిల్లలకు త్రాగించినను, ఈ వ్యాధి కలుగునుగాన జాగత్తగా నుండవలెను. అప్పుడప్పుడు పశువుల శాలలో సాంబ్రాణిపొగ వేయుటమంచిది.

ఆవుమజ్జిగ సేరు, మంచినూనె సవటాకు, ఆరిగ అన్నముగాని వరిబియ్యపుఅన్నము గాని అరధశేరు కలిపి మంచిపశువులకు త్రాగించిన వ్యాధిసోకదు. జబ్బునెమ్మదించిన తరువాత జొన్నలను వండి మంచినూనెలోకలిపి ప్రతిరోజు పెట్టిన మంచిది. దీనినే మడ్డికూడందురు.

## గురక ( Hemorrhagic Septicamia )

దీనినే కంఠమాద, కుత్తుకవాపు, గురక గొంతురోగము, ఎట్టిదొమ్మ, దున్నలప్లేగు అందురు.

ఆ॥ వె॥ మేత నీరుమాని చైతన్యముడిగియు
కన్ను ముక్కు నోరు కందియుండి
పొరలు ఎరుపులెక్కి జ్వరము సోకుచునుండు
కొన్ని పశువులందు గన్న తెలియు ॥

ఆ॥ వె॥ గంగడోలువాచి గట్టిగానుండియు
జిగురు చొంగకారి చెడుగనుండు

మందుంవారమడి అయినా కావలెను, మాటకారి మొంగుడు అయినా కావలెను.

గుటక వేయలేక గురకలు నొందుచు
నాలుకానసాచి తూలిచచ్చు ॥




గురక

## స్వభావము—వ్యాపకము

ఇది రక్తసంబంధమైనది. పశువులకు సంభవించు రోగములన్నిటిలో నీ వ్యాధి తుపాకుగుండు వంటిది. ఈవ్యాధి తగిలిన కొన్ని గంటలలోనే మరణించును. ఈవ్యాధి గ్రామములో వ్యాపించినదనగానే రైతులకు గుండెలు దడదడకొట్టుకొనును. గ్రామము లోనికి రాకపూర్వమే ఈ వ్యాధికి రైతుపశువు ఆహారనాళము దగ్గర మూడుగీతలు వాతగా కాల్చుదురు. 1886 వ సంవత్సరములో ఇటలీలో ఒరెస్టే, ఆర్మన్ని అను పరిశోధకులు ఈ వ్యాధిని కనుగొనిరి. ఈ వ్యాధిచే నూటికి 90 వరకు మరణించును. ఇదికూడ అంటురోగమైయున్నది. ఈ వ్యాధి దుప్పులకు పక్షులకు దున్నలకు తదితర పశువులకు సోకును. ఈ వ్యాధిని కలిగించు సూక్ష్మజీవి పల్లముగను, అనారోగ్యముగను తేమగను యుండునట్టి పల్లపు నేలలందుండును. అట్టి నేలలో మొలకు గడ్డిలోగాని త్రాగునీటిలో గాని యుండి తొలకరి రాగానే వ్యాపించి దున్నలకు గేదెలకు తగులును. అందుచేతనే దున్నల ప్లేగందురు. ప్రారంభములో గేదె, దున్నదూడలకువచ్చి చచ్చిపోవుచుండును. క్రమేపి వ్యాధి వ్యాపించి గేదె, దున్న, ఎడ్లకుకూడ వచ్చును. ఈ వ్యాధి లోపల దాగి యుండి బయటకు కనపడు అంతర్గతకాలము ఒకటి రెండు దినములని గ్రహించవలెను. నూటికి 98 దున్నల వరకు ఈ వ్యాధిచే మరణించును.

## లక్షణములు

పశువునకు తీవ్రమగు జ్వరము 106, 108 డిగ్రీల వరకు వచ్చును. మేతమానును. మందమతిగానుండును. కన్ను, ముక్కు, నోరు మున్నగు శరీరావయవములలోనుండు పొరలు ఎరుపుగా కందియుండును. మూతిపొడవుగ విస్తరించును. నోటినుండి చొంగకారు

తుండును. గొంతును పట్టి చూచిన వాపుగలిగి చల్లదనముగానుండును. ఈ వాపు క్రమేపి గొంతుక,దవుడలు,గంగడోలు, మెడముందరి కాళ్లు మున్నగు భాగములందు పుట్టును. ఇంకను తలమీదను,కంటిరెప్పలమీదను,ముక్కురంధ్రములమీదను,నోటిలోపలను ఈ వాపు కనబడును. ఈ వాపులు కనబడిన ఆ యా భాగముల చర్మములోపల ఎరుపుగా కంది రక్తపు మచ్చలు కనబడును. నాలుకవాచి ఎఱ్ఱబడి జిగురువంటి పదార్థము పడుచుండును. నరములు లాగుచుండును. నోరు నలుపుగానుండును. దగ్గుకూడయుండును. వాపు త్వరలోనే హెచ్చును. ఈవాపు ముదిరినకొలది చల్లగానుండును. పశువు లేచుచు పడుకొనుచుండును. పశువునకు ఊపిరి సలుపక కఫము తన్నుచుండును. కన్నుగుంటలు విడచును. చూచేమనిషికే విచారకరముగానుండును. పశువులకుకూడా యిట్టి జబ్బులు భగవంతుడు సంప్రాప్తించినాడాయని రైతులు పదేపదే విచారపడుచుందురు. ఈ వాపు గొంతుకవద్ద కనబడుట వలన కంఠమాదయనియు, ఊపిరాడకపోవుట వలన గురక యనియు చెప్పుదురు. ఆ గురక చాలాదూరమువరకు వినబడును. పశువు తనపీడను బాధవలన ముడుచుకొనుచుండును. పశువు పేగులు వాచి కందును. నొప్పిగల దగ్గుండును. శ్వాసకోశములు చిన్నవగును. క్రమేపి వ్యాధిముదిరి అకస్మాత్తుగా మరణించును.

### చికిత్స

ఈ వ్యాధి సామాన్యముగా చికిత్సకు లొంగదు. మంచి పశువులను వీనితో కలుపక ప్రత్యేకము నుంచవలెను. నాలుక జారవిడిచి గోంద్రు పెట్టుచున్నపుడు ఆ పశువు బ్రతుకదని గ్రహించవలెను. ఏ మందయిన పోసిన గుటకవేయక వెంటనే మరణించును.




ఈ రీతిగా కంఠముదగ్గర మూడు గీతలు,
ముచ్చిలి గుంటలో ఒకచుక్క వాతవేయవలెను.

ఆరంభములోనే నాలుగు డ్రాముల సారాయితో అర్ధసేరు దుష్టపాకుపసరు కలిపి త్రాగించి వాతలు చూపించిన ఫొటోలోనున్నట్లు రక్షలు వేయుటమంచిది.

---

ఊట కావలసిన మడి వాతలువేసిన పశువు అక్కరకు వచ్చును.

లేక సేరున్నర పాలలో 4 తులములు వసపొడి కలిపి కాచి కాఫీ త్రాగునంత వేడిగానున్నపుడు నాలుగుగంటల కొకపర్యాయము త్రాగించుము.

లేక పసుపు 2 తు, సొంటి 2 తు, పిప్పళ్లు 2 తు, మిరియాలు 2 తు, వెల్లుల్లి 10 తు, ఎండుమిర్చి 6 తు, మెత్తగానూరి అర్ధసేరు మునగచెక్క రసముతో పెట్టుము.

లేక ఆంగ్లేయ చికిత్సలో కార్బాలిక్ ఆసిడ్ $\frac{1}{4}$ తు, గంజి సేరు కలిపి త్రాగించుము.

లేక పొటాషియం పర్మాంగనేట్ $\frac{1}{8}$ తు, నీరు రెండుసేర్లు కలిపి త్రాగించుము.

లేక స్పిరిట్ $1\frac{1}{8}$, తు వరిగంజి సేరున్నర కలిపి త్రాగించుము.

ఈ వ్యాధికి గవర్నమెంటు పశువైద్య డిపార్టుమెంటువారు టీకాలు వేయుదురు. గాన ఆరంభములోనే మీ పశువులన్నిటికి వేయించుడు. మా ఆయుర్వేద పశువైద్య పరిశోధనల ప్రకారము చీడపారుదుడు జెముడుపాల టీకాలనుగూర్చి పరిశోధింపబడుచున్నవి.

షరా:- ఈ వ్యాధి పాలవలన మనుష్యులకు చంటిబిడ్డలకు వ్యాపించును.

## జబ్బవాపు (Black Quarter)




దీనినే గూడవాపు లేక జబ్బవాపు అందురు

మ॥ ధరణిన్ వాపున జబ్బతో బసియు బాధన్బొందు భాగంబు మీ
దరయన్ కొద్దిగ నుద్భవంబగును నాయంగంబు నందంతటన్

---

మడినిబడ్డ నీరు పైనిబడ్డ దెబ్బ పోనేరవు.

సరగన్వాపు జనించనీరు వడికంపు జెంత కుళ్లుండగా
ఖరగన్వేగమె కాలధర్మమున దాబాయున్ స్వకీయాసువుల్.

## స్వభావము—వ్యాపకము

ఇదికూడ విచిత్రమైన వ్యాధియే. ఈవ్యాధి కొండప్రదేశములందు, అరణ్య ప్రాంతములందు, రాతినేలప్రాంతములందుండు పశువులకు తరచుగా కఠినముగా సోకు చుండును. ఈవ్యాధిని కలిగించు సూక్ష్మజీవులు గాలి రూపమున, నీటి రూపమున, ఆహార మూలమున పశువునందు ప్రవేశించును. లేతవయస్సులోనుండు పశువులు అనగా 4 నెలల నుండి 5 సంవత్సరములలోపువానికి విస్తారముగా సోకును. తక్కినవానికి తక్కువగ సోకును. ఈ వ్యాధి కొన్నిపశువులకు పై దుబకక లోపలదాగియుండును. కండబట్టి మిగుల బలసియున్న గిత్తలకు తరచుగా ఈ వ్యాధి సోకును. వేసవికాలములో సరియగు మేతలేక తొలకరించగనే మిక్కిలి ఆతురతతో పచ్చికను తిను పశువులకు గూడ ఈ వ్యాధిసోకును. ఈ వ్యాధి ఒంటెలకు, గుఱ్ఱములకు, గేదెలకు, ఎద్దులకు కూడ తగులును. భూమిలో పెరుగుచుండెడి ఒకవిధమగు సూక్ష్మజీవులు ఈ వ్యాధిని కలుగజేయును. ఈ సూక్ష్మజీవులు రోగము తగిలిన పశువుయొక్క రక్తప్రవాహములో సాధారణముగా కనుపించవు. వాపు కనిపించినచోట మాంసములో అవి తప్పక కనుపించును. ఈ సూక్ష్మ జీవులు సులభముగా చావవు. ఈ వ్యాధి పశువునకు సోకిన రెండు మూడు దినములకు గాని బయటకు కనపడదు. తీవ్రముగావచ్చిన కొన్ని గంటలలోనే చనిపోవును.

## లక్షణములు

ఈ వ్యాధి తగిలిన పశువు మిగిలిన వానితో నుండక ప్రత్యేక స్థలమునందుండును. పశువు మందమతిగానుండును. కుంటుటకూడ నుండును. జాగ్రత్తగా పరీక్షించినచో ముందుజబ్బమీదనో, వెనుకతొడలమీదనో, లేక మెడ, పిఱ్ఱల, రొమ్ము, వీపు, నడుము మీదనో, వాపు కనడును. ఆవాపునుపట్టి చూచిన ఎక్కువవేడిగానుండును. ఆవాపు చుట్టును వృద్ధిపొంది పశువును కదలకుండునట్లు చేయును. మరికొంతసేపటికి ఆవాపు పైకి పొంగినట్లుండును. అప్పుడు ఆ వాపుమీద చేతితో తట్టినమెదల బురబురలాడును. వాచిన ప్రదేశముయొక్క చర్మము క్రిందిభాగమును చీల్చిన ఆ మాంసము కుళ్ళి యుండును. పులిసిన నురుగువంటి ద్రవము కారును. ఈ వాపును నొక్కిన కరకరమను శబ్దముకూడ యుండును. ఈ వాపునుబట్టియే జబ్బవాపు, గూడవాపుఅని పేరువచ్చినది. ఇంక నీవాపు శీఘ్రముగా పెరిగి 2 నుంచి 24 గంటలలోగాని, రెండుమూడు దినము లలోగాని పశువునుచంపును. వ్యాధముదిరినకొలది శరీరము శీతలములోనికి వచ్చును. నాడి బలహీనముగా నుండును. ఉణకుదుండును. ఊపిరి కష్టముగా విడదును. పశువు మూలుగు చుండును. క్రమేపి మత్తువచ్చి చనిపోవును. ఈ రీతిగా నూటికి 95 వరకు చనిపోవును.

---

మేహాజాడ్యము తోట సేద్యం.

## చికిత్స

వాపును కత్తితోకోసి ప్రబలిన మాంసమును తీసివైచి కర్పూరతైలమును గాని లేక జిల్లేడాకు దుష్టపాకు పసరు సమానభాగములను రాతి తడిసున్నం 1 భాగమును కలిపిపట్టించవలెను.

లోపలికి మూడు డ్రాముల సారాయిని త్రాగించుము.

లేక నాగజెముడు మట్టను ఉడికించి దానిలో సన్నావాలు కొద్దిగావేసి త్రొక్కిన జిగురుగా వచ్చును. దానిని వాపునకు పట్టించవలెను. అంతకువాపు ఆగనప్పుడు వాపు చుట్టు రక్షలు వేయుటమంచిది.

లేక బాలింతబోలు 1 తు, గండఫెరోజా 2 తు, ముసాంబ్రము 1 తు. మెత్తగానూరి సారాయితో వాపుమీద పట్టించవలెను.

## ఆంగ్లేయచికిత్స

ఒకముప్పాతిక సేరు లిన్‌సీడ్ ఆయిల్‌లో 60 చుక్కలు కార్బాలికు ఆసిడును కలిపి ఆరంభములోనే త్రాగించవలెను. వ్యాధితగ్గిన తరువాత టింక్చర్ ఫెర్రిపర్ క్లోరీడ్ 120 చుక్కలు గ్లిసరీన్ 1½ తు, నీరు 20 ఔన్సులు కలిపి రోజునకొక మోతాదు ఈయవలెను. ఈ వ్యాధికి కూడ పశువైద్య డిపార్టుమెంటువారు వ్యాధి రాకుండ టీకాలువేయుదురుగాన త్వరపడవచ్చును.

## కురమ (Sympathetic Fever)

దీనినే కురమ, చలికురమ, ఒకవిధమగు విషజ్వరము అని చెప్పుదురు.

గీ॥ మొదట పశువు వణకును ముక్కునుండి
చీమిడిగార్చి మోకాళ్ళు చిక్కబెట్టు
కడుపునుబ్బును మలబద్ధకముగ నుండు
పాదములు నిలుపలేకను బాధపడును
చెవులు నిక్కించి యాలించి చింతతోడ
గురకబెట్టంగ నిది చలికురమ యగును॥

ఆ॥ వె॥ పసియు మొదట మెండువణకుతో దగ్గు నోం
ద చెవులు నిలువుచు దుఃఖపడును

---

చెట్టులేని చేను చుట్టములేనియూరు కష్టం.

కడుపు నుబ్బరమున గాసి జెందగ ముక్కు-
నుండినీరు వడిగ నూటవాఱు॥

ఆ॥ వె॥ వ్యాధి ముదర గురక యాడుచు బాధతో
పాదములు నిలుపక బాధనుండు
లివయు లేక లేవలేక లేచుచునుండ
చలికురమ యనగను చాలనొప్పు॥




## స్వభావము—వ్యాపకము

ఈ జాడ్యము వర్షాకాలము అగాయతు శీతాకాలమువరకు వ్యాపించియుండును. రైతులలోను నాటువైద్యులలోను కొంతమంది ప్రతిజబ్బునకు కురమయని పేరుపెట్టుదురు. ఈ వ్యాధి కలిగించు సూక్ష్మజీవులు ఒకతరగతి దోమలయందు నివాస మేర్పరచుకొనును. పశువు రక్తములోనుండు ఎఱ్ఱ కణములలో నివి చేరియుండును. ఈ సూక్ష్మ జీవులు పల్లపుభూములందును, గొప్పనదులు సముద్రములో కలియుచోటులందును, అడవి ప్రదేశములందును బురదనేలలందును, క్రుళ్ళుచుండు పెంటపోగు అందును దాగియుండును. ఎండలు తీవ్రముగా నున్నపుడు ఈ సూక్ష్మజీవులు పైకివచ్చును. పశువును ఎండలో పని చేయించుట వలన లోపలి నెత్తురు ఉడుకెత్తు నపుడు ఈ వ్యాధి రావచ్చును. ఇంకను చక్కని కోడెలకు, ఆవులకు, మధ్యవయస్సుగల జంతువులకు, పెద్దవయస్సులో నున్న వానికి తక్కువగను ఈవ్యాధిసోకును.

---

## లక్షణములు

ఆరంభములో పశువు వణకును. మలబద్ధకముండును. ముఖ్యముగా దగ్గు ఉండును. అన్నిటికంటె ముఖ్యమైన లక్షణము చెవులు క్రిందకు నిక్కబొడుచుకొని యుండును. నల్లకప్పు వేయును. కాళ్ళు ఒకటి రెండు గాని అన్ని గాని పట్లుపట్టును. వెన్ను చర్మము బిగిసియుండును. మూత్రము పసిమిరంగుగా పోవును. మేతనెమరు మానును. మరికొన్ని కాళ్ళు పట్లు బాధసహించలేక వెల్లికిలగా పరుండి గోండ్రుపెట్టును. మరికొన్ని మంచిబలమునీదనుండి గురకరోగములో వలె గోండ్రుపెట్టును. మరికొన్నిటికి నోటివెంట చొంగ పడుచుండును. వ్యాధి తీవ్రముగా నున్నపుడు నాడి తీవ్రముగా నుండును. 106, 107 డిగ్రీల జ్వరముండును. కాళ్లు, చెవుల చివరభాగములు, చల్లగా నుండునపుడు చలిజ్వరమ యందురు. కడుపుబ్బరముగా నుండి మునగదీసికొనును. పశువు యొక్క తత్వమునుబట్టి పైలక్షణములలో తదితర లక్షణములు కూడ యుండవచ్చును.

## చికిత్స

ఈ వ్యాధినిగూర్చి ప్రతి రైతునకు తెలియును. ఈ వ్యాధి వలన ప్రమాదము రాదు కాని కొన్నిపశువులకు ప్రమాదమువచ్చుచున్నది. పశువు బలహీనమై నాలుగు కాళ్లును కదల్పలేక కనుగ్రుడ్లు బయటకువచ్చిన అధిక శ్వాసకలిగినపుడు మాత్రము ప్రమాదము రావచ్చును. ముఖ్యముగా ప్రతి రైతు ఈ వ్యాధిని చూడగానే గుర్తించ వలసిన విషయములేమనగా:— పశువు చెవులు నిక్కబొడిచినవా లేదా? దగ్గు అప్పు డప్పుడు ఉన్నదా లేదా? కాళ్లలో ఒకకాలు లేక నాలుగుకాళ్లను పట్టుచున్నదా? డొక్కలభాగము ఉబ్బుముగా నున్నదా? ఈ కొరముగో గుటికపుట్టి చెవులు నిక్క బొడుచుకొని యున్నవా? వాలియున్నవా? యున్నను విషయములను మనస్సులో ఆలోచించుకొని తగినచికిత్స చేయవలెను. కొంతమందివైద్యులు డబ్బునకాశించి పలు విధములుగా చెప్పుదురు. మరికొందరు అమ్మో ఇంతప్రమాదమైన వ్యాధి ఎచ్చటా చూడలేదని చెప్పుదురు. ఈవ్యాధి విషయమై గాబరాపడవలసినంత కారణములు కన్ప ట్టవు. వివిధరకముల తెలిసితెలియని చికిత్సలు చేసినచో తప్పక ప్రమాదము కలిగించును. మంచిఖరీదుగలిగి బలముగలకోడెలకు వచ్చినపుడు ఆకోడెబాధనుబట్టి ఎంతో ఆతురత పడుదురు. ఈఆతురతనుబట్టి వైద్యులలో కొంతమంది డబ్బుకొరకు నాటకమాడుదురు. నోరులేనిపశువుల విషయమై ఎవరువైద్యముచేయుదురో! వారుతప్పక భూతదయ కలిగి యుండుటవసరము. ఈవ్యాధితగిలిన నాలుగు లేక వారము రోజులలో తగ్గిపోవును. చికిత్సజాగ్రత్తగా చేసిన ఆతురత పడనవసరములేదు. రైతులలో కొంతమందికి మాఎద్దుకు ఇంజక్షన్ యిచ్చిన తగ్గుతుంది. ఎంతఖరీదైనసరే యిచ్చెదనని ఉవ్విళ్లూరుచుందురు. ఇదికూడ పొరపాటే కొంతమంది వైద్యులు మాట్లాడితే ఇంజెక్షను యిస్తానని, లేకపోతే తగ్గదని ఈ వ్యాధివిషయమై చెప్పుదురు. అన్ని విషయములు తెలిసిన రైతులకు ఈ వ్యాధి విష

యుక్తమైన ఆయుర్వేద చికిత్సయే మంచిదని తెలియజేయుచున్నాను. నేను ఎన్నోవేల పశువులకు చికిత్సలుచేసి రైతుల మెప్పువడసితిని గాన ముఖ్యముగా జెప్పవలసియున్నది. ఆరంభములోనే ఈ వ్యాధి సోకిన పశువునకు మూడు డ్రాముల సారాయి త్రాగించిన కాళ్లపట్టులు, నొప్పులు తగ్గును. చురుకుదనముపుట్టును. సారాయికూడ దొరకని చోట రైతులున్న మేకపాలు అర్ధసేరు, పసుపు 2తు, కలిపి త్రాగించుము.

లేక తిప్పతీగెరసము సేరు మంచినూనె అర్ధసేరు కలిపి ఒకసారి త్రాగించుము.

లేక దుష్టపాకుపసరు అర్ధసేరు, సారాయి 2 డ్రాములు త్రాగించుము.

లేక దుష్టపాకు అరగుప్పెడు, తులసిపాకు అరగుప్పెడు, వావిలాకు అరగుప్పెడు, వాము 4 తు, వెల్లుల్లి 4 తు, పసుపు 1 తు, నీరు రెండుసేర్లు కలిపి కాచివడపోసి పూటకు రెండు గొట్టముల వంతున తగ్గువరకు పెట్టుము.

కాళ్లపట్టుకు పచ్చకర్పూరం ½ తు, కొబ్బరినూనె 10 తు, కలిపి గోరువెచ్చగా కాచి రాసి వేడినీటి కాపులుగాని, చన్నీటిలో గుడ్డను తడిపి ఆ భాగములకు కొట్టిగాని చికిత్స చేయవలెను. ఇంకను కాళ్లపట్టుకు తిప్పతీగెరసమునుగాని దూసరాకు, ఉమ్మెత్తాకు పసరుగాని దుష్టపాకురసమును కలిపి తగినంత వెన్నలో కలిపి మర్దనచేయవలెను. లేక పిడక బూడిదనుగాని, విభూతినిగాని కాళ్లపట్టులకు, మొత్తలకు రుద్దిన మంచిది.

ఈ వ్యాధితగిలినఆరంభములోనే దుష్టపు తీగెను గాని దూసరతీగెను గాని తిప్పతీగనుగాని పశువులువలెచుట్టి మెడలో వేసిన తాత్కాలిక జ్వరము, నొప్పులు ఆ ఘాటు వలన తగ్గును గాన తప్పక ప్రతిరైతు ఆచరించవలెను.

పథ్యము:—జ్వరము తీవ్రముగానున్న ఎండుఖర్జూరకాయలు 8 టిని కొట్టి సేరు నీటిలోవేసి త్రాగించవలెను. నూకలజావను, బియ్యపునీటిని, కాచిన వేడినీటిని అప్పుడప్పుడు త్రాగించవలెను.

## ఆంగ్లేయ చికిత్స

సోడాసాలిసైలస్ 1 ఔన్సు సేరు నీటిలో కలిపి త్రాగించుము.

లేక క్యాంఫర్ ¼ తు, మంచిబెల్లం 10 తు, కలిపి నాకించవలెను.

## మశూచి (Cowpox)

ఈ వ్యాధినే స్ఫోటకమందురు. పశువుల మేకలకు గుత్తములకు గొఱ్ఱెలకు పందులకు ఒంటెలకు కుక్కలకు సోకును. ఈ వ్యాధినుండియే మానవులకు సోకును. ఇదిఅంటుసంబంధమైనట్టియు, పొక్కులుతేచునట్టియు, జీవితమునందు సామాన్యముగా

ఒకనాటి అదును ఏడాదిబ్రతుకు.

శోకపర్యాయమే కలుగునట్టి జ్వరమైయున్నది. ఈ వ్యాధి ప్రారంభించినది లగాయతు నెమ్మదియగు వరకు ఈ మధ్యలో అస్వస్థతయుండినను, మాలిన్యమేర్పడినను, చర్మము నుండి పూర్తిగా పొక్కులు పోవువరకు విశేష అంటుగుణము వహించియుండును. చీడ, పొరుడు మీద వచ్చు పొక్కులనే కొందరు మశూచియందురు. అట్లనుట పొరబాటు. ఈ రోగముగల పశువులతో మంచిపశువులు కలియుటవలనను, పశువులకాపరులు, పాలుపితుకువారు, జబ్బుపశువులను తాకి మంచిపశువులను తాకుట చేతను ఈ వ్యాధి కలుగును. పట్టణములలో నుండు వాటికే ఈ వ్యాధి ఎక్కువగావచ్చును. కొన్ని పశువులు గుఱ్ఱపు లద్దెలు ఒంటెలద్దెలు దినుటవలనకూడ రావచ్చును.

## లక్షణములు

ఆరంభములో జ్వరముండును. కండ్లనుండి నోటినుండి నీరుగారును. మేతతినదు. పాలిచ్చు పశువుల పొదుగుమీదను చన్నులమీదను, దూడలకు మూతిమీదను, ఎద్దులకు తొడలమధ్యను, వెంట్రుకలు లేని చోట్లను బఠాణిగింజలంత పొక్కులై పక్వమై పలుచబారి పగిలి ఒకవిధమగు రసికారును. వీటినే రసిపుండలందురు. మనుష్యులకు వేయు టీకాలరసము ఈ రసిపుండలనుండియే తయారు చేయుదురు. ఈ వ్యాధి మనదేశములో చాలతక్కువ. పాడిపశువులకు ఈ వ్యాధితగలగనే పాలుతగ్గును. రెండుమూడు దినములైన తర్వాత యెఱ్ఱని చుక్కలు పశువు శరీరముపైన కనపడును. తర్వాత పొక్కులుగా మారును. నాలుదినములైన పొక్కులు శరీరమునందంతట వ్యాపించి నీరుపట్టి ఎఱుపుగా నుండి మలినమేర్పడి మశూచి వాసన స్పష్టముగ కనబడును. ఈ వ్యాధి ఈ ద్రుతగతిని వహించినచో ముఖము వాడిపోయి కన్నులు మూసికొనిపోవును. పొక్కులు ఎండి గోధుమరంగుగా మచ్చలుపడి పక్షములేక అరమండలము రోజులవరకు గానినెమ్మదికాదు.

## చికిత్స

జబ్బు పశువును ప్రత్యేకముగా నుంచి జాగ్రత్తగా పోషణచేయవలెను. విరేచనము గావించు పదార్థములను పెట్టుచు వుండవలెను. దగిన చికిత్సలు, తగిన సంరక్షణ చేయవలెను. చురుకుదనముకలిగించు ఆహార పానీయముల నిచ్చుచు అప్పుడప్పుడు ఘాటుగల ధూపములను వేయుచుండవలెను.



అమును పమును కనిపెట్టి చల్లవలెను.

# జీర్ణరోగములు

## పదునాలుగవ భాగము

### అజీర్తివ్యాధి (Indigestion)

ఆ॥ వె॥ అర్ధమేతమేసి యతివిషణ్ణతతోడ
పేడవేయలేదు వేడిచేత
పాడి పశియునైన పాలురుచియు దప్పు
వ్యాధిముదరగ ప్రాణ చయము నశించు॥




తే॥ గీ॥ పేడ బాగుగ బెట్టదు వేడిచేత
మండుచుండు శరీరము దండిగాను
పశువుమేయదు మరియు నపానవాయు
వులను విడచును పాడిపశులవియైన
పాలునించవు యిట్లైన వ్యాధిముదిరి
చిక్కి చనిపోవు దీని నజీర్తియంద్రు॥

---

రెండూళ్ళ వ్యవసాయం, యిద్దరు భార్యలు చెరుపు.

పశువుయొక్క జీర్ణకోశము చెడుటయే అజీర్తియనబడును. నెమరువేయు ప్రతి జంతువుయొక్క పొట్టను నాలుగు భాగములుగ విభజింపవచ్చును. కాబట్టి అజీర్తి కలిగినపుడు నాలుగు పొట్టలలోను అజీర్తి యేర్పడవచ్చును. వ్యాధిలక్షణములను బట్టి నాలుగు కోశములలో ఏ కోశము చెడినది పరీక్షించవచ్చును. ముఖ్యముగా ఈ వ్యాధి పాడిపశువులకుఎక్కువగావచ్చును. వేసవికాలమందు మేతతక్కువగను, వర్షాకాలమందు మేతఎక్కువగా తినుటచేతను, మామూలు ఆహారము తినుచు జొన్నపిండి, ఉలవపిండి తదితర దాణాలు గొంతుక వరకు పెట్టుటచేతను, పశువును పనిచేయించక సోమరితనముగా నుంచుటచేతను, పశువు ఆహారకోశములో పురుగులు, సున్నము, జీర్ణముకాని కఠిన పదార్థములు యుండుటచేతను ఈ వ్యాధి కలుగును.

## లక్షణములు

ఆకలితగ్గును. అరమేతమేయును. చక్కగా లెక్కప్రకారము 36 నెమర్లు వేయదు. మలబద్ధకముండును. అప్పుడప్పుడు అపానవాయువులు వదలుచుండును. ప్రేగులు అరచుచుండును. కడుపు వెన్నునంటి యుండును. నల్లకప్పువేయును. అప్పుడప్పుడు కడుపులో గాలి కూడ యుండును. పాడిపశువైన మొదల పాలరుచి తగ్గును. వ్యాధిముదిరినకొలది పశువు కృశించి ఆకలితగ్గి రక్తము క్షీణించి మరణించును. ఇట్టి వ్యాధులకు చికిత్స చేయుటకు చాలాకాలముపట్టునుగాన రోగనిదానము గ్రహించుట మంచిది.

## చికిత్స

సోడాఉప్పు 2 తు, మరంజీవాము 4తు, ఇంగువ 1 తు, నేలవేము 1 తు, ఉప్పు 4 తు. కలిపి సేరు గోరువెచ్చని నీటితో కలిపి దినమునకొక మోతాదు వంతున పక్షము దినములు పెట్టుము.

లేక సొంటి 2 తు, మిరియాలు 1 తు, పిప్పళ్లు 1 తు, ఇంగువ 2 తు, వాము గిద్దెడు, ఉప్పు 3 తు, కలిపి సేరు గోరువెచ్చని నీటిలో కలిపి పై మాదిరిగనే పెట్టుము.

లేక ధనియాలు చేరెడు, పిప్పళ్లు 2 తు, పేరుజీలకర్ర 2 తు, మరంజీవాము 4 తు, ఉప్పు 4 తు. కలిపి పెట్టుము.

లేక మిరెపఆకురసము అర్ధసేరు, మిరియాలు 1 తు, ఉప్పు 2½ తులములు కలిపి పెట్టుము.

లేక మహిసాక్షి 2 తు, కటుకరోహిణి 1 తు, సొంటి 1 తు, ఉప్పు 4 తు, కలిపి పెట్టుము.

---

లేక లవంగాలు 1 తు, సొంటి 2 తు, నేలవేము 1½ తు, సోడాఉప్పు 2 తు కలిపి పెట్టుము.

లేక చింతపండుపులుసు, కారము, ఉప్పు, ఆవపిండి కలిపి రోజుకొక మూడు గొట్టములు పెట్టుము. పై చికిత్సలను వరుసగా కొంతకాలము వాడుము.

## మరొక సలహా

వరికుప్పలు, అపరధాన్యములను నూర్చునపుడు పశువులు ఆతురతతో తినుటవలన జీర్ణముకాక పేగులలో చిక్కుకొని బాధపడును. ఇట్టిసమయములలో కొందరు వంకాయలను, దోసకాయలను, ఉప్పును కొబ్బరినూనెను పోయుదురు. ఇట్టి చికిత్సలను అనుభవ పరుల సలహాతీసికొని చేయుట మిగులమంచిది. కాని చేరెడు గాని, రెండు చేరలు ఉప్పును మెత్తగా నలుగగొట్టి దానిలో 4 తులముల సొంటి పొడిని కలిపి కాఫీత్రాగునంత వేడినీటిలో కలిపిపెట్టిన తగ్గును.

లేక కొబ్బరిని సీననీటిలో వేసి తొక్కి 10 తులముల ఉప్పును కలిపి పెట్టుము.

లేక కోడిపెంటను 6 తులములు తీసికొని సేరున్నర గోరువెచ్చని నీటితో ఈయుము.

లేక మూడు డ్రాముల సారాయిని త్రాగించుము.

లేక మూడుగుప్పెళ్ళ ఎండు మిరపకాయలను రెండుసేర్ల నీటిలో కలిపి కాచి పిసికి వడపోసి త్రాగించవలెను.

## కడుపుబ్బు ( Tympanitis )

గీ॥ పశువు జీర్ణమొందనిమేత మెసవి మెసవి
కడుపు నుబ్బరింపగనుండు గాలితోను
చూడి పశువుకుండు నేర్పుతోడ మందు
వాడవలయు నేర్పును లేకను వాడరాదు॥

జీర్ణముకాని పదార్థములు నెమరు పొట్టలో నిలువయుండుట వలన అవి పులియుట వలనగాని దూరప్రయాణమైనవెంటనే నేదైన మేతతిననతరువాత కుడితి మున్నగు పదార్థములు త్రాగుటవలనగాని తొలకరి వర్షములు కురిసిన తరువాత మొలచు గడ్డి ఎక్కువగా తినుటవలన గాని, విషవంతములగు పొదలు మొక్కలు తినుటవలన గాని, పచ్చిజనుము, వరిపిలక మున్నగు వాతపదార్థము రుచిగానున్నవని ఎక్కువగా తినుట వలనగాని ఈ ఉబ్బుకలుగును. ఇంకను ఇతరరోగములలో కూడ ఇదికలుగవచ్చును.

---

పాలు అంబారంబు పరగ భూపతిపాలు దుక్కిటి పశువులు ధూళిపాలు.

## లక్షణములు

కడుపు విస్తారముగా పొంగుటయే ముఖ్యమగు గుర్తు. ఎడమడొక్క భాగములోనే ఆహార కోశముండును. ఎడమడొక్కయే ఉబ్బును. ఆ ఉబ్బుమీద వ్రేళ్లతో తట్టిన యెడల గాలితిత్తివలె మ్రోగును. సకాలములో తగుచికిత్స చేయనిచో. నెత్తురుతలకెక్కును. అప్పుడు ముఖముమీద రక్తనాళములు ఉబ్బును. కన్నులు కపబడవు. ఊపిరివీల్చుట కష్టముగానుండును. పశువు మూల్గుచుండును. వ్యాధి ముదిరినకొలది మరణముకూడ సిద్ధమగును.




## చికిత్స

ఆరంభములో ఆరసోలెడు ఉప్పును మెత్తగానూరి సేరున్నర గోరువెచ్చని నీటిలో కలిపి త్రాగించుము. లేక నాలుగు గుప్పిళ్ల ఎండుమిర్చిని మెత్తగా నలుగగొట్టి మూడుసేర్ల నీటిలో కలిపి కాచి వడపోసి త్రాగించుము.

లేక కడుపులో గాలి జేరియున్న గాలి తీసేపద్ధతి చేయుము.

లేక మామూలుగా తిండి ఎక్కువై ముక్కుచున్న పశువునకు మూడు డ్రాముల సారాయిలో 2 తులముల ఇంగువ కలిపి పెట్టుము.

లేక ముఖముమీద రక్తనాళములుబ్బి శ్వాస కష్టముగా పీల్చుచున్న ఉలితో ఆ రక్తనాళములను తెగగొట్టుము.

లేక కోడిరెట్టను 10 తులములు తీసికొని సేరున్నర గోరువెచ్చని నీటిలో కలిపి త్రాగించుము.

లేక జొన్నదంటుగాని, వరిగడ్డినిగాని కాల్చి మసిచేసి ముక్కుగొట్టములు పెట్టుము.

లేక దిరిసెన ఆకుపసరు సేరు, కారం 4 తు, ఉప్పుచేరెడు, కలినీరుసేరు, కలిపి త్రాగించుము.

---

వానతో కరువులేదు, పెనిమిటితో దారిద్ర్యములేదు.

లేక సోపు 2 తు, ఏలకులు 2 తు, జీలకర్ర 2 తు, సొంటి 2 తు, కలిపి సేరు గోరువెచ్చని నీటితో త్రాగించుము.

## ఆకస్మిక కడుపుబ్బు

పశువు కడుపులో విషపదార్థములు చిక్కుకొనుట వలన గాని, తాటిపండ్లు తదితర వస్తువులు గొంతుకకు అడ్డుపడుటవలన గాని, జీర్ణముకాక తినిన పదార్థములు పులిసి ఆహారకోశములో నిలువయుండి ఒక విధమగు గ్యాసుగా ఏర్పడుటవలన గాని, తదితర కారణముల వలనగాని ఆకస్మికముగా కడుపుఉబ్బును.

ఇట్టి సమయములో పశువు తత్తరపడును. దేహము ముడుచుకొనును. ఎడమ డొక్క గ్యాసుతోనున్న బాగుగావుబ్బును. వ్రేలితో నొక్కిన గుంటపడక డండం అను ధ్వని కలుగును. మలబద్ధకముండును. వెంటనే తగు చికిత్స చేయనిచో చనిపోవును.

## చికిత్స

కడుపు విస్తారముగా పొంగి శ్వాస ఆడనపుడు ఎడమప్రక్కనగుమూ ఎముక, కడపటిప్రక్క ఎముక తొంటిఎముక ఈ మూడు ఎముకలకు మధ్యగానుండు భాగములో అనగా రమారమి గుంటగానుండు ఎడమప్రక్కకు మధ్యభాగమున పీరాతోగాని, పేడతోగాని గుర్తుపెట్టిన పశువును పడవేసి ఆగుర్తుపైన డొక్క లో ఒక చిన్న చాకుతోగాని, ట్రోకరు అను పనిముట్టుతోగాని పొడిచి గాయముగుండ గొట్టమును తగిలించిన లోపలనున్న గ్యాసు అంత బుస్సుమని దుర్గంధముతో పైకివచ్చి ఉబ్బరముతగ్గును. మరునాడుకూడ ఈ రీతిగా గ్యాసుతీసి అవిసెనూనెగాని, ఆముదమునుగాని సేరున్ను, అల్లము 6 తులములును నూరి కలిపి ఒకమోతాదు ఈయవలెను. లేక గ్యాసును పోగొట్టు వస్తువులను ఈయవలెను. గొంతుకలో తాటిపండ్లు, ఎముకలు అడ్డుపడిన ఒక నున్నని తిన్నని కర్రను గొంతుకలోనికి పోనిచ్చి కొద్దిగా ఆముదమునుపోయుచు బైటకో, లోపలికో నెట్టవలెను. ఇంకను ఏమైన చిన్నవస్తువులు చిక్కుకొన్న కోడిగ్రుడ్ల తెల్లసొనతో ఆముదము కలిపి గొంతులోనికి జారవిడువ వలెను.

## ఉదయ సాయంకాలపు ఉబ్బు

కొన్ని పశువులకు అజీర్తివలన గాని తదితర కారణముల వలన గాని ఆహారకోశములో గాలి జేరుచుపోవుచుండును. కొన్నిటికి ఉదయపుపూటను, మరికొన్నిటికి సాయంకాలమునను, ఇంకా కొన్నిటికి అన్ని వేళలందును డొక్కభాగములో ఉబ్బు కనబడుచుండును. ఈ వాపున్నంతసేపు పశువుకు బాధగానుండును. మేత సరిగా తినదు. కొన్నిటికి దగ్గుండును. చికిత్స చేయకపోయిన దీర్ఘరోగముగా ఏర్పడి ఆహారకోశము చెడి మలబద్ధకమేర్పడి పశువు మృత్యువున కాసన్నమగును. గాన ఆరంభములోనే చికిత్స చేయవలెను.

---

వడ్లరాసి వండపోయినా వానతో కరువులేదు.

## చికిత్స

ఆరంభములోనే ఆడ్డసరపాకులు 3గుప్పిళ్లును, ఉప్పు చేరెడు, ఇంగువ 2తు, కలిపి ద్రొక్కి దినమున కొక మోతాదువంతున సేరు గోరువెచ్చని నీటితోగాని, కారపు పాలతోగాని నాలుగు దినములు వరుసగా యిచ్చిన తగ్గును.

లేక అవిసెనూనె సవాసేరు, కర్పూరతైలం 2¼ తు, నవాసాగరం 1 తు కలిపి ఒకమోతాదు మాత్రమే యిచ్చిన తగ్గును.

లేక మసిబొగ్గుపొడి 6తు, కారపుపొడి 4తు, సున్నపుతేటసేరు కలిపి త్రాగించుము.

లేక వావిలాకు పసరు సేరు, శొంటి 2 తు, పిప్పళ్లు 1 తు, మిరియాలు 1 తు, చేదు జీలకర్ర 2 తు, ముసాంబ్రము ¼ తు, మహిసాక్షి 1 తు, కారపుపాలు సేరు కలిపి త్రాగించుము.

## కడుపునొప్పి (Colic)

ఆ॥ వె॥ పశువు మేత మాన బరగ కాళ్లుముడిచి
మూల్గుచుండు తనను కాళ్ళనుంచి
మేతజీర్ణింపక చెడువాతమగును
కడుపునొప్పి వచ్చి గాసిజెందు॥




పశువు ఎండుగడ్డిని,పచ్చిగడ్డిని వెంటవెంటనే మేయుటచేతను ఆతురతతో అంగిన ముండ్లచెట్లు, కంప జాతులను తినుటచేతను, ఎల్లపుడు చల్లనినీటిని త్రాగుట చేతను, పేగు లలో జీర్ణముకాని పదార్థములు నిలువయుండుటచేతను, వాయుపూరితముగా కడుపుబ్బరముగా నుండునపుడు పనిచేయించుటచేతను, మత్తుపదార్థములు పేగులలో

---

ఆకాలపువాన ఆరికలకూడు.

చిక్కుకొనిపోయి బాధ కలుగుటవలనను, తవుడు, జొన్నలు, వడ్లు, మున్నగు గట్టి పదార్థములు మిక్కుటముగా తిని జీర్ణము కాకపోవుటవలనను, ఈ వ్యాధి కలుగును.

## లక్షణములు

పశువు మేతమేయుట మానును. ఏమియు తోచక పరుండును. ముఖ్యముగా పశువు తలను ఎడమ డొక్కదగ్గర ఆనించి మూల్గుచు వెనుక కాళ్లతో తన్నుకొనుచు, వెన్నును విరచుచు, పడుకొనుచు, లేచుచు, తోకనువిప్పుచు, మాటిమాటికి మూత్రమును పోయుచు, పేడపలుచగగాని గట్టిగాగాని అసలు వేయకుండగగాని యుండును, అప్పుడప్పుడు పండ్లు కొరుకుచు బాధపడుచుండును.

## చికిత్స

ఈ వ్యాధి ఏకారణము వలన వచ్చినదో, ఏపరిస్థితిలో నున్నదో, వెంటనే తగునా? ఎంతకాలము పట్టును? అప్పుడప్పుడు వచ్చిన ఏ లక్షణములతో నుండును? ఏమైనా అవుసరమా? మున్నగు విషయములను పరీక్షించి తగిన చికిత్స చేయవలెను.

ఆరంభములో ఉప్పుచేరెడు, వాము అరసోలెడు, ఇంగువ 4 తు, కలిపి సేరు న్నర గోరువెచ్చని నీటిలో కలిపి ఒక మోతాదునీయవలెను.

పేడ వేయక మలబద్ధకముగానున్నపుడు సబ్బునీటితో ఎనిమా చేయుట మంచిది.

లేక గచ్చాకురసము అర్ధసేరు, ఇంగువ 4 తు, కలిపి త్రాగించవలెను.

లేక దీర్ఘకాలపు నొప్పిగానున్న సొంటి 1 తు, మిరియాలు 2 తు, కురంజీవాము 2 తు, సోడాఉప్పు 1 తు, వాయులవంగాలు 1తు, నీరు సేరున్నర కలిపి రెండుదినముల కొక మోతాదునీయవలెను.

లేక నొప్పిచే తన్నుకొనుచుండిన గాడిదగడపాకు పసరుగాని, వాముపాటరుగాని యీయవలెను.

## మలబద్ధకము (Constipation)

పశువులయొక్క తత్వములనుబట్టి అప్పుడప్పుడుగాని, ప్రతిదినముగాని మలబద్ధక మేర్పడును. ఈ వ్యాధికూడ అనేక కారణములవలన రావచ్చును. ప్రేగులు సరిగా పని చేయక పోవుటవలనను, అనారోగ్యమగు మన్యప్రదేశములలో నుంచుటవలనను, మేత, నీరు సరిగా పెట్టక ఎల్లప్పుడు ఎండలోనుంచి పనిచేయుటవలనను, పేగులు ఆరిపోవుట వలనను మలబద్ధకము కలుగును. పశువు అనారోగ్యముగా నున్నపుడెల్ల యీ వ్యాధి కలుగును.

---

## లక్షణములు

పశువు నాలుకపై ఒకవిధమగు పొరగ్రమ్మును. మలము గట్టిగా వేయుచుండును. ఆకలి తగ్గును. మందమతిగా నుండును. నెమరు సరిగా వేయదు. తోక నప్పుడప్పుడు ఎత్తుచు ముక్కుచుండును. జ్వరముకూడ యుండును. అపానవాయువులు విడచు చుండును.

## చికిత్స

ఆరంభములో చింతపండుపులుసు సేరు, ఉప్పు చేరెడు, గోరువెచ్చని నీరు సేరు కలిపి త్రాగించుము.

లేక అరసేరు ఆముదములో 40 చుక్కల నేపాళనూనె కలిపి ఈయవలెను.

లేక నల్లజీడిగింజలు కొట్టినవి 15న్ను, పాలు సేరున్ను కలిపి కాచి వడపోసి త్రాగించవలెను.

లేక మసాంబ్రము 1 తులము, నేలవేము 2 తులములు, ఉప్పు 6 తులములు, సొంటి 2 తులములు కలిపి సేరు వేడినీటిలో కలిపి ఈయుము.

లేక ఆముదము సేరు, ఎండుమిర్చి గుప్పెడు, అల్లము 2 తులములు కలిపి కాచి వడపోసి త్రాగించవలెను.

ఈరీతిగా అనుభవచికిత్సలు చేయవలెను. విరేచనములైనతరువాత బలముగల తేలికపదార్థములను, పచ్చిగడ్డిని పెట్టవలెను.

## విరేచనములు (Diarrhea)

ఆ॥ వె॥ కడుపునొప్పికల్గి కలతజెందుచునుండ
పలుచ పేడవేయు బాధతోడ
మేత నెమరుమాని మిగుల మందతనుండు
వాతమైన భువిని బాధలేదు.

ఈవ్యాధి మేతలోపమువలనను, ఆహారకోశములోను, పేగులలోను ఒకవిధమగు పురుగులుండుటవలనను, పచ్చిక మేయుచు వెంటనే ఎండుగడ్డి మేయుటవలనను, వర్షము కురిసినతరువాత పచ్చిగడ్డి తినుటవలనను, ముక్కిపోయిన గడ్డి, కావలు, పురుగులుపడిన తవుడు, నిలువయున్న కుడితి పుగ్గిరాలు తినుటవలనను కలుగును. ఇంకను పెద్దరోగము మున్నగు తదితర రోగములలోకూడ ఈవ్యాధి రావచ్చును.

---

చీటికి కురిసిన వర్షము అడివిగాచిన వెన్నెల.

## లక్షణములు

పలుచగా పేడవేయుటయే దాని ముఖ్యలక్షణము. కడుపునొప్పి, ఆకలిలేకుండుట కలుగును. వేడిచేసి పారుడు ముడ్డిత్రిప్పుతో ముక్కుచుండును. వాతముచేసి పారుచుండిన ముడ్డిత్రిప్పుయుండదు. దుర్వాసన బంకతోగూడిన నెత్తురుకూడ యుండును. విరేచనములగుచోటది మలద్వారము తగ్గును. చెవులను క్రేలాడవేయును. నల్లకప్పు వేయును. దినమునకు 10 లేక 15 వరకు విరేచనములగును. నెమరు మానును. మూల్గుచుండును. డొక్కలు దిండుకొనిపోవును. అంటురోగములలో వచ్చు విరేచనముల లక్షణములు మరొకవిధముగా నుండును.

## చికిత్స

ఆరంభములోనే సేరు ఆముదమును యిచ్చిన లోపలి మలమంత కదలిపడిపోయి వ్యాధి తగ్గును.

లేక పచ్చితుమ్మచెక్క రసము, పచ్చినేరేడుచెక్కరసము, పచ్చివేపచెక్కరసము మూడు అర్థసేర్ల రసము తీసి నిమ్మకాయంత వెన్న కలిపి ఒకటి రెండు మోతాదులు యిచ్చిన తగ్గును.

లేక కవిరి 2 తులములు, మాచికాయలు 2 తులములు, సీమసున్నము 4 తులములు, గంజాయి 1 తులము, నల్లమందు పావుతులం, కలిసిరు సేరున్నర కలిపి పారుడు తగ్గువరకు రెండు మూడు మోతాదులిచ్చిన తగ్గును.

లేక మారేడుగుజ్జు 10 తులములు, కవిరి 2 తులములు కలిపి నూరి సేరు నీటిలో కలిపి ఈయవలెను.

లేక కర్పూరము పావుతులము, ఇంగువ 1 తులము, సొంటి 1 తులము కలిపి సేరు జొన్నకలితో పెట్టుము.

లేక కానిసిగింజలను నీటిలో నానవేసి పిసికి త్రాగించిన ముడ్డిత్రిప్పుతగ్గి విరేచనములు కట్టును.

లేక పయిడిప్రత్తిఆకురసము సేరు, మజ్జిగసేరు కలిపి కాచియిచ్చిన తగ్గును.

షరా:—ఈ వ్యాధి కౌకవలన పారుచున్నది, లేక వాతమువలన పారుచున్నది, లేక తదితరవ్యాధులవలన పారుచున్నది బాగుగా పరీక్షించి అనుభవముతో చికిత్స చేయవలెను. కౌకవలన పారిన అంత ప్రమాదములేదుగాని వాతమువలన పారిన శీతలములోనికి వచ్చి ప్రమాదము కలిగించును. విరేచనములగుచోట ఎప్పటికప్పుడు పరిశుభ్రము చేయుచుండవలెను. యెక్కువగాసై నీరసించిన, జొన్నజావలో సారాయి,

---

పన్నెండు నెలలలో రెండుపోతే పాడుపాడు.

సొంటిపొడి కలిపి పెట్టవలెను. ఆంగ్లేయ చికిత్సలో క్లోరోడైన్‌నుగాని క్యాంఫర్ డైన్‌ను గాని తడవకు అరఔన్సు వరకు సేరు నీటిలో కలిపి ఈయవచ్చును.

## రక్త విరేచనములు (Dysentery)

ఈ వ్యాధి శీతోష్ణస్థితిగతులు మారునప్పుడు తరచుగా వచ్చుచుండును. పశువులు క్రొత్తగడ్డి తినుటవలనను, కాల్వలలోని క్రొత్తనీరు త్రాగుటవలనను, కొన్ని సమయములలో అతిగాడిచేయుటవలనను, జీర్ణముకాని పదార్థములు జీర్ణకోశములో నిలువయుండుట వలనను, ఒక విధమగు పురుగులు పేగులలో నుండుటవలనను ఈ వ్యాధి కలుగును.

### లక్షణములు

ఈ రోగము ఆకస్మికముగా కలుగును. పశువునకు చలిపోవును. మలమువెంట చీము నెత్తురు పడుచుండును. గుదస్థానమున బాధయుండును. కడుపునొప్పిచే పండ్లు కొరుకుచుండును. పచ్చిమాంసపు ముక్కలవలె నుండు చిన్నచిన్న నెత్తురుకండలు విరేచనములతో పడుచు దుర్వాసనగా నుండును. పేగులపై ఒత్తిన బాధగానుండును. పగలుకంటె రాత్రులందు వాతమువలన పశువు బాధపడుచుండును. పేగులు అరచుచుండును. వ్యాధి ముదిరినకొలది శుష్కించును. దుర్వాసనగల చెమట శరీరముపై దుబుకును. తగిన చికిత్స చేయనిచో చనిపోవును.

### చికిత్స

ఈ వ్యాధికి జాగ్రత్తగా సంరక్షణ చేయవలెను. వగరు పదార్థములను, కాచిన నీటి నిచ్చుచుండవలెను.

ఆరంభములో పెసరగుగ్గిళ్లు తవ్వెడు లేక మానెడు, పేరినేయి సోలెడు, ఉప్పు 4 తు. కలిపి పెట్టవలెను.

లేక అరటిపువ్వులరసము అరసోలెడు, పెరుగు అరసేరు, వెన్న 5 తు, కలిపి ఒకటి రెండు మోతాదులు ఈయవలెను.

లేక ఆవుపాలు అరసేరు, పచ్చకర్పూరము ½ తు, కవిరి 1 తు, వరిపిండి సోలెడు కలిపి పెట్టుము.

లేక ఎఱ్ఱకలువ దుంపలు ద్రొక్కి అరవీసెడు రసముతీసి, సేరు జొన్నకలితో కలిపి కాచి విరేచనములు తగ్గువరకు నాలుగుగంటల కొక మోతాదు ఈయవలెను.

లేక నీరుల్లిపాయలు 25 తు, పెరుగు అరసేరు, మెంతిపొడి 2 తు, వెన్న నిమ్మకాయంత కలిపి పెట్టుము.

---

రెండేండ్లయెండ మూడేండ్ల మురుగు వుండదు.

లేక ఉడకబెట్టిన పిల్లిపాయలు 15 తు, పిచ్చిబెండాకు గుప్పెడు, నల్లమందు ¼ తు. కలిపి మెత్తగానూరి పెట్టుము.

లేక క్యాంఫర్ డైన్ గాని క్లోరోడైన్ గాని ఒక ఔన్సు, సేరు నీటిలోకలిపి ఒకటి రెండు మోతాదులు ఈయవలెను.

## హెచ్చరిక

లోకను, ఆసనమును వేడినీటితో కడుగుచుండవలెను. ఆహారము జీర్ణము కలుగ జేయునదిగా పెట్టవలెను. నీరు కాచి పెట్టవలెను. దుర్వాసనయున్న సాంబ్రాణిపొగ వేయుము.

## పాండురోగము

పశువునకు తగినంత ఆహారము పెట్టకపోవుటచేతను, చీకటికొట్టములో ఎల్లప్పుడు నుంచుటచేతను, తగినంత గాలి లేకపోవుట చేతను, సోమరితనముగా ఎల్లప్పుడు నిడను పశువులచావడిలో నుంచుటచేతను, రక్తమునందుండు ఎఱుపు కణములు తగ్గుటచేతను ఈ వ్యాధి కలుగును. రక్తమునందలి దౌర్బల్యమే దీనికి ముఖ్యకారణము.

## లక్షణములు

పశువు శరీరకాంతి పాలిపోవును. సామాన్య జ్వరముండును. కండ్లరెప్పలు చూచిన రక్తములేక తెలుపురంగుగానుండును. నాలుక, పెదవులు, కనురెప్పలు, చర్మము మున్నగు భాగములన్నియు పాలిపోవును. వ్యాధిముదిరినకొలది బరువుతగ్గును. ముఖమువాచును. రక్తము క్షీణించినకొలది అవయవములు అస్వస్థతనొందును. క్రమేపి పక్షవాతముకూడ రావచ్చును. క్రమక్రమముగా కృశించి కొన్నాళ్లకు మరణించును.

## చికిత్స

బలము, రక్తవృద్ధి కలుగజేయు పదార్థములను పెట్టుచుండవలెను. గాలి ధారాళముగా వచ్చు ప్రదేశమునందుంచవలెను.

అన్నభేది 1 తు, విషముష్టిగింజలపొడి 2 తు, సోడాఉప్పు 1 తు, వురంజీవాము 1 తు, ఉప్పు 2½ తు, పసుపు ½ తు, కలిపి ఉదయసాయంకాలములందు గోరువెచ్చని నీటితోగాని, బెల్లముతోగాని పెట్టవలెను.

లేక జిల్లేడుమొగ్గలపొడి ½ తు, వాము 4 తు, మిరియాలు 1 తు, సొంటి 1 తు, ఇంగువ ½ తు, కలిపి పై మాదిరిగనే పెట్టవలెను.

లేక విషముష్టిగింజలపొడి 2 తు, నేలవేము 1 తు, అన్నభేది 1½ తు, పసుపు½తు, కలిపి పై మాదిరిగనే పెట్టవలెను.

---

చెట్లుమొండు అయితే చేరికవాన.

లేక మహిసాక్షి 1 తు, కటకరోహిణి 1 తు, సొంటి 1 తు, ఉప్పు 3 తు, కలిపి దాణాలోగాని, వేడినీటితోగాని పెట్టవలెను.

## జలోదరము

రోగము పశువులకు దుర్బలత్వమువలన కలుగును. ఇంకను వేసవికాలమందు మేత సరిగా దొరకక తొలకరించగనే మిక్కుటముగా తినుటచేతను, వర్షాకాలమందు నూతనముగా చిగిర్చి నీటిమయమై యుండెడు పచ్చికతినుటచేతను, ఎల్లపుడు చలిగాలిలో నుంచుటచేతను, శ్వాసకోశములలో అస్వస్థత యేర్పడుటచేతను, రక్తహీనతచేతను, కలుగును. ఈ జాడ్యము పశువు రొమ్మునకు, కడుపునకు మాత్రము ముఖ్యముగాసోకును. ఇదే గుండెకు సోకిన గుండెనంజు యందురు.

## లక్షణములు

ఆరంభములో పశువు రక్తనాళములలోని రక్తము సరిగా ప్రసరించకపోవుటవలన ఆయా భాగములు ఉబ్బును. ఆ ఉబ్బిన భాగములను వ్రేళ్లతో నొక్కినయెడల గుంటలు పడును. జ్వరము తక్కువగా నుండును. నోటినుండి చొంగ అప్పుడప్పుడు పడుచుండును. నోరు దుర్వాసనగా నాలుక తెలుపుగానుండును. పశువు పనిచేసినపుడుగాని, ఎండలో నున్నపుడుగాని, వేడిజేసినప్పుడుగాని రొప్పుచుండును. వ్యాధి ముదిరినకొలది ఎండలో పనిచేయించిన రొప్పుచు నోటినుండి చిక్కని చొంగవంటి పదార్థము పడుచుండును. చిన్నదూడలకు కడుపుదగ్గరగా నీరుచేరి ఒత్తిన మెత్తగానుండును. పశువు అరమేత మేయును. కాళ్లుగాని, ముఖముగాని, రొమ్ముగాని, దవుడక్రిందగాని లేక భాగములన్నియుగాని నీరున్నట్లు కనపడుచుండును. వ్యాధి ముదిరినకొలది పశువు క్షీణించుచుండును. కనురెప్పలు, చీలమండలు, మూతి మున్నగు భాగములలో వాపుయేర్పడును. ఈ వ్యాధి కొన్ని నెలలవరకు యుండి పశువును బాధించును.

## చికిత్స

సూదితో లోపలి నీటిని తీసివేయువచ్చునుగాని అనుభవముగల వైద్యులచే చేయించవలెను. ఆరంభములో సొంటి 1 తు, అన్నభేది $\frac{1}{2}$ తు, విషముష్టిగింజలపొడి 1తు, నేలవేము 1 తు, ఉప్పు $2\frac{1}{2}$ తు, కలిపి చూర్ణముచేసి ప్రతిదినము ఈ మోతాదు వంతున వారము దినములు పెట్టుచు జీర్ణశక్తిగలుగు పదార్థముల పెట్టుచుండవలెను.

లేక ఆరెదొండాకు పసరు అర్థసేరు, మిరియాలపొడి 1 తు, సొంటి 1 తు, వెల్లుల్లిపాయలు 1 తు, పసుపు $\frac{1}{2}$ తు కలిపి పై మాదిరిగనే నాలుగు దినములు పెట్టవలెను.

లేక ఆవుపాలుగాని, గేదెపాలుగాని సేరు, తెలికపిండి సవాసేరు కలిపి ఒక పూట నాననిచ్చి పెట్టవలెను.

---

శనివారపువాన శనివారం విడుచును.

లేక కర్పూరము ¼ తు, యష్టిమధుకము 1 తు, ఇంగువ 1 తు, బెల్లం 6 తు, కలిపి అప్పుడప్పుడు నాకించుచుండవలెను.

## గర్భశూల

ఈ వ్యాధి చిన్న పశువులకు వచ్చును. దాణా దినుసులు, కందులు, ఉలవలు, మినుములు మున్నగునవి ఎక్కువగాతిని మరల పచ్చిగడ్డి తదితర పొట్టుధాన్యములు తినుట వలనను, క్రొత్తగడ్డి, కొడద తినుటవలనను, వాతరోగము వలనను, అజీర్తివలనను జీర్ణము కాకుండగనే ఆహారము మరల తినుటవలనను, నెమరు సరిగా వేయకపోవుటవలనను, చలిగాలిలోను, వర్షములోను ఉండుటవలనను రావచ్చును. ఈ వ్యాధి కొన్నిరోజులు గాని ఒకటి రెండు మాసములుగాని ఉండును.

## లక్షణములు

ముఖ్యముగా ఈ వ్యాధిలో విరేచన మవ్వక జిగురుతో కొద్దిగా పడుచుండును. శూలనొప్పి వచ్చినపుడు కాళ్లనుజాపి తన తలను పొత్తికడుపునకు ఆనించి మూలుగుచు దీనముగా చూచుచుండును. పొట్ట ఉబ్బరముగా నుండును. అప్పుడప్పుడు నోటి నుండి చొంగపడుచుండును. ఎన్నిపర్యాయములు ఎనిమా చేసినను విరేచనము కాదు. పశువు లేచుట, పండుకొనుట, మూల్గుట, వెన్ను విరచుకొనుట, అపానవాయువులు విడచుట, క్రమేపి వ్యాధిముదిరి మరణమునకు సిద్ధమగును.

## చికిత్స

ఈ చింతమణిలో చెప్పిన రోగనిదానములలో పశువుయొక్క తత్వమునుబట్టి కొన్నిలక్షణములు లేకపోవచ్చును. మరొకరీతిగా మారవచ్చును. అంతమాత్రమునకే ఈ గ్రంథమును విమర్శించరాదు. మీ అనుభవమునుబట్టికూడ చికిత్స చేసికొనుట మంచిది.

గర్భశూల గల పశువునకు ముందువిరేచనమయ్యే సూత్రమును చూడవలెను. ఈ విరేచనమగుటకు ఆతురతతో రైతులు వివిధచికిత్సలు అనగా కొబ్బరినూనె, వంకాయలు, నల్లేరు, పందిపెంట, ఆముదుకొడలరసము మున్నగు వస్తువులు పెట్టుటవలన మలము గట్టిపడి దీర్ఘవ్యాధిగా నై మరణమునకు సిద్ధమగును.

ఆరంభములోనే నల్లజీడివిత్తులు 15 మెత్తగాకొట్టి సేరు గోదెపాలలో కలిపి కాచి ఒక్కపర్యాయమే ఈయవలెను.

లేక రెండుగిద్దల ఉప్పును, కొరవుపాలతో కలిపి గోరువెచ్చగా నుండునట్లు ఒక్కపర్యాయమే త్రాగించవలెను.

---

ఉప్పుతో తొమ్మిది ఇంటనుండిన, శనివారపు జడి శప్పము పెటుకదు.

లేక నేపాలగింజలనూనె 60 చుక్కలున్ను, ఆముదము సేరున్ను కలిపి ఈయవలెను. ఈ రీతిగా గాఢవిరేచనమగునట్లు ఒక మోతాదు యిచ్చిన లోపలనున్న చెడు మలమంతి పడిపోయిన తరువాత ఏ వాయురసమో, ఏ సొంటి రసమో, ఏ ఇంగువపాలో, దినమున కొక మోతాదును యిచ్చుచు జీర్ణమగు తేలిక పదార్థములను పెట్టుచుండవలెను. కాచిన నీటిని దాహముగా నియ్యవలెను.

## కాలిజవ్యాధి

### స్వభావము

పశువు శరీరమునందలి ప్రధానావయవములలో కాలిజము ముఖ్యమైనదియైయున్నది. ఈ అవయవముయొక్క బాగుపై పశువుయొక్క సౌఖ్యమాధారపడి యున్నది. జీవితము నందలి సౌఖ్యపదవి నిర్మాణము నొందియున్నది. ఈ అవయవముయొక్క స్వస్థత చెడినయెడల పశువు సుఖముగ నుండజాలదు. ఆరోగ్యస్థితియందుకూడ దీని పరిమాణము మారుచుండును. ఈ అవయవముయొక్క ముఖ్య వ్యాపారము పశువు తిను త్రావు పదార్థములను రక్తమునందు కలియునట్లు చేయుటను నుపయోగించు పైత్యద్రవమును స్రవింపజేయుటయై యున్నది. ఈ పైత్యద్రవము స్వాభావికముగ విరేచనకారిగను, ఆహారము క్రుళ్ళకుండ జేయునట్టిదిగను పరిణమించుచున్నది. ఈ కాలిజవ్యాధి పశువులను అప్పుడప్పుడు సోకుచుండును. ఈ వ్యాధి పల్లపు ప్రదేశములలోను, పట్టిసేలలలోను మేయు జంతువులకు ముఖ్యముగా కలుగును. జంతువుయొక్క కాలిజములో నొకవిధమగు పురుగు లుండుటచేత ఈ వ్యాధి యేర్పడును. ఈ వ్యాధి ఎక్కువగా చిన్నజంతువులకు వచ్చుచుండును. పశువులను క్రిక్కిరిసి కట్టుటవలనను, క్రుళ్ళుకొను నానావిధములగు వస్తువులు మేపుటవలనను ఈ వ్యాధి కలుగును.

### లక్షణములు

ఇది మిక్కిలి చెడువ్యాధియైయున్నది. దీనిని ఆరంభములో కనిపెట్టుట కష్టము. జబ్బుపడిన జంతువు నడుముపైన చెయ్యిపెట్టి నొక్కినయెడల చర్మముక్రింద పెటపెటమను శబ్దము కలుగును. కన్ను, ముక్కు, నోరు మొదలగువానిలోనుండు మృదువగు పొరలు పాలిపోవును. పశువు శరీరముపైనున్న రోమము రాలిపోయి కంటిదృష్టి తగ్గవచ్చును. గొంతుకలో నీరుపట్టి ఉబ్బు కనబడవచ్చును. పెద్దపొట్ట విస్తరించును. విరేచనములు ప్రారంభమగును. నాలుక బడపారిపోవును. విరేచనములచే పశువు నీరసపడి మృతినొందవచ్చును.

### చికిత్స

అన్నభేది 1 తులము, సొంటి 2 తులములు, నేలవేము 3 తులములు, వేడినీరు అర్ధసేరు కలిపి 4 దినములు త్రాగించవలెను.

---

ప్రొద్దున్నే వచ్చిన చుట్టం ప్రొద్దున్నే వచ్చినవాన నిలువదు.

లేక నవాసాగరము 1 తులము, నాము 10 తులములు, పెరు అర్ధసేరు కలిపి 4 దినములు త్రాగించవలెను.

లేక కృష్ణతులసిఆకురసము పావుసేరు, ఒకపర్యాయము త్రాగించవలెను.

నరా :—చాలినంత ఎండుమేతతో ఉప్పుచేర్చి పెట్టవలెను.

## మలమూత్రబంధ రోగము

ఈ వ్యాధి అతివేడిచేసిగాని, వాత రోగమువలనగాని, తదితర వ్యాధులలో యేదైన సంధిగుణములు పుట్టినపుడుగాని ఈ వ్యాధి కలుగుచుండును. కడుపు బాగుగా ఉబ్బును. ఊపిరి ధారాళముగా విడువలేదు. మలమూత్రములు రెంటిని బంధించును. పశువు ఆసనము ఉబ్బును. పశువు మూత్రకోశము వాచును. పశువు చెప్పరాని బాధ పడును. కండ్లను తేలవేయును. మూల్గుచుండును. అతివేడి యుండును. ఈ వ్యాధి సాధారణముగా చికిత్సకు లొంగదు.

## చికిత్స

వెంటనే విరేచనమునకు మందీయవలెను.

సొంటి అర్ధసేరునపటాసు, ఉప్పు చేరెడు కలిపి పొడిచేసి సేరు నీటిలో కలిపి త్రాగించవలెను.

లేక ఆవిసెనూనె అరవీసెడు త్రాగించవలెను.

లేక మేకపిరుడు పావుసేరు తెచ్చి పశువు ముక్కురంధ్రములలో పోయును.

లేక ఆవాలు, సబ్బు మెత్తగా నూరి గుడ్డకు పట్టించి మూత్రద్వారములోనికి తోయవలెను.

లేక నారింజకాయంత ఆవు వెన్న సేరు నీటిలో బాగుగా కాచి త్రాగించ వలెను.

నరా:—పై మందులు దినమునకు రెండుమూడుసార్లు ఉపయోగించవలెను.

## గుండ్రని పురుగులు

ఇవి తెలుపురంగుగానుండి శరీరముయొక్క లోపలిభాగమున పెరుగలిగియుండును. ఈ పురుగులు పశువుయొక్క కాలేయములోను ఊపిరితిత్తులలోను ఉండును. ఈ పురుగు లుండుటచేత శరీరావయవము లంతగా పనిచేయజాలవు. ఒకప్పుడు వానిలో పెద్దదిగా నుండు పురుగు చితికినయెడల దానియందలి విషద్రవము పశువుయొక్క కడుపుభాగ మందైన, రొమ్ముభాగమందైన పడుటవలన పశువు మరణించును. ఈ పురుగులు లెక్క

---

ప్రొద్దున వచ్చిన వర్షం ప్రొద్దుగూకి వచ్చిన చుట్టం పోరు.

తక్కువగా నుండుటే గాని జంతువునకు వ్యాధిని కలుగజేయునంత గొప్పదిగా నుండుట లేదు. మాదిగలు మాంసముకొరకై జంతువును కోసినపుడు లోపల ఈపురుగులు అనేకము చేరియుండును. ఈ పురుగులుండు జంతువుల మాంసము హానికరము. ఈ పురుగులు కనబడిన భాగము కోసి తక్కలవు చేయరాదు.

## చికిత్స

ఈ పురుగులు హానికరములు గాకపోవుటచేత ఈ వ్యాధి విషయమై సరిగా గుర్తించుట చాల కష్టము. పశువునుకోసి పరీక్షించినప్పుడే ఈ వ్యాధి విషయమై తెలిసి కొనవచ్చును. ఈ పురుగు లుండిన కారిజముగాని, నురుగుదబ్బలుగాని కాల్చివేయుట మంచిది.

పశువు శరీరములో పైన చెప్పిన పురుగులు పట్టకుండ నుండుటకు ఉప్పుగాని గంధకపుపొడిగాని పెట్టుటమంచిది. ప్రతి రైతు కూడ దినమునకు చేరెడు ఉప్పు దాణా తినునులలో పెట్టినయెడల యేవిధమైన పురుగులు పట్టవు. ఈ జాడ్యముచే బాధపడు దుర్బలమగు జంతువులకు అన్నభేది, నేలవేము, సొంటి, ఉప్పు ఈ వస్తువులు ఔషధ ప్రమాణముగా బలము వచ్చువరకు ప్రతి దినము పెట్టుచుండవలెను.

కర్పూరతైలము ఆముదము సమభాగములు కలిపి త్రాగించవలెను.

వేపాకుపసరు ఉప్పు కలిపి త్రాగించవలెను.

## ఆహారకోశములో నుండు పురుగులు

ఇవి పశువు ఆహారతిత్తిలో ప్రవేశించి ఒక విధమైన రోగము కలిగించును. ఈ పురుగులు జలగ ఆకారముగా నుండును. ఈ వ్యాధి పల్లపు ప్రదేశములలోనుండు పశువులకు తరచుగా వచ్చుచుండును. మొదట పశువు బాగుగా బలియును. తరువాత దుర్బలపడి పాండుపట్టి రక్తహీనమై కృశించి చనిపోవును.

## చికిత్స

ఈ వ్యాధిగల పశువునకు బెల్లపు పానకము అప్పుడప్పుడు త్రాగించుట మంచిది. లేక దానిమ్మచెక్క కషాయము త్రాగించవలెను. లేక దుష్టపాకు రసము త్రాగించవలెను.

## రొమ్మునొప్పి

దీనినే రొమ్మపట్టు, రొమ్మునడికలబడుట యందురు. పశువులను విసుగు విరామములేక ఎక్కువ బరువులు వేసి బండ్లు తోలుటచేతను, చలిగాలి సోకుటచేతను, శీతగాలి సోకుటచేతను, వివాహములకు గుడిసెబండ్లు కట్టి ఎద్దులను సర్దాగా కన్నుమిన్ను గానక తోలుటచేతను, ఇసుపనాగళ్లతో దున్నుటచేతను, కిరాయిబండ్లవారు ఎక్కువ

ధాన్యపుబస్తాలువేసి బరువుగానుండు బజారులలోకూడ తోలుటచేతను, నూటికినూటికి బరిమోముకలపైన రైతులు తమ చెందు కర్రలతో కొట్టుటచేతను ఈవ్యాధి కలుగును.

## లక్షణములు

ఈ నొప్పి ప్రారంభమైనవెంటనే జ్వరము సోకును. దగ్గుచుండును. దగ్గునప్పుడు బుసకొట్టుచుండును. పశువు ఎల్లప్పుడు పండుకొనుటకు ఇష్టపడునుగాని, నిలుచుండుటకు ఇష్టమును సూచింపదు. శ్వాసోత్పత్తియగు అంగములకు పలువిధములైన వాపు సంకటములు సంభవించుచుండును. రొమ్మునభాగము చాల బాధగా నుండును. రొమ్ముముక చాల పచ్చిగానుండి అప్పుడప్పుడు నోటివెంట నురుగుగాని, తెమడగాని పడుచుండును. వ్యాధిని గ్రహించలేక పశువుతో పనిచేయించినయెడల రక్తప్రచారమున కొటంకము కలిగి ఊపిరి రాడక పశువు చనిపోవును.

## చికిత్స

తాటిబెల్లము అరవీసె, జిల్లేడుపూవుపొట్టు అర్ధసేరుశనగటూకు కలిపి త్రొక్కి నెమ్మదియగువరకు పెట్టుము.

లేక ఉలవపిండి అరసోలెడు, తాటిబెల్లము అరవీసె, తెలకపిండి సవాసేరు, ఉప్పు చేరెడు, కోడిపెట్ట క్రొవ్వు సవాసేరు కలిపి త్రొక్కి ప్రతిదినము ఉదయ సాయంకాలములందు కోడిగ్రుడ్డంత వంతున పైనుండు పద్దువాడు పెట్టును.

లేక ఉప్పిచెక్క 8 తులములు, పసుపు 1 తులము, ఉలవపిండి సోలెడు, కలిపి దంచి రెండు దినములు పెట్టవలెను.

లేక తక్కుడువేరుపొట్టు 8 తులములు, జిల్లేడుపువ్వులు 2 తులములు, తాటి బెల్లము సవాసేరు కలిపి పెట్టవలెను.

## హెచ్చరిక

రోగముగల పశువును క్రొత్తపాకలో నుంచి వేడికాపులు రొమ్మున కిరు ప్రక్కల కాచవలెను. పశువు ఎదరాలదగ్గరకూడ బాగుగా కాపులు తీయుట మంచిది. కాపులు తీయునపుడు తడిలేమండ పాతిగుడ్డలో వేయించిన యినుకగాని, ఉప్పుగాని వేసి తీయవలెను. అవసరమున్నయెడల ఆవాల పట్టుగాని, లేక గురివిందాకు పసరులో సున్న కలిపిగాని, లేక సబ్బు సున్నము సమానభాగములుగా నూరి పట్టువేయుము.

## రక్తశూల

ఈ రోగము పశువు మెండుగ చెమటవలనను, ఎండలోను, వడగాడ్పులలోను పశువును పనిచేయించుట వలనను, వేడిని గలిగించు దాణాదినుసులను మేపుటవలనను, పశువులకు కలుగును.

---

కత్తెరపోటును కదలపారుతుంది.

## లక్షణములు

పశువునకు జ్వరము తగులును. గొంతునాళములు చాల వేడిగా నుండును. దేహము కృశించును. ముక్కులనుండి, నోటినుండి, ఆసనమునుండి నెత్తురు పడుచుండును. పశువు మేత మేయదు. ఒకవిధమైన శూల కలిగి పశువు చాల బాధపడుచుండును. మూల్గును. పండ్లు కొరుకును. రక్తము స్రవించినకొలది పశువు నీరసించును. నోరు దుర్వాసన వేయును. కాళ్లు పట్టివేయును. వ్యాధి ముదిరినకొలది పశువు నడువజాలదు. సరియైన చికిత్స చేయనిచో వెంటనే చనిపోవును.

## చికిత్స

ఈత గుంజు—అరవీసె, పంచదార—అర్ధసేరునవటాకు కలిపి ఒకసారి పెట్టుము.

లేక నేరేడుచెక్కరసము—అర్ధసేరు, ఆవుపాలు—అర్ధసేరు ఈ మోతాదు వంతున కలిపి రెండుసార్లు త్రాగించవలెను.

లేక ఆముదపువేళ్లు—2 గుప్పిళ్లు, పల్లేరువేళ్లు—2 గుప్పిళ్లు, దర్భవేళ్లు—1½ గుప్పెడు, కల్లువేళ్లు—3 గుప్పిళ్లు, నూరి కషాయము కాచి అర్ధసేరు ఆవుపాలలో కలిపి ఒకసారి త్రాగించవలెను.

లేక అర్ధసేరు గేదె మూత్రము రెండుపూటలు త్రాగించుము.

లేక ఆడగుఱ్ఱపు లద్దె గడ్డలో వేసి పిండగా వచ్చిన రసములో వేయించిన యింగువ తులము కలిపి ఒకసారి త్రాగించవలెను.

లేక ఉత్తరేణి ఆకుపసరు—గిద్దెడు, ఆవుపాలు—అరసోలెడు కలిపి అప్పుడప్పుడు పోయుచుండవలెను.

## హెచ్చరిక

ఈ వ్యాధిగల పశువును ప్రత్యేక స్థలమునందుంచవలెను. రక్తముకారు శరీర భాగములను పటిక లోషనులోగాని, మైలతుత్తు లోషనులోగాని కడుగవలెను. ఈగలను మూగనీయరాదు. అర్ధసేరు పెసరగుగ్గిళ్లలో అరసోలెడు పేరునెయ్యి కలిపి తినిపించవలెను. లేక అర్ధసేరు నూకలజావ త్రాగించవలెను.

---

భావాయపున్నకుడు పరగళ్ళు పచ్చపడుతవి.

# వాతరోగములు

## పదునైదవ భాగము

చ॥ నసియగు వన్నెతగ్గి జిగిచార నశించియు కప్పువేయగా
పసయునశించి దేహమును బాధచే సంకుచితంబు చేసెడిన్
పసరముజిక్కి పాదములు పట్టుచు వేయుచు బాధబొందెడిన్
మెసవుట తగ్గు కొన్నిటికి మేనుజిగుల్ మఱిహెచ్చియుండెడిన్॥




గీ॥ వ్యాధి ముదిరినకొలది వాయుగిల్లు
పాడి పశువుల కయినను పాలుతగ్గు
పేడవాసన జిగురుగా బెట్టుచుండు
వాతమందురు దీనిని నేతలెందు॥

---

కట్టెకోలు యేకాశికి కట్టెకంప కొట్టుకొస్తుంది.

రైతులలో చాలామంది మా పశువునకు వాతము చేసినది, ఏమియు తినుట లేదని మామూలుగా తదితరులతో చెప్పుచుందురు. వాతమను వ్యాధి దేనివలన వచ్చు చున్నదో, ఆలక్షణము లెట్లుండునో ఈ వాతములలో ఎన్నిరకములున్నవో, ఏయే వాతములలో పశువు లక్షణము లెట్లుండునో, ఏ ఆహార పదార్థములు తినినందువలన ఈ వ్యాధి వచ్చినదో మున్నగు విషయములు తెలిసికొనవలెను. వాత పిత్త కఫములు (త్రిధాతువులు) పశువులకు కూడ గలవు గాన ఈ విషయము ఇదివరకే తెలుపబడినవి గాన వివరముగా చూడుడు.

పశువులు తిను మామూలుఆహారముగాక అదనముగా బలముగలిగించు లొండంగి, పిల్లిపెసర, మినుము, కందిపొట్టు, శనగపొట్టు, తవుడు మున్నగునవి మితిలేనంత మేపుట వలనను, వేసవికాలములో పిల్లిపెసర పొలములలో పశువులనుతోలి మిక్కుటముగా తినిపించుటవలనను, ప్రత్తిగింజలు, మొక్కజొన్న పాలకండెలు, జొన్నపిండి, పాలు, మినపపిండి ఇంకా ఎన్నోన్నో రకరకాల పదార్థములు అలుకులు పెట్టినట్లుగా ఈ పశువులకు పెట్టుటవలనను తప్పక వాతము కలుగుచున్నది. ఈ రీతిగా మేపిన పశువులకు తగినంత వ్యాయామము ఈయకపోవుట వలనను, చలిగాలిలో, ఎండలో నుంచుటవలనను ఈ వాతము వచ్చును. గాన పశుప్రదర్శనములకు వెళ్లాలని అన్నము, గుగ్గిళ్లు, గారెలు బూరెలు, నెయ్యి మినపపిండి వగైరా మనిషివలె పశువునకుకూడ గారాబముగా పెట్టే వారున్నారు. ఇటువంటివన్నియు పెట్టి అరే! మాగిత్తకు కాళ్లుపట్టినవిరా! వాతము చేసినదిరా! అని చెప్పగానే 74వస్తువులు ఏ కొండలమీదవో, ఎవరు చెప్పినవో తీసికొని వచ్చి ముద్దకొట్టి నోటిలో పెట్టుదురు. ఇట్లు పెట్టుటవలన వస్తువుల గుణముల ననుసరించి లోపల జీర్ణించుకొలేక నోరులేని ఆ పశువు పడే బాధ భగవంతునకెరుక. కాబట్టి ఇట్టి పశువులకు జాగ్రత్తగా చికిత్స చేయించవలెను. ఇవన్నియు నా అనుభవములోని మాటలు గాన చెప్పవలసి వచ్చినది. ప్రదర్శనములకు వెళ్లవద్దనిగాని వాటిని మేపవద్దని గాని చెప్పుటకాదు. నేను స్వయముగా పై పదార్థములు పెట్టువారిని చూచితిని గాన తెలుపవలసినది. నేనుకూడ రైతుల మహాసభలలో ఈ విషయములగూర్చి ఉపన్యసించితిని గాన జాగ్రత్తగా మేపుదురుగాక.

## లక్షణములు

వాతమనునది పశువు దేహములో జీర్ణించిన రెండుమూడు సంవత్సరములకుకూడ రావచ్చును. ఆరంభదశలో నల్లకట్టు వేయును. ముఖ్యముగా నన్ను, డొక్కల భాగము ముడుచుకొనును. అగమేత మేయును. కాళ్లు పట్టివేయును. శరీరమంతయు మెరుపుగా నుండును. పేడ పలుచగాగాని, గట్టిగాగాని యుండి పులుసువాసన కొట్టుచుండును. మలబద్ధకముండును. జ్వరము హెచ్చుతగ్గులు నుండును. క్రమేపి పశువు క్షీణించుచుండును. కండ్లనుండి కొన్నిటికి పుసులు కారును. అప్పుడప్పుడు పండ్లు కొరుకుచుండును. పశువు

---

ఏరుముందా ఏర్వాకపున్నమ ముందా.

తన తలను కడుపుదగ్గర పెట్టుకొని విచారకరముగా నుండును. కొన్ని వెన్ను విరుగదు చుండును. అపానవాయువులుకూడ విడచుచుండును. క్రమేపి పశువు నీరసించి చనిపోవును.

## చికిత్స

ఆరంభములోనే ఎనిమాచేయుట మంచిది.

ఏరుపెసరాకు (పెరుసుగానుండును. ఇదియొక గుబురుతీగ: సముద్రపు ప్రాంతములందును కొండల ప్రాంతములందునుండును.) 8 వీసెలు, మంచినూనె 4 వీసెలు, సొంటి, పిప్పళ్లు, మిరియాలు 15 తులములు, తాటిబెల్లం 2 వీసెలు, ఉప్పు సోలెడు, దురంజివాము సవాసేరు కలిపి త్రొక్కి ఒకకుండలోవేసి పక్షముదినములు భూమిలో పాతిపెట్టి తీసి ప్రతిరోజు సవాసేరుమందును తినిపించిన చాలా బాగుగా పనిచేయును. ఇది నా స్వానుభవము.

లేక తమలపాకులు 50, ఇంగువ 2 తు, వెల్లుల్లి 4 తు. మెత్తగానూరి ఒకగొట్టము నువ్వులనూనెలో కలిపి రెండుదినముల కొక మోతాదువంతున వారము దినములు ఇచ్చిన తగ్గును.

లేక చేలాణికాకు (సేగుర్తాకు) పసరుసేరు, పసుపు 1 తు, ఇంగువ 2 తు, వెల్లుల్లి 8 తు, కురాసానివాము గుప్పెడు కలిపి రెండు దినములకొకసారి వంతున 10 దినములు పెట్టుము. లేక తేలికగా తగిలిన పశువునకు ప్రతిరోజు ఒక కొబ్బరికాయను నీటిలో త్రొక్కి పాలుతీసి ఒకసేరున్ను, సొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, ఇంగువ ఒక్కొక్కటి ఒక్క తులమువంతున కలిపి నాలుగురోజులు పెట్టిన తగ్గును.

లేక పచ్చి అల్లము 4 తులములు, ఉప్పు 6 తు, కొబ్బరిపాలు సేరు కలిపి పెట్టుము

లేక దుష్టపాకుపసరు అర్ధసేరు, కడుగు సేరు, ఉప్పు 4 తు, కలిపి పెట్టుము. నాలుగు మోతాదులీయుము. దినమున కొకసారి మాత్రమే.

లేక వెంపలివేళ్ల రసము అర్ధసేరు, కలిపిన సేరువంతున పదిరోజులు పెట్టుము.

లేక నల్లేరు నిమ్మకాయంత, ఇంగువ 1 తు, వెల్లుల్లి 4 తు, ఆముదపుపప్పు నిమ్మకాయంత నూరి సేరు కలితో పెట్టుము.

కాళ్ళు పట్టుపట్టినయెడల ఒకబిందె నీటిలో తురక వేపాకునుగాని, వావిలాకును గానివేసి కాచి కాఫీత్రాగునంత వేడినీటితో గుడ్డముంచి అప్పుడప్పుడు కొట్టుచు కొబ్బరినూనెలో హారతికర్పూరబిళ్లలువేసి కలిపి మర్దన చేయవలెను.

లేక మంచినూనెలో మండపసుపుకొమ్ము అరగదీసి పట్టించుము.

---

ఏలుముందా? ఏకాదశిముందా?

లేక కర్పూరతైలమునుగాని, వెన్న, పసుపు కలిపిగాని రాసి మర్దనచేసి వేడి కాపులు వేయవచ్చును.

ఈరీతిగా ఇంకను అనుభవముమీద చికిత్స లెన్నోగలవుగాన చేసికొనవచ్చును.

ఈ రోగముగల పశువులకు తేలికగా జీర్ణమగు పదార్థములను పెట్టవలెను. ఎండలోను చలిలోను యుంచరాదు.

## ఆంగ్లేయ చికిత్స

సోడా సాలిసైలస్ 2½ తు, పల్వీస్ జింజర్ 1 తు, మంచిబెల్లము 10 తు, కలిపి దినమున కొకపర్యాయము వంతున నాలుగురోజులు ఇచ్చిన తగ్గును.

## కీళ్లవాతము (Arthritis)

పశువులు చలిగాలిలో నుంచుటవలనను, మురికిగానుండు ప్రదేశములో కట్టుటవలనను, వాతము జీర్ణించిపోవుటవలనను ఈ వ్యాధి వచ్చును.

ఈ వ్యాధిలో జ్వరము తీవ్రముగానుండును. అన్ని అవయవములు వేడిగానుండును. ఆకలి దురుకుదనము తగ్గును. నడచుట కొంతమాత్రము యిష్టముండక పడుకొని మూల్గుచుండును. ఈ వ్యాధికి పశువు కొంకులదగ్గర వాచును. ఆ వాపు ఒక కాలునకుగాని నాలుగు కాళ్లకుగాని రావచ్చును. ఇట్టి సమయములో పశువును కదలనీయరాదు. వాపు భాగము వేడిగను గట్టిగను ఉండును. ఈ వ్యాధి దీర్ఘకాలమున్నచో పశువునకు జ్వరముండదు. ఈ వ్యాధి ఆవులకు ఆబోతులకు యున్న దూడలకుకూడ వచ్చును.

## చికిత్స

నల్ల ఉమ్మెత్తాకు పసరు అర్ధసేరు, నల్లమందు ¼ తు, పస 1 తు. కలిపి వాపులకు పట్టువేయవలెను. లోపలికి దురుకుదనము పుట్టించు ఆహారమునుగాని, మందునుగాని ఈయవలెను.

లేక అన్నభేది 1 తు, విషముష్టిగింజలపొడి 1తు, వాము 4 తు, నేలవేము 2 తు కలిపి, సేరు నీటిలోగాని, ముద్దగా వచ్చునంత తాటిబెల్లముతోగాని దినమున కొక మోతాదువంతున పక్షము దినములు పెట్టుచు వాపులకు కీళ్లపట్టులకు కర్పూరతైలము 6 తు, సబ్బు ⅜ తు, కొబ్బరినూనె 12 తులములు కలిపి మర్దనచేసిన తగ్గును.

లేక తాటిబెల్లము 2 వీసెలు, వెల్లుల్లి 6 తు, కొట్టుపసుపు 4 తు, సరంజీవాము 10 తు, ఇంగువ 4 తు, మునగచెక్కపొడి 10 తు, సన్నావాలు 4 తు, కలిపి మెత్తగా నూరి దినమున కొక పర్యాయము రెండునిమ్మకాయలంత ఉండను మందు వచ్చువరకు పెట్టవలెను. మలబద్ధకము లేకుండ చూడవలెను. నువ్వులనూనెలో చిత్రమూలమువేరు

---

కర్కాటకపు వర్షమునకు కాడిమోపు తడియదు.

అరగదీసి కీళ్లవాపులకు పట్టించుము. లేక జిల్లేడుపాలు 1 భాగము, వెన్న 6 భాగములు, పసుపు అర్ధభాగము కలిపి వాపులకు రుద్దవచ్చును.

లేక వావిలాకు గుప్పెడు, నేలవేము ఆకు అరగుప్పెడు, వేపాకు గుప్పెడు తెచ్చి మెత్తగా నూరి దానిలో అరతులము పసుపు కలిపి కాఫీ త్రాగునంత వేడినీటితో దినమున కొక మోతాదువంతున వ్యాధి తగ్గువరకు పెట్టవలెను.

ఈ వ్యాధి దీర్ఘముగా నున్నచో ఎక్కువకాలము పై మందులను వాడవచ్చును. వాత సంబంధమగు ఆహారములు పెట్టరాదు. మందులకు తగ్గనిచో రక్షలు వేయవలెను.

## ఎండువాతము

చం॥ మలములో మార్పుగన్పడును మత్తుగా మేయును మందగించు నా
కలియును కొన్ని యాకటను(గాలుచు మేయుచు చిక్కిపోయెడిన్
పలుచగకొన్ని బారెడిని వాసన దుర్భరమై చెలంగెడిన్
పొలముకు బండిగట్టినను బోరున బారిననట్టి దీనినే
ఎలమిని యెండువాతమని యేర్పడజెప్పిరి పెద్దలెంతయున్॥

ఈ రోగమెల్లప్పుడు శరీరము వేడిగానుండు పశువులకును, అజీర్తివలనను, మూత్రము జారీయగుటవలనను, నరములలో పటుత్వము లేకపోవుటవలనను, దాణాలు, ఇష్టమువచ్చిన మందులు బలము కలుగజేయుననుయుద్దేశ్యముతో పెట్టుటవలనను, ఎంత మేసినను నిస్సత్తువగా నుండి బరి ఎముకలు కనబడుటవలనను, మేత, నీరు పెట్టి వెంటనే బండి కట్టుటవలనను, ఈ వ్యాధి రాగలదు. దీనినే పెంటికకల్లు, అజీర్తివాత మందురు.

## లక్షణములు

పశువునకు లోపల మామూలు వేడికంటె ఎక్కువగా నుండును. పేడను కొన్ని రోజులు గట్టిగను, మరికొన్నిరోజులు పలుచగను వేయుచుండును. ఈ రోగముగల పశువులను నేను చాల పరీక్షించితినిగాని వ్యాధి ముదిరిన లాభము కన్పట్టదు. కొన్ని, శరీరము శుష్కించుచు బండి కట్టినపుడు పారుచుండును. మరికొన్ని వ్యాధి ముదిరిన కొలది శరీర పటుత్వము ఎడతెగక పారుచుండును. ఈ పారుడు వెనుకకాళ్ల కొంపలకు తోకకు, ముడ్డికి అంటియుండును. పారుడులో బుడగలుండి నలుపురంగుగా నుండును. మలము పులుసువాసన కొట్టును. రైతు లన్నిరకాల చికిత్సలు చేయుదురు. పారుడుపుట్టిన తరువాత లాభముండదు. కృశించి నెమ్మదిగా చనిపోవును.

---

కర్కాటకము బిందిస్తే పర్పాటకము పండును.

## చికిత్స

ఈ వ్యాధికి అనేకమంది అనేక చికిత్సలు చేయుదురు. తాత్కాలికముగా ఏతుమ్మ చెక్కయో ఏ నేరేడు చెక్కయో నీటిలో త్రొక్కి చిక్కనిరసము నాలుగైదు పర్యాయములిచ్చిన తగ్గునుగాని మరల యధాప్రకారముగా పారుచునే యుండును. రైతులకు కూడ విసుగుపుట్టును. అందుచేత ఆరంభములోనే జాగ్రత్తగా చికిత్స చేయవలెను.

ఆరంభములో వేయించిన ఉలవపిండి మంచెడు, తాటిబెల్లం 4 వీసెలు, అల్లం 8 తు, మారేడు పండ్లపొడి 20తులములు, ఇంగువ 10 తు, వెల్లుల్లి 8 తు కలిపి త్రొక్కి కలిపి ప్రతిరోజు కొబ్బరికాయంత పరిమాణము పెట్టవలెను.

లేక సేరు ఆవుపాలలోగాని, మేకపాలలోగాని సవాసేరు తెలికపిండికలిపి ఒక పూట నాననిచ్చి తులమున్నర పసుపుకలిపి దినమున కొకమోతాదువంతున పక్షము రోజులు పెట్టుము.

లేక తమలపాకులు 100, ఇంగువ 1 తు, పసుపు 1 తు, మారేడుపండ్లగుజ్జు 2 తు. కలిపి నూరి దినమునకొక మోతాదువంతున 10 దినములు పెట్టవలెను.

లేక చేగొణి ఆకురసము అర్ధసేరు, పాలు అర్ధసేరు, పసుపు 1 తు, ఇంగువ 1 తు కలిపి దినమున కొక మోతాదువంతున వారము దినములు పెట్టుము.

ఇంకను అనుభవముమీద ఎన్నో చికిత్సలు చేయవచ్చును. పై మందులను వాడునపుడు కొంత కాలము పశువులకు విశ్రాంతి నీయవలెను.

## ఆమవాతము

దీనినే శీతవాతమందురు. పశువు కార్జము మూత్రగ్రంధులు సరిగా పనిచేయక పోవుటవలనను, ఉలవలు నానపోసి ఉబ్బి మోతాదుకంటె ఉడికితో కలిపి పెట్టుటవలనను, తవుడును మితిమీరి పెట్టుటవలనను, అజీర్ణలో దాణాదినును హెచ్చువగా పెట్టుటవలనను, విషసంబంధమగు పదార్థములు పెట్టుటవలనను, ఈవ్యాధి రాగలదు.

## లక్షణములు

జ్వర మెక్కువగానుండును. చిన్నకీళ్ళు అస్వస్థత నొంది బాధగా నుండును. పశువు మందమతిగా నుండును. విరేచనములు తెలుపు పసుపు రంగుగా నుండును. కడుపునొప్పికూడ కొన్నిటికి యుండును. ఈవ్యాధి రాత్రులయందు హెచ్చువగానుండును. మూత్రముతో వీర్యముకలసికూడ పడుచుండును. అప్పుడప్పుడు కడుపుబ్బగముండును. ఈ వ్యాధి ముదిరినకొలది పారుడు పులుసువాసనగా నుండును. డొక్కలు దించుకొని నీరసము జెంది చనిపోవును.

---

కర్కాటకం బిందిస్తే పేరికాటకం బందు.

## చికిత్స

విరేచన బద్ధకముగానున్నయెడల ఆముదము సేరు, అల్లం 4 తులములు కలిపి పోయుము. తరువాత కరక్కాయబెరడు 10 తులములు, తాటిబెల్లము వీసె, పసుపు 6 తులములు, ముద్దకర్పూరము పావుతులము కలిపి త్రొక్కి వెలగకాయంత వంతున ప్రతిరోజు పెట్టుము.

లేక అల్లము 2 తులములు, పసుపు 2 తులములు, మెంతిపిండి 4 తులములు, పులిసిన మజ్జిగలో కలిపి దినమునకొకసారివంతున వారముదినములు త్రాగించుము.

లేక వాము గుప్పెడు, పచ్చిపసుపు 4 తులములు, సొంటి 3 తులములు, వెల్లుల్లి 3 తులములు కలిపి త్రొక్కి సేరు గోరువెచ్చని నీటితో కలిపి త్రాగించుము.

లేక ఉదయమున అర్ధసేరు పాలలో 2 తులముల సొంటిని కలిపి నాలుగు దినములు త్రాగించుము.

## శిరోవాతము

ఈ వ్యాధి జలుబువలనగాని, వర్షాకాలములో మాగాని పొలములలో దమ్ము చేయుటవలనగాని, పచ్చిగడ్డి దొరకనపుడు తవుడు, చిట్టు మన్నగు దాణాలు ఎక్కువగా పెట్టుటవలనగాని, ఈ వ్యాధి రావచ్చును. లేతపశువుల కెక్కువగా సోకును. ఈ వ్యాధి శిరస్సులో పుట్టుటవలన శిరోవాతమని పేరువచ్చినది.

## లక్షణములు

ఆరంభములో పశువునకు వేడి తక్కువగా నుండును. చెవుల మొదటిభాగమందు వేడిగను, చివరభాగమందు చల్లగను ఉండును. ముక్కులనుండి ద్రవమువంటి పదార్థము కారుచుండును. అప్పుడప్పుడు కండ్లనుండి నీరుగార్చును. నల్లకప్పువేయును. కొమ్ము పట్టివేయును. వ్యాధి ముదిరినకొలది శుష్కించి ముక్కులనుండి వచ్చు ద్రవము చిక్కగా నుండును. ఆగమేత మేయును. నాలుకతో ముక్కులనుండి వచ్చు ద్రవమును నాకుచుండును. నీరుకూడ సరిగా త్రాగదు. నాలుక తెలుపుగా నుండును. ఈ వ్యాధి సెలరోజులవరకుకూడ యుండును. క్రమేపి కొమ్ము డొల్లలుగాగాని కొమ్ము మొదగాగాని చేరవచ్చును.

## చికిత్స

ఆరంభములో ముక్కులనుండి వచ్చు ద్రవమును పరీక్షింపవలెను. ఏదే ఆహారము పెట్టినది? ఎంతకాలమునుంచియున్నది? పరీక్షించవలెను. తరువాత ఆవుపాలుగాని మేకపాలుగాని సేరు, వసపొడి 1 తులము, సొంటిపొడి 1 తులము కలిపి దినమున

---

మహాలక్ష్మమ్మ పండుగకు మాడెత్తుచలి.

కొక మోతాదువంతున పక్షముదినములవరకు పెట్టిన తప్పక తగ్గును. వాతవస్తువులను మాత్రము పెట్టరాదు. అప్పుడప్పుడు ముక్కురంధ్రములకు సాంబ్రాణిపొగను పట్టించుట మంచిది.

లేక వస 1 తులము, వెల్లులి 1 తులము, మస్సింటాకుపసరు 6 తులములు కలిపి రెండు చెవులలో పోసి కొమ్ములకు చెవులకు కట్టవలెను. ఈరీతిగా నాలుగుదినముల కొక పర్యాయము చేయుచు బలముగల ఆహారపదార్థములను పెట్టుచుండవలెను.

లేక వామింటాకు పిడికెడు నలిపి నీరుపిండి బిళ్ళగాచేసి తలకొమ్ములకు కట్టవలెను. ఈరీతిగా వారమురోజులు చేయవలెను

తలవగుగిల్లు, మడికూడు, వగైరా ఎక్కువగా పెట్టవలెను. ఇంకను విపరీతముగా ముక్కులనుండి నీరు కారుచున్నప్పుడు ముచ్చెనగుంటలో ఒకచుక్కగా కాల్చుట మంచిది.

## గర్భవాతము

పశువును మితిమీరి మేపుటవలనను, కందులు, శనగలు వడ్లు వగైరా పొట్టుతో నున్నపుడు ఆతురతతో తినుటవలనను, వరిపిలక, తొండంగి, పిల్లిపెసర ఎక్కువగా తినుటవలనను ఈ రోగమువచ్చును.

పశువు నల్లకప్పు వేయును. మలబద్ధకముగానుండి పేడ గట్టిగానుండును. జ్వరము కూడ నుండును. దగ్గు కొద్దిగానుండును. ముఖ్యముగా బొడ్డు పైకిలాగుకొని పోవును. నీరుడుకూడ ధారాళముగా పోయదు. మేత నీరు క్రమేపి మానును. డొక్కక్రింది భాగము వెన్నెముక భాగము ఉబ్బినముగా నుండును. కొన్ని పశువులు కాళ్లనుకూడ పట్టివేయును. ఈవ్యాధి 10, 20, 30 దినములవరకుండును. తగిన చికిత్సచేసిన వెంటనే తగ్గును.

## చికిత్స

గర్భకోశములో వాతముండుటవలన గర్భవాతమును పేరువచ్చినది. ఆరంభములో కటకరోహిణి 1 తు, ఉప్పు 6 తు, సొంటి 1 తు, మిరియాలు 1 తు, సారాయి 2 డ్రాములు, నూకలజావ సేరు కలిపి త్రాగించిన తగ్గును.

లేక వెట్టిపుచ్చకాయలు 40 న్ని కోసిన తరువాత పసుపు 10 తు, మరంజీవాము 10 తు, నల్లఉప్పు 4 తు, వేసి త్రొక్కి ఒక కుండలోవేసి నాలుగు దినములుంచి ప్రతి రోజు ఒక వెలగకాయంత ముద్దనుపెట్టిన తగును.

లేక వెల్లులి 15 తు, ఇంగువ 10 తు, సొంటి 4 తు, మరాసానివాము గుప్పెడు, పచ్చికసువు 10 తు, ఆముదపుపప్పు సోలెడు కలిపి త్రొక్కి నిమ్మకాయంత ఉండలు చేసి రేపుమాపు పెట్టిన తగ్గును.

---

దీపావళికి దీపమంతచలి.

లేక అల్లము 15 తు, వాము 10 తు, ఇంగువ 4 తు, ఉప్పు 15 తు, సోడాఉప్పు 10 తు కలిపినూరి దినమునకు 4 తులములవంతున సేరు వేడినీటిలో కలిపియిచ్చిన తగ్గును.

మలబద్ధకము గానున్న ఆరంభములో విరేచనములను ఈయవలెను. వ్యాధితగ్గువరకు తేలిక ఆహారపదార్థములను యిచ్చుచుండవలెను.

## నక్కవాతము

దీనినే నక్కోర్కు, జంబుకవాతము, కసిమిరి యందురు.

ఆ॥ వె॥ పసికిని దగ్గుతగ్గి పాడుపడుట కేత
నిచ్చగింప బాగునీడజూచు
నోరు చొంగకెంది నూత్నరూపంబందు
కసిమిరనగబరగు కాంచ ధరణి.

గీ॥ కోడిగ్రుడ్డంత సున్నము గుళికలోనగ
జేసి పూటకు నొక్కటి శీఘ్రముగను
యుక్తిచే పసుచయమ్ముల కొదవిరేని
నక్కవాతాదికమ్ముల నృక్కజేయు.

గీ॥ నీరుల్లి తాటిబెల్లము
నేరుపునను ద్రొక్కి పసికి నియతిగొట్టన్
తేరడచు నక్కవాతము
ఘోరపురోమాళి యొక్కసారిని దూలున్.

గాలివంటుకగిలి పశువు ఎండలో నుండుటవలనను, రక్తవృద్ధి తగ్గుటవలనను, జబ్బులో నీరసత్వ మెక్కువగా నుండుటవలనను, పేగులలో పురుగులుండుటవలనను, ఊపిరితిత్తులలో వేడిగాలి చేరియుండుటవలనను ఈ వ్యాధి వచ్చును.

## లక్షణములు

పశువు శరీరమంతా నలుపురంగుగనో, బూడిదరంగుగనో యుండును. కొన్నిటికి నక్క వెంట్రుకలవలె పొడుగగు రోమములు పుట్టి నిక్కబొడుచుకొని యుండును. ఎండలో నెంతమాత్రము నిలువలేక నీడకొరకు ఎదురు చూచుచుండును. పగర్పు

---

దీపములకు దీపాంతరందాటును.

ఎక్కువగా నుండును. కొన్ని పశువులు దీనముగా నుండి కృశించును. ఇట్టి పశువులను జాగ్రత్తగా కాపాడవలెను.

## చికిత్స

తంగేడు చిగుళ్ళు నాలుగు గుప్పెళ్ళు, నీరుల్లిపాయలు 10 తులములు, గోంగూర సవాసేరు, పయిడిప్రత్తిఆకు గుప్పెడు త్రొక్కి దినమునకొక మోతాదువంతున పక్షము దినములు పెట్టుము.

లేక నీరుల్లిపాయలు 25 తులములు, పచ్చిపసుపు 6 తులములు, తాటిబెల్లము 15 తులములు, కలిపి త్రొక్కి రోజువిడచి రోజువంతున పక్షముదినములు పెట్టుము.

లేక నాగులాకు 2 వీసెలు, తక్కుడాకు 1 వీసె, గోంగూర 2 వీసెలు, మంచి నూనె 1 వీసె కలిపి ముద్దజేసి దినమువిడిచి దినము పెట్టుము.

లేక కలబందగుజ్జు 15 తులములు, ఉలవపిండి అరసోలెడు, నీరుల్లిపాయలు సవాసేరు, కలిపి త్రొక్కి దినమునకొక మోతాదువంతున వారము దినములు పెట్టుము.

లేక పూటకు కోడిగ్రుడ్డంత సున్నము పెట్టుము.

లేక పసుపు 6 తులములు, తామరగుంపలు 1 వీసె, బెండవేళ్ళు 2 గుప్పెళ్ళు, పంచదార అరవీసె కలిపి 2శేర్ల పందినేతితోవండి వెలగకాయంత తీసికొని అర్ధశేరు గొర్రెపాలతో కలిపి పెట్టుము.

లేక పచ్చిగోంగూర 1 మణుగు, సొంటి 15 తులములు, మిరియాలు 10 తులములు, ఉసిరికపప్పు సవాసేరు, కలిపి ఒక బానలో వేసి భూమిలో 10 దినములు పాతి పెట్టి దినమునకొక కొబ్బరికాయంత పెట్టుము.

## తిమురువాతము

పశువుల శరీరముయొక్క నరముల వాపుదలవలన యీ వ్యాధి వచ్చును. ఈవ్యాధి ఉష్ణప్రాంతము లందుండు పశువులకు తరచుగా కలుగుచుండును. ఇంకను రక్తహీనత వలనను, చలిదోమ్మవలనను, శీతవాతమువలనను, చెమ్మతగులుటవలనను, సరిగా మేతమేపని పశువులకును యీ రోగము వచ్చును.

## లక్షణములు

కాళ్లు పట్టుపట్టి వంగకుండును. నడకలో తూలుచుండును. మన చేతితో ఆయా భాగములను తాకిన బండబారినట్లుండును. కీళ్లనొప్పులుండును. వ్యాధి ముదిరినకొలది శరీరము ఉబ్బును. ఇదియే చివరకు సంజూర్యాధరోనికి దింపును. నాడి నీరసముగా

---

తులాయాం జాయతేహిమం వృశ్చికాంతభివర్ధతే ధనుషీధనురాకారం మకరే
కుండలాకృతి : కుంభేశీతమశీతంవా మీనేశీత నివారణం.

నుండును. ప్రతి అవయవమునకు తిమ్మిరి అనగా బండబారినట్లు నొప్పిలేక యుండును. వ్యాధి ముదిరినకొలది విరేచనము తెల్లనై, అచ్చటచ్చట శరీరముపైన దద్దుర్లుపుట్టి చనిపోవును.

## చికిత్స

చేగొణితాకు అతివస, చేదుబీరాకు 4 గుప్పెళ్ళు, చేదుపొట్లాకు 3 గుప్పెళ్ళు, కరంజీవాము తోలెడు, ఇంగువ 6 తు కలిపి త్రొక్కి ఉండలుచేసి మునగచెక్కరసముతో కడిపి నిమ్మకాయంత మోతాదు రేపుమాపు పెట్టుము. కాళ్లవాపులకు నీరుల్లిపాయరసము, పచ్చిపసుపునూరి రాయుము. లేక మంచినూనె మండపసుపుకొమ్ము అరగదీసి రాయుము.

లేక అన్నభేది 2 తు, వేలవేము 1 తు, విషముష్టిగింజలపొడి 2½ తు, పసుపు 1 తు కలిపి సేరు బియ్యపునీటిలో కలిపి దినమున కొక మోతాదు త్రాగించుము. వాపులకు ఎల్లేరుచిగుళ్లతో పసుపు, హారతికర్పూరం కలిపి నూరి రాయుము.

## ధనుర్వాతము (Tetnus)

దీనినే ఈడుపురోగమనియు, ధనుర్వాయువనియు నందురు. ఈవ్యాధి చలిగాలి సోకుటవలనగాని, గాయపుసంధివలనగాని, పశువునకేమైన అపాయమైన దెబ్బ తగిలినపుడు ఏ అవయవమైన విరిగినపుడుగాని, ఇదివరకు ఏమైన శరీరముమీద పుండ్లు, వ్రణములు, గాయములు, మున్నగునవి యున్నపుడుగాని ఈ వ్యాధి సోకును. గాయములోనికి ఏమాత్రము దుమ్ము లేక మట్టి చేరినను వెంటనే ఒకవిధమగు సూక్ష్మజీవులు అందులో ప్రవేశించి పశువునకు ప్రాణాపాయము కలిగించును. కాబట్టి పశువునకేమైన దెబ్బతగులుట, విరుగుట, చలిగాలిలో, వర్షములో నుంచుట మున్నగునవి కలిగినపుడు వెంటనే ఆ గాయమునకు దుమ్ము, మట్టి వగైరాలు కలుగకుండ కాపాడవలెను. అట్లు దుమ్ము వగైరాలు దూరినచో వెంటనే ఎలెక్ట్రిక్కుతీగవలె రక్తములో నున్న నరముల సముదాయముల కేగినవెంటనే ప్రాణాపాయము కలుగును. పాడిపశువులకు, లేతపశువులకు, దూడలకు తరచుగా వచ్చుచుండును. దూడలకు మిన్నల్లులు పట్టుటవలన కొవులు పొడిచి పెద్దపుండ్లు చేయుటవలనకూడ ఈ వ్యాధి రావచ్చును. శస్త్రచికిత్స చేసినపుడుకూడ ఈవ్యాధి రావచ్చును.

## లక్షణములు

పశువును కదలించినచో చాలా కష్టముగా కదలును. లోపల జ్వరముండును. నోటివెంట చొంగపడుచుండును. మనము తలను లేపినయెడల వెంటనే పశువునకు వణకుబుట్టి ఈడ్పులు (ఈలుకలు) గలుగును. వ్యాధి ముదిరినకొలది మెడ, దవుడలు, బిగిసికొనిపోవును. క్రమేపి వ్యాధి ముదిరినకొలది కాళ్ళు వగైరా బిగదీసికొనిపోయి

---

పశువు విల్లువలె వంగిపోయి ముఖము ముడుచుకొనిపోయి వికృతాకారముగా నగును. ఱెప్పలు అన్ని అవయవములకు సోకి ఆయాసమెక్కువై పశువు మరణించును.

## చికిత్స

దవుడలు బిగిసికొనిపోయి గుటకవేయనిచో లాభములేదని గ్రహించవలెను.

కర్పూరము 2 తు, పరిగంజి సేరు, ఇంగువ 4 తు కలిపి త్రాగించి అన్ని అవయవములకు తవుడుతో గాని ఉప్పుతో గాని వేడికాపులు వేయుము.

లేక మూడుడ్రాముల సారాయిలో అరతులం కర్పూరం కలిపి త్రాగించుము.

లేక నవాసాగరము 3 తులములు తీసికొని సేరు వేడినీటిలో కలిపి త్రాగించుము.

లేక పుగాకురసము అర్ధసేరు, నల్లేరురసము పావుసేరు కలిపి త్రాగించుము.

లేక 10 కోడిగ్రుడ్లలోని తెలుపుసొనయు, సేరుసున్నపుతేట కలిపి త్రాగించుము.

లేక కుంకుడుకాయనురుగునీరు కలిసినది సేరు త్రాగించుము.

లేక మీ సమీపములో ఇంజెక్షన్సు యిచ్చేడాక్టరున్న ధనుర్వాతపు ఇంజెక్షన్సు యిప్పించుము.

## అండవాతము

మూత్రగ్రంధు లస్వస్థతవలనగాని, పశువునకు మిగుల వాతము చేయుటవలనగాని సత్తువాతమువలనగాని, బుడ్డకొట్టిన తరువాత సరిగా నలుగకపోవుటవలనగాని ఈ వ్యాధి వృషణములకువచ్చును.

## లక్షణములు

పశువుపట్టలు రెండును ఎగుడుదిగుడుగావుండి వాపువచ్చియుండును. ఈ వాపునే అండవాత మందురు. మూత్రముతో అప్పుడప్పుడు వీర్యము పడుచుండును. నొప్పిమీద మనము చేతితో తట్టినయెడల పశువునకు చాలా బాధగానుండును. వ్యాధి ముదిరినకొలది పట్టలువాచి బాధగానుండును. మూత్రము ఎక్కువగనే పోయుచుండును. వాపు వేడిగా కాంతిగానుండును. వాపు మాగినకొలది ఒకవిధముగు చెముడుచేరి నరములులాగి కనుగుంటలు విడిచి మరణమునకు సిద్ధమగును.

## చికిత్స

ఆరంభములో 'ఆముదము సేరు, ఎండుమిర్చిపొడి 6 తు, ఉప్పు చేరెడుకలిపి కాచి గోరువెచ్చగానున్నపుడు త్రాగించవలెను. ఆమరునాడు కల్లుబెల్లము ½ వీసె, ఎండుమిర్చి 10 తు, వెల్లుల్లి 10 తు, కురంజీవాము 4 తు కలిపి త్రొక్కి రేపుమాపు వెలగకాయంత పెట్టుచు, వాపునకు కర్పూరతైలముకుగాని, కొబ్బరినూనెలో హారతి

కర్పూరము కలిపి గోరువెచ్చగాచేసి గాని అప్పుడప్పుడు రాయుచు వేడినీటి కాపులు తీయవలెను.

లేక విషముష్టి గింజలపొడి 2 తు, అన్నభేది 1 తు, సోడాఉప్పు 1 తు, కరాసానివాము 4 తు, ఇంగువ 2 తు కలిపినూరి సేరు వేడినీటిలో కలిపి త్రాగించుచు కాపులకు కవిరి 1 తు, వస 1 తు, సబ్బు 2 తు, పసుపు 2 తు మెత్తగానూరి 10 తులముల మంచి నూనెలో కలిపి రాయుము.

## పక్షవాతము (Paralysis)

చం॥ పశువుల పృష్ఠభాగమున బాధజనింపగ వాతమొందియున్
పసియగు వన్నెతగ్గి జిగిచాల నశించియు తూలుచుండగా
నిశితపు జూపులం బఱప నేర్చిన వైద్యులు కాల్చిరంతటన్
మసలక మూత్రకోశమును మ్రగ్గగ వాతముజెంది నీల్గెడిన్॥




### స్వభావము - వ్యాపకము

మెదడు యొక్క అస్వస్థతవలనను, మెదడునకు నరముల సముదాయమునకు దెబ్బతగిలినపుడు, చెవినరములకు ఒత్తిడి కలిగినపుడు, వెన్నెముకకు హానికలిగినపుడు, విషవస్తువులు తినినపుడు, ఎండలోను వర్షములోను పనిచేయించినపుడు, విపరీతమైన వాతముచేసినపుడు, చలిగాలిలోను మంచులోను ఎక్కువగా పనిచేయించునపుడు, తదితర

---

కార్తీక మాసమునకు కడవరి వానలు.

కారణములవలన ఈరోగము వచ్చును. ముఖ్యముగా ఈరోగము శీతాకాలములో దుంచి ఎద్దులకు, దూడి ఆవులకువచ్చును.

## లక్షణములు

పశువుశరీరపు సగభాగముగాని, పశువు వెనుకభాగమునకుగాని, ముందు కాళ్ళకు గాని, ఒకచెవికిగాని, ఒకకన్నునకుగాని, తలకుగాని, శరీరమంతటికిగాని, నాలుకకుగాని ఈవ్యాధి రావచ్చును. ఒకరైతు దొడ్డిలో ఈరోగముచేతనే ఒక్కపర్యాయమే పది పశువులకు సోకినది. వీనికన్నిటికి వెనుక తొడలు, కాళ్ళు, ముడ్డిపూసక్రిందిభాగము సోకి నాలుగుదినములు కొన్ని, వారముదినములుకొన్ని పక్షముదినములుకొన్నియుండి చికిత్సల వలన తగ్గినవి. కాబట్టి ఈవ్యాధి తేలికగా తగిలిన పిట్టవాలినదని వాతలు, యంత్ర ములు వేయుదురు. ఈ యంత్రమువలననే తగ్గినదనుకొందురు. మరికొన్నిటికి తాత్కా లిక చికిత్సలవలన, వాటితత్వమువలన కొన్నిటికి తగును. కాబట్టి జాగ్రత్తగా పశువును పరీక్షించి ఏ ఏ భాగములకు, ఏ ఏ లక్షణములతో సోకి బాధపడుచున్నదో చికిత్స చేయవలెను.

## చికిత్స

ఏ అవయవమునకు ఈ వ్యాధిసోకినదో కనుగొనుటకు ముందుగా ఒక సూదితో ఆ అవయవమును తేలికగా పొడువవలెను. అట్లుపొడిచినపుడు పశువునకు నొప్పి యున్నట్లు అలుకుచున్నదా లేక తిమ్మిరియెక్కినట్లున్నదా? ఆ తిమ్మిరి ఏ అవయవము వరకుయున్నది? ఎంతకాలమునుంచి పశువునిలుచుండుటలేదు? ఏ కారణమువలన సోకి నది? తేలికగా తగిలినదా? ఎక్కువగా తగిలినదా? మేతతినుచు వెనుక భాగము లేప లేకుండనున్నదా? మున్నగు లక్షణములు గ్రహించి చికిత్సకు ప్రారంభించవలెను.

ఈ వ్యాధితగిలిన వారము రోజులలో పశువు లేవలేకపోయినచో ఆపశువు బ్రతుకుట కష్టమని గ్రహించవలెను. వారమునుంచి నెలదినములవరకు భాధపడి, అవయవములు, మూత్రకోశముత్రుళ్ళి బాధపడి చనిపోయినవికూడగలవుగాన జాగ్రత్తగా ఆలోచించి చికిత్స చేయవలెను. ఒకదొడ్డిలోనే పదిపశువులు పడుకొనినవి. అదికూడ అంటుసంబంధమైన వ్యాధియని నేను గ్రహించి చికిత్సచేయగా తగ్గినవి.

ఆరంభములో విరేచన మగుటకు మందీయవలెను. తరువాత నేలవేము 1 తు, కరంజీవాము 2 తు, సోడాఉప్పు 1 తు, మంచిగంధపుపొడి ½ తు, నల్లఉప్పు 1 తు కలిపి మెత్తగానూరి ఉదయమున సేరునీటిలో కలిపి త్రాగించవలెను. సాయంకాలము 7 గంటలకుఆవుపాలుగాని గేదెపాలుగాని సేరు,రావిచెక్కపచ్చిరసము అర్థసేరు,కస్తూరి, పసుపు 1 తు కలిపి త్రాగించవలెను. అప్పుడప్పుడు తెలికపిండిని నేతు మజ్జిగలో నాన వేసి పెట్టవలెను.

---

కార్తీకనెలతో వర్షము, కర్ణునితో యుద్ధము సరి.

లేక శుగిలము 15 తు, పొంగించిన వెలిగారము 10 తు, కస్తూరి పసుపు 15 తు, కలిపిత్రొక్కి సేరున్నర మునగచెక్కరసముపోసి నిమ్మకాయంత ముద్దలుచేసి రేపుమాపు మందు వచ్చువరకు పెట్టవలెను.

పిట్ట వాలినదని అనుమానములో నున్నపుడు గరుత్మంతుని పాదపు ఆకారముగా వెనుక భాగముమీద పసుపుతో యంత్రము వేయవచ్చును. కాల్చుదురు. యంత్రము వేసిన రెండు దినములలో పశువు లేవలేకపోయిన ఆ పశువునకు నెమ్మదియగుట చాలా కష్టము. కొన్ని చూడిపశువులకు ఈవ్యాధి వచ్చిన తరువాత ఈనిన వెంటనే తగ్గుటయు గలదు.

స్పర్శలేని అవయవములకు మంచినూనె సవాసేరు, జిల్లేడాకులరసము పావుసేరు, జిల్లేడు వ్రేళ్లరసము పావుసేరు, జిల్లేడు పువ్వులరసము పావుసేరు కలిపినూరి తడి యిగురువరకు కాగబెట్టి దింపి చల్లార్చి ప్రతిరోజు మర్దనచేయుచు లేవుడు వేయించిగాని, యిసుక వేయించిగాని అప్పుడప్పుడు వేడికాపులు కాయవలెను.

ఈవ్యాధికి వాతలు వేయుటవలన లాభము లేకపోగా పశువు మరణమునకు సిద్ధమగును. ఇంకను తేనెటీగల మైనము 20 తు, మంచినూనె 20 తు, కలిపి గోరువెచ్చగా కాచి అందులో అరతులము నల్లమందు, 4 తులముల హారతికర్పూరం కలిపి చలనములేని భాగములకు మర్దన చేయవలెను. ఈరీతిగా అనుభవముమీద చికిత్సలు చేసికొనవచ్చును.



కార్తీకం తల్లవేని కాపానివలయును.

# పశునేత్రచికిత్స

## పదిఆఱవ భాగము

నేత్రములలో యే మాత్రమైన వేదన కలిగినవపుడు మోతాదులు ఎక్కువ తక్కువలు గాకుండా మీ పశువైద్యులను కనుగొని జాగ్రత్తగా చికిత్స చేయవలెను.

నేత్రవ్యాధితోనున్న పశువును చలిగాలిలో నుంచరాదు. కంటిమీద ఈగలను వ్రాలనీయరాదు.

నీ పశువుకంటికి చికిత్స చేయించుటకు ఆరంభములో యే వైద్యునిచే చికిత్స చేయించుచున్నావో, అతనిచేతనే చికిత్స చేయించవలెనుగాని అందరి సలహాలడిగి అన్ని మందులు తీసుకొనివచ్చి పశువుకంటిలో పెట్టరాదు. నీకంతకు పెట్టవలెనని కోరిక యున్నచో ఆరంభమునుండి చికిత్సచేయు వైద్యునిసలహా నడిగి చేయుము.

పశువు దేహమునకు వ్యాధి కలిగినపుడు సామాన్యముగా పన్నెరొతులలో పది మందిచెప్పిన చికిత్సలు చేయుదురు. కాని కంటిజబ్బులవిషయమై అట్లు చికిత్సలుచేసిన తప్పక ముప్పు వాటిల్లును.

నేత్రవ్యాధిగల పశువునకు పెట్టుమేత సులభముగ జీర్ణమగునదిగను, సారవంతమగు నదిగను, చలువచేయునదిగాని నిస్సారమైనదిగను, తుక్కుగడ్డి, మక్కుజొన్నగడ్డి మొదలగు నవి యేమాత్రము మేపరాదు.

కంటిమీదను, లోపలనుండు భాగమును శుభ్రముగ నుంచవలెను. ప్రతిదినము ఉదయసాయంకాలములు పటికలోషనుతోగాని, మైలతుత్తము లోషనుతోగాని శుభ్రముగా కడుగు చుండవలెను.

నేత్రములకు శస్త్రచికిత్స చేసినపుడు కట్టినకట్టులలోపలకు గాలి దూరకుండ గట్టిగా కట్టుకట్టవలెను. ఆకట్టుకు గసి అంటుకొనినయెడల వేడినీటితో శుభ్రముగాకడిగి తర్వాత తగిన చికిత్స చేసి జాగ్రత్తతో కట్టుకట్టవలెను. గాలిమాత్రము సోకనీయరాదు.

### నేత్రము (The eye)

పశువుయొక్క జ్ఞానేంద్రియములన్నిటిలోను నేత్రములును శ్రోత్రములును మిక్కిలి ముఖ్యమైనవి. సమస్తేంద్రియములలో కన్ను ప్రధానమైనది. కన్ను పశువు యొక్క శరీరమున నుపయోగకరముగనుండు ముందుభాగమందు అనగా శిరస్సు యొక్క ముందరి భాగమునందుంచబడినది. వస్తువుయొక్క పరిమాణ రూపమును,

రంగును, స్థానమును తెలిసికొనుట కుపయోగించు యింద్రియ మిదియే. ఇది మృదువైన యింద్రియమగుటచే పశువు లజాగ్రత్తగ నున్నయెడల దీనికి భంగముకలుగును. ఇది ఒకసారి చెడిపోయిన యెడల దీనిని బాగుచేయుట దుర్లభము. కావున దీనిని కాపాడుటకు సృష్టియందే భగవంతుడు కొన్ని యేర్పాటులు చేసియున్నాడు. కంటియొక్క నిర్మాణము బహు ఆశ్చర్యకరమైనది. పూర్వకాలమందుండిన ఒకవైద్యుడు దానిని పరీక్షించి చూచి సృష్టికర్తయగు దేవునిస్తుతించుచు నొకకీర్తన వ్రాసెనట. పశువు తనకంటి నన్నిదిక్కులకు త్రిప్పగలుగుటకు భగవంతుడు రెండుకన్నుల నేర్పరచియున్నాడు. దురదృష్టమువల్ల ఒక కన్నుపోయినను రెండవనేత్రము సహాయమగును. పశువుమూతి కిరుప్రక్కలను కనుగుంట లనబడు ఎముకలగూడులలో నేత్రగోళము లమర్పబడియున్నవి. ఎదుటిభాగమే గాక నేత్రముయొక్క మిగిలినభాగములన్నియు కనుగుంటలయందుండు ఎముకలచేత సంరక్షింపబడును. నేత్రగోళమునకు వేడిమి కలిగించుటకును, ఆమరుదెబ్బల వలన దానికి భంగము కలుగకుండునట్లు చేయుటకును దీనిచుట్టును క్రొవ్వుతో చేయబడిన మెత్తని పదార్థముండును. ఇంకను దీనియందు రక్తనాళములును, నీటి కాలువలును పోషణనిమిత్తము ప్రవహించుచుండును. కనుబొమలు కనురెప్పల చివరనుండు వెండ్రుకలు నేత్రముయొక్క ముందుభాగమును రక్షించును.

## కనుబొమలు, కనురెప్పలు (Eyebrows and Eyelids)

పశువు కంటిని కాపాడుటకు రెండుమూతలుకూడ నున్నవి. వానిపేరు కనురెప్పలు. సూర్యుని వెలుతురు తీక్ష్ణముగా నున్నప్పుడు కనురెప్పలు కన్నులను కాపాడును. నిద్రించువేళ నవి మూసికొనును. ఈ రెప్పలకొనలయందుండు వెండ్రుకలు నేత్రములకు నీడను, అందము నిచ్చుటయేగాక గాలిలో ఎగురుచుండు దుమ్ము, పురుగులు, పదార్థములయొక్క చిన్నచిన్న నలుసులు మొదలగునవి కండ్లలోనికి జొరనీయకుండ కండ్లను కాపాడును. కండ్లను బాగుగా కాపాడునవి కనురెప్పలు. ఇవి కంటికి పైభాగమం దొకటియు, క్రిందిభాగమునం దొకటియు నమర్పబడి యుండును. కంటియొక్క పైరెప్ప క్రిందిదానికంటె పెద్దదిగానుండి సుఖముగా కదల్చుటకు వీలుగానుండును. కంటిని మూయుట లేక తెరచుటయు ముఖ్యముగా పైరెప్పచేతనే కలుగుచుండును. కంటిచుట్టు నుండు గుండ్రని కండరసహాయముచే ఈ రెప్పలు మూతబడుచుండును. ఈ రెప్పల పైవైపున చర్మముతో కప్పబడి అడుగుభాగమున తడిచర్మముతో కూడియుండును. ఈ తడిచర్మము పశువు కనురెప్పలయొక్క అడుగుభాగమందుమాత్రమే యుండక వెనుకకు తిరిగి కనుగ్రుడ్డునుకూడ కప్పియుండును. కావున రెప్పల అడుగుభాగమునందును, కనుగ్రుడ్డుయొక్క పైభాగమందును, ఈ తడిచర్మమే యుండును. ఇంకను కంటిలో నీళ్ళతిత్తి యొకటిగలదు. దానిలోనుండి కన్నీళ్ళువచ్చి కంటి పైభాగమును తడిపి కంటిలో నేవస్తువైనను బడియున్నయెడల దానిని కడిగివేయును. కనురెప్పలమూలముగా కన్నీళ్ళు కంటిమీద వ్యాపించుచుండును. కనుబొమ్మ అనునది కంటిమీద విల్లువంపులాగున

---

దండి అమావాస్యకు వాన తాడు తెంపుకొనిపోతుంది.

వెంట్రుకలు నిండియుండుభాగము. కనుబొమ్మలు పశువుయొక్క నొసలునకు క్రిందుగను కంటికి పైవైపునను ఏర్పడియున్న వెంట్రుకలవరుసలు. ఇవి పశువుముఖమునకు అందము నిచ్చుటయేగాక నొసలునందు పుట్టు చెమటను కండ్లలోనికి రాకుండజేసి కండ్లను కాపాడు చుండును. కనురెప్ప ప్రక్కనుండు వెంట్రుకలు మిక్కిలి సూక్ష్మమైనవస్తువులు కంటిలో బడకుండ తప్పించుటయేగాక కంటికి నీడను అందమును ఇచ్చుచున్నవి.

## కనుగ్రుడ్డు (Eye ball)

పశువు కనుగ్రుడ్డు గుండ్రముగానుండును. ఇది కనుగుంట యనబడెడు ఎముక గూటిలో నమర్చబడియున్నది. అందువలన సాధారణముగా దీనికి దెబ్బతగులనేరదు. ఇది మిక్కిలి కోమలముగా నుండును. కావున దీనిని కాపాడుటకై కనుగుంటయందు ఒక విధమైన క్రొవ్వుపదార్థ ముండును. అది దిండువలె నేర్పడి గ్రుడ్డునకు అదరుదెబ్బ తగులకుండజేయుటయే గాక ఎముకలతో రాపిడికలుగకుండగను, గ్రుడ్డు నానావిధములు తిరుగుటకును, దానికి వేడిని కలిగించుటకు నుపయోగపడుచున్నది. కొన్ని పశువుల కను గ్రుడ్లు గుంటయందు లోతుగా నమర్చబడియుండక మెరకగానుండును. అందువలన కన్నులు పెద్దవిగా కనబడును. కనుగ్రుడ్లు సర్వదా కదుగపడుచుండుటకు కొన్ని విచిత్ర మైన ఏర్పాటులు గలవు. కనుగ్రుడ్డు బంతివలెనుండి చుట్టును ఆవరణపు పొరలను కలిగి యున్నది. దీనిలో పైభాగమునందుండునది పైపొర; దీనినే మనము తెల్లగ్రుడ్డని చెప్పు చున్నాము. దీనికి వెనుకనుండునది మధ్య పొర; ఇదినల్లగానుండుటవలన దీనిని నల్ల గ్రుడ్డని చెప్పుచున్నాము. పశువు కనుగ్రుడ్డుయొక్క పైపొర తెలుపురంగుగలిగి మిక్కిలి దృఢమైన నారవంటి పదార్థముతో చేయబడియున్నది. ఇది లోపలనుండు మృదువైన భాగములను కాపాడుచుండును. అన్ని పొరలలోను యిది గట్టిదగుటవలన ఇగి సాధా రణముగా బ్రిద్దలు కానేరదు. ముందరిభాగము కొంచెము గుండ్రము మేరతప్ప ఈ పొర కనుగ్రుడ్డునంతను కప్పియున్నది. ఇంకను ముందరిభాగమున ఉబ్బెత్తుగా కనబడును. పశువు కనురెప్పలెప్పుడును ఆడుచుండుటచేత నీ తెల్లగ్రుడ్డుయొక్క నునుపును దానిగుండ వెలుతురు పోనిచ్చు శక్తియు కాపాడబడు చుండును. కనురెప్ప లాడుచుండుటచేత తెల్లగ్రుడ్డు ఎప్పుడును తేమగానుండి శుభ్రము చేయుచుండును.

నల్లగ్రుడ్డు పశువుకంటిలోనుండు పైపొరకును లోపలి పొరకును నడుమ నుండును. దీనియందు నల్లని రంగుపదార్థముండుటచేత ఇది నల్లగానుండును. దీనినే నల్లగ్రుడ్డు అందురు. ఈ గ్రుడ్డు కంటికి రంగునిచ్చును. గవ్వకండ్లు, తేనెకండ్లు మొదలగునవి దీని వలననే కలుగుచుండును.

## కంటిలోని పువ్వులు (Ulcers)

### స్వభావము (Causes)

పశువు మెదడునుండి కంటిలోపలికి ఒకనరము (opticnerve) గలదు. అమిత మైన వేడిజేసి ఈ నరము చెడుటయుగలదు. అందువలన కంటిలో తెలుపుదనము కూడ ఏర్పడును. కంటిలో పువ్వువేసినయెడల నల్లగ్రుడ్డునందు ఒక తెలుపుమచ్చ యుండును. దీనినే పువ్వందురు. ఇంకను కంటికి దెబ్బతగులుట వలనను, చిన్నచిన్న నలుసులు కంటిలో పడుటవలనను, వాతరోగముండుటవలన అవి వెలుపలికి రాజాలక అక్కడనే యుండుటవలనను, వాతరోగమువలనను ఈవ్యాధి జనించును.

### లక్షణములు (Symptoms)

సహజముగ దీర్ఘచతురస్రాకారముగ నుండు కన్ను పుట్వోగ్రమునట్లైన గుండ్రని యాకారమునుపొంది కదలకుండును. ఏ వస్తువైనను దాటవలసివచ్చినచో కంటిలోపువ్వు గల పశువు అక్కడక్కడ నాగిపోవుచుండును. నడచునపుడు కాళ్ళను పైకి లేవు చూడును. మిఱ్ఱిమిఱ్ఱి చూచుచుండును. కొన్నివేళలలో పువ్వు అద్దమును పోలియుండును. అట్టిచో నేత్రములను మనము సామాన్యముగా గాజుకన్ను వాడుదుము. వెలుతురు చూచుట కష్టముగానుండి కండ్లవెంబడి నీరు గార్చుచుండును. దీనికి సకాలములో తగిన చికిత్స చేయనియెడల ఈవ్యాధి వృద్ధియై క్రమముగా చూపు తగ్గిపోయి అంధత్వముకూడ తటస్థపడును. మూడు లేక ఆరుమాసములవరకుయున్న కంటిపువ్వు తగ్గదని గ్రహించ వలెను.

### ఆయుర్వేదచికిత్స (Ayurvedic treatment)

పటికనీటితో కన్నుశుభ్రముగా కడిగి మిరియాలు ½ తు, పిప్పళ్లు ½ తు తెచ్చి కాటుకవలె చూర్ణముచేసి వ్యాసులైనులోగాని వెన్నలోగాని కలిపి నాలుగైదుదినములు ఉదయపుపూట కందిగింజంత పెట్టుచుండిన తగ్గును.

లేక వారము లేక నెలదినములు వయస్సుగల పసిబాలుని మూత్రముగాని, మలము గాని కంటిలో పెట్టుము.

లేక మూడునాలుగు ఇండుపుగింజలుకాల్చి పొడిజేసి అందులో సగభాగము పంచదారకలిపి దినమునకు మూడు నాలుగు పర్యాయములు కంటిలో పెట్టవలెను.

లేక దిరిసెనచెక్కరసము 2తు, ఉప్పు ¼ తు, మిరియాలు ¼ తు తెచ్చి నూరి రెండు దినములు కుడికంటిలో పువ్వయిన యెడల ఎడమచెవిలోను, ఎడమకంటిలో పువ్వయిన కుడి చెవిలోను పోయవలెను.

---

మబ్బువిడిచిన ఎండ, మొగుని విడిచిన ముండ.

లేక పండుగారకాయలోని గుజ్జున్ను, పాతచిల్ల పెంకున్ను పొడిజేసి చింతచిగురు నిమ్మకాయరసము మెత్తగా నూరి పైపొడి దీనిలోకలిపి కోడిఈకతో నేత్రములకు పట్టించుము.

లేక జిల్లేడుపాలు ఒకచుక్క కంటిలో వేయుము.

లేక మూర్గొండాకు పసరు, దొండాకు పసరు కలిపి ఎఱ్ఱగాజుపెంకు మెత్తగా నూరి వస్త్రకాళితము పట్టగా వచ్చిన పొడిని ఆ పసరులో కలిపి కన్నులకు కట్టవలెను.

లేక సీసము, కర్పూరశిలాజిత్తు సముపాళ్ళు తెచ్చి పొడిచేసి మెత్తగా నూరి వస్త్రకాళితము పట్టగా వచ్చిన చూర్ణమును, కురువి వపు చూర్ణమును కలిపి కంటిలో వేయుచుండుము.

లేక 2 తులముల సీసములో 10 దానిమ్మపండ్ల రసము పోసి కాటుకగా జేసి కన్నులకు పెట్టుము.

లేక పాలామిశ్రి $\frac{1}{4}$ తులము, ఖర్జూరకాయలు $\frac{1}{4}$ తు, గారకాయ $\frac{1}{4}$ తు, చిల్లగింజలు $\frac{1}{4}$ తు, మైలతుత్తము $\frac{1}{8}$ తులము కలిపి రెండుజాములు కాల్చి తీసి నేత్రములకు పెట్టుము.

లేక పొంగించిన పటిక $\frac{1}{8}$ తు. మైలతుత్తము $\frac{1}{8}$ తు. వెన్న 1 తులము కలిపి కన్నులకు పెట్టుము.

లేక దిరిసినపు విత్తుల పలుకులున్ను, కందిపప్పు పలుకులున్ను నిమ్మకాయ రసముతో అరగదీసిన గంధము మాటికి పట్టించి కంటిలో పెట్టుచుండవలెను.

లేక కొద్ది దొండాకు పసరున్ను, రెండు మిరియములు తెచ్చి నూరి కండ్లలో పెట్టవలెను.

లేక మండపసుపుకొమ్ము, ఉప్పుగల్లు, మిరయము తెచ్చి కాకరాకు పసరుతోగాని, అవిసెఆకు పసరుతోగాని కంటిలో పెట్టవలెను.

లేక పొగాకు, ఉప్పు రోటిలో వేసి మెత్తగా నూరి తెల్లనిగుడ్డలో వేసి కంటిలో పిండవలెను.

లేక దిరిసెనచెక్కరసము, మిరియాలు తగినంత తెచ్చి నూరి రెండుదినములు కుడికంటిలో పువ్వయినచో ఎడమచెవిలోను, ఎడమకంటిలో పువ్వున్నయెడల కుడిచెవిలోను పోయవలెను.

లేక సబ్బు, చీనాపంచదార మెత్తగానూరి కంటిలో పెట్టుము.

## ఆంగ్లేయ చికిత్స (Allopathic Treatment)

ఏ, బి, సి లోషన్ను వాడుము.

అనగా ఆలంలోషన్‌గాని, బోరసులోషన్‌గాని, సిల్వర్ నైట్రేట్ లోషన్‌గాని వాడుము.

---

సంక్రాంతిక చంకి లెత్తనివ్వదు.

## కంటిలోని పొరలు (Cataracts)

### స్వభావము (Causes)

ఈ వ్యాధి పశువుయొక్క కంటికి ఒకదానికిగాని, రెండుకండ్లకుగాని రావచ్చును. బింబముగుండ వెలుతురు పోదు. కనుక చూపు కనపడదు. అనగా కాంతిహీనమైన పొర కప్పియుండును. బింబముతియు పొరగప్పియున్నపుడు కొన్ని కిరణములు లోపలికి పోవుటచేత కొంచెము చూడగలిగియుండును. ఈ వ్యాధి పశువులకు మధ్య వయస్సులోగాని, ముదిమివయస్సులోగాని లేక తదితర వ్యాధులవలనగాని రావచ్చును.

### లక్షణములు (Symptoms)

పశువునకు మొదటిదినము కనుగ్రుడ్డుమీద సన్నముగా మైలపొర క్రమ్మియుండి మరుసటిదినమున ఈ పొరమీద మరియొక పొర క్రమ్ముకొని దళసరిగా కాన్పించును. ఈవిధముగా వారము దినములవరకు దినమున కొక పొరవంతున క్రమ్ముకొని గుడ్డంతయు తెల్లపడి తరువాత సన్నని పురుగులు ఆ గ్రుడ్డు పొరలలో ప్రవేశించి అటునిటు తిరుగుచుండును.

### ఆయుర్వేద (Native) వైద్యము

సబ్బు 1 తు, కలకండ 1 తు. తెచ్చి మెత్తగానూరి కంటిలో వారముదినములు పెట్టుము.

లేక పాలతుత్తము ½ తు. అమరశిలగంధకము ¼ తు. ఉంకుడుపప్పు ½ తులము తెచ్చి ఒక్కొక్కటి నూరి తరువాత నిమ్మకాయ పులుసు కలిపి కనగనింజంత కంటిలో పెట్టుచుండవలెను.

లేక వావుడాకు పసరులో కలకండ మెత్తనిది కలిపి కంటిలో వారముదినములు పెట్టుము.

లేక ఉప్పువావుడాకు పసరు వెన్నతో కలిపి రెండువేళల కంటిలో పెట్టవలెను.

లేక జీడిచమురు కోడిగ్రుడ్డుతో తేలికగా కంటిలో పెట్టుము.

### ఆంగ్లేయ (Allopathic) వైద్యము

సిల్వర్ నైట్రేట్ లోషన్ అప్పుడప్పుడు కండ్లలో వేయుచుండుము.

లేక అలంలోషన్ అప్పుడప్పుడు వేయుచుండుము.

## అవిరి (Ophthalmia)

### స్వభావము (Causes)

పశువులకు వాతరోగమువలనను, కోకరోగమువలనను, కండ్లకు అదరు దెబ్బలు తగులుటవలనను, మనుష్యులు రాళ్ళు మొదలగునవి పశువులమీద విసరునపుడు కంటికి

తగులుటవలనను, దుమ్ములోనుండు నలకలు పడుటవలనను, ఎప్పుడు చురుకుగానుండి బొల్లిమచ్చలు గలిగి సవారిచేయుటవలనను ఎద్దులకు ఈవ్యాధి రావచ్చును. దీనిలో తెల్ల అవిరి, కోడిజుట్టుఅవిరి, గ్రుడ్డుఅవిరి అనునవిగలవి. ఏజాతియైనను ఆరంభములో చికిత్స చేయవలెనుగాని ముదిరినతరువాత నేమియు లాభములేదు. అవిరికి సరియైన చికిత్సలు చేయక ఎల్లప్పుడు రోగపశువును పనిచేయించుటవలన మెరగుకరిగి కనుగ్రుడ్డు గ్రుళ్లిపోయి మూదగా నగును. కాబట్టి చాల జాగ్రత్తగా అవిరిచికిత్స చేయవలెను.

## లక్షణములు (Symptoms)

పశువు ఎండగాని, వెలుతురుగాని చూడజాలదు. కంటినుండి నీరు విస్తారముగా కారుచుండును. కన్ను రెపరెపలాడు చుండును. రెప్ప లావెక్కి క్రిందిపొర ఒత్తుబారి యుండును. ఇంకను రెప్పలమీద సన్నని పొక్కులుకూడ లేచును. కంటి గ్రుడ్డుమీద దుర్మాంసము పెరుగును. ఈ దుర్మాంసము కంటి లోపలినుంచి పుట్టును. ఇట్లు పుట్టిన మొదలు గ్రుడ్డు చెడినదని గ్రహించవలెను. దీనినే కంటిమూదయందురు. ఒక కన్నుచెడిన మరల రెండవకంటికికూడ రావచ్చునుగాన త్వరగా మేలుకొనవలెను.

## ఆయుర్వేద (Native) వైద్యము

పశువుకంటిలోపలిభాగమందును, రెప్పలలోను నుండు మలినపదార్థములను తీసివేసి పటిక నీటితో కండ్లను శుభ్రముగా కడుగవలెను.

తరువాత వాకుడాకు పసరు 1తు, వెన్న 2తు, ఉప్పు $\frac{1}{8}$ తు కలిపి ఉదయసాయం కాలములందు కంటిలో పెట్టవలెను.

లేక పేరిననెయ్యి 1 తు, పెంకుసోడి $\frac{1}{8}$ తు, ఆరటిదుంప రసము $\frac{1}{8}$ తు కలిపి కంటిలో 5 దినములు పెట్టుము.

లేక చిల్లగింజను తేనెతో అరగదీసి పచ్చకర్పూరముకలిపి కండ్లయందు పెట్టుము.

లేక ఉసరికపప్పు 1 తు, కరక్కాయపప్పు 1 తు, తానికాయపప్పు 1 తు. తెచ్చి మెత్తగానూరి నిమ్మపండ్లరసములో మర్దించి కణికలు చేసి నేత్రములలో పెట్టవలెను.

లేక కావిరాయి నీటితో అరగదీసి గుడ్డనుపట్టించి కండ్లపైన వేయుము.

## ఆంగ్లేయ (Allopathic) వైద్యము

| | | |
|---|---|---|
| హైడ్రోక్లోరేట్ ఆఫ్ కొకైన్ | $2\frac{1}{3}$ | గ్రెయిన్సు |
| మోర్ఫియా | $1\frac{1}{2}$ | గ్రెయిన్సు |
| డిస్టిల్డువాటరు | $1\frac{1}{2}$ | డ్రాములు |

ఈ మందును అయిదారు చుక్కల వంతున కంటిలో వేయుచుండవలెను.

---

మాఘమాసములో మాపులు వొంగుచుండవి.

### లోపలికి

మాగ్నీషియా ¼ పౌను, వేడినీరు సేరు కలిపి త్రాగించవలెను. కన్నులచుట్టు గ్లిసరిన్ అప్పుడప్పుడు రాయుచుండవలెను.

కన్ను మిక్కిలి బలహీనముగానున్న యెడల

| | | |
|---|---|---|
| సిల్వర్ నైట్రేట్ | 2 | గ్రెయిన్సు |
| లేక జింకుసల్ఫేటు | 3 | గ్రెయిన్సు |
| లేక ఆలం | 6 | గ్రెయిన్సు |
| నీరు | 1 | ఔన్సు |

కలిపి కొద్దిచుక్కలు అప్పుడప్పుడు కంటిలో వేయుచుండవలెను. లేక స్వచ్ఛమైన వేపనూనెను కొన్ని చుక్కలు వేయుచుండవలెను.

## కామెర్లు (Jaundice)

### స్వభావము (Causes)

ఇది పైత్య రస సంబంధమగు వ్యాధి. పైత్యరస మధిక మగునపుడు అది రక్తము లోనికి జేరి శరీరమునకును, కండ్లకును పసుపువన్నె కలుగజేయుచున్నది. ఈవ్యాధి కొలది కాలములలో తగ్గుటయు, లేక చాలాకాలముండుటయు గూడ గలదు.

### లక్షణములు (Symptoms)

కండ్లలోని తెలుపు, ఆకుపచ్చగాగాని, పసుపువర్ణముగాగాని యుండును. పశువు చర్మము నలుపురంగుతో కూడిన పసుపుఛాయ కలిగియుండును. పశువునకు జ్వరము సోకును. మందకొడిగానుండును. కొమ్ములమొదళ్ళుఎండి వేడిగానుండును. పేగులలో మలబద్ధక మేర్పడును. పశువు శరీరముపై దురదగూడ నేర్పడును. నాలుకమీద ఒకవిధమైన పొర గమ్మును. విరేచనము తెలుపుగాగాని, లేగడివర్ణముగాని యుండును. మూత్రము నల్లజేగురురంగుగానుండును. కన్నులువాచి నీరు గారుచుండును. ఆకలి ఎక్కువగానుండును. పశువు విచారముగా నుండును. నెమరు సరిగా వేయదు.

### ఆయుర్వేద (Native) వైద్యము

ముసాంబ్రము 2 తు, నేలవేము 1½ తు కలిపి బెల్లపు పానకములో నాలుగుదినములు కొకసారి యిచ్చుచుండవలెను.

లేక పిప్పళ్ళు ¼ తు, మిరియాలు ¼ తు మెత్తగా నూరి వెన్నపూసతో కలిపి కంటిలో పెట్టవలెను.

లేక ఉత్తరేణి ఆకుపసరు 4 తు, పెరుగు అర్థసేరు కలిపి నాలుగుదినములు ఉదయపుపూట త్రాగించవలెను.

---

ఫాల్గుణమాసములో వాన పడిపశులకు చెరుపు.

లేక ఊడుగచెట్టువేరు రసం 3 తులములు, మజ్జిగ అరసేరు కలిపి త్రాగించవలెను.

లేక గుంటగలిజేరాకురసము కాటుకగా జేసి కండ్లలో పెట్టుము. కన్నుగ్రుడ్డు మీద అవిరిపుట్ట పెరిగినయెడల శస్త్రము చేయవలసియుండును గాన మీ తాలూకా డాక్టరుగారికి చూపించుము.

## ఆంగ్లేయ (Allopathic) వైద్యము

అప్పుడప్పుడు బోరిక్ లోషన్ వాడుము. లేక అలంలోషన్ వాడుము.

## కంటిజబ్బు (Common Eye Disease)

### స్వభావము (Causes)

పశువు కంటికి గాయము తగులుటవలనను, శరీరములోపల వ్యాధి యేర్పడుట వలనను, కొరడాతో కంటిమీద క్రూరముగా కొట్టుటవలనను, రాళ్ళు, మట్టిగడ్డలు మొదలగునవి విసరునప్పుడు కంటికి తగులుటవలనను, పశువునకు సరిగా మేత మేపక ఉపవాసవ్రతములు చేయించుటవలనను, ఎల్లప్పుడు పశువు దీనముగా, విచారముగా నుండుట వలనను, తలపైన అదరుదెబ్బలు తగులుటవలనను, కండ్లను అవిరిపోటుచేతను, చెమట పట్టి కంటిలో దిగనుగుటవలనను కంటికి జబ్బు యేర్పడును.

### ఆయుర్వేద (Native) వైద్యము

కందిగింజలపై పొరతీసి సానమీద నీటితో అరగదీసిన గంధమును అప్పుడప్పుడు కంటిలో పెట్టుచుండుము.

లేక చిల్లగింజ తేనెతో గంధముతీసి పచ్చకర్పూరమును చేర్చి కంటికి పెట్టుము.

### ఆంగ్లేయ (Allopathic) వైద్యము

అలం 4 గ్రెయిన్సు, డిస్టిలువాటరు 1 ఔన్సు కలిపి కండ్లలో వేయుచుండుము.

మొదటిభాగమునకు క్యాస్టర్ ఆయిల్ మర్దన చేయుచుండుము.

లేక బోరిక్ ఆసిడ్ లోషనును ఉపయోగించుము.

## కంటితెలుపు (Amaurosis)

### స్వభావము (Causes)

వీటినే పిటికాను లందురు. పశువు కనుగ్రుడ్డునకు దెబ్బ తగులుట వలనను, వాతము, జలుబు రోగమువలనను, ఇంకను దుమ్ములోనుండు చిన్నచిన్న నలకలు మొదలగునవిపడి కంటిలో నిలవయుండుట వలనను కలుగు చుండును.

---

గల్బరీదు క్షారిపయషముచు దిబ్బలు కరుగును.

## లక్షణములు (Symptoms)

మొదట కన్ను ఎరుపెక్కి నీరు గారుచుండును. పోటుకలుగును. పుసులుకట్టును. వెంటనే తెలుపుపుట్టి క్రమక్రమముగా కన్నంతయు వ్యాపించును. తుదకు కన్నంతయు తెలుపురంగుగా నుండి గవ్వ ఆకారముగా నుండును. పశువు తక్కువసలాడును. మాటి మాటికి పశువు తన కంటిరెప్ప పైకెత్తుచుండును. ఎక్కువగా దెబ్బతగిలి తెలుపు పుట్టిన కంటియొక్క కనురెప్పలు మూసికొనిపోయి తెరచుటకు కష్టముగుచు వెలుతురును చూడ జాలక బాధపడుచుండును.

## ఆయుర్వేద (Native) వైద్యము

పశువును వెలుతురువచ్చు స్థలమునందుమాత్రము కట్టవలెను. మామూలుకంటె మేత తగ్గించి పెట్టవలెను.

సొంటి 1 తు, పిప్పళ్ళు 1 తు, మిరియాలు 1 తు మెత్తగానూరి వస్త్రఘాళితము చేసి తగినంత వెన్నతో కలిపి పెట్టవచ్చు.

లేక అయిదు పచ్చగాజులు తెచ్చి కాల్చి భస్మముచేసి నిమ్మకాయరసముతో నూరి కంటిలో పెట్టుము.

లేక ఏనుగకాలిగోరు నీటిలో అరగదీసిన గంధము కంటిలో పెట్టుము.

లేక శిలాజిత్తును శుద్ధిచేసి వెన్నతో కలిపి కంటిలో పెట్టవలెను.

లేక మిరియాలు 1 తు, అక్కలకర్ర ½ తు, లవంగాలు ½ తు, ఉప్పుడుబియ్యము 1 తు తెచ్చి నూరి నిమ్మకాయ రసములో కలిపి కోడియీకతో కంటికి రాయవలెను.

లేక పిప్పళ్ళు, సీసము, సీసాపెంకు సమానభాగములుగా తెచ్చి పొడిజేసి గొట్టములో పోసి పొరయూదుము.

లేక దినమునకు రెండుతులముల అల్లము వంతున వారము దినములు తినిపించుము.

## ఆంగ్లేయ (Allopathic) వైద్యము

సిల్వర్ నైట్రేట్ 2 గ్రెయిన్సు, డిస్టిలువాటరు 1 ఔన్సు కలిపి సీసాలో నుంచుకొని అప్పుడప్పుడు కంటిలో వేయుచుండవలెను.

లేక జింకుసల్ఫేట్ 3 గ్రెయిన్సు, డిస్టిల్డువాటరు 1 ఔన్సు కలిపి అప్పుడప్పుడు కంటిలో వేయుచుండును.

## కండ్లఎరుపు — నీరుకారుట ( Inflammation of the eye ball )

## స్వభావము (Causes)

రక్తరోగమువలనను, అతివేడివలనను, కండ్లలో ధూళి మున్నగునవి పడుటవలనను, విసుగు విరామములేక రాత్రింబవళ్ళు పనిచేయించుటవలనను, ఈ వ్యాధి పశువులకు

కలుగును. కొన్ని పశువులకు చిన్ననాటినుండియు విసువక కండ్లనుండి నీరుగారుచుండును. పశువు మొదటిలో పుట్టిన వ్యాధియే దీనికి కారణమైయున్నది. ఈ వ్యాధి వంశపరంపరముగ వచ్చుటయు కొన్ని పశువులలో కలదని కొన్ని పశువైద్యశాస్త్రములు తెలుపుచున్నవి. అధికవాతముగల పశువులకుకూడ నీరుగారుచుండును.

## లక్షణములు (Symptoms)

పశువునకు గుడ్డుపైపొర వాచి యెఱ్ఱబడును. కన్నీరు వేడిగా నుండును. కంటిలో ఎరుపుజీరలుకూడ యుండును. పశువు కన్ను మిక్కిలి ఎరుపుగానున్నచో వెలుతురును కూడ చూడజాలదు. ఇంకను పశువు మురికిగానున్నచో కొన్ని సూక్ష్మజీవులు కంటిలోనికి ప్రవేశించి పుసులు కట్టుచుండును.

## ఆయుర్వేద (Native) వైద్యము

పశువునకు వెలుతురు, ఎండ అంతగా తగులనీయరాదు. కండ్లను ఉదయవేళల యందు వగరునీటితో కడుగుచుండవలెను. పశువుకన్నులు మిక్కిలి ఎరుపుగానున్నచో 30, 40 తులముల ఆముదమును త్రాగించుము.

లేక కందిగింజల గంధము కండ్లలో రెండువేళల పెట్టుము.

లేక పశువు మాడుపట్టున ఆముదముకాచి రెండుమూడు దినములు పెట్టుము.

లేక పొంగించిన పటిక అరతులము తెచ్చి దానిలో సూక్ష్మముగా నల్లమందు వేసి చింతాకురసముతో కాలవేసిన వేడిపారమీద మర్దనచేసి కండ్లకు పెట్టుము.

## ఆంగ్లేయ (Allopathic) వైద్యము

యల్లో ఆయింటుమెంటు దినమున కొకసారి కంటిలో పెట్టుము.

# కన్నులు పుసులు కట్టుట

## స్వభావము (Causes)

పశువును విసుగు విరామములేకుండ పనిచేయించుటవలనను, వాతరక్తరోగముల వలనను, ఇంకను కంటికిగాని, తలకుగాని, అదరుదెబ్బలు తగులుటవలనను, ఎండలో పనిచేయించుటవలనను, అతివేడివలనను, నేత్రగోళములలో జబ్బుండుటవలనను ఈ వ్యాధి కలుగుచుండును.

## లక్షణములు (Symptoms)

కన్ను తెల్లబడుటయుగలదు. నీరు కారుచుండును. దురదకూడ నుండవచ్చును. కన్నుల మొదటిభాగమందు పుసులు, నీరు కారుచుండును. అస్థలమునందె గడ్డలుకట్టి

---

ఉత్తరే పూర్వసస్యాస్య పరసస్యాని రేవతి, భరణీ సర్వసస్యాని, సర్వంనాశాయతేశ్వని.

యుండును. చూచుటకు పశువు చాల అసహ్యాకరముగా నుండును. ఈగలుకూడ ఆ గడ్డలమీద ముసిరి కండ్లను చెరుపును.

## ఆయుర్వేద (Native) వైద్యము

ప్రతిదినము పశువుమూడును ఆవుపిడకను కాచి పోయుచుండవలెను. ఇట్లు నాలు గైదు దినములు చేయవలెను. పటికనీటితో కండ్లు కడుగుచుండుము.

లేక పసుపుగాని, మంజిష్ఠగాని కండ్లలో పెట్టుము.

లేక సారచేప తలలోని రాయి, ఖర్జూరగింజ, చనుబాలతో అరగదీసి కండ్లలో పెట్టుము.

లేక శిలాజిత్తు భస్మము వెన్నతో కలిపి అప్పుడప్పుడు పెట్టుము.

## ఆంగ్లేయ (Allopathic) వైద్యము

బోరిక్ లోషన్ గాని, ఆలం లోషన్ గాని అప్పుడప్పుడు వేయుచుండుము.

# రేజీకటి (Defects of Vision)

## స్వభావము (Causes)

కొన్ని పశువులకు రాత్రిపూట కండ్లు ఏమాత్రమును గన్పించవు. ఈ వ్యాధిని పశువుయొక్క చర్యలను బట్టి కనుగొనవలసినదే గాని సాధారణముగా నేత్రపరీక్షవలన తెలిసికొనుట దుస్తరము. కొన్ని దూడలు పుట్టిన వారముదినములలోనే ఈ వ్యాధి జనించును. ఈవ్యాధికూడ వంశ పరంపరముగ వచ్చునని కొందరు డాక్టర్లు చెప్పు చున్నారు. ఇంకను ఫ్యాక్టరీలలోనుండు తవుడును విస్తారముగా మేపుటవలనను, పిల్లి పెసరను కొలలకొలది మేపుటవలనను కండ్లకు అతివేడిజేసి ఈవ్యాధి రావచ్చును.

## లక్షణములు (Symptoms)

ఈ వ్యాధిగల పశువులు పగలు బాగుగనే చూడగలవు గాని రాత్రిపూట మాత్రము చూడజాలవు. రాత్రిపూట బుట్టలలో ఆహారపదార్థములుంచి యెదుటనుం చిన యెడల రేజీకటిగల పశువులు ఇటునటు వెదకుకొనుచుండును. ఒక దొడ్డినుండి మరియొక దొడ్డికి తోలినయెడల పశువునకు త్రోవ సరిగా కన్పించక గోడలకు, గోతు లకు, చెట్లకు అడ్డుపడిపోవుచుండును. మంచి వెన్నెల గాయుచున్నపుడు మాత్రము వీని కొకమాదిరిగ కన్పించును.

## ఆయుర్వేద (Native) వైద్యము

నేత్రములలో ఆవువెన్న పెట్టి చన్నీళ్ళు కొట్టుము.

లేక, మాలగాను రసము తేనెతో కలిపి కండ్లకు పెట్టుము.

---

అశ్వనిశరిస్తే అంతానష్టము.

లేక, గానుగవేరు తేనెతో అరగదీసి కండ్లకు పెట్టుము.

లేక, జాజికాయ తేనెతో అరగదీసి పెట్టుము.

లేక, ఒకటి రెండుచుక్కలు నిరుల్లిపాయరసము కండ్లలో పిండుము.

లేక, అవిసెపువ్వుల రసము నలకలులేకుండ శుభ్రమైనది పోయుము.

లేక, సజ్జలు విసరి పిండి పెట్టుము.

## ఆంగ్లేయ (Allopathic) వైద్యము

సిల్వర్ నైట్రేట్ లోషను వాడుము.

లేక ఆర్జరాల్ 50 గ్రెయిన్సు, నీరు 1 ఔన్సు కలిపి వాడవలెను.

## కండ్ల కలక (Inflammation of the eye)

### స్వభావము (Causes)

గ్రుడ్డుయొక్క పై పొరవాయుటవలనను, పశువు ఇసుకలో తలను ఆనించి నిద్రించుటవలనను, చలిగాలివలనను, కంటికి దెబ్బతగులుటవలనను, శీతోష్ణస్థితి హఠాత్తుగా మారుటవలనను ఈ వ్యాధివచ్చును. ఇది అంటుసంబంధమైనది.

### లక్షణములు (Symptoms)

వెలుతురును సహించలేకపోవును. కండ్లనుండి నీరు గారును. కంటిలో పుసులు కట్టును. కనురెప్పలుబికి వెచ్చగానుండును. కంటిపొరలలో అక్కడక్కడ పొక్కులు లేచును. కంటియందు ఇసుకరేణువు లున్నట్లు గరగరలాడుచుండును.

### ఆయుర్వేద (Native) వైద్యము

తెల్ల వావిడుకాయరసము కండ్లలో పెట్టుము.

లేక పిప్పళ్ళు ½ తు, మిరియాలు ½ తు మెత్తగా నూరి వెన్నపూసతో కలిపి కండ్లకు పెట్టవలెను.

లేక గుంటకలగరాకు పసరుతో మిరియపుగింజ లవంగపు మొగ్గ అరగదీసి కండ్లకు పెట్టుము.

లేక నందివర్ధన పండుటాకులరసము కండ్లలో పిండుము.

లేక తడిపసుపుగుడ్డగాని కావిరాయిగుడ్డగాని కండ్లపైన నుంచుము.

లేక తుమ్మచెట్టునకు పట్టు ఒకవిధమైన పురుగుగూడు తెచ్చి దానిలో నుండు పురుగుల రసము కంటిలో పెట్టుము.

లేక అరటిదుంపసొన కండ్లలో పెట్టుము.

---

అశ్వనిపరిస్తే ఒక అడవిలోకి చాలదు.

లేక ఆరెచెట్టురసము పెట్టుము.

### ఆంగ్లేయ (Allopathic) వైద్యము

జింకు సల్ఫేటులోషన్ గాని, లేక బోరికు ఆసిడ్ 9 గ్రెయిన్సు, డిస్టిల్డువాటరు 1 ఔన్సుకలిపిన చుక్కలుగాని వేయవలెను.

## కండ్ల దృష్టి తగ్గుట (Amblyopia)

### స్వభావము (Causes)

పశువులను రాత్రివేళలందు బండ్లుకట్టి రోడ్లమీద తమ పాలములతో మట్టి వగైరాలు తోలుటవలన మోటారు లైటువెలుతురు, గ్యాసులైటుల వెలుతురు, ఎక్కువగా తగులుటవలన దృష్టి తగ్గుచుండును. ఇంకను మిడిమిడి ఎండలో పనిచేయుటచేతను, ఆ సూర్యరశ్మి కండ్లమీదతగిలి దృష్టి తగ్గుచుండును. ఇంకను మురికినీరు త్రాగించుటచేతను, కావలసినంత వెలుతురులేనిచోట్ల పశువులను కట్టుటచేతను, చెడునీరు కండ్లలో ప్రవేశించుటచేతను ఈవ్యాధి కలుగుచున్నది. ఇంకను నరములదోషమువలనను, రక్తహీనతవలనను కలుగుచుండును.

### ఆయుర్వేద (Native) వైద్యము

పదిమిరియములు పొడిచేసి తుందిలపాకురసములో కలిపి అప్పుడప్పుడు కన్నులలో పెట్టుచుండుము.

లేక పచ్చకర్పూరము, పంచదార సమానభాగములు కలిపి ఆవువెన్నతో నూరి కండ్లను పెట్టుము.

లేక సొగచేపమలము 10 దినములు కంటిలో పెట్టుము.

లేక నీరుల్లిపాయ రసము పోయుము.

లేక తిప్పతీగె రసము, సొంటిరసము, సైంధవలవణము, నూరి కన్నులకు పెట్టవలెను.

### ఆంగ్లేయ (Allopathic) వైద్యము

పొటాషియం అయోడైడ్ 10 గ్రెయిన్సు, హైడ్రార్జరీ అయోడైడ్ రుబ్రం 5 గ్రెయిన్సు, గంజిలో కలిపి 10 దినములు 3 వేళల యీయవలెను.

ఆలంలోషన్ గాని, జింకులోషన్ గాని, బోరిక్ లోషన్ గాని అప్పుడప్పుడు కంటిలో వేయుచుండవలెను.

---

## కంటిమాద

### స్వభావము (Causes)

ఈ వ్యాధి అవిరి ముదిరినతరువాత వచ్చును. ఇది చాల ప్రమాదకరమైనది. ఎక్కువగా పాటుపడుచు చురుకుగా స్వారిచేయు బొల్లిమచ్చలుగల ఎద్దులకు తరచుగా గలుగుచుండును. కనుగ్రుడ్డుపైన కొయ్యగండలు పెరిగి క్రమేపి కన్నుగ్రుడ్డు ప్రుళ్ళి పోవును. దీని కెటువంటి చికిత్సలు చేసినను లాభములేదు. ప్రత్యేకముగా మీ తాలూకా పశువుల డాక్టరుచే కన్ను తీసివేయించుట మంచిది. లేనిచో ఈదోషము రెండవ కంటికి కూడ వచ్చును. ఈ కన్ను తీసినప్పటికి కూడ నీరు కట్టినచో ఆ పశువు త్వరలో చని పోవగలదని గ్రహించవలెను. అందుచేతనే దీనికి కంటిమాదయని పేరువచ్చినది.

### లక్షణములు (Symptoms)

పశువు నోరులేనిది గాన అది పడుబాధ భగవంతుని కెరుక. చికిత్సచేసే వైద్యుని కెరుక. కంటిచుట్టు వాతలు పెట్టుదురు. ఇందువలన పశువున కపాయము గలుగుటయే గాక పశువు మరణించును. నోటివెంట చొంగపడుచుండును. వ్యాధి ముదిరినకొలది కంటినుండి రక్తము కారుచుండును. కన్ను భీకరాకారముగా నుండును. కనుగ్రుడ్డు ఎరుపుగ నుండును. లేక గ్రుడ్డు దుర్మాంసముచే కప్పబడియుండును. ఎల్లప్పుడు విచారముగా నుండును. ముదిరినకొలది ఈగలు కంటిచుట్టు మూగి గ్రుడ్డును తినివేయును. క్రమేపి వాతముగ్రమ్మి పశువు మరణించును.

### ఆయుర్వేద (Native) వైద్యము

దుర్మాంసమును గోటితోగాని, కత్తెరతోగాని తీసివేసి మిరియాలపొడితో పచ్చ కర్పూరము తగినంతగా కలిపి కంటిలో పెట్టవలెను.

లేక అప్పుడప్పుడు పటికనీటి చిక్కని బిందువులు పోయుచుండుము.

### ఆంగ్లేయ (Allopathic) వైద్యము

మీ తాలూకా వెటరినరీ డాక్టరుగారిచే కన్ను తీయించుట నా ముఖ్యోద్దేశ్యము. ఎన్ని చికిత్సలు చేసినను లాభములేదు.

## కనురెప్పలచివర పొక్కులు లేచుట

### ( Stye - Hordeoleum )

పశువు కనురెప్పల పొక్కులు లేక పురుపులు బయలుదేరి బాధనుకలుగజేయును. ఈపొక్కులు తెలుపుగను, గట్టిగను యుండును. ఇవి కనురెప్పల పైవైపునగాని,

---

భరణికరిస్తే ధరణి పండును.

లోపలివై పుసుపుగాని చిలిక గ్రొవ్వువంటి పదార్థము వెడలును ఎక్కువబాధను, కప్పుల యంతటను వాపును గలుగజేయును.

## ఆయుర్వేద (Native) వైద్యము

పాక్కులను మండపసుపుకొమ్ము ఆరగదీసి దానిలో కొంచెము గంధకముకలిపి పట్టించవలెను.

లేక మామిడి ఆకులనుగాని ఈనెలుకాల్చి మసిచేసి నీటితోకలిపి కురుపులకు పట్టించవలెను.

లేక పటికపొడి 1తు, పసుపు 1 తు, వేపనూనె ½ తు కలిపి అప్పుడప్పుడు పట్టించవలెను.

## ఆంగ్లేయ (Allopathic) వైద్యము

కార్బాలిక్ ఆయిలుగాని టింక్చర్ అయోడిన్‌గాని అప్పుడప్పుడు కురుపులకు పట్టించుము.

బోరిక ఆయింటుమెంటు రుద్దుము.

## కొయ్యగండలు పెరుగుట (Trachoma)

పశువు రెప్పలు బిరుసెక్కును. కంటిరెప్పలచుట్టు కొయ్యగండలు పెరుగును. ఇవి గ్రుడ్డుమీద కాకుండ తదితరభాగములమీద పుట్టును. వీటివలన పశువు బాధపడుచుండును.

## ఆయుర్వేద (Native) వైద్యము

బ్రహ్మదండి చెట్టు సమూలము ఉప్పుతో మెత్తగా నూరి గాయమునకు పట్టించవలెను.

లేక కొబ్బరి, నల్లజీడిపిత్తులు కలిపి ప్రతిదినము ఉదయపుప్రొద్దుట తినిపించుచు ఆ గాయమునకు కొత్తసున్నము గాడిదగడపాదరసము కలిపి పట్టించుము.

లేక మైలతుత్తము, గంధకము, పాదరసము, సమానభాగములు తమలపాకురసముతో కంచుపళ్లెముమీద నూరి గాయమునకు పట్టించుము.

లేక మైలతుత్తము, సూరేకారము, రాతిసున్నము సమపాళ్లు తెచ్చి నిమ్మకాయరసముతో నూరి గాయమునకు పట్టించుము.

## నేత్రముల కొలుకులలో దుర్మాంసము పెరిగినచో

దుర్మాంసమును శస్త్రముచేసి పసుపుకొమ్మును కాల్చి అంటించుము.

---

రోహిణీ మృగశిర వరుసైతే రోళ్ళు పగిలేయెండ.

లేక మిరియాలు మెత్తగానూరి కొలుకులకు అంటించుము.

లేక నూరేకారము పసుపు మెత్తగానూరి నేత్రములలో పారబోయుము.

లేక తుంగముస్తపువ్వు, కరక్కాయ ఆముదము సమాన భాగములు నూరి కలబంద మట్ట రసములో తేనెకలిపి కాటుకగాచేసి కండ్లలో పెట్టుము.

లేక కవిరి, వెలిగారము, పటిక, కొబ్బరినూనె, ఆవువెన్నతో కలిపి కండ్లకు పెట్టుము.

## కంటిలో ఇతర వస్తువులు పడుట

## ( Foreign bodies in the eye )

పశువు కంటిలో నలకలు, దుమ్ము రేణువులు, పురుగులు మొదలగునవిపడి బాధ కలిగించును. అట్టిసమయములలో ఈ క్రింది విషయములను గ్రహించవలెను.

1. పశువుకన్ను మూసి కన్నీటిని కారించుటమంచిది. ఆ నీటిప్రవాహములో దుమ్ము రేణువులు కొట్టుకొనిపోయి సౌఖ్యము కలుగును.

2. లేనియెడల కంటిని కడుగుట మంచిది.

3. వెచ్చని నీటిని దెచ్చి కంటిలోనికి పిచ్చికారితో కొట్టవలెను.

4. పుల్లగాని, పేడుగాని గ్రుచ్చుకొనినయెడల జాగ్రత్తగా తీసి బోరిక్ ఆసిడ్ లోషన్ కంటిలో వేయుచు వేడినీటి కాపులు తీయించవలెను.

5. మేకుగాని, త్రుప్పుపట్టిన రేకుగాని గ్రుచ్చుకొనినయెడల సన్నని దారా తీసివేసి యంతలో అయొడిన్‌టింక్చరు తేలికగా పెట్టుచుండవలెను.

6. పుల్లగాని, మేకుగాని గ్రుచ్చుకొని కన్ను వాచినగాని పై చికిత్సలవలన తగ్గకపోయిన యెడల కొలుకులలో ఆముదపు చుక్కలను విడువవలెను.

---

# శ్వాసరోగములు

## పదునేడవ భాగము

### క్షయ (Tuberculosis)

#### స్వభావము - వ్యాపకము

ఇదియొకవిధమైన అంటువ్యాధి. ఈ వ్యాధి అన్నివిధములగు జంతువులలోను వ్యాపించును. పశువుయొక్క శ్వాసకోశములయందు ఒక విధమైన పురుగు ప్రవేశించి వానిని క్షీణింపజేయుట వలన ఈవ్యాధి కలుగుచున్నది. పశువుయొక్క కీళ్లలోను, చొంగలోను, పాలలోను, రక్తములోను, ఊపిరిలోను, ఈ పురుగు వ్యాపించి యుండును. ఆహారపదార్థముల మూలమునను, గాలిమూలమునను, ఈసూక్ష్మజీవి పశువుయొక్క శరీరములో ప్రవేశించును. జబ్బుగల పశువులు మంచి పశువులతో కలసి యుండుటచేత ఈ వ్యాధి విచ్చలవిడిగా విజృంభించును. కనుక జబ్బుగల పశువులను ఆరోగ్య పశువులనుండి విడదీసి ప్రత్యేకస్థలము నందుంచవలెను. ఈ సూక్ష్మజీవికి పశువుయొక్క శరీరము వెలుపలకూడ జీవించు శక్తిగలదు. పశువుల కొట్టము అనారోగ్యకరముగను, అపరిశుభ్రముగ నుంచుటచేత ఈ రోగము పెంపొందును. ఈవ్యాధి కొన్ని వారములుగాని, మాసములుగాని యుండును. ఈ వ్యాధి ముదరకమునుపే చికిత్స చేయుట మంచిది. ఈ వ్యాధి అన్నిజాతుల జంతువులకును, మనుష్యులకును, పక్షులకును కూడ సోకును. ఇది సామాన్యముగ పట్టణములలోనుండు పశువులకు ఎక్కువగా వచ్చుచుండును. అనారోగ్యప్రదేశములలో నుంచుటవలనను పశువుపేడ, చెత్త, మూత్రము మున్నగువానిని నిలవయుంచుటవలనను, గాలి, వెలుతురులేని కొట్టములలో పశువులను కట్టివేయుటవలనను, దోమలు, ఈగలు ఎక్కువగానుండు మురికి ప్రదేశములలో పశువుల కట్టివేయుట వలనను, ఈ వ్యాధి ప్రబలుచుండును. ఈవ్యాధిని కలిగించు సూక్ష్మజీవి మంచి పశువులకుండు గాయముల మూలమునను, త్రాగెడి నీటిమూలమునను పీల్చు చెడుగాలివలనను, లోపలికి ప్రవేశించి వ్యాధిని కలిగించును.

#### లక్షణములు

ఈవ్యాధి ముఖ్యముగా శ్వాసకోశములలో వృద్ధియగుచుండును. దగ్గు ముఖ్యలక్షణము. ఆదగ్గు మొదట కొంచెము కొంచెముగా నుండి క్రమక్రమముగా హెచ్చును. దగ్గు ఎక్కువైన కొలది తెమడ ఎక్కువగా పడుచుండును. పనిచేయునప్పుడు మిగుల ఆయాస

---

మృగశిర బిందిస్తే అయిదు కార్తెలు కురుసును.

మూగా నుండును. క్రమక్రమముగా శరీరము శుష్కించును. జీర్ణశక్తి తగ్గును. అందుచే ఆహార మెంత పెట్టినను నీరసముగా నుండి పశువు కృశించును. పశువు బలహీనమైన కొలది దగ్గుచుండును. జ్వరముకూడ అప్పుడప్పుడు వచ్చుచుండును. ఈవ్యాధి తగిలినపశువు చనిపోవుటకు కొంతకాలము పట్టును. పైన వ్రాసినట్లు శ్వాసకోశములయందే గాక జీర్ణకోశములయందు గూడ క్షయ యభివృద్ధినొందును. అప్పుడు పలుచగా పేడవేయును. కడుపుబ్బర ముండును. కనుగుంటలు విడుచుచుండును. పేగులు చెడవచ్చును. ఆహారమును జీర్ణము చేసికొనలేక పోవును. పాడి పశువైనయెడల పొదుగు గట్టిపడి వాచి యుండును. ఆ పొదుగులో పాలు పలుచగను, నీరువలెనుండి ఒక విధమైన పచ్చని రంగు కలిగి యుండును. పొదుగు పూర్తిగా చెడునప్పటికి పాలేమియుండవు. ఈ వ్యాధి ముదిరినకొలది ఎముకలు కీళ్లు జబ్బుపడుట, బలహీనత చెందుట, నడచునపుడు కుంటుట, మొదలగు లక్షణములు కనపడును. రానురాను కఫజ్వరము ఎక్కువై మరణము సంభవించును.

## చికిత్స

సాధారణముగా ఈవ్యాధిని వైద్యులు కనుగొనుట కష్టము. అందుకొరకు ప్రత్యేకముగా తయారుజేయబడిన "ట్యూబర్క్యులిను" అను ఇంగ్లీషు మందొకటి కలదు. దానిని శరీరములోనికి ఇంజెక్షను చేసిన యెడల దానివలన శరీరమునందు కలుగు మార్పులనుబట్టి ఈవ్యాధిని నిర్ణయించవచ్చును. ఈవ్యాధికి పశువును అతి జాగ్రత్తతో సంరక్షించుటయే తక్క వేరొండు మంచిచికిత్స లేదు. ఈవ్యాధిగ్రస్తమగు పశువును ధారాళముగా గాలి, వెలుతురు వచ్చు కొట్టములలో నుంచవలెను. పశువును ఎక్కువగా మేపరాదు. అమెరికా మున్నగు దేశములలో క్షయవ్యాధిగల పశువులను ప్రతిదినము పరీక్షించిగాని, వాటిపాల నమ్మనీయరు. ఈవ్యాధినిగురించి తగినంత శ్రద్ధ తీసికొనక పోయినచో ఒక పశువునుండి మరియొక పశువునకు ఈవ్యాధి వ్యాపించును గాన మంచిపశువులలో వ్యాధిగ్రస్తమగు పశువును కలుపరాదు.

## హెచ్చరిక

ప్రతిపట్టణములో నుండు పశు వధశాలలను,పశువైద్యులచే పరిశోధన చేయించుట మంచిది. ఆహారార్థము వధార్హములగు జంతువులు కేవలము వయసు చెందినవి గాకుండను, చూడిపశువులు గాకుండను, పసిదూడలు గాకుండను, జాడ్యగ్రస్తములైనవి గాకుండను, కేవలము బక్కచిక్కినవి కాకుండగను, ఉండవలయును. పశువధశాలలు, వాని సమీపప్రదేశములు శుచిగానుండు టావశ్యకము. క్షయ, దొమ్మ మొదలగు జాడ్యముల వలన మృతినొందిన జంతువుల మాంసము భక్షించుటచేత భక్షకులకు సయితము ఈ జాడ్యము సంభవించును. ఈ విషయము చక్కగా మనస్సునందు నాటియుండవలెను.

---

మృగశిర బిందిస్తే మిగిలినకార్తెలు వర్షించును.

వీలనన ఈ దేశమందంతట హీనజాతులవారు తమ కెచ్చటనైన చచ్చినపశువు దొరికిన యెడల దానిమాంసమును సంకోచములేక తిందురు. అట్టివారు పెక్కు రోగముల పాలగుచున్నారు. పాశ్చాత్యదేశములలో భక్షించు మాంసాముల విషయమై, పానము చేయు క్షీరముల విషయమై అనేకములైన కట్టుదిట్టములు, శాసనములు ప్రజల క్షేమము కొరకై చేయబడి యున్నవి.

పట్టణములలో పాలను పితుకుట, విక్రయించుట మొదలగు విషయముల గురించి శాసన మొకటి అత్యవసరమై యున్నది. అట్టి శాసనము పుట్టువరకుపాలను కొనెడివారు తాము కొనుచున్న పాలు ఎక్కడనుండి తమకు చేరుచున్నవో చక్కగా తెలిసికొని జాగరూకులై యుండవలెను. రోగముగల పశువులపాలు పానయోగ్యములు కానేరవు. గనుక అట్టి పాలను వాడరాదు. పశువులయొక్క రోగము నివారించుట, పాల యొక్క ఆరోగ్యము కాపాడుట మున్నగు కృత్యములు పశువైద్యవు టుద్యోగియులకు చెందియున్నది. పశువులలో ఏ పశువునకైన క్షయవ్యాధి యున్నయెడల ఒక పశువు నుండి మరియొక పశువున కది వ్యాపించుటయే గాక ఈ వ్యాధి తగిలిన పాడిపశువు యొక్క (ఆవు, గేదె) పాల నుపయోగించుటవలన మనుష్యులకును, ముఖ్యముగా చంటి బిడ్డలకును, ఈ వ్యాధి తగిలి వారి కపాయము కలిగించును. ఇదియే మనము ముఖ్య ముగా గమనించవలసిన విషయము.

## ఊర్ధ్వ శ్వాసరోగము

పశువును చలిగాలిలో త్రిప్పుటవలనను, మితముగా బండికట్టి తోలుటవలనను, ఆహారము సరిగా పెట్టకపోవుటవలనను రక్తములో ప్రాణవాయువు తక్కువగా నుండుట వలనను, శ్వాసనాళిమున కేదైన ఆటంకము గలుగుటవలనను ఈవ్యాధి సంభవించును.

### లక్షణములు

పశువు వణకుచుండును. చెవులను వ్రేలాడవేయును. శరీరము వేడిగా నుండును. నోటినుండి ఒకవిధమైన తెమడ పడుచుండును. ఈ వ్యాధి ముదిరినకొలది మలమూత్ర బంధరోగముగ పరిణమింపవచ్చును. ముఖము వాడిపోవును. నాలుకను జారవిడచును. పశువు తూలుచుండును. ఊపిరియాడుట కష్టముగా నుండును. మనము తగిన చికిత్స చేయనిచో ఉచ్ఛ్వాసనిశ్వాసము లెక్కువై పశువు వెంటనే మరణించును.

### చికిత్స

| | |
|---|---|
| కర్పూరము ½ తులము | నూరేకారము ½ తులము |
| మసాంబరము 1 తులము | నల్లమందు ½ తులము |

కలిపి అప్పుడప్పుడు తేనెలో నాకించవలెను.

---

మృగశిర బిందిస్తే ముసిలెద్దు రంకెవేయును.

లేక కోడిగ్రుడ్డులోని చందమామ 1, ఫిరంగి సాంబ్రాణి 1 తులము కలిపి వాడించవలెను.

లేక సొంటి 2 తులములు, పిప్పళ్ళు 1 తులము, మిరియాలు 1 తులము, కల్లు బెల్లము 1/8 వీసె, ఉలవపిండి సోలెడు కలిపి ముద్దచేసి లోపలికి పెట్టవలెను.

## న్యూమోనియా (Pnemonia)

దీనికే ఊపిరితిత్తుల వాపందురు. ఈ వ్యాధికూడ ఒకవిధమైన అంటుజ్వరమని జంతుశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. ఇది పశువుయొక్క శ్వాసకోశములకు తగులును. చలిగాలి ఎక్కువగా సోకుటవలనను, ఎల్లప్పుడును పశువును వర్షములో నుంచుటవలనను, ఈ వ్యాధి వచ్చును. ఈ వ్యాధి పాడిపశువులకే కాక పాటుపడు పశువులకు తరచుగా సోకుచుండును. ఈవ్యాధిగల పశువుయొక్క ఒక ఊపిరితిత్తికి గాని, కొన్నిటికి రెండుతిత్తులకు గాని సోకవచ్చును. చలిగాలి ఎక్కువగా వీచుటచేత ఈ వ్యాధి రావచ్చునని కొందరు డాక్టర్లు చెప్పుచున్నారు. ఈ వ్యాధియొక్క లక్షణములు, ఋతువులను బట్టియు, స్థలములను బట్టియు, పశువుయొక్క వయస్సును బట్టియు వ్యాధి తగులకముందు రోగియొక్క ఆరోగ్యమును బట్టియు మారును. ఈవ్యాధికికూడ కొన్ని పురుగులే మూలకారణము. దీనిని మన రైతులు కనిపెట్టుట కష్టము. పశువు గుండెమీద స్టెతస్కోపు పెట్టి లోపలనుండు శ్వాసకోశములనుండి వచ్చు ధ్వనినిబట్టి ఈ రోగమును గుర్తించవలెను. ఈవ్యాధిసంబంధమగు పురుగు అనేకవిధమైన విషములు తయారుచేసి తదితర పశువులకు ప్రసరింపజేయును. గాన జాగ్రత్తగా పశువును కాపాడవలెను. ఈ వ్యాధి తగిలిన పశువు చొంగ బడిన స్థలము పరిశుభ్రము చేయనిచో నా ప్రదేశముమీద ఆరోగ్యసంబంధమైన విష మొకసంవత్సరము వరకుండునని శాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు.

### లక్షణములు

ఈ వ్యాధికి ఆరంభములోనే పశువు ప్రక్కభాగములందు ఉద్రుతమగు బాధ ప్రారంభమై పోటు పొడిచి నట్లుండును. ఊపిరితిత్తులు కదియుండుటవలన శ్వాస మిక్కిలి ఆయాసముగా నుండును. కొన్నిటికి జ్వరము ముండదు. మేత, నీరు మానును. పశువు పని జేయజాలదు. అంటుసంబంధమైన జ్వరమైనయెడల దీర్ఘకాల ముండును. ప్రారంభములో ఎక్కువ లక్షణములు కన్పడవు. పని చేయించునపుడు పశువు అలసిపోవును. తదితర పశువులతో నుండక విడిగా నుండును. శ్వాసకోశములు క్రుళ్లినయెడల ఊపిరి వాసనకొట్టును. నాడి తొందరగా కొట్టుకొనుచుండును. మూత్రము తీవ్రవర్ణము కలిగి యుండును. ఈ వ్యాధియందు దగ్గుకూడ నుండును. వ్యాధి ముదిరినకొలది రక్తము

మృగశిర వానకురిస్తే ముంగారు పండును.

క్షీణించును. క్రమక్రమముగ గుండె అస్వస్థత జెంది శ్వాసకోశములలో విషపదార్థములు చేరుకొని ఉచ్ఛ్వాస నిశ్వాసల నాడనీయక పోవుటచే పశువు మరణించును.

## చికిత్స

ఈ వ్యాధికి మన ఆయుర్వేద పశువైద్యులు చికిత్సలు చేయుట బహుకష్టము. కొన్ని మందులను ఇంజక్షన్ చేయవలసియుండును. అందుచే ఇట్టి లక్షణములు కలిగిన పశువులను వెంటనే పశువైద్యశాలలకు తీసికొనిపోవుట చాల మంచిపని. అట్లు చేయుటకు వీలు లేనిచో నీరు ఒకపాత్రలో మరిగించి కర్పూరతైలముగాని, యూకలిప్టస్ ఆయిల్‌గాని వేసి దానినుండి వచ్చు ఆవిరిని ముక్కురంధ్రములోనికి పట్టించవలెను. పశువు ఎదురురొమ్మునొప్పికికూడ ఉపశాంతి చేయవలసియుండును. ఈ నొప్పిని తగ్గించుటవలన రోగిపశువుయొక్క సామాన్యస్థితి అభివృద్ధిపొందును. ఇందుకొరకు కొందరు ఆవాలు నూరి పట్టువేయుదురు. ఇది యెక్కువగా వేసినయెడల అపకారము చేయును. గాన అమితముగా వేయరాదు. ఇంకను పిండికట్టు కట్టవచ్చును. కర్పూరతైలము రాచి వేడికాపడములు కాయవచ్చును. వేడికాపడములు కాయుగుడ్డలో నీ రెంతమాత్రము ఉంచక పిండివేసి కాపులు కాయవలెను. అప్పుడప్పుడు సారాయిని త్రాగించవచ్చును.

## హెచ్చరిక

వ్యాధితగిలిన పశువును శుచియైన స్థలములో నుంచి పరిశుభ్రమైనగాలి తగులునట్లు చేయవలెను. రొమ్మునకు చలిగాలి తగులకుండ వెచ్చని ఉన్నిబట్టలు, గొంగడి, కంబళి మొదలగువానిని కప్పవలెను. మేత మేయనియెడల బలవంతముగా పెట్టరాదు. ద్రవసంబంధమైన పదార్థము లేవియు త్రాగింపరాదు. ఏ మందైనను లేహ్యముగా చేసి నాలుకకు రాయవలెను. బార్లిగంజిగాని నూకలజావగాని పెట్టవలెను. పశువునకు బలమును కలిగించు పదార్థములుకూడ పెట్టవచ్చును. పశువు నోటినుండి కఫము పడుచుండినయెడల ఆకఫమును శుభ్రముగా తీసివేసి ఫినైల్‌గాని, కార్బాలిక్ ఆసిడ్‌గాని, పిప్పర్‌మెంటు ఆయిల్‌గాని ఆ కఫముపడినచోట చల్లవలెను.

## దగ్గు (Cough)

ఆ॥ వె॥ పసికిదగ్గు నుద్భవంబంద బాధతో
మేత నర్థగాను మేయుచుండు
నిసియుదగ్గు హెచ్చి నీరసంబునుజెంద
కాక మిగుల తగుల గాసి జెందు॥

పశువునకు చలిగాలి, మంచు తగులుటవలనను, మిక్కిలి అలసిపోవునటుల పని చేయించుటవలనను, అలసియున్నపుడు వర్షమునకు మందునకు తడిసియుండుటవలనను

మృగేవర్షే ముఖేఖర్జే స్వాతి సౌతామినీతథా

ఊపిరితిత్తులలో నుండు పొరలు కందుటవలనను లేక ఊపిరిగొట్టములలో నున్న పొరలు కందుటవలనను ఈవ్యాధి రావచ్చును. ఇదికూడ రెండువిధములుగా నుండును. అందు మొదటిది ఊపిరిగొట్టములోనిపొర కందుటవలన కలుగును. రెండవది ఊపిరితిత్తులలోని పొర కందుటవలన కలుగును. రెండువిధములుగాక ఊపిరిగొట్టములో ఒకవిధమైన పురుగులు పుట్టును.

## లక్షణములు

దీనిచే వచ్చినను ప్రారంభములో లక్షణము లన్నియు ఒకేమాదిరిగా నుండును. అందుచే జాగ్రత్తగా కారణమును కనిపెట్టవలెను. పశువు దగ్గుట, మేత మేయలేక పోవుట, పనిచేయలేక అలసిపోవుట, మొదలగులక్షణము లన్నియు కనపడవచ్చును. ఊపిరి గొట్టములో వ్యాధికన్న ఊపిరితిత్తులలో కలిగిన వ్యాధి ఎక్కువ భయంకరముగా నుండును. దానికంటె పురుగుల వలన కలిగిన వ్యాధి కఠినతమముగా నుండును. మొదట చెప్పిన కారణమేగాక మిగిలిన రెండు కారణములవలనను జ్వరముకూడ నుండవచ్చును. ముక్కులవెంబడి ద్రవపదార్థము వెలువడుచుండును. కండ్లనుండి నీరుకారుచుండును. దగ్గు రాత్రులయందు విశేషముగా నుండును. ఈ వ్యాధి ముదిరినకొలది పశువు క్షీణించుచుండును. పడుకొని లేవజాలదు. చాల విచారముగా నుండును. జ్వరము హెచ్చుచు తగ్గుచుండును. పశువు క్షీణించినకొలది బరిమెముకలు స్పష్టముగా కనపడును. నోటినుండి జిగటవంటి ద్రవపదార్థము ఎక్కువగా వెలువడుచుండును. కఫమెక్కువైన పశువునకు మరణము సంభవించును.

## చికిత్స

రావిచెక్క 2 తులములు, మిరియాలు 2 తులములు, పచ్చిపాలు అర్థసేరు కలిపి ప్రతిదినము ఉదయము త్రాగించవలెను. ఈ విధముగా వారము దినములు చేయవలెను.

లేక పెన్నేరుదుంపల పొట్టు పావుసేరు, పులిచల్ల అర్థసేరు, కలిపి ఒకపూట మాత్రమే త్రాగించవలెను. ఈవిధముగా వారము దినములు చేయవలెను.

లేక నీరుల్లిపాయరసము పావుసేరు ఒక పూట త్రాగించుము. ఈరీతిగా 15 దినములు చేయవలెను.

లేక అడ్డసరపాకు పసరు పావుసేరు, అల్లపురసము పావుసేరు, కలిపి సాయంకాలము త్రాగించవలెను. 4 దినములు చేయవలెను.

## హెచ్చరిక

ఈ వ్యాధికి కూడ రొంపకు చేయు చికిత్సయే చేయవలెను. కాని పురుగులవలన కలిగిన వ్యాధిని మాత్రము పశువుల డాక్టరునకు చూపించవలెను. ఒక పశువునుండి మరి

రోగ పశువునకు ఈ వ్యాధి వ్యాపించి కొన్ని పశువులు చెడిపోవచ్చును. డాక్టరు దగ్గరకు వెళ్ళుట తటస్థించిన యెడల జబ్బుతగిలిన పశువులను ఒక గదిలోనుంచి గంధకపు పొగ పీల్చునట్లు చేయవలెను.

## రొంప (Catarrah)

ఉ॥ కాలము మార్పునొంద కడు కాయము శీతలమొంది బాధతో
నాలిగనుండి దగ్గువడ నాసికమందు జనించు వాపును
న్నాలుగ హెచ్చియుండగను చక్కన శీర్షము వాతమొంద
తాళగలేక సొక్కి కడు తాహతులేకను బాధచెందెడున్.

ఈ వ్యాధి అంటువ్యాధిలో చేరింది. మనుష్యుల కందరికి పడిశములు ఒక్కసారే ఏవిధముగ వచ్చునో ఆమాదిరిగనే పశువులకుకూడ వచ్చును. పశువును అతిశీతలమైన గాలిలో నుంచటవలనను, శీతోష్ణస్థితిలో వింతయగు మార్పులు కలుగుటవలనను, గాలి వెలుతురు లేని ఇరుకుగానుండు కొట్టములలో పెక్కింటిని కట్టుటవలనను వానికి ముందు, చలిగాలి తగులుటవలనను, అధికశ్రమ కలుగునట్లు పనిచేయించుట వలనను ఈ వ్యాధి కలుగును.

### లక్షణములు

ఈ వ్యాధి సంభవించుటకు రెండుమూడు దినములకు ముందే పశువు నిరుత్సాహముగా నుండును. అప్పుడప్పుడు దగ్గుచుండును. పశువునకు జ్వరముండును. నోటిలో ఒకవిధమైన కఫ మేర్పడును. జంతువు పరుండుటకు ఇచ్ఛగింపదు. వ్యాధి ప్రారంభించిన కొలది ఊపిరితిత్తులలో ఒకవిధమైన ధ్వని పుట్టును. ముక్కు రంధ్రములలోని పలుచని పొరకు నెత్తురు ఎక్కువగా చేరుటవలన ఆపొర ఎఱ్ఱబడును. ఆ ముక్కురంధ్రములనుండి వచ్చు ద్రవపదార్థము చిక్కబడి ముద్దకట్టును. ఈ స్థితిలో పశువు మేత సరిగా మేయదు. వ్యాధి ముదిరినకొలది పొడిదగ్గు ఏర్పడును. ముక్కునందు తడియుండదు. ఇంకను అశ్రద్ధచేసినయెడల శ్వాసకోశములోనికి వ్యాధి వ్యాపించి జ్వరము ఎక్కువై పశువు చాల బాధపడును. శ్వాసకోశములు చెడి వ్యాధి హెచ్చిన యెడల పశువునకు ఆరోగ్యము కుదురుట కష్టముగనుక మొదటనే జాగ్రత్త పడవలెను.

### చికిత్స

### జ్వరముగానున్న యెడల

ఉప్పు 10 తు, సూరేకారము 2 తు, నవాసాగరము 1 తు, అర్థసేరు చన్నీటిలో కలిపి త్రాగించవలెను.

---

ఆరుద్ర చింబిస్తే ఆరువైరోజాలు వరవు, ఆరుద్రలో వర్షంకురుస్తే ఆరుకార్తెలుకురుసును.

లేక నల్లమందు ⅛ తు, కర్పూరము ⅛ తు, కర్పూరతైలము 2½ తు, అర్ధసేరు నీటిలో కలిపి త్రాగించవలెను.

లేక సొంటి 2 తు, పిప్పళ్లు 2 తు, మిరియాలు 2 తు, అర్ధసేరు నీటిలో కలిపి త్రాగించుము.

లేక నీరుల్లిపాయలరసము 4 తులములు ముక్కురంధ్రములలో పోయుము.

లేక మంచిబెల్లం సవాసేరు, పసుపు 4 తు కలిపి నిమ్మకాయంత ఉండలుచేసి పెట్టుము.

పైన చెప్పిన చికిత్సలలో రెండు మూడు దినములు మీ యిష్టమువచ్చినది చేయవచ్చును.

## హెచ్చరిక

మన రైతులలో చాలమంది పశువుముక్కు రంధ్రములనుండి నీరుగాని, చీమిడిగాని, కారుచుండినయెడల కొమ్ముడొల్లలని, శిరోవాతమని ఇంక నేదోయొక పైత్యరోగమని పేర్లుపెట్టి తెలిసితెలియని వైద్యములు చేసి పశువును చేతులార చంపుదురు. కాబట్టి రోగముయొక్క జాడను, గుణములు గుర్తించి తగిన చికిత్సలు చేయవలెను.

ఈ వ్యాధి పశువున కెక్కువగా నున్నపుడు తవుడు, బార్లీగంజి లేక నూకలజావ పెట్టుట మంచిది. పశువును చలిగాలిలోను, ఎండలోను నుంచరాదు. మలబద్ధక మున్నయెడల విరేచనమునకు మందీయవలెను. ఈరోగము పశువు శ్వాసనాళములను చెడగొట్టవచ్చును. పశువువిడుచు ఊపిరిలో మొత్తపనసు లేకపోవచ్చును. జంతువును తగినంత పరిశ్రమ చేయించుచుండవలెను. పశువునకు బలవంతముగా మందును లోపలికి పోయరాదు. కొంచెము యూకలిప్టస్ ఆయిలుగాని, కర్పూరతైలముగాని బుడగలు వచ్చునట్లుగా నీటిలో వేసి ఆ నీటినుండి వచ్చు ఆవిరిని పశువు ముక్కురంధ్రములలోనికి వెళ్లునట్లుగా మూతియొద్ద పెట్టి తలమీద నొకగుడ్డ కప్పవలెను.

## ఉబ్బసము (Asthma)

### స్వభావము

ఈవ్యాధి మనదేశములో బండిఎద్దులకు తరచుగా వచ్చుచుండును. పశువుయొక్క శ్వాసకోశములో నున్న చిన్నతిత్తులు పెద్దవియగుటవలన ఈ వ్యాధి కలుగుచున్నది. పశువులకు సారములేని పిప్పివంటి ఆహారవస్తువులు మేపుటవలనను, కొన్ని పనిలేక సోమరితనముగా నుండుటవలనను, మరికొన్ని విస్తారముగా మేతమేయు స్వభావము గలవిగా నుండుటవలనను ఈరోగ ముత్పత్తియగుచున్నది. నోటిగాల్లు తగిలిన నెమ్మదించిన పశువుల కీవ్యాధి తరచుగా వచ్చుచుండును. ఈ వ్యాధియందు కఫ మెక్కువగా పడును.

---

ఆరుద్ర వురిమితే అరువానలు పాడు.

కొన్నిటికి కఫముండదు. పశువు నరములు యథాస్థితిలో నుండకపోవుటచేతను, ఊపిరితిత్తులకు ఒత్తిడి గలుగుటవలనను, దీర్ఘమైన దగ్గులేక శ్వాసకోశములకు వేడి తగులుట వలనను ఈవ్యాధి రావచ్చును. ఈవ్యాధి తగిలినపశువు చాల కృశించి మిగుల విచారముగా నుండును. ఇది ముసలిపశువుల కెక్కువగావచ్చును.

## లక్షణము

పశువునకు ఆరంభములో కొదిగ జ్వర ముండును. తీవ్రమైన దగ్గుండును. పశువు ముక్కురంధ్రములనుండి తెల్లని జిగురువంటి పదార్థము నెలువడుచుండును. ముక్కురంధ్రములను పరీక్షించి చూచినయెడల ఎఱ్ఱని కురుపులుగానబడును. శరీరముమీది వెండ్రుకలు రాలిపోవుచుండును. రాలిపోవుటకు మిగిలినవెండ్రుకలు బాగుగాపెరిగి నిక్కబొడుచుకొని యుండును. పశువునకు వ్యాధి ముదిరినకొలది బుస ఎక్కువై చాల దూరమువరకు వినబడును. ఈ బుస ఎల్లప్పుడు నుండును. ఈ బుస చూచి పశువుయజమాని చికిత్స చేయిందుటకు ఆతురత పడుచుండును. ఈవ్యాధిగల పశువు అపానవాయువులు తరచుగా విడుచుచుండును. క్రమముగ జంతువుయొక్క కళ మారిపోవును. ఈ వ్యాధిగల పశువుతో కొందరు రైతులు పనిచేయించుదురు. అందువలన ఆ పశువునకు ఉచ్ఛ్వాస నిశ్వాసములు సరిగా ఆడక డొక్కలు ఎగురవేయుచుండును. పశువులకొట్టములో ఈ పశువును కట్టివేసి దానిబుస పరీక్షించినయెడల పిల్లికూతవలె నుండును. స్టెతస్కోపు పెట్టి పరీక్షించినయెడల చక్కగా తెలియును. వ్యాధి ముదిరినకొలది పశువుముఖపురంగు మారును. దగ్గుచున్నపుడు తెల్లని తెమడ ఎక్కువగా పడుచుండును. బుస ఎక్కువై పశువుమూలుగు చుండుటను, క్రమముగా పశువు నీరసము జెంది చనిపోవును.

## చికిత్స

కర్పూరతైలముగాని, యూకలిప్టస్ ఆయిలుగాని వేడినీటిలో వేసి సలసల కాగనిచ్చి ఆ యావిరి పశువుముక్కు రంధ్రములకు పట్టించవలెను.

వెంటనే అడ్డసరపాకు రసము అరసేరు, సొంటి 1తు, పిప్పళ్ళు 1తు, మిరియాలు 1 తు ఒకసారిమాత్రమే కలిపి త్రాగించవలెను.

లేక సారాయి 2 డ్రాములు, నిమ్మఉప్పు 1తు, సొంటి 1 తు, మిరియాలు 1తు, పసుపు 2 తు ఒకసారిమాత్రమే కలిపి త్రాగించవలెను.

లేక మంచిబెల్లము 2 సేర్లు, అల్లము 2 సేర్లు, వాము అరసోలెడు. తెచ్చి త్రొక్కి వెలగకాయంత ముద్దలుచేసి వారము దినములు తినిపించవలెను.

లేక వెల్లుల్లిపాయలు 4 తు, మిరియాలు 1 తు, వేపచెక్కపొడి 3తు, మేకపాలు అర్ధసేరు కలిపి నూరి త్రాగించవలెను. ఈరీతిగా వారముదినములు చేయుము.

---

అంద్రవాన అదురువాన

ధరా:—ప్రతిదినము విరేచనసాధకము చేయించవలెను. నూతినీరు త్రాగించవలెను.

పై చికిత్సలకు లొంగని యెడల నొసలునుండి మూతివరకు నాలుగు చుక్కలు పెట్టవలెను. ముందరి జబ్బలదగ్గర 9 చుక్కలున్న ఎద రాలలో ఒక చుక్క పెట్టవలెను. ఆసనమువద్ద ఒకచుక్క పెట్టవలెను.

## హెచ్చరిక

ఈ వ్యాధి కలిగిన పశువు పూర్తిగా ఆరోగ్యము చెందుట కష్టము. అందుచే పశువునకు పెట్టుమేత శుభ్రమైనదిగను బలము కలుగజేయునదిగను, సులభముగా జీర్ణమగునదిగ నుండవలెను. ఆహారము తగ్గించి పెట్టవలెను. పని చేయించుటకు ముందు కొన్ని గంటలవ్యవధి యుండునట్లుగా తేకి మేత తగినంత మేసి పనిచేయించవలెను. ఈ వ్యాధి గల పశువును విస్తారముగా ఎండలో పనిచేయించక ఉదయసాయంకాలములయందు మాత్రమే తేలికగా పనిచేయించవలెను. పశువును పరుగెత్తించరాదు. నియమితకాలము అందు మాత్రమే పని చేయించవలెను.

## కసిమిరి

ఎద్దులకును, తక్కువమేతమేయు పశువులకును, గాలిమంటు తగిలి ఎండలో తిరుగు పశువులకును, ఇంకను నరములు యథాస్థితిని తప్పుటవలనను, ఊపిరితిత్తులకు ఒత్తిడి కలుగుటవలనను, దీర్ఘమైన దగ్గుండుటవలనను, ఊపిరితిత్తులకు వేడి తగులుట వలన ఈవ్యాధి కలుగవచ్చును.

## లక్షణములు

దగ్గు చాల తక్కువగనుండును. ఆదగ్గు ధ్వనిని కలుగజేయునదిగ నుండినను కొద్దిదూరము మాత్రమే వినబడును. అప్పుడు గాలి ఆసనముగుండా వెడలుచుండును. ఈవ్యాధితో పాటు అజీర్తికూడ నుండును. అజీర్తిగా నున్నయెడల జంతువురూపము మారిపోవును. ఎల్లపుడు నీడకొరకు ఎదురుచూచుచుండును. వెంట్రుకలు నిక్కబొడుచుకొనును. బండి కట్టినయెడల డొక్కలు ఎగురవేయుచుండును. క్రమేణ పశువు కృశించి చనిపోవును.

## చికిత్స

నీరుల్లిపాయలు అర్ధసేరునవటాకు, మజ్జిగ అర్ధసేరు, కలిపి దినమున కొకపూట, పక్షముదినములు త్రాగించుము.

లేక మాదుగాకుపసరు పావుసేరు, కలినీరు అర్ధసేరు, కలిపి దినమున కొకసారి, వారము దినములు త్రాగించుము.

---

ఆరుద్ర కురిస్తే దారిద్ర్యం లేదు

లేక మంచిబెల్లము 2 సేర్లు, అల్లము 2 సేర్లు, తెచ్చి వెలగకాయంత ముద్దలు చేసి వారమురోజులు పెట్టుము.

లేక గంటెలు తెచ్చి వడ్డికూడుగా వండి అందులో మంచినూనె కలిపి తవ్వెడు, మానెడు వంతున 40 దినములు పెట్టినచో హరించును.

## హెచ్చరిక

గాలికుంటు తగిలినపశువుతో పనిచేయించరాదు. ఎండలో త్రిప్పరాదు. లేనిచో ఇటువంటి వ్యాధుల పాలగును. ఈ కసిమిరిగల పశువుతో పనిచేయించరాదు. తగిన ఆహారము వేళకు పెట్టుచుండవలెను.

## ముకుబంతి

ఆ॥ వె॥ నాసికంబునందు నంటియుండగనుండ
కాయ కోలనగుట కాననగును
నాకుచుండ జూలు నాసికమునయుండు
ముకును బతియండ్రు మూగములోను.

ఆ॥ వె॥ ముక్కునాళమందు ముడికాయ పెంపొంద
పసియు దగ్గునొంది బాధచెందు
నాసికంబునందు నడచుచుండును నీరు
గాలి పీల్చి వదల కష్టమగును.

దీనికే ముకుబంతి లేక ముంగబాతి అందురు. ఇది రెండు విధములుగా నుండును.

(1) ముక్కురంధ్రముల లోపలి పై భాగమున నొక విధమైన మాంసకండ గుండ్రని కోలగా నుండు కాయలవలె పెరుగును. అది ముక్కురంధ్రములలో నుండు శ్లేష్మపు పొరలకు ఒక సన్నని కాడవంటిదాని నంటుకొనియుండును. ఈ వ్యాధి చలిగాలివలనగాని, తదితర వ్యాధులవలనగాని లేత పశువులకు తరచుగా వచ్చుచుండును.

(2) ముక్కురంధ్రముల పొడుగున అనగా పైనుండి క్రిందవరకు చిన్న గుండ్రని బిళ్ళలవలెగాని, ఉండలవలె గాని మాంసము పెరుగును.

మొదటివిధమైన వ్యాధిగల పశువులకు దగ్గుచుండును. కాయగాని, ఉండగాని గొంతువద్ద అడ్డుపడుటవలన శ్వాస సరిగా ఆడక తన్నుకొనును, కొద్ది జ్వరముండును. కండ్లు యెర్రగా నుండును. ముక్కులగుండా ద్రవము వచ్చును. ముదిరినకొలది ద్రవము చిక్కబడును. పులిసియుండును.

---

ఆరు కార్తెలకు పోతుకార్తె ఆరుద్రకార్తె

రెండవవిధ మైనదానితో దుర్మాంసము పెరిగి బిళ్ళలుగాని, ఉండలుగాని, చిటికి యుండుట, నల్లగా (మగ్గుట, ముక్కురంధ్రముల వెంబడి చీమిడి వంటి పదార్థము కారుట, శ్వాస తీసుకొను సమయములో విస్తారముగా శబ్దము కలుగుట మొదలగు లక్షణములు కనబడును. వ్యాధి ముదిరిన కొలది పశువు ఆటునిటు తిరుగును. మూర్ఛ కూడ రావచ్చును.

## చికిత్స

మొదటి విధమైన రోగమునకు ఒకదారము గారుముడి వేసి ఒక సన్నని చివర మొటుగా నుండెడి పుల్లతోగాని లేక సన్నని తీగతోగాని, అముడిని లోపలికి తీసికొని వెళ్ళి జాగ్రత్తగా సన్నని కాడపై సుండు చోటను తగిలించి ముడిని లాగినయెడల ఆకాడ తెగిపోయి ఉండ బైటికి వచ్చును. దీనినే ముడుబంతియని చెప్పుదురు. ఈ ప్రకారము సాధ్యము కానిచో పశువైద్యశాలకు తీసికొనిపోయినయెడల వారు ఒకవిధమైన పనిముట్టుతో తీసివేసెదరు.

పశువు, శరీరము నాకికొనుటచే ఆబొచ్చు గేహములోనికి ప్రవేశించి పెద్ద పొట్టలో జేరి ఉండకట్టును. దగునపుడు ఆ కాయ నేలబడును. దీనినే మొగబంతికాయయందురు. ఈ కాయను ఆవుపంచితములో కొంతసేపు ఊరవేసి సాంబ్రాణి పొగ వేసి జబ్బుపశువుయొక్క ముక్కురంధ్రములదగ్గర కొంచెముసేపు వుంచి తరువాత పశువునకు ముమ్మారు దిగదుడిచివేయుదురు. ఇదియొక డాంబిక చికిత్సయేగాని పశువునకు ఈ రోగమువలన ప్రమాదము లేదనియు మూడు నాలుగు దినములుండి తానంత టదితో పోవునని కొందరు శాస్త్రము చెప్పుచున్నారు.

హారతి కర్పూరము ¼ తు జీలకర్ర 1 తు దానిమ్మ మొగ్గలు గుప్పెడు చనుబాలతో నూరి గుడ్డలో వేసి పిండి 5, 6 చుక్కలు 2, 3 దినములు ముక్కులలో పోయవలెను.

లేక పిల్లిపీచరగడ్డరసము ముక్కురంధ్రములలో పోసిన నెమ్మదియగును.

లేక కామంచిచెట్టు కాడలను ముక్కలుగ కోసి రోటిలో వేసి దంచి అపాడిని ముక్కురంధ్రములలో నస్యము చేయించవలెను.

లేక పాలతీగాకు రసములో వసగంధము కొద్దిగా కలిపి 10 చుక్కలు ముక్కులలో పోయుము.

## పీనసరోగము

ఈ వ్యాధి ఒక విధమైన యీగలవలన కలుగు చున్నది. ఇదికూడ అంటువ్యాధియే యని నా నమ్మిక. ముక్కు రంధ్రములలో ఈగలు జేరి ఒక విధమైన మలినపదార్థము విడిచిపెట్టును. తరుపరి ఆ రంధ్రములలో ఒక విధమైన చీము పతపలు పతపలుగా

---

పునర్వసు పుష్యమి కార్తులు వర్షించితే పూరేలి అమూల్యమైన తడియుదు.

నుండు పరువులుగా లేదును. ఇవి బాగుగా పెరిగి పగిలి చీము కారుచుండును. ముక్కును పరీక్షించినయెడల పతపలు స్పష్టముగా కనబడును. ఈ వ్యాధి ముదిరిన కొలది మెదడు నకు కూడ సోకి పశువు మరణమునకుకూడ సిద్ధమగును. ఈ వ్యాధి సంవత్సరమువర కుండును.

## లక్షణములు

పశువునకు జ్వరముండును. ముక్కులనుండి చిక్కని చీమిడి పడుచుండును. అప్పు డప్పుడు తుమ్ముచుండును. అది మేతమేయును, నోరు చాల అసహ్యముగా నుండును. ముక్కురంధ్రములచుట్టు ఉబ్బు మునురుచుండును. ఉచ్ఛ్వాస నిశ్వాసముల నాటంక పరచు చుండును. ఈ వ్యాధి ముదిరినకొలది గురక పుట్టి తుమ్ములెక్కువగును. అప్పు డప్పుడు ముక్కు వెదరి రక్తము కారుచుండును. పశువు చాల బాధపడుచుండును. సరియైన చికిత్స చేయనిచో పశువు కొలది కాలములోనే మరణించును.

## చికిత్స

ముక్కులను గోరువెచ్చని నీటితోగాని, పటికనీటితోగాని పిచికారీ జేయుచుండ వలెను.

తరువాత, హారతి కర్పూరము – 1 తు, వస – కై తు కలిపి అప్పుడప్పుడు ముక్కుల లోనికి పొర ఊదవలెను.

లేక, నీరుల్లిపాయల రసము – 1 తు, తులసిఆకురసము – 1 తు కలిపి ముక్కు లలో పోయును.

మీ తాలూకా గవర్నమెంటు వెటరినరీ డాక్టరుగారిచే ఇంజెక్షన్ చేయించుము.

## హెచ్చరిక

ఇటువంటి పశువులను ప్రత్యేకముగా నుంచుట మంచిది. వీటికి నీరు త్రాగుటకు, ఆహారమునిచుటకు ప్రత్యేకముగా తొట్లు నుంచవలెను. పశువు ముక్కురంధ్రములలో ఏవిధమైన గాయము లున్నను ఆ గాయములగుండ వెంటనే ఈ వ్యాధి సోకును.

## యౌవనమందమతి

ఈ వ్యాధి యౌవనము దాటిన పశువులలో మాత్రమే సామాన్యముగ కన్పించు చున్నది. సామాన్యముగా మేపబడినను, ఎక్కువగా మేపబడినను, సరియగు శరీరపరిశ్రమ లేకున్నను, ఎండలో ఎక్కువగా పనిచేసినను, పశువు కంఠమునకు తగిలించు పలుపుగాని త్రాడుగాని బిగిసికొని పోయినను ఈ వ్యాధి పశువులకు సోకును.

## లక్షణములు

పశువు వెంటనే క్రిందపడిపోవును. లేక అంతకుముందే బద్ధకము ప్రాప్తించి

---

పుశాల పరిస్థితి పూరిపిట్టతడ వదు.

చుట్టుప్రక్కల ఏమి జరుగుచున్నది చూడకుండ రెప్పలు మూతలు బడిపోవును. జంతువు చాల కష్టముతో ఊపిరి విడుచుచుండును. తక్షణమే జంతువు ఒకచోటనుండి కదలలేదు. తూలుచుండును. గాలి సరిగా పీల్చలేదు. దేహమునిండ చెమటపట్టును. శరీరములోని రక్తస్రావములకు ఆటంకము కలుగును. మనస్సునకు తెలియకుండగనే ఊపిరి విడువబడుచుండును. కొన్ని సమయములలో కడుపులో త్రిప్పుటకూడ కనబడును. పక్షవాతము కలుగవచ్చును. సరియైన చికిత్స చేయనిచో పశువు మరణించును.

## హెచ్చరిక

శరీరభాగములు కదుపవలెనంత దుస్థితిలో నున్నప్పుడు విరేచనము కొనియెడల మందీయవలెను. గాలి ధారాళముగా వచ్చు స్థలమందు పశువు నుంచవలెను. జంతువు శరీరభాగములను మాలీసు చేయవలెను. ముఖ్య అవయవముల దగ్గరను, వీపుమీదను జాగ్రత్తగా తోమవలెను. శిరస్సుమీద అప్పుడప్పుడు చన్నీటిని పోయుచుండవలెను. నాకలజావ పెట్టవలెను.

## చికిత్స

కర్పూరతైలము శరీరభాగములకు రాయవలెను.

లోపలికి సొంటి - 2 తు, నిమ్మఉప్పు - అరతులము, వేడినీరు - అర్ధసేరు కలిపి దినమునకొకసారి వంతున వారముదినములు త్రాగించవలెను.

లేక నీరుల్లిపాయల రసము పావుసేరు త్రాగించుము.

లేక ముసాంబ్రము 1 తు, ఇంగువ 1 తు, నీరు అర్ధసేరు కలిపి త్రాగించుము.

# శిరోరోగములు

## పిచ్చి (Insanity)

తే॥ పిచ్చికుక్కలు పసువుల పీకినంత
జబ్బుచిన్నెలు రోజు వత్సరముదాక
పసువు మూతి బిగించియు బాధపడును
తల్లి పడుచుండు రోగము తీవ్రమయిన॥

తే॥ మీదబడి క్రుమ్ము మానుజుని సాదురేగి
కోప మెక్కువయిపోయి తాపమొందు
దాహ మెక్కుడనయి నీరు త్రావుచుండు
తిండి దినకను చనిపోవుదిటవు దొరగి॥

ఈ వ్యాధి పాలిచ్చు ప్రతిజంతువునకు రావచ్చును. ఇది నిజముగా జంతువులకు కలిగెడివ్యాధియై యున్నది. ఇది మనుష్యులకుకూడ అకస్మాత్తుగా కలుగుచున్నది. ఈ వెఱ్ఱికి కారణభూతమైన దేదియో ఇంకను కనుగొన బడలేదు. కాని అదియొక జీవపదార్థ మనుటకు సందియము లేదు. ఈ వ్యాధిగల జంతువు దేహమందు విషమను పదార్థము నరములంగల భాగమందుండును. అనగా మెదడు, నరములు వీనియందును, ఉమ్మిని కూర్చునట్టి గవదలవంటి కొన్ని భాగములందును ఉండును, గవదలనుండి విషము ఉమ్మిమూలముగ వెలుపలికి వచ్చును, గాన వెఱ్ఱిపట్టిన జంతువులు కఱచుటవలన ఆవ్యాధి తదితర పశువులకు మనుష్యులకు సోకుచున్నది. అయినను వెఱ్ఱిపట్టిన జంతువుయొక్క విషము కాటుచేయేర్పడిన చర్మమునకు తగిలిననేగాని, అది సోకుడును కలుగజేయనేరదు. అట్టి కాటు సామాన్యముగా ఆవెఱ్ఱి జంతువుయొక్క పండ్లచే నేర్పడును. కాని మంగలికత్తి గాయములను, దోమకాట్లు మున్నగు చిన్నగాయములను ఆపశువు నాకినయెడల ఈవ్యాధి కలుగును. ఈవ్యాధి తగిలిన పశువునకు మూడు లేక అయిదు దినములవరకు రోగచిహ్నము లగుపడవు. ఇదియునుగాక తనంతట తాను వ్యాధి కలిగిన జంతువులకు సాధారణముగా వ్యాధి ప్రారంభించినది మొదలు కొన్ని దినములలోనే మరణమును కలుగజేయును. విషము వెన్నెముకకు, మెదడునకు చేరువరకు ఈవ్యాధి బయల్పడదు. ఈతావున చేరుటకై ఆవిషము నరములగుండా వ్యాపించును. కాబట్టి కాటు మెదడునకు ఎంత సమీపమునందుండునో, అంత త్వరగా విషము మెదడున కెక్కి అంత త్వరగా రోగ లక్షణములు కన్పించును. ఈ వ్యాధి కొన్నిటికి ఆరుమాసములవరకుండును.

## లక్షణములు

జంతువు మొదట వ్యాకులతతో నుండి మూతి విరచుచుండును. మనుష్యుల యొద్దకుగాని, తదితర పశువుల యొద్దకుగాని చేరుట కిష్ట ముండదు. గృహోపకరణముల క్రిందగాని, నిశ్శబ్దమైన స్థలములందుగాని దాగియుండును. రోగము ముదిరినకొలది కోపోద్రేకము కలిగి చిరాకుగ నుండును. కంటికి కనబడినవాని నెల్ల కఱవబోవును. ఈగలను పట్టుకొనుటకు ప్రయత్నించుదానివలె అరచుచు తిరుగులాడుచుండును. ఒక విధమైన చొంగ నోటినుండి కారుచుండును. ఆ చొంగ జిగటగాను, నురుగు నురుగుగాను ఉండును. ఆ చొంగ పశువుల పెదవులనుండి తీగవలె వ్రేలాడుచుండును. కండ్లు ఎఱ్ఱగా నుండును. ఇట్టి స్థితిలో ఆ జంతువునోరు కొంచెము తెరచుకొని సరిగా ముందునకు పరుగెత్తుచు మార్గమున దానికి కనపడు ప్రతివానిని పొడుచుచు కఱచుచు పోవుచుండును. ఆకలి మందగించును. దానికి దొరకునట్టి యేవస్తువునైనను తినబోవును. అది అరచునపుడు దానిఅరపు ఒక విధమైన లోహపు ధ్వనిగఆకూతగా మారిపోవునట్లు కనుగొనవచ్చును. ఇట్టి స్థితిలో మరణము సంభవించును. పక్షవాతము కలుగును. ఆహారము తినదు. క్రింది దవుడలు సన్నముగా నుండును. మ్రింగునపుడు విశేషముగా కష్టపడునట్లు విశదమగును.

---

ఆశ్లేషలో అడుగుకు ఒక చినుకు పడినా అడిగినన్ని వడ్లు పండును.

చిట్టచివరకు కాళ్ళు చచ్చుపడి విరేచనములై శుష్కించి చనిపోవును. కొంతకాలము కదలకుండ పడియుండిన తరువాత కొన్ని పశువులకు మరణము సంభవించును.

## చచ్చినతరువాత కనబడు లక్షణములు

ఈ వ్యాధిగల పశువుకడుపు కోసి చూచినయెడల మట్టి, రాళ్లు, పుల్లలు, గడ్డి, చింపిరిబట్టలు మున్నగు వస్తువులతో నిండియుండును. క్రిందిదవుడ వ్రేలాడును. చిక్కని ద్రవము కారుచుండును.

## చికిత్స

మగ పశువునకు పిచ్చియెత్తిన ఆడుపశువు మూత్రమును, ఆడుపశువునకు పిచ్చియెత్తిన మగపశువు మూత్రమును పూటకు అర్ధసేరు త్రాగించవలెను.

లేక ఈ వ్యాధిగల పశువు గాయముమీద గరిటెతోగాని, ఇనుప కడ్డీతోగాని కాల్చవలెను.

ఈ వ్యాధికి పశువుకొమ్ములనుండి మధ్యగా మూతివరకు ఒక వరుసగా చుక్కలు పెట్టవలెను. ముచ్చిలిగుంటలో ఒక చుక్క పెట్టవలెను.

## హెచ్చరిక

ఇటువంటి జంతువును సాధ్యమైనంతవరకు చంపరాదు. దానిని జాగ్రత్తగా గొలుసుతో కట్టివేసి పరీక్షించుచుండవలెను. ఆకాలము ముగియునప్పటికి అది యింకను బ్రతికి బాగుగనుండి వెర్రిలక్షణములు ఏమియు కనబడకయున్నయెడల దానికి వెర్రి పట్టలేదని గ్రహించవలెను.

## పొదుగువాపు (Garget)

## స్వభావము

ఈ వాపునే పాలనెల్లి, చనుపుండు అందురు. ఈ వ్యాధి అంటుసంబంధమైన సూక్ష్మజీవులచే కలుగును. ఇది పాడిపశువులకే సోకును. చలిగాలిలో ఎల్లప్పుడు నుండుటచేతను, పాలు పితుకునపుడు చేతికి పదునైన గోరులుండి అవి గ్రుచ్చుకొనుటచేతను, దూడలు పాలు త్రాగునపుడు కరచుటచేత గీరుకొనిన గాయములచేతను, లేక పాలద్వారము వలనను, ఈ సూక్ష్మజీవులు పొదుగులో ప్రవేశించును. ఏ చన్నులో ప్రవేశించునో ఆప్రక్క నంతటను గలుగును. ఇంకను పశువుల కొట్టములు మొగలుగునవి అశుభ్రతగా నుంచుట వలనను, పాలు పితుకువారి చేతులు శుభ్రముగా లేకపోవుటచేతను, ఈ సూక్ష్మజీవులు పొదుగులో ప్రవేశించును. కొన్ని జంతువులకు పాలు నిలువకట్టుట వలన కూడ ఈ వ్యాధి రావచ్చును. ఈరోగ జంతువుల పొదుగునుండి పాలు తీయునియెడల ఈ వ్యాధి తటస్థించును. ఇది అంటురోగమువలన తటస్థించును. అందు ముఖ్యముగా క్షయ

---

ఆశ్లేష ముసలికార్తె, ఆగి ఆగి తుంపర కురుస్తుంది.

రోగమువలన కలుగును. ఈ పాలసేర్లు దృష్టిదోషమువలన కూడ కలుగునని నాకు నమ్మకముగలదు. ఇంకను కొందరు చేరగాండ్రు వేళకు పాలు పిండక పాలు నిలవరము చేయుటచేత గూడ ఈ వ్యాధి రావచ్చును. ఇట్లు పాలు నిలవర ముంచుటవలన పొదుగు బాగుగా నున్నదని తదితరులు ఎక్కువ ధరకుకొందురను యుద్దేశముతో పాలు పిండరు.

## లక్షణములు

జంతువునకు తీవ్రముగా వ్యాధి తగిలినయెడల శరీరమునకు ఎక్కువ జ్వరము కలుగును. మేత నెమరు మానును. పొదుగు నాలుగు భాగములుగా నుండును. ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్క చన్ను ఉండును. ఈ చన్నులలో ఒకదానికిగాని రెంటికిగాని రావచ్చును. పొదుగు ఎఱ్ఱగా కందియుండును. వాచిన చన్ను గట్టిగా నుండును. పాలు వచ్చుట కష్టముగా నుండును. క్రమముగా పాలు తగ్గును. పాలు పితుకునప్పుడు మొదట కొంచెము పసుపువర్ణముగా నుండి తరువాత రక్తపుజీర కలిగి యుండును. ఇంకను రోగము హెచ్చిన కొలది పాలు చీముగా మారవచ్చును. ఈ స్థితిలో పొదుగు ప్రుళ్ళి కురుపు యేర్పడిన దని తెలిసికొనవలయును. ఈస్థితిలో పొదుగుయొక్క వేడిమి తగ్గి చల్లగా నుండి అసహ్యకరంగుగా నుండును. ఇంకను ఈ వ్యాధి ముదిరిన కొలది పశువు క్షీణించి చనిపోవును.

కొన్ని పశువులలో ఈ వ్యాధి అంత తీవ్రముగా నుండక పశువు మేతమేయును ఆరోగ్యముగానే యుండున ట్లుండును. కాని పొదుగు మాత్రము కొంచెము గట్టిగా నుండి మామూలుకన్న కొంచెము పాలు తగ్గుచుండును. కొన్ని దినములకు తిరిగి మనవారు చేయు ఏ వైద్యము వల్లనైనను మామూలు స్థితికి వచ్చుటయు గలదు. ఈవ్యాధి దీర్ఘముగా నున్నయెడల పొదు గంతయు చెడిపోయి ఒకటి రెండు లేక నాలుగు చన్నుల నుండియు పాలు రాక ఒక విధమైన పసుపుపచ్చగా పేరిన ఉండలవలె నుండు పదార్థము రావచ్చును. కొద్ది కాలమున ఆ చన్నులవెంబడి ద్రవము కారును. పొదుగు ఎండి పోయి గట్టిగా నుండును.

## చికిత్స

జ్వరము తీవ్రముగానుండి పేడవేయనిచో ఉప్పు చేరెడు, ముసాంబ్రము 2 తు వేడినీరు అర్ధసేరు కలిపి త్రాగించుము.

పశువు మేతమేయక నీరసముగా నున్నచో సారాయి 10 తు, మిరియాలపొడి 1½ తు, నూకలజావ అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

లేక 18 చింతకాయలు నీటితో రుబ్బి వడితిలో కలిపి రెండు మూడు పూటలు పోయవలెను.

లేక జీడిగింజలు 25 కాల్చి తినిపించవలెను.

---

మఖపుబ్బలు వరుపైతే మా అన్న వ్యవసాయము నావ్యవసాయము ఒకటే.

లేక చవుకు 2తు, సున్నము 1 తు కలిపి పశువు ఆసనము క్రింద మూడుగీతలుగా పెట్టుము.

## హెచ్చరిక

ఈ రోగము తగిలిన పశువును. దూరముగా నుండు ప్రత్యేకస్థలమునందుంచవలెను. పొదుగునకు దెబ్బలు తగులకుండ కాపాడవలెను. రోగము తగిలిన పాడిపశువుల పాలు పితికి వెంటనే మందుద్రావకములతో చేతులను శుభ్రముగ కడుగుకొనవలెను. అట్లు చేయక ఆ చేతులతోనే ఆరోగ్యముగానుండు పశువుల పాలు పితికినయెడల వానికి నిష్కారణముగా ఈ వ్యాధి సంభవించును. ఈ విషయమునం దెన్నడును ఏమఱి యుండ గూడదు.

నీటిని ఆవిరి వచ్చువరకు మఱుగ కాగనిచ్చి ఒక కంబళిగుడ్డ అందు ముంచి నీరు పోవునట్లుగా పిండి ఆగుడ్డతో పొదుగునకును, చన్నులకును, ఒక అరగంటసేపు కాపు తీయవలెను. పాలు రాక చన్నులు గట్టిపడినపుడు పాలగొట్టము (ఇది పశువుల ఆస్పత్రిలో నుండును.) పెట్టి చన్నులలోనుండు మలిన పదార్థములను తీయవచ్చును. ఇట్టి పనిని మనవారు చేయజాలరు. పొదుగు చీము పట్టినయెడల పొదుగు కోసి మందు వేయవలసి యుండును. ఇట్లు చేయుట మనకు సాధ్యము కాదు. ఇట్టి ప్రమాదకరమగు వ్యాధులు వచ్చినపుడు పశువులను మీ తాలూకా వెటరినరీ డాక్టరుగారికి చూపించుట మంచిది.

ముఖ్యముగా పుండ్లను కాకులు పొడువగూడదు. పుండ్లమీద ఈగలను ముసర నీయరాదు. ఆ పశువును నాకనీయరాదు. ఇట్లు జరుగుచో పుండ్లు శీఘ్రముగా మాని పోవును. మనవారు ఈ పొదుగు వాపునే దృష్టిదోషమని నెంచి వేపచిగురు, ప్రత్తిగింజలు ఉప్పు కలిపి పశువునకు ముమ్మారు దిగదుడిచి నిప్పులయందు బోసినయెడల ఆ పశువునకు దృష్టిదోషము పోవునట.

## కొమ్ముడొల్లలు

తే. శృంగములు మ్రోగు నోటిగ చీమిడియును
ముక్కువెంటను ధారగా పోవుచుండు
ఏడురోజుల కావును నేడ్చుచుండు
దగ్గుచుండును కొలదిగ త్రావునపుడు.

తే. మూతి సగమును నీటిలో ముంచి గుటక
వేయుచుండును దిగులున వెతలు గుడుచు
కొమ్ముమూదగ మారును నమ్మరాదు
కొమ్ముడొల్లని చెప్పిరి కోవిదులును.

---

పశువులకు జీర్ణశక్తి తగ్గుటచేతను, ఆహారము సరిగా పెట్టకపోవుటచేతను, శీతోవాతము వలనను, ఈ వ్యాధి ఉత్పత్తియగును. రక్తము క్షీణించుటవలనను, విషసంబంధమైన గాలిని పీల్చుటవలనను, పశువుయొక్క మెదడు కరిగిపోయి ముక్కులగుండ చిక్కని ద్రవముగాని, చీమిడివంటి పదార్థముగాని కారుచుండును. కొమ్ము కొట్టి చూచినచో ఓటిమోత మ్రోగును. ఈ వ్యాధి పుట్టిన వారముదినములకే పశువు క్షీణించుచుండును. వ్యాధి ముదిరినయెడల కొమ్ముమీదగాని, పార్శ్వపు మీదగాని పరిణమించును. కొమ్ములయందు రక్తమేమాత్రముండదు. రాతితడిసున్నము తెచ్చి కొమ్ముల మొదళ్లచుట్టు రాచి ఒక దినముంచినయెడల ముక్కులనుండి కారు ద్రవములో రక్తపు జీర కనబడును. ఈ రక్తపుజీర యున్నయెడల కొమ్ము డొల్లలని గ్రహించవలెను. ఈ వ్యాధిగల పశువును నీళ్లు త్రాగించునపుడు ముంతిని సగమువరకు నీటిలోముంచి గుటకలు వేయుచుండును.

## చికిత్స

ఈ వ్యాధికి అనేకములగు అనేకరకములుగా చికిత్సచేయుదురు. సొంటి 2 తు, ఆవుపాలు అర్ధసేరు వంతున దినమునకొకసారి చింతగింజంత వసగంధము దానిలోకలిపి త్రాగించవలెను.

లేక కారు ఇంగువ 1½ తు, వస ½ తు, మారేడాకు పసరు 3 తు కలిపి చెవులలోపోసి, చెవులు కొమ్ములకు కట్టవలెను.

లేక దిరిసెనాకు పసరు ఆవుపాలతో త్రొక్కి రసముతీసి అందులో వసగంధము చింతగింజంతచేర్చి చెవిలో పోయుము.

లేక వస 2 తు, రసకర్పూరము 2 తు, మంచిగంధము 4 తు, పొగాకు 6 తు పావుసేరు సున్నపు తేటలో కలిపి చెవిలోపోయుము.

లేక మిరియాలు 1 తు, చేదుజీలకఱ్ఱ 1తు, ఆవాలు 2 తు, వెల్లుల్లిపాయలు 2 తు కలిపి నూరి చెవిలో పిండవలెను.

లేక పొగాకు రసముతో నీరుసున్నము కలిపిగాని లేక అరతులము పాదరసముగాని, పశువుకొమ్ములకు బెజ్జములు వేసి బెజ్జములయందు పైమందువేసి గుడ్డపీలికలు పెట్టవలెను. తరువాత నీలిరంగు గుడ్డ కాల్చిన పొగ ముక్కులకు పట్టించవలెను.

## ఎండదెబ్బ

ఇది పశువుమెదడునందు గలిగెడు అస్వస్థతవలన కలుగును. బహుతీక్షణమైన ఎండలో పనిచేయించుట వలనగాని, ఆఱువాపుగల పశువులను ఎండలో పనిచేయించుట వలనగాని, పొలములలో నుండు చెట్లనీడదగ్గర నుండు పశువులకు వడగాల్పులు సోకుట వలనగాని ఈ వ్యాధి కలుగును.

---

సుఖపురిమితే మగురునీరాది కర్ర అయినా పండును.

## లక్షణములు

ఆరంభములో తీవ్రమైనజ్వర ముండును. కన్నులు ఎఱ్ఱగానుండును. దేహముమీద చెమట పట్టును. పశువు పలుమారు బుసపెట్టుచుండును. మూతి తడిలేక ఎండిపోవును. ఆకలి మందగించును. తలను అటునిటు ఊపుచుండును. ఈ వ్యాధి ముదిరినకొలది నిస్త్రాణ జెందును. శరీరము చల్లబడును. మూత్రము ఎక్కువగా విడుచుచుండును. ముఖము పాలిపోవును. ఊపిరి ఆయాసముగా విడుచును. కనుగ్రుడ్లు లోతునకు పోవును. క్రమముగా స్మారకము తప్పి నాలుక జారవిడిచి చచ్చిపోవును.

## చికిత్స

మాటిమాటికి పశువుతలమీద చన్నీళ్లు పోయుచుండవలెను.

సారాయి 2 డ్రాములు త్రాగించవలెను.

నిమ్మిపాయల గుజ్జు సేకరించి దేహమునకు పూయుము.

తరువాత నూనెలో చనుబాలు పోసి రంగరించి చెవులలో పోయుము.

## హెచ్చరిక

రైతులలో చాలమంది బండిమోకులను పడగాడ్పులలో బండ్లుగట్టి తోలుదురు. ప్రతిరైతు సాయంకాలము నాలుగుగంటలకు ఒకబిందెడు చన్నీళ్లు పశువు మెడమీద పోసినయెడల ఆదోషము పోవును. నూకలజావ పెట్టవలెను.

## కుంటేటి వెఱ్ఱి (Gidness)

దీనిచే తిక్కతెవులు, తిమ్మ అందురు. ఇదియును నాడికి సంబంధమైన వ్యాధియైయున్నది. నరములకు సంబంధించిన కొన్ని దుర్గుణములు ముందు ప్రారంభమగును. ఈ వ్యాధి ఎల్లప్పుడు వినుగు విరామము లేక పని చేయుచుండుట వలనను, సోమరితనముగా నుండుటవలనను, కపాలసంబంధమగు నరములశాఖ అస్వస్థత నొందుట వలనను పశువులకు కలుగుచుండును.

## లక్షణములు

ఈవ్యాధి మంచి బలముగల పశువులకు వచ్చును. పశువుతలలో నేదో యొక భాగము మేకు గ్రుచ్చుకొనినయట్లుండును. జ్వరము సమశీతోష్ణముగా నుండును. పశువు దవడలకు చాలబాధగా నుండును. నాలుక జారవిడుచుచు ముడుచుకొనుచుండును. తన తలను కొట్టపుగోడలకుగాని, తదితరవస్తువులకుగాని ఆనించి త్రోయుచుండును. వెఱ్ఱిచూపులు చూచుచు పైకెగురుచుండును. ఈ వ్యాధి ముదిరినకొలది పశువు గిరగిర తిరుగుచూ, నేలమీద పడుచు లేచుచుండును. ఈ విధముగా ప్రతి అరగంటకు

వచ్చును. మనుష్యులను కరవపోవును. కొమ్ములతో పొడుచును. బజారులవెంట పరుగిడు చుండును. ఆయాసముచే చొంగి వేయుచు క్రింద పండుకొనును. కాళ్ళు నిగడదన్నును. నడువలేదు. క్రమేణ నీరసము జెంది పశువు చనిపోవును.




## చికిత్స

కరిదూపము - చేరెడు, శొంటి - నవటాకు, మిరియాలు 2 తు, పిప్పళ్లు 1 తు కలిపి కషాయముకాచి దానిలో బీరాకుపసరు - తవ్వెడు, నెయ్యి - తవ్వెడు కలిపి త్రాగించవలెను.

లేక పశువు కొమ్ములకు నూనెగుడ్డలుచుట్టి వెలిగించవలెను. ఈ వేడిచే రోగము అగును.

లేక జనుపనారకొస కొమ్ములకు చుట్టి బిగించవలెను. ఇట్లు ఒక గంటసేపుంచి ఊడదీయవలెను.

పశువు కొమ్ములమట్టు చుక్కలు పెట్టవలెను. నుచ్చిలిగుంటలో ఒక చుక్క పెట్టవలెను. మూతిమీద మూడు అడ్డగీతలు గీయవలెను.

## హెచ్చరిక

ఇటువంటి వ్యాధిగల పశువును చాల జాగ్రత్తగా కాపాడవలెను. బండిమోకులు గాని, చొప్పత్రాళ్లుగాని, గుక్కమోకులుగాని తెచ్చి ఆ పశువు మెడకువేసి చెట్టునకు గాని బండికిగాని కట్టవలెను. లేనియెడల పశువునకు ఉద్రేకము వచ్చినపుడు నిలువక గోడలకుగాని చెట్లకుగాని తలతలను వేసి కొట్టుకొనును. అప్పుడు పశువునకు ప్రాణాపాయము రాగలదు. ఈ పశువులు చికిత్సకు లొంగుట చాల కష్టము.

---

పుబ్బ రేగినా బూతు రేగినా నిలువదు.

## హిస్టీరియా

ఇది మెదడు సంబంధమగు రోగమైయున్నది. ఇది పనిచేయించకుండ సోమరిగా నుండు పశువులకు సంభవించును. ఇది వాతరోగమువలనకూడ కలుగును. ఈ వ్యాధిని కనిపెట్టుట చాల కష్టము. ఈ వ్యాధిగల పశువును ఎక్కువగా కష్టపెట్టరాదు.

## లక్షణములు

ఆరంభములో శరీరముపైని చెరుటలు పట్టును. వణకుచుండును. శరీరము కృశించును. కన్నుల నటునిటు త్రిప్పును. నోటినుండి నురుగు వచ్చుచుండును. దౌడలు బిగిసికొని పోవును. ఈ వ్యాధి వచ్చుటకు పూర్వము మేత తినదు. ఉచ్ఛ్వాస నిశ్వాసము లెక్కువగును. అప్పుడప్పుడు పశువు అరచును. ఈ విధముగా ఒక గంట లేక రెండు గంటలనుండి తగ్గును. లేక వ్యాధి ముదిరినయెడల ఒకపూటవరకుండి తగ్గును.

## చికిత్స

ఈ వ్యాధి రాగానే చన్నీళ్లు ఒక బిందెడు తలమీద పోయవలెను. లేక స్మెల్లింగుసాల్టు వాసన చూపించుచును. ఒక తులము ఇంగువను, అర్ధసేరు వేడినీటిలో కలిపి వ్యాధి రాకమునుపే త్రాగించవలెను.

ఈ వ్యాధి ఆరంభించిన వెంటనే గంజాయిపత్రి 1 తు, నూకలగంజి - అర్ధసేరు, ఇంగువ 1 తు కలిపి త్రాగించవలెను.

లేక 6 నిమ్మకాయల రసము త్రాగించుము.

లేక గాడిదమూత్రము - సేరు త్రాగించుము.

లేక రావినెక్కరసము - అర్ధసేరు, ఆవుపాలు - అర్ధసేరు కలిపి వారముదినములు త్రాగించుము.

ఇదివరకు ఈ గ్రంథములో చూపించిన తలతిరుగుడురోగమునకు చేయువాటినే ఈ వ్యాధికికూడ చేయవచ్చును.

## నాలుక సేర్లు

ఈ వ్యాధికూడ పాడి పశువులకు తరచుగా వచ్చుచుండును. నాలుకకు దెబ్బ తగులుటచేతగాని, ముండ్లగడ్డి తినుటచేతగాని, నాలుక కోసికొనిపోవుటచేతగాని, పొదుగునకు జబ్బు చేయుటచేతగాని, పొంగు తగ్గి పొంగు తక్కువ నిచ్చుటచేతగాని, ఎల్లప్పుడు తవుడు జనుపకట్టలు ఎక్కువగా మేయుటచేతగాని, చలిగాలి సోకుటచేతగాని, గొప్పవర్షములకు తడియుటచేతగాని ఈ వ్యాధి కలుగును. ఈ వ్యాధికికూడ అనేక ఆయుర్వేద చికిత్సలు చేయుదురుగాని సామాన్యముగా లొంగదు.

---

## లక్షణములు

ఆరంభములో జ్వర ముండును. వెనుక కాళ్ళు కొన్ని పశువులు పట్టివేయును. పొడుగును ఒత్తినయెడల తన్నును. పాలు తక్కువగా నిచ్చుచుండును. అప్పుడప్పుడు నోటివెంట చొంగ పడుచుండును. వ్యాధి ముదిరినకొలది పశువు మేత తినజాలదు. దాహ మెక్కువగుచుండును. ఆహారనాళము గూడ నొప్పిగా నుండవచ్చును. దెబ్బ తగిలిన భాగము ఎఱ్ఱగా కంది యుండవచ్చును. వ్యాధి ముదిరినకొలది పాలెండిపోయి పశువు క్షీణించి మరొక వ్యాధికి లోనై పశువు మరణించును. నాలుక లావై మొద్దుబారి యుండును. దానిని నటునిటు కదల్చలేదు. నాలుక యెక్కువగా వాచిన యెడల వ్యాధి కుదురుట కష్టము. ఈవ్యాధి తగిలిన పశువునకు తవుడు, చిట్టు విస్తారముగా మేపరాదు. జనుపకట్టలు వేయరాదు. తదితర దాణాదినుసులు వాతము చేయునవి పెట్టరాదు.

## చికిత్స

పశువునాలుక యెత్తి పరీక్షించినయెడల నాలుకక్రింది భాగమున రెండు నెత్తురు నరములు పైకి తేలియుండును. అవి నలుపురంగుగా నుండును. వానిలో చెడునెత్తురుండును. ఆనెత్తురుండుటచే సరిగా పశువు పాలీయదు. కాబట్టి పశువును పడగొట్టి నాలుకక్రింద నుండు చెడు రక్తనాళములను సూదితో గుచ్చి వేయగనే నలుపు రంగు గల నెత్తురు కారును. ఆ నెత్తురు కారిన తరువాత పటికపొడి అద్దవలెను.

లేక తిప్పతీగె 4 తు, పిప్పళ్ళు 2 తు, వేపచెక్క 4తు, కటకరోహిణి 2తు, రెండు సేర్ల నీటిలోవేసి కాచి అప్పుడప్పుడు పుక్కిలింపు చేయుచుండవలెను.

లేక మైలతుత్తపు లోషనుతో అప్పుడప్పుడు నోరు కడుగుచుండవలెను.

ఈ వ్యాధికికూడ అప్పుడప్పుడు యీ దిగువ మందు లీయవలయును.

చేదుజీలకఱ్ఱ 2తు, మిరపకాయలపొడి 1 తు, వేడినీరు అర్థసేరు కలిపి త్రాగించవలెను.

నాలుగుదినముల కొకసారి మల్లాన్ ఇంగువ 1 తు, వేడినీరు అర్థసేరు కలిపి త్రాగించవలెను.

## అర్లు పెరుగుట (Pharyngel polypus)

పశువు గొంతుకద్వారము మొదలు దవడలవరకు ఒక విధమైన మెత్తని ముండ్లుండును. వీటినే అంగిటిముండ్లందురు. అంగిటిలో ఒకవిధమైన పొర యుండును. జీర్ణకోశము తగినంత పనిచేయక గాని, జలుబువలనగాని లేక ఆహారలు ఏ కారణముచేతనైన విస్తరిల్లుటవలనగాని ఒకవిధమైన ముండ్లేర్పడును. ఈ ముండ్లు తెలుపురంగుగను, మరికొన్ని నలుపురంగుగను ఉండి నిక్కబొడుచుకొని సూదులవలె నుండును. ఈ

---

పుబ్బ ఉబ్బిబ్బిమరికినా గుబ్బచ్చి చెట్టుక్రింద నానను.

ముండ్లను సరియైన చికిత్స చేయనిచో పశువుయొక్క గొంతుభాగము వాచి ఎక్కువ బాధ చేయును.

## లక్షణములు

పశువు మేత మేయునపుడు చాల బాధపడుచుండును. మేత నెమరుకూడ మానును. నాలుక లావుబారియుండును. మేత తినలేక అప్పుడప్పుడు క్రక్కుచుండును. ఒక విధమైన జిగురు నోటినుండి వెలువడుచుండును. పశువు మూతి విరచుచుండును. వ్యాధి ముదిరినకొలది పశువు విచారముగా నుండును.

## చికిత్స

అంగిలిలో నున్న ముండ్లను కత్తెరతో కత్తిరించవలెను. సామాన్యమైన కత్తెరలు పనికిరావు పశుచికిత్సాలయములో నుండు కత్తెరలు చాల మంచివి. కత్తిరించుటకు పూర్వము పటికపొడి ఆముండ్లపై రాచి కత్తిరించవలెను. నెత్తురు కారినను భయపడ నవసరములేదు. కత్తిరించునపుడు చాల జాగ్రత్తగా కత్తిరించవలెను. తెలిసి తెలియని వైద్యులు కత్తిరించిన మొదల నాలుకగాని, దవుడల భాగపు మాంసముగాని తెగిపోవును కాబట్టి చాల జాగ్రత్తగా కత్తిరించవలెను. ఎక్కువ పొడుగుగా పెరిగిన ముండ్లుగాని, మొద్దుబారియుండు ముండ్లుగాని కత్తిరించవలెను. చిన్నవి కత్తిరించక పోయినను నష్టము లేదు.

మన స్వదేశీయ వైద్యులు వస్తువంటి చేటలో వేసి చెరగనుండ కొంచెము ఉప్పు కలిపి రెండు మూడు పూటలు ఆ ముండ్లపైన వేసి తోముదురు. కాని కత్తిరించినంత దృఢముగా ఈచికిత్సను బాగుండదు.

## నోటి పూత

పశువునకు జలుబువలనగాని, అతివేడివలనగాని, జ్వరమువలనగాని ఒక విధమైన పురుగువలనగాని పాదరసము మొదలగు విషపదార్థములు పశువులు మ్రింగుటవలన గాని ఈ వ్యాధి రావచ్చును.

## లక్షణములు

అప్పుడప్పుడు జ్వర ముండును. నోటిలోపలను నాలుకమీదను చిన్నచిన్న పొక్కులు బయలుదేరును. ఈ పొక్కులు పగిలిన కొలది పుండ్లగును. ఈ పుండ్లు పగిలి నోరంతయు వ్యాపింపవచ్చును. పశువు చొంగ కార్చుచుండును. నాలుక నొప్పిగా నుండును. నాలుక ఎఱ్ఱబడి యుండును. ఈ వ్యాధి ఎక్కువగా దూడలకు కలుగు చుండును.

మఖపుబ్బలువరపిట్టో,నువా తెనఖ్షుంచవచ్చు,ఇ త్తచుంచిఎత్తగంపు,నాస్తుముంచిపోయునా

## చికిత్స

నోటిపూత సామాన్యముగా నున్నను, నోటియం దంతటను పెద్దపెద్ద పుండ్లు పడినను వెలిగారముగాని, లేక బోరిక్ ఆసిడ్ అను తెల్లపొడిగాని, పొటాసియం క్లోరేట్ అను ఇంగ్లీషుమందుగాని తేనెలో కలిపి నోటికి పూయవలెను.

పురుగుసంబంధమైన నోటిపూత యైనయెడల వెలిగారము తేనెతో కలిపి లేహ్యముగా నుండునట్లుచేసి నోటికి పూయవలెను.

పాదరససంబంధమైన నోటిపూత విస్తారముగా పాదరసము మున్నగు విషసంబంధమగు పదార్థముల మూలమున కలుగును. దీనికి పొటాషియం క్లోరేట్ కలిపిన నీటితో కడుగవలెను.

లేక వగరుగా నుండు తుమ్మచెక్క, రావిచెక్క, తంగేడుచెక్క మున్నగు చెక్కలతో కాచిన నీటితోగాని. పటిక, మైలతుత్తం మున్నగునవి పొడిజేసి వేడినీటిలో కలిపిగాని కడుగవలెను.

## హెచ్చరిక

ఈ వ్యాధి ముఖ్యముగా ఆహారవిషయములో కడు జాగ్రత్త తీసికొనవలెను. బార్లీధాన్యము దొరకనియెడల నూకలజావతో కోడిగ్రుడ్లరసము కలిపి పెట్టవలెను.

---

# మూత్ర వ్యాధులు

## రక్త మూత్రము

ఆ॥ వె॥ పసికినుండు మొదట బాయని జ్వరముండు
కదలకుండ వాల్చు కర్ణమంత
మూత్ర మెరుపుజెంది మూడురోజులలోన
బలముతగ్గి మిగుల బాధజెందు॥

ఈ రోగము అతివేడి చేయుటవలనగాని, విసుగు విరామము లేక పనిచేయించుట వలనగాని, విషసంబంధమగు గోమారులు పశువు శరీరములో ప్రవేశించుటవలనగాని కలుగవచ్చును. ఈ వ్యాధి విషయములో ముఖ్యముగా రోగనిదానము కనిపెట్టవలెను. గోమారులవలన వచ్చినచో చాలా ప్రమాదమని గ్రహించవలయును.

---

హస్తమి అతివానకాలము చస్తిమి గొల్లబోయలారా, బండమీద దొడ్లు నేయండి

## లక్షణములు

ఆరంభములో జ్వరము తీవ్రముగానుండును. చలికూడ నుండవచ్చును. శరీరము, బొడ్డుస్థానము నుడుచుకొనును. ముఖ్యముగా మూత్రము ఆరంభములో తుమ్మచెక్క కషాయపు రంగువలె పలుచగానుండి వ్యాధి ముదిరినకొలది రక్తమువలె పోయుచుండును. పశువు మూత్రము ఎక్కువగా పోయుకొలది శుష్కించును. మలబద్ధకముండును. ఆకలి మందగించును. దగ్గుకూడ యుండును. నాలుగునుంచి వారముకోజులలో మరణించును. అతివేడిజేసి రక్తమూత్రము పోసిన తగిన చికిత్స చేసిన క్రమేపి తగ్గును.

## చికిత్స

ఆరంభములో వ్యాధి లక్షణములు కనుగొని జ్వరము తీవ్రముగా నున్నపుడు సూరేకారము 4 తు, మంచిగంధపుపొడి 6తు, చల్లటినీరు సేరు కలిపి ఒక్కపర్యాయము త్రాగించవలెను. పచ్చిగడ్డి తినిన పెట్టవలెను.

అప్పుడప్పుడు ఉప్పు 2 తు, పటిక 2 తు, కలిపి నూరి సేరు నీటిలో కలిపి దినము నకు రెండుమూడు మోతాదులు యిచ్చిన తగ్గును.

తుమ్మచెక్కరంగుగా మూత్రముండి తెలుపుగా, జిగటగల కండలుకూడ పడుచు ఈగలు వాలుచున్నయెడల ప్రమాదమని గ్రహించవలెను.

ఇట్టి సమయములో మెంతిపిండి 15తు, దూసరాకుపసరు సేరు, నీలిమందు 1తు కలిపి ఒకే మోతాదు ఈయవలెను. లేక కొవిరాయి అరగదీసి సేరు నీటితో కలిపి పెట్టుము. అప్పుడప్పుడు నూకల జావగాని బార్లీజావగాని పెట్టవలెను. వేడిజేసి రక్తమూత్రము పడు చున్నపుడు కొబ్బరి బొండములోని నీటిని రెండు సేర్లు త్రాగించి, పేరినెయ్యి 15 తు, పెసరగుగ్గిళ్లు సోలెడు, పంచదార చేరెడు కలిపి పెట్టుము. వేడినీటిని త్రాగించవలెను.

లేక ట్రిపన్‌బ్లు ఇంగ్లీషుమందుగలదు. నీలిరంగు నీరావలెనుండును. దీనిని ఒక ఔన్సు అరఖును లోపలికి సేరు నీటిలో కలిపి త్రాగించుము. లేక రక్తనాళములోనికి ఇంజెక్షన్ ఈయవచ్చును.

## మూత్రపుసంచిలోరాళ్లు (Urinary calculus)

దీనినే శిలామేహావాతము, ఉచ్చబుడ్డ కంకట, వాకట, వీర్యముగట్టి పడుట అని పలువిధములుగా చెప్పుదురు.

ఈ సంవత్సరము ఈకేసులు మా చికిత్సాలయమునకు ఎక్కువగా వచ్చినవి.

ఈవ్యాధి అతివేడివలనను, మలబద్ధకము వలనను, కొరజపు అస్వస్థతవలనను ఎక్కువగా పనిచేయించుటవలనను, తిరిగి తిండిలేని దినములవలనను ఈవ్యాధి కలుగును. ఇది బహుచిత్రమైన వ్యాధి.

---

ఉత్త ఉరిమిమురిసినా పాము తిరిగికరిచినా విరగదు.

## లక్షణములు

జ్వరము బాగుగానుండును. పశువు తోకనెత్తుచుండును. పేడ వేయవలెనని తినుకుచుండునుగాని బయటపడరాదు. అర్ధమేత మేయుచుండును. మరికొన్ని మేయక బాధ పడుచుండును. మూత్రము రక్తములోనికి జీర్ణించి కనుగుంటలు విడచును. వ్యాధి ముదిరిన




కొలది దాహ మెక్కువగా నుండును. నీరు త్రాగినకొలది పొట్టయుబ్బును. మూత్ర కోశము ఉబ్బి పేడవచ్చు మార్గమునుకూడ బంధించును. క్రమేపి పశువు ఉష్కించి రక్తము తలకెక్కి చనిపోవును. మరికొన్ని పశువులు మూత్రము ఎరుపుగాగాని, పసుపు పచ్చగాగాని చుక్కలుచుక్కలుగా పడుచుండును. ఇట్లు పోయుటవలన కొంత ఆశ కలుగునుగాని వారము లేక పక్షము, నెల దినములవరకు యుండి చచ్చుటయు గలదు. మరికొన్ని మూడునాలుగు రోజులలోనే చనిపోవును. కాబట్టి ఈవ్యాధి వచ్చిన తరువాత అయిదారు రోజులలో మూత్రము పోయనిచో ఆపశువునకు వైద్యముచేయుట వృథా యని గ్రహించవలెను. ఒకవేళ పదిదినములైన తరువాత పోసినప్పటికి మరల కొద్ది కాలములో ఈ వ్యాధి మరల సోకి పశువును చంపునని తెలిసికొనవలెను.

---

ఉత్తర పురుషుతప్పినా, రాజా పాడితప్పినా, చెదపురుగునకు రెక్కలువచ్చినా కష్టము.




## చికిత్స

ఆరంభములో గోరువెచ్చని నీటితో ఎనిమా చేయవలెను. మనిషివలె పశువునకు మూత్రకోశములో కడ్డీఎక్కించి తీయుటకు వీలులేదు. పైపటములో పశువు మూత్రకోశము ఏరీతిగా వంకరగానున్నదో చూడుడి. రైతులు ఆతురతపడుచుందురు. మూత్రకోశములో నునుపువంటి చక్కని రాళ్ళుపుట్టును. ఇవే అడ్డుపడి పశువును బాధించును. శస్త్ర చికిత్సచేసి నప్పటికి చాలా పశువులు చనిపోవును.

ఆరంభములోనే మూత్రమును జారీచేయు నూరేకారము, రేవల్చిన్ని, కొబ్బరి పీచు మున్నగునవి అనుభవముమీద వాడవలెను.

## అతిమూత్రము

పశువును ఎక్కువగా పనిచేయించుట వలనను, న్యూమోనియా వ్యాధి సంభవించుటవలనను, కారిజము సరిగా పనిచేయకపోవుటవలనను, విషపదార్థముల తినుటవలనను, సీటిరుంగ మొదలగు గడ్డి దినుసులు తినుటవలనను ఈ వ్యాధి కలుగుచున్నది. ఇది తరచుగా సంభవించెడి వ్యాధికాదు. ఇంకను పశువు శరీరములో నుండు చక్కెర పదార్థము తెక్కువగా కలియుటవలనకూడ ఈ వ్యాధి కలుగును. అందుచే దేహములోని జలభాగము అన్నియు పొంగి ప్రవహించును.

## లక్షణములు

మూత్రము ఎక్కువగా వచ్చుచుండును. మూత్రము హెచ్చుగానగుచు వ్యాధి ముదిరినకొలది దినమునకు 250 మొదలు 400 ఔన్సుల వరకుకూడ నగును. పశువు కృశించును. ఈ మూత్రముపై ఈగలు విశేషముగా మూగుచుండును. ఈ మూత్రము

---

ఉత్తరచూడి ఎత్తరగంప, విశాఖమూది విడువగొంప.

పడిన భాగము ఎండిపోయి పిమ్మట తెల్లగా నుండును. ఈ తెలుపురంగునుబట్టియే ఈ రోగనిదానమును గ్రహించవలెను. మేత సరిగా మేయదు. పశువు కాళ్ళు వాచును. కండ్లు పొరలు గ్రమ్మును. ఈ వేడి సమానముగా నుండును. వర్షము కురియునప్పుడు, మబ్బుగా నుండునపుడు, నీరు డెక్కువగా పోయును. కొంత వేడిగానుండదు. ఈవ్యాధి గల పాడిపశువులు సరిగా ఎదకొవ్వు.

## చికిత్స

పచ్చి వెల్లుల్లిపాయలు - అర్ధసేరు నవటాను, కల్లుబెల్లము - అర్ధసేరునవటాను కలిపి త్రొక్కి పెట్టవలెను. ఇట్లు వారము దినములు పెట్టవలెను.

లేక కలబందరసము 4 తు, ఆవుపాలు - అర్ధసేరు కలిపి అప్పుడప్పుడు పెట్టవలెను.

లేక పటికపొడి - అరతులము, వేడినీరు - అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

లేక పచ్చికంగేడు చిగుళ్లరసము 3 తు దినమున కొకసారి త్రాగించవలెను.

## హెచ్చరిక

గోధుమపొట్టుగాని, కందిపొట్టుగాని, నువ్వులపొట్టుగాని, తెలికపిండిగాని, ఉలవ గుగ్గిళ్ళుగాని, నువ్వులు బెల్లము కలిపి త్రొక్కిగాని పెట్టుచుండవలెను. ఈ వ్యాధిగల పశువునకు అప్పుడప్పుడు విశ్రాంతి నిచ్చుచుండవలెను. పశువు ఎంత ఆహారము తినినను, ఎంతనీరు త్రాగినను తృప్తికాదు.

## వీర్యనష్టము

ఆ॥ వె॥ మూత్రమందు వీర్యము పడుచునుండగ
బక్కచిక్కి పశువు బాధనొందు
వీర్య పటిమతగ్గి వీసక నుండును
కడుపునొప్పి మఱియు కాంతితొలగు॥

ఈ వ్యాధి వాతమువలనగాని, మిగుల కొకవలనగాని, అజీర్ణవలనగాని, మత్తు పదార్థములు పెట్టుటవలనగాని, మలబంధమువలనగాని, వేడిపదార్థములు పెట్టుటవలన గాని, ఆసనభాగములకు దెబ్బ తగులుట వలనగాని, గనేరియా వ్యాధివలనగాని రావచ్చును.

## లక్షణములు

ఆరంభములో మూత్రము ధారాళముగా పోయుచు చివరకు సున్నపుతేటవంటి మూత్రమును విడుచును. ఈ వ్యాధి ముదిరినకొలది మలబద్ధక మేర్పడును. మూత్రము వెంట అప్పుడప్పుడు వీర్యము పడుచుండును. మూత్రకోశము చెడిపోవును. మూత్రాంగ

---

వృష్టికిప్రమాణం ఉత్తరహస్తలు.

పటుత్వము పోయి వీర్య మెక్కువగా పడుచుండును. అప్పుడప్పుడు వీర్యము చుక్కలు చుక్కలుగా గాని, దతిపలు దతిపలుగా గాని, పడుచుండును. ముల్లు గ్రుచ్చుకొని నట్లుగా మంటను గలిగి యుండును. సొమ్మసిల్లుచుండును. కడుపునొప్పి యుండును. దుర్బలత్వ మెక్కువై పశువు నీరసించి చావుకు సిద్ధమగును.

## చికిత్స

నీరుల్లిపాయలు అరవీసె, ఆవుపాలు సేరు, జిల్లేడుపువ్వులు 6 గుప్పెళ్ళు, నల్లమందు అరతులము కలిపి ఉడకబెట్టి వెలగకాయంత ముద్దచేసి రెండు పూటల రెండు ముద్దలు పెట్టవలెను.

లేక జాజికాయ 4 తు, జాపత్రి 3 తు, లవంగాలు 4 తు, పోకచెక్కలు 2 తు కలిపి పొడిచేసి తేనెతో పదనుచేసి తగువరకు ప్రతిపూట తినిపించవలెను.

లేక అరటిపండు సగముముక్కలో నిలువున వ్రేలితో రంధ్రముజేసి దానినిండ మఱ్ఱిపాలు పోసి ఒకగంటసేపుంచి పశువునోటిలో వేయవలెను.

లేక మామిడిపిందెల చూర్ణము 2తు, పెరుగు అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

## హెచ్చరిక

ఈవ్యాధిగల పశువుతో పని చేయించరాదు. విరేచనములకు అప్పుడప్పుడు మందిచ్చుచుండవలెను. అజీర్తి యున్నచో తగినచికిత్స చేయవలెను. సరియైనవేళకు ఆహారము పెట్టవలెను.

## నీరు చురుకు

ఆ॥ వె॥ మూత్రకోశమందు ముడికండ నుండంగ
ఉచ్చబుడ్డ వాచియుండు మిగుల
పొట్ట బిగియబట్టి మూత్రము రాకుండు
పండ్లు కొరుకుచుండు బాధతోను॥

ఆ॥ వె॥ వెన్నుక్రిందనుండు వేగంబె నొప్పియు
మూత్రమును విడువగ ముక్కుచుండు
మొండదెబ్బ మిగుల నేర్పడుచుండగ
నీరు చురుకనంగ నెగడుచుండు॥

---

అన్నకొద్దిలు మరయుకపోతే వాస్త వప్పుడు మరయును.

పశువుయొక్క ఉచ్చబుడ్డ వాచుటచేతను, దానిలో రాయి ఉండుటచేతగాని, చిరుకప్పులు కరుచుటచేతగాని చలిగాలికి లోనగుటచేతగాని, మిగుల వేడిచేయుట చేత గాని, మూత్రము పోయనీయకుండ బండికట్టి సవారిచేయుంచుట చేతగాని, అలసటను కలుగుచేయు వ్యాధులు కలుగుట చేతగాని, మూత్రకోశము ముడుచుకొనుట చేతగాని, అజీర్తిచేతగాని, మితము తప్పి పనిచేయించుటచేతగాని, ఈ వ్యాధి కలుగును.

## లక్షణములు

ఈ వ్యాధికికూడ కడుపునొప్పివ్యాధిలక్షణము లుండును. మూత్రము గొట్లు బొట్లుగా పడును. మూత్రము పోయునపుడు చురుకుగా నుండును. కడుపు బిగబట్టును. పశువు వెన్నుయొక్క క్రిందిభాగమునం దొకవిధమైన నొప్పియుండును. నీరుడు వెంట వెంటనే విడువవలెనను కోరికయుండునుగాని విడుచునపుడు బాధపడుచుండును. పండ్లు కొరుకుచుండును. వ్యాధి అభివృద్ధి నొందిన కొలది పశువు పాలిపోవును. రాత్రులయం దెక్కువగా మూత్రము విడువవలెనని యిచ్ఛయుండును. అజీర్తి కలుగవచ్చును. ఊపిరి పీల్చునపుడు ఆయాస మెక్కువగా నుండును. క్రమేణ పశువు క్షీణించి చనిపోవును.

## చికిత్స

సూరేకారము 2 తు, వేడినీరు - అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

లేక దూసరాకు 2 పిడికెళ్ళు, తాటిబెల్లము - అర్ధసేరునవటాను, మంచిబెల్లము - అర్ధసేరునవటాను కలిపి ముద్దలుచేసి పెట్టవలెను.

లేక రేవల్చిన్నిరసము - గిద్దెడు, మజ్జిగ - అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

నీరుల్లిపాయలరసము - పావుసేరు త్రాగించవలెను.

## హెచ్చరిక

పశువులకు చలిగాలి తగులనీయరాదు. నూకలజావ పెట్టవలెను. ఈ వ్యాధి విషయమై ఆరంభములోనే తగు చికిత్స చేసినయెడల నెమ్మదించును. పశువు మూత్రకోశ ములో వ్రేలుపెట్టి చూడవలెను. రాయి యున్నయెడల తీసివేయవలెను.

---

హాస్తమిచూచి అందరం పోదాము.

# విషతంత్రము

## పదిఎనిమిదవ భాగము

### విషోత్పత్తి

పాలసముద్రమున దేవదానవులు మధించుసమయమున అమృతము పుట్టుటకు ముందుగా తీక్ష్ణతేజస్సు గలవాడును, భయంకరాకృతి గలవాడును, పసుపురంగు వెండ్రుకలు గలవాడును, నాలుగుకోరలు గలవాడును, అగ్నిసదృశమగు చూపులుగలవాడును నగు నొక విషపురుషు డుద్భవించెను. చతుర్ముఖు డాతనిని జూచి హుంకార మొనరించెను. అప్పుడతడు భీకరాకారమువదలి కొన్ని స్థావరజంగమములందు తన స్వరూపమును బ్రవేశపెట్టినందున స్థావరజంగమవిషము లేర్పడెను. అందు స్థావరవిషము అమోఘమై జగతియందు ప్రఖ్యాతిగాంచెను.

### విషలక్షణము

పశువు లోపలికి నుపయోగింపబడినపుడు గాని, లేక శరీరవు పై భాగమున రాచినపుడు గాని ప్రాణముపోవునంతటి ఆయాసమును కలిగించు వస్తువులెల్లను విషము అనబడును.

### విషముయొక్క సామాన్యగుణములు

చమురులేని విషము:—ఇది వాతమును గలిగించును.

ఘాటుగల విషము:—ఇది రక్తమును ప్రకోపింపజేసి హృదయమును సరియైన స్థితిలోనుంచక సంధిబంధముల బిగువు తప్పించును.

స్వల్పాకారముగల విషము:—స్వల్పకాలములోనే ప్రవేశించి ఆకృతి వికృతము చేయును.

తక్షణమే ప్రవేశించువిషము:—ప్రవేశించిన వెంటనే జీవముల దీయును.

దేహమంతటను వ్యాపించువిషము;—శరీరమంతయు త్వరలో వ్యాపించును.

వ్యాప్తిజెందు విషము:—ధాతువును నశింపజేయును.

బరువులేని విషము;—స్థానచలనము నొనర్చును.

---

హస్తలో అకులు అల్లాడితే చిత్తలో చినుకులు పడుటలేదు.

క్షారములేని విషము:—చికిత్సాసాధ్యముగానుండును.
జీర్ణముకాని విషము:—ఇది లేని జీర్ణముకానీయదు.
వేడిమిగల విషము:—వెంటనే వేడిని సంపాదించును.

## స్థావరవిషము

వేళ్లు, పత్రములు, పుష్పములు, పట్ట, పాలు, చేవ, బంక, ధాతువులు, దుంపలు మనువాటియందు స్థావరవిషము లుండును.

తెల్లగన్నేరు, గురివింద, నలుపుగురుగుల అతిమధురము, ద్రుంగ, విజయ, విద్యుచ్ఛిఖ, గర్గర, సుగంధ యీ చెట్లవేళ్లు విషమును గలిగియుండును.

విషపత్రి, లంబ, వరదారుకము, కరంభము మహాకరంభము, లేతజొన్న ఈ చెట్ల ఆకులు విషములు గలిగియుండును.

కుముద్వతి, వేణుక, కరంభము, మహాకరంభము, కర్కోటకము, రేణుకము, ఖద్యోతకము, చర్మరి, ఇభగంధ, సర్పఘాతి, నందనము, సారపాకము ఈ చెట్ల ఫలము అలో విషముండును.

వేత్రము, కాదంబము, వల్లీజము, కరంభము, మహాకరంభము, ఈ చెటపుష్పము అలో విషముండును.

ఆంత్రపాచకము, కర్తరీయకము, సైరేయకము, ద్రుమగచెట్టు, కరంభము, నందనము, వరాటకము అను చెట్లయొక్క బెరడు, చేవ, బాకయును వాంలో విషముండును.

కుముదఘ్ని, జెముడు, జాలక్షీరియను చెట్ల పాలయందు విషముండును.

శంఖపాషాణము, తాళకములందు విషముండును.

కాలకూటము, వత్సనాభము, సర్షపము, కర్దమకము, వైరాటము, ముస్తకము, శృంగీవిషము, మూలకము, కర్కటము, హాలాహలము, ప్రపుండరీకము, పాలకము, మహావిషము—ఈదుంపలు విషమును గలిగియుండును.

## పై విషములు చేయు వికారములు

చెట్లవేళ్ల విషములు తినిన పశువులు మెలికలు తిరిగి చొంగపడుచుండును. మందమతిగా నుండును.

చెట్లఆకుల విషములు తినినవి నోరు చేదుగనుండి తిక్కపుట్టును. బుస యెక్కువగును, చొంగపడును.

చెట్ల ఫలములుతినినవి మేతతగ్గించి మందమతిగా నుండును. మలమును బంధించును.

---

హస్తఆదివారము చస్తిమోయి గొల్లబోయలారా కొసుకొకదాన్ని కొలువుట్టి ...

చెట్ల పుష్పములు తినినచో కడుపుబ్బును. మందమతిగా నుండును.

చెట్ల బెరడు బంక, చేవ తినినచో నోటివెంట నురుగు, దుర్వాసన యుండును.

చెట్లపాల విషములు తగిలిన నోరు పొక్కును. పొక్కుదురుండును. నాలుక పొక్కును.

ధాతు విషములు తగిలిన దవుడలు నొక్కుకొనిపోవును. నోరుపొక్కును. బాధగా నుండును.

దుంపల విషములు చాల ప్రమాదములు. ఆరంభములోగాని కొంతకాలమునకు గాని బాధగలిగించును.

## శత్రువులుచేయు విషప్రయోగములు

తటాకములలో సరస్సులలో విషముకలిపిన జలమెట్లుండును ?

విషముకలిపిన నీరు జిగటలుసాగును. ఘాటైనవాసన గలిగియుండును. నురుగు చారలు గలిగియుండును. ఈలక్షణము లుండుటవలన జలచరములు చనిపోవును. పక్షులు మదమును బొందినవై నీటియొద్దనుండ సంచరించుచుండును. ఈ నీటియందు స్నానముచేసిన మనుష్యుల పశువులు మందమతి జ్వరము, శరీరతాపము, వాపులు మొదలగు లక్షణము లుండును.

స్థలములందు విషములు ప్రయోగించిన నెట్లుండును.

భూమిగాని, కూర్చుండుటకు తగురాతి కట్టడముగాని, నీటి రేవుగాని, విషముచే దూషింపబడినపుడు వానిని ముట్టుకొనిన ఆవులు, గుఱ్ఱములు, ఎద్దులు, ఏనుగులు, లొట్టి పిట్టలు గాడిదలు, మనుజులు గూడా చాల బాధనొందుదురు. వీరి శరీరము దేభాగము లందు విషయుత పదార్థములు తగులునో యా భాగముల వాపు జనించును. మంటగా నుండును. అచ్చటగల వెంట్రుకలు ఊడిపోవును.

## ఆహారపదార్థములు

గడ్డి ఆహారపదార్థములు విషముచే చెరుపబడినచో దానిని సేవించు జంతువులకు అంగశైథిల్యము, మూర్ఛ, వాంతులు గలుగును. మలము పలుచగ నగును. చనిపోవును.

## పొగ, గాలి

పొగ, గాలి విషయుతములైనచో పక్షులు శ్రమనొందినవై భూమియందు పడును. దగ్గు, పీనస, శిరోబాధకలుగును. భయంకరమైన నేత్రవ్యాధులు కలుగును.

## ఆహారములలో విషముకలువుట

ఆహారమునందు విషమున్న దానిని భక్షించిన ఈగలు, కాకులు మున్నగునవి వెంటనే మడియును. దానిని అగ్నియందు వైచిన చిటచిట యను ధ్వనులెగయును. నెమలి కంఠమునందలి రంగువంటి రంగుగల పొగ లెగయును. ఈపొగను భరించుట చాల కష్టము. మంటలు కలిసియుండక విడివిడిగా నుండును. ఈ యగ్నినుండి వెలువడు గంధము పొగ చాలసేపటి వరకుండును.

విషముగలిగిన ఆహారమునుండి వెడలు ఆవిరితగులుటచే హృదయమునందు బాధ కలుగును. కన్నులుతిరుగును. కాళ్ళకు అంటిన మంటలుపుట్టును.

ప్రమాదముచేగాని, యజ్ఞానముచేగాని విషాహారమును సేవించిన నాలుక బండ బారును. రుచిని గ్రహించుశక్తి నశించును. మండుచున్నట్లుగా నుండును.

విషము జీర్ణమైనపుడును అతిసారము, మంటలు, కడుపుబ్బరగడబిడ, శరీరకాంతి తగ్గుట గలుగును. సారాయి, కల్లు మున్నగు ద్రవపదార్థములయందు విషముకు కలిపిన యెడల గీతలు నురుగులు బుడగలు గలుగుచుండును.

దాణాదినుసులు, పచ్చిగడ్డిజాతులలో విషమును గలిపిన చిటచిటలాడుచు రుచి నశించును. దుర్గంధము కలిగియుండును. పచ్చికాయలకు విషముతగిలిన వెంటనే పండును పండిన వానికి తగిలిన వెంటనే ప్రుల్లిపోవును.

దంతములయందు విషమున్నయెడల మొనలు విరిగిపోవును. నాలుక పండ్లు చిగుళ్లు వాచును. పువ్వులకు విషము తగిలి వానినువాసన తగ్గును. రంగుమారును. వాడిపోవును. వానిని వాసనచూచిన శిరోబాధ గలిగి నేత్రములందు నీరు జేరును.

అంజనమునందు విషమున్నచో కన్నీటియందు జిగురు గలును. అంధత్వము గలుగును.

పట్టెళ్ళయందు, గంటలయందు, గొలుసులయందు విషము కలిపిన నవి మామూలుగా ప్రకాశింపవు. ధరించిన నాయా శరీరభాగముల హింపించును. ఒడలు మండును. పుండగును.

## విషవంతములగు ఆకులు తినునపుడు కలుగు ప్రమాదములు.

మేత దొరకని కాలములందు పశువులు పొదలమీదనుండు విషవంతములగు ఆకులు తినుటవలనను, విషపుపుట్టలు పట్టియుండెడు చొప్ప, రెల్లు మొదలగు గడ్డి దినుసులు తినుటవలనను ఆకస్మికముగా మేతతో ఉమ్మెత్తాకులు, జిల్లేడాకులు, పొగాకు లేతదొన్న మొదలగు విషవస్తువులు తినుటవలనను, పశువుల కపాయములు తటస్థించు చున్నవి.

---

హాస్తకార్తెలో వానవస్తే అడగకనే గొట్టుకట్టు.

## విషవస్తువులు ఆకులలోను, తవుడులోను కలిపి పెట్టుట.

ఇంకను పశువులకు మాలమాదిగెలు దుర్బుద్ధిచేతనో, తోళ్లకొరకో విషముపెట్టి చంపుదురు. చచ్చిన పశువులను గ్రామ మాదిగెలకిచ్చు నాచారమునుబట్టి తోళ్ళు గిరాకీగానుండు కాలములందు గ్రామమాదిగెలు పశువులకు విషములు పెట్టి చంపుదురు.

విషవస్తువులు తెచ్చి పిండితోగాని, తవుడుతోగాని పిసికి ముద్దచేసి అరటియాకు లోగాని యితర ఆకులలోగాని మడచి పెట్టుదురు. లేదా పశువులముందర పడవేతురు. అంతట పశువు తినును.

## గడ్డిజాతులలో కలిపి పెట్టుట

కొన్ని సమయములందు పశువులుతిను గడ్డిలో కలుపుదురు. కొందరు పశువులు మేయు బీడుభూములలో పాషాణపాడి జల్లుదురు.

## గాయములు, ఆసనములలో పెట్టుట

మరికొందరు చర్మమును చీల్చి ఆ గాయమునందు విషమును పూయుదురు. లేదా ఆసనమునందుగాని, యోనియందుగాని విషపదార్థ మెక్కింతురు.

## మశూచిపడిన తలను క్రుళ్లించుట

మశూచిపడి చనిపోయిన పశువుయొక్క తలను భూమిలో పాతిపెట్టి అది కుళ్ళిన తరువాత దానిలో ఒక యింజెక్షన్ సూదిని దించి క్రుళ్ళునీరు సూదికి పట్టించిన తరువాత ఆసూదితో ఇతర జంతువులను కొంచెము రక్తము కారునట్లు చేయుదురు. వెంటనే ఆవిషమెక్కి పశువు చనిపోవును.

## జిల్లేడుపాలను ప్రేగులలోనికి ఎక్కించుట

జిల్లేడుపాలను ఒక చిప్పలోనికి నొడిచి మూరెడు పొడుగును ఒక అంగుళము వెడల్పును గల కర్రపుల్ల కొనకు, అగుడ్డను చుట్టి మాత్రము విడుదు ప్రేగులలోనికి గ్రుచ్చి లోపల అక్కడనుంచి పుల్లను నెమ్మదిగా బయటకు లాగుదురు. ఈమందు బహు వేడియగు వస్తువగుటవలన వెంటనే ప్రేగులు వాచి బాధపడి చచ్చిపోవును.

## అంటువ్యాధుల మలము లుపయోగించుట

పెద్దరోగము, దొమ్మ మొదలగు వ్యాధులు సంభవించిన పశువుల పేడను తీసి దాచియుంచెదరు. తోళ్ళు గిరాకీగా నుండునపుడు మాత్రము ఆ పేడ పచ్చికమీద జల్లుదురు. ఆపచ్చిక పశువులుతిని పలువిధసంకటముల పాలగుచున్నవి.

---

## గన్నేరుగింజల, చెక్కల నుపయోగించుట

కొందరు మాదిగవాండ్రు పచ్చగన్నేరుగింజలను దారమునకు దండవలె గ్రుచ్చి పశువులముందర విసరుదురు. లేదా ఎండుగడ్డితో గన్నేరు చెక్క కలిపి పెట్టెదరు.

## గురుగింజలను పెట్టుట

మరికొందరు గురుగింజలను పొడిజేసి నీటిలో కలిపి ముద్దజేసి ఒక అంగుళము పొడవుగల కర్రచివర వాడిగా చెక్కి ఆముద్దను కర్రకు అంటించి జంతువు శరీరములోనికి జొనపుదురు. పొడి ఎచ్చట ప్రవేశించునో ఆ భాగము విశేషముగా వాచి రెండు మూడు దినములలో పశువులు చనిపోవును.

## విషము నోటిగుండ పెట్టినతరువాత కనబడు లక్షణములు

పశువునోటినుండి విషము లోనికిచ్చిన యెడల దంతములు, చిగుళ్లు, నోరు, నాలుక పూచి బాధగలుగును. చొంగ యధికముగా కార్చును. వాంతిచేయుటకు ప్రయత్నించును. కడుపునొప్పి కలుగును. తరచుగా లేచుచు పండుకొనుచుండును. కడుపుబ్బును. పిమ్మట దుర్గంధములతో కూడ విరేచనములగు చుండును ఆ విరేచనములలో రక్తజీర కూడ నుండవచ్చును.

## ఆసనములో పెట్టినతరువాత కనబడు లక్షణములు

ఆసనములో పెట్టినయెడల ఆసనము ఎర్రబడి చాల బాధపడును. కడపటియవస్థలో దైన్యముతో చూచుచు కంటిపాపలు పెద్దవై చాల ఆయాసముకలిగి పక్షవాతముచే నిలువక క్రిందబడి చనిపోవును.

## చికిత్స

10, 20 కోడిగ్రుడ్లను ఒక సేరున్నర చిక్కని జావలోగాని, పాలలోగాని కలిపి 3, 4 గంటల కొకసారి త్రాగించవలెను. లేక వెలగబండనీరుగాని, అన్నభేదినీరుగాని త్రాగించవలెను. లేక పచ్చి అపిసెరూసె గాని, సున్నపునీరుగాని, ఘాటుసారాయిగాని త్రాగించవలెను. లేక సారాయి 10 తు, సొంటి 2 తు, నల్లమిరియాలపొడి 1 తు, జావ అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

## పథ్యము

నీటిని యేమాత్రము త్రాగనీయరాదు. నీళ్ళఅవిసెగింజల జావగాని, బియ్యపుజావగాని, ఎక్కువగా త్రాగించవలెను. ఉడకబెట్టిన తవుడు, చిట్టు పథ్యముగా పెట్టవలెను.

---

హస్తచిత్తపోతే అందరి శేద్యం వొక్కటేను.

## ఉంగిడి

లేతజొన్న, లేత ఆముదపు ఆకులు తిను పశువులు సాధారణముగా విషమెక్కి చచ్చుట మనకందరకు తెలియును. ఒక పొలములోని లేతజొన్నను మేసిన పశువులు విషమెక్కి చావగా మరియొక పొలములో నట్టిలేత జొన్ననే మేసిన పశువు లారోగ్యవంతములై యుండుటనుగూడ మన మెరుగుదుము. 1903వ సంవత్సరములో క్వీన్సులాండు దేశమందంతట లేత జొన్నను మేయుటవలన అనేక పశువులు మరణించెను. అందువలన ఆద్వీపవాసులు శోధనలను జెక్కుటి చేసి వాని ఫలితములను తెలియపరచిరి. సారవంతములైన భూములలో పెరిగిన జొన్నలయందు ఘోరవిషమైన ప్రుస్సిక్ ఆసిడ్ (Prussic Acid) మున్నగు పదార్థములుండును. భూమియందలి సారము తగ్గినకొలది నందుండు జొన్నలో విషము లంతగానుండవు. కావున నిస్సారములగు పొలములయందలి లేతజొన్నను పశువులకు మేపినప్పుడు నష్టము కలుగకున్నను భూమిలోని సారము హెచ్చినకొలది ఆ దలి లేతజొన్నను మేసిన పశువులకు విషచిహ్నము లెక్కువగా కానవచ్చుట యీ దేశమువారి శోధనవలన గానవచ్చినది. నైట్రోజను విస్తారముగాగల భూములలో మాత్రమే యిట్టివిషము లేతజొన్న యందు కానబడును. ఇందుకొరకై బ్రెన్నిక్ (Brennic) అనువారు ఒక పొలములోని కొంతభాగములో ఎరువును దేనిని వేయకనే జొన్నలను జల్లి మరికొంత భాగమునకు నైట్రోజను ఎరువు విస్తారముగా వేసి జొన్నలను విత్తెను. నైట్రోజను వేయబడిన భాగమందలి లేతజొన్నలో విషములు విస్తారముగా గానవచ్చెను. నైట్రోజను ఎంత ఎక్కువగా వేయబడినదో అంతవరకే సరిగా నందలి లేతజొన్నలో యీ విషములు హెచ్చెను. ఎన్ని పర్యాయములు యిట్లు శోధించిచూచినను ఈరీతిగనే ఫలితము తేలెను. కావున భూమిలోని నైట్రోజను ననుసరించి లేతజొన్నయందు విషముండునని నిర్ధారణ యగుచున్నది.

ఎఱ్ఱగా నెదుగు మొక్కలలో విషము తక్కువగా నుండును. ఎండాకాలపు మొక్కలలోను, పీలగా నెదుగు మొక్కలలోను ఈ విషము విస్తారముగా నుండును. విస్తారము నైట్రోజనుగల భూములలో బెరుగు మొక్కలు ఒక వీసెడెత్తు తినగనే యెట్టి పసరమైనను చనిపోవును. కావున లేత మొక్కలును, పీల మొక్కలును అంతగా నారోగ్యకరము లైనవి కావు. లేతగా కోసినను ఎండుచొప్ప యగువరకు దీనియందు విషముండును. నైట్రోజను విస్తారముగాగల భూములలోని జొన్నను కంకివేయువరకు పశువులకు మేపరాదు. మొక్క మొలచిన మూడువారములు మొదలుకొని ఏడువారములవరకు నందు విశేషముగా విషముండును. అటుతరువాత నీ విషమందలి నైట్రోజను విరిగిపోయి హానిచేయని యితర పదార్థముల క్రిందకు మారిపోవును. మొక్క పూతబట్టిన తరువాత నందలి విషము నామమాత్రావశిష్టమై యుండును. కాని కొన్నిచోట్ల కొద్దికాలమునకు పూతవచ్చు మొక్క మరికొన్నిచోట్ల నేపుగా పెరిగి చాలకాలమువరకుగాని పూతవ

చిత్త స్వాతులు కురుచుకుంటె చిక్కునాడా నాంబ్రం.

కాకుండుటచే పైనచెప్పిన మూడు, ఏడువారములు నను గడువు సర్వత్రసమముగా వర్తిం చదు. కాబట్టి యేది ఎట్లున్నను పూతపూయక ముందు పచ్చిజొన్నను పశువులకు మేతగా పెట్టరాదు. మాక్సెవెల్ (Maksevel) అను ఒక దొరగారు లేతజొన్నను ఎండుగడ్డి కలిపి పశువులకు మేతగా వేయవచ్చుననియు, అందు ఎండుగడ్డి పాలుహెచ్చుగా నున్న మొదలు లోపలికిపోవు లేత జొన్నయందలి విషము చాలతక్కువగుటచేత అంతగా హాని కలిగించదనియు తెలియజేసెను. ఏది యెట్లున్నను పూతపూయని పచ్చిజొన్నను పశువులకు వేయకుండుటయే మంచిది. పెరుగుచున్న జొన్న మొదలకు పైరులను పశువులు చొరబడి మేయకుండ కాపుదలచేసికొనవలెను. కోసినవెంటనే పచ్చిజొన్న మొక్కజొన్న వీనిని పశువులకు వేయరాదు. రెండు మూడు దినములు వీనిని ఎండబెట్టి తరువాతనే పశువులకు వేయవలెను. పూతపూయక మునుపు పచ్చి చొప్పను పశువులకు వేయుట యెతప్పు. లేమ లేలకు ఏపుగా ఎదిగిన దానిని వేయవచ్చును. విశేషముగా ఈ మేతను ఇతర ఆహారములతో యిచ్చుట మంచిది.

## లేతజొన్న తిన్న పశువు లక్షణములు

పశువు అడుగువేయలేదు. తడబడుచుండును. స్పృహ తప్పును. నాలుక జార విడచును. నోటివెంట చొంగపడుచుండును. నాలుక విరగలాగుచుండును. వ్యాధి మునిరినకొలది పొట్ట ఉబ్బి వరే పొంగును. గురకపుట్టును. దవుడలు బిగిసికొనిపోవును. ఊపిరియాడక వెంటనే మృతినొందును.

## చికిత్స

ఆరంభములోనే చికిత్స చేయవలయునుగాని తరువాత నేమియు లాభములేదు.

1. పులుకలిలో ఉప్పు చేరెడు, నల్లేరుముద్ద చిన్న నారింజకాయంత కలిపి పెట్టవలెను.

2. కొమ్ములకు నూనెవత్తులు చుట్టి కాల్చి జామువరకు యుంచిన తగ్గును.

3. కుంకుడుకాయల గంధము కంటిలో కలికము వేయుము.

4. నిమ్మపండ్ల రసము, నల్లేరురసము కలిపి మూడు గొట్టములు పెట్టిన తగ్గును.

5. చిత్రిచెట్టు దంచి రసముతీసి పులికలితో మూడు గొట్టములు పెట్టవలెను.

6. దోసకాయలు పది పెట్టుము.

7. దీపపుకొడిచే జిల్లేడుఆకులు పొట్లములుగా కట్టి చమురుకు కాచి మూడున పెట్టవలెను.

8. పులికలిలో దుష్టపుచెక్కుహూరి సారముతీసి ముక్కురంధ్రములలో పోసి కన్ను లకు ఇంగువ కలికము వేయవలెను.

---

చిత్త చిత్తమువచ్చిన చోటపడును.

9. చింతపండు పులుసు మూడు గొట్టములు పెట్టవలెను.

10. నల్లేరుకాడలు దవుడలకు పెట్టి కొరికించిన తిక్క పోవును.

11. అమ్మోనియం క్లోరైడ్ అను మందు 2½ తులములు తీసికొని చన్నీటిలో కలిపి త్రాగించవలెను.

12. గోరువరుకు పెట్టుము. అప్పుడప్పుడు స్మెల్లింగుసాల్టు ముక్కునకు చూపించుము.

## పశువుల కుపయోగించు పనిముట్లు

పలుపులు, నీరుపెట్టు తొట్లెలు, మందులనిచ్చు గొట్టములు, పాత్రలు ఎప్పటి కప్పుడే పరిశుభ్రము చేయవలెను. శత్రువులెవరైన యున్నపుడు విషమందులు కలుపుదు రేమో తనిఖీ చేయుచుండవలెను.

పశువులశాలలు, పాకలుకూడ పరిశుభ్రముగానుండవలెను. చెత్త వగైరాలున్నచో విషపురుగులు చేరును. క్రిమికీటకములు జనించి పలువిధ రోగములు కలిగించును. గడ్డివాములు, పుట్టలు, విషముగల తీగెలు, లేక జొన్న వగైరా లుండుచోట్ల పశువులను కట్టరాదు.

మంచి పశువులను ఓర్వలేనివారు నోటిలో దబ్బనము, ఇనుపమేకులు మున్నగునవి వేయుదురు. ఇట్లు చేయుటవలన పశువు ప్రేగులలోగాని, తదితర అవయవములలోగాని నిలువయుండి పశువును బాధించుచు కొన్నాళ్ళకు ఆ వస్తువు త్రుప్పుపట్టి శరీరభాగములను చెరచును. ఆకలి తగ్గును. మందముతో నుండును. ప్రేగులలో చిక్కుకొనియున్న మొనలు తూట్లుపడును. కడుపునొప్పి, నోటివెంట చొంగ, ముక్కులవెంట చీమిడి మున్నగునవి పడుచు క్రమేపి పశువు మరణించును. కండరములలో చిక్కుకొనియున్నమొనల ఆ భాగమంతయు చెడి కణుతులు లేచును. ఆ కంతులు పక్వమునకు రాక శరీరమంతయు పుట్టి కొన్నాళ్ళకు ఆవిషమంతయు జీర్ణమై చనిపోవును.

## చికిత్స

ఇటువంటి వస్తువులు మ్రింగిన పశువుల చరిత్ర తెలిసికొనుట చాల కష్టము. అనేకమంది పశువైద్యులను తీసికొనివచ్చి చూపింతురు. అందులో కొందరు ప్రేగులలో చిక్కుకొనినప్పుడు కడుపునొప్పి యందురు. ఇంక అనేకవిధములుగా రోగ నిర్ణయములు చేయుదురుగాని అసలు వ్యాధి కనుగొనరు. పశువు మరణించిన తరువాత మాదిగవాండ్రు కోయునప్పుడు ఆ వస్తువులు బయటపడును. ఈరీతిగా అనుభవముమీద కొన్ని కేసులు ప్రత్యక్షముగా చూచితిమి.

---

చిత్త వాన యాడపడితే ఆడనే.

ఇటువంటి ప్రమాదములు జరిగినపుడు వెంటనే మూడు నాలుగుసార్లు సబ్బు నీటితో ఎనిమాచేయవలెను, తరువాత వెన్నను తినిపించవలెను. కండలు పుట్టిన మొదల శస్త్రవైద్యములోనున్న ప్రకారము శస్త్రచికిత్సలు చేయవలెను.

## జంగమ విషములు

పిచ్చికుక్కలు మొదలగునవి చతుష్పాదజంతువులు, సర్పములు, వృశ్చికములు, శతపదాదులు, లూతలు, మూషికములు, మండూకములు అనునవి.

## విషమాశ్రయించి యుండుస్థానములు

దృష్టి, నిట్టూర్పు, కోరలు, గోళ్ళు, మలము, మూత్రము, శుక్రధాతువు చొంగ, తోక, ఆర్తవరక్తము, ముఖములో కరచుట, అపానవాతము, గుదముదగ్గరి కొండ్లు, చేదు, తోకయందలి ముల్లు మృతకళేబరము అనువానియందు విషముండును.

దేవతాసర్పములకు దృష్టియందును, నిట్టూర్పునందును విషముండును. నేలమీద నుండు సర్పములకు కోరలయందు విషముండును.

పిల్లి, కుక్క, కోతి, మొసలి, కప్ప, మత్స్యము, ఉడుము, నత్తపురుగులు, కీదురాయి, బల్లి మొదలగు చతుష్పాది జంతువులకు, పురుగులకు కోరలయందును, గోళ్ళయందును విషముండును.

చిపిటము, పిచ్చిటము, కషాయవాసికము, సర్షపవాసికము, తోటకము, వర్చః కీటము, కౌండిల్యక మను పురుగులకు మలమూత్రములందు విషముండును. ఎలుకలకు శుక్రమునందు విషముండును.

సాలెపురుగులకు, చొంగ, మూత్రము, రెట్ట, కాటు, గోళ్లు, శుక్రము, ఆర్తవము-వీనియందు విషముండును.

తేలు, విశ్వంభరము, రాజీవమను చేప, ఉచ్చిటింగము, సముద్రపు వృశ్చికము అనువానికి తోకయందుండును.

చిత్రశిరము, శరావకుర్దము, శతదారుకము, అరిమేదకము, శారికాముఖమను కీటములకు కాటు, అపానవాతము, మూత్రము, రెట్ట యనువానియందు విషముండును.

ఈగలు కందిరీగలు జలగలు కాటునందు విషము గలిగియుండును.

విషముచే చచ్చినజంతువులయొక్క ఎముకలు, పాము శరీరమునందలి శల్యములు, వరటి యను చేపఎముక యనునవి అస్థివిషములు.

కపిని, ఎర్రచారలుగల చేప (రక్తరాజీవము) వరటియను చేపలకు చేదుకట్లయందు విషముండును. సూక్ష్మతుండము, ఉచ్చిటింగము, వరటి, కాళ్లజెఱ్ఱి (శతపది,

చిత్తయెండ పిట్టరిల పురుగులును.

శూకవలభిక, శృంగి, భ్రమరము (తుమ్మెద) లకును తోకయందు, ముల్లునందు విష ముండును.

చచ్చిన పురుగులు, పాములు శవవిషములని గ్రహించవలెను.

## కీటకములు

పాములయొక్క శుక్రము మలము మూత్రము శవము కుళ్ళిపోయిన గ్రుడ్డు కొంద లగువానినుండి వాత పిత్త శ్లేష్మ ప్రకృతులుగల వివిధములగు కీటకములు జనించును.

## కందిరీగలు

నాలుగుజాతులు గలవు. ఇవన్నియు తీవ్రముగా బాధను గలిగించును. ఇవి కరచినచో వాపులు పుట్టును. కాటు నల్లబడును. నొప్పులు మంటలు కలుగును.

## ఉడుములు

ఇవి అయిదురకములు, ఇవి కరచినపుడు భయంకరమైన కంతులు పుట్టును. ఉడుమునందు కృష్ణసర్పమువలన కలిగినట్టి నాలుగు కాళ్లు గలిగినట్టి జంతువునకు గాధేరక మని పేరు. ఈ జాతిఉడుము కరచిన పశువు బ్రతుకదు.

## కాళ్లజెర్రులు

ఎనిమిదిజాతులు గలవు. ఇవి కరచిన వాపు మంటలు కలుగును. కొన్ని కరచిన గడ్డలు లేచును.

## కప్పలు

ఎనిమిదిజాతులు గలవు. వీటిలో కొన్ని కరచినచోట దురదకలుగును. నోటివెంట నురుగువచ్చును. ఇంక కొన్ని రకములు కరచిన మంటలు గలుగును. మూర్ఛవచ్చును.

## శూకవృంతాదులు

కరచిన దురద, దద్దురులు పుట్టును. కాటునందు తోకముల్లు కనబడును.

## కంఠూమకములు

కరచిన శరీరరంగు మారును. జ్వరము పొడుదు కలుగును.

## చీమలు

ఆరు జాతులు, చలిచీమలు కరచిన కాటునందు తీపి, అగ్ని తగిలినట్లు మంట, వాపు కలుగును.

---

చిత్తస్వాతి సందుచినుకులు చాలా వర్షం తెచ్చును.

## తేనెటీగలు

ఆరుజాతులు. ఇవి కరచిన మంటలు వాపులు కలుగును.

## దోమలు

అయిదువిధములు:—ఇవి కరచిన ఎక్కువ దురద కలుగును. కొన్ని కరచిన ఆస్థలమందు గోకినయెడల పుండ్లు పడును. మంటగా నుండును.

## వృశ్చికములు

మూడువిధములు: ఆవుపేడ క్రుళ్ళుటవలన బుట్టునవి మందవిషములు; కర్రలు ఇటుకలు మన్నగువాని యందుండునవి మధ్యమవిషములు. కుళ్ళిపోయిన పాములనుండి పుట్టినవి, ఇంక ఇతర విషములనుండి పుట్టినవి తీక్ష్ణవిషములు.

మందములుగల వృశ్చికములు 12, మధ్యమవిషముగలవి 3. ఉత్తమవిషముగలవి 15. మొత్తము 30 జాతులు.

## అల్పవిషములు గలవి

నలుపుగను, ఎరుపుగను. చిత్రవర్ణముగను, పచ్చగను, ఆవుపంచితము రంగుగను, పరుషముగను, తెమిలిపురి రంగుగను, తెలుపుగను, ఎఱుపుగను, రోమములు గలిగియు కరికరంగుగను, కొంచెము ఎరుపుగ నుండునవి అల్పవిషములు గలిగియుండును.

ఇవి కరచినచో మంటలు; చెమటలు కలుగులు.

## మధ్యవీర్యముగల వృశ్చికములు

ఎరుపుగను, పచ్చగను, శరీరరంగు గలిగి యుదరమునందు కపిలరంగు గలిగినట్టియు, అంతట పొగచూరురంగు కలిగినట్టియు, మూడుకణుపులు కలిగినట్టియు వృశ్చికములు మధ్యవీర్యము గలవి. ఇవి వాత పిత్త శ్లేష్మ ప్రకృతులుగల పాములయొక్క మల మూత్రముల వల్లను క్రుళ్ళిపోయిన గుడ్లనుండియు పుట్టును. ఇవి యేజాతిపామునకు సంబంధించి పుట్టునో యా ప్రకృతిచేరి యా దోషమునే ప్రకోపింపజేయును. నాలుక వాచుట మ్రింగుడుబడకపోవుట భయంకరమగు మూర్ఛ కలుగును.

## ప్రాణములను హరించునవి

తెలుపుగను, చిత్రవర్ణముగను, శ్యామలముగను ఎరుపుగను తెలుపు ఎరుపురంగు గను ఉదరమునందు ఎరుపు నీలము రంగులుగను నీలము తెలుపుగలసిన రంగు

---

చిత్తస్వాతులు వర్షించకపోతే చిగురుటాకులు మాడిపోవును.

గను ఎరుపు చిత్రవర్ణములు గలసిన రంగుగను నుండెడి వృశ్చికములును ఒంటికణుపు గలిగినట్టి వృశ్చికములును కణుపులే లేనట్టివిగను వృశ్చికములు ప్రాణములను దీయును.

ఇవి తీక్ష్ణమైన విషము గలిగియుండును. ఇవి కుళ్ళిన సర్పములనుండి పుట్టును విషముచే మరణించినవానిశరీరము నుండియు పుట్టును. ఇవి కరచిన పామువలన గలిగెడి విషవేగములు గలుగును. పొక్కులు బుట్టును. శరీరము త్రిప్పును. దేహమునందు మంటలు, జ్వరము, స్రోతస్సులనుండి నల్లని రక్తము కారును. కనుక నివి కరచినచో మనుజుడు చనిపోవును.

## సాలెపురుగులనుతినుట

మనము మన యిండ్లయందును, తెల్లగబ్బిలందును, జనుపగడ్డి వాములందును సాలెపురుగులను లూతలను చూచుచుందుము. వీటినిగురించియే ఇదివరకు చెప్పబడి యున్నది. సాలీడు శరీరమందు గ్రంధులనబడు సంచులుండును. కొన్ని భూములలో కన్నములు చేసికొని వానిపై కప్పులను గూడుగా నమర్చును. లోపలిభాగమున పగలం తయు నుండి రాత్రులయందు దాహారము కొరకు వెలుపలికి బయలుదేరును. మరికొన్ని చెట్లకొమ్మలను ఛత్రమువంటి గూటిని నిర్మించి మధ్యను తన పిల్లలను రక్షించుకొనుచుండును. ఇంకకొన్ని నీటియడుగుననె యుండి యచ్చటనే గూండ్లుకట్టుకొని తమపిల్లలను పెంచుకొనుచుండును. పశువులు తెల్లగబ్బిలను తినునపుడు గాని, జనుపకట్టలు, జొన్న, వరిగడ్డి, చీటిమేత, తదితరదాణా గనులు, తినునపుడు వానితోపాటు ఈ సాలీళ్ళను వాటిగూళ్ళను తినిన యెడల ఒకవిధమైనవ్యాధి కలుగును. కొన్ని ప్రమాదము కలిగించును.

## లక్షణములు

ఆరంభములో పశువు నల్లకప్పువేయును. కడుపుబ్బును. నోటినుండి చొంగపడుచుండును. మలబద్ధక ముండును. వెన్ను వించుచుండును. ఈవ్యాధి సంవత్సరము లేక ఆరుమాసముల వరకుండును. కొన్ని వెంటనేతగ్గును. కరచినచోట మంటలు పుట్టును. బుడగలుగా పారుచుండును. వెంద్రుకలు నిక్కబొడుచును.

## చికిత్సలు

ముందు విరేచనములను మందీయవలెను.

తరువాత దిరిసెనాకు పసరు అరసేరు పసుపు ½ తులం కలిపి త్రాగించవలెను.

లేక సొంటి 1 తు, పిప్పళ్లు 1 తు, మిరియాలు 1 తు, మజ్జిగ 1 సేరు కలిపి త్రాగించవలెను.

---

యథాచిత్తా తథాస్వాతి.

ఎక్కువ తీవ్రలక్షణము లున్నచో

సొంటిగంధముగాని మిరియాల గంధముగాని కండ్లలో కలికము వేయవలెను. పశు పక్ష్యాదుల కపకారమొనరించు సర్పములు 80 అని తెలిసికొనవలెను. ఇవి అయిదు విధములుగా విభజించబడెను.

దర్వీకరములు — త్రాచుపాములు
మండలులు — పొడపాములు
రాజీమంతములు—కట్లపాములు
నిర్విషములు — విషములేనివి
వైకరంజములు — సంకరజాతులు.

## విభజింపబడిన సర్పజాతులు

| | | | |
|---|---|---|---|
| త్రాచుపాములు | —26 | విషములేనివి | — 12 |
| పొడపాములు | —22 | సంకరజాతులు | — 3 |
| కట్లపాములు | —10 | సంకరజాతులవలన పుట్టినవి | 7 |

ఈరీతిగా మొత్తముమీద 80 జాతిసర్పములు గలవని తెలిసికొనవలెను.

## రంధ్రములలో దాగియుండునవి

ఈ పాములు భూభాగమునందుండు రంధ్రములలోగాని, తదితరప్రాంతమునందు గాని నివసించుచుండును. అప్పుడప్పుడు వానికి అవసరము వచ్చినపుడుమాత్రము భూమిపై తిరుగుచుండును. వీటి శరీరము మిగుల దృఢముగాను వలయాకారము గాను ఉండును. తోక పొట్టిగానుండును. నోరు చిన్నదిగా నుండును. దంతములు కూడ మిగుల చిన్నవిగా నుండును. వాటికి చిన్నచిన్న పక్షులు పురుగులు మొదలగునవి ఆహారము.

## భూమిమీద సంచరించునవి

ఇవి భూమిమీదనే సంచరించుచు అప్పుడప్పుడు గుబురు లతలలోనికి, ముండ్ల పొదలలోనికి, బోవుచుండును. నీటిలోనికిగూడ బోవుచుండును. శరీరము కొంచెము వంకరగా నుండును. అటునిటు వంగు శక్తి బాగుగా నుండును. వాటి యాహారము వెన్నెముకలుగల జంతువులు చాలా భాగపురకములు ఈజాతిలోనివే.

## చెట్లమీద సంచరించునవి

ఇవి పొదలమీదను, చెట్లమీదను కాపురముండును. శరీరము నునుపుగాను సన్నముగాను నుండును. వీటిలో కాంతిగల రకము లనేకములు గలవు. ఆ రకము లలో ఆకుపచ్చనిది ముఖ్యమైనది. ఇందు కొన్నిమాత్రము గ్రుడ్లను తినును.

---

చిత్తస్వాతులు జోడించినరీసినట్లు.

## నీటిలో నివసించునవి

ఇవి మంచినీటిలో నివసించును. తోక కోసుగానుండును. చక్కగా ఈదగలవు. వీనిలో కొన్ని జాతులు సముద్రములలోనికి పోవును. ఇవి చేపలు, కప్పలు, పీతలు మున్నగువాటిని తినును. ఇవి విషవంతములైనవి కావు.

## సముద్రములో నుండునవి

ఇవి సముద్రములో నివసించును. అప్పుడప్పుడు ఒడ్డునకు వచ్చుచుండును. చేపలను తినును. ఇవియును విషములు గలవియే. ఇవికూడ పిల్లలను పెట్టును.

## కొండలమీద నుండునవి

కొన్ని పాములు కొండలమీదనుండును. ఇవి చాల పెద్దవిగా నుండును. వీటికి తగినంత విశ్రాంతి, ఆహారముండుటచేత చాల బలము గలిగియుండును. ఇవి నూరు సంవత్సరములవరకు బ్రతుకును.

## అల్పవిషములు గల పానసర్పములు

రోగము కలిగినట్టియు, భయపడినట్టియు, సర్పములకు విషము స్వల్పముగ నుండును. అవిధముగనే వృద్ధాప్యము గలిగినట్టియు, చిన్నవియగు పాములకు గూడ స్వల్పవిషముండును. విషహారములగు ఔషధములుకల ప్రదేశములయందు విషము బాగుగా వ్యాపింపజాలదు. జలములోను సంచరించు సర్పములకు, కుబుసము విడుచు సర్పములకు, చిక్కిన సర్పములకు దప్పిగొన్న సర్పములకు విషము తక్కువగా నుండును.

## అరిష్టము

ఏసర్పము కరిచినను కాళ్ళయందైనచో మొదటమొదట గుడ్డపీలికలచేగాని, తోలు వారులచేగాని, చెట్లుపట్టలచేగాని మరి యేయితరమృదువైన వస్తువులచేగాని కరచిన చోటునకు నాలుగు అంగుళములపైన కట్టుకట్టవలెను. ఇట్లు కట్టుటచే విషము శరీరము నందు వ్యాపింపక నిలచిపోవును. ఈ కట్టునకు అరిష్టమందురు. కట్టు కట్టుటకు వీలులేని స్థలములైనచో విషమును వెలుపలికి పీల్చుట, కరచినచోటు కోయుట, కాల్చుట యను నవి అన్ని విషములందును ముఖ్యములైనవి.

## సర్పములవిషము

మనుజులకు శరీరమంతటను శుక్రము వ్యాపించియున్న రీతిగ సర్పమునకు శరీర మునందంతటను విషము వ్యాపించియుండును. కోపము కలిగినప్పుడు విషము బయల్వె డలును. సర్పముయొక్క కోరలు చేపలను బట్టుగాలములవలె వంకరగా నుండును. విషము

---

స్వాతివురిస్తే భీతిపొందుదురు.

శరీరమునుండి బయలుదేరి వానియందు చిక్కుకొనును. కనుక సర్పములు కాటువేసిన తరువాత వెల్లికిలబడినగాని (పడగవరకు) విషమును వదలజాలవు. విషమంతయు గూడ మిక్కిలి ఉష్ణముగ తీక్ష్ణముగనుండును.

## మంత్రములు

సర్ప విషహరములగు మంత్రములను తెలిసినవాడు మంత్రముల జదువుచు త్రాడు మున్నగువానిచే కట్టుకట్టిన అవి ప్రభావములచే విషములను హరించును.

దేవతలచేతను, బ్రహ్మర్షులచేతను చెప్పబడిన సత్యతపోమయములైన మంత్రములు వ్యర్థముగాక అతిభయంకరమైన విషములను గూడ బోగొట్టును. తేజస్వంతములై, సత్య తపోయుక్తములైన మంత్రరాజములచే విషము నివారింపబడు నట్లుగ ఔషధములచేత నివారింపబడదు.

విషమును పోగొట్టుటకు కలికము (అంజనము) చూర్ణములు పీల్పించుట (నస్యకర్మ) చేయించవలెను. పూయుటకు వాడెడు పట్లు, గంధము మొదలగునవి చాల చల్లగనుండునవి వాడవలయును.

## కాటులోని భేదములు

పాదములతో దన్నినగాని, స్వభావదౌష్ట్యముచేగాని, ఆహారము కోరికగాని, మహాక్రోధముగల యీ సర్పములు జీవుల కాటువేయును. ఈ సర్పదంశము (పాము కాటు) నాలుగు విధములుగా విభజింపబడెను.

## స్పరితము

కాటు ఒకటిగాని, నాలుగైనుగాని కలిగియుండి కోరలు దిగిన చుట్టు నుద్రి చిగుళ్ళ ఆకారమువలె పొట్టిగనుండి కొంచెము నొప్పుగల యుండురములు బుట్టిన మొనల స్పరిత మందురు.

## రదితము

కరచినచోట కొంచెము రక్తముగ వచ్చును. పసుపు తెలుపు నీలము ఎరుపురంగుగల గీతలు చర్మమునందు గలిగినది రదిత మనబడును.

## నిర్విషము

మూడుకోరలు దిగి వాపుతేకుండును. యిందు విషముండదు.

## సర్పాంగాభిహతము

భయమెక్కువగుటచే కరచినవానికి వాతము ప్రకోపించును.

---

స్వాతిపరిస్తే మూడు కొర్తెలు పరుసును.

## మహాసర్పములు

ఇవి నేలమీద సంచరించుచుండును. సర్పముల కన్నిటికి ఇవి అధిపతులు. వీని యాకారము అగ్నివలె ప్రకాశించుచుండును. ఇవి ఎల్లప్పుడును విషమును వర్షింపుచు లోకములతపింప జేయుచుండును. అన్ని సముద్రములయందును పర్వతముల యందును కన్పట్టుచున్నవి. ఈ సర్పములు కోపగించిన ఈ ప్రపంచమును కేవలము దృష్టి, నిట్టూర్పులతో దహింపగలిగి యుండును.

## త్రాచుపాములు (దర్వీకరములు)

చక్రము, నాగలి, ఛత్రము, చౌకము, అంకుశముల చిహ్నముగలిగి పడగలతో నొప్పారుచు శీఘ్రమగు గమనము గలవాటిని త్రాచుపాములందురు.

గోధుమత్రాచు, నల్లత్రాచు, కందిపోడలత్రాచు; నాగజెఱ్ఱిత్రాచు, అరికెవన్నె త్రాచు; మొగలిపూవుత్రాచు; తెల్లత్రాచు; కోడిత్రాచు: ఏరుత్రాచు; సెనగపువ్వుత్రాచు; చింతపువ్వవన్నెత్రాచు; గిరినాగు మున్నగు రకములు గలవు.

## వారములను బట్టి విషములుండును

గోధుమత్రాచునకు శనివారము నాడును; నల్లత్రాచునకు మంగళవారము నాడును; అరికెవన్నెత్రాచునకు కందిపోడల త్రాచునకు బుధవారము నాడును; నాగజెఱ్ఱిత్రాచునకు సెనగపువ్వుత్రాచునకు సోమవారము నాడును మొగలిపువ్వుత్రాచునకు, తెల్లత్రాచునకు గురువారము నాడును; కోడిత్రాచునకు, ఏరుత్రాచునకు, గిరినాగునకు శుక్రవారము నాడు; చింతపువ్వవన్నె త్రాచునకు భానువారము నాడును; విషోద్రేకముండునని తెలిసికొనవలెను.

## పోడపాములు (మండలీసర్పములు)

ఆనేకరకములగు పోడలు - పెద్దశరీరము గలిగియుండును. నెమ్మదిగా తిరుగుచుండును. ఇవి సూర్యునివలె ప్రకాశించుచుండును.

కలంకారీపెంజర - ఇది మూరెడుపొడవుండును. కలంకారీరంగువంటి మచ్చలుండును. ఇది కరచిన శరీరమున మంటలుండును. దినములో చనిపోవును.

పొట్లపెంజర:—దీనితల తోక సన్నముగానుండును. శరీరము లావుగానుండును. పొట్లకాయరంగుగలిగి పొట్లకాయవలె పొడవుగానుండును. గురక పుట్టును. శరీరము వాచును; నాలుగుదినములలో మరణించవచ్చును. తివాసిపోడపెంజర; పిచ్చుకపోడపెంజర; అగ్నిపోడపెంజర; పాడపెంజర; సున్నపుపోడపెంజర; తేనెపోడపెంజర; కుల్లపోడపెంజర; పాదిరీ పోడపెంజర, గవ్వపోడపెంజర; గరికపోడపెంజర; మోదుగ పోడపెంజర; పనుపుపోడపెంజర; దొండపండు పోడపెంజర; అనురకములు గలవు.

---

## కట్లపాములు (రాజివంతములు)

ధగధగలాడుచు వివిధవర్ణములు కలిగి నిడుపుగ, అడ్డముగ వ్యాపించిన గీతలతో చిత్రింపబడినట్లు ప్రకాశించు వాటిని రాజివంతము లందురు.

వీటిలో నాలుగు తెగలు గలవు.

### క్షుద్రజాతిసర్పములు

ఇవి తొమ్మిదిరకములు. పెదకట్లపాము; నాగులకట్లపాము; నూనెకట్లపాము; బట్టికట్లపాము; కట్లపాము; తాడిగిరి, చెల్లెగురుపాము; గొడ్డలిపెంగపుపాము; గోవ పాకుడుపాము; అనురకములు.

### మహాసర్పములు

కొండచిలువ; సముద్రపుపాము; దాసరిపాము.

### నిర్విషసర్పములు

కొండచిలువ; క్షీరకము; జ్యోతీరథము; పుష్పాహికము; వానపాము; పుష్పశకలము; అందాహి; పసిగిరిపాము, గలగోలి; నూకపత్రము; జాలకము; కలశిబలాహకము; గజభక్షము; అను నామములుగల పాములు విషరహితములై యుండును.

### కుంభీనసర్పములు

త్రిశూలిసర్పము; కుంభీనసర్పము; రెక్కలపాము, లోహితాక్షసర్పము; శోణముఖసర్పము; ఘంటాపుచ్ఛము; ఛత్రపతసర్పము.

### బ్రాహ్మణజాతిసర్పములు

ముత్తియములను వెండిని బోలిన తెలుపుకాంతి గలిగినట్టియు; ఎఱుపు పసుపు రంగు కలిగినట్టియు; బంగారువన్నె కలిగినట్టియు; సాంబ్రాణి చిరిసెన పన్నము పొంద అగుపువ్వుల సువాసనగల సర్పములను బ్రాహ్మణజాతిసర్పము లందురు. ఇవి పర్వతజలధారలదగ్గరను; తటాకము లదగ్గరను; నూతులదగ్గరను; మెట్లభావులదగ్గరను యుండును. పుష్పములను గాలిని భక్షించును.

### క్షత్రియజాతిసర్పములు

ఇవి వజ్రములవలె నిగనిగ లాడుచుండును. వీనికి కోపము ఎక్కువగా నుండును. దీని శరీరమునందు సూర్యుడు చంద్రుడు గొడుగులను శంఖచక్రములరంగువలె జాజి సంపంగి పొన్న పుష్పముల వాసన గలిగియుండును. నేరేడు ఖర్జూరఫలముల రంగువలె

స్వాతిపురస్త్రీ పోలిపండును.

నుండును. ఇవి పరిశుభ్రమైన స్థలములందును; మనుష్యులుండుస్థలములందును నివసించును మూషికములను తినును.

## వైశ్యజాతిసర్పములు

ఇవి నలుపుగను: కెంపు గోమేధికకాంతి గలవిగను; పొపురపుడంగుగను; గులాబి పుష్పవాసనగలిగియు నుండును. ఇవి కాటియగదను; బూడిదపప్పులందును; ఊకపప్పు లందును; నదీతీరములందును; పశుశాలలందును నివసించును. మండూకములను దినును.

## శూద్రసర్పములు

ఇవి దున్నపోతు, పెద్దపులి యనువాని చర్మములను బోలిన వర్ణము పొరుషము కలిగి చిత్రవర్ణములు కలిగియున్న సర్పములను శూద్రసర్పములందురు. ఇవి మనుష్య సంచారము లేక పాడుపడినస్థలములందును; నిర్జనస్థలములందును; కట్టెలగుట్టలయందును నుండును. ఇవి అన్నిటిని దినును.

## ముంగిసలు

ఇవి సాధారణముగా పాములతో పోట్లాడవలచినప్పుడు ప్రథమమున తాము తక్కపాల చెట్లున్నచోటును చూదివచ్చి తదుపరి సర్పముపైకి కలహించుటకై పోయి సర్పమును తిన్నగా తా చెట్టుదగ్గరకు రానిచ్చి కలియబడి అవి కాటువేసినపుడెల్ల తుక్కపాలాకు కొరికి నమలి తినుచు విషము పోగొట్టుకొనుచు పామును చీల్చివేయును. ఇది మహాజాగ్రత్తగల జంతువు.

## సర్పములకు ఆయువు

5 సంవత్సరములు, 20, 50, 55, 100, 500, 1000 సంవత్సరములు కాలపరిమితి యుండును.

## కోరలు వచ్చుట

పాములకు సంవత్సరమున కొకసారి కోర లూడిపోయి మరల నూతనముగా వచ్చుచుండును.

## గర్భిణీసర్పము

గర్భముతోనున్న సర్పము కరచిన మొదల పన్నదష్టుని నోటనుంచి రక్తము ప్రవహించును. సహించలేని మంటలు శరీరమంతటను గలుగును. ముఖము తెల్లబడును.

## ఆడ సర్పము

స్త్రీసర్పము కరచిన నోస లుబ్బును. క్రిందిమూపుగలిగి యుండును. పాదములు భూమిమీద నిలుపుట కష్టము.

---

స్వాతివారపు చిత్రాలక్రింద వెన్ను.

## పురుషసర్పము

పురుషసర్పము కరచిన క్రిందచూడలేవుండును. పశికాలు క్రిందబెట్టుట కళప్రడె యుండును.

## ప్రసవించిన పాము

ఇది కరచినయెడల లింగమునుండి రక్తము ప్రవహించును.

## కాటు భేదములు

వెలికిల బడినచో మిక్కిలి బలముగా కరచినదనియు, ఒక్క కోరమాత్రమే దిగబడినయెడల ఆక్రాంతమై కరచినదనియు, ఒక్క కోరమాత్రమే కొంచెము దిగ బడినయెడల భీతిల్లి కరచినదనియు, రెండు కోరలు లోతుగా దిగపడినయెడల క్షుద్బాధ మిక్కుటముగా నుండి కరచినదనియు, మూడు కోరలుంగ దిగబడినచో మహానాగము కాటువేసినదనియు, మిక్కిలి లోతుగా గాయము బడునటుల గరచినయెడల ఇదివరకు పగబట్టి కరచినదనియు గ్రహింపుము.

## విషాది వివరణ పట్టిక

| | విషగ్రంధులో నుండు విషము | కరచినపుడు వెలువడు నది | మనుజుని, పశు వును చంపుటకు వలయునది | మరణము తటస్థించు కాలము |
|---|---|---|---|---|
| త్రాచుపాము | ⅜-18 గ్రెయినులు | 6 గ్రెయినులు | 1/12 గ్రెయినులు | 10 ని॥ మొ॥ 30 గంటలు |
| కృష్ణసర్పము | 2-6 గ్రెయినులు | 4 గ్రెయినులు | 1/12 గ్రెయినులు | 10 ని॥ మొ॥ 24 గంటలు |
| వైపరులు | 1-4 గ్రెయినులు | 2 గ్రెయినులు | 1/8 గ్రెయినులు | 6 గ॥ మొ॥ 8 రోజులు |
| కట్లపాము | 1/50-2 గ్రెయినులు | 1 గ్రెయిను | 1/100 గ్రెయినులు | 12 గ॥ మొ॥ 8 రోజులు |

పొగాకుతోటలవైపునకు పాములు రావు. గావున పొగాకును ఔషధముగా వాడు చుందురు. ఇదియును కొంతపని చేయును. శీతాకాలములో విషమెక్కువగా యుం డును. చీకటిలో వెలుతురుకన్న విషమెక్కువగాయుండును. పాము చాల దూరము నుండి వచ్చి కరచినపుడుగాని, రెండు దవుడలు సరిగ కలువకపోయినగాని విషము చాల కొద్దిగా నెక్కును. మంచినీళ్ళలోనుండు పాములకు విషముండదు. సముద్రములో నుండు సర్పములలో కృష్ణసర్పముకన్న పదిరెట్లెక్కువ విషముండును. ఉష్ణప్రదేశము

---

స్వాతివానకు ముత్యపు చిప్పలు యెదురుచూచినట్లు.

ఁలలో యెక్కువ విషముండును. సర్పముయొక్క వయస్సునుబట్టికూడ విషము మారును. సర్పము కోపముగానున్న విష మెక్కువగానుండును. ఆహారము తినిన తరువాతను, కూసము విడిచిన తరువాతను విషముండదు. ఈ సర్పము లన్నియు చెట్లెక్కగలవు. నదుల దాటగలవు. త్రాచుపాములజాతి చాల జ్ఞాపకశక్తిగలవి. వాటిని బాధించిన వారిని చాలకాలమైనను జ్ఞాపకముంచుకొని వీలైన తిరిగి శిక్షించగలవు.

## ముఖ్యమైన విషయము

పాములలో అనేకరకములను దైవము సృష్టించియున్నాడని ఇదివరకే చెప్పియుంటిని. ఒక్కొక్క సమయములో పాము కరచి పారిపోయినపుడు అది ఏసర్పమైనది తెలిసికొనుట కవకాశము యుండదు. ప్రాణాపాయము చేయు పాములయొక్క లక్షణములు త్వరలోనే తెలియును. ప్రాణాపాయము వెంటనే చేయక నెమ్మదిగాచేయు పాములను గూర్చి తగిన చికిత్సలు చేయవచ్చును. అనేకమంది వైద్యులు అనేకరకములగ చికిత్సలు చేయుదురు. అటువంటివారు మన దేశములో చాలమంది యున్నారు. వీరు వాడునట్టి ఆకుపసరులు, మంత్రములు బాగుగా పనిచేయును.

పాము స్వల్పమైనజంతువైనను దానికాటువలన పశుదేహమున ప్రసరించువిషము స్వల్పమైనను దీని తీవ్రస్వభావమువలన కొన్నినిమిషములలో ప్రాణము తీయుచున్నది. కఱచిన వెంటనే చికిత్సచేయుటకు ఆలస్యమైనయెడల చికిత్సచేయువారలకు తగినంత అనుభవము లేకపోయినగాని కఱవబడినపశువుప్రాణమును కాపాడుట కష్టము. ప్రతి సంవత్సరము విషపురుగుల కాట్లవలన అనేకజీవములు మృతినొందుచున్నవి వీటి కష్టముల నివారించుటకు రోగనిదానముగల పశువైద్య మత్యవసరము. ఎటువంటి వైద్యపండితులైనను విషపురుగుల కాట్లను కనుగొనుట కష్టము. అందుచేతనే కొన్నికొన్ని ప్రాంతములందు ననాయాసముగా పశువులు మరణించుచుండును. వేసవికాలములో పొలములలోను, బీళ్ళలోను పశువులను కట్టునపుడు కొన్నిపశువులు తెల్లవారుసరికి విషపురుగుల కాట్లచే చనిపోయి యుండును. మరునాటిరాత్రికూడ ఒక్కొక్క సమయములో ఆరీతిగనే జరుగుచుండును. అప్పుడారైతు ఆతురతజెంది తన పొలములో ఏమైన పాము లున్నవాయని విచారించి తగిన ప్రయత్నములు చేయుచుండును. పాముకరచిన పశువు సూర్యోదయము కాగానే మరణించును. పాముల పుట్టలుగల ప్రాంతములందు పశువుల నుంచవలెను. ఇంకను పశువులశాలలలోను, కోళ్లగూళ్లలోను, గడ్డివాములలోను ఎలుకల కొరకవి దాగియుండును. అవియుండుచోటు గ్రహించి పశువులను జాగ్రత్తగా కాపాడుచుండవలెను.

## పాముకాటు లక్షణములు

పాముకాటునకు వెంటనే అనగా విషము దేహమునందు వ్యాపించకముందే చికిత్సచేయుట కారంభింపవలయునుగాని "ఆలస్యం అమృతంవిషం" అనునట్లు విషము దేహమునందంతట నుండు రక్తములో ప్రవేశించి రక్తము నల్లబడిన తరువాత

నేమియు లాభములేదు. పాముకరచిన పశువులకు బాగుగా లక్షణములు కనబడు చుండును. కరచిన చోట భరింపరాని మంటయుండును. శీఘ్రముగామత్తును కలుగ జేయును. తటాలున క్రిందనుండిపైకి పక్షవాతము క్రమ్మునట్లగును. కాళ్లలో సత్తువ బోవును. నేలగూలబడును. గుండెలు వత్తుకొని పోవునట్లుండి దడగానుండును. క్రమేపి తలక్రవాలిపోవును. ఊపిరియాడుట కష్టముగానుండును. కునుకుపాట్లు పడుచుండును. దీనినే సర్పనిద్రయందురు.

మొదటి అవస్థ:— పశువుపండ్లు తెలుపురంగుగానుండి నీరుకారుచుండును. జ్వరముండును. ఈ అవస్థలో జిల్లేడుకొనలు, ఉప్పు, ఆవుపాలతో నూరి కండ్లలో కలికము వేయుము. లేక దిరిసెన పువ్వులరసము కండ్లలో పెట్టుము. లోపలికి నాగముల్లి వేరు 2 తులములు, సన్నావాలు అరతులం నూరి మూడుగొట్టముల గంజిలో కలిపి పెట్టుము.

రెండవఅవస్థ:—పశువు శరీరమంతయు నలుపురంగుగామారి చొంగను కార్చు చుండును. ఈ అవస్థలో మణుగుతామర 3 తులములు, తెల్లగలిజేరు 3 తు॥ ఈశ్వరివేరు 3 తు॥ నూరి ముద్దచేసి నీటిలో కలిపి త్రాగించవలెను. తెల్లనేరు గంధముతీసి కండ్లలో పెట్టవలెను.

మూడవఅవస్థ :— శిరస్సుబరువుగానుండును. మెడనిలుపజాలదు. ఈ అవస్థ యందు తెల్లకలిమిరివేరు 2 తులములు, ఈశ్వరివేరు 3 తు॥ దిరిసెనచెక్కరసం 3 తు॥ నూరి నీటితో కలిపి త్రాగించవలెను. కలి నీటితో దిరిసెనవిత్తులునూరి కండ్లలో వేయుము.

నాలుగవ అవస్థ:— పండ్లుకొరుకును. భూమిమీదపడును. శరీరము నల్లబడును. ఈ అవస్థలో చికిత్సలు చేయుట లాభములేదు.

## తదితర చికిత్సలు

1. నాగదుండదుంప నీటితో అరగదీసి అయిదుతులములు లోపలికి త్రాగించి కొంతకరచినచోట పూసిన విషమువిరుగును.

2. తెల్లఈశ్వరివేరు గంధముతీసి నాలుగు తులములు లోపలికిచ్చి కుట్టినచోట పూసిన విషము హరించును.

3. ఉత్తరేణి ఆకులునూరి పాముకరచినచోట మందముగ పట్టించిన విషము హరించును. దీని ఆకురసము లోపలికి త్రాగించుము.

4. కాకిదొండాకపసరు సేరుచొప్పున రెండుపర్యాయములీయుము.

5. గాడిదగడపాకు పసరు సేరు త్రాగించుము.

6. నాగముషినివేరు చెక్కరసము 5 తులములు త్రాగించుము.

7. పచ్చినేలవేమురసముతో మిరియాలపొడి కలిపి యిచ్చిన సమస్తవిషములు హరించును.

8. చేదుబీరాకపసరు సేరు త్రాగించుము.

ఇంకను అనేకవిధములుగా చికిత్సలు చేయుదురు.

---

# ప్రసవతంత్రము

## పందొమ్మిదవ భాగము

మన దేశములోనున్న చూడిపశువులు ఈనిన తరువాత గాని, ఈనక మునుపు గాని అనేక వ్యాధులు, అపాయములు అప్పుడప్పుడు సంభవించుచున్నవని మన కందరకును విశదమే కదా? ఇట్టివి సంభవించుట మన రైతులయొక్క తెలివితక్కువ చేతను, ఆయా పశువులయొక్క అనారోగ్యము చేతను తటస్థించు చున్నవి. ఇటువంటి అపాయములు పోగొట్టి పశుసంతతిని కాపాడవలెనను యుద్దేశముతో ఈ పశుతంత్రమును వ్రాసితిని. పశువులు ఈనుట, గర్భము ధరించుట మున్నగునవి వానికి స్వాభావిక కర్మలేనిగాని వ్యాధులలో జేరినవి గావు. మిక్కిలి గారాబములో పెంచు చూడిపశువు ఈనవలె ననిన చాల కష్టముగా ఈనును. ఎందుచేతనన దానికి తగినంత విశ్రాంతి లేక దృష్టిదోషము తగులునను యుద్దేశముతో చీకటికొట్టములలోనుంచి, అమితముగా దాణాదినుసులు పెట్టి మేపుటవలన ఇటువంటివి కలుగును. ఇటువంటి పశువులు ఈనునప్పుడు పడు కష్టములు చెప్ప నలవిగాదు. కొన్ని పశువులు చూలు నిలువగనే సునాయాసముగా ఈని చాల ఆరోగ్యకరముగా నుండును. ఈ పశువు లిట్లుండు టెందుచేతననగా :— నిర్మలవాయువులో దిరుగుచు, నిర్మలోదకమును ద్రావుచు, పరిశుభ్రమైన స్థలములలో వసించుచు, దేహకష్టమువలన దేహదార్ఢ్యమును కలుగజేసికొనుచు నుండును. చూడిపశువులను తదితర పశువులతో నెప్పుడు నుంచరాదు. పశువులన్నియు ఎచ్చోట నుండునో ఆచ్చోట వాయువు అపరిశుభ్రమగును. కల్మషాదులు ఎక్కువ అగును. ఇందుచే నిచ్చోట వసించు పశువులు అనేకరోగముల పాలగును. పశువును పనిచేయించనిచో శరీరపటుత్వము తప్పును. కావున అల్పకారణములచే అవి రోగముల పాలగును.

### చూడిపశువుల పోషించుట

ఇంతియేకాకుండ పశువులను పోషించు రైతులు చాల జాగ్రత్తతో, ప్రేమతో, చూచు చుండవలెను. ఇవి ఈనుకాలము వచ్చిన తరువాత వానికి ఏమైన ఆటంకములు వచ్చినయెడల తెలివిగల పశువైద్యుని రప్పించి తగిన చికిత్సలు చేయించవలెను. పల్లె గ్రామములలో అనేక విధమైన పశువైద్యులు గలరు. కొందరు డబ్బు కానించి తెలిసి తెలియని వైద్యముచేసి పశువులను చంపుదురు. మరి కొందరు దూడను సరియైన మార్గములోనికి తీసికొని రాకుండగనే లోపల దానికాలకు త్రాడుచేసి యోనిగుండ లాగుదురు.

---

మరి కొందరు చేయిపెట్టి లోపలిఅవయవము లన్నియు తాకి పశువుయొక్క యోనిని చెడగొట్టుదురు. మరి కొందరు తెలియని మందులు లోపలికి పోయించి పిండమున కపాయము కలుగజేయుచుందురు.

కాబట్టి సోదరులగు రైతులారా! చూడిపశువుల విషయమై చాల జాగ్రత్తగా నుండవలెను. అవి నోరులేని పశువులు. మనము జ్ఞానము గలవారము కాబట్టి మన మెంత జాగ్రత్తగా నుండిన అంత పుణ్యము మనకు కలుగును. మీ గ్రామములో పశువైద్యుడు లేనిచో చూడి పశువునకు యేదైన వ్యాధి సంభవించినప్పుడు తదితర మనుష్యులు ఊహాపోహాలతో చెప్పిన చికిత్సలు చేయరాదు. అటువంటి సమయములో భగవంతుని మీద నమ్మిక యుంచి పశువునకు ఏమందు పోయకుండుటయే మంచిదని నా యుద్దేశము.

తరువాత చూడి పశువులకు సంభవించు వ్యాధులకు వాతలు (కాల్పులు) వేయరాదు. ఇట్లు వేయుట మహాపాతకము.

## పశుగర్భనిర్మాణము

పశువు జీవితమునకు గర్భకోశము ముఖ్యాధారమై యున్నది. ఇది మాంసములో చేయబడిన ఒకసంచి. ఈ కోశములో మూడు భాగములుండును. గర్భకోశములో చిన్న చిన్న అరలుగా నుండును. ఈ అరలు పెద్దజంతువులలో కొన్నిటికి ఎక్కువగా నుండును. పశువు గర్భకోశములో నుండు భాగములు చాల సూక్ష్మములుగా నుండును. పశువు గర్భకోశములో నుండుభాగము లన్నియు నారింజపండులో నుండుభాగములవలె నుండును.

పశువు శరీరములోపల ఆకారములోను, రైజాలోనుకూడ చాల భేదములు గలవు. గర్భకోశము ముఖ్యముగా మాంసపుత్రాళ్లచేత చేయబడినది. ఈత్రాళ్లు అన్నిదిక్కులకు అడ్డదిడ్డముగా వ్యాపించి నరములతో నిండి యుండును. గ్రొవ్వుతిత్తులు గోళాకారముగ నుండును. ఎముక తిత్తులు వంకర టింకరలుగను, కండర తిత్తులు కదురు ఆకారముగను, నరముతిత్తులు దారములవలె నుండును. ఈ తిత్తు లన్నియు సుత్పత్తికోశములై యున్నవి. వీనిలో ఎక్కువ భాగములు పిండోత్పత్తిని కలుగజేయును. పైనచెప్పిన తిత్తు లన్నియు ఒక్కొక్కటి ఒక్కొక్కభాగము సుత్పత్తిచేయును. మగపశువు బీజములు ఆడపశువు బీజములలో కలిసినప్పుడే ఉత్పత్తియగును.

## యోని (Vulva)

దీనికే లోతులేని రంధ్రమందురు. దీనికి ఒకవిధమైన మెత్తని తిత్తి యుండును. దీనిమూలముననే వెలుపలి అవయవములకు సంబంధము కలుగజేసికొనును. యోని అను భాగము శరీరమునకు తగినట్లు నిడుపుగాను, పొట్టిగాను నుండును. తెలపశువుల యోని

---

విశాఖ పట్టితే. విశాదిపట్టినట్లు.

ద్వారముమీద ఉల్లిపొరవంటి పొర మూసికొని యుండును. ఆరంభములో మగపశువు దాటినప్పుడు ఈపొర బ్రద్దలై పోవును. యోనిమూలముననే వెలుపలి అవయవములకు సంబంధము కలుగజేసికొనును. ఈ మూత్రనాళముదు ఇంకను రెండుమూతలు లోపలిభాగ



మున నుండును. ఒకమూతద్వారా శుక్లబుడ్డను వెళ్లును, రెండవమూతద్వారా భగరంధ్రమునకు వెళ్లును. అది కత్తెరయొక్క ఒరలాగున నుండును. ఒక చివరనుండి యోనికి సంబంధ ముండును. ఇంకొక చివరనుండి గర్భాశయమున నుండును. యోనివంటి వస్తిక ముండును. పైపటమున నున్న వస్తికభాగమును చూడుము. వస్తికవు ఎముకవంగినను, విరిగినను, ముడుచుకొనిపోయినను మూత నిండివాపులు వచ్చినపుడు బైటకు రా వీలుండదుగాన జాగ్రత్తగా పరీక్షింపవలెను

## పెనుపెదవులు (Upper Lips)

పశువు యోనియొక్క పై భాగమున పెనుపెదవు లను డిప్పలుండును. ఈపెదవులు నిడుపైన చర్మపు మడతలు గలిగియుండును. ఇవి పశువు మూత్ర, భగ ద్వారముల చుట్టుకొని యుండును. ఈపెదవులు చివరభాగమునందు కలిసియున్నవి. ఈపెదవుల లోపలి భాగమున రెండు చిన్నపెదవులుండును. ఇవి గ్రంథులతో నిండియుండి తేమగా నుండును. ఇంకను జిగటపదార్థములుగల అరలు అనేకము లమర్పబడి యున్నవి.

## గర్భకోశము (Uterus)

గర్భకోశ మనునది కండరములపంచి. ఇది మూత్రసంచికిని, మలపేగులకును మధ్య నమర్పబడి యుండును. ఇదిరబ్బరువంటి ఒక విధమైన కండరముచే కల్పింపబడినది. ఇది రబ్బరువలె వెడల్పగుటకును, చిన్నదగుటకును అనుకూలముగా నుండుట

కార్తీకం కలకాలా వైశాఖం పులకాలా.

వలన గర్భమును ధరించి దినదినముగా గర్భము పెరుగు సమయమున గర్భపుసంచి వెడల్పగును. పిమ్మట పక్వమై దూడ బయటపడిన తరువాత పూర్వముండిన స్వభావమునకు వచ్చుటకొరకే రబ్బరువంటి జన్వ్వానే అమర్చబడి యున్నది. గర్భాశయము వెడల్పయిన చోటికి శిఖరమనియు, మధ్యభాగమునకు దేహమనియు, చివరనుండు భాగమునకు గొంతు అనియు, ద్వారమునకు నోరు అనియు పేరు. ఈనని పశువు గర్భాశయపు నోరనునది నిడువుగాను, ఈనిన పశువునకు హ్రస్వముగాను ఉండును. ఈ శృంగమండలము ప్రతి చివరనుండి అండాశయమునకు దారి యుండును. ఈదారులే గర్భాశయనాళము లనబడును. ఈప్రతినాళము చివర పుష్పమువలె విచ్చియుండును. వీనికి అండాశయము నకును దగ్గర సంబంధము గలదు.

## మగపశువు ఉత్పత్తి అవయవములు

## (Male germ Cells)

ఈ అవయవములలో వృషణములు, అంగము (చేరు) ముఖ్యమైన అవయవములు. ఈ అంగము మూలముననే ఆడపశువు గర్భాశయములోనికి ద్రవపదార్థము ప్రవేశించును. ఎదయగు కాలములో తప్ప ఇతరసమయములలో కత్తి ఒరవంటి ఒక భాగములో మూసి యుంచబడును. రెండు మూత్రపిండము లుండును. ఇవియింద్రియము నుత్పత్తిచేయును. ఈ ద్రవము కొన్ని నాళములద్వారా పోవుచున్నపుడు మూత్రగ్రంథులనుంచి కొంత ద్రవము బయలుదేరును. ఈ ద్రవము లన్నియు కలసిన యెడల వీర్యమనబడును.

## మగపశువు బీజములు

ఇవి మూత్రపిండములలో తయారగును. వీటికిని ఆడపశువు బీజములకును చాల భేదములు గలవు. మగ పశువు బీజము 1/2400 వంతు అంగుళముల పొడవుగ నుండును. ఈ బీజములకు ముఖ్యముగా తల తోక అను భాగములు రెండే యుండును. ఇవి యింత సన్నముగా నుండుటవలననే ద్రవముతో నుంచినయెడల చేప ఈదునట్లు ఈదును. దీని కీశక్తి యుండుటవలననే ఆడపశువుబీజములలో ప్రవేశించును. ఈ ద్రవములో బీజములు లక్షలకొలది యుండును. ఈ ద్రవమునే ఇంద్రియమందురు. ఆబోతుయొక్క ఇంద్రియమును పరీక్షించిన యెడల బీజములను కనుగొనవచ్చును. వీర్యములో ఈ బీజములు లేని యెడల నపుంసకజంతు వందురు.

## ఆడపశువు బీజములు

ఈ పశువుయొక్క బీజము 1/1800 వంతు అంగుళము డయామీటరు గలిగి యుండును. ఇవి గర్భకోశములో నుండును. ఆడపశువు గర్భకోశములో నుత్పత్తి అవయవములు చాల నుండును.

---

విశాఖపస్తుంది మందతిట్టలు పెట్టను ఎత్తుమని.

## ఆడపశువు ఎద

ఆవు ఎదయినప్పుడు దానిని కట్టివేసి దానిదగ్గర ఆబోతును విడువవలెను. ఎదయైన పశువును రైతున కన్నిపను లున్నను వెంటనే పశువునకు చూపించవలెను. కొలంపలోగాని, బురదలోగాని పశువును దిగనియరాదు. అట్లు దిగించో ఎదయనుశక్తి నిలిచి పోవును. తనుపరి మగల రావచ్చును. మంచి జాతిలో పుట్టిన ఆబోతు లేక దున్నపోతను తీసికొని వెళ్లవలెను. మగపశువు దాటుచున్నది లేనిది జాగ్రత్తగా పరీక్షించ వలయును.

## కలయిక

ఆబోతును ప్రతిదినము ఆవులతో కలుపుటకు వీలులేదు. వారమునకు రెండు ఆవులతో కంటె ఎక్కువగా కలియనీయరాదు. ఆబోతును నియమితము లేకుండ విడచుట వలన శీఘ్రముగా నపుంసకమగును. లేదా అట్టిదానికి పుట్టినదూడలు రోగగ్రస్తములు, బలహీనములై చచ్చును. లేదా చచ్చియు చావక కునుకుచు బ్రతుకును. ఆవును అనేక సారులు దాటించుటచేత దాని చూలుకూడ నిలిచిపోవును. ఆబోతు ఆవును ఒకసారి దాటినయెడల చూలు కలుగును. రెండవసారి దాటినయెడల చూడికి భంగము కలుగును. చూడి కట్టిన తరువాత ఆవును మరల ఆబోతుతో కలియనీయరాదు. ఇట్లు కలిసిన గర్భస్రావము కలిగి ఆవు ఈచుకొనిపోవును. ఒకసారి చూడికట్టిన ఆవు మరల ఆబోతును కాంక్షించదని అనేకమంది అభిప్రాయపడుదురు. కాని ఈ సంగతి మేము నమ్మజాలము. నాలుగైదునెలలచూడిలోనున్న ఆవులనుకూడ ఆబోతులు కలియును.

## ఆవునుదాటించుకాలము

ఆవు ఈనిన 4 మాసములవరకు ఆబోతునకు జేరనియరాదు. అప్పుడు కరి పచ్చిగా దించుకొని యుండును. గర్భము ధరించుటకు తగిన స్థితిలో నుండదు. ఒకవేళ ఆబోతు కలిసినను చూలు నిలువదు. ఆవు ఈ సమయములో అరదినను దాటించరాదు. ఎద అరనిచో చన్నీళ్లతో కడుగుట మంచిది. లేక నూరెకారము అంతులం చన్నీటితో కలిపి త్రాగించిన అతాప మణగును.

## యుక్తవయస్సు

పశువుయొక్క యుక్తవయస్సును గూర్చి పశువైద్యశాస్త్రజ్ఞులలో కొందరికి భేదాభిప్రాయములు గలవు. సామాన్యముగా ఆవుపెయ్య అనుమానసులకు పార్లి 15 మాసములకు యుక్తవయస్సు వచ్చినదికి ఈనదు. కాని అంత చిన్నవయస్సులో గర్భము ధరించి ఈనిన పశువునకు పుట్టుదూడ బలహీనముగ నుండును. పాల నమ్ముకొను ఆవు పెయ్యను అరుమాసములకే గర్భము ధరించునట్లు చేయుదురు. దానికి కారణ మేమనః— అంత త్వరలో ఈనినయెడల వారు దానిపాలు మొదలగు వానిని అమ్ముకొని లాభము పొందుటకు ప్రయత్నించుదురు. జనసామాన్య మంతయు ఆవుపెయ్యను రెండుసంవత్సర

---

అనూరాధ కార్తెకలో అనాథకర్ర ఆయినా యీనును.

ముల వయస్సు' వచ్చునప్పటికి ఈనునట్లుగా చేయుదురు. ఈ వయస్సునందు 'ఈను పెయ్యను మనము జాగ్రత్తగా పోషించిన యెడల అది యెట్టికష్టములను పొందక దూడను పెట్టును.

## చిన్నతనమునందే గర్భధారిగా జేయరాదు

ఒక పెయ్య మొదటికాన్పు కనగనే మంచి ఆహారమునుపెట్టి బాగుగ పోషింప వలయును. పశువును చిన్నతనమందే గర్భధారిగా (6 మాసములకే) చేయువారు ప్రతి ఈతకు మధ్యకాలము (రెండు సంవత్సరముల వయస్సు)లో ఈనిన పశువున కుండవలసిన కాలము కంటె ఎక్కువగా నుండినచో అది చిన్నతనమందే గర్భము ధరించుటచేత బల హీనముగా నుండును. గాన ఆ బలహీనతను కోలుపోయి పశువు బలమును జెంది మరల పుట్టిన దూడకు కావలసిన పాలను సమృద్ధిగా జేకూర్చుకొనుటయే కారణమై యున్నది. పశువునకు వయస్సు ఎక్కువైనను త్వరగా పెరుగకున్న చిన్న వయస్సులోనే గర్భధారణకు పనికిరాదని తోచినయెడల దానిని 18 లగాయతు 24 మాసముల వయస్సు వరకు పొర్లనీయకుండ నుంచవలెను. కాని అట్టిపెయ్యలు ముందుముందు ఆవులైన పిమ్మట ఎక్కువ పర్యాయములు ఈనును. సామాన్యముగా ఆవు ప్రతిపర్యాయము ఈనుటకు మధ్య సంవత్సరము పట్టుచుండును. ఆవు గర్భము ధరించినది మొదలు 9 మాసములకే ఈనును గాన సంవత్సరమునకు ఒక్కొక్కదూడ పుట్టవలె ననిన ఒకసారి ఈనిన మూడునెలలకే మరల ఆవు పొర్లవలెను. కొన్ని ఆవులు ఈనుటకు ముందు 2 నెలలు లేక 6 వారములు వరకు పాలు యిచ్చును. గర్భము ధరించిన ఆరునెలల పిదప దానియొక్క పిండోత్పత్తికి అవసరము వచ్చునుగాన పాలిచ్చుట కొంచెము కొంచెము తగ్గును. మనము ఆవు ఈనుటయందే ఆశించక పాలు ఒక సంవత్సరము వరకు నీయవలె నను యుద్దేశముతో ఆ సంవత్సరాంతమువరకు దానిని పొర్లకుండజేయువలెను. ఇట్లు జేయుటవలన ఒక్కొక్కసారి ఈనుటకు మధ్య 16 మొదలు 20 మాసముల వరకు గడు వుండును. కాని పై విధముగ ప్రతిసారియు జరిగినయెడల ఆవుదూడలు తక్కువ పుట్టుట సంభవించును. ఆ పద్ధతి దూడకైనను ఆవుకైనను అంతమంచి పద్ధతికాదు.

## ప్రసవకాలపట్టిక

పశువులను పెంచువారు పశువు పొర్లినతేదీని జ్ఞాపకముంచుకొనిన యెడల అది ఈను సరియైనదినము ఆయజమాని తెలిసికొనగలడు. 473,474,475,476 పేజీలలో నున్న పట్టికలోని మొదటి వరుసలో తెలుపబడినవి పశువులు పొర్లిన తేదీలని, వానికి వ్యతిరేక ముగ నున్న రెండవవరుసలో నున్న తేదీలు అవి ఈను కాలమును తెలుపు తేదీలని గ్రహించవలెను.

దీనికి ఉదాహరణము :— ఒకఆవు జనవరి 10 వ తేదీని పొర్లినయెడల అక్టోబరు 21 వ తేదీన ఈనును. జూన్ 16 వ తేదీన పొర్లినయెడల ఏప్రియల్ 8 వ తేదీన ఈనును.

ఈ పట్టికలో వేసిన తేదీలు సుమారుగ వేయబడినవి. ఈ చెప్పిన తేదీలకు కొద్ది దినములు ముందువెనుకలుగ ఈనును.

## ప్రసవకాలపట్టిక

| పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ |
|---|---|---|---|---|---|
| జనవరి 1 | అక్టో॥ 12 | ఫిబ్రవరి 1 | నవం॥ 12 | మార్చి 1 | డిశం॥ 10 |
| 2 | 13 | 2 | 13 | 2 | 11 |
| 3 | 14 | 3 | 14 | 3 | 12 |
| 4 | 15 | 4 | 15 | 4 | 13 |
| 5 | 16 | 5 | 16 | 5 | 14 |
| 6 | 17 | 6 | 17 | 6 | 15 |
| 7 | 18 | 7 | 18 | 7 | 16 |
| 8 | 19 | 8 | 19 | 8 | 17 |
| 9 | 20 | 9 | 20 | 9 | 18 |
| 10 | 21 | 10 | 21 | 10 | 19 |
| 11 | 22 | 11 | 22 | 11 | 20 |
| 12 | 23 | 12 | 23 | 12 | 21 |
| 13 | 24 | 13 | 24 | 13 | 22 |
| 14 | 25 | 14 | 25 | 14 | 23 |
| 15 | 26 | 15 | 26 | 15 | 24 |
| 16 | 27 | 16 | 27 | 16 | 25 |
| 17 | 28 | 17 | 28 | 17 | 26 |
| 18 | 29 | 18 | 29 | 18 | 27 |
| 19 | 30 | 19 | 30 | 19 | 28 |
| 20 | 31 | 20 | డిశం॥ 1 | 20 | 29 |
| 21 | నవం॥ 1 | 21 | 2 | 21 | 30 |
| 22 | 2 | 22 | 3 | 22 | 31 |
| 23 | 3 | 23 | 4 | 23 | జనవరి 1 |
| 24 | 4 | 24 | 5 | 24 | 2 |
| 25 | 5 | 25 | 6 | 25 | 3 |
| 26 | 6 | 26 | 7 | 26 | 4 |
| 27 | 7 | 27 | 8 | 27 | 5 |
| 28 | 8 | 28 | 9 | 28 | 6 |
| 29 | 9 | | | 29 | 7 |
| 30 | 10 | | | 30 | 8 |
| 31 | 11 | | | 31 | 9 |

## ప్రసవ కాలపట్టిక

| పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ |
|---|---|---|---|---|---|
| ఏప్రియల్ 1 | జనవరి 10 | మే 1 | ఫిబ్రు॥ 9 | జూన్ 1 | మార్చి 12 |
| 2 | 11 | 2 | 10 | 2 | 13 |
| 3 | 12 | 3 | 11 | 3 | 14 |
| 4 | 13 | 4 | 12 | 4 | 15 |
| 5 | 14 | 5 | 13 | 5 | 16 |
| 6 | 15 | 6 | 14 | 6 | 17 |
| 7 | 16 | 7 | 15 | 7 | 18 |
| 8 | 17 | 8 | 16 | 8 | 19 |
| 9 | 18 | 9 | 17 | 9 | 20 |
| 10 | 19 | 10 | 18 | 10 | 21 |
| 11 | 20 | 11 | 19 | 11 | 22 |
| 12 | 21 | 12 | 20 | 12 | 23 |
| 13 | 22 | 13 | 21 | 13 | 24 |
| 14 | 23 | 14 | 22 | 14 | 25 |
| 15 | 24 | 15 | 23 | 15 | 26 |
| 16 | 25 | 16 | 24 | 16 | 27 |
| 17 | 26 | 17 | 25 | 17 | 28 |
| 18 | 27 | 18 | 26 | 18 | 29 |
| 19 | 28 | 19 | 27 | 19 | 30 |
| 20 | 29 | 20 | 28 | 20 | 31 |
| 21 | 30 | 21 | మార్చి 1 | 21 | ఏప్రిల్ 1 |
| 22 | 31 | 22 | 2 | 22 | 2 |
| 23 | ఫిబ్రు॥ 1 | 23 | 3 | 23 | 3 |
| 24 | 2 | 24 | 4 | 24 | 4 |
| 25 | 3 | 25 | 5 | 25 | 5 |
| 26 | 4 | 26 | 6 | 26 | 6 |
| 27 | 5 | 27 | 7 | 27 | 7 |
| 28 | 6 | 28 | 8 | 28 | 8 |
| 29 | 7 | 29 | 9 | 29 | 9 |
| 30 | 8 | 30 | 10 | 30 | 10 |
| | | 31 | 11 | | |

మూలవాన ముంచకతీరదు.

# ప్రసవకాలపట్టిక.

| పశువు పొర్లిన తేది | ఈనిన తేది | పశువు పొర్లిన తేది | ఈనిన తేది | పశువు పొర్లిన తేది | ఈనిన తేది |
|---|---|---|---|---|---|
| జూలై 1 | ఏప్రిల్ 11 | ఆగస్టు 1 | మే 12 | సెప్టెంబరు 1 | జూన్ 11 |
| 2 | 12 | 2 | 13 | 2 | 12 |
| 3 | 13 | 3 | 14 | 3 | 13 |
| 4 | 14 | 4 | 15 | 4 | 14 |
| 5 | 15 | 5 | 16 | 5 | 15 |
| 6 | 16 | 6 | 17 | 6 | 16 |
| 7 | 17 | 7 | 18 | 7 | 17 |
| 8 | 18 | 8 | 19 | 8 | 18 |
| 9 | 19 | 9 | 20 | 9 | 19 |
| 10 | 20 | 10 | 21 | 10 | 20 |
| 11 | 21 | 11 | 22 | 11 | 21 |
| 12 | 22 | 12 | 23 | 12 | 22 |
| 13 | 23 | 13 | 24 | 13 | 23 |
| 14 | 24 | 14 | 25 | 14 | 24 |
| 15 | 25 | 15 | 26 | 15 | 25 |
| 16 | 26 | 16 | 27 | 15 | 26 |
| 17 | 27 | 17 | 28 | 17 | 27 |
| 18 | 28 | 18 | 29 | 18 | 28 |
| 19 | 29 | 19 | 30 | 19 | 29 |
| 20 | 30 | 20 | 31 | 20 | 30 |
| 21 | మే 1 | 21 | జూన్ 1 | 21 | జూలై 1 |
| 22 | 2 | 22 | 2 | 22 | 2 |
| 23 | 3 | 23 | 3 | 23 | 3 |
| 24 | 4 | 24 | 4 | 24 | 4 |
| 25 | 5 | 25 | 5 | 25 | 5 |
| 26 | 6 | 26 | 6 | 26 | 6 |
| 27 | 7 | 27 | 7 | 27 | 7 |
| 28 | 8 | 28 | 8 | 28 | 8 |
| 29 | 9 | 29 | 9 | 29 | 9 |
| 30 | 10 | 30 | 10 | 30 | 10 |
| 31 | 11 | 31 | 11 | | 11 |

మూలా ముందును జేష్ఠ తెల్పును.

## ప్రసవకాలపట్టిక.

| పశువు పొర్లిన తేది | ఈనిన తేది | పశువు పొర్లిన తేది | ఈనిన తేది | పశువు పొర్లిన తేది | ఈనిన తేది |
|---|---|---|---|---|---|
| అక్టోబరు 1 | జూలై 12 | నవంబరు 1 | ఆగస్టు 12 | డిశంబరు 1 | సెప్టెం॥ 11 |
| 2 | 13 | 2 | 13 | 2 | 12 |
| 3 | 14 | 3 | 14 | 3 | 13 |
| 4 | 15 | 4 | 15 | 4 | 14 |
| 5 | 16 | 5 | 16 | 5 | 15 |
| 6 | 17 | 6 | 17 | 6 | 16 |
| 7 | 18 | 7 | 18 | 7 | 17 |
| 8 | 19 | 8 | 19 | 8 | 18 |
| 9 | 20 | 9 | 20 | 9 | 19 |
| 10 | 21 | 10 | 21 | 10 | 20 |
| 11 | 22 | 11 | 22 | 11 | 21 |
| 12 | 23 | 12 | 23 | 12 | 22 |
| 13 | 24 | 13 | 24 | 13 | 23 |
| 14 | 25 | 14 | 25 | 14 | 24 |
| 15 | 26 | 15 | 26 | 15 | 25 |
| 16 | 27 | 16 | 27 | 16 | 26 |
| 17 | 28 | 17 | 28 | 17 | 27 |
| 18 | 29 | 18 | 29 | 18 | 28 |
| 19 | 30 | 19 | 30 | 19 | 29 |
| 20 | 31 | 20 | 31 | 20 | 30 |
| 21 | ఆగస్టు 1 | 21 | సెప్టెం॥ 1 | 21 | అక్టో॥ 1 |
| 22 | 2 | 22 | 2 | 22 | 2 |
| 23 | 3 | 23 | 3 | 23 | 3 |
| 24 | 4 | 24 | 4 | 24 | 4 |
| 25 | 5 | 25 | 5 | 25 | 5 |
| 26 | 6 | 26 | 6 | 26 | 6 |
| 27 | 7 | 27 | 7 | 27 | 7 |
| 28 | 8 | 28 | 8 | 28 | 8 |
| 29 | 9 | 29 | 9 | 29 | 9 |
| 30 | 10 | 30 | 10 | 30 | 10 |
| 31 | 11 | | | 31 | 11 |

పూలుదురిస్తే ముంగారి పాడు.

## గర్భములో పిండము పెరుగువిధము (Development of Foetus)

పశువు గర్భములో పిండోత్పత్తికి కావలసిన అవయవములు ఆరోగ్యవంతములుగా నుండి మార్గము లన్నియు అడ్డగింపులేక ధారాళముగా నుండి మగ పశువుయొక్క ఇంద్రియము చెడక మంచిస్థితిలో నుండి ఇట్టి మగ ఆడ పశువుల సంయోగము ఋతుకాలానుసరణమై సంభవించు నెడల మగ ఆడపశువుల ఇంద్రియము మిశ్రమముచే పిండోత్పత్తి కలుగునని ఇదివరకే చెప్పియుంటిమి. పశువు గర్భము ధరించి నప్పటినుండి ఈనుకాలమువరకు 7 భాగములుగా విభజింపవచ్చును.

### మొదటిదశ (First Period)

పశువు గర్భముధరించిన తరువాత రెండవ వారమునకు పిండము పొట్టలో నుండి గర్భాశయములోనికి వచ్చును. అప్పు డది ఒక అంగుళములో పన్నెండవ వంతు నడిమి కొలత గలిగి యుండును.

### రెండవదశ (Second Period)

గర్భము ధరించిన మూడవ వారములో పిండముయొక్క మొదటి లక్షణములు కనపడును. శరీరము తల మొదలగు అవయవములు కొంచెము కొంచెముగా గుర్తుపట్టుటకు వీలగును. పిండము మూడవవంతు పరిమాణము గలదిగ నుండును.

### మూడవదశ (Third Period)

అయిదు మొదలు ఎనిమిది వారములవరకు 1¾ అంగుళములు పిండము పెరుగును. ఈ కాలములో కాళ్లు డెక్కలయొక్క చిహ్నములు కనబడును.

### నాలుగవదశ (Fourth Period)

తొమ్మిది మొదలు పన్నెండవవారము వరకు 5¼ అంగుళము పిండము పెరుగును. నాలుగు పొట్టలు కనబడును.

### అయిదవదశ (Fifth Period)

13 మొదలు 20 వ వారము వరకు 12 అంగుళములు పిండము పెరుగును. ఈ కాలములో స్పర్శశక్తిగల వెంట్రుకలు పెదవుల మీదను, పైకనురెప్పలమీదను, కనుబొమలమీదను మొలచును. ఆపిండమునకు చను మొనలు వచ్చును.

### పిండమును పోషించుట

గర్భము ధరించినది మొదలు ఎక్కువగా తవుడు, తొండంగి, పిల్లిపెసర మున్నగు వాత పదార్థములు తినుచుండు పశువు శరీరమునందు వాతము కూడుకొని యుండును.

ఆ వాతము శరీరమున నుండూడ గర్భాశయమున బొంగును. అట్లు వాతము పెంపొంగుట వలన అంగహీనము, గూని, తక్కువ కీలలుదూడ, మున్నగునవి గలుగుచుండును. ఇంకను తల్లియొక్క వాతము దూడకుకూడ సంభవించి దాని జీవితము బాధించును.

గర్భస్థమగు దూడకు స్వాతంత్ర్యములేదు. తల్లి నిదురపోయిన పిండముకూడ నిదురపోవును. మేలుకొనిన మేలుకొనును. కావున పిండము తల్లికి అధీనమైయుండును. గర్భాశయమునందు సంయోగము గలిగినది మొదలు ఆ గర్భపిండమునకు అవయవములు సరిగా వచ్చువరకు గర్భాశయములోనుండు పదార్థముల మూలమున పిండము వృద్ధి బొందును. అవయవములు సరిగా వచ్చుచున్నప్పుడు గర్భముయొక్క నాభియందు ఒక సన్నని రంధ్రముగల నాడి కట్టబడి యుండును. ఆ నాడితో మావి చేర్చబడును. ఆ మావి తల్లియొక్క రసాశయమునకు స్థానమందు చేర్చబడును. ఇట్లు చేయబడుట వలన తల్లియొక్క ఆహారరసము ధమనుల వలన శరీరమున ప్రవహించుచు మావిని చేరును. ఆ మావి వలన దూడయొక్క నాభినాడిని పొందును. ఆ నాభివలన ఆరసము దూడయొక్క పక్వాశయమునందు చేరి అచ్చట దూడయొక్క కాయాగ్నిచే పక్వముగాబడి రక్తాది ధాతువులను పోషించును. ఇట్లు గర్భముగానున్న సమయములో తల్లి ఆహారరసముచేతనే గర్భము పోషింపబడుచుండును. పుట్టిన తరువాత కూడ ఆ తల్లియొక్క ఆహారరసమే చన్నులయందు స్తన్యరూపమున పరిణమించి పుట్టిన దూడను పోషించును. తల్లియొక్క రసవహనాడి పిండముయొక్క నాభికూడ కూర్చబడినది. ఆ నాభినాడి రసవహనాడియందు కూర్చబడిన దగుటచే ఆతల్లియొక్క ఆహారసారమును గ్రహించి దానివలన పిండమును పోషించును. గర్భమునందున్న పిండము ప్రత్యేకముగ ఆహారపానీయముల సేవించక స్వచ్ఛమగు ఆహారసారమైన శరీరపోషణము జరుగబడుచుండుటచే గర్భస్థపిండమునకు మూలమలము గలుగదని గ్రహించవలెను.

## ఆఱవదశ (Sixth Period)

21 మొదలు 22 వ వారము వరకు 2 అంగుళముల పరిమాణముగల పిండము పెరుగును. ఈ కాలములో కనురెప్పలు, వెండ్రుకలు బాగుగా మొలచును. పిండము గర్భములో తిరుగుట తల్లి గుర్తించును.

## అంత్యదశ (Last Period)

నిండుపిండము సంపూర్ణదశ నొందియుండును.

## గర్భమున దూడ వృద్ధిజెందుట

చూడి పశువులు ఈను సమయము వచ్చువరకు చాల కష్టపడుటయు, ఈనిన తరువాత రోగముచే బాధపడుచుండుటయును కారణము సామాన్యారోగ్యవిధుల నలక్ష్యము చేయుటవలననే! గర్భము దాల్చినది మొదలు గర్భక్షేత్రమునందే గాక శరీరనిర్మాణ

---

మార్గశిర మాసంలో చు చు పడ్డ నూటతొంబదియో నాడు మంచివర్షం కురుస్తుంది.

మంతయు విశేషమైన మార్పులు గలుగుచుండును. శరీరమున విశేషద్రవము లూరుచుండును. గర్భమున దూడ వృద్ధిచెందుచుండుటయు, గర్భము విస్తరించుటయు, అందువలన యితర అవయవములకు వత్తుగలుగుచుండుటయు, గర్భపశువుయొక్క శరీర పోషణకేగాక గర్భక్షేత్రమునగల దూడనుకూడ పోషించగల ద్రవము లుత్పత్తిచేయుటయును, పోషక పదార్థములిచ్చుటయును, శరీరావయవములన్నియు నెక్కువపని చేయుచుండుటయు జరుగుచుండుటచే శరీరనిర్మాణమున చిత్రమైన మార్పులు గలుగుచుండును.

### చివరమాసములలో జాగ్రత్తగా చూడవలెను

గర్భమున పెరుగుచున్న దూడ మాతృశరీరమునుండియే పోషక పదార్థము నాకర్షించుకొను. అట్టి పోషక పదార్థములను ఆహారరూపమున చూడిపశువులు ఎక్కువగా తీసికొనవలసి యుండును. ఎముకలు, కండరములును నిర్మించుటకు లవణములు కావలసి యుండును. ఈ లవణములు లేని లోపములవలన ఎన్నియో వ్యాధులు పుట్టుచుండును. గర్భము క్రమముగా విస్తరించుచున్న కొలదిని నాడీమండలమున కెక్కువ శ్రమగలుగుచుండును. నరములు బలహీనమగుచుండును. చూడిపశువులు కొన్ని ఆఖరుమాసములందు చాల బాధపడుచుండును. ఈనుట ఆసన్నమగుచున్నపుడు గర్భము క్రిందికి జారును. ఇట్టి సమయములందు తగిన చికిత్సలు చేయవలెను.

# చూడిలో వచ్చు రోగములు

### కడుపులో వాయువుచేరుట

చూడిపశువు కడుపులో వాయువు చేరి డొక్క లుబ్బి యుండును. జీర్ణముకాని పదార్థములు తినుటవలనను, పిండమునకు ఏదైన అపాయము కలుగుటవలనను ఈవ్యాధి రావచ్చును. ఇంకను పేగులయందు జీర్ణశక్తి క్షీణించుటచేత కూడ వాయువు ప్రసరించి కడుపునొప్పి, శూలనొప్పి, కడుపుబ్బరము కలుగును. ఇట్టి సమయములో వేడినీటితో ఎనిమాచేయుట మంచిది. లేక ఆముదము అర్థసేరు త్రాగించిన నెమ్మదించును. కాని విషసంబంధమైన మందు లేమియు పోయరాదు. పైపటమున చూపించిన పశువు జీర్ణరోగమును చూడుడు.

### మలబద్ధకము

ఇది సాధారణముగా పశువులలో చాల భాగము బాధించును. ఈవ్యాధి చూడిపశువులకు పలుమారు వచ్చుచుండును. పశువు తినిన ఆహారము సరిగా జీర్ణమై పేడ సరిగా వేయవలెను. అట్లు పేడ వేయనిచో అనేక వ్యాధులు పుట్టును. లోపల పేడలోని మురికి పదార్థములు పేరుకొని తదితర వ్యాధులు పుట్టించును. ఇంకను అవయవముల

---

పెద్దవాడు పడుచువాడు మామతోనగూడ కేని పంచము తిలేక వానవచ్చును.

యందలి బలమునుకూడ తగ్గించును. మలబద్ధకమువలననే చూడిపశువులకు కడుపునొప్పి, రక్తశూల గర్భశూల మున్నగు వ్యాధులు జనించును. కాబట్టి దీనికి చెప్పిన చికిత్సలు మంచిది.



## చికిత్స

వారమునకు రెండు పర్యాయములు అర్ధసేరు ఆముదము నిచ్చుట మంచిది.

లేక వాము అరసోలెడు, ఉప్పు 2 తు, వేడినీరు అర్ధసేరు కలిపి త్రాగించుట మంచిది.

## విరేచనములు

చూలు కట్టినది లగాయతు ఈడువరకు కొన్ని పశువులకు పలుచని విరేచనము లగుచుండును. ఈ విరేచనములు దుర్వాసనగా నుండును. ఇట్లు ఎల్లప్పుడగుచుండు పశువునకు గర్భపాతము కలుగును. కాబట్టి ఆరంభములోనే తగినచికిత్స చేయుట మంచిది. ఈ విరేచనములతో కడుపునొప్పికూడ యుండవచ్చును.

మాచికాయలపొడి 1 తు, పోక చెక్కలపొడి 1 తు, పచ్చి నేరేడు చెక్కరసము 15 తు, కలిపి దినమున కొకసారి చొప్పున నాలుగైదు దినములు త్రాగించవలెను.

లేక దానిమ్మ చిగుళ్లు 2 గుప్పిళ్లు పెరుగు అర్ధసేరు కలిపి త్రొక్కి పెట్టవచ్చును.

పై మోతాదు దినమునకు రెండు పర్యాయముల వంతున నీయవచ్చును.

---

గుడ్డివాడు జడ్డివాడు నామముతో నగుపడిరేని పంచమింతిలేక వానవచ్చును.

## వాతము

ఈ వ్యాధి వాతశరీరముగల పశువులకు సోకును. విశేషముగా ఎండలలో తిరుగుట వలనను, దొడ్లప్పుడు తేమనేలలో పండుకొనుట వలనను, లేక మలబద్ధమువలనను, చూలు కొకముందు ఎక్కువగా తవుడు మేపుటవలనను, ఈ వ్యాధి రావచ్చును. నోటి వెంట చొంగపడును. నోరు దుర్వాసనగా నుండును. చెవులు వ్రేలాడవేయును. శరీరము అంత వేడిగా నుండదు. పేడ వేయజాలదు.

### చికిత్స

వాము అరసోలెడు, ఉప్పు చేరెడు, కలిపి ద్రొక్కి అర్ధసేరు వేడినీటిలో కలిపి త్రాగించవలెను.

లేక శొంఠిపొడి 1 తులము, పిప్పళ్ళపొడి 1 తులము, మిరియాలపొడి ½ తులం, వేడినీరు అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

వరా:— పశువు తలకు మంచి ఆముదము కాచి గోరువెచ్చనిది రాయవలెను.

## రొమ్మునొప్పి

వాతశరీరముగల పశువులకును, బలహీనముగానున్న పశువులకును గర్భకాలము లయందు రొమ్మునొప్పి కనబడును. ఈ నొప్పిచే పశువు చన్నులలో రెండో ఒకదానికూడ గడ్డలేచును. ఆగడ్డ పొడుగువరకు వ్యాపించి చాల బాధ చేయును.

### చికిత్స

ఆముదము అర్ధసేరు త్రాగించవలెను. తరువాత ఆ గడ్డకు టింక్చర్ అయోడిన్ రాయుము.

లేక వెన్నపూస 3 తులములు, వెలిగారము 1 తులము కలిపి చంటిగడ్డకు రాయవలెను.

తరువాత ప్రతిదినము ఇసుకగాని ఉప్పుగాని వేయించి గుడ్డలో వేసి ఆ గడ్డకు కాపులు కాచిన తగ్గును. ఈప్రకారము ప్రతిదినము తగ్గువరకు చేయవచ్చును.

## తీగలు వేయుట.

పశువు కటినుండి చీమిడివంటి తీగలు పడుచుండును. ఆ స్రావము మిక్కిలి వేడిగా నుండును. పశువునకు వేడిచేసినపుడెల్ల నీతీగెలు పడుచుండును. వాతరోగమున్న పశువులకు ఈ తీగలు తరచుగా పడుచుండును.

---

స్వాతిగతః శుక్రేయి వాతవృష్టిః

## చికిత్స

పటిక లోషన్‌తో పశువుకటిని కడుగుటమంచిది. 1 తులము ఇంగువ వేడినీటిలో కలిపి త్రాగించవలెను.

## పశువు ఈనుట

ఈనుటకు ముందు నొప్పులు వచ్చును. పశువు శాంతముగా నుండలేదు. బాధ పడుచున్నటుల కదలుచుండును. పిండము తరచుగా మార్గము తప్పుటకు కారణ మేమన:— సకాలమునకు ముందు ప్రసవించుట చేయుటగాక, పరిమితించు నొప్పులవలననే గాక, దూడ ఉన్నటువంటి స్థానమును బట్టికూడ యుండును. పశువు ఈనుటకు సరియైన కారణములు బాగుగా తెలియవు. పిండము క్రమక్రమముగా వృద్ధియగుకొలది యోనియు గుహ్యము క్రమక్రమముగా మార్పులు కలిగి పిండము బయటకు వచ్చుటకు వీలు పడునట్లు వృద్ధి పొందును.

పిండము వృద్ధియగుకొలదిని తల్లిశరీరమునుండి మావికజేరుచున్న రక్తము మొదలగునవి ప్రసరించుట తగ్గిపోవును. ఇంకను వృద్ధిపొందినకొలది తల్లిశరీరముతో సంబంధముండక దూడ విడిగా నుండును.

## దూడ బయటకువచ్చుటకు కారణములు.

పశువు యోనిభాగమునందుండు కండరములు, నరములు మొదలగు వానియొక్క ఒత్తిడిచేత దూడ బయటికి వచ్చును. ఈ కండరములే ఆ యోనిభాగములను ముడుచుకొనునట్లును, విడిపోవునట్లును చేయును. ఆగర్భకోశము ముడుచుకొని పోవునప్పుడు నొప్పులు తప్పకవచ్చును. దానికి కారణము నరములయొక్క ఒత్తిడియే యైయున్నది. ఇవి నరములు ఒత్తిడిచేయుటవలన కలుగు నొప్పులుగావు వీనిని కష్టపునొప్పు లందురు. గర్భాశయము ఒకటి రెండు సార్లు ముడుచుకొని బాధపడిన తమాత్రముననే పిండము బయటకు రాక అనేక పర్యాయములు ముడుచుకొని విడిపోయిన తరువాత దూడ బయటకు వచ్చును. ముడుచుకొనుట, విడిపోవుట మొదలిడినప్పుడు పశువు మిక్కిలి బలహీనముగా నుండి నెమ్మదినెమ్మదిగా ముడుచుకొనుట సంభవించును. మొదట బలహీనతజెంది క్రమేణ వృద్ధియగును తుదకు తగ్గిపోయి కూడ పడిపోవును. ఈనుకాలము సమీపించు కొలది యోనిభాగము, పిండము సడిపోవును.

గర్భాశయము ఎక్కువగా ముడుచుకొనుటకు ఆలస్యము మాత్రము తక్కువగుచుండును. ఈ మధ్యమున్న కలుగు ఆలస్యములో తల్లికిని - లోపలనుండు మావికిని కలుగు నష్టములను తీర్చుకొనుటకు వీలుపడును. అట్లు వీలుపడుచు, ముడుచుకొనుటవలన పిండము బయటకు అతిసులభముగా మార్గమును వెలువరింపబడును. సక్రమముగా వచ్చు బాధ

---

స్వాంగతే శుక్రే వాతివృష్టిః.

సమయములో గర్భాశయము సంపూర్ణముగా ముడుచుకొని పోవును. దూడయొక్క తల ఉచ్చబుడ్డలో నున్నపుడు ఒక్కొక్కప్పుడు ముందు బయటకు వచ్చియుండును. లోపలను లాగు శక్తియే బయటకు త్రోయుశక్తికంటె యెక్కువగును. పిండమును చుట్టుకొని యుండు పొరలు బయటకు వచ్చునపుడు గుండ్రముగ నుండు యోనియొక్క చుట్టుభాగ మందు కనబడును. పడిపోయినటువంటి ద్రవముతో కూడినటువంటి యోనిద్వారమందు ఒకవిధమైన కాయ (ఉబ్బు) లేక ఉచ్చబుడ్డకూడ అవయవమునకు మిక్కిలి బాధను కలిగించును. కాని ముడుచుకొనుట మారిన సమయములందు మాత్రమని వగునై అంత బాధకరముగా నుండదు. ముడుచుకొనుట యెక్కువైనకొలది పొరలు బయటకు వచ్చుట ప్రారంభించును. అప్పుడే కొన్ని ద్రవపదార్థములు వానినుండి వెలువడిపోవును. అట్లు వెలువడకముందు కొంతభాగము యోనిభాగమునకు వదలిపెట్టును. అందుచే, దూడ బయటకు పోవునపుడు నిష్కంటకముగా పోవుటకు సహాయము చేయును. ఈ పొరలు గనుక ముందుగా పగిలిన మొదల పిండమునకు అపాయము ప్రసవము కష్టతరమై మిక్కిలి ఆలస్యమై ఒక్కొక్కప్పుడు దూడకు అపాయకరముగ కూడ తోచును.

## ఈనులక్షణములు - చలనములు

ఈనునప్పుడు పట్టుకాలము నాలుగు భాగములుగా విభజించవచ్చును.

(1) ప్రారంభదశ
(2) యోనిభాగ మబ్బుట
(3) పిండము బయటపడుట
(4) పొరలు (మావి) బయటపడుట

## ఈనునప్పుడు పరిశుభ్రత

పశువు ఈనుటకుముందు విశాలమైన సందులోగాని, గాలివచ్చు పశుశాలగదిలో గాని యుంచవలెను. ఆ గది విశాలముగను, తేమ లేనిదిగను, సున్నము కొట్టినగోడలు గలదిగను ఉండవలెను. పశువు ఈనునప్పుడు యజమాని, నౌకరు జాగ్రత్తగా చూచు చుండవలెను. పశువు ఆరోగ్యముగా నున్నచో నొప్పులు ఆరంభించగనే యోనిమార్గము నుండి తీగలు, ద్రవము వెలువడుచుండును. గర్భాశయద్వారమున దళి గోళములలో ఊరిన కొంత ద్రవము యోని ద్వారమునందు గల్గు సూక్ష్మజీవులు విస్తారముగానుండును గాన హానికరములగు వ్యాధులను కలిగించు క్రిములు గర్భాశయమునందు ప్రవేశింపకుండ దీనియందలి సూక్ష్మజీవులు వానిని నిరోధించుచుండును.

పశువు ఈనుసమయములో గర్భాశయము చాల ప్రమాదకరమునకు గురియై యుండును. గాన అట్టి అపాయస్థితిలో విషక్రిములు దానిలో ప్రవేశించకుండ చేయుటకు తగిన యేర్పాటులు సృష్టికర్త అమర్చియున్నాడు.

## వైద్యునిదగ్గర నుండవలసిన పనిముట్లు

చికిత్సచేయు వైద్యునియొద్ద స్టెతస్కోపు (శబ్దవేణు), ఒక కత్తెర, ఎనిమాడబ్బా, పొటాషియం పర్మాంగనేట్ లేలికలోషన్, ఒక దూదుగుడ్డ, సబ్బుబిళ్ల, ఫినైల్ మున్నగు వస్తువు లుండవలెను. పశువున కేమైన అపాయములు సంభవించినయెడల వానికి తగిన సామగ్రి తన నౌకరుతో తెప్పించిగాని, తాను తెచ్చిగాని తగిన చికిత్స చేయవలెను. వైద్యులకు మట్టలాగు, సగము చేతులుగల చొక్కా, కాళ్లకు బూటులుం డుట మంచిది. అట్లు లేనిచో పశువునకు చికిత్స చేయునప్పుడు తదితర దుస్తులు అడ్డమువచ్చును గాన అట్టి సమయములో తగిన దుస్తులుండుటయే మంచిది.

## పనిముట్లను, చేతులను శుభ్రముగా నుంచుకొనవలెను.

ఆయుధములతో పని చేయవలసినప్పుడు వేడినీటిలో వేసి కాచియుంచవలెను. పశువు ఈనిన తరువాత దూడయొక్క కాళ్లగోళ్లను తీయుటకు సిద్ధముగా నుండవలెను. ఆ వైద్యునియొక్క గోళ్లయందు దేమాత్రము మలిన ముండరాదు. తరువాత యెప్పటి కప్పుడు చేతులను లోషన్ నీటిలో కడుగుకొనుచు ండవలెను. ఇంకను చికిత్సచేయు వైద్యునిచేతులు మురికిగా నుండరాదు రోగియందలి విషద్రవ్యములు వైద్యుని చేతులకు గాని, ఉపకరణములకుగాని అంటుకొని యుండినను వ్యాధిని కలిగించు సూక్ష్మ జీవులు రోగనియందు ప్రవేశించుట కవకాశము గలదు. గాన చేతులను శుభ్రముగా నుంచుకొనవలెను.

## దూడబొడ్డును జాగ్రత్తగా చూడవలెను.

పశువు ఈనుట పూర్తియైన తరువాత ఆ స్థలమునకు కుక్కలనుగాని, కాకులను గాని రానీయకుండ జాగ్రత్తగా చూచుచుండవలయును. ఈగలను, దోమలను అచ్చట మూగనీయకుండ ఫినైల్ లోషన్ చల్లుట మంచిది. దూడబొడ్డును కాకులు ముట్టకుండ చాల జాగ్రత్తగా కాపాడవలెను. ఈనిన తరువాత పశువుకటి వెంబడివచ్చు రక్తపు తిత్తులను కాకులు పొడిచి పెద్దపుండు చేయును. అట్లు పొడుచుటచే పుండులో పురుగులుపడి పశువున కపాయము సంభవించును.

దూడపుట్టిన తక్షణమే అది ఊపిరి విడుచునట్లు దాని ముక్కును, నోటును తుడువవలెను. అట్లు చేసినతరువాత దూడ అరవ నారంభించును.

## ప్రారంభదశ

ఈనుటకు కొన్నిగంటలకాలము పట్టును. ఒక్కొక్కప్పుడు సరిగా ఈనవలసిన కాలమునకు కొన్ని దినములు ఆలస్యముగా ఈనును. ఈనినతరువాత చన్నులు ఒకవిధ

---

జిగట ద్రవము నిచ్చును. క్రమక్రమముగా ఆ ద్రవమే ప్రారంభదశలో పాలుగా మారును. యోనిభాగము డొల్లభాగముగా ఏర్పడును. ఖాళీ యెక్కువగా కనపడును. మృదువుగా గూడ నుండును. దాని లోపలిభాగమునందు పొర ఎఱ్ఱబడును. ఆ ఎరుపువన్నె నొందిన భాగమును ఒకవిధమగు బంకవంటి ద్రవపదార్థము కప్పివేయును. ఈ మార్పులతో ఉదరము మిక్కిలి వ్రేలాడి అంటుకొనిపోవును.

ఈనకముందు జంతువు మిక్కిలి కష్టముగాను, నెమ్మదిగాను నడచును. అది వచ్చి గడ్డి మేయుచున్న యెడల యెక్కువగా కొన్ని కొన్ని నిమిషము లాగుచుండును. దానికి కారణము యోనిభాగము ముడుచుకొనుచుండుటయే. అట్టి సమయమునందు ఆవైన యెడల అఱచును. ఇంకను పశువును కట్టివేయక స్వతంత్రముగా వదలిపెట్టినయెడల దూరముగా పోయి శాంతముగా నుండు స్థలమును చూచుకొని అచట ఈనుటకు ప్రయత్నించును. ఇవియే సాధారణముగా ఈనులక్షణములై యున్నవి. ఒక్కొక్కప్పుడవి మోసపుచ్చుచు కొన్నిదినములు కొన్ని గంటలుకూడ గడచి ఈనును. ఇట్టి ప్రసవవేదనలు ఈనెడి దినమునకు కొన్నివారములు ముందుగనే కనబడును.

## యోనిభాగ ముబ్బుట

పశువు దీనిని మొదటిదానియంత స్పష్టముగా తెలిపికొనలేదు. జంతువు బాధపడుట చూచి దీనిని కనిపెట్టవచ్చును. గుఱ్ఱమే మన కాలితో మట్టిం గీఱును. మాటిమాటికి పశువు పండుకొనుచు లేచుచుండును. ఏమియు తెలియనిదానివలె అటునిటు చూచుచుండును. యోనిభాగము ముడుచుకొనుట సక్రమముగా మొదలుపెట్టి పైనచెప్పిన పనులను హఠాత్తుగా పశువు ఆపివేయును. ముడుచుకొనుటవలన గలుగు బాధచే నిశ్చేష్టురాలై పోవును. దానికన్నులు దాని బాధను కనపరచును. శరీరము వేడిగానుండును. నాడి త్వరగా కొట్టుకొనును. పొట్ట పైభాగము (కడుపు) ముడుచుకొనిపోవును. సామాన్యముగా మూత్రముకూడ బాగుగా పడదు. కొంచెము కొంచెముగ పోయును. ఈ కష్టసమయమందు యోనిభాగమును పరీక్షించినయెడల దానియొక్క లోపలిభాగము చుట్టు గట్టిగా నుండును. బాధ తగ్గినపుడు శాంతి నెలకొనును. ఒక్కసారి వచ్చిన బాధ కొన్ని సెకండ్లు మాత్రమే యుండును. ఒక్కొక్కసారి రెండుమూడు నిమిషములుకూడ నుండును. నొప్పులు ప్రారంభమైన తరువాత 15 నిమిషములకు దూడ తల కాళ్ళు మొదలగు అవయవములయొక్క క్రిందిభాగములు తలతో ముందుకు వచ్చును. తరువాత రొమ్ముభాగము బయటకువచ్చును. మొదట నెమ్మదిగా ఆ యోనిభాగ ముబ్బును. దూడ వెనుకభాగమునుండి వచ్చునపుడు యెక్కువగా ఆ యోనిభాగముబ్బును. దూడ కాళ్లు, తల ముందునకు వచ్చినప్పుడును లేక మెడ యెత్తుగా నుండునప్పుడును కూడ ఉబ్బును. దూడ ఉచ్చబుడ్డ బయటకు రాగానే యోని భాగము క్రమముగా నుబ్బి

---

చంద్ర పరివేషము వానయోగము.

తీయును. ఒక్కొక్క దూడకు పెట్టు పశువునకు కవలదూడల గర్భమైనపుడు ఒక్కొక్క పిండము ఒక్కొక్క సంచిలో నివసించును. రెండుపిండములు ఒకేపరిమాణము కలిగి యుండును.

## పిండముండు చోటు

పిండము చెప్పునట్లు సామాన్యముగా ముంగుభాగములోనే యుండును. అప్పు డప్పుడు కొంచెము వెనుకభాగములోను కూడ తటసించుచుండును. ఇట్టి సమయ ములందు ఒకే దూడను ఈనుచున్నయెడల రెండు దూడలను ఈనుట యనుమ బహుకష్టమైయుండును. గర్భాశయభాగము ముడుచుకొనుట పిండము బయటకొనుట లొకేసారి జరుగును. ఏ పిండము కొంచెము మెత్తగ ముడుచుకొనుచు బయటకు వచ్చుటతో దానిని వెంటనే పశువు ఈనును. రెండవపిండము సామాన్యముగా మొదటిదానికన్న రెండుగంటలకాలము ఎక్కువ పట్టవచ్చును. గర్భాశయము ముడుచుకొనుటలో మిక్కిలి శక్తిగలవై యుండును గనుక పిండమునకు, గర్భాశయమునకు యున్న సంబంధము త్వరగా తన చేతిని దూర్చియుంచిన యెడల సహాయము గు పిండము ముడుచుకొనుట, పిండము వెన్ను దిగా కలుగును. తల్లియొక్క గర్భాశయమునకు కొంచెము సంబంధము తప్పక యుండును. యోనియొద్ద ఎముక పూర్తిగా ఉబ్బినతరువాత సకలవిధ కండరములు నొక్కసారి గర్భా శయములో నున్న దూడను బయటకు త్రోయ ప్రయత్నించును. ఈవిధముగ జరుగునపుడు అవి రొమ్ముముకవద్ద నున్న కండరములచేతను, పశువు వెనుకభాగమున నున్న కండర ములచేతను సహాయము చేయుచుండును.

## దూడ క్రిందబడుట

ఈ స్థితిలో బాధలు అతితీవ్రముగను, అతిశ్రమముగను, వచ్చును. గర్భాశయము ముడుచుకొనుటలుకూడ ఎక్కువగును. అదేసమయములందు రొమ్మునకు మధ్య నడుమ నుండు చర్మము, ఉదరములోని కండరములును కదలుటకు, లేక ముడుచుకొనుటకు, ప్రారంభించును. పశువు నిలుచుండినయెడల దానియొక్క అవయవములు చిన్నటిని నడుముక్రిందకు తెచ్చుకొనును. నడుమును వంచును. తోక పైకెత్తును. వెనుకమాపును చూచును. పశువు కొంచెమునాలుకను ముడుచుకొనును. సాధ్యమైనంతవరకు తన లోపలి భాగమునను ఒత్తిడిగలిగించి దూడను యోనిభాగములోనికి వచ్చునట్లు గనుపరచుకొనును ముడుచుకొనినపుడు ప్రతిసారియు ఉచ్చబుడ్డ గర్భాశయములోనుండి వెలుపలకు కొం చెము క్రిందకు దిగుచు యోనిభాగము బయటవచ్చి తిత్తివలె కనపడును. పిమ్మట యోనిభాగమునుండి ఉచ్చబుడ్డ పూర్తిగా బయటకు వచ్చును. దానియొక్క లోపలి మురికిపదార్థమంతియు కొంచెపరమ పోవును. తరువాత దూడయొక్క రొమ్ముభాగము మొదలగునవి బయటకు వచ్చునపుడు యోనిభాగమునుండి ఉచ్చబుడ్డ దూడకు అడ్డము లేకుండ నుండునట్లు పూర్తిగా పడిపోవును. ఇవి జరుగుటకు ముందే దూడ పైభాగమున నున్నపొరలు పగిలిపోవును.

---

ఆగమువేసిది, అత్తగాన్న ఎంత కోపములున్ను.

## ముందు కాళ్లుతల వచ్చుట

మొట్టమొదట మాడయొక్క ముందుకాళ్లును, ఆ భాగమున నుండు కండరప్రదేశములును బయటకు వచ్చును. అప్పుడే యోనిభాగ మింధు మింధుగ పెద్దదగుచుండును.



పెద్ద పెద్ద జం[illegible] పాదములు ముందు వచ్చి కింది భాగము మాత్రము తరువాత బయటకు వచ్చును. మాంసభక్షక జంతువుల విషయములో తల పెద్దదగుటచే ముందు

---

కొర్తె ముందర ఉరిమినా కార్యము ముందర పడరినా చెపుతుంది.

వచ్చును. తరువాత ముందుభాగపు అవయవములు రొమ్ముక్రిందుగా వదుర్చబడి బైటకు వచ్చును. ఒక్కొక్కప్పుడు అరుదుగా దూడయొక్క వెనుకభాగము బయటకుపడు సమయములలో రెండు వెనుకకాళ్లు ముందు కనపడును. తరువాత తదితర అవయవము లన్నియు బయటకు వచ్చును. సామాన్యముగా యోనినుండి దూడతల బయటకు వచ్చినపుడు తరువాత భాగము రాక కొంచెమాగును. ఎందుచేతననగా తలతరువాత భాగము మిక్కిలి లావై యుండుటచేత అది బయటకు వచ్చుటకు యోనిభాగ మింకను ఎక్కువగ ఉబ్బవలసిన అవసర ముండుటవలన, అట్లు ఉబ్బుటకు వీలు గలుగుటకు కొంత ఆలస్యమగును. తల బయటకు వచ్చిన తరువాత రొమ్ముభాగములును, భుజములును, పొత్తికడుపు లోపలవరకు వచ్చును. అందుచేత నప్పుడు పశువుయొక్క ఆ భాగము మిక్కిలి లావుగ ఉబ్బరముగ కనబడును. అప్పుడే ముడుచుకొనుటలు ఎక్కువగను, అతి బలీయముగను కలుగుచుండి తరువాత దూడ ఒక్కసారి బయటికి బడును. ఆసమయమం దిదివరకున్న బాధ ఎక్కువగును. ఒక్క పిల్లి అటువంటి సమయములందు అరచును. రొమ్మునకు తరువాత భాగము బయటకు వచ్చుటకు కొంచెము సులభముగనే యుండును.

## ఈనిన వెంటనే పశువుచేయునది

అన్ని పశువులు నొకేవిధముగ స్థితిలో ఈనజాలవు. గుఱ్ఱము, ఆవు, గొఱ్ఱె మొదలగునవి సామాన్యముగా నిలబడియే ఈనును. ఒక్కొక్కప్పుడు ఆవు పరుండి ఈను సమయములో నిలబడుటకు ప్రయత్నించును. పశువు అట్లు నిలుచున్నపుడు వెన్నెముకపై ఆధారపడుచు శరీర మంతయు ప్రక్కకు వంచి శరీరపుముందుభాగపు అవయవములను రొమ్ముక్రింది ప్రక్కకు లాగుకొనుచు వెనుకకాళ్లను పొట్టక్రిందకు లాగుకొనుచు నుండును అట్లు చేయుచు చాలకష్టపడుచు మిక్కిలి శ్రమనొందిన తరువాత చాల నెమ్మదిగా నిలబడును. దూడక్రింద పడగనే, తల్లి దూడమీదనుండు పొరలను దీసివేసి బొడ్డుత్రాటిని నాకి తీసివేయును. దాని నాలుకతో దూడయొక్క శరీరమును శుభ్రపరచును. దూడను సరియైనస్థితిలో నుంచి తనచన్నులయొద్దకు దానిని మూతితో నెట్టును. తరువాత దూడను పాలు కుడుపుకొనును.

## ప్రసవకాలము - బొడ్డుత్రాడు

ప్రసవవేదన కాలము అనేకవిధములుగా పశువుల సాంప్రదాయమునుబట్టియు, ఆయాసమయములనుబట్టియు, పరిస్థితులనుబట్టియు నుండును. ఆవు ఒకగంట లగాయతు రెండుగంటలలో ఈనుట పూర్తియగును. ఒక్కొక్కసారి 15 నిమిషములలోనే జరుగును. ఒక్కొక్కసారి ఒకటి రెండు దినములవరకు జరుగును. ఆవుమాద బొడ్డుత్రాడు మిగుల కురచగ నుండును. ఒక్కొక్కప్పుడు ఆ బొడ్డుత్రాడు దూడ క్రిందపడకమునుపే పశువుయొక్క యోనిభాగములోనే తెగిపోవును. ఒక్కొకప్పుడు అబొడ్డుత్రాడు గట్టి

---

వర్షలేమికి ఉరుములు ఎక్కువ.

గను బలముగ నున్నప్పుడు అట్లు తెగిపోక పొరలచేత చుట్టబడి దూడ క్రిందపడునంత నుండును. అప్పుడు ఆవు ఆశ్చర్యయుతముగు సహజజ్ఞానముచే దూడను పరిశుభ్రముగ తుడుచుచు ఆ బొడ్డుత్రాటిని తీసివేయును. బొడ్డునుండి రెండంగుళముల తరువాత బొడ్డుత్రాడు తెగిపోవును. ఒక్కొక్కప్పుడు 5, 6 అంగుళముల వరకు తెగిపోవును. మనము కత్తితోగాని లేక కత్తెరతోగాని దానిని కత్తిరించినపుడు యెట్టి అపదయు రాజాలదు. మిగిలియున్న భాగము బొడ్డునుంటియుండి క్రమక్రమముగా ఎండిపోయి చివర కూడిపోవును.

## మా వి ప డు ట

పిండసంబంధమగు పొరలు లేక మావి యనునది దూడ పడిన తరువాత బయటకు పడును. కొన్ని కొన్ని కేసులు మాత్రము వానియొక్క బలమును బట్టియు, వృద్ధత్వమును బట్టియు, బలహీనతనుబట్టియు ముందువెనుకలుగా పడుచుండును. దూడ క్రిందపడిన వెంటనే గర్భాశయము అతి త్వరితముగా శక్తివంతముగ ముడుచుకొనుచు విడిపోవుచుండును. ఈ సమయమందు యోనియొక్క లోపలిభాగపు ఘనపరిమాణము కరిమముగ తగ్గును. యోనిభాగములోనికి అచటనుండు వసుసైన ఎముకలద్వారా నెమ్మదిగ వచ్చుచుండు ఆ పిండపు పొరలను లేక మావిని బయటకు స్వేచ్ఛగ రానీయక నొక్కిపట్టుచుండును. అదే సమయములో పొట్ట వెన్నుభాగముల యందుండు కండరములు అప్పుడప్పుడు పిండము క్రిందపడునప్పుడుండు ఒరుపుచేతను, దూడయొక్క బొడ్డుత్రాడు చుట్టుకొని పోవుటచేతను, ఆ మావి గర్భాశయములోనుండి యోనిభాగములోనికి తోయ్యబడును. అప్పుడప్పుడా మావితోకూడ పశువు గుంజప్రక్కనుండు రక్తము కొంచెము కొంచెముగా వచ్చుచుండును. ఇట్టి రక్తము నాపుటకు అప్పుడప్పుడు సంభవించు గర్భాశయపు ముడుచుకొనుటలు తోడ్పడుచు అపుచుండును. 24 గంటలలో మావి పడనియెడల వెంటనే తగు చికిత్స చేయవలెను. ఒకసారి దూడను కను పశువులు కవలదూడలను కనునపుడు మొదట దూడ వెంటనే మావి బయటకువచ్చును. అది సరియైన తోడలో లేకపోవుటచేతనే అట్లు చిక్కులు కలసించుచుండును.

## మావిని తిననీయరాదు

మావిని పశువును తిననియ్యరాదు. మావితిన్న పశువునకు ఊపిరి తిరుగకుండ నుండు చిహ్నములు కనబడును. ఆవు ఈనగనే సాధ్యమైనంతవరకు దూడ పడినతరువాత మావిపడుట చాల అవసరము. అట్లు మావివేయక యోనిభాగమందే నిలవయున్నయెడల ఒక విధమైన వ్యాధి కలుగును. మావి పడగనే యోనిభాగము తనంతటదియే ముడుచుకొనిపోవును. తరువాత పశువు సుఖముగా నుండును. యోని యొక్క ఘనపరిమాణము వెంటవెంటనే తగ్గినగాని వెనుకటివలెను ఎన్నడును రాదు. యోనిభాగములో నుండు బంకపదార్థములతో గూడిన పొర దాని సహజస్థితిలోనికి

---

వానినుండు పోరమైనా మాటవయుండు ఏర్పినా తునిమట్టును.

వచ్చును. దానియొక్క లోపలిభాగము వెంటనే ముడుచుకొనును. ఇంక నా భాగములో నుండు ఎముకలు కొన్ని దినములలో ముడుచుకొని పోవును.

## మే యి ది గు ట

చూడిపశువును సరిగా మేపకుండుటవలనను, దుర్బలత్వమువలనను, వాతరోగము వలనను, అతికాకవలనను ఈ మేయి కనపడుచుండును. ఇది చాల ప్రమాదకరమైనది. ఈ మేయిలో అనేకరకములు గలవు. చూడిపశువులకు ఈ మేయి కనపడగనే చాల ఆందోళనపడుచుందురు. ఈ మేయి దిగిన చూడిపశువునకు చికిత్స లెంతమాత్రము చేయరాదు. చికిత్సలు చేయవలెనని కోరికయున్నచో మీ తాలూకా వెటరినరీడాక్టరు గారిని కనుగొనుడు. కాని తెలిసి తెలియని వైద్యము చేయరాదు. అట్లుచేసిన పిండమునకు అపాయము కలుగును. ఈ మేయి ఈనినతరువాత కొన్ని పశువులకు కనబడును. మరికొన్నిటికి చూలింతోనే తటస్థించును. కాని పశువు ఈనుటకుముందు ఈ మేయి ఆటంకము కలిగించి పశువునకపాయము సంభవించును. ముక్కుచుండును. ఇంకను భరింపరాని నొప్పులుకూడ నుండును. కాబట్టి అది యేజాతిలో చేరినదో తెలిసికొని తగిన చికిత్స చేయవలెను.

## గ రి మే యి

మనము గడ్డికోయు కొడవలికక్కు (గరదు) యేమాదిరిగనుండునో ఆమాదిరిగనే ఈ గరిమేయి యుండును.

## సొ ర మే యి

ఇది సొరకాయ ఆకారముగ నుండును. ఈ మేయికి మధ్యగాగాని, ఒకప్రక్క నుంచిగాని ఒక మొద్దని చీరయుండును. ఈ చీరగలభాగము పశువు దిబ్బముకను తిన్నగానుంచి లోపలికి తోయవలెను. లేనిచో మరల వెంటనే జారును.

## గుం డ్ర మే యి

ఇది కొబ్బరికాయ ఆకారముగ నుండును. దీనికిని సొర మేయివలె చిరయుండును. పైవిధముగనే చికిత్స చేయవలెను.

## బల్లి ఆకారపు మేయి

ఇది బల్లిఆకారముగా నుండును. ఇంకను పనసమేయి, మిడిమేయి మొదలగునవి గలవని ఆయుర్వేద పశువైద్యులు చెప్పుదురు. ఇటువంటివి తటస్థించినప్పుడు అనుభవముగల వైద్యునితో జాగ్రత్తగా తగిన చికిత్సలు చేయించవలెను.

---

ఉరిమిన వాన కురవకమానదు.

## చికిత్స

మెయిని స్వస్థానమునకు త్రోసి సీసా దూర్చి కట్టుకట్టవలెను. మూడునాలుగు దినములుంచి తీసివేయవలెను.

లేక ఏటవాలుగా నేల త్రవ్వి ఆగోతి పైభాగమున పశువుమెయి దిగువభాగ మున్ను, తలక్రింది భాగమునను నుండవలెను. ముందు మెయి స్వస్థానములో త్రోసి ఆపశువు నట్లే కొన్నిదినము లుంచవలెను.

లేక ముందు నందివర్ధనపువ్వులు తెచ్చి గిద్దెడు రసము తీసి ఆమెయికి రాచి సరియైన స్థానములో నుంచవలెను. నందివర్ధన రసములో కుసలాగివేయు శక్తియున్నది. ఆమెయి మరి కొన్నిగంటలలోగాని, కొన్నిదినములలోగాని మరల కనుపడవచ్చును. అప్పుడు మెయిని త్రోసివేసి బద్దలు చెక్కి మానమునకు కట్టిన మరలరాదు. తరువాత ఒకటిరెండు దినములకు బద్దలు తీయవచ్చును. కొందరు మెయిని త్రోసివేసి మానమును కుట్టుదురు. ఇదిచాల మూర్ఖత్వపు పని - మంచి పద్ధతికాదు.

## మెయిత్రోసివేసిన తరువాత

కల్లుమ్యాకు పసరు అరసోలెడు, పాలు అర్ధసేరు, ఇంగువ 1 తులము కలిపి దానిలో ఎర్రగా కాల్చిన ఒక కంకరరాయి వేసి మరల తీసి త్రాగించవలెను. అంతట నొప్పులు తగ్గకచో 3 డ్రాముల సారాయి లోపలికి త్రాగింతురు.

## మావిపడకుండుట

పశువు ఈదుకొని పోవునప్పుడును, చాలసేపు నొప్పులు పడి యీనినప్పుడును గర్భసంచిలో నుండి దూడనంత బలము లేకుండుట వలనను, బలములేని ముసలి పశువు లగుట, గర్భకోశము ముడుచుకొని పోవుట వలనను, గర్భకోశనాళములలో బలహీనత వలనను మావిక్రింద పడక నిలిచిపోవును. పశువు మానమునుండి మావి కొద్దిగా వ్రేలాడును. కాళ్ళు నేలమీద కొట్టుకొనుచుండును. తోక ఆడించుచుండును. ముక్కుచుండును. మావి నిలువయున్న మొదల ప్రబ్బి దుర్వాసన వేయును. వెనుకభాగము పైకి లేపలేదు. సరిగా పశువు నిలుచుండలేదు. కనుగుంటలు విడుచును. ఈగలు మానము చుట్టు ముసురును. మానమువెంబడి చీము పడుచుండును. మావి కుళ్ళుటవలన శరీరమునకు అమితబాధ కలుగును. ఈ చెడిపోయినదియు, ప్రబ్బినదియు నగు మావియొక్క సారము శరీరమందు ప్రవేశించి నెత్తురును చెరచును. అందువలన జ్వరము, గడ్డలు లేచుట మున్నగు వ్యాధులు సంభవించును. జ్వరము తగిలిన తరువాత పాలుకయందు లేమ యుండదు. పాలుండవు. కల్మషము విరిచిపోయి మిగుల బలహీనముగా నుండును.

---

కర్కాటకము బిందిస్తే పెరకొటకము మూలభూతము.

## చికిత్స

పశువు ఈనిన తరువాత కొంతకాలము వరకు మావిపడనప్పుడు తగిన చికిత్స చేయవలెను. అయినను 24 గంటలవరకు లేక అంతకన్న కొంచె మాలస్యముగా కూడ ఏ దుర్గుణము లేకయే మావి పడుట పశువులలో కలదు.

1½ దినము కంటె మావి నిలువయున్నయెడల నువ్వులు అర్ధశేరు, వేడినీరు సేరు కలిపి త్రొక్కి త్రాగించినచో అది క్రిందపడును.

లేక తాటికాయలు 9 టి, మంచిబెల్లం 10 తులములు కలిపి పెట్టవలెను.

లేక పులిసినచల్లలో కందనూరి కలిపిపెట్టవలెను.

లేక ఉడకబెట్టిన సజ్జపిండి 1½ సేరు, మంచిబెల్లము అరవీశ కలిపి త్రొక్కి పెట్టవలెను.

లేక సెంగకాయలు 15 లేక 25, నువ్వులు 10 తులములు, వరిగంజి సేరు కలిపి త్రాగించవలెను.

పై వస్తువులను గుణాయమక మావి క్రిందికి చుర్వాగున చేయుచున్నయెడల అను దినము అర్ధసేరు త్రాగించినచో పడిపోవును.

## మావిని తీసివేయుట

పశువు యోనిద్వారమున చేయి దూర్చి మెల్లగా గర్భతిత్తిలోనికి పోనిచ్చి మావిని పట్టుకొని బయటకు తీసికొనిరావలయును. చెయ్యి లోపలికి పోవునందున గర్భతిత్తికి ముడుచుకొనుశక్తి గలుగును. అందువలన మావి వెలుపలికి వచ్చి రక్తము నిలిచి పోవును. ఈ సూత్రముకూడ విూకు తెలియని యెడల ఒక అడుగు పొడవుగల సన్నని బద్దలు రెండిని తీసికొని వ్రేలాడుచున్న మావియొక్క చివరను, ఆ రెండుబద్దల మధ్య నుంచి ఆ బద్దలయొక్క చివరలను రెండుచేతులతో గట్టిగా పట్టుకొని ఆ మావిని ఆ బద్దలకు చుట్టవలెను. ఇట్లు చేయగా ఆ బద్దలు కదిలపడకు వచ్చును. అంతట మెల్లగా లాగుచు ఆ విధముగా చుట్టవలెను. కఠినముగా లాగరాదు. ఎంత తేలికగా లాగిన అంత మేలు కలుగును. నెమ్మదిగా లాగినచెడల మావి రాక బద్దలకు చుట్టుటకు వీలు లేని యెడల అంతటితో ఆ దినము లాగివేయుటకు మానివేసి మరుసటిదినమున తిరిగి ప్రయత్నించవలయును. మావిని తీసివేసిన తరువాత పశువునకు పత్తువ కలుగుటకు గంజి పోయవచ్చును.

## ప్రమాదములు

గర్భము బాగుగా వృద్ధిచెందినతరువాత పశువుయొక్క ఉదరము బిగిసి కదల కుండుట, కడుపులో రాయివలె త్రిప్పినట్లుండుట, శూల, గర్భము చలనరహితమగుట,

---

పడమర మెరిస్తే పదరి అయినా తల్లీకు దిగదు.

గర్భవేదనలు గలుగుచుండుట, యోనిమార్గమునుండి గర్భోదకాదులు స్రవించుచుండుట, నేత్రములనుండి నీరుకారుట, ఆయాసముగా నుండుట, శరీరము ఉబ్బుట మున్నగు లక్షణములున్న లోపల దూడ మరణించినదని తెలిసికొనవలెను. పిండమునకు వాత,




పిత్త, కఫము లావరించుటవలనను, దెబ్బలు వగయిరా తగులుటవలనను, తదితర కారణములవలనను, లోపల పిండము వికృతాకారముగా గాని, తదితర ఆకారములుగాగాని యుండును.

తూర్పున ఇంద్రధనస్సు దూరా పాతవర్షము

వత్తికము దెబ్బతగిలి వంగుటవలన గాని, వాతముచేత వంగుటవలన గాని, లోపల దూడ బైటకు వచ్చుటకు కష్టముగా నుండును. గాన జాగ్రత్తగా ఆలోచించి దూడను లాగవలయును.

చచ్చిపోయిన దూడను వెంటనే తీయకపోయిన పెద్ద పశువునకు అపాయము కలుగును. జీవముతోనున్న దూడను అజ్ఞానముచేత చచ్చినదని తలంచి శస్త్రముచేత అటు నిటు లాగినచో దూడ, తల్లికూడ మరణించును. గాన జాగ్రత్తగా ఆలోచించి చేయవలెను.

ప్రాణముతోనున్న దూడ రూనిర్దయముగా తగుల్కొనిన చేతిని సన్నదిగా దూడ నోటిలోనికి పోనిచ్చిన చేతివేలు నాకును. అట్టి సమయములో జాగ్రత్తగా దూడను తీసినవాడే పశువైద్యాచార్యుడనిపించుకొనును.

దూడ లోపల చచ్చి బాధపడుచున్న దానిని శస్త్రముచేసి తీయుట చాలా కష్టము. ఎందుచేతనన యోని, యకృత్, ప్లీహ, పేగులు, గర్భాశయము వీటి మధ్య భాగమున బాధ కలుగజేయునంక, వాటిని ముట్టుకొనకుండ శస్త్రము చేయవలయును. మరియు అధోగతమైన దూడను ఊర్ధ్వముగ బంధించుట, గర్భాశయమునందు అడ్డము తిరిగిన దూడను అధోముఖముగా తీయుట, ఒక భాగమునే కోయుట, అవుసరమున్న అన్ని అవయవములను కోయుట, యోని ముఖద్వారమును కోయుట, చాలా కష్టము గాన పశువు యజమానికి చెప్పి శస్త్రచికిత్స చేయుట మంచిది కాని బాధ్యత వైద్యుని మీద పెట్టరాదు. ఈ కష్టములన్నియు వారు చూచుచునే కొందరు ఆక్షేపించుదురు. అవుసరమున్న పిండము యోనికి అడ్డు తగిలి ఈ గ్రంథములో సూచించిన పటముల ననుసరించి దూడ తలను ముక్కలుముక్కలుగా నరకవలసివచ్చును. అవుసరమున్న దూడ నన్ని భాగములను కోయవలసివచ్చును గాన వైద్యుడు జాగ్రత్తగా ఆలోచించి చేయవలెను. పెద్దపశువు బ్రతుకదని అనుమానముగా నున్నప్పుడు వైద్యుడు చికిత్సచేయకుండుట మంచిది.

గ్రామాలలోనుండు పశువైద్యులలో చాలా కోప్పరు లున్నారు. కాని తెలిసి తెలియనివారు పశువు యోనిలోనికి చేతులు దూర్చియు, పిండమునకు మోకు, త్రాళ్లు వేసి బలవంతముగా లాగుటయు నాలుగైదు గంటలు తంటాలుపడి పిమ్మట వైద్యుల దగ్గరకు వచ్చెదరు. మేము మాత్రము ఏమి చేయగలము. అనుమానముగానున్న చికిత్స చేయకుండుట మంచిది. ఎందుచేతనన భాగమంతయు వాచి వాతము కూడుకొని యుండ, పశువు చనిపోవునప్పుడు రాక్షమాత్రము దేవుడా! కాదు! ముమ్మాటికి కాదు. అట్టి వాటిని చికిత్స చేయక వదలిపెట్టుటయే మంచిది.

---

పడమట పాల్పిట్టంత మేఘమువస్తే పగ్గాలం తెగకురుస్తుంది.

## గర్భతిత్తి చీలిపోవుట

గర్భతిత్తి పగిలిపోవుట వలన పశువున కపాయము సంభవించును. సామాన్యముగా అన్నిపశువులకు నిట్లు పగిలిపోదు. రెండు మూడు దూడలను కనుటవలనను గర్భవైశాల్యమున కంటె బిడ్డ పెద్దదిగ పెరిగియుండుటవలనను, నిండుచూడిమీద పొత్తికడుపునకు దెబ్బతగులుటవలనను గర్భతిత్తి పగిలిపోవచ్చును.

అప్పుడు పశువు యోనిద్వారమునుండి రక్తనాళము వెడలుచుండును. ముందుగా వచ్చునొప్పులు ఆకస్మికముగా నిలిచిపోవును. శరీరము శీతలమునకు వచ్చును. నాడి దుర్బలతగా నుండును. ఎగఊపిరి కలుగును.

## చికిత్స

ఇట్టి అపాయకరమైన సమయములో వైద్యుడు అతిధైర్యముతోను, మెలకువతోను అలస్యము చేయక కర్తవ్యమును చేయుట మంచిది. గర్భతిత్తి పగిలి దూడ గర్భములో నున్నయెడల పట్కారుతోగాని, లేక యేదైన సదుపాయమైన ఆయుధముతోగాని బయటకు తీయవలెను. ఏసమయములో యేపనిముట్టు నుపయోగించవలెనో చూచి జాగ్రత్తగా చేయవలెను.

## కవలదూడలు

కవలదూడలు పుట్టుట చాల అరుదు. మూడు దూడలు పుట్టుట మిక్కిలి అరుదు. ప్రతిదూడయును వేరువేరు సంచులలో నుండును. జననము చాల ఆలస్యముగానగును. ఈ దూడలు అంతబలముగా నుండక సన్నగిలియుండును. రెండుదూడలు వస్తికము (తొంటిభాగము) దగ్గరకు వచ్చునప్పటికి కష్టప్రసవము కలుగును. ఈ ప్రసవములో గర్భతిత్తి రంధ్రము మూయుచుకొని, దూడ వెలుపలికి వచ్చు మార్గమున నిరోధము గలుగును. అప్పుడు ఈనుటకు కష్టముగా నుండును. ఒక దూడ పుట్టినతరువాత నొప్పి నిలిచిపోయి కొంతసేపటికి వేరొకటి కలుగును. కొన్నిసమయములలో ఒక దినము ఆగిన తరువాత మరొకదూడ పుట్టుటయు కలదు. గర్భరంధ్రమునందు రెండు తలలు ఇరుకుకొని ఈనుట కష్టమైనయెడల శస్త్రము చేయవలసివచ్చును. పశువుయోనిలోనుండి మన చేయి దోపగానే పిండము యొక్క చివరభాగమువరకు పోవునట్లు నిర్మింపబడియున్నది. మనము చేయి పెట్టినవెంటనే ముందు బరి యెముకలుగాని, ఎదురుగానుండు ఎముకలుగాని, ఎదురుగా వెనుక ఎముకలుగాని, రెండు ముందుఎముకలు గాని; లేక రెండు కాలుకు, ఆరుగాని కనపడును. లేక పాదములుగాని, ఒకతోక ఒకతలగాని కనపడును. ఆరంభములో చేయి పెట్టగానే కవలదూడలైన సంగతి కనుగొనుటకష్టము. జాగ్రత్తగా చేతితో తాకి పరిశీలించి కనుగొనవలెను.

---

ముఖ బిందిస్తి మదురిమీద కల్లు అయినా పండుతుంది.

ఒకదూడయొక్క కాళ్ళు, రెండవ దూడయొక్క తల కనబడిన యెడల ఈ భాగములు ఒకేపిండమునకు చెందినవని తెలిసికొనుటకు జాగ్రత్తగా పరీక్షించవలెను. కొన్ని సమయములందు రెండు దూడలు వస్తికము దగ్గర కలిసి యుండుటచే వాటిని విడదీయుట మిక్కిలి దుర్లభము. కవలదూడలు రెంటిని ఆరంభములో చేయి పెట్టిన వెంటనే తప్పక విడదీయవలెను. లోపల చేయి పెట్టినప్పుడు ఒక పిండమును నునుపైన దారముతో కట్టియుంచి రెండవ దానిని జాగ్రత్తగా గర్భాశయములోనికి లాగవలెను. అట్లు లాగినపుడు ఒకదూడ బయటికి వచ్చును. ఈ విధముగా రెండవ దానిని కూడ మెల్లదిగా లాగిన సుఖప్రసవము కలుగును.



రెండుతలలుగలదూడ

వికృతాకారము గలవి నెమరువేయు జంతువులలోనే కలుగుచుండును. సామాన్యముగా పంది, పిల్లి మొదలగు జంతువులలోకూడ కలుగుచుండును. రెండుతలలుగల దూడ పుట్టినప్పుడు అది బ్రతుకుట చాలకష్టము. లేక కొన్నిదినములుండి చనిపోవచ్చును. అనేకగ్రామములలో యిట్టిదూడలు పుట్టినపుడు ఆ యా గ్రామస్థులు వినోదముగా చూచుచుందురు. మరికొందరు ఆదూడ అట్లు పుట్టుటవలన ఆ పశువు యజమానికి, పశువులకు నష్టము సంభవించునను యుద్దేశముతో ఆ దూడ చచ్చిన తరువాత గ్రామములో ఉత్సవము చేసి దానిని పాతిపెట్టుదురు.

---

ఈ దూడ సామాన్యముగా 50 దినములవరకు బ్రతికియుండుటయు కలదు. ఈ దూడ పుట్టుక చాలా కష్టప్రసవముగనే యుండును. కాని కొన్ని దూడలు బయటకు రాలేక పశువులు చాలా విపరీతముగా బాధపడుచుండును. ఎందుచేతననగా ఆ రెండు తలలయొక్క అతుకు మెడయొద్దగాని, పుట్టియొద్దగాని నుండుటచేతను, ఒక తల ముందునకు, మరియొక తల వెనుకకు నుండుటచేతను కష్టముగా ఈనును. ఈనునప్పుడు ముఖభాగము ముందర వచ్చుట విధియై యున్నది. అట్టి ప్రసవసమయమునందు యోనిని పరీక్షించినయెడల కారణము తెలిసికొనగలము.

## చికిత్స

ఇటువంటి కష్టప్రసవము కలిగినపుడు దూడనుకోసితీయుటగాని, లేక ఆ యోని భాగము కోసిగాని దూడను తీయవలెను. ఒక్కొక్కప్పుడు ఒక తలనుగాని, రెండు తలలనుగాని నరికివేయవలెను. రెండు శిరస్సులు కపాలమువద్ద కలిసికొని యున్నప్పుడు శస్త్రచికిత్సచేసి ఆ రెంటిని విడదీయవలెను. ఒక తలను ఒక మెడను వీలైనంతవరకు క్రిందకు వచ్చునట్లు నరుకవలెను. కొన్ని కొన్ని సమయములయందు అతిజాగ్రత్తగా నేర్పుతో, సమయానుకూలముగా పిండమును లాగుటవలన సుఖప్రసవము కలుగును.

రెండుగా వికృతాకారముగలవి రెండు పిండములచే కూడియుండును. అవి ముఖ్యముగా ఆవులయందు కలుగును. సామాన్యముగా గొఱ్ఱెలయందును, పందులయందును, గుఱ్ఱములయందును మిక్కిలి అరుదుగ కలుగును. చూడిని గుర్తించుటకు:- పశువు శరీరము పెద్దదిగా నుండుటయు, రొమ్ముకభాగము, తొంటిభాగము ఇవి రెట్టింపు లావుగను, పెద్దవిగను కనబడును. సామాన్యముగా అవి ప్రసవించు కాలమందు మిక్కిలి కష్టము సంభవించును. అరుదుగా సుఖప్రసవము కలిగి దూడలు జీవించుటగూడ కలదని కొందరు శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

## దూడ అడ్డము తిరుగుట

తల ముందుభాగము నుండిగాని, వెనుకభాగము నుండిగాని క్రమముతప్పుట, డొక్కలభాగము తల్లియొక్క వెన్నముకవైపునకు తిరుగుట మొదలగునవి సాధారణముగా జరుగుచుండును. ఈ పరిస్థితులు సంభవించునప్పుడు పశువులకు ముఖ్యముగా గుండెబరువు అను వ్యాధి తటస్థించి మూత్రాశయము గర్భాశయము పగిలిన తరువాత మలాశయమునుండి పిండము వచ్చును. ఇట్లు సంభవించుటకు కారణమేమనగా, ఈ భాగములోనే పిండము సామాన్యముగా అడ్డముతిరుగుటవలన మూత్రాశయమునుంచి వచ్చుటచేగాని వేరొకటి గాదని భావించవలెను.

---

మిన్ను కలిగినా కన్ను కలిగినా కారకమానను.

## కారణములు

పిండము వెన్నుభాగములో నున్నయెడల ముందు బరియెముకలు యోనిలోనికి వచ్చుటయు, పిమ్మట మన చేతికి రొమ్మెముక తగులును. రొమ్మెముక పైభాగము మెడ యొక్క ముందుభాగము శ్వాసనాళముతో అంశాస్థులకు మెడకు నడుమనున్న భాగము



కూడగ ఉత్తరించెను.

వక పోవును, లేక ప్రక్క వైపునకు జారవచ్చును. డెక్కయొక్క ముందుభాగము తల్లియొక్క వెన్నుముక (యోని) వైపునకుండును, లేక వంకరగా తిరిగియుండును.

పిండముయొక్క వెన్నుముకమీద చేతితో సరిచేసి ఉపయోగించినయెడల దూడ సరియైన స్థానమునకు వచ్చును. దూడయొక్క తల యోనిలోనికి రానియెడల మరల చేతితో జాగ్రత్తగా తట్టవలెను. మనము యేవిధమైన ఆటంకములు లేకుండ చేయిపెట్టి ముందు పాదముల భాగము పట్టుకొనిగాని, లేక కట్టిగాని నెమ్మదిగా త్రిప్పుచు యోని వద్దకు తీసుకొని రావలయును. ఇట్టి సమయములో దూడను కోసి తీయుటకు ఎక్కువ అవసర ముండదు. అట్లు కోసి తీయవలసివచ్చినయెడల చివరకు కష్టపడవ సమయమందు మాత్రము ఆపరేషన్ చేయవచ్చును. ఆపరేషన్ చేసినప్పటికి ఈనకపోయినయెడల సాధ్యమైనంత త్వరలో మత్తుమందిచ్చి మూర్ఛపోవునట్లు చేయవలెను.

## గర్భమునందు దూడ చనిపోవుట

దూడ గర్భమున మరణించినచో పశువునకు జ్వరము కలుగును. వణకుచుండును. కడుపులో ఆరాటము కలుగును. పశువు నిడుచు ఊపిరి గట్టిగాపట్టగా నుండును. శరీర వేడిమి తగ్గును. కడుపు పచ్చి వదలును. గర్భనొప్పులు ఆరంభమైనయెడల యోనిలో నుండి రక్తము మిశ్రమమగు దుర్గంధద్రవము కారుచుండును. కను ఘుబ్బును. పశువు డొక్కలుబ్బును. ఈ గుర్తులన్నియు పరీక్షించి లోపలి దూడను తీసివేయవలెను.

## అతివేగముగా ఈనుట

కొన్ని పశువులు అతివేగముగా ఈనును. పొలములకు మేతకు పోలినప్పుడును, చెరువులలో నీటిని త్రాగుటకు పోవునప్పుడును ప్రసవచిహ్నములు కానరాకయే ఒక నొప్పి వచ్చి వెంటనే దూడను పెట్టును.

ఇటువంటి సమయములందు చాలా జాగ్రత్తగా ఆ పశువును కాపాడవలెను. లేనిచో నేదైన అపాయము పశువునకుగాని దూడకుగాని సంభవింపవచ్చును.

## అకాలప్రసవము

దీనినే ఈచుకొనిపోవుట లేక అకాలప్రసవమందురు. పశువులలో అకాలప్రసవము చాల ఎక్కువగా తటస్థించుచున్నది. అకాల ప్రసవముగా పశువు గర్భితిలో దూడ కదలుట ఆరంభించినది లగాయతు 5 లేక 8 నెలల మధ్య ఈనుట. మొదటి కాన్పు ఈచుకొనిపోయినతరువాత తదితర కాన్పులకు ఈచుకొనిపోవునట్టి కొన్ని పశువులలో గలదు. సామాన్యముకన్న ఎక్కువగా మేపిన పశువునకు ఈ అపాయము తప్పక వాటిల్లును.

---

ఉడమురకు పార్వాపిట్టంత మేఘము నడిస్తే పాతాళం ఒద్దుకొట్టుతుంది.

కడుపుమీద దెబ్బతగిలినను, చెడిపోయిన మేత తినినను, గర్భము దాల్చినపిమ్మట మగజంతువులతో సంపర్కము కలిగినను, చుట్టుప్రక్కలజంతువు లేవైన ఈచుకొని పోయిన యెడల ఇది పసిపట్టుట వలనను, పెద్దపులి మున్నగు భయంకరమైన మృగము లను అకస్మాత్తుగా చూచుటవలనను, మరియు బలహీనతవలనను, పేగులలో ఆటంకము కలుగుటవలనను ఈచుకొనిపోవును.

## లక్షణములు

మేత మేయదు. మందగించును. విచారముగానుండును. పాలు స్రవించవు. స్తనములు జారును. జంతువు తరచుగా అరచుచుండును. కటినుండి తీగెలు వేయు చుండును. కడుపు ముడుచుకొనిపోవును. తల్లికడుపులో దూడ అటునిటు తిరుగజాలక ఆగిపోవును. ఒక్కొక్క సమయములో దూడకూడ లోపల చనిపోవుటయు కలదు. ఇంకను దూడ లోపల నుండవలసిన స్థానమున నుండక తప్పిపోవుటయు కూడ కలుగును. ఎరుపురంగుగల ద్రవము మర్మస్థానమునుండి కారుచుండును. పిండము బయట పడునంతవరకు ఆవు బాధపడును. అకాల ప్రసవములో దూడకల చిన్నదగుటచే త్వరగా ఈనుట పూర్తియగును.

సారాయి 10 తులములు, ఆవుపాలు అర సేరు, ఇంగువ 2 తులములు, కుమ్మాకు పసరు పావుసేరు కలిపి త్రాగించవలెను.

ఈచుకొనిపోయినవెంటనే వేడిగంజిలో ఉప్పు కలిపి నడుమునకు, తొడలకు రుద్దవలెను.

## దూడకాళ్లు ముందుకు వచ్చుట

పశువు ఈనునపుడు ముందుగా కాళ్లు, డొక్కలు బయటకువచ్చును. తలతప్పిపోయి ప్రత్యేకముగా ముందుకాళ్లు వచ్చును. అప్పుడు వైద్యుని పిలిపించి సరియైన స్థానములో నుండునట్లు చేయించవలెను.

## దూడపిఱ్ఱలు ముందుకువచ్చుట

కొన్ని సమయములలో దూడపిఱ్ఱలు ముందుగా బయటికి వచ్చును. ఇట్టి సమయ ములలో గూడ వైద్యుని రప్పించి తగిన చికిత్స చేయించవలెను.

ఇటువంటి అవస్థలు అప్పుడప్పుడు అరుదుగా కొన్నిపశువులకు తటస్థించును. పశువు ఆసనముయొక్క మధ్యపల్లమును పట్టి చూచినయెడల ముందుగా తెలియును. ఇటువంటి సమయములలో జాగ్రత్తగా వైద్యుడు లాగవలెను. లేనిచో లోపల దూడ తల బెణకవచ్చును.

---

గట్టుమీద మేఘము మేస్తే కల్లముందరవాన.

## చన్నులలోబాధ

ఈ వ్యాధి క్రొత్తపాలు ఎక్కువగా వచ్చుటవలన చన్నులలో చలనము కలిగి బాధపుట్టును. వెంటనే చికిత్స చేయనియెడల పాలు గడ్డకట్టి చన్నులు గట్టిపడును. జ్వరము 102, 103 డిగ్రీలుండును.

### చికిత్స

పాలను పిండవలెను. తవుడు వేయించి చన్నులకు పొదుగునకు కాపులు తీయవలెను.

సూరేకారము 2 తు, తేవల్ప్చిన్నిరసము 3 తు, వాముురసము అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

## రక్తద్రవము

కొన్ని పశువులకు నిండుమాసములు వచ్చి ఈనునపుడు రక్తముతో కలిసిన మూత్రము మిక్కుటముగా పోయుచుండును. వాతము వలనను, బలహీనత వలనను, అతి వేడి వలనను నిది సంభవించును. పశువు నిస్త్రాణ జెందును. తోక పైకెత్తును. అటునిటు తిరుగుచుండును. దూడ లోపలనే చనిపోవచ్చును.

### చికిత్స

వెంటనే దూడను లాగివేయవలెను. తరువాత సారాయి 12 తు, ఇంగువ 1 తు కలిపి త్రాగించవలెను.

పథ్యము:—వాత సంబంధమగు పదార్థములు పెట్టరాదు.

## మైలపడుట

పశువు ఈనినతరువాత శరీరమునందలి తదితరకారణముల వలనగాని, మర్మస్థానమును శుభ్రముగా నుంచకపోవుటవలనగాని, వాతమువలనగాని ఈ వ్యాధి కలుగును. దీని వలన మూత్రకోశము దురదపుట్టును. మంటగా నుండును. మూత్రము సరిగా పోయజాలదు. పోసినను రక్తమిళితమై యుండును. వ్యాధి ముదిరినకొలది మర్మస్థానము నలుపురంగుగ నుండును. ఈ వ్యాధితోపాటు తదితర జీర్ణసంబంధమగు రోగములు పుట్టిన యెడల పశువు బ్రతుకదు.

## సూతికావాతము

ఈ వ్యాధి పశువు ఈనినవెంటనేగాని, ఈనినతరువాత తవుడు చిట్టు దాణాదినుసులు మున్నగునవి పెట్టుటవలనగాని, చలిగాలిలోనుంచుట వలనగాని ఈ వ్యాధి కలుగును.

## లక్షణములు

పశువు శరీరమంతయు భారముగా నుండును. త్వరలో ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఆయాసము, నోరు తెరచుట ప్రారంభమగును. శరీరము చల్లగానుండును. కాళ్లు పట్టివేయును. నోటివెంట చొంగయుండును. క్రమేపి కడుపుబ్బును. మలబద్ధక మెక్కువగా నుండును. కన్నులుమూయును. ఉష్ణమున్నట్లు కనపడదు. క్రమేపి కడుపుబ్బి మరణించును.

## చికిత్స

1. సారాయి 3 డ్రాములు త్రాగించవలెను.

2. సొంటి 2 తు, మిరియాలు 1 తు, పిప్పళ్ళు 1 తు, వాము గిద్దెడు, ఎండు మిర్చిపొడి 4 తు, కలిపి సేరు కలిపి ఒక మోతాదు నీయవలెను.

వేడిపచ్చుటకు కర్పూరము 1 తు, తాటిబెల్లము 10 తు, కలిపి నాలుకకు రాయుచుండవలెను. లేక లోపలికి ఈయవచ్చును. ఇంకను వేడిపిటికాపులు శరీరమంతయు ఈయవచ్చును. అంతకుతగ్గనిచో ముచ్చిలిగుంటలోను, మూతిమీదను, ఎదరాలలోను వాతలు పెట్టవలెను.

సలహా:—మీ ఫిర్కా ఆయుర్వేద పశువుల డాక్టర్ వేడిపచ్చుటకు ఇంజెక్షన్ యిచ్చుట, లోపలికి మందునిచ్చుట వగైరాలు నడుపుటగాన పిలిపింపుడు.

## పాలజ్వరము

పశువు ఈనిన తరువాత ఒక్కొక్కప్పుడు మిగుల అపాయకరమగు జ్వరము తటస్థించును. ఇది చాల అపాయకరమైనది. ఈనినవెంటనే బలమైన ఆహారమిచ్చుట వలనను, తగినంత విశ్రాంతి లేక పోవుటవలనను, పశువు కష్టములో ఈనుటవలనను, వర్షములోను, చలిగాలిలో నుంచుటచేతను ఈ వ్యాధివచ్చును. ఇంకను పశువు గర్భమునబుండు మలినము సరిగా వెలువడక రక్తములో కలియుటచేత నీ జ్వరముకలుగుచున్నది. పశువు ఈనిన కొలదికాలములోనే అకస్మాత్తుగా ఈ వ్యాధి కలిగి 24 గంటలలోనే చనిపోవు పశువులుకూడ గలవు. సోమరితనముగానుండు పశువులకు ఇటువంటి వ్యాధులు తటస్థించుచుండును. పశువు ఈనినతరువాత యేకారణముల వల్లనైనను దూడ చనిపోయిన రోజుల పాలు పరిగానీయదు. ఆ పశువు పాలనీయదను యుద్దేశ్యముతో ఆ పశువును విడిచిపెట్టుదురు. అప్పుడా పశువునకు పాలగ్రంధులుబ్బి శరీరవేడిమి అధికమై పాలజ్వర మేర్పడును.

## లక్షణములు

ఆకలి లేకపోవుట, పశువు చిరాకుగానుండుట, నాడి తీవ్రముగానుండుట, శ్వాస యెక్కువగుట, పాలుతగ్గుట, కడుపుబ్బుట, పొదుగుభాగము గట్టిగానుండి వేడిగానుండుట, వెనుకకాళ్లలో సత్తువతగ్గి నిలుచుండుట కష్టముగా నుండుట, పశువు తూలుచు పడిపోవుచుండుట, కన్నులు చూచుటకు శక్తితగ్గుట, నోటివెంట చొంగకార్చుట, నాడి తీవ్రముగా కొట్టుకొనుట, పేగులలో బాధగా నుండుట, నాలుక తెలుపుగా నుండుట, ముఖకాంతి తగ్గుట, మలమూత్రములు గట్టిపడుట. ఇటువంటి లక్షణములుగల చికిత్స చేయనిచో త్వరలో మరణించును.

## ఆయుర్వేద చికిత్స

తిప్పతీగరసము అర్ధసేరు, సొంటి 1 తు, మిరియాలు 1 తు, కలిపి అర్ధసేరు కలి నీటిలో కలిపి త్రాగించవలెను.

తమలపాకుల రసము పావుసేరుతీసి తులముఇంగువ, సేరు వేడిగంజిలో కలిపి పెట్టవలెను.

32 డ్రాముల సారాయిలో తులము సూరేకారము కలిపి త్రాగించవలెను.

## ఆంగ్లేయచికిత్స

1. సోడియంక్లోరైడ్ 5 తులములు, సల్ఫర్ 1 తు, గంజిసేరు కలిపి త్రాగించవలెను.

2. క్వైనైన్‌సల్ఫు 10 గ్రెయినులు, సల్ఫూరిక్‌ఆసిడ్ 20 చుక్కలు, నీరు 3 ఔన్సులు కలిపి త్రాగించవలెను.



# వత్సభృత్యము

## ఇరువదియవభాగము

ఉ॥ గంటలకట్టి దూడలకు గంతులు వేయుచు నాడజూచి
యా వెంటనె రూకలీయనొక వెంగలి వెంటన మూర
ణార్థమున్ ఇంటను వీడి పొందనగ నింగితమింతయు లేక
పంపుమీ తుంటరి వేసబాస పనతూలిక లార్వ్యలకుండు చిహ్నలే॥
మూగతల్లి.

శా॥ గోవత్సంబును నోరుగట్టి పెర సాకుల్మాని దుగ్ధంబు స
ర్వావిద్ధంబుగ బిండివైచి యది యాత్మార్థంబు గై
కొన్న లోభావిష్టుండగు మానవుండు దురిత వ్యా
పార పారీణుడై భావాతీత దరిద్రతా నిరతుడై
బాధల్పడున్ వ్యర్థుడై. "మూగతల్లి"

ఏదేశములోనైనను పశుసంతాన మభివృద్ధికావలెననిన దూడలే ఆధారము. అవియే మూలసంతతి. దేహమనోదార్ఢ్యములు గలదూడలతో గూడిన దేశము మిక్కిలి పాడిపంటలతో తులతూగును. అందుచేతనే వంగసభ్య ఔన్నత్యమునకై పెనగులాడుచున్న పాశ్చాత్యదేశములు అమెరికా మొదలగునవి దూడల ఆరోగ్యమున కెంతేని కృషి చేయుచున్నవి. ఆరోగ్యవంతములగు దూడలను రైతులు పోషించి పెంచినచో దేశాభ్యుదయమున కెంతయు తోడ్పడినవారగుదురు. పశుశాలలో దూడలులేని సంసారమెంత నిర్జీవమైన యెడారివంటిది. ఎక్కువ సంఖ్య వత్సములుగలశాల ఒకరమ్యమైన ఉద్యానవనమువంటిది. ఆరోగ్యముగల దూడలు పుట్టుటకుముందు రైతులు వానితల్లులను జాగ్రత్తగా పెంచుచు చూచుచుండవలెను. దూడలకు రోగములు కలుగుటకు కారణములలో ముఖ్యమైనది వానితల్లుల సాంప్రదాయపురోగములే యైయున్నవి. తల్లిరోగము బీజముద్వారా వత్సములందు ప్రవేశించును. ఈకారణమువలననే కొన్నిదూడలు రోగముతోనే పుట్టును. అంటువ్యాధులుగల తల్లులకు పుట్టినదూడలు జన్మించక ముందుగానే మరణించుటగాని; వెంటనేమరణించుటగాని; కొలదికాలములోనే మరణించుటగాని

కనుములమీద మొగిలు మేస్తే కన్నులముందరవాన.

జరుగుచుండును. ఈరీతిగనే క్షయరోగముగల దూడలుగూడ మరణించును. దూడలకు కలుగు దీర్ఘరోగములన్నియు తల్లులరోగములవలననే కలుగుచుండును.

దూడలు పుట్టినది మొదలు ప్రకృతిధర్మములకు విరుద్ధముగ పెంచబడుటవలనకూడ అనేకరోగములు కలుగుచుండును. వీటిలో కృత్రిమాహారములు; కృత్రిమ అలవాటులును ముఖ్యముగా రోగజనితములు. దూడలకు గలుగు తరుణవ్యాధులన్నియు వీటివల్లనే కలుగుచుండును.

## ఆ హా ర ము

దూడ ఆరోగ్యముగను, త్వరగా పెరుగుటకు శుభ్రమైన పాలు సమృద్ధిగా నుండవలెను. ప్రతి దినము ఉదయసాయంకాలములయందు అనువున్న వేళల ప్రకారము కుడుపవలెను. తల్లిపాలకంటె దూడకు శ్రేష్ఠమైన ఆహారములేదు. ఇవియె ఆరోగ్యమునకు బలముకలుగ జేయును. అవి త్వరలో జీర్ణమై దూడను పోషణచేయును. రైతులలో చాలమంది దున్నపోతు పుట్టినయెడల పాలు తక్కువగా కుడువనిచ్చెదరు. దూడ లేక పోయిన పశువు పాలీయదను యుద్దేశ్యమున్నయెడల ఏమంతయైనను పాలను సరిగా విడిచి పెట్టుదురు. కావుననే మంతలు ఆరోగ్యవంతములుగాక నిత్యము రోగపీడితములై ముక్కుచు మూల్గుచు అకాలమృత్యువువాత బడుచున్నవి.

కోడెదూడయైనచో బాగుగా పాలువిడిచిపెట్టుదురు. ఇట్లు చేయుట చాలతప్పు. పశువులపాలలో అనేకరకము లుండును. కొన్ని పశువులపాలు చిక్కగనుండును. మరి కొన్నిటివి పలుచగనుండును. కావున పాలతత్వములను బట్టి దూడలను కుడుపునుండవలెనుగాని ఎక్కువ తక్కువలుగా కుడిపిన పలువిధములైన సంకటములపాలై మృతి నొందును.

ఒకవేళ తల్లివద్ద పాలులేకపోయినను తల్లి చనిపోయినను తల్లి అనారోగ్యవంతురాలైనను తదితర పశువులపాలు పిండి పోయవలెను. అలవాటయినయెడల ఆపశువు పాలను కుడిపించవచ్చును. తదితర పాలను కుడిపించు పశువు ఆరోగ్యముగలదై, భయము లేనిదై, సాంప్రదాయముగలదై యుండవలెను. పాలు ప్రత్యేకముగా పోయువలసినపుడు తగినంత పరిమాణముగా నీయవలెనుగాని ఎక్కువగా నిచ్చిన సులభముగ జీర్ణముకాక అజీర్ణరోగములు కలుగును.

చిక్కనిపాలు వాడవలసి వచ్చినపుడు అవసరము కలిగినచో పాలలో నీరుకలిపి త్రాగించవచ్చును. దూడలకిచ్చు పాలు పశువుశరీర మెంతయుష్ణముగా నుండునో అంత యుష్ణముగా (100 డిగ్రీలు) నుండవలెను. మొదట కడుపు చిన్నది. దూడ పెరుగుచున్నకొలది ఆహారపరిమితి క్రమముగా మారుచుండవలెను. నెలలు జరిగినకొలది ఒక్కొక్క పర్యాయము ఇచ్చు ఆహార పరిమితిగూడ హెచ్చుచుండవలెను. ఆరుమాసములైన కడ నుంచి

---

గొల్లకంపు గాలికొట్టింది అత్తగారు—అంటుకుండలోనీరు పారపొయ్యకోవేలా.

దూడలకు పాలధ్యానముతగ్గి మామూలుగానుండు దాణాదినుసులు మున్నగువాటిని రుచి చూచుట కలవాటగును. మరియు నందినదానినెల్ల లెక్కచేయక తినుచుండుటవలన అజీర్ణ రోగములు ప్రాప్తించును. జీర్ణశక్తి చెడును.

## తత్వములనుబట్టి పాలుపడుట

కొన్ని పశువులకు ఈనినవెంటనే పాలు రావు. అంతమాత్రమున వట్టిపోయినదని రైతు నిరుత్సాహపడరాదు. మొదట చన్నులనుండి పలుచగానుండు ద్రవము వెలువరించును. తరువాత ఒకటి రెండుదినములకు సాధారణపుపాలకంటె గట్టిగానుండు ద్రవము వచ్చును. తరువాత మంచిపాలు వచ్చును. కొన్నిపశువులకు దూడ పుట్టక ముందును మరికొన్నిటికి దూడ పుట్టిన తరువాతను పాలుపడుట అక్కడక్కడ గలదు. కాబట్టి పాలు త్వరితముగా రానందులకు ఆతురత పడనవసరములేదు. దూడకు పేగులలోనుండు మలినపదార్థమును తొలగించుటకు తల్లిపాలనుండివచ్చు నీటివంటి ద్రవమే మిక్కిలి ఉపయోగము. దూడలు పుట్టగనే పాలు త్రాగకపోయినచో అంతగా దిగులుపడ నవసరము లేదు.

## పాలను విడిచిపెట్టుట

పశువు యీనగనే పాలు ఎన్నియున్నవి తెలివి గ్రహించవలెను. పాలెక్కువగా నున్నయెడల తక్కువ వదలిపెట్టుటయు, తక్కువగా నున్నయెడల ఎక్కువగా వదలిపెట్టుటయు, చేయవలెను. మామూలుగా దూడకు పొదుగునకు ఉండు ఒకవైపు రెండుచన్నులలోనిపాలే కుడుపవలెను. పాలు చిక్కగానుండి ఎక్కువగా నిచ్చునప్పుడు తక్కువగా వదలిపెట్టవలెను. ఇవన్నియు కూడ పశువు ఈనిన రెండు మూడు దినములలో ఎక్కువ తక్కువ పరిమాణములు తెలిసికొనవలెను. దూడకు పాలు తక్కువగా కుడిపిన రక్తము పారును. ఎక్కువగా కుడిపిన తెలుపురంగుగా పారును నెలదినములు గడుమవరకు ప్రక్కపాలు దూడలకు కుడుపుచుండవలెను. ముందరివైపు ఒకసారి రెండవవైపు మరియొకసారి వదలిపెట్టుచుండవలెను. ఒకప్రక్కనే వదలిపెట్టుచుండినయెడల పొదుగు ఒరుగుగా దిగుచుండును. పాలు తక్కువగా నున్నయెడల మూడుచన్నులు వదలిపెట్టుచుండవలెను. నెల దినములు రాగానే మేతమేయును గాన ఒక చన్నులోనిపాలు వదలిపెట్టవలెను. దూడనెప్పుడు ఆకలితో నుంచవలెనుగాని కడుపునిండుగా త్రాగించరాదు. ఈరీతిగా మూడుమాసములవరకు చేయవలెను. తరువాత మీ యిష్టప్రకారము వదలిపెట్టవచ్చును. పాలు చిక్కగానున్న దూడలు బ్రతుకవు గాన తగ్గించుచు త్రాగించవలెను. వెన్న తక్కువగానున్న పాలు ఎన్నిత్రాగినను వ్యాధులు రాజాలవు. పశువు ఎండిపోవువరకు దూడకు ఒకచన్ను వదలిపెట్టినట్లయిన పెయ్యదూడయిన రెండుసంవత్సరములు వెళ్లగనే పొర్లి మూడవసంవత్సరములోనే ఈని పాలిచ్చును.

---

ఉద్దగిరి గాలి చొల్లితే గుంటలలో నీళ్లు ఉండవు.

దూడలకు మన్నుతిను స్వభావము గాన చాల జాగ్రత్తగా కాపాడుచుండవలెను. సామాన్యముగా ఈనిన పదిదినములు లగాయతు పచ్చిమేతకొరకు ఎదురుచూచుచుండును. మరికొన్ని తినుచుండును. కొన్ని వాసన చూచుచుండును. పక్షము దినములైన కడనుంచి అరుదుగా ఒకొక్కక్క గడ్డిపరకయే కొఱికి తినుచుండును. పాలు త్రాగుట వలన మేత తినుటవలన సరిగా జీర్ణముగాక నెలజబ్బువచ్చును. కాని బలాత్కారముగా మాత్రము మేత పెట్టరాదు. లేనిచో పాలు మేత కలిసి చాల జబ్బుచేయును. కొందరు పాలెక్కువ తీసికొనవలెనని గరిక, పరిపిలక, గోంగూర మేపుదురు. ఇట్లు మేపుటవలన దూడకడుపు లావుగా పెరుగును.

## ఆహారములో మార్పుచేయుటకు సూచనలు

పాలు త్రాగినవెంటనే కక్కినచో దూడ త్వరగా త్రాగెననిగాని, అధికముగా త్రాగెననిగాని, ఏదైన జబ్బుచేసినదనిగాని గ్రహించవలెను.

ఒకసారి పాలు త్రాగి రెండవసారి త్రాగుటకుగాని, మధ్యగ్రక్కినచో క్రొవ్వు పదార్థము లెక్కువగుటచే అజీర్తి చేసినదని గ్రహించవలెను.

పాలు త్రాగినతరువాత అరగంటకు పెరుగుబిళ్లలవలె గ్రక్కినచో, మాంసకృత్తు లధికమగుటచే అజీర్ణము చేసినదని గ్రహించవలెను.

మలబద్ధకమున్నచో క్రొవ్వుపదార్థము లెక్కువైనదనిగాని, కావలసినదానికంటె అధికముగానున్నదనిగాని గ్రహించవలెను.

కడుపునొప్పి యున్నయెడల మాంసకృత్తులధికముగా నున్నవనిగాని, పాలు వేగముగా పట్టువడినవనిగాని, అధికముగ నివ్వబడినవనిగాని గ్రహించవలెను.

## పుట్టిన వెంటనే పాలు కుడుపరాదు

మంచి పుష్టిగల పశువులకు పుట్టిన దూడలకుత్పత్తియైన తరువాత ఒకదినమువరకు గూడ బలముచే పాల నపేక్షింపకయే యుండును. మనము ముఖ్యముగా చూడవలసినది శ్వాస విడుచుట, ఒడలువిరచి నిద్రించుట—రెండు చక్కగా నుండెనేని పాలు త్రాగకపోయినను దూడను తల్లిప్రక్కనే పరుండబెట్టుటవలన కొంచెము వేడిచే శరీరము ఆరోగ్యస్థితియందుండును. దూడలు పుట్టగనే పాలు కుడుపుట మంచిదికాదు. అదివరకు పదార్థగ్రహణము నెరుగని ప్రేవుల కంత త్వరగా పాలు పడిపినను ఆ పదార్థములు సరిపడక అసంతృప్తి కలిగించును. ఒకవేళ పశువుదగ్గర కొన్నిదినముల పర్యంతము పాలు లేనిచో దూడలకు మంచిపశువు పాలుపిండి ఇదివరకు చెప్పినరీతిగా త్రాగించవలెను. కొన్ని పశువులకు ఈనినవెంటనే పాలు రానప్పుడు గూడ చన్నుకుడుపగనే చక్కిలిగింతపుట్టి పాలు పొంగి పారును.

---

కోడికెక్క ఆవేస్తే గొప్పవర్షం కురుస్తుంది.

## అపరధాన్యపుగడ్డిజాతు లుపయోగించుట

కొన్నిటికి త్వరగా ఎముక ఎదుగకపోయిన యెడలను, పండ్లు రాకపోయిన పక్షమునను, పాలతోపాటు అపరధాన్యపు గడ్డిజాతు లుపయోగింపవచ్చును. కొన్నిటికి ఎముకలు త్వరితముగా బలిసి చూచుటకు అందముగా నుండును. అట్టివానికి మాంసము, నెత్తురు వృద్ధియగుటకు మారుగా క్రొవ్వు, దుర్మాంసము పెరుగును. అట్టిదానికి ఏదైన రోగము వచ్చినచో కుదురుట కష్టమని తలంచవలెను. ప్రక్క ఎముకలయం దెక్కుడైన కొంచెము బలుపు కనిపించెనేని అది నిజమగు బలుపని గ్రహించక జలోదరము వ్యాధి యనుకొని తగు చికిత్స చేయవలెను.

## ఆహార పరిమితిని హెచ్చించుట

దూడ పెరుగుచున్నకొలది ఆహారపరిమితి క్రమముగా మార్చుచుండవలయును. క్రమముగా పాలను తగ్గించుచు మేత పెట్టుచుండవలెను. ఇంకను నిచ్చుపాలు కొంచెము వేడిగా నుండవలెను. నెలలు గడిచినకొలది ఒక్కొక్క పర్యాయ మిచ్చు ఆహారపరిమితి గూడ హెచ్చించుచుండవలెను. శీతోష్ణస్థితి భేదముల వ్యత్యాసములనుబట్టి ఆహారములు మార్చుచుండవలెను. మరియు దూడలు మరుసటదినము పెంపొందుటలో ముక్కాలి భేద పడుచుండును. కాన ఆహారపరిమితి వానివాని శరీరస్థితినిబట్టి నిర్ణయించుకొనవలెను. మట్టి వగైరాలు తినకుండ మూతికి చిక్కములు కట్టుచుండవలెను. లేనిచో వివిధరోగముల పాలగును. పండ్లు వచ్చునంతవరకు పాలు మామూలుగా నిచ్చుచుండవలెను. సుమారు ఒక సంవత్సరము వచ్చినతరువాత దాణా వగైరాలు పెట్టవచ్చును. ఒక సంవత్సరములో దూడలకు పాలధ్యానము తగ్గి మామూలుగా తిండిపదార్థము లన్నిటిని రుచిమాను నలవాటేర్పడును. మరియు నంగినదానినెల్ల లెక్కచేయక తినును దినముల అజీర్ణరోగము ప్రాప్తించుట, జీర్ణశక్తి చెడుట తటస్థించుచుండును.

## దోషరహితమైన పాలు

తెలుపుగను, నిర్మలముగను, మధురముగను, త్రాగుటకు రుచిగనుండి ఉదకమును బోసినపుడు నీటిలో గలసిపోవు స్వభావము గలిగి నురుగులేకుండ నుండు పాలు పరిశుద్ధమైనవనియు, ఆరోగ్యమైనవనియు దూడల కిచ్చుటకు తగినవనియు తెలిసికొనవలయును.

## శరీర పరిశ్రమ

దూడల కాహారమెంత యవసరమో, అంతకంటె పదిరెట్లు పరిశ్రమ ముఖ్యము. దూడ ఆరోగ్యముగను, బలముగాను నుండుటకుకూడ పరిశ్రమ అవసరము. దేహపరిశ్రమ చేయని యెడల కండరములు తగినంతగా పనిచేయజాలవు. పాలు విడిచిన వెంటనే

ఓటి కుండలో వరుడు పలికితే వచ్చేదివాన.

అటునిటు గంతులు వేయనీయరాదు. తరువాత దినమునను మూడునాలుగు గంటలు విశ్రాంతిగా దొడ్డిలో అటునిటు తిరుగనీయవలెను. దేహపరిశ్రమ చేయునప్పుడు గుండె చురుకుగా కొట్టుకొనుచుండును. ఇందువలన శరీరములోని ప్రతిభాగమునకు చాల రక్తమును, రక్తములోనున్న యాహారమును ప్రవహించును. దూడ వయస్సుగూడ మంచి



చురుకుగా నుండును. దూడలను బజారుల వెంటను, రోడ్లమీదను, గోతులలోనికి, పడిపోవు గోడలదగ్గరకు పోనీయక అచ్చట గంతులు వేయనీయక జాగ్రత్తగా కాపాడవలెను. శీతకాలములో పాల యెక్కువ తక్కువలనుబట్టి దూడలకు వ్యాధులెక్కువగా కలుగుచుండును. కాన జాగ్రత్తగా కాపాడుచు తగినన్ని పాలను కుడుపవలెను.

## దూడలనుంచు ప్రదేశములు

మిగుల వేడిగానుండి పొగతోనిండిన వంటయిండ్లకు దగ్గరగాగాని, వసారాలలోగాని, మిగులశీతలముగా నుండుచోట్లనుగాని గాలిలేని ప్రదేశములందు గాని, చీకటి కొట్లలోగాని, మిన్నల్లులు, గోమారులుండు స్థలములందుగాని, అంటువ్యాధులుగల పశువుల దగ్గరగాని, విషజంతువులుండు ప్రదేశములందుగాని, దూడల నుంచరాదు. అట్లుంచినయెడల అవి ఒకదాని చెవి నొకటి తప్పరించుచు, మోకాళ్ళు నాకికొనుచు ప్రథమరూపములైన పొడుగులకు నష్టము కలుగుచుండును. కావున అన్నిటి నొకచోట నుంచక సాధ్యమైనంతవరకు నితరచోట్ల కట్టివేయవలెను. లేక ఒకదానికొకటి అందకుండ కట్టివేయవలెను.

---

పరిపట్టుకడితే గొప్పవరషం కురుస్తుంది.

ఒక్కొక్కప్పుడు దూడలు నోటికందినవానినెల్ల నములుటకు ప్రారంభించును. అట్లులలవాటైనయెడల అవిచిన్నవయస్సునందే ఎండుగడ్డి నములగల శక్తిగలవగును. వాటిని ప్రత్యేకముగా పశుశాలలయందుంచినపుడు అవి పచ్చికమీదనే యాధారపడి యుండుటకంటె దానితల్లియొక్క స్తన్యముమీదనే ఆధారపడినయెడల దూడలు చాల బాగుగానుండును. దూడకు మేతపెట్టినవెంటనే లేతచిగుళ్లను పొట్టులను పెట్టుచుండవలెను. మనుష్యుని చూచి పారిపోవుట, పొడుచుట, తన్నుట మొదలగునవి దురభ్యాసములు. ఇవి చెడుపోషణవలన గలిగిన దురభ్యాసములేగాని వేరుగావు. పచ్చిగడ్డి మీదనే దూడలు ఆధారపడి యుండుటవలన వానికి పాలకొరకై గలుగు ఆకలి మందగించును. అదియునుగాక అవి తినునపుడు ఆపచ్చికమీద చిన్నచిన్న క్రిములు ఈగలు మొదలగునవి చేరును.

## పండ్లు వచ్చుట

దూడపుట్టినప్పుడే చిగుళ్ళలోనుండి కొంచెము కొంచెము పాలపండ్లు కనబడును. క్రమక్రమముగా ఆపాలపండ్లు పోయి స్థిరమైనపండ్లు వచ్చును. స్థిరమైనపండ్లు పాలపండ్లకంటెపరిమాణమునందు పెద్దవిగానుండును. కాన వానిని సులభముగ తెలిసికొనవచ్చును. ఆవుదూడ పుట్టినపుడు లోదవుడయందు రెండుపాలపండ్లుండును. రెండవవారమున నాలుగుపండ్లు వచ్చును. మూడవవారమునకు ఆరువచ్చును. ఒకనెలలో ఎనిమిదివచ్చును. ఈ రీతిగా పండ్లువచ్చునపుడు ఊడిపోయినపుడు కలుగువ్యత్యాసములను పశువైద్యులకు చూపించుచు వచ్చిననేగాని దూడశరీరారోగ్యము శుభ్రముగా నుండదు.

పండ్లూడి మరలక్రొత్తవివచ్చినపుడు కొన్నిటికి చిగుళ్ళువాచి చొంగపడుచుండును. నెలనెలకు పండ్లుపెరుగుట, ఊడుటలనుబట్టి వ్యాధులు కలుగుచుండును. నాలుక ఎండుట, మూతిమీద చెమటలేకుండుట, చిరాకుగానుండుట, కొంచెముజ్వరము తగులుట, విరేచనములు కలుగుట మొదలగు లక్షణములుండును. పైదవుడ లోపలి భాగమునందు పండ్లుండు స్థానమునకు మధ్యగా ఒకతెలుపువంటి పదార్థముగల గట్టిమాంసపుముద్ద యుండును. ఆముద్ద దంతపు ఆకారముగానుండును. ఇది ముదిరిన కొలది శరీరము మీద దద్దురుపుట్టి నుసిమిరిమాదిరిగా నగును. అట్టిసమయములందు ఆపన్నును చేతితో గాని, చిన్నచాకుతోగాని గీచినయెడల ఆవ్యాధి తగ్గును. ఈ పన్నునే తామరపన్ను అందురు.

## గాలి

దూడలను పశువులశాలలోగాని, తమయిండ్లలో కట్టియుంచినప్పుడుగాని, గాలి ధారాళముగా వచ్చుచు పోవుచు నుండునట్లుగా నుండవలెను. దూడలనెట్టిస్థలములందు కట్టివేసినను భయములేదని కొందరు తలంచుచుందురు. చీకటిగదులలో, మురికిగుంటల

---

సముద్రము మిరిమిన వాన తప్పదు.

దగ్గరగా నుండుపాకలలోను దూడలను కట్టరాదు. ధారాళముగా గాలిరానిచో లోపల నుండి ఊపిరి వెకివిడిచిన విషవాయువే కొట్టమునంతటను నిండియుండుటను, విష హేతువగు దానినే మరల లోనికిపీల్చుటచేత శరీరారోగ్యము నిమిషములో చెడిపోవు చున్నది. గాలివచ్చుటకు పశువుల చావడులలోకూడ చిన్నచిన్న కిటికీలు అక్కడక్కడ నుండవలయును నేగాని కాలయంతేయు తలుపులమయుమై దుష్పమగు కీతినిగాలి లోపలికి వచ్చునట్లుండిన దూడలకు శీతలము కలుగును. కిటికీలు ఎత్తుగానుండవలెనుగాని భూమి నంటియుండరాదు.

## వెలుతురు

శరీరారోగ్యమునకు వాయువెట్లు ఆధారమో సూర్యరశ్మియు నంత ముఖ్యమైన దేయని గ్రహించవలెను. సూర్యరశ్మి తగులక చెట్లెట్లు జీవింపనేరవో అటులనే దూడలు జీవింపనేరవు. ఇట్లు చెప్పితినని కన్నులు మిరుమిట్లు గొనునంత వెలుతురును లోనికి రానీయరాదు. దూడలయావజ్జీవము అక్కరకు వచ్చుగుణములు కలుగుట కనువగు పసి తనమును జాగ్రత్తగా కాపాడవలెను.

## పుట్టినవెంటనే మందుల నీయరాదు

కొన్ని దూడలు పుట్టినవెంటనే మలబద్ధకముగా నుండును. అందుచే కొందరు పశువైద్యులు మందులనిచ్చుదురు. ఈ దురభ్యాసము మాన్పవలెను. సాధ్యమైనంతవరకు మందీయకుండు ప్రయత్నము చేయవలెను. ఒక్కసారి మందిచ్చినయెడల తరచుగా నీయ వలసివచ్చుచుండును. ఇట్లు కొన్నిదినములైనప్పటికి కడుపులో మందులపాపు పెట్టవలసి వచ్చును. పుట్టిన తరువాత 24 గంటలలో విరేచనము గానిచో ఎందుచేత గాలేదో పరీక్ష చేయవచ్చును. మనదేశములో కొందరు కోడెదూడలు పుట్టగనే చన్నులు నలిపి వదుపు దురు. అట్లు నలుపుటవలన కొన్ని రక్తనాళములు తెగి పాలుగు చెడిపోవును.

## నరములు ముడుచుకొనుట

శ్వాస పీల్చుట, అరచుట, తుమ్ముట, దగ్గుట, పాలు వదుచుట, మ్రింగుట, త్రవ్వుట, మలమూత్ర విసర్జనము చేయుట మొదలగునవన్నియు నరములవలన చేయ బడు పనులై యున్నవి. దూడనరములు మిక్కిలి సూక్ష్మముగా నుండును. అందువలననే అవి ధ్వనులకు ఉలికిపడును. మూడుమాసములు వచ్చునంతవరకు దూడ మెదడునుండి వచ్చునరములు వృద్ధికాజాలవు. ముసలిపశువులకు పుట్టినవియు, రోగపశువులకు పుట్టి నవియు, చిన్నపశువులకు పుట్టినవియు నరములబలము లేకుండుటచే దృఢముగా నుండ జాలవు.

---

గొల్లవంపుగాలి తోలిన వాన తప్పదు.

## నాడి పరీక్ష

ఆరోగ్యముగా నుండుదూడకు నిమిషమునకు 50 నుంచి 120 వరకు నాడి కొట్టుకొనును. ఈ క్రమముతప్పిచో అనారోగ్యమని గ్రహించవలెను. నాడి తీవ్రముగా నున్నచో జ్వరముండును. నాడిక్షీణించి నెమ్మదిగానున్నచో ప్రాణశక్తి తక్కువయని సూచించును.

## ఉచ్ఛ్వాస నిశ్వాసములు

నిమిషమునకు 32 నుంచి 48 వరకు తీయుచుండును. శ్వాస యేవిధమైన వాసనయు లేక యుండును. దూడలశ్వాస యందు పొత్తికడుపు కదలుచుండును. ఇది తప్పినచో అనారోగ్యము. ఊపిరి వేగముగా తీయుచున్నను, ధ్వని యున్నను, శ్వాసరోగము అను సూచించును. ఊపిరి వాసనకలిగి యున్నచో జ్వరరోగముల సూచించును.

## శరీరకాంతి

దూడరంగు నల్లకప్పువేయుక మామూలుగ వేయుండును. ఆరోగ్యముగల దూడ ముఖమునం దొకవిధమైన కళయుండును. ముఖవర్చస్సు ఆరోగ్యమును సూచించును. వర్చస్సుమారినచో అనారోగ్యమును సూచించును. నల్లకప్పు వేసినయెడల జ్వరమున్నదని గ్రహించవలెను.

## ఇతర అవయవములు

ఇవన్నియు సరిగా వయస్సునుబట్టి అభివృద్ధిచెందుచున్నచో ఆరోగ్యముగా ఉత్సాహముగానుండును. అట్లుగాక అవయవములు సరిగా అభివృద్ధిజెందక పొట్ట పెద్దగుట, కాళ్ళు సన్నగిలుట, శరీరము కృశించుట మున్నగునవి రోగలక్షణములు.

## శరీరోష్ణము

దూడలకు పెద్దపశువులకంటె శరీరోష్ణమెక్కువగా నుండును. అదియునుగాక జీర్ణ, రక్తసంబంధమైన రోగములలో శరీరోష్ణము త్వరలో హెచ్చుచుండును. మామూలు ఉష్ణముకన్న ఒక డిగ్రీహెచ్చినను, ఒక డిగ్రీ తగ్గినను భయములేదు. విశేషముగా హెచ్చినజ్వరము, విశేషముగా తగ్గినవాతము. దీనిలో నేది కలిగినను ప్రమాదమే యని గ్రహించవలెను.

## పొత్తికడుపు

ఆహారపుడొక్క మెత్తగానుండిన ఒక విధమైనబాధ లేకుండిన దూడ కులాసాగానుండును. పొత్తికడుపుబ్బి గట్టిగా నుండుట అనారోగ్యలక్షణము. ఇట్లుండుట వలన అజీర్ణరోగములు పుట్టును.

---

*దక్షిణాం ముబ్బుసాగిన వాన తప్పదు.

## అ ర చు ట

ఆరోగ్యముగానున్న దూడ ఆకలివేయునపుడు మాత్రమే అరచుచుండును. కాని కొన్ని దూడలు ఏమియుతోచక అరచుచుండును. వేళప్రకారము అరచుచుండునపుడు, పాలుకుడిపించినపుడు ఊరుకొనిన ఆకలిచే అరచుచున్నదని తలంపవచ్చును. కాని ఒకప్పుడు మత్తువలనకూడ పడుకొనవచ్చును. కాని మొత్తముమీద [illegible] కని పెట్టుటకష్టము. పాలుకుడిపినను, త్రాగించినను కూడ అరచినచో కడుపునొప్పిగాని, తదితర బాధలుగాని, యున్నవని గ్రహించవలెను.

## మ ల ము

దూడపుట్టినప్పుడు పసుపుపచ్చగాగాని కొంచెము నలుపు రంగుగాగాని యుండును. తరువాత విశేషముగా పలుచగాగాని గట్టిగాగాని యుండక కొంచెము పసుపు రంగుగను ఏవిధమైన దుర్వాసన, శ్రమలేక మామూలుగా క్రిందికి జారిపోయినచో ఆరోగ్యమును సూచించును. మలము గట్టిగా ఉండలుగనుండిన నుండి [illegible] విశేషముగా తినుచున్న మలబద్ధకమున్నదనియు, తెలుపురంగుగా పలుచగ విరోచనమైన అజీర్ణమనియు, జిగురు నెత్తురు కలిసియున్నచో జలుబనియు తెలిసికొనవలెను.

## మూ త్ర ము

ఇది తెలుపు కొంచెము పసుపురంగుగలిగి పరిశుభ్రముగా నున్నచో ఆరోగ్యము. ఏకధారగా పోయుచుండును. దీనిని నిలువయుంచినచో ఏవిధమైన పదార్థము అడుగున చేరదు. మూత్రము పసుపు యెరుపురంగుగా నుండినచో జ్వరచిహ్నములనియు, రక్తముతో కూడికొనియున్నను, మూత్రద్వారము చురుకుగ నున్నను, నిలువయుంచినచో అడుగున మడ్డిగను, తెల్లని పదార్థముగాని, ఉప్పువంటి పదార్థముగాని చేరినచో మూత్రరోగములనియు, యెల్లప్పుడు ఎడతెగకుండ స్రవించుచున్నచో అజీర్ణలక్షణములనియు గ్రహించవలెను.

## దూడలకు సంభవించు రోగములు

దూడలు పుట్టినవెంటనే మలబద్ధకము మొదలగు కొన్ని వ్యాధులు కొన్ని కారణములచే వచ్చుచుండును. దూడలను మట్టిని తిననీయరాదు. ఈగలు గోమారులు మిన్నల్లులు మున్నగునవి దూడలను చంపును. అవి పేడదిబ్బలనుండి కుళ్ళినవాటినుండి అన్నిరకముల కల్మషములను దూడలు తిను ఆహారముమీదకు తీసికొనిపోవును. దూడలు వీటిని తినుట తరువాత పలువిధరోగముల పాలగుచుండును.

పాలుకుడుచు దూడలకు దాణా ఎక్కువగా పెట్టరాదు. అట్లు పెట్టుటవలన అతిసారము, కడుపునొప్పి మొదలగు అజీర్ణ సంబంధములగు వ్యాధులు పుట్టును. దూడకు

---

కల్లు చట్టిలో పాడిగువ్వ పడితే నాలుగురోజులలో వర్షిస్తుంది.

అతిసారము వచ్చినప్పుడు తల్లికి రోగమేమైన యున్నదేమో కనుగొనవలెను. వాతరోగముచే బాధపడు పశువుపాలు త్రాగి దూడ అంబాయని అంతగా అరువజాలదు. శరీరము కృశించును. అపానవాయువులు తరచుగా విడచుచుండును. మలము జిగురుజిగురుగా నుండును. పైత్యరోగముచే చాలా బాధపడుచున్న పశువుపాలు త్రాగిన దూడ మలము వంటలువంటలుగా నుండును, శరీరము అధికవేడిగా నుండును. ముక్కురంధ్రములయందు తేమ అంతగా నుండదు, కఫరోగముచే బాధపడుచున్న పశువుల పాలు త్రాగిన దూడ నోటినుండి చొంగ కారుచుండును. పాలను వెడలగ్రక్కుచుండును.

## వ్యాధులు కనుగొనుట

దూడ విశేషముగా ఆహారవేళలయందుగాక తదితర వేళలయందు అరచుచున్నయెడల మిక్కిలి బాధకలదనియు, కొంచెము తక్కువగా అరచుచున్నయెడల కొంచెము బాధగా నున్నదనియు గ్రహించవలయును. దూడ తన శరీరముపై నెక్కుడెక్కువగా స్పృశించుచుండునో అచ్చట బాధ కలదనియు, ఎక్కడ మనము చేతితో తాకిన బాధ నొందుచుండునో అచ్చట బాధకలదనియు తెలిసికొనవలయును.

మలబద్ధకమున్న దూడకు ప్రేగులు అరచుట, కడుపుబ్బరము, శరీరము ముడుచుకొనుట, విచారముగా నుండుట, పాలు కుడువకుండుట మొదలగు లక్షణములుండును.

వస్తికమునందు బాధ కలిగినప్పుడు మూత్రమున్ను, అసనమునందు బాధకలిగినప్పుడు మలమున్ను నిలచియుండునని గ్రహించవలెను.

ప్రతి అవయవమును, కండ్లను మాటిమాటికి మిగుల శ్రద్ధతో చూచుచుండవలెను. ఇంతటిశ్రద్ధ మనదేశములో యిప్పటి నాగరకతా లక్షణములుగల రైతులు కలిగి యుందురా యని సందేహము. దూడలయందు తగినంత శ్రద్ధబుచ్చుకొననిచో మీపశువు సంతతి క్షీణించునుగాని వృద్ధిలోనికి రాజాలదని గట్టిగా నమ్ముడు.

# దూడల రోగములు

## పెద్దరోగము (Pinderpest)

దీనినే మనరైతులు పారుడురోగము లేక నల్లమునురు, చీడపార్లు, సరకు, అమ్మవారు, విషజ్వరమందురు. పశువులకు సంభవించు వ్యాధులన్నిటిలో నిది ప్రమాదకరమైనది. ఈ వ్యాధి అంటుసంబంధమైనది. పాలుకుడుచుదూడలకు తల్లులనుంచి సోకును. కాబట్టి పెద్దపశువులకు సోకినప్పుడు వెంటనే దూడలను పాలుకుడువనీయక ప్రత్యేక స్థలమందుంచి మంచిపశువుయొక్క పాలు త్రాగించుచుండవలెను. రైతులలో చాల మంది గేదెదూడలకు, దున్నపిల్లలకు ఈవ్యాధితగిలిన లక్ష్యపెట్టరు. పెక్కుదొడ్లలో

బాపలుతప్పినా వేపలు తప్పవు.

గేదెలు మొదలు చికిత్సచేయబడక యీ వ్యాధివలన నిష్కారణముగా చనిపోయిన పశువు లనేకములు గలవు.

## లక్షణములు

ఈ వ్యాధి సోకినపిమ్మట మూడుదినములు మొదలు ఏడుదినములవరకుపట్టును. కొన్నిటికి 10, 15 దినములుపట్టును. పశువుల ఖామందులు, ఈ జాడ్యముసోకిన అంత్య దశలో అనగా పారుట మొదలుపెట్టిన తరువాత జబ్బుతగిలినదని యూహింతురు. మొదటనే తెలిసికొనుట దుర్లభము. మొదటనే తెలిసికొనినయెడల రోగమును సులభ చికిత్సతోడనే బాల్యావస్థలోనే నశింపుచేయవచ్చును. జాడ్యము ముదిరి పారుట మొదలుపెట్టిన తరువాత రోగము కుదురుట కష్టము.

ఈవ్యాధి సోకిన ఆరంభదశలో తీవ్రమైనజ్వరము 106, 107 డిగ్రీలుండును. థర్మామీటరును అపానములో పెట్టిచూచిన స్పష్టముగా కనబడును. అప్పుడప్పుడు అరమేత మేయుచుండును. తల నిటునటు ఆడించును. చెవులనుండి రసికారును. నల్లకప్పువేయును. కన్నులకొలుకులు బిరుసుగానుండి పుసులుకట్టును. మలబద్ధక మెక్కువగానుండును. చెవులు వ్రేలాడవేయును. వ్యాధిముదిరిన కొలది పలుచగా పారుచుండును. పారు డెక్కువైన కొలది దుర్వాసనగానుండును. క్రమేపి శీతలములోనికివచ్చి దూడ మరణించును.

## ఆయుర్వేద చికిత్స

వ్యాధితగిలిన వెంటనే సొంటి 1 తులము, వాము 2 తులములు; పచ్చకర్పూరము పావుతులము కలిపి నూరి అర్థశేరు బియ్యపుగంజిలో కలిపి త్రాగించవలెను.

లేక చింతపండుపులుసు అర్ధసేరు, ఉప్పు 2½ తులములు కలిపి త్రాగించుము.

ఈరీతిగా తగిలినప్పటినుంచి మూడు దినములు పెట్టుట మంచిది.

## పారుచున్న యెడల

పచ్చి తుమ్మచెక్కరసముగాని, పచ్చి నేరేడుచెక్కరసముగాని పావుసేరు తీసికొని దానిలో నిమ్మకాయంత వెన్నకలిపి రెండుమూడు మోతాదులిచ్చిన తగ్గును.

లేక దానిమ్మచిగుళ్ళు పెరుగులో నూరి రెండుమూడు మోతాదులిచ్చిన తగ్గును.

ఇంకను ఆయుర్వేద చికిత్సలు కావలసిన నేను రచించిన పశుచికిత్సాసారమను గ్రంథములో చూడుడు.

లేక కార్బాలిక్ ఆసిడ్ 10 చుక్కలు నీరు అర్ధసేరు కలిపి రెండు మూడు మోతాదు లీయవచ్చును.

నోటిపుండ్లకు పటికలోషన్‌తో పుక్కిలింపు చేయుచుండవలెను.

---

నేరెళ్లునిగిడేది మూవిళ్లు మగేది. మంచికాలానికి లక్షణం.

## ఆహారము - సలహాలు

దూడలకు సులభముగ జీర్ణమగు పదార్థములను వాడవలెను. దీపనకారులను విసర్జింపవలెను. కండ్లను పటికనీటితోను లేదితర ఔషధ లోషన్సుతోను కడుగుచుండవలెను. ఈగలు వాలకుండ ఫినైల్ లోషనును అచ్చటచ్చట జల్లవలెను. మలమూత్రములు ఎప్పటికప్పుడు తీసివేయుచుండవలెను. పారుడుపుట్టిన వెంటనే తగిన చికిత్సచేయుట వలన కొంత ప్రయోజనముండగలదు. వ్యాధి నెమ్మదించినతరువాత తగిన ఆహారమిచ్చుచుండవలెను. వ్యాధి తగ్గువరకు నీటిని కాచియిచ్చుట మంచిది.

## గాళ్లు (Hoot and Mouth Disease)

ఈ వ్యాధి ఎక్కువగా తుక్కుగడ్డి తిని తిరుగుటచేతను, దూడ అనారోగ్యముగా నుండుటవలనను, చలిగాడ్పులలో నుండుటవలనను, సరియైనపోషణ లేకపోవుటవలనను, అంటుసంబంధముగ పశువులను సోకుటవలనను కలుగును. ఈవ్యాధి తగిలిన పశువుల పాలను దూడలకు త్రాగించరాదు. ఈపాలు త్రాగిన దూడ నిమిషములప్రకారము చనిపోవును.

## లక్షణములు

ఆరంభములో దూడ మందముగనుండును. జ్వరము తీవ్రముగా నుండును. కండ్లు ఎరుపురంగుగానుండును. దగ్గు ఉండును. తల ఆడించుచుండును. నోటికిసోకినమేడల చప్పరించుచుండును. పండ్లు కొరుకుచుండును. చిక్కినదూడలు బలము కలవానికన్న ఎక్కువ బాధపడుచుండును. నోటిలోను, కాళ్ళమీదనుండు పుండ్లుచితికి పుండ్లుగా నగును. గిట్టలుపగిలి ద్రవము కారుచుండును. ఘురగుటపడి ప్రాణాపాయముకూడ కలుగుచుండును.

## ఆయుర్వేద చికిత్స

నాలుకకు అప్పుడప్పుడు ముద్దకర్పూరము నేనెతో కలిపి రాయుచుండవలెను.

ధనియాలు 2 తు, మిరియాలు అరతులం, ముద్దకర్పూరము $\frac{1}{8}$ తులం కలిపి బెల్లపు పానకముతోగాని, బియ్యపునీటితోగాని త్రాగించవలెను.

## నోటిపుండ్లకు

మాచికాయపొడి, పటికపొడి సమానభాగములు కలిపి అప్పుడప్పుడు అద్దుచుండవలెను. పటికనీటితో నోరుకడుగుచుండవలెను. ఇంకను తుమ్మచెక్క, రావిచెక్కవేసి కాచిన నీటిని కాళ్ళను నోటిని కడుగుచుండవలెను. కాలిపుండ్లకు అప్పుడప్పుడు నెయ్యి రాచుచు వచ్చిన జల తగ్గి మానును. వేపచెక్కబూడిద పుండ్లకు పట్టించవచ్చును.

---

మామిళ్లుమగ్గినా నేరేళ్లు నెగ్గినా ఫలము పెద్ద.

## ఆహారము - సలహాలు

దూడను విశ్రాంతియైన పరిశుభ్రమైన శాలలో నుంచవలెను. మెత్తని ఆహారపదార్థములు, యితరజావలు పెట్టుచుండవలెను. పెసరపప్పు పేరినెయ్యి కలిపిపెట్టుటమంచిది. కాని తగిలినదూడలను ఎండలో నెంతమాత్రము తిరుగనీయరాదు. అట్లుతిరుగనిచ్చిన మెదడు రోప్పపుట్టును. దూడలు చెడిపోవును.

## పాలదొమ్మ (Milk Anthrax)

దూడలు పాలుఎక్కువతక్కువలుగా కుడుచుటవలనను, పాలుపితుకునప్పుడు ఎక్కువగా విడిచిపెట్టుటవలనను, చిక్కని పాలు కడుపులో జేరుటవలనను, ఈ వ్యాధి కలుగును; నోటినుండి జిగురువంటిపదార్థము వెలువడుచుండును. పాలు కడుపులో పేరుకొనును. కుంకిపాట్లు పడుచుండును. దగ్గుచుండును. మందమతిగానుండును. నల్లకప్పువేయును. శరీరము ముడుచుకొనును. వ్యాధిముదిరినకొలది గురకయుండును. కడుపుబ్బును. కండ్లనుండినీరు గార్చును. ముక్కులగుండ ఒకవిధమైన ద్రవము కారును. క్రమేపి ఊపిరి ఆడక చనిపోవును.

## చికిత్స

అప్పుడప్పుడు దూడలను మలబద్ధకము లేకుండ చూచుచుండవలెను.

పసుపు 1 తులము, కొఱ్ఱపిండి 4 తులములు, వెన్న నిమ్మకాయంత కలిపి పెట్టవలెను.

లేక పెన్నేరుదుంప 2 తు, గల్లేరువేళ్ళు అరగుప్పెడ, కలినీటిలో కలిపి త్రాగించవలెను.

లేక మోదుగపువ్వు 1 తులము, బియ్యపునీరు అరశేరు కలిపి త్రాగించుము.

బరిప్రక్కలను కక్కువేయు రక్షలు వేసిన పాలదొమ్మతగ్గును.

తగిలిన వెంటనే సారాయిపట్టిన మంచిది.

## చలిదొమ్మ (Cold Anthrax)

ఈ వ్యాధి వర్షాకాలములోను శీతకాలములోను తరచుగావచ్చును. ఈ వ్యాధి గల దూడకడుపులో సూక్ష్మజీవులు ప్రవేశించును. తరువాత అవి రక్తములో చేరి వ్యాధిని వృద్ధిజేయును. 105, 106 డిగ్రీలవేడి లోపలనుండును. చలిచే గజ గజ వణకుచుండును. వెంట్రుకలు నిక్కబొడుచును. చొంగయెక్కువ గార్చుచుండును. పారును. నల్లకప్పువేయును. వ్యాధిముదిరినకొలది నాలుక జారవిడచును. క్రమేపి కడుపుబ్బి చనిపోవును.

---

### చికిత్స

సారాయి 2 డ్రాములు తగిలినవెంటనే త్రాగించుము.

కారపుపాలు ఒక అరగొట్టము త్రాగించుము.

ఆవుపంచితము స్త్రీమూత్రము సమానభాగములు కలిపి మూడుగొట్టములు పెట్టిన తగ్గును.

పసుపు 1 తులము, ఉప్పు అర్ధసేరము, కలినీరు అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

తాటిబెల్లము ఉలవపిండి కలిపి పెట్టి తరువాత కలినీరు త్రాగించవచ్చును.

పాలదొమ్మకుచేసే చికిత్సలే ఈదొమ్మకు చేయవచ్చును.

## అజీర్తి (Dyspepsia)

కొన్ని పశువులపాలు చిక్కగనుండుటచేతను, హెచ్చుగ నుండుటచేతను ఆకలి తీసప్పుడు తానంతటది పాలుత్రాగుటచేతను ఈవ్యాధికలుగును. దూడనాలుకమీద తెలుపువర్ణముగల పొరయేర్పడును. ఊపిరి పులుసువాసనగా నుండును. పాలు అప్పుడప్పుడు కక్కుచుండును. కక్కినపదార్థములతో పాలసంబంధమైన విరుగుడునీరుగాక జిగటగనుండు తెమడ యుండును, వాంతితోపాటు అధికముగ మలబద్ధకముండును. దూడ చిక్కిపోవును, ఆరోగ్యము క్షీణించును. ఎముకలు పైకితేలబడుచుండును. శరీరము శీతలముగానుండును. కొన్నిటికి కడుపునొప్పికూడ యుండును. సరియగుచికిత్స చేయనిచో దూడ చనిపోవచ్చును. దీనినే నెలజబ్బు అనికూడ యందురు.

### ఆయుర్వేదచికిత్స

వామురసం పావుసేరు, సొంటిరసము పావుసేరు, ఉప్పు తులము కలిపి త్రాగించవలెను. తమలపాకులు 10, ఇంగువ అరతులము, గురివిందాకు 1 తులము కలిపి నూరి పెట్టిన తగ్గును. పాలలో మిరియాలపొడి కలిపి దానిలో కంకరరాయి ఎఱ్ఱగా కాల్చి పడవేసి చల్లారిన త్రాగించవలెను. వెలులిపాయలు, 1 తు, దుష్టపుచిగుళ్ళు అరగుప్పెడు, పెరుగు పావుసేరు కలిపి పెట్టుము. కంఠముదగ్గర మూడుగీతలుగా గర్తలువేసిన తగ్గును.

## విరేచనములు (Diarrhoea)

కొన్ని సూక్ష్మజీవులు పశువులపాలతిత్తులలోచేరి ఆపాలను దూడ కుడుచునప్పుడు దానికి సోకుటచేతను, పాలలోనుండు వస్తువులు తగ్గుటచేతను ఈవ్యాధిదూడలకు రావచ్చును. సాధారణముగా ఈవ్యాధి చాలసందర్భములలో ఆయుక్తాహార పానీయముల వలన కలుగుచున్నది. ఇంకను దూడలు చెడిపోయిన పదార్థములను తినుటవలనను, చెడు నీరు త్రాగుటవలనను రావచ్చును.

---

కలివిపండ్లు పండితే కరువువచ్చును.

## లక్షణములు

కొన్నిదూడలకు మెల్లమెల్లగ పారుట ప్రారంభించి క్రమముగ అధికముగ కావచ్చును. మరికొన్నిటికి అకస్మికముగా అధికముగనే ప్రారంభించును. విరేచనపురంగు కొంచెము పసుపుపచ్చగనుండి తరువాత నలుపురంగుగలదిగా నుండును. వానితోపాటు కొంచెము జిగురుకూడ నుండవచ్చును. ఇంకను దుర్వాసనతోగూడిన నీళ్ళవిరేచనము లగును. పెరుగుతునకలవలె గుండ్రముగ ఉండ లుండలుగ నలుసులు విరేచనములతో కలిసియుండును. ఇవి జీర్ణముకానిపాలు అని తెలిసికొనవలెను. విరేచనము ఎక్కు-వైనకొలది దూడ నీరసించి చనిపోవును.

## ఆయుర్వేద చికిత్స

నూనెలో ఏకుముంచి దూడ కందించవలెను.

పమిడిప్రత్తియాకు మెత్తగా నూరి కలితో కలిపి పెట్టవలెను.

దానిమ్మయిగుళ్ళు గుప్పెడుతీసుకొని పెరుగుతో నూరిపెట్టవలెను.

ఈ చికిత్సలు విరేచనములు కట్టువరకు రెండుమూడుసార్లు ఈయవచ్చును.

## వైరూప్యౌషధ చికిత్స

క్యాస్టర్ ఆయిల్ 2 ఔన్సులు యిచ్చిన ప్రేగులను శుభ్రము చేయును.

ఓపియం $\frac{1}{3}$ తులమును అర్ధసేరుగంజిలో కలిపి పెట్టుము.

## ఆహారము - సలహాలు

దూడను పాలుకుడుపరాదు. వేడినీటితో ఆరంభములో ఎనిమాచేయుట మంచిది. విరేచనములు పలుచగనుండి మిక్కిలి దుర్వాసనగా నున్నయెడల వగరుపదార్ధములిచ్చుట మంచిది. దూడకు వెచ్చదనము నీయవలెను. పొడిఆహారము పెట్టవలెను.

## మలబద్ధకము (Constipation)

దూడకు మలబద్ధకము తరచుగా సంభవించుచుండుట వాడుక. శీతకాలములో ఈ మలబద్ధకమువలన అనేకదూడలు చనిపోవుచుండును. చిక్కనిపాలు త్రాగు దూడలకు ఈ వ్యాధి తరచుగా వచ్చుచుండును. ఈ వ్యాధినిగూర్చి రైతులు బాగుగా తెలిసికొనవలెను ఈ వ్యాధిగల దూడలకు తగుచికిత్స చేయని యెడల దాని యావజ్జీవమును బాధించును. ఇది పాలు ఎక్కువగుటవలనగాని, తగినంత క్రొవ్వుపదార్థము లేకపోవుట వలనగాని, ప్రేగులలో సరియైన గమనము లేకపోవుటవలనగాని, చలిగాలి ఎక్కువ సోకుటవలనగాని రావచ్చును.

---

కలివిలు పండితే కాలము తీరుతుంది.

## లక్షణములు

మలబద్ధకముగల దూడలకు కడుపునొప్పి కూడ సంభవించును. దూడ చిక్కిపోవు చుండును. పెద్దప్రేగు దినదినము తిత్తివలె పెద్దదై అందు మలము నిలువయుండి నానాటికి ప్రేగు బలహీనము చెందుచుండును. ఆయాసపడుచుండును. వ్యాధి ముదిరినకొలది ప్రేగుచివర భాగము వెలికిరావచ్చును. మలము గట్టిగా రాయివలె ఉండలుండలుగా ఆసనమువద్దనుండి బయటకు రాకపోవుటచే పిడుకుచుండును. సరియైనచికిత్స చేయని యెడల మలము శరీరములో జీర్ణించి దుర్గంధములు పుట్టి చనిపోవును.

## ఆయుర్వేద చికిత్స

4 అరటిపండ్లను తోలు తీసి ఆముదములోముంచి నోటిలో వేయుము.

సున్నపుతేటగాని కొబ్బరిపాలుగాని ఆరగొట్టము పెట్టుము.

గోలిమిడాపలును నూరి రేగు నిమ్మకాయలంత తీసికొని ఆముదముతో కలిపి పెట్టుము.

2 తులముల ఉప్పును అర్ధసేరు గోరువెచ్చని నీటిలో కలిపి త్రాగించుము.

## వైద్యాప్యచికిత్స

ఎప్సన్‌సాల్టు 2 ఔన్సులు తీసికొని అర్ధసేరు గోరువెచ్చని నీటిలో కలిపి త్రాగించవలెను.

కాష్టర్ఆయిల్ 1 ఔన్సు పిప్పర్ మెంటునీరు అరఔన్సు కలిపి త్రాగించుము.

టింక్చర్ నక్సువామికా 30 చుక్కలు తీసికొని అర్ధసేరు నీటిలో కలిపి త్రాగించుము.

## ఆహారము - సలహాలు

రైతులలో చాలమంది అతివేడిచేసి మలబద్ధకముగానున్న దూడకు బలుసాకు, ఆముదము, సొంటి, మున్నగు వస్తువులు పెట్టుదురు. ఇట్లు పెట్టుటవలన ఇంకను వేడిచేసి మలము గట్టిపడి బయటకు రాకపోవుటచేత కూడ బాధపడుచుండును. కాబట్టి వ్యాధి నిదానముగా కనుగొని చేయవలెను. దూడయొక్క తత్వమును గ్రహించి ఎనీమా చేయవలెను. వేడిబాగుగా నున్నపుడు ఎనీమా చేయవలెను. శీతలముగా నున్నపుడు చేయరాదు.

## కడుపునొప్పి (Gastralgia)

దూడకడుపులో పాలు పులిసిపోవుటవలన కొన్నిరకముల పదార్థములుపుట్టి ప్రేగులలో రేచ్చపెట్టుటవలనగాని, ప్రేగులలో పాలబిళ్ళలుండుటవలనగాని, పాలు

---

బలుసులు పండితే గొలుసులువలె పండును.

సరిగా జీర్ణము కాకపోవుటచేత ప్రేగులలో గాలిచేరుటవల్లగాని యింకను తదితర వ్యాధులవల్లగాని యీవ్యాధి రావచ్చును. ప్రేగులలో క్రిములుండుటవలనకూడ ఈవ్యాధి రావచ్చును.

## లక్షణములు

కడుపు గట్టిగానుండును. తనతలను పొట్ట వానించుకొని నాలుగుకాళ్లను తన దగ్గర చేర్చుకొని ముడుచుకొని పండుకొనును. దూడకు బాధఎక్కువైనకొలది కాళ్లతో నటునిటు తన్నుకొనుచుండును. దూడమూత్రద్వారసమీపమున నుండు చర్మము ముడుచుకొనిపోవును. మలబద్ధకము కొన్నిటికియుండును. అపానవాయువులు విడచుచుండును.

## ఆయుర్వేదచికిత్స

వాముురసము అర్ధసేరు, తెలకర్ర ½ తులము, అర్ధసేరు కొరవుపాలలో కలిపి త్రాగించుము.

అరతులము ఇంగువను అర్ధసేరు గచ్చాకురసములో కలిపి త్రాగించుము.

ఆరుదొండాకు పసరు 6 తులములు ఆముదము 4 తులములు కలిపి త్రాగించుము.

ఇంగువ 2 తులములు, వాముురసము అర్ధసేరు కలినీరు అర్ధసేరు, కలిపిపెట్టుము.

## ఆహారపు సలహాలు

జీర్ణముకాని పదార్థములు పెట్టరాదు. వేడినీటిని దాహముగా యిచ్చుటమంచిది. చలిగాలి సోకనీయరాదు. మలబద్ధకముగానున్నచో సబ్బునీటితో ఎనిమాచేయుట మంచిది. డొక్కభాగములకు వేడికాపులు తీయుటమంచిది.

## కడుపుబ్బు (Tympanitis)

పాలు జీర్ణముకాక పొట్టలో నిలువయుండుటవలనను, తటాలున కుడితితొట్టిని చేరి నీరుత్రాగుటవలనను, ఏపదార్థమైనను గొంతుకలో అడ్డము పడుటవలనను, పొట్టలోపల గాలి ప్రవేశించుటవలనను, దాణాదినుసులు గాని, ధాన్యము మున్నగునవి తినుటవలన గాని ఈవ్యాధి రావచ్చును.

## లక్షణములు

కడుపు విస్తారముగా పొంగును. వ్యాధి ముదిరినయెడల బాధపడుచుండును. దీర్ఘమైన శ్వాసవిడచును. పొట్టయుబ్బి రాతికంటె కఠినముగా నుండును. మూల్గుచుండును. గాలి చేరినయెడల ఒత్తిన పైకి ఉబుకుచుండును. అటునిటు దొర్లుచుండును. వ్యాధి ముదిరిన కొలది దూడకు ప్రాణాపాయము కలుగవచ్చును.

---

గొండిపండ్లు పండిలేకూడ పయిరు పండును.

కలుగును. పాలు చెడిపోయినప్పుడు, వాని అంతరగుణములనుబట్టి నోరు శుభ్రముగా నుండనప్పుడు ఈవ్యాధి కలుగును. పెదవులలోను, చిగుళ్లమీదను, అంగిటిలోను, దవుడలలోను చిన్న చిన్న పొక్కులుండును. ఆ పొక్కులచుట్టు ఎరుపుగా వాచి పాలు మ్రింగుటకైనను కష్టముగా నుండును. నోటినుండి నురుగుకూడ వచ్చుచుండును. దూడ పాలు కష్టముగా త్రాగుచుండును.

## ఆయుర్వేదచికిత్స

తుమ్మచెక్క, రావిచెక్క నీటితో దినమునకు రెండుమూడు పర్యాయములు నోటిని కడుగుచు మాచికాయపొడినిగాని, కవిరిపొడినిగాని తేనెతో కలిపి నాలుకకు తాకించుచుండవలెను.

## వైరూప్య చికిత్స

పొటాషియంపర్మాంగనేట్ లోషనుతోగాని, అలం లోషన్‌తోగాని నోటిని డూష్‌చేయుచు పొటాష్‌క్లోరస్ అను తెల్ల పొడిని తేనెతోగాని, గ్లిసరిన్‌తోగాని కలిపి అప్పుడప్పుడు నోటికి రాయుచుండవలెను.

## ఆహారము - సలహా

తల్లికిచ్చు ఆహారము పథ్యముగా నుండవలెను. పరిశుభ్రమైనశాలలలో నుంచవలెను. వ్యాధి తగ్గినతరువాత క్రమేపి నోటిని పరిశుభ్రముచేయుచు మలబద్ధకము లేకుండ, కాపాడవలెను.

## రక్తవిరేచనములు (Dysentery)

ఇది ప్రేగులలోని మాలిన్యమువలన కలుగును. అతిసారమునుండి ఈవ్యాధి కలుగును. అతివేడివలనను చలిగాలి సోకుటవలనను, చెడు ఆహారములు ఇచ్చుటవలనను అపరిశుభ్రముగా నుండు నీటిని త్రాగుటవలనను, గాలిలో ఆకస్మికముగా మార్పు కలుగుటవలనను ఈవ్యాధి కలుగును.

## లక్షణములు

దూడ మందమతిగను, అసౌఖ్యముగను కొంతకాలముండి ఈవ్యాధి అకస్మాత్తుగావచ్చును. మలము ఉండ ఉండలుగానుండి బంకతోడను బాధతోడను కలుగును. నడుము వంగిపోవును. తోకను లేపుచుండును. తరచుగా పేడవేయుటకు ప్రయత్నము చేయుచుండును. మూలుగుచు పండ్లు కొరుకుకొనుచుండును. విరేచనములు నెత్తురు వాసన కలిగియుండును. క్రమేపి నీరసించి చనిపోవును.

---

## ఆయుర్వేద చికిత్స

పెన్నేరుదుంపను కేరి నెయ్యితో కలిపి రెండుమూడు పర్యాయములు పెట్టవలెను.

10 తులముల ఆముదములో ¼ తులము నల్లమందు కలిపి పెట్టవలెను.

వాము 1 తులం, జీలకర్ర ¼ తులం, సొంటి 1 తులం కలిపి బెల్లముతో కలిపి గోలీలుకట్టి సేవించవలెను.

## వైరూప్య చికిత్స

క్రిసాల్ ను ఒక చుక్కను తీసికొని అర్ధసేరు నీటిలో కలిపి త్రాగించవలెను.

• గం ఆకేసియాలో ఒక్కొక్క చుక్క క్యాస్టరాయిల్ పోయుచు సన్నికల్లులో వేసి నూరి క్రమేపి నీరు క్యాస్టరాయిల్ కలిపిన చిక్కని పాలగును. ఇది త్రాగించవలెను.

క్లోరోడైన్ గాని క్యాంఫర్ డైన్ గాని 15 చుక్కలు అర్ధసేరు నీటిలో కలిపి యిచ్చిన తగ్గును.

## ఆహారము - సలహాలు

ఆహారము ద్రవరూపముగను, బలమొసగునదిగను, సులభముగ జీర్ణమగునదిగను యుండవలెను. ఘనపదార్థములు ఈరోగము సాంతముగ తగ్గిన వారమూదినముల పర్యంతమును దూడకు తినుటకీయరాదు. చన్నీటిని ఈయరాదు. కాచిన నీటినే త్రాగించవలెను.

## క్రిములు (Worms)

దూడప్రేగులలోను, మలకోశములోను అనేక రకములైన క్రిములు చేరియుండును. (Round worm) అనగా గుండ్రని పురుగు అనునది తెలుపుగా పొడుగుగా నుండును. ఇవి 6 లేక 12 అంగుళముల పొడవుగలిగి చిన్నప్రేగులలో నుండును.

(Thread worm) త్రెడ్ వరం అనునది 5, 6 అంగుళముల పొడవుగలిగి పెద్దప్రేగులలోను, ఆసనములోను యుండును. ఇది చిన్నదిగానుండి సన్నని సూదివలె నుండును. (Tape worm) టేపువరం ఇది పెద్దప్రేగులలోను, చిన్నప్రేగులలోను యుండును. ఈ క్రిములు అపరిశుభ్రతవలననే ఎక్కువగా శరీరములో ప్రవేశించును. అంటువ్యాధుల ప్రకరణములో చూచిన ఈక్రిముల ఫోటో కనపడును.

## లక్షణములు

దూడకృశించును. ఆకలి హెచ్చుతగ్గులు కలిగియుండును. తోకను దేనికైన వేసి రుద్దుకొనుటకు ప్రయత్నించుచుండును. మట్టితినుటకు ప్రయత్నించును. మలము

---

చింత పండితే జీడిపండును.

జిగటగానుండును. కడుపునొప్పికూడ నుండును.

## ఆయుర్వేద చికిత్స

గాడిదగడపాకుపసరు పావుసేరు త్రాగించుము. అరచేరెడుఉప్పు, అర్ధసేరు చింతపండు పులుసులో కలిపిత్రాగించుము. పచ్చికొలవేమురసము పావుసేరు, కలిసేరు అర్ధసేరు కలిపిత్రాగించుము. యింగువను పెట్టుము.

## వైరూప్య చికిత్స

టర్పంటైన్ 2½ తు, క్యాస్టరాయిల్ 6 తు, కలిపి రెండుపర్యాయములీయుము. సోప్‌వాటరులో ఎనిమాచేయుము.

రుబార్బుపొడరును సోడాబైకార్బనేట్‌ను సమానభాగములు కలిపి బెల్లపు నీటిలో త్రాగించుము.

ఎప్సన్‌సాల్టు 10 తులములు తీసికొని అర్ధసేరువేడినీటిలో కలిపి త్రాగించుము. రాతిసాల్టును 3 తులములు అర్ధసేరు నీటిలో కలిపి త్రాగించుము.

## ఆహారము - సలహాలు

ఆహారము త్వరగా జీర్ణమగునదిగా నుండవలెను. ఉప్పుకలిపిన నీటిని పెట్టుట మంచిది. దూడను అటునిటు తిరుగనిచ్చు చుండవలెను.

## రక్త చెర్మి

దూడలకు ఈవ్యాధి తరచుగా వచ్చుచుండును. శరీరముమీదను, మూతిమీదను తదితరభాగములయందును చిన్నచిన్న కురుపులు లేచి బాధను కలుగజేయును. ఈ కురుపులు నలుపురంగుగా నుండును. వీటిని చిదిపిన రసికారి ఎరుపురంగుగా నుండును. ఇంకను వీటిని తాకిచూచినయెడల వేడిగను నొప్పిగను యుండును. అశుభ్రమైన గాలిని పీల్చుటవలన ఈ వ్యాధి కలుగును. ఇది 15 దినములవరకు నుండును. సరియైన చికిత్స చేయనిచో కురుపులన్నియు కలసి పెద్దవాపుగా నగును.

## ఆయుర్వేద చికిత్స

సబ్బునీటితోగాని, కుంకుడుకాయనురుగుతోగాని శరీరభాగములు కడిగి మైలతుత్తం పావుతులం, వెన్న 6 తు, గంధకము తులము, ముద్దకర్పూరము అరతులం కలిపి మెత్తగానూరి రెండుమూడు పర్యాయములు రాసిన తగ్గిపోవును. లేక బ్రహ్మదండి ఆకుపసరులో ముద్దకర్పూరము కలిపి రాసిన తగ్గును.

---

దారిద్రానికి పాసవులు పంట.

## వైరూప్య చికిత్స

కార్బాలిక్ ఆసిడ్ 20 చుక్కలు, సల్ఫర్ అరతులం, బోరిక్ ఆసిడ్ 1 తులము. జింకు ఆక్సైడ్ ½ తు, వ్యాసులైను 6 తులములు కలిపి అప్పుడప్పుడు రాసిన తగ్గును. లేక క్రిసాల్ 10 చుక్కలు, కాపర్‌స్ఫలేటు ¼ తులం, జింకాక్సైడ్ 1 తు, వెన్నగాని వ్యాసులైనుగాని 6 తులములు కలిపి అప్పుడప్పుడు రాసిన తగ్గును.

## మిన్నల్లుల వలన కలుగు పుండ్లు

దూడలకు మిన్నల్లులు పట్టి చాలబాధించును. వీటివలన అనేకదూడలు చని పోవుచుండును. వెంట్రుకలు రాలిపోవును. శరీరముమీద అంగుళము రెండంగుళముల లోతు పుండ్లు పడుచుండును. మిన్నల్లులు చర్మమునందు రంధ్రముచేసి గ్రుడ్లు పెట్టుచుండును. ఆగ్రుడ్లు పిల్లలై చర్మముపై దురదను పుట్టించుచుండును. ఇవి రోగములుగల పశువురక్తమును పీల్చి యితర పశువుల దేహములలో దీనిని విడుచుటవలన అంటు వ్యాధులు కలుగుచుండును.

## చికిత్సలు

వేపాకుపసరులో మంచినూనె కలిపి రెండుసార్లు పూతపెట్టుము. ఫినైల్ 1 భాగము, నీరు 2 భాగములు కలిపి శరీరమునకు పట్టించిన మిన్నల్లులు చనిపోవును. వేపనూనె 1 భాగము, కిరోసనాయిల్ 2 భాగములు కలిపిపట్టించిన తగ్గును. లేక ఎండు చేపలకడిగిన నీటిని పట్టించిన పోవును.



---

వేప చాలాకాస్తే ఉమూచిక ఎక్కువగా వుండును.

# పాడి పరిశ్రమ

## ఇరువది ఒకటవ భాగము

సీ॥ నంసారిజనునకు సౌఖ్యదములు రెండు
పాడియు బంట నా బరగుచుండు
గోవు వానికినెల్ల దావలమూటచే
బాయక యది సేవనీయమయ్యె
పాడిపంటలు లేనివానిదే భవనంబు
వనకల్పమై కనంబడునుగాదె
పంట లేకుండిన బడయు నెట్లశనంబు
పాడిగల్గక తృప్తిపరగు నెట్లు

గీ॥ ఇట్టివౌ కారణంబులబట్టి గోవు
భాజనంబులకెల్లను బూజనీయ
మయ్యె సద సద్వివేక విఖ్యాతమతులు
ధేనుగణమును బోషింప బూనరెట్లు.

"గో ప్రభావము"

సీ॥ గోభూములనుదున్న గోష్పాదమంతయు
బీడులునైనట్టి యా గోడుకతన
నావులపాలన్ని సంగళ్లపాల్సేసి
చిల్లరసొత్తు లాసించుకతన
వృద్ధోక్షములు చాల వివిధవిధంబుల
సూదనాపణముల జొచ్చుకతన
సోమరితనమున జూచి చూడక యాల
మందలు పాడయినందువలన

తే॥ గీ॥ బంట లారోగ్యములుతగ్గ బ్రబలె ఋణము
వైద్యశాలలు పాపము వాసికెక్క
గాన బ్రత్యక్షలక్ష్ముల గాంచినట్లు
గోవులను దేవతలనెప్డు గొలువరయ్య.

"మూఁగతల్లి"



## భారతదేశవు పాడిపరిశ్రమ

వ్యవసాయమే భారతదేశముయొక్క ముఖ్యపరిశ్రమ యనియు, తదభివృద్ధికై కోట్లకొలది భారతీయుల జీవన మాధారపడి యున్నదనియు వేరుగ చెప్పనవసరము లేదు. కాని మన దేశమునందు వ్యవసాయము చాల వెనుకబడియున్నది. విరామకాలములయందు కృషీవలకుగాని, నిరుద్యోగులకుగాని పనికల్పించుటకై గ్రామపరిశ్రమల నెలకొల్పుట అత్యంతావశ్యకమను విషయమును గ్రామపునరుద్ధరణయందు శ్రద్ధ తీసికొనుచున్న ఆర్థికవేత్తలందరు గుర్తించియేయున్నారు. గాంధిమహాత్ముని చరఖాసందేశము గూడ నీయావశ్యకతను గుర్తించుటయే ముఖ్యకారణము. కాని పెరుగు, పాలు, వెన్న నేయి మొదలగునవి ఎక్కువ విలువయైనట్టివిగను, ఆహారపదార్థములయం దత్యావశ్యక

---

కాకి గూడుపెట్టితే కడాపటి వర్షము

మైనవిగను పరిగణింపబడు భారతదేశములో పాడిపరిశ్రమను గ్రామపరిశ్రమగా నేర్పాటుజేసి యభివృద్ధికి దెచ్చు విషయమై యేమాత్రము శ్రద్ధ జూపకుండుట మిగుల చిత్రము.

## పాడిపరిశ్రమవలన లాభములు

సరియైన పద్ధతులపై నేర్పాటు చేయబడిన గ్రామ పాడిపరిశ్రమ యత్యంత లాభదాయకమై అనేక విధముల గ్రామప్రజాభివృద్ధికి తోడ్పడగలదు. గోరక్షకుడగు వ్యవసాయకునకు, అతని కుటుంబమునకు సంవత్సరము పొడుగున నది చాలినంత పనిని కల్పించును. పాడిపరిశ్రమాలయ వ్యవసాయకులకును, ఇతర పనివారలకును అనేకులకు జీవనాధారము జూపించును. పాడిపరిశ్రమ మిగుల నభివృద్ధిజెందిన దేశములన్నిటిలోగూడ గోసంరక్షణము వ్యవసాయకృషియందొక భాగముగనే పరిగణింపబడుచున్నది. వ్యవసాయకుడగు గోరక్షకుడు తన గోవులనుండి సేకరింపగలుగుచున్న పాలను విక్రయించుటకును, ఇతర పదార్థములను తయారుచేసి లాభమును గూర్చుటకును అతని గ్రామమందున్న పాడిపరిశ్రమాలయము మెంతయు తోడ్పడుచున్నది.

## గ్రామములలోనే యేర్పాటు చేయవలెను

పాలకు మంచిధరవచ్చి లాభము పొందవలయుననినచో పాల యుపయోగము పూర్తిగా వినియోగములోనికి గొనితేవలయును. ఒకమాదిరి మంచిరకముగా నుండునట్లు గూడ చూడవలయును. అందుచేత నీ పనులనన్నిటిని నిర్వహించుకొనుట పాలను స్వీకరింపగలుగుచున్న వ్యవసాయకునకీగాని సాధ్యము కాజాలదు. కావున పాడిపరిశ్రమాలయములకు తోడ్పాటు గోసంరక్షణము (cow protection) గూడ రైతుల కత్యంతావసరమగుచున్నది. కాని యీ పరిశ్రమాలయములు పాలు లభించు ప్రదేశములకు చాల దూరములో నున్నను లాభములేదు. అందుచే వీరు తమతమ గ్రామములలోనే యిట్టి యేర్పాట్లగునట్లు చూచి వానిసహాయమును పొందవలయును.

వ్యవసాయమునందు మిగుల నభివృద్ధికళలోనున్న డెన్మార్కు, న్యూజిలాండు, హాలండు, ఐర్లండు, అమెరికా మున్నగు దేశములయందే గ్రామమునకేగినను ఆ గ్రామ పాడి పరిశ్రమాలయములు కన్నులపండువుగా గానవచ్చుచుండును. ఆదేశముల యందలి వానిని నాదర్శముగా పెట్టుకొని కో-ఆపరేటివ్ పద్ధతిపైననే మనము ఏర్పాటుచేసికొనవచ్చును. అవి పాల పరిశ్రమాలయములుగల పాలను కాచితయారుచేసి ఎప్పటికప్పుడు విక్రయార్థము నగరములకెగుమతిచేయవచ్చును. ఇదియునుగాక ప్రత్యేకముగా మీగడ పరిశ్రమాలయములు, నేతపరిశ్రమాలయములు, గడ్డపాలను జేయు యంత్రాలయములు, ఇతరవిధములైన పరిశ్రమాలయములు మున్నగునవి పాలయమ్మకమును సాగించుచునే యిట్టివానిని గూడ తయారుచేయు పరిశ్రమాలయములుగాని అనేకములు నెలకొల్ప

చేసిపంట కొయ్యగానే చెప్పుతుంది.

బకుట కవకాశములు గలవు. ప్రస్తుతము అమ్మబడు నెయ్యి పాలు మీగడ మొదలగు పాలపదార్థములను తయారుచేయు పద్ధతులను, పాలను ప్రొయ్యి నుంచి కాచు పద్ధతియు పూర్వకాలపునాటి మోటుపద్ధతులై యున్నవి. భారతదేశములో నిట్టిగ్రామ పాడిపరిశ్రమాలయములను నెలకొల్పుటకును, వాని నభివృద్ధికి తెచ్చుటకును సమాజముగ నెక్కువవకాశములున్నవి. ఒక గ్రామములో నిట్టి పరిశ్రమాలయము నెలకొల్పబడినచో నెందరికో జీవనాధార మేర్పడగలదు.

## గొడ్డుపోవునట్లు చేయుట

పాడిపశువులపట్ల పట్టణములలోని పాలవాండ్రు చేయుచున్న ఘోరకృత్యములలో ఫూకా యనునదొకటి. ఇది ప్రాచీనభారతవర్షము గడించిన ఆధ్యాత్మిక యశస్సునకు గూడ భంగము కలుగచేయుచున్నది. పాలవాండ్రు దురాశాపరులై లేగదూడలను తగినన్ని పాలువదలక చంపుటయే గాక పాడిపశువులవలన వీలగునంత ఎక్కువగ పాలు లాగుటకు "ఫూకా" యను పనిచేసి పాడిపశువులను గొడ్డుపోవునట్లు చేయుచున్నారు. ఇటీవల లిన్‌లిత్‌గో (Linlithgo) ప్రభువుగూడ ఇట్టి పద్ధతి మిగుల అవినీతికరమైనదని నిందించుచున్నాడు. ఫూకా యనగా చాలమందికి తెలియకపోవచ్చును. అదిపలురకములు. ఆవుయొక్క గుహ్యాంగములోనికి గాలి నెక్కించుదురు. లేదా వెదురుగొట్టములో ఉప్పునీటిని ఎక్కించుదురు. గర్భస్థానములోనికి దానితోకను మడిచి దోపెదరు. లేదా దానికి సరిపోవునంతటి లావును, మూరెడు పొడుగును గల గడ్డివేటిని తయారుచేసి బలవంతముగ ఎక్కించుదురు. ఒక్కొక్కప్పుడు మోచేతివరకు చేతినే దోపెదరు. దీనినే ఫూకా యందురు.

లేగలు చనిపోయినను పశువులు పాలిచ్చుననియు, పాలిచ్చుపరిమితి పెరుగుననియు, సహజముగ పశువులు తమలేగలకుగాను పొదుగులో నిలుపుకొనియుండు పాలు అవి నిలుపుకొనకుండచేసి పూర్తిగా పితుకుకొనవచ్చుననియు, కడుహీనమైన స్వార్థపరత్వముతో ఇట్లు చేయుచున్నారు. ఫూకా వలన పశువులకు అమితమైనబాధ కలుగును. ఇట్లుచేయు సమయమున పాపమా పశువు గ్రుడ్లు తేలవేయును. దానికి వెనుక చట్టభాగము ముడుచుకొనిపోవును. భయాతిశయమున గజగజవణకుచు తోక చెంత కెవరైన వచ్చినతోడనే అది త్రుళ్ళిపడుచుండును. లేగలనోరు కట్టి అవి త్రాగు పాలనుగూడ తామే తీసికొనవలెనని చేయు దుండగమునకంటె వేరొకటిగలదా? బుద్ధివంతులు ఈ ప్రచారమునకు తోడ్పడుదురు గాక.

ఇంతియేగాక మండి ఎండిన ఆవులను, గేదెలను, నాగళ్ళు, బండ్లుకట్టి పనిచేయించుదురు. కోడెదూడ పుట్టిన బాగుగా మేపరు. గున్నపిల్లపుట్టిన అసలే మేపరు. ఈరీతిగా పశుపోషణ యున్నది. వందలకొలది మేలు ఆవులు కడుపునిండ తిండిలేక శల్యావశిష్టములుగ నున్నవి. కాని ఈరీతిగా దుగ్ధశాలల నేర్పరచి సంస్కృతమును ఆరోగ్యము

గడ ధూమిని బీదరాజాని చెపదువరాను.

కాదుగదా, గడ్డియైన పెట్టరు. మూడవదిక్కు మరణమునకు సంప్రాప్తమగును. కసాయి వానికి ఆదూడ నీయకనే మాంసముతీసికొని గడ్డిక్కి చేతదూడను సష్టము చేయును. ఆవు పిచ్చిది, గడ్డిబొమ్మను చూచి భ్రమపడి పాలిచ్చును. ఈరీతిగా చేయుదురు.

## పాడిపశువుల కష్టములు

మన దేశములో అనాదినుండియు ప్రతిరైతు తన పశువులకు తగినంత ఆహార మిచ్చి పోషించుటయు, పూజించుటయు, అనుభవించుటయు కలదు. పశుసంరక్షణ వేద కాలము నుండియు ధర్మసంరక్షణగా నెన్నబడుచున్నది. మన దేశప్రజలకు పూర్వకాలము నుండియు పశువులను పెంచు విధానము తెలిసియుండియు క్రమక్రమముగా మూఢనమ్మకములకు లోనయి ఈ విధానము నశించుచున్నది. ధనికులు వివేకులు మున్నగువారందరు ఆంగ్లేయ చదువులు చదివి మన యున్న పశువులను భూములను పోగొట్టి యుద్యోగాల కాశపడుచున్నారు. ఇంకను తదితర కృత్యములన్నియు నక్షరజ్ఞానములేని ప్రజలకు విడిచి పెట్టబడుచున్నవి. అందుచేతనే పశుసంరక్షణ వ్యవసాయము మున్నగునవి క్షీణించుచున్నవి. ఇంకను మన దేశమందు పశువులవిషయమై చాలభాగము తగినంత శ్రద్ధ తీసికొనుటలేదు. పుట్టినవి పుట్టుచున్నవి, చచ్చినవి చచ్చుచున్నవి, రోగములు కుదుర్చుటకు రైతులకు తగినన్ని చికిత్సలు తెలియుటలేదు. పూర్వకాలములో ఆయుర్వేదపశువైద్యము చాల వ్యాప్తిలో నుండెనని తాళపత్ర శాస్త్రములనుబట్టి తెలియుచున్నది.

## సోమరి రైతులు

మనదేశములో పాడిపశువులను పోషించువిధానము తెలియని రైతులెందరో గలరు. జిల్లాబోర్డులు, కౌన్సిల్ యెలెక్షన్సులో స్టాండయి పశుపోషణ వ్యవసాయము మున్నగునవి మరచిపోయిన రైతులెందరోగలరు. పట్టణములలో మకాములుపెట్టి దురభ్యాసములకు లోనై తమ యింటివద్దనుండు పశువు లేమిచేయుచున్నవో యెరుగని రైతులుకూడ గలరు. తమకు మించిన ఆస్తికంటె అనవసర ఋణములుజేసి జప్తులు రాగానే తమ పశువులను తోలుకొనిపొమ్మను రైతులుకూడ గలరు. జప్తుక్రిందవచ్చిన పశువులు కోర్టుదగ్గరను, బందెలదొడ్లలోను ఉండి మేత దొరకక కృశించుచుండును.

## దొంగ పశువులు

మరికొందరు రైతులు పాడిపశువులను సరిగా మేపరు. ఇటువంటి రైతులను సోమరిపోతులందురు. వీరు చీకటిపడగనే తమ పశువులను తదితర రైతుల పొలముల లోనికి తోలుదురు. ఆ పశువులు పొలములలోనున్న మేత కలవాటయి దొంగతనము నేర్చుకొని ప్రతిదినము ఆమాదిరిగనే పొలములకు బోవుచుండును. ఇట్లు కొన్నిదినము లైనతరువాత ఆ పొలము యజమాని యీ దొంగపశువును బట్టుకొని యాగ్రామము దగ్గరగా నున్న గ్రామాదుల బందెలదొడ్లకు తోలుకొనిపోయి పెట్టును. దొంగమేత

ఎర్రభూమి పంట ఒకనాటి వంట

ఉప్పునీటిని పోసి తీయవలెను. ఇంకను పొలమునుండి పశువులు రాగానే యేవ్యాధితో నైన వచ్చుచున్నవో, యే విషపురుగైన కాటువేసినదో, యే విషసాలీడైన కరచినదో, యే చిరుకప్పలైన పీకినవో తనిఖీ చేసి యింటివద్దనుండు దాణాదినుసులుగాని, గడ్డిగాని వేయవలెను.

## పాడిపశువుల నుంచువేళలు

పాడిపశువులు ఉదయము 9 గంటలవరకు యింటివద్దనుండి తదుపరి సాయంకాలము 5 గంటలవరకు బీళ్ళలో నుంచవలెను. సాయంకాలము 6 గంటలనుండి ఉదయము 10 గంటలవరకు ఇంటివద్దనుండు కొట్టములలోగాని, వీనికి ప్రత్యేకముగా నుండు కొట్టములలోగాని యుండవలెను. పాడిపశువులను కొట్టములనుండి యిండ్లకు తీసికొని వచ్చి పాలు పితుకుకొని మరల వెంటనే కొట్టములకు తోలుటమంచిది. లేనియెడల యింటికిని కొట్టమునకును దూరముగా నున్నయెడల పాలు పితుకుటకు ప్రత్యేక పనిమీద వెళ్ళవలసియుండును. ఇంకను కొట్టమునుండి తెచ్చు పాలపాత్రలలో పదిసేర నూక్ష్మ జీవులు చేరి రోగములు కలిగింపవచ్చును. కాబట్టి పాత్రలపైన మూతలువేసి జాగ్రత్తగా తేవలెను.

## పాడిపశువుల విశ్రాంతి

వర్షాకాలములో 10, 15 దినము లొకేసారిగా ధారగా వర్షములు కురిసినపుడు పాడిపశువులను దొడ్లలో నుంచుదురు. మాగాణిభూముల రైతులు మెట్టరైతులకంటె పశువుల విషయమై చాల యిక్కట్లు పడుచుందురు. మాగాణి రైతులు వర్షములు కురిసినప్పుడు గడ్డిపోచలు తోలుటకు సలుపు లేక ఆ కొట్టములలోనే యుంచుదురు. వర్షములకు దొడ్డియంతయు తడిసి చెత్తనుల మూత్రములు పగ్గరాలు ప్రబలి దుర్వాసన వేయును. అందుచేత ఆ వాసన సహింపలేక పశువులు దొడ్డినుండి బయటకు వెళ్ళుటకు ప్రయత్నించును. కాబట్టి వర్షము కురిసినపుడు మీ గ్రామ పశులసలములోనికి మీ పశువులను తోలుకొనివెళ్లి అక్కడ కొంచెముసేపుంచి అటునిటు తిరుగనిచ్చుట మంచిది. లేక పొలములో నున్న మెరకనేలను తోలినను తోలవచ్చును. కొన్ని ప్రాంతముల యందు పశువుల నెల్లప్పుడు మెట్టభూములయందే వానికి తగిన కొట్టముల నేర్పరచి అక్కడనే యుంచుదురు. ఈ పద్ధతి చాల మంచిదియే గాని అప్పుడప్పుడు యిండ్లకు కూడ నలవాటు చేయవలెను. వర్షములు లేనప్పుడు, అంతా బాయములందుము, పశువులను కట్టుకొయ్యలకు కట్టివేయక విశ్రాంతిగా ఆ దొడ్లలో తిరుగనిచ్చుచుండవలెను. లేనిచో అవి బయటకు పోవుటకు ప్రయత్నించుచుందురు. జబ్బుగానుండు పశువులను మాత్రము పొలములకు తోలరాదు. గ్రామములో అంటువ్యాధు లున్నపుడు గూడ పశువులను విచ్చలవిడిగా త్రిప్పరాదు.

---

ఊసరభూమిలో విత్తనమువేస్తే ఉల్లికోపులు పండును.

## పాలుతీయుమనిషి

సాధారణముగా ధనికుల యిండ్లలోతప్ప తదితరచోటుల పశువులయజమానులుగాని, వారిస్త్రీలుగాని పాలుపితుకుదురు. ప్రతిరైతు సోమరితనముంచక తనంతట తానే తమపశువులను పాలుపితుకుట మంచిది. ధనికులలోగూడ చాలమంది తదితర వ్యవసాయపనులు చేయకపోయినను పాలు పితుకుట మాత్రము విధిగా చేయుదురు. పాడిలేనియింటియొక్క స్థితిగతులు మీకే తెలియును. కాబట్టి పాడిగల ప్రతిరైతు తప్పక పాడిపశువులను పోషించి పాలుపితుకుట మంచిది.

## ధరించు వస్త్రములు

పాలుపితుకు మనిషి శుచిగానుండు చేతులను శుభ్రముగా కడుగుకొని పాలు పిండవలెను. పాలు పితుకుమనిషికి మురచచొక్కాయును, మోకాళ్ళవరకు సరిపోవుకట్టు పంచెయును, ఇష్టమున్న తలపాగయు నుండవలెను. పొడుగుచొక్కాయును, లావైన కట్టుపంచెయు, నుండుటవలన పశువుమెప్పుడైన తన్నినయెడల ఆమనిషికి ప్రమాదము కలుగవచ్చును. అనారోగ్యకరమగు మనిషి అనగా క్షయ మొదలగు అంటువ్యాధులుగల మనిషి పాలు పితుకరాదు. పాలుపితుకువారిగోళ్ళు చాల పొట్టివిగా నుండవలెను.

## బాధ లేకుండ పితుకుట

పాడిపశువును పాలుపితుకుట కష్టమైన పనికాదు. పశువునకు బాధలేకుండ పితుకుట కలవాటు జేసికొనుటయే ముఖ్యమైనపని. చన్నుల దగ్గర బొటనవ్రేలుతోను, చూపుడువ్రేలుతోను, పట్టుకొని చివరకు నొత్తుచు లాగుచు పాలుపితుకవలెను. పాలుతీయు నపుడు పశువునకు దగ్గరగా కూర్చుండి పితుకవలెను. చేతులమీద చెంబు బరువు పట్టలేని వారు రెండు మోకాళ్ళమీద పట్టుకొని పిండవలెను. పాలను పితుకుటకు పూర్వము దూడనువిడిచి అయిదునిమిషములు చన్నులను కుడిపించి చేపునకురాగానే దూడనుతీసి విడిగాకట్టి తరువాత పాలు పితికినయెడల జలజల రాలును. పాలుపితుకు ముందు పొదుగుభాగమునను శుభ్రముగా కడుగవలెను. పొదుగునుంచి ప్రతిదినము దూడకు ఒక్క చన్నువంతునమార్చి కుడిపించవలెను. లేనిచో పాలు ఒకప్రక్కకు చేరి చనుకుదురు వ్యాధి వచ్చును. ఇంకను దూడను పశువునకు దగ్గరగా నుంచిన అది దూడను నాకుచు చాల సంతోషముగా నుండును.

## పాడిపశువుల యారోగ్యము

మంచి పరామరికతో జూడబడిన పశువు తెక్కువ పాలిచ్చును. జాతి మంచిదిగా నున్నను శ్రద్ధగా జూచుటవలన కొన్ని గొడ్లెక్కువ పాలియ్యగలవు. ఉత్తమజాతి పశువును అశ్రద్ధగా నిర్లక్ష్యముగా చూచినయెడల పాలీయదు. దినమునకు రెండు పర్యాయములు మాత్రమే పాలుతీయవలెను. అట్లుతీసినపాలు ఎక్కువగను, బలముగలవి

---

ఊరిక్షేత్రం దూసర తీగ

గను యుండును. దినమునకు మూడునాలుగు పర్యాయములు తీసినపాలు రసహీనముగానుండును. అతిశీతలములోను, ఇసుక భూములలోనుండు పశువులు సరిగా పాలీయవు. మెరక భూములలోని పశువులు గట్టిపారి ఆరోగ్యముగానుండును. ఇంట కట్టివేసి గడితి తవుడు చిట్టు పెట్టి బీళ్ళలోనికి పంపబడు పశువులెక్కువగా పాలిచ్చును. ఆరోగ్యవంతులును అనారోగ్యవంతులును పసిబిడ్డలును సయితము పాలను వినియోగించుచున్నారు. పాలు సామాన్యముగా బలముకలుగుటకు పుచ్చుకొందురుగాన పాలిచ్చు పశువులుకూడ బలముగలవిగాను ఆరోగ్యముగ నుండవలెను. లేనియెడల రుగ్మతగల గల్లి పాలను గ్రోలిన నిసుగులెంత అనారోగ్యముగనుండునో అంతటి అనారోగ్యము గలిగి పట్టియు, బక్కచిక్కిపట్టియు పశువుక్షీరమును గ్రోలినవారు అబలులగుటయేగాక రోగపీడితులగుటలో ఆశ్చర్యమేమియులేదు. కాబట్టి పాడిపశువులారోగ్యముగా నుండవలెననిన వానిని గట్టివేయుశాలలు సాధ్యమైనంత పరిశుభ్రముగ నుండవలెను. రెండవది యాహారవిషయములో తగుజాగ్రత్త వహించి కాపాడవలెను. మూడవది ప్రతిదినము ఒకపర్యాయమైన పశుశరీరము శుభ్రముగా కడుగవలెను.

## పాడిపశువులను కొనునప్పుడు పరీక్షచేయుట

పాడిపశువులను కొనునప్పుడు బాగుగా పరీక్షించవలెను. ముందు శరీరమునుబట్టి, ఆకారమునుబట్టి, జాతినిబట్టి, తుదకు పాలనుబట్టి పశువు ఖరీదుండును. చాలమంది రంగునుచూచి మోసపోవుదురు. గనుక ముఖ్యముగా చూడవలసిన విషయమేమనగా దాని పొదుగును చూడవలెను. అన్నిలక్షణములు కలిగి సరిగా పొదుగులేనిఆవును, అన్ని లక్షణములుండి కొమ్ములుసరిగా లేని ఆవును గణ్యములో జేర్చియుండును. ఎన్నిఅవయవ లక్షణములుండినను పొదుగు సరిగాలేనిదానిని కొనరాదు. పొదుగు సైజును బట్టియే పాలుయుండును. ఎంత పొదుగు ఉన్న అన్ని పాలు యిచ్చును. పెద్దపొదుగుండుటవలన లాభమేమో పశువాళ్ళకు బాగుగా తెలియును. పొదుగును బాగుగా చేయుటకై వారు ప్రయత్నించెదరు. కాని ఈ పద్ధతి ఆవునకేగాక రైతునకుకూడ నష్టమువచ్చును. పొదుగురూపము గాకుండ లక్షణములనుబట్టికూడ నుండును.

## పొదుగును పరీక్షచేయుట

పొదుగులలో అనేకరకములుగలవు. కొన్నిటికి యుండవలసిన ఆకారములుండవు. ముసలి పశువుల పొదుగులు సరిగా నుండవు. పడుచువాటిని, ముసలివాటిని పొదుగునుబట్టి నిర్ణయింపవచ్చును. కొన్ని పొదుగులు సీసా ఆకారముగ పొదుగుగానుండును. ఇవి అంత శ్రేష్ఠమైనవిగావు. మంచిరకపు పొదుగు తగినంతలోతు వెడల్పు క్రిందిభాగము సరిగ ఉండుట మంచిది. ఇంకను చతురముగానుండి అడుగుభాగము వెడల్పుగా నుండవలెను. వెనుకటి కాళ్ళదగ్గర పొదుగు పెద్దదిగాను, ముందువైపు చాల తక్కువగాను ఉన్న దానిని గ్రహించవలెను.

---

ఊసరనేలలో వేసిన పయిరు ఉదకములేని చెరువునకు సమానము

## చన్నులను పరీక్షచేయుట

చన్నులబట్టికూడ నిర్ణయింపవచ్చును. కొన్నిటిచన్నులు ప్రేళ్లు ముడుచుకొని యుండును. ఇట్టివి చెడువని తలంచవలెను. సామాన్యముగా విడిగను, వెనుక చన్నులు పెద్దవిగను యుండుట మంచిది. కొన్నిటికి పెద్దవి చిన్నవి యుండును. కాని సైజునుబట్టి పాలుండవు. కొన్ని చిన్నసైజులుగలవి బాగుగా పాలిచ్చును. పెద్దచన్నులుగలవి పిదుకుటకు సులభముగా నుండును. గాని పాలీయుటకు కండపొదుగుగలవి అంత శ్రేష్ఠమైనవి కావు. మొదటి ఈతకు చన్నులు చిన్నవైనప్పటికి ఈనినకొలది పెద్దవగుచుండును. పాలు సరిగా పితుకకపోయినను చన్నులు తెగును. కాబట్టి వేళలకు పితుకుచుండవలెను. చన్నుల విషయమై పరీక్షించుట మంచిది.

## చన్నులలోని రకములు

ముఖ్యముగా చూడవలసిన విషయమేమన కొన్ని చన్నులు గుడ్డిగా, తిప్పగా నుండి పాలురావు. కొన్ని ఈతలలో కొరివిచన్నులై యుండును. అట్టివానిని మోసపుచ్చి చవుకగా అమ్ముదురు. అట్టివానిని బాగుగా పరీక్షించి కొనవలెను. తిప్పగానుండి పాలు రాకపోవుటకు కారణము వేళకు సరిగా పిండక అశ్రద్ధచేయుటయే. మూడుచన్నులు గలవి ఆక్షేపణయుండును. పాలుకూడ తక్కువగా నిచ్చును. రెండు చన్నులు గలవానిని అసలే కొనరాదు. కాబట్టి నాలుగు చన్నులను జాగ్రత్తగా చూచి కొనవలెను.

## పొదుగును నొక్కిచూచుట

ఈనకముందుగాని ఎండిపోయినపుడుగాని, ఆవును కొనినచో నాలుగుచన్నుల లోనిపాలు వచ్చునా? రావా? యని తెలిసికొనవలెను. పొదుగు మెత్తగానుండిన పాలెక్కువగా నుండును. పొదుగు గట్టిగా నుండిన పాలు తక్కువగా నుండును. కాబట్టి పొదుగు చేతులతో నొక్కి పరీక్షించవలెను. గట్టిగానుండి కండపొదుగుగా నుండునది చాల దాంబికముగా నుండుటవలన రైతులు మోసపోవుదురు. మెత్తగా నున్నదానినే కొనవలెను.

## సంతలలో మోసపుచ్చు బేరగాండ్రు

మంచిపాడిపశువులను కొనునపుడు దానిగుణములన్నిటిని జాగ్రత్తగా పరీక్షించవలసి యుండును. కొందరు బేరగాండ్రు మాటలచే అమ్మి మోసపుచ్చుదురు. మంచి పాడిపశువు ను కొనదలచుకొనునపుడు అనుభవముగలవారగు మీ మిత్రులను సంప్రదించి, బాగుగావిచారించి కొనవలెను. ముఖ్యముగా సంతలలో జరుగు మోసము చాలదారుణముగా యుండును. సంతలకు దొంగపశువులు, లోపల జబ్బున్నపశువులు, తాత్కాలిక బలుపు మీద నున్న పశువులు వచ్చుచుండును. కాబట్టి బాగుగా వాని పూర్వాపరములు కనుగొని కొనవలెను. చెడ్డపశువు పరిస్థితులు వేరుగానే యుండును. అప్పుడు యజమాని కంటికగపడక, అక్కడనుండే ప్రేక్షకులలో కలిసియుండి ఆపశువుదగ్గరకు వచ్చు వాను

ష్యాలను చూచుచుండును. సామాన్యముగా సంతను చేరగాండ్రు ఎక్కువగ వచ్చెదరు. ఇటువంటి చేరగాండ్రందరు ఖరీదెక్కువగువరకు ఆపశువును అక్కడనే యుంచెదరు. సంతకు వచ్చు పాడిపశువులు రెండుపాకములలోనివే వచ్చునుగాని సరియైన సాంప్రదాయముగలవి రావు, అటువంటి సాంప్రదాయముగలవి యున్నచో ఆపశువున్న గ్రామములోగాని, సంతకువచ్చు మధ్యదారిలోగాని అమ్ముడుబోవును. చాలాకాలమునుండి గొడ్డుతనము గలిగి కటాలున చూలుకలిసిన ఆవులనుకూడ సంతలకు తోలుకొని వచ్చెదరు. ఇట్టిఆవులకొమ్ములు పొట్టిగా నుండును. చిన్నపొదుగుగలిగి యుండునని గ్రహించవలెను.

## పాలెండిన పశువులు

రైతులలో చాలమంది, పశువులు పాలెండిపోగనే తిరిగి చిల్లపశువులతో మేపుదురు. మరిరెండు నెలలకు ఎండిపోవునపుడా స్వల్పఖరీదునకో అమ్మెదరు. మరికొందరు ఈ పశువుల నటుంచి మరియొక పాడిపశువునుకొందురు. పాడియున్నంతకాలము పశువును బాగుగా మేపుదురు. ఎండిపోవగనే సరిగా మేతకూడవేయరు. అందుచేతనే అవి క్రమక్రమముగా క్షీణించి అనేకరోగముల పాలగుచున్నవి. మరికొన్ని కొనయూపిరితో నుండును. మరికొన్ని మేతకొరకు (తాళ్ళుతెంపుకొని పొలములను పాడుచేయుచుండును. అప్పుడాపొలముయొక్కవారు ఈపశువును కట్టితోలుకొనుటయో, లేక బందెలదొడ్డిలో పెట్టుటయో తటస్థించును. మరికొన్ని పశువులు కంటికికనబడకుండ నూరదేశములకుపోవును. ఈమాదిరిగా మనదేశములో పశువులవిషయమై రైతులశ్రద్ధ చూపుదురు. మరికొందరు పచ్చిగడ్డి, దాణాదినుసులు మున్నగునవి పాడిపశువులముందర వేయుగా పాలెండిపోయిన పశువులు లాగుచుండును. కానిసామాన్యముగా వరిగడ్డి తప్ప ఇతరదినుసులు పెట్టరు. కాబట్టి మీపశువులు మరల చూడిగా నుండవలెనన్న ప్రతిదినము సరిగా మేపుచుండవలెను. పాడిపశువునకు పెట్టునంత ఆహారము పెట్టకపోయినను దానిలో సగభాగమైనను పెట్టవలెను. లేనిచో అవి మరల చూడివి కావు. కాబట్టి నోరులేనిపశువులను బాధించక క్రమముగా నాహారము పెట్టుచు తగినంత యార్జన తీయవలెను.

## గొడ్డుబోతు పశువులు

ఆబోతులతో ఆవులు కలియక చిక్కులు పెట్టుటచేతను, వేడియగు మేతమేయుటవలనను, మేత తక్కువగా పెట్టి పాలెక్కువగా తీయుటవలనను, గర్భము దిగుడుకొని పోవుటవలనను, గర్భోత్పత్తి అవయవములు సరిగ నభివృద్ధి చెందకపోవుటవలనను గొడ్డుబోతుఆవులు కావచ్చును. ఇటువంటి పశువులను పొలములకు దోలి పనిచేయించవలెను. వరిమళ్లలో బంతులుకట్టి నూర్చవలెను. గడ్డి వేడికి శరీరతత్వము మారి పొర్లు వచ్చును. దున్నుట, మోటలాగుట మొదలగు పనులు చేయించవలెను.

---

కోడి అడుగులో కోటిపగ్గాలు భూమి.

## పాడిపశువులకు పెట్టు ద్రవపదార్థములు
### (తవుడు నెక్కువగా మేపరాదు)

పశువు లారోగ్యముగనుండి తగినపని చేయుటకుగాని పాలిచ్చుటకుగాని వాని కనుకూలమగు ఆహారముల నీయవలెను. వ్యవసాయదారుడుగాని గోరక్షకుడుగాని ఈ విషయమై తగినంత శ్రద్ధ వహించినయెడల నితర విషయములలో నెంత శ్రద్ధ తీసికొనినను నెంత వ్యయము జేసినను లాభములేదు. అన్నిజాతుల పశువులకు పచ్చిక స్వాభావి కాహారము. పచ్చిగడ్డి అన్నికాలములందు తగినంత దొరకునెడల పశువులకు సాధారణముగా వేరొక మేత ఏమియు నవసరముండదు. ఇట్లు లభింపనపుడును, విరామములేక పగలంతయు పనిచేయు పశువులకు దినమంతయు మేసి పొట్ట నింపుకొనుటకు తగిన యవకాశము లేకపోవుటచే గడ్డి మొదలగునవి తెచ్చివేయుటయే గాక కొంతపరిమాణము నందె యెక్కువ సారముగల తవుడు తెలికపిండి మొదలగు దాణాదినుసులు వేయవలసి యుండును.

## స్త్రీలు వెన్నను అమ్ముట

మన యిండ్లలోనుండు ఆడువారలకు పాడిపశువు లనిన మిగులప్రీతి. వీరెప్పుడును వీసెలకు వీసెలు నేతిని తయారుచేయవలెననియు, డబ్బాలకు డబ్బాలు వెన్న నమ్మవలెననియు, అమ్మగా వచ్చిన డబ్బు తమ భర్తల కీయక నగలు చేయించుకొనవలెనను యుద్దేశ్యముతో తమ పాడిపశువులను సంరక్షించుకొనుచుండుట మనము కన్నులార గాంచుచున్నారము. ఇంకను సుమారు రెండు సంవత్సరములనుండి అనగా మదరాసులో వెన్న పరిశ్రమాలయములు స్థాపించినకడనుంచి వెన్న కొను వర్తకులు పల్లెటూళ్లకేగి మిక్కిలి ప్రచారము చేయుటవలన గృహాంగనలు మిగుల విలువగల పాడిపశువులను కొని విస్తారముగా తవుడును మేపుచున్నారు.

## తవుడువలన వ్యాధులు కలుగుట

పశువులకు తవుడు విస్తారముగా అలవాటుచేయుటవలన ఇతర దాణా దినుసులకు అలవాటుపడుట లేదు. కొన్ని ప్రాంతములందు ప్రత్యేకముగా తవుడుమీదనే ఆధారపడి యుండు పశువులు గలవు. ఇట్లు తవుడు యెక్కువగా మేపుటవలన నేత్ర రోగములు, వాతరోగములు సంభవించుచుండుటచే పశువైద్యులు చికిత్సలు చేయజాలకున్నారు. ఇంకను అనేక పశువులు వట్టిపోవుచున్నవి. మా నిఖిలాంధ్ర ఆయుర్వేద పశువైద్య కళాశాలలో నేర్చుకొను విద్యార్థులందరు ఈ కేసులు చూచి ఆశ్చర్యపడుచుందురు.

పశువు ఈనినవెంటనే తవుడు యెంతమాత్రము పెట్టరాదు. పక్షముదినములవరకు పెట్టకుండుట మంచిది. అట్లు పెట్టినయెడల మదవాతము మున్నగు వాతరోగములు కలు

---

చాలులో చాలుదున్నితే సంసారానికి అవును.

నెమరువేయుచు విశేషముగా క్షీరముల నిచ్చుచుండును. అట్టి సమయములందు చేపని పశువులుకూడ చేపునకువచ్చి లెస్సగా పాలిచ్చును.

## తవుడు కలిపిన కుడితి

పశువుయొక్క పరిమాణమునుబట్టి రాతితొట్టిలోగాని, మట్టితొట్టిలోగాని, మానెడు లేక అడ్డెడు తవుడుపోసి అందులో నాలుగు తులముల ఉప్పు కలిపి తగినన్ని నీళ్ళుపోసి కొంతసేపు నాననిచ్చి త్రాగించవలెను. కుక్కలను తదితర జంతువులను ఆ తొట్లలోనికి పోనియకుండ పైన మూతలు వేయవలెను. నాననిచ్చిన కుడితిని త్రాగి కడుపు నింపుకొని పాలనిచ్చును. కొందరు రెండు దినములవరకు నీటిలో కలిపి పెట్టుదురు. ఇట్లు పెట్టుటవలన పొట్ట బరువెక్కినదై ముక్కుచుండును. అట్లు పెట్టిన యెడల గర్భపాతము అజీర్ణమున్నగు రోగములు కలుగును. ఈ కుడితి వెన్న నెక్కువగా కలుగజేయును.

## కలగలుపు కుడితి

పుల్లమజ్జిగ, చిక్కని త్రాగని పాలు, మిగిలిన అన్నము, వార్చిన గంజి, బియ్యపు నీళ్ళు, తవుడు మున్నగునవన్నియు ఒక తొట్టిలో పోయుదురు. దీనినే కలగలుపు కుడితి యందురు. కాని ఈ కుడితి అన్ని పశువులు మాత్రము త్రాగవు. నిత్యము అలవాటయిన పశువులుమాత్రమే త్రాగును. ఈ కుడితి పశువులకంత శ్రేష్ఠమైనదిగాదు. త్వరగా జీర్ణముకాదు. ఇది త్రాగిన పశువులు బలహీనముగా నుండును. ఈ కుడితి త్రాగిన పశువుల మజ్జిగ త్వరగా పులుపెక్కి దుర్వాసన వేయును.

## జొన్న కుడితి

పచ్చజొన్నలు కడిగిన నీటిని, జొన్నపిండి కలిపిన నీటిని, వార్చిన గంజినీటిని ఒక తొట్టిలో పోసియుంచి దానిలో గిద్దెడు ఉప్పు కలిపి పెట్టవలెను. ఈ కుడితి బలము కలిగించును. మలమును గట్టిపరచును. పాలెక్కువగా నిచ్చును. వెన్న గట్టిగా నుండును. బక్కచిక్కిన పశువులు శీఘ్రముగా జీర్ణము చేసికొనును. బలము కలిగించును.

## సజ్జకుడితి

మెట్టరైతులు సజ్జకుడితి నెక్కువగా తమ పశువులకు పెట్టుదురు. తక్కిన కుడితులకంటె ఇది మిగుల బలమును, దేహపుష్టిని కలిగించుటలో మిగుల ప్రసిద్ధికెక్కినది. మెట్టసజ్జలకంటె తోటసజ్జలు మిగుల బలము కలిగించును. వాతరోగముల చేతను, నేత్రరోగముల చేతను, బాధపడుచున్న పశువులకు ఈ కుడితి మరింత శ్రేష్ఠము. ఈ కుడితిలో చలువజేయు గుణముగలదు. వెన్న గట్టిగా నుండును. పాల నెక్కువగా నిచ్చును.

---

తెగినచేను తేమఓర్చును.

## కొఱ్ఱకుడితి

ఈ కుడితిలో మజ్జిగ, గంజి విస్తారముగా కలుపుదురు. బలము కలిగించును. మలబద్ధక మెక్కువగా నుండును. ఎక్కువగా పెట్టిన వాతము గలిగించును. పశువుల అవయవములు విరిగినపుడు ఈ కుడితిని పెట్టిన మంచిది. దీనిలో రక్తవృద్ధి ఎక్కువగా నుండుటవలన పాల నెక్కువగా నిచ్చును.

## రేగుపొట్టుకుడితి

జొన్నకుడితిలోను, సజ్జకుడితిలోను, రేగుపొట్టు కలిపి పెట్టుదురు. ప్రత్యేకముగా ఈ పొట్టును నీటిలో నానవేసి పెట్టుదురు. ఇది మిగుల జిగురుగా నుండును. ఇది పుల్లగా రుచికరముగా నుండుటచే పాడిపశువులు ప్రేమతో త్రాగును. వాతరోగముగల పశువులకు నిది శ్రేష్ఠము. ఆకలి యెక్కువగా నగును. వెన్న గట్టిగా నుండును.

## ప్రత్తివిత్తులకుడితి

ప్రత్తివిత్తులను రుబ్బి నీటిలో కలిపి పశువులకు పెట్టుదురు. ఈ కుడితిని ప్రతిదినము పరిమాణముగా పోయవలెనుగాని యెక్కువ తక్కువలుగా పోయరాదు. అట్లు పోసిన యెడల ఆరోగ్యము చెడును. ఈ కుడితి అలవాటైన పశువులే త్రాగును. ఈ కుడితి త్రాగిన పశువులు పాల నెక్కువగా నిచ్చును. వెన్న చాల గట్టిగా నుండును.

## ఉలవకుడితి

ఉలవలను నానబెట్టి రోటిలోవేసి మెత్తగారుబ్బి తొట్టిలో పోయుదురు. ఈ కుడితిని వాతతత్వముగల పశువులకు పెట్టరాదు. కొత్త పశువులకు మిగుల శ్రేష్ఠము. ఏపూట రుబ్బినకుడితి ఆపూటనే పెట్టవలెను. పాలు, వెన్న నెక్కువ కలుగ జేయును.

## శనగకుడితి

శనగలను నానవేసి రుబ్బి నీటిలో కలిపి త్రాగించవలెను. వాతపశువులకు పెట్టరాదు. మారువేరగాండ్రు ఈకుడితిని ఎక్కువగా పెట్టుచుందురు. పాలు తక్కువగా నిచ్చి వెన్న నెక్కువగా నిచ్చును. వెన్నకూడ గట్టిగానుండును. పాలు, వెన్న నమ్ముకొను వారేమంతులు ఈకుడితిని జాస్తిగా వాడుచుందురు. పాడిపశువుల కంత శ్రేష్ఠమైనది గాదని నాయభిప్రాయము. దీనివలన వాతరోగము లెక్కువగా కలుగును.

## తాటిపండ్లకుడితి

బాగుగా పండిన తాటిపండ్లనుండి గుంజుతీసి అప్పలుగా పోసి నిలువయుంచుదురు. అవసరమైనప్పుడు దానిని నీటిలో కలిపి పాడిపశువులకు కుడితిగా పోయుదురు. ఈ కుడితి త్రాగిన పశువులపాలు చిక్కగా నుండి వెన్న నెక్కువ కలుగజేయును. వాతి

---

దుక్కిసత్తువచేత దుగడంబులేదు.

శరీరముగల పశువులకు పెట్టరాదు. ఎక్కువగా పెట్టుచుండినయెడల నేత్రరోగములు కలుగుచుండును.

## గో ధు మ కు డి తి

ఇది పశువుశరీరములోని చెడునీరు తీసివేయును. శీతాకాలములో దీనినెక్కువగా వాడవచ్చును. పాలెక్కువగా పడును. ఎక్కువగా పెట్టరాదు. ఎక్కువ పెట్టిన అతివేడి జేసి గర్భమునకు హానికలిగించును. వెన్న జిడ్డుగానుండును.

## చోడికుడితి

చలువచేయును. వేసవికాలములో ఎక్కువగా నుపయోగించవచ్చును. బలము కలుగజేయును. పాలు రుచిగానుండును. వెన్న అంతగట్టిగానుండదు.

## మినపకుడితి

ఈ కుడితివలన వెన్న అద్భుతముగా వచ్చి గట్టిగానుండును. దీనిని తరుచుగా వాడరాదు. వాతరోగము లెక్కువగా కలుగును. కండ్లను జలుబుచేయును.

## జా వ లు

జబ్బుగల పశువులకు పైనచెప్పిన కుడితుల నుపయోగించు ధాన్యాలనే జావలుగా కాచి ఆయారోగపశువులనుబట్టి జాగ్రత్తగా పెట్టుట మంచిది. సజ్జజావ, గోధుమజావల వలన పాలెక్కువగా పడును. వాతరోగములు హరించును. పథ్యములుగా నుపయోగించును. ప్రతి జావలోను తగినంత ఉప్పుకలిపి పెట్టుట మంచిది. తైదుజావ కోడెపశువులకు మంచిది. రోగపశువులకు ఆరోగ్యముగానుండి తృప్తి కలిగించును. మొక్కజొన్నజావ పాల నెక్కువజేయును గాని వాతము కలిగించును. వరూకలజావ పసిపశువులు [illegible] తిననప్పుడు పెట్టుట మంచిది. ఎక్కువగా పెట్టిన శీతలము గావించును.

## పాలుపితుకు యంత్రము

పూర్వము ఎంతయో కష్టపడి నేర్చుకొనినగాని చేయజాలని పనులన్నియు నేడు మిక్కిలి సులభముగ యంత్రము వలన నెరవేర్పబడుచున్నవి. ఈ యంత్రమువలన చేతితో చేయబడుదానికంటె మిక్కిలి సులభముగను, అత్యల్పకాలమునను జేయబడును. ప్రస్తుతము కనిపెట్టబడిన యంత్రములలో పశువుల పాలు పిండు యంత్రమొకటి యున్నది.

ఇది తక్కిన యంత్రములంత యుపయోగకరము కాకున్నను నేర్పరియైన గొల్లవానితో సమానము గాకున్నను కొన్ని మార్పులు కొలదికాలములో జేయబడినచో మిక్కిలి ఉపయోగకారియై ప్రసిద్ధిపడయును. మనదేశములో నింకను యీ యంత్రము విశేషముగా నుపయోగింపబడకుండుటచే పాలను పిండుటకు మిక్కిలి నేర్పరిగలవారును అనుభవముగలవారుండవలెను. పాలను పిండువిద్యయు నొకఘనమైన

---

ఆరుసత్తువచేత అనుగుపడును.



పాడిపశువుల కొట్టము.



ఇంగ్లీషు జాతి పెయ్య



శ్రీ నల్లపాటి విజయరామయ్యగారి పొట్టిగిత్త
తె నా లి



శ్రీ ముక్కామల వీరయ్యగారి ఎద్దులతో బండపట్టు
ఎడ్లపల్లి (గుం. జి.)

విద్యయేయని నుడువవచ్చును. చిన్నతనమునుండియు పశువులలో దిరుగుచు వాటిని సంరక్షించుచు పాలను పిండువారి కాపని తేలికగనే యుండును. పాలయంత్రమును గురించి ఇదివరకే చెప్పబడియున్నది. గొల్లకాపుల బిడ్డలు చిన్నతనమునందే యీపని నేర్చుకొనుచుండుట యెల్లరకు దెలిసినవిషయమే. వారల కపని యందు యాసక్తి మెండు. చిన్నతనమునం దీపని కడు దుస్సాధ్యమయ్యు కొంతకాల మగుసరికి యీ విద్యయందు కడు నేర్పరులై సునాయాసముగా పాలను పిండుదురు.

## పాలను పిండుట

పూర్వమెన్నడును పాలు పిండియుండనిక్రొత్తగా పనిచేయ నుద్యమించినవానికి మిక్కిలి ఆశ్చర్యమును, కష్టమును దోచును. ఇతరులు పిండునప్పుడు మిక్కిలి సులభముగా నగుపడిన నాపని వానికప్పుడు అతికష్టముగా దోచును. వాడు బిగికిన పాలు పాత్రయందుగుభాగి మైనను పడియుండదును. కనుక పాలను పిండుటకు కొంతకాలము పరిశ్రమచేయవలెను. పశువుకడ నొకధారయైనను లేకుండ పాలను పిండగలిగినపుడే ఆపనియందాతడు నేర్పరియని చెప్పవచ్చును. పాలను సులభముగ ముఖ్యముగ పిండువారు రెండువిషయముల నేమరియుండవలెను. ఆవేవియన ఏరీతిగ బిగికిన పశువు అధికముగ పాలిచ్చునోయను విషయమును, పాలను పిండినపుడు యితర మలిన పదార్థములతో నేకీభవింపక పాలు శుభ్రముగనుండు విషయము జ్ఞాపకముంచుకొనవలెను. పశువేవిధముగ నధికపాలిచ్చునో ఆయాపశువునుబట్టి గ్రహింపవలెను. పాలను పిండునపుడు ఏ భాగము ముందు పిండవలెనను విషయమున నియమము నేర్పరుపబడలేదు. కొందరు ముందుభాగమును మొదటబిండుదురు. ఎట్లుపిండిన చేతులకనుకూలముగను అనతికాలములోను పిండుటకు వీలగునో అట్లు పశువునకు హాంకారము కలుగకుండునట్లు పిండవలెను. ఆసమయమున పశువుప్రవర్తనను బాగుగ సూక్ష్మతతో పరికించిన ఏరీతి పిండిన చీకాకుపడకుండ పాలనీయగలదో తెలియగలదు.

## పితుకునపుడు బాధ కలుగనీయరాదు

సాధారణముగా పాలను పిండుట నేర్చుకొనువారు భయముచే పశువునకు దూరముగ గూర్చుందురు. ఇట్లు చేయుట మిక్కిలి పొరపాటు. సరిగా పాలను పిండువారు పశువునకు మిక్కిలి దగ్గరగ కూర్చుండి రెండు మోకాళ్ళసందునను పాత్రను గట్టిగా నొక్కిపట్టి పాత్ర పొదుగునకు సూటిగ నుండునట్లు గూర్చుండవలెను. అట్లు గూర్చున్నయెడల పశువు గ్రహించి నెమ్మదిగ విడువబడును. లేనిచో వెవరి చిందులు ద్రొక్కి పాలనీయదు. పశువు యింతమాత్రము బెదరకుండునట్లు చూడవలెను. పశువు చీకాకుపడి తన్నినచో దానిని గొట్టియుంకను బెదరునట్లు చేయక నెమ్మదిగా చేరి లోబరచుకొనవలెను. పాలుపిండు మనిషి పశువు నడతను బాగుగా గుర్తించి దాని కనుకూల

---

ఎనుపు సత్తువచేత వెన్నుతిను.

ముగ ప్రవర్తించవలెను. పాలను పితుకునపుడు చేతులు పొడిగ నుండవలయునని కొందరు చెప్పుదురు. చేతులు పొడిగ నున్నయెడల పాలలోనికి మలినము రాకపోవచ్చును, గాని పశువున కాగ్రహము తప్పక కలుగును. చేతులు పొడిగనుండిన పాలుపిండుటధికముగ నొత్తిడి సేయవలసి యుండును. అందువలన పశువునకు బాధ కలిగి నిలువబడదు. చేతులు కొంచము తడిజేసుకొని పిండినచో పిండువానికిని పశువునకును గూడ అనుకూలముగ నుండును. పిండుపాలలో చేతులు తడిజేసికొనగూడదు. ఆయాదేశముల పశువులనుబట్టియు, వానివయస్సునుబట్టియు అవి యొసగుపాలపరిమితియు భేదించుచుండును.

## ముఱ్ఱుపాలు

పాలలో నీరు క్రొవ్వుతో గూడిన మీగడ, పంచదార, బూడిద, ప్రొటీన్ యుండును. చివర నాలుగు భాగములు ఘనపదార్థము లనబడుచున్నవి. పశువు పాలిచ్చు కాలములో ఈ పదార్థముల పరిమాణములు భేదించుచుండును. మొదటిసారి పశువు ఈనినపుడు పాలు చిక్కగను, పసుపువర్ణముగను, మంచి వాసన, రుచిగ యుండి జున్నుపాలు అని పిలువబడును. ఈ మొదటి పర్యాయము తీయబడిన పాలు వివిధపశువులలో వివిధరకములుగా నుండును. ఈ జున్నుపాలనే ముఱ్ఱుపాలందురు. ఈ పాలకును సామాన్యపాలకును కొంత భేదము కలదు. సామాన్యపాలు మిగుల చిక్కగను, పసుపుపచ్చగను, సాంద్రత యెక్కువకలదిగ నుండును. ఇంతియేగాక అందలి చమురుబొక్కలు పెద్దవిగ నుండును. ముఱ్ఱుపాలయందు అల్బూమినద్రవ్యము లెక్కువగా నుండును. ఇందుచేతనే ఈ పాలు కాచినయెడల గడ్డకట్టి జున్నువంటి పదార్థ మగును. ముఱ్ఱుపాలు విరేచనకారి యగుటచే అప్పుడు పుట్టిన దూడ ప్రేగుయందలి ఒకవిధమగు మాలిన్యమును గొట్టివేయును. పశువు ఈనిన వెంటనే పాలు పిండిన తరువాత తొట్టెలో పోయవలెను. తరువాత దూడను కుడుపవలెను. దూడను విడిగా కట్టివేయక తన తల్లిదగ్గరనే యుంచవలెను. అట్లుంచినయెడల దూడ యిష్టము వచ్చినపుడెల్ల పాలు త్రాగుచుండును. ఆ పాలు దూడ అప్పుడప్పుడు త్రాగుచుండుట వలన చన్నులలోని పాలనిచ్చు పాలగొట్టములు విజృంభించును. దూడ ఆకలితో నుండుటచేత చన్నులను గీరి బలముతో త్రాగును. అందువలన చన్నులయందు నొప్పితగ్గును. పశువు ఈనిన తరువాత మూడు దినములవరకు రెండుమూడుసార్లు క్రమము తప్పక పాలు పితుకవలయును. మూడవదినమున పిండుపాలు త్రాగుటకు రుచిగా నుండును. మొదటిదినమున రెండవదినమున నిచ్చుపాలను జున్నుగా వండుకొని తిందురు. ఇది చాల పొరపాటు. ఇటువంటి పాల నుపయోగించుటవలన వాతరోగములు మొదలగునవి జనించును. గాన నవి యెంతమాత్రము నుపయోగించక దూడకే విడిచిపెట్టవలయును.

అదును పదును చెరుచునది వేపనాగేలు.



## పొదుగు

పాడిపశువులకు పొదుగను అంగముండును. ఈ పొదుగునందు నాలుగు పాల గ్రంథు లుండును. ఈ గ్రంథులు పశువుయొక్క వెనుకకాళ్ళ సందున యుండును. ఒక ప్రక్క నున్న రెండు గ్రంథులును ఒక తంతుసంయుతమైన తొడుగుచే పరివేష్టింపబడియుండును. రెండవప్రక్క నున్నవి మరియొక తొడుగుచే పరివేష్టింపబడియుండును. ప్రతి గ్రంధికి ఒక్కొక చన్ను యుండును. ఈ చన్నులు పాడిపశువులకు 3, 4 న్ను, ఆడగుఱ్ఱము, ఆడుగొఱ్ఱెలకు 2 ను, ఆడుపందికి 10 లేక 14 ను, యుండును. అప్పుడప్పు డీ నాలుగు గ్రంథులుగాక మరియొక రెండు మాంసగ్రంథులు కలిగియుండును. ప్రతిదానికి ప్రత్యేక ద్వారము లుండును. చంటిపైని ప్రతి గ్రంధిలోను పాలతిత్తియొకటి యుండును.

## క్షీరనాళములు

ఇందులోనికి పాల కాలువ లన్నియు ప్రవహించును. ఈ పాలతిత్తినుండి చంటి గుండ పైభాగమున నొక కాలువ గలదు. పాలగ్రంధికి రబ్బరువంటి తొడుగు గలదు. ఈ గ్రంధికి క్షీరవాహికలచుట్టు సమర్పబడియుండు కణముల గుంపులచే నేర్పడిన యంగము క్షీరవాహిక లనేకములు చేరి పెద్దవాహికలుగ నేర్పడును. ఇవియన్నియు చంటిపైనుండు పాలతిత్తులలోనికి ప్రవహించును. ప్రతి పాలతిత్తినుండియు నొక కాలువ చంటిగుండ పైకి వెలువడుచుండును. చంటిచివరనుండు మాంసకండరములు పాలు తమంతట తాము కారిపోకుండ నీ కాలువలను మూసికొనియుండునట్లు జేయును.

---

దుక్కిదున్నితే భూమికి శాంతము,

## పా ల స ం చి

పాలగ్రంథికి కొన్ని రక్తనాళములగుండ రక్తము వచ్చును. ఆ రక్తమునుండి గ్రంథికణములు, పాలకు పనికివచ్చు ద్రవ్యములు తీసికొనినతరువాత తక్కినభాగము దుష్టరక్తనాళములగుండ మరలిపోవును. ఈ దుష్టరక్తనాళములలో కొన్ని లోపల నున్నను మరికొన్ని పైభాగమున నుండును. పైభాగమునందుండువానినే పాలనాళము అని చెప్పుదురు. పశువుల లోపలిభాగమున నుండు రక్తనాళము లెంత పెద్దవిగ, స్ఫుటముగ నున్న అవి యంత బాగుగా పాలిచ్చును. పాలగ్రంథులలో తమ దూడల పోషణకై పాలు పుట్టుచుండును. చంటి మొనలకు పోయిన మార్గములగుండ పాలు ప్రవహించును. ఆ మార్గమునకు పైభాగమున క్రిందిభాగమున ద్వారమును మూయగల కండరము ఏర్పడి యున్నవి. చనుమొనకు పైని పాలతొట్టి సుమారు 1½ పైంటు పాలు పట్టగలిగినగా నుండును. దానినుంచి చంటిద్వారముగుండ పాలు లాగబడును. శరీరములో మాంసకండరములున్న భాగములకు పొదుగుభాగమునకు మధ్యగా పాలగ్రంథులు ఏర్పడి ఏకముగా చేరి పాలను నిలువచేయుచున్నవి. ఈ గ్రంధులు ఒక్కొక్కటి అంగుళములో 30-వ వంతు వెడల్పు గలిగియుండును. పొదుగుపంచికంటె దానిలో నుండు పాలయొక్క బరువు యెక్కువగా నుండును. ప్రాయమువచ్చినపుడు పొదుగు వికసించి యీనుటకుముందు నది పెద్దదగును. ఈనిన నది మరుమదనము గలిగియుండును. పాలిచ్చుకాల మంత్యమగునప్పటికి మరల సంకోచము నొంది తమ వ్యాపారమును మానును. క్షీరగ్రంథులవలన పుట్టునుపాలు మానవుల సంపూర్ణాహారము.

## పాలలోనుండు వస్తువులు

పాలలో నీరు, క్రొవ్వుతోకూడిన మీగడ, పంచదార, బూడిద, ప్రొటీన యుండునని యిదివరకె చెప్పబడినది. 87 40 నీరు, 3.75 మీగడ, 5.00 పంచదార, 3.15 ప్రొటీన్, .70 బూడిద మొత్తము 100.00. ఈరీతిగా పాలలో భాగములున్నవి. ఈ భాగములు పశువులనుబట్టి భేదించుచుండును. ముఖ్యముగా మీగడ విశేషముగా మార్పుజెందుచుండును. కొన్ని ఆవులు నూటికి 8 భాగములును, కొన్ని 3 భాగముల లోపుకు యిచ్చుచున్నవి. పాలిచ్చు చివరభాగములో మీగడ యెక్కువగా వచ్చును. కాని పాలరుచి తగ్గును. పాలయొక్క పరిమాణముగూడ చాలవరకు తగ్గును. ఈమార్పులనుబట్టి బేరగాండ్రందరు బేరము చేయుటలో సందేహించెదరు.

### పదార్థముల భాగములను తెలుపు పట్టిక

| జంతువు | నీరు 100 కి | మీగడ 100 కి | ప్రొటీన 100 కి | చక్కెర 100 కి | బూడిద 100 కి |
|---|---|---|---|---|---|
| ఆవు ... | 84.40 | 3.75 | 3.15 | 5.00 | .70 |
| మేక ... | 85 71 | 4 78 | 4.29 | 4 46 | .76 |
| గొఱ్ఱె ... | 80.82 | 6.86 | 6 52 | 4.91 | .89 |
| గుఱ్ఱము ... | 90.78 | 1.21 | 1.99 | 5.27 | 35 |

ఈ పట్టికనుబట్టి గొఱ్ఱెలనుండి మేకలనుండి వచ్చు పాలు ఎక్కువ. ప్రొటీన్, క్రొవ్వున్ను, గుఱ్ఱమునకు వచ్చు పాలలో మీగడ, ప్రొటీనున్ను, ఆవుపాలలో వచ్చు పరిమాణముకంటె తక్కువగను, దీనిలో చక్కెర ఎక్కువగను, మేక, గొఱ్ఱెపాలలో నీరున్ను, మిగత రెండు జంతువులకంటె తక్కువగను తయారగునట్లు తెలియుచున్నది.

## క్రొవ్వుతో కూడిన మీగడ

ఒక చిన్నపాలబొట్టులో 3 కోట్లనుంచి 10 కోట్లవరకు చిన్నకణములు చేరి మీగడగా నగుచున్నవి. ఇవి పశువులనుబట్టి మారుచుండును. ఈ క్రొవ్వు పాలలోని తేలిక పదార్థమైయుండి పాలను కదలించకుండ యుంచినచో కణములు పైకితేలును. జెర్సి, గెర్నిసిజాతి జంతువులపాలలో నుండు కణములు షార్టారన్ లేక హాల్‌స్టీన్‌జాతుల పాలలో నుండు కణములకంటె పెద్దవి. షార్టారన్ జాతిలోనుండు కణములు ఒకటిని, గెర్నిసిజాతి 1.25 న్ను, జెర్సిజాతి 1. 6 న్ను కలిగియుండును.

## మీగడ (Cream)

పాలలోని ఒకభాగమై, ఎక్కువ క్రొవ్వుతో చేరియుండును. పాలు గిలకొట్టగా పైకితేలిన పదార్థము మీగడగా నగును.

## ప్రొటీన్ (Protein)

దీనిలో కేసిన్ అల్బ్యుమిన్ అను రెండుభాగములు చేరి ప్రొటీన్ అగుచున్నది. దీనిలో కేసిన్ అను భాగము ఎక్కువగా నుండును. ఇది పాలను గిలకొట్టినగాని పైకి తేలదు. పాలవలన తయారగు పెరుగులో ఈ కణములు చేరియుండును. క్రొవ్వుకణములు పెరుగును. కదలించగనే పసుపుపచ్చరంగుగల ద్రవపదార్థము తేలును. పాలను వేడి చేయగా వచ్చు పదార్థమును అల్బ్యుమిన్ అందురు. పాలలో నీ పదార్థము తక్కువగను, ముర్రుపాలలో కొంచెమెక్కువగను యుండును. ఈ పదార్థము పాలను విరుగకుండ జేయును.

## చక్కెర (Sugar)

పాలలో తేలునట్టి చక్కెరను లాక్టోజ్ అందురు. ఈ చక్కెర రుచికి తక్కువగనుండి పాలను కాచగా తయారగును. ఇది ఔషధకారిగను, పిల్లలకు వాడుకొనుటకు నుపయోగింతురు. పాలకు రుచి యిచ్చునది చక్కెరపదార్థము. కేరుపాలలో $1\frac{1}{4}$ చటాకుల చక్కెర యుండును.

## బూడిద (Ash)

ఇది పాలలో నుండు ఒక ముఖ్యమైన పదార్థమై యున్నది. ఇంక నీ పదార్థము పాలు, పెరుగులలో నుండు నీటిలో నెక్కువగా నుండును. పాలలో తక్కువగా నుండును.

---

మాగిలిదున్నితే మాదిగవాడైనా పైరు పెట్టును.

## పశుజాతులనుబట్టి పాలవర్ణన

| జాతి | నీరు 100 కి | క్రొవ్వు 100 కి | ప్రొటీన్ 100 కి | చక్కెర 100 కి | బూడిద 100 కి |
|---|---|---|---|---|---|
| జెర్సీజాతి | 85.66 | 4.78 | 3.96 | 4.85 | 0.75 |
| గెరన్సీజాతి | 85.52 | 5.02 | 3.92 | 4.80 | 0.74 |
| అయిర్‌షైర్ జాతి | 87.30 | 3.68 | 3.48 | 4.44 | 0.70 |
| హోల్‌స్టీన్‌జాతి | 87.88 | 3.51 | 3.28 | 4.69 | 0.64 |
| షార్ట్‌హారన్‌జాతి | 87.55 | 3.65 | 3.27 | 4.80 | 0.73 |

ఈ పట్టికనుబట్టి వివిధజాతులలో పాలలోనిపదార్థములను, మార్పులను, చూపించుచున్నవి. జెర్సీ, గెరన్సీ, పశువులు క్రొవ్వునకు ప్రసిద్ధి. అయిర్‌షైర్‌జాతి రెండవరకము. అన్నిటికంటె హోల్‌స్టీన్‌జాతి క్రొవ్వునకు తక్కువప్రసిద్ధి. షార్ట్‌హారన్‌జాతి క్రొవ్వునకు తక్కువ ప్రసిద్ధి. చక్కెర విషయములో పశుజాతులలోకొద్ది భేదములు గలవు. సరాసరిమీద జెర్సీ, గెరన్సీజాతి పాలు ఇతర జాతుల పాలకంటె శ్రేష్ఠమైనవి.

## విదేశపు ఆవుల పాడి

| సంఖ్య | జాతి | ఆవు వయస్సు సంవత్సరములు | మొత్తంమీద ఎన్ని గేలనుల పాలిచ్చినది | ఎన్ని దినములుపాలిచ్చినది | పాల వెల రు. అ. పై. |
|---|---|---|---|---|---|
| 1 | జెరన్‌సీ | 7 | 6937 | 302 | [illegible]77—11—0 |
| 2 | జరన్‌సీ | 6 | 5470 | 305 | 657—12—0 |
| 3 | హోల్‌స్టీన్ | 12 | 5057 | 284 | 608— 0—0 |
| 4 | అయిర్‌షైర్ | 7 | 5044 | 294 | 606— 8—0 |
| 5 | జెర్సీ | 8 | 4740 | 340 | 569—13—0 |
| 6 | జరన్‌సీ | 8 | 4459 | 348 | 536— 9—0 |
| 7 | 5, 6 జాతుల మిశ్రమము | 8 | 4425 | 271 | 532— 0—0 |
| 8 | జరన్‌సీ | 10 | 3471 | 300 | 417— 2—0 |
| 9 | జరన్‌సీ | 11 | 2458 | 340 | [illegible]67—13—0 |

ఈ పట్టికనుబట్టి స్వదేశి ఆవులకంటె విదేశపు ఆవులే అధికముగా పాలిచ్చునని స్పష్టముగా తెలియుచున్నది. అనగా ఐరోపాదేశపు ఆవులను అన్యదేశములకు గొనిపోయిన పాడి హెచ్చుగానే యున్నది. ఐరోపాదేశపు ఆవులే యెక్కువ దినములు పాలిచ్చుచున్నవి. ఆరేండ్ల వయస్సుగల జాతియావు ఒకప్పుడు ఎన్నిపాలిచ్చునో, ఏడేం

మాగిలియున్నతే మరింతిపందును.

డప్పుడు ఆ జాతియావు అంతకంటె యెక్కువ పాలిచ్చును. 6 సంవత్సరములు వయస్సున్నప్పుడు 7 సంవత్సరములకంటె తక్కువ పాడి వచ్చును. కాబట్టి ఆవులు ఏడవ సంవత్సరమున అధికముగా పాలిచ్చుననియు ఆటుతరువాత క్రమక్రమముగా పాడి తగ్గిపోవుననియు గ్రహించవలెను. జరన్సీ ఆవులు 6వ యేట 5470 రతుల పాలను, 7వ యేట 6937 రతుల పాలను, 8వ యేట 4459 రతుల పాలను, 10వ యేట 3471 రతులపాలను, 11వ యేట 2453 రతులపాలను ఇచ్చినట్లు పైపట్టికవలన మనకు తెలియుచున్నది. స్వదేశీ ఆవులలో ఇట్లే యున్నది.

## పాలు తీయు కాలములో జరుగుచుండు మార్పులు

నిత్యము ఒకేకాలమందు పాలుతీయుచున్నపుడు ఒక విధముగానుండును. కొంచెమాలస్యముగా పాలను తీసినచో క్రొవ్వు ఎక్కువగా నుండును. ఉదయము తీసిన పాలకంటె సాయంకాలము తీసిన పాలు శ్రేష్ఠముగా నుండును.

| వరుస | క్రొవ్వు | క్రొవ్వుకాని ఇతర పదార్థములు |
|---|---|---|
| మొదటి పర్యాయము | 1.70 | 8.77 |
| రెండవ పర్యాయము | 1.76 | 8.99 |
| మూడవ పర్యాయము | 2.10 | 8.75 |
| నాల్గవ పర్యాయము | 2.54 | 8.69 |
| అయిదవ పర్యాయము | 3.14 | 8.49 |
| ఆరవ పర్యాయము | 4.08 | 8.59 |

మొదటి పర్యాయము తీయబడిన పాలలో క్రొవ్వు తక్కువగను, క్రమేపి ఎక్కువగను అగుచుండును. మొదటిపర్యాయము తీయబడిన పాలలోని క్రొవ్వు తక్కువగా నుండుటకును ఆరవపర్యాయములో తీయబడిన పాలలో క్రొవ్వు ఎక్కువగా నుండుటకును కారణ మేమన పొదుగుక్రిందిభాగమున నుండు పాలలోని క్రొవ్వును తిరిగి లోపలకు లాగుకొనుటవలన పోగొట్టుకొనబడునని తెలియుచున్నది. కాని ఇది సరియైన సిద్ధాంతము గాదని నా యభిప్రాయము. జంతువును బాగుగా మేపినకొలది క్రొవ్వు ఎక్కువగును. పచ్చిమేత, ఎండుమేత వేయుటలో ఈ మార్పు కలుగుచుండును. పచ్చిగడ్డి వేసినచో క్రొవ్వుయొక్క పాలయొక్క రంగు పసుపువర్ణముగా నుండును. ఆహారమును బట్టి పాలయొక్క రుచి మారుచుండును. కొన్నిసుంపదినుసులు తినుటవలన పాలయొక్క రుచి తగ్గును.

ఎగిలిచస్తే ఎలనివానికయినా పండును.

## పాలలోని వాసనలు

పాలు, మీగడ, వెన్న, మజ్జిగ మొదలగునవి దగ్గరనుంచి వానియొక్క వాసనలను సులభముగా గ్రహింపవచ్చును. కొన్నిపాలు మేకవాసన కొట్టుచున్నవనియు, మట్టికంపు కొట్టుచున్నవనియు, గొర్రెవాసన కొట్టుచున్నవనియు, బూజుకంపు కొట్టుచున్నవనియు, చెప్పుచుందురు. పశువులనుండి బయలుదేరు కొన్నివిధములగు వాయువులు పాలుపిండు వేళలయందు పాలలోగూడ కలసి వచ్చుటచే ఈ వాసనలు బయలుదేరును. ఇంక నిట్టి వాసనలు మనము పాలనుపయోగించు పాత్రలు శుచిగా లేకుండుటవలనను, పాత్ర అడుగుభాగమున నుండు మలినము కడుగక పోవుటవలనను, పాలు సరిగా కాగనీయకుండ తోడుపెట్టుటవలనను, పాలు చల్లారినతరువాత చుంచులు మొదలగు జంతువులు నాకుటవలనను, గలుగుచుండును. కొన్నిపశువులు మనుష్యుల మలము, నీరుల్లి, వెల్లుల్లి, మొదలగు వస్తువులు తినుటవలన అవి యిచ్చుపాలుకూడ ఆ మాదిరిగనే వాసన వేయుచుండును.

## పాలగుణములు

పశుజాతినిబట్టియు, ఆహారమునుబట్టియు, అవి ఈనిన ఋతువులనుబట్టియు పాలగుణములు మారుచుండును. పసుపురంగుగల పాలలో వెన్నను కలుగజేయు పదార్థ మెక్కువగా నుండును. నీలిరంగుగల పాలు రుచికి తీపిగనుండును. కాని అందులో మీగడ, పెరుగు, వెన్న ఎక్కువగా రావు. చిక్కనిపాలకంటె పలుచనిపాలే శిశువులకు రోగులకు ప్రశస్తము. సేరు మంచిపాలలో నొకనవటాకు వెన్నయుండును. పశువు వయస్సు ముదిరినకొలది పాలు చిక్కబడును. చూడిపశువుల పాలు శిశువులకు మంచివి గావు. ఇంకను పాలలోనుండు ద్రవ్యములలో కొన్నియెక్కువగా నుండుటవలనను, మరికొన్నితక్కువగా నుండుటవలనను పాలగుణములు మార్పుజెందుచుండును.

## నీరసముగా నుండు పశువులపాలు

నీరసముగా నుండు పశువులయొక్క పాలు ఒక్కొక్కప్పుడు నీలివర్ణముగానుండి పలుచగనుండును. పాలొక్కొక్కప్పుడు తీసినవెంటనే కరుడుగట్టును. ఇందుకు కొన్ని సూక్ష్మజీవులే కారణము. ఒక్కొక్కప్పుడు పాలు తీసినకొంతసేపటికి అవి చిక్కగను జిగురుగనుయుండును. ఈ రంగు పొదుగులోనుండు పాలలో రక్తము కలియుటవలన కలుగును. ఈపాలను కలుపకుండ నుంచినచో రక్తసంబంధమగు పదార్థములు క్రిందికి దిగును. ఈరీతిగనే పాలుతీసిన కొంతసేపటికి ఎఱ్ఱబడుటయు, సుగుల పల్చబడుటయు, చేదగుటయు వివిధములగు సూక్ష్మజీవులచేతనే యని కొందరి యభిప్రాయము.

---

ఏగిలి దున్నితే మూలకైనా పండును.

## పాలస్వభావము, మేత మార్పుట

పొదుగు కొంతవరకు మూత్రపిండమువలె శరీరమునందుండు కొన్నివిధముల మాలిన్యములను దీసివేయుటకుగూడ నుపయోగపడును. మేతయందుండు కొన్నిద్రవ్యము లిట్లు తొలగింపబడును. కావున పాలస్వభావము మేతమార్పుగలదు. కొన్నిద్రవ్యములతో గూడిన మేత మేసిన పాడిపశువులపాలు మనుష్యులకు జబ్బుచేయును. పాలవలన క్షయ మొదలగు వ్యాధులు రాగలవు. పశువులవయస్సునుబట్టియు, అవితినెడి మేతను బట్టియు, పాలను పితుకునట్టి వేళలనుబట్టియు, పాలగుణములు మారుచుండును. పాలలో నీటిని కలుపవలసి వచ్చినప్పుడు పరిశుద్ధమైన నీటినే చేర్చవలెను. లేనియెడల చెడునీటిలోనుండు సూక్ష్మజీవులు పాలలో జేరి అనేక వ్యాధులు కలిగించును. కొన్ని పశువు లొక్కొక్కప్పుడు ఈనుసమయము వచ్చినను పాలిచ్చుచుండును. ఇది యొక వ్యాధిగా పరిగణింపనవసరములేకున్నను జంతువులయొక్క బల మిందువలన క్షీణించును. కావున ఈనుటకు కొన్నినెలలముందు పాలిచ్చుట మాన్పవలయును. ఇంకను పాలగ్రంధులకు విశ్రాంతి గలుగజేయనియెడల ఈనినవెనుక పాలు తగ్గవచ్చును.

## పులుపు గలిగించు బీజములు

పాలు తీయగనే పులియుట ప్రారంభించును. బక్టీరియా (Bacteria) అను ఒక విధమైన బీజములవలన యీ మార్పులు కలుగుచుండును. ఈ బీజములు పాలలో ననేక విధములుగా నుండును. పాలను శుద్ధముగా తీసివేసినచో ఈ బీజములంతగా యుండవు. అశుద్ధముగా నున్న పరిస్థితులలో పాలు తీసినచో ఈబీజము లెక్కువగా నుండును. అందువలన పాలుతీయునపుడు శుచిగా నుండవలెను. ఆహారము మిక్కుటముగా యున్న చోటులందును, గాలి ధారాళముగా వచ్చు ప్రదేశములందును, వేడి ఎక్కువగా నున్న ప్రదేశములందును, ఈ సూక్ష్మబీజములు విశేషముగా వృద్ధియగుచుండును. ఈ బీజములు రెప్పపాటులో లక్షోపలక్షలుగా పెరుగును. ఒక్కొక్కబీజము మధ్యగా చీలి రెండేసి యగుచుండును. ఈరీతిగా నివి సంఖ్యాభివృద్ధి యగుచుండును. ఇవి ద్రవపదార్థముగా నుండు పాలు, నేయి, నీరు మొదలగువానిలోనే అభివృద్ధిచెందుచుండును. పంచదార, మాంసకర పదార్థములు మొదలగునవి యున్నచోట నెక్కువగా నుండును.

## బీజములు చనిపోవుట

ఇంక నివి ఆహారనాళములో కన్పట్టుచుండును. బురద, మురికినీరు, ఎరువు మొదలగు పదార్థములలో నేదైన పాలలో కలసినయెడల ఈ బీజములు తప్పక యుండును. పాలలో నుండుటకు మంచిఅవకాశములున్నవి. టెంపరేచరు సరిగానుండి పాలు వేడిగానున్నయెడల బీజములంతగానుండవు. 130 డిగ్రీలవేడిమి యున్నపుడు ఈ బీజ

---

విత్తులువేస్తే విడువక వ్యవసాయము చేయుము.

ములు చాలవరకు నశించును. 180 లేక 210 డిగ్రీలున్నపుడు అన్నిజాతుల బీజములు నిరభ్యంతరముగా చనిపోవును.

## విషబీజములు పాలలో చేరుట

సిరలకు గాయములు తగులుచుండును. వానినుండి రక్తము, చీము పాలతో కలసి పాత్రలోనికి చేరును. శాఖాహారముల నమ్మువారు ఈ రక్తపానమును గూర్చి ఆలోచించుకొనరుగాక. ఇంతియేగాక వడపోతవలన ఈదోషము నివారింపదు. పాలలో నివి కొంతవరకు మనుజులకు హానికరములుగావు. కాని పాలు నిలువయున్నకొలదిని విపరీతముగ వృద్ధిజెందును. మరియొకవిధమైన సూక్ష్మజీవులు (Micro-organisus) ఉండుట కలుగింపవచ్చును. అవి ఘోరరోగబీజములు. ఆవులలో నా ప్రాణులు ఉదాసీనములై యుండును. వాటిని బాధించవన్నను మనుజునిశరీరములోనికి రాగానే వృద్ధిచెంది బాధించును. వానిలో ఒకరకపు బీజములు క్షయరోగము (Phthisis) ను కలిగించును. ఈబీజములను పాలను మరుగబెట్టి చంపవచ్చును. పచ్చిపాలు త్రాగువారు పితికిన వెంటనే పాలను పొంగుతో త్రాగుదురు. ఈవిషయమై చక్కగా గమనింపవలయును.

## ఈతలనుబట్టి పాలు

పాలు ప్రతిదినముకొలుచుట మంచిది. సంవత్సరమునకు 300 నుంచి 500 గాలనుల పాలిచ్చుఆవులను పెంచుట అంతలాభమైనపని కాదు. కేవలము ఈతలీనిన ఆవులను 700 నుండి 1000 గాలనులవరకు యిచ్చు ఆవులను సంపాదించవలెను. పాలు కొలుచుటవలన లాభమేమనగా పాలు తగ్గుచున్నయెడల దానికేమైన వ్యాధి యున్నదేమో గ్రహించవలెను. తరువాత వ్యాధియున్నచో పశువైద్యునిచే చికిత్స చేయించవలెను. ప్రతిదినము ఉదయ సాయంకాలములందు పాలు కొలిచి డైరీ (Dairy) వ్రాసి సంవత్సరమున కెంతపాలు యిచ్చినదో తెలిసికొనుట మంచిది. పాలను పొదుగులో మిగల్చరాదు. అట్లు మిగిల్చినయెడల పొదుగు (Udder) చెడిపోవును. చివరనున్న పాలలో మీగడ ఎక్కువగా నుండునుగాన తప్పకుండతీయుటమంచిది. పాలతో చున్నలు తడిచేసి పిండరాదు. అట్లుపిండుటవలన పాలు చెడిపోవును.

## పాలిచ్చు వేళలు

సామాన్యముగా పాడిపశువులలో అనేకరములుండును. కొన్ని, పాలు సునాయాసముగా నిచ్చును. మరికొన్నిటికి చిరుతిండి అనగా ఉలవలు, తవుడు, జనుపకట్టలు మున్నగు దాణాదినుసులుపెట్టి పాలుతీయుదురు. కొన్ని దొంగపశువులు తమదూడలకు పాలుతక్కువగనుండు యుద్దేశ్యముతో సగమువరకు పాలనిచ్చి తరువాత ఎగజేపుకొనును. మరికొన్ని తన్నును. తరువాత ఆపాలను దూడకు విడుపును. కాబట్టి పశువుయొక్క గుణమును కనిపెట్టి పాలుపితుకవలెను. ప్రతిదినము ఉదయము 6 క్కి గంటలకును,

సాయంకాలము 7½ గంటలకును పాలుతీయుట మంచిది. కొన్ని ఆవులు ఎల్లవేళల నిచ్చును. ఇట్టిపాలు అంత రుచికరముగా నుండవు. కాని దినమునకు రెండుపూటలు పిండుటే మంచిది.

## పాలుపితుకుటకు పూర్వము పశువును తనిఖీచేయుట

పాలుపితుకుటకు పూర్వము పశువు సంతోషముగా నున్నదో, జబ్బుగానున్నదో పరీక్షించి పాలుతీయవలయును. పశువుశాలను శుభ్రముగా బాగుచేసిన తరువాత పాలను తీయుటమంచిది. పాలుపితుకునపుడు ఇతరులెవరును యుండరాదు. అట్లుండుటవలన దృష్టిదోషము తగులును. పాలలో దుమ్ము ఎంతమాత్రము పడరాదు. పాలు పిండినతరువాత పాలబిందె నెవరికి చూపించరాదు. దృష్టియనునది యున్నదా యని కొందరు చమత్కార ప్రశ్నలు వేయుదురు. నా అనుభవము మీద దృష్టిదోషము యున్నదని చెప్పగలను.

## పాలలోని కలగలుపులు

ఆడపశువులు వాని బిడ్డలకొరకు స్తనసంబంధమగు నాళములు తయారు చేయు ఒకవిధమైన తెలుపుగను, చిక్కగ నునుపుగనుండు ద్రవమునకు పాలు అందురు. కొన్ని జంతువులు వానిబిడ్డలకు పాలు అవసరము లేనప్పుడు పాలిచ్చుట ఆపివేయును. కొన్ని పాడిపశువులు దూడలకు అవుసరము లేకున్నను పాలిచ్చుచునే యుండును. ఆవుపాలు (Cow Milk) అన్నిటికంటె పేరుగాంచినవి. గొఱ్ఱె, మేక గాడిద గుఱ్ఱము మొదలగు జంతువులిచ్చుపాలుగూడ ఒక్కొక్కప్పుడు మనుష్యులకు నుపయోగముగ వాడబడుచున్నవి. పాలనుండి మీగడతీసినచో మీగడపాలనియు, మీగడ తీయని పాలనియు, అనేకజంతువులపాలు కలసినపుడు మిశ్రమపాలుఅనియు పిలువబడుచుండును.

మన దేశములో పాలను మిక్కిలి కల్తీచేయుచుందురు. పాలలో చక్కెరను నీటిని చేర్చెదరు. ఉదయము పితికిన పాలను సాయంకాలపు పాలలో కలుపుదురు. మరికొందరు ఆవుపాలలో గేదెపాలను కలుపుదురు. పాలు పెరుగు నెయ్యి వెన్న మున్నగువాటిని అమ్మెడువారిలో అన్యాయమునకు జంకనివారు లాభము నధికముగా గడించుటకు బుద్ధిపూర్వకముగనే పాలలోనున్నమీగడను తీసివేసి పాలలో పిండిని, గంజిని కలుపుదురు. పాలలో సహజముగా నీరు చక్కెర వెన్న పెరుగు మొదలగునవియును శరీరపోషణ కవసరములగు కొన్ని లవణములును యుండును. పాలనమ్మువారు ప్రత్యేకముగా పాలలో కలుపునీరు తరచుగా అపరిశుద్ధముగా నుండును. అందువలన అట్టిపాలను త్రాగినచో చెడునీటివలన కలుగు నట్టి కలరా టైఫాయిడ్ మున్నగు వ్యాధులు కలుగుటకు కూడ నవకాశ మేర్పడును.

---

అయిదుసార్లు పైచాలు తోలినట్లు.

## ఆవుపాలు

ఈ పాలు తీపిగనుండును. చలువచేయును. జిగటగ నుండును. ఆయురారోగ్యములను శరీరపుష్టిని యిచ్చును. నలుపు రంగుగల ఆవుపాలు శ్రేష్ఠమైనవి. తెలుపురంగుగల ఆవుపాలు గురుత్వముచేయును. లేతదూడగల ఆవుపాలు, దూడలేని ఆవుపాలు త్రిదోషముల కలుగజేయును. తెలకపిండి మొదలగు వస్తువులు తినిన ఆవుపాలు గురుత్వముచేయును. నలుపురంగుగల ఆవుపాలు వాతరోగములను హరించును. పసుపురంగుగల ఆవుపాలు పైత్యము, వాతముచేయును. తెలుపురంగుగల ఆవుపాలు శ్లేష్మమును పోగొట్టును. గురుత్వము చేయును. ఎరుపు రంగుగల ఆవుపాలు వాతమును పోగొట్టును. లేగపెయ్యకలదాని యొక్కయు దూడ చచ్చినదాని యొక్కయు పాలు త్రిదోషములను హరించి బలము కలుగజేయును.

పొట్టులు, గడ్డిజాతులు, ప్రత్తిగింజలు తినిన ఆవులపాలు రోగులకు హితముగానుండును. ఆవుపాలు తియ్యగా, చల్లగా, చిక్కగా నుండును. పశువులను బుడ్డకొట్టిన తరువాత ప్రతిదినము శేరుపాలలో నాలుగు కోడిగ్రుడ్లు కలిపి పెట్టిన బలము కలిగించి పట్టులు బిగియును. శిరోవాతములకు, కొమ్ముడొల్లలకు ఆవుపాలలో సొంటి, వస, కలిపి పథ్యముదినములు పెట్టిన మొదల తగ్గును. పశువు ఈనినవెంటనే శేరుపాలలో 4 తులముల యింగువ కలిపి పెట్టిన నాలుకసన్ని, గర్భవాతము హరించును. పశువులకు గలుగు వాతరోగములకు ఆవుపాలు చాలమంచివి. మలమూత్రములు చక్కగా గావించును. ప్రాణశక్తి గలిగించును. చెడువాసన యున్నవి, విరిగినవి, గడ్డకట్టినవి వాడరాదు.

## గేదెపాలు

ఆవుపాలకంటె గేదెపాలు చాల బలకరమైనవి. తినియుండు నూటికి పదవవంతు వెన్న, క్రొవ్వు యుండును. సుమారు 5 శేర్ల గేదెపాలలో అరశేరువెన్న తేలికగా వచ్చును. మంచివెన్నలో 70 లే 80 వ వంతు నేయివచ్చును. పాలయొక్క గుణాగుణములనుబట్టి మీగడయొక్క హెచ్చుతగ్గులు కలుగుచుండును. ఈపాలు తీపిగ, జిగటగ నుండును. గురుత్వముచేయును. చలువచేయును. ఆవుపాలు దొరకనప్పుడు పైచెప్పిన వ్యాధులకు వాడవచ్చును.

## మేకపాలు

ఈపాలు ఆవుపాలగుణము కలిగియుండును మలబద్ధకము కలిగించును. పశువులకు కలుగు రక్తవాత శ్వాసరోగములకు బాగుగా పనిచేయును. మేక అల్పశరీరముగలదిగ నుండుట వలనను, కారము చేదు మున్నగు రసములుగల వస్తువులను తినుటవలనను, తక్కువనీరు త్రాగుటవలనను, విశేషముగా తిరుగుటవలనను మేకపాలు సర్వరోగముల హరింపజేయును. మేకపాలు పశువులకు కలిగెడి వాతరోగములు, పార్శ్వవాతము, శిరోరోగములకు రెండు మాసములపాటు పెట్టిన నెమ్మదియగును.

---

పాపసము పది సేద్యాల పట్టు.

## వెన్నయొక్క గుణములు

వెన్నను నిత్యకృత్యములయందు మాత్రమే గాక వైద్యులుచేయు చికిత్సలన్నిటిలోను తరచుగా వాడుచుండుట మనకందరకు తెలిసినవిషయమే. వెన్న పశువులకు మంచి చలువచేయును. బలము కలిగించును. చర్మసంబంధమగు రోగములకును బెణుకులకును మర్దనచేసిన బాగుగా పని చేయును. జీర్ణసంబంధమగు వ్యాధులకు తరచుగా వాడవచ్చును.

ఆవువెన్న:—ఇది కొంచెము పసుపురంగు కలిగి మెరయుచుండును. చూచుట కింపుగానుండును. నేత్రరోగములకు, విరేచనములకు వాడవచ్చును. పారుచున్న మూడలకు దీనిని నిమ్మకాయంత లోపలికి పెట్టవచ్చును.

గేదెవెన్న:—ఆవువెన్నవలె పసుపురంగుగా నుండక తెలుపుగా నుండును. దీనిలో చమురుపదార్థ మెక్కువగా నుండును. బలముకలిగించును. రక్తవిరేచనములకు చర్మవ్యాధులకు నిది బాగుగా పనిచేయును. పాపల కప్పుడప్పుడు నాకించుట మంచిది.

పచ్చివెన్న:—చలువచేయును. నేత్రవ్యాధులకు బాగుగా పనిచేయును. బలము కలిగించును.

నిలువయుండువెన్న:—ఇది పులుపువాసనగలిగి వగరుగ నుండును. చర్మసంబంధమగు రోగముల కన్నిటికి వాడవచ్చును.

క్రొత్తవెన్న:—చలువ చేయును. శరీర కాంతినిచ్చును. అన్ని వాతనొప్పులకు బాగుగా పనిచేయును.

## కొబ్బరివెన్న

ఎండుకొబ్బరిని చిన్నచిన్న ముక్కలుగ చితుకగొట్టి వానినుండి యంత్రమూలమున చమురును తీయుదురు. ఈపచ్చినూనెయందు క్రొవ్వుపదార్థము లుండుటచే దానియందు దుర్వాసన యుండును. దానిలో చెడువాసన యేమియు లేకుండ జేయుటకు మొదట నొక పెద్దతొట్టెలో యీ నూనెపోసి అందులో పొడిగ నుండు సీమసున్నమును కలుపుదురు. అట్లు కలుపుటవలన యందలి క్రొవ్వుపదార్థముతో కూడ నది క్రిందికి చేరి ప్రశస్తమైన నూనెమాత్రమే పైన యుండును. పైకితేలిన నూనెను వేరొక తొట్టిలోనికి తోడి వేయుదురు. అట్లు చేయునప్పుడు నాలుగైదుసారులు వడపోయుదురు. పిమ్మట ఆవిరి గొట్టములగుండ దానిని మరగనిచ్చెదరు. నూనెస్ఫటికమువలె తెల్లబడి పొంగువరకు పైవిధమున వడపోసి కాచబడును. బాగుగ కాగి తెల్లబడినతరువాత దానిని చల్లారనిచ్చెదరు.

సీమసున్నముతో కలిపి అడుగునకు చేరిన క్రొవ్వుపదార్థములో సల్ఫ్యూరిక్ ఆసిడ్‌ను చేర్చినయెడల సీమసున్నము కరిగిపోయి ఆద్రావకముపై యీ క్రొవ్వుపదార్థము తేలును. ఈ కొబ్బరివెన్న కొన్ని మాసములవరకు చెడిపోకుండ నిలువయుండును. ఉష్ణకాలము

---

కలుపు తయ్యారి పైరు క్రింద వెలపడను.

రోగములకు బాగుగా పనిచేయును. పులుపుమజ్జిగ ఆహారమును త్వరగా జీర్ణము చేయును. కాళరోగములుగల పశువులకు పెట్టుట మంచిది.

ఈమధ్య నామిత్రులొకరు రు40-0-0ల విలువగల గేదె నొకదానిని తెచ్చియున్నారు. ఈ పశువును వారు కల్పతరువుగ భావించి లాలించుట చూడ నాశ్చర్యము వొడమి తత్కారణములు తెలుపకోరితి. అంతవారు రైతు తల్లడిల్లుటకింకను అంతిమ కాలము దాపురించ లేదనియు, శ్రద్ధ వహించి కృషిసల్పిన ఇంకను తరుణోపాయము కలదనియు నుడివి, సర్వవిధముల రైతు క్రుంగిపోవుచున్నాడని భ్రమించుచున్న నాకు విస్మయము తోపజేసెను. వారు తమ అనుభవమువలన తమ పశు ఆదాయము నిట్లు వర్ణించిరి.

## పాడిగేదెమీద వచ్చు ఆదాయము

గేదె కొనుగోలుఖరీదు రు 40-0-0 లని ఇదివరకు చెప్పియుంటినిగదా? ఇయ్యది పూటకు రెండుశేర్లవంతున 4 సేర్లపాలు యిచ్చుచున్నది. పాలనే విక్రయించినచో శేరు 1 కి రు 0-3-0 వంతున 4 శేర్లకు రు 0-12-0 గిట్టుచున్నది. అట్లుగాక పాడిచేయుదుము;—నేయి తమయింటిఖర్చునకు పోగా దినమునకు సగముసేరువెన్న వచ్చును. ఈవెన్న ఖరీదు రు 0-5-0, మజ్జిగ, పెరుగు విక్రయమున రు 0-2-0. పిడకలవలన రు 0-1-0 మొత్తము అనుదినము వచ్చురాబడి 0-8-0 యై యున్నది.

ఈ గేదెకగుఖర్చు దినమునకు తవుడు ఒకమంచెడు వెల రు 0-1-0, చిట్టు ఒకమంచెడు రు 0-0-8. మొత్తము వెరసి రు 0-1-6. నామిత్రులు రైతులగుటవలన గడ్డిఖర్చు లేకున్నది. గడ్డికొరకు కొనదలచిన నెల 1 కి రు1-4-0. అనగా దినమునకు రు0-0-9 లోపుగా అగుచున్నది. మొత్తము దినవ్యయము రు 0-2-3 అనగా నికరాదాయము దినమునకు రైతునకు రు 0-5-9. ప్రతిదిన భూస్వామునకు ఇంతకన్న లాభప్రదమైనకృషి వేరొండుగలదేమొ ప్రాజ్ఞులు వచింతురుగాక. ఇది వినిన నాకు "పాడి,పంటను మించు" నను లోకోక్తి తథ్యమని నమ్మితిని. పెంటపోగును సంవత్సరాంతమున విక్రయించిన కనీసము రు 4-0-0 వచ్చునట. దీనివలన వస్త్రాదివ్యయము కొంతవరకు తగ్గునుకదా!

## పాడిపశువువలన వచ్చు ఆదాయము

ఇక గోమాతవిషయమై చెప్పెదను. నావ్యాసమునకు చెందినఆవు సుమారు ఏబదిరూకలకు మించుటలేదు ఇట్టి ఆవు దినమునకు 4 శేర్లపాలు నిచ్చుటలో వింతలేదు. ఈపాల్లుశేర్ల ఖరీదు సేరు 1 కి రు 0-4-0 వంతున లెక్కగున్నది. ఆవువలన నేయి తీసినచో వచ్చినది మూల్యాధికముగదా? వెన్న దినమునకు అర్థసేరుచొప్పున వచ్చును. ఈ వెన్న దినమునకు అర్ధసేరునపటాను వచ్చును. ఈ వెన్న ఖరీదు రు 0-3-6, పెరుగువగైరాలకు

కలుపు తీస్తేనె బలుపు.

రు 0-2-0, పిడకలు 0-1-0. మొత్తము రు 0-6-6. దీనికగు ఖర్చులు తవుడు చిట్టు వగైరా దినమునకు రు 0-2-0. కోడెదూడ అయిన దూడ గ్రాసము రు 0-0-6. గడ్డి కూడ కొనవలసివచ్చిన రు 0-1-0. మొత్తము దినఖర్చు రు 0-3-6. దీనికి పెంటపోగు నుంచి సంవత్సరాంతమున సుమారు రు 6-0-0 వరకు రాగలదు. నికరాదాయము దినము నకు రు 0-3-0. సంవత్సరాంతమున. అనగా పాలు విడిచిన తరువాత కోడె అయినచో కనీసము రు 30-0-0, 40-0-0 వరకు రాగలదని మనవి. ఇప్పుడు రైతునకు పశువుపై వచ్చు సంవత్సరాదాయమును నిర్ణయింతము.

## గే దె వ ల న

| | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| దినమునకు రు 0-6-3 వంతున సంవత్సరమునకు. | | 140 | 10 | 0 |
| | పెంటపోగు | 4 | 0 | 0 |
| | దూడ | 5 | 0 | 0 |
| | మొత్తము | 149 | 10 | 0 |

సంవత్సరము తరువాతకూడ పాలిచ్చునట. సుమారు రెండేండ్లవరకు పాలు ఇచ్చు ననికూడ తెలియుచున్నది. కాని సంవత్సరమునకే నేను అంచన వేయుచున్నాను. దీని దూడలనుంచి ఎన్నదగిన ఆదాయము రాదని తలంచి విడచితిని. కాని అందువలనను కనీసము రు 5-0-0 ల వరకు రాగలదు.

## ఆ వు వ ల న

దినమునకు రు 0-3-0 ల వంతున.

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| సంవత్సరమునకు | 67 | 8 | 0 |
| పెంటపోగు | 6 | 0 | 0 |
| దూడ | 40 | 0 | 0 |
| మొత్తము | 113 | 8 | 0 |

రైతు ఒక గోవును, ఒక గేదెను పెంచినచో ఎంతటి లాభప్రదమో ఇప్పటికైన రైతుసోదరులు గ్రహింతురుగాక. ఆ పశువును కొన్న ఖరీదు పోను మొదటి సంవత్సరమునకే కొంత నిలువచేయగలడో గ్రహింపుడు. ఇకనైనను రైతుసోదరులు తమ అజ్ఞానమును పోద్రోలి ఇంతవరకు తాము పశువులపై వహించిన ఉపేక్షను వీడి, తామింత వరకొనర్చిన అకృత్యములకు, అత్యాచారములకు సిగ్గునొందియైన, "ఆత్మవత్సర్వభూతాని" యను ధర్మసారసారమైనను కామధేనువనదగిన గోవును, తదితర పశువులను పోషించుచు నేటి ఆర్థిక చిక్కులనుండి రక్షించబడి ప్రపంచమున కౌరవ్య ప్రాయులై సుఖింతురుగాక.

---

గరికచేను గాడిదపాలు.

# పాడిపశువుల రోగములు

## పాలు చేపకుండుట

పాడిపశువుల చన్నుల గొట్టములలో ననేకమైన సూక్ష్మములగు నాళములుండును. ఈపాలగొట్టముల కన్నిటికి తుదిమొదళ్లలో మాంసముతో చేయబడిన ద్వారములుండును. ఈ ద్వారములు తెరచికొని యున్నప్పుడే పాలతిత్తులలోని పాలు వెలిగుండ ప్రవహించగలవు. పశువునకు భయము కలిగినప్పుడుగాని, జ్వరము వచ్చినప్పుడుగాని, సకాలమునకు పాలుపిండనప్పుడుగాని, పశువుమోసకు పాలుదాచుకొనవలెనను యుద్దేశ మున్నప్పుడుగాని, మనోవ్యాధులను కలిగినప్పుడు గాని ఈ ద్వారములు ముడుచుకొనును. అప్పుడు పశువు చేపుటలేదందురు. పశువు దూడను దగ్గరకు రానీయదు. చన్నులపైన నీరుపోసి పితికినప్పుడు పాలురావు. బెదరిబెదరి చూచుచుండును, సరిగా నిలబడక అటునిటు తిరుగును. కొన్నిపశువుల కిట్టిసమయములలో దాణాదినుసులు పెట్టిన పాలు చేపుటకూడ గలదు.

### చికిత్స

ఆవుమజ్జిగ అర్ధసేరు, తాడికాయలు 1 తు, కొచలవణము ¼ తు, సుగంధపాల రసము 2 తు కలిపి రెండుపర్యాయము తీయవచ్చును.

లేక గోధుమగంజి అర్ధసేరు, నెయ్యి 5 తు కలిపి మూడుపూటలు త్రాగించుము.

లేక సాగసార మట్టలుతెచ్చి ఉడికించి దానిలోనున్న తెలుపువలుకలుతీసి మజ్జిగలో కలిపి త్రాగించవలెను.

లేక పల్లతీగనుంచి రసముతీసి చన్నుల పైభాగమున మర్దించి చేతులతో కొంచెముగా కొట్టిన పశువు చేపును.

లేక కొండగోగు ఆకురసము తీసి పాలు పితుకబోవు ముందు పశువు శరీరమునకు రాచిన తప్పక చేపును.

## చన్నుల ద్వారములు ముడుచుకొనుట

పశువుయొక్క చన్నులు పాలతిత్తులలోనికి వ్యాపించును. పాలతిత్తులలో నీగొట్టములు ప్రవేశించుచోట నొకద్వార ముండును. ఈ ద్వారము తనంత నదియే ముడుచుకొన గలదు. అట్లు ముడుచుకొనినపుడు చన్నులనుండి పాలురావు. పాడిపశువు పొదుగులో రెండు తిత్తులుండును. రెండు గొట్టములొక తిత్తిలోనికిని, తక్కిన రెండు గొట్టములు మరియొక పాలతిత్తిలోనికిని ప్రవేశించును. కొన్ని పశువులపాలు ఈ గొట్టమునుండి

---

ఎరువుంటే వెర్రివాడు సేద్యగాడే.

పిదుకకుండగనే వానియంతట యవియే కారిపోవును. కొన్ని పశువులకు బాగుగా పిండి నప్పటికి పాలు రాజాలవు. కారణమేమన పశువుచన్నులలో ఒకటిగాని, అంతకన్నెక్కువ గాని పూడిపోయిన రంధ్రములుగలవై యుండును.

ఈనిన వెంటనే కొన్ని పశువుల గ్రంధులలో పాలుపుట్టి చన్నులు లావుగా కన బడినను పాలుమాత్రము పైకి రాజాలవు. పాలు పైకివచ్చు ద్వారమున కడ్డముగా చంటి చివర నొకవిధమగుపొర పెరుగుటయే యిందుకు కారణము. రైతు లిట్టి పశువులను గూర్చి చాలవిచారపడుచుందురు. కొన్ని పశువులు ఈనినవెంటనే చన్నులద్వారములు మూసికొనిపోయి వట్టిపోవును. కొన్ని పశువుల నాలుగు చన్నులకుగాని, రెండు చన్ను లకుగాని యిది రావచ్చును. ద్వారములు గట్టిగా మూసుకొనిపోయిన పశువుల కెన్ని చికిత్సలు చేసినను లాభములేదు. ఆ ఈత కంతియేయని గ్రహించవలెను. మరల రెండవ కాన్పునకుకూడ రావచ్చును.

చంటి రంధ్రములు పొరతో మూసుకొని పోయినపుడు సలాక (Probe) తో గాని, కతీటరు (Catheter) అను పనిముట్టుతో గాని పొడిచి పాలు పైకివచ్చునట్లు చేయవచ్చును. లేక పొడుగుగల సన్నని సూదితో నెమ్మదిగా నాపాలరంధ్రములోనికి పొడిచి పాలను రప్పించవచ్చును. కాని తెలివి తెలియనివారు రంధ్రభాగమునకు పొడి చిన యెడల పశువున కపాయము సంభవించును. అంతకు తెలియనిచో మీతాలూకా వెటరనరీ చికిత్సాలయమునకు తీసికొని వెళ్లి చికిత్స చేయుడు.

## కండరసంకోచము

ఒక్కొక్కప్పుడు చంటి చివరనుండి పాలు తమంతటవి కారిపోకుండ కాపాడు కండరము సంకోచము నొందుటచే రంధ్రము మిగుల చిన్నదయి పాలుతీయుటకు దుర్లభ ముగా నుండును. దీనికి చికిత్స చేయుట దుర్లభము. శస్త్ర మవసరముగ నుండునుగాని యీపని మిగుల నేర్పరియైన వైద్యుడు చేయవలసి యుండును. అందువలన పైనను తప్పక లాభముండును ఇటువంటి శస్త్రసంబంధమైన వ్యాధులు కలిగినపుడు మీ తాలూకా వెటరినరీ డాక్టరుగారికి చూపించుట మంచిది. ఆయుర్వేద పశువైద్యులవలన నేమియు లాభముండదు. లేక ప్రతిదినము నొక సన్నని సూదిని లోనికి జొన్పి పాలను దీయుచు వచ్చినయెడల రంధ్రము పెద్దది కావచ్చును.

## చన్నులమీద కాయలు

పశువు చన్నులమీద చిటిపొటి కాయలు మొదలగునవి యుండుటచే పాలు పితుకుట కాటంకము గలిగించును. ఒక్కొక్కప్పుడవి రేగినయెడల పుండు పడి పశువు బాధపడును. పాలుకూడ తగ్గవచ్చును, కాబట్టి అటువంటి కాయలను కోసి వేయుట వలనగాని, [illegible]లతో బిగించి కట్టుటవలనగాని అవి పోవచ్చును.

---

గంపెడిచ్చిన తినకు గరిసెడిచ్చును.

## చన్నులకాటంకము గలుగుట

పాలలో సమురుగాక కొన్ని ఘనపదార్థములుండును ఈ పదార్థములు విస్తారముగా నున్నయెడల పాలు బరువుగానుండును. ఈ ఘనపదార్థములు పాలుపితుకునప్పుడు చేతికి చిన్నచిన్న ముద్దలవలె తరచుగా తగులుచుండును. ఇవి పేరుకొనిన పాలముద్దలుగాని, లోపల చర్మముపై బయలుదేరిన కంతులుగాని, లేక ఒక విధమైన శిలలు గాని అయియుండవచ్చును. ఇవి పాలుతీయుటకు అవరోధమును కలిగించుటయే గాక ఒక్కొక్కప్పుడు పొదుగునందుకూడ వాపుపుట్టించును. కావున ఈ యవరోధమును దీసివేయుట యావశ్యకము. తీసివేయుటకు వీలులేనియెడల పైనుండు పాలతిత్తిలోనికి త్రోసి వేయుట మంచిది.

## చంటికి రంధ్రము పడుట

ఏదైన అపాయమువలనగాని, పుండుపుట్టుటవలనగాని, చంటిలో సామాన్యముగ పాలుతీయు మార్గముగాక పాలతిత్తిలోనుండి చంటిప్రక్కను కన్నముపడవచ్చును. అచటినుండి పాలుకారిపోవును. ఇందువలన పొదుగంతటికిని కూడ వాపు తగులవచ్చును. పాలిచ్చుచున్నంతకాలమును ఈ రంధ్రమును పూడునట్లు చేయుట మిగుల కష్టము. పాలిచ్చుట మానినతరువాత శీఘ్రముగనే పూడ్చవచ్చును. అయినను పాలతిత్తిలో పాలెప్పుడును లేకుండ కారునట్లు మామూలుమార్గములో నొకగొట్టముంచి యాపుండును మాన్పవచ్చును. కాని యిది కష్టసాధ్యము.

## కొరివిచన్ను

పాడిపశువులలో నేదైన కొరివిచన్ను కావచ్చును. అనగా నాచన్ను తిత్తివలెనై పాలు స్రవించకుండ నుండును. పశువున కతివేడిజేసినపుడుగాని, విషసంబంధమైన పదార్థములు తినుటవలనగాని ఈవ్యాధి యేర్పడవచ్చును. పశువు నవమాసములు వచ్చిన తరువాత యేదైన విషపుమొక్కలు తినినయెడల ఈనిన తరువాత ఈ వ్యాధి కనపడవచ్చును. కొన్నిపశువుల చన్నులనుండి నెత్తురు పడుచుండును. మరికొన్నిటికి చీము, నెత్తురు కలిసి పడుచుండును. అప్పుడు దృష్టిదోషము తగిలినదని అనేక చికిత్సలు చేయుదురు. కొరివిచన్నుగల పశువు ప్రతిఈతకు పాలు సరిగా నీయదు. తక్కిన మూడుచన్నులనుండి పాలు వచ్చునుగాని, ఈ చన్నునుండిమాత్రము రావు. ఒక్కొక్కప్పుడు అన్ని చన్నులకు నీ వ్యాధి రావచ్చును.

## పాలుతగ్గిపోవుట (Loss of milk)

పశువుయొక్క తత్వమును బట్టియు, ఆరోగ్యమును బట్టియు, సాంప్రదాయమును బట్టియు పాలెక్కువ తక్కువగా పట్టుచుండును. పశువులకు ప్రతిదినము పెట్టుదాణా

---

దినుసులు తగ్గించి పెట్టుటవలనను, బొత్తిగా పెట్టక పోవుటవలననుకూడ పాలుతగ్గ వచ్చును. ఇంకను పశుశరీరములో తగినంత రక్తవృద్ధి లేకపోవుటవలనను, క్రొత్త మనుష్యులు పితుకుటవలనను, ఎండలో నెక్కువగా నుండుటవలనను, పొదుగులోనున్న పాలను పూర్తిగా పిండకపోవుటవలనను, విషసంబంధమైన మొక్కలు తినుటవలనను, దూడ చచ్చినపుడుగాని, పాలన్నియు మందగాగునను యుద్దేశముతో కడ పితుక పోవుటవలననుకూడ పాలుతగ్గుచుండును. ఇట్టి తాత్కాలిక కారణములవలన పాలు తగ్గినయెడల ఆహారమును మార్చవలెను.

## చికిత్స

వాతముగల పశువునకు ప్రతిదినము సాయంకాలమందు సపానేగు తెలికపిండి పెట్టుటవలన పాలవృద్ధి గలుగును. లేక ఆపిండిని నీటిలో నానవేసి సాయంకాలము పెట్టు కుడితిలో కలిపి పెట్టవచ్చును.

లేక కౌళశరీరముగల పశువునకు ఉలవలు నానవేసి రుబ్బి కుడితిగా పోయవచ్చును. లేక శనగలు నానవేసి రుబ్బి కుడితిగా పోయవచ్చును. పశువుయొక్క శరీరతత్వముల గ్రహించి వానికి తగిన ఆహార పదార్థములు పెట్టుచుండిన యెడల పాలువృద్ధియగుచుండును.

## దూడకు పాలు మరపించుట

కొన్ని పశువులు దూడలు పెద్దవైనపుడుకూడ పాలిచ్చుచుండును. ఇట్లు దూడను వయస్సు వచ్చిన తరువాతకూడ తల్లిపాలు కుడుచుటవలన యజమానికి కొంత నష్టము కలుగును. కాబట్టి దూడకు ప్రత్యేకముగా దాణాదినుసులుగాని ద్రవపదార్థములు అనగా నూకలజావ, లేత పచ్చికడ్డి మున్నగునవి వేసి పాలు మరపించవలెను.

## అధిక పాలప్రవాహము

కొన్నిపశువు లొక్కొక్కప్పు డీనుసమయము వచ్చినను పాలిచ్చుచుండును. ఇది యొకరోగముగా పరిగణింపక పోయినను జంతువుయొక్క బలము దీనివలన క్షీణించును. కావున ఈనుటకు కొన్నినెలల ముందు పాలిచ్చుట మాన్పవలెను. పాలగ్రంథులకు విశ్రాంతిగలుగని యెడల ఈనిన వెనుక పాలుతగ్గ వచ్చును.

పాడిపశువులను పాలుపితుకక సరిగా మానకట్టుటవలన గాని మేత మిక్కుటముగా మేసి పాలు పొదుగులో నిలువయుండుటవలన గాని, ఒక్కొక్కప్పుడు చంటిచివర నుండు కండరముయొక్క పటుత్వము తగ్గిపోయి పాలు కారుచుండును. పాలు విస్తారముగా కారునెడల చంటిచివర నొక్కిపట్టుటకు రబ్బరు ఉంగరమువంటి సాధనము పెట్టిన యెడల పాలుకారుట తగ్గును.

పాలు విశేషముగా పోవుటవలన తల్లికి రోగముగ బలహీనత కలుగును. కాబట్టి తగిన వేళలు కనిపెట్టి దూడను పాలు కుడుపుటగాని యజమాని పాలుతీయుటగాని చేయవలెను.

# శస్త్రవైద్యము

## ఇరువది రెండవ భాగము

దహ్యాతే దహానే నవక్షారేణేవ ప్రపచ్యతే
పిపీలికాగణేనేవ దశ్యతే ఛిద్యతే తథా॥

పక్వమగుచున్న వ్రణము (కంతి) నిప్పుతో కాల్చుచున్నట్లును, క్షారముచే పక్వమగుచున్నట్లును, చీమలచే కరవబడుచున్నట్లును, చీల్చబడుచున్నట్లును.

ఛిద్యతే చైవ శస్త్రేణ దండేనేవ చ తాడ్యతే
పీడ్యతే పాణీనే వాతః సూచీభివర తుద్యతే॥

శస్త్రముచే ఛేదింపబడుచున్నట్లును, కఱ్ఱలతో కొట్టుచున్నట్లును, చేతితో లోపల పిసుకుచున్నట్లును, సూదులతో పొడుచుచున్నట్లును, అపరిమితమైన బాధకలిగి యుండును.

ఊషచోషే వివర్ణస్స్యాద్దంగుళ్యేవా వ పీడ్యతే
ఆసనే శయనేస్థానే శాంతిం వృశ్చిక విద్ధవత్॥

ఇంతియేగాక తీవ్రమైన మంటలు, పేల్చివేయుచున్నట్లు బాధకలిగి యుండును. శరీరము మరొకరంగుగా నుండును. వేళ్లతో నొక్కుచున్నట్లు బాధయుండును. పరున్నను, నిలుచున్నను తేలు కుట్టుచున్నట్లు బాధపడుచు శాంతిని పొందజాలరు.

వేదనోపశమః శోథో లోహితోల్పోన చోన్నతిః
ప్రాదుర్భావో వలీనాం చతోదః కండూర్ముహుర్ముహుః
ఉపద్రవాణాం ప్రశమో నిమ్నతాస్ఫుట నంత్వచాం॥

పక్వమైన వ్రణమందు మంట బాధతగ్గి ముడుతలుగ్గలిగి, కొద్ది దురదుగ, దురదగ, ఎరుపుగ, ఆకార పరిమాణముతగ్గి జ్వరము వగైరాలన్ని తగ్గిపోవును.

ఋతేనిలాద్రుజే న వినానపిత్తం పాకః కఫంచాపి వినానపూయః
తస్మాత్సిస్సర్వే పరిపాకకాలే పంచతి శోఫాస్త్రిభిరేవదోషైః॥

---

గొర్రె తోక్కైనా చాలును.

వ్రణము గుంట పడినచో అందలి చర్మము పొరలు లేచి యుండును. వేలితో వాపు మీద నొక్కిన యెడల లోపలి తిత్తిలో నీళ్ళు కదలుచున్నట్లు కదలుచుండును. ఒకచోట వత్తిన మరియొకచోట ఎత్తుగ నుండును. పక్వమైన వ్రణముగలవానికి ఆకలి ఎక్కువగా నుండును.

వస్తావివాంబు సంచారః స్యాచ్ఛోథే గులిపీడితే
పూయశ్చపీడయే దేకమంతే మంతే చ పీడితే
బుభుక్షా వ్రణశోథస్య భవేత్ప్వ క్వస్య లక్షణం॥

వ్రణము ఉబ్బుగాగాని లేక గుంటగాగాని యున్నచో అందలి చర్మము పొరలు లేచియుండును, వాపుమీద వేలితో నొక్కిన యెడల లోపల నీరున్నట్లు చీము కదలుచుండును. ఒకచోట నొక్కిన మరొకచోట ఉబ్బుగా నుండును. పక్వమైన వ్రణముగల వాటికి ఆకలి ఎక్కువగానుండును.

ఋతేనిలాద్రుజే న వినానపిత్తం పాకః కఫంచాపి వినానపూయః
తస్మాద్ధిసర్వే పరిపాకకాలే పచంతిశోథా స్త్రిభిరేవదోషైః॥

వాతములేకుండ పోటుగలుగదు, పిత్తములేకుండ పాకమునపు రాదు. కఫము లేకుండ చీము పుట్టదు. కాబట్టి వ్రణపరిపాకకాలమందు త్రిదోషములచేత పక్వమగు చున్నది.

గాయములో చీమున్నప్పుడు త్వరగమాన్పరాదు

న చైనం త్వరమాణః సాన్తర్దోషం రోపయేత్
స్వల్పేప్యపచారేణాభ్యన్తరముత్సజ్గం
కృత్వాభుయోపి వికరోతి॥

వ్రణమును శస్త్రముచేసిన తరువాత గాయములో చీమున్నపుడు తొందరపడి గాయమును మాన్పరాదు అట్లుచేసినయెడల ఆ గాయము స్వల్పమగు అపచారము వలన లోపలగడ్డకట్టి మగల బాధించును.

సులభముగా శస్త్రచికిత్స చేయుట

తత్రాయతో విశాలః సమః సువిభక్తోనిరాశయ ఇతి వ్రణగుణాః॥

స్పష్టముగా తేలినదియు, అన్నివైపుల పక్వముబొందినదియు, బాగుగా అర్ధమైనదియు, నాలుక దంతసంధులు మున్నగు భాగములనుండు నదియునగు వ్రణమును తేలికగా శస్త్రము చేయవలెను.

---

ఏకేన వా వ్రణేనా శుధ్యమానే నాన్తరాబుద్ధ్యా
వేత్త్యాపరాన్ వ్రణాన్ కుర్యాత్॥

వ్రణమును చీల్చిన తరువాత చీము సరిగా కారనిచో తన స్వంతబుద్ధితో, విశాల మనస్సుతో ఆలోచించి చేయవలెను. అన్ని వ్రణములను ఈరీతిగా చేయవచ్చును.

యతోయతో గతిం విద్యాదుత్సర్గో యత్రయత్ర చ
తత్ర తత్ర వ్రణం కుర్యాద్యథా దోషోన తిష్ఠతి॥

ఏ భాగమునుంచి చీము కారుచున్నదో, ఎచ్చటెచ్చట నొక్కిన గుంటలుపడునో అచ్చటనుంచి చీమును తీయుటకు మరియొక బెజ్జము వేయవలెను.

## శస్త్రము చేయవలసిన భాగములు

తత్ర భ్రూ గణ్డ శఙ్ఖ లలాటా క్షిపుటౌ ష్ఠ దన్తవేష్ట
కక్షా కుక్షి వఙ్క్షణేషు తిర్యక్ ఛేద ఉక్తః॥

కనుబొమలు, చెక్కిళ్లు, కణతలు, నొసలు, కనురెప్పలు, పెదవులు, దంతమాంసములు, చంకలు, ఉదరము, గజ్జలు, ఈ స్థానములందు అడ్డముగా శస్త్ర చికిత్స చేయవలెను. ప్రాణము పోవునని అనుమాన మున్నపుడుకూడ చేయవచ్చును.

అన్యథా తు సిరాస్నాయుచ్ఛేదనం అతిమాత్రం వేదనా
చిరాద్వ్రణ సంరోహో మాంసకన్ద ప్రాదుర్భావశ్చేతి॥

అట్లు చేయక అడ్డము చేసినయెడల సిరలు, స్నాయువులు తెగి విపరీతమైన బాధ కలుగును. గాయములు సరిగా మానక దుర్మాంసము, కంతులు పెరుగును.

## శస్త్ర చికిత్సలలో కలుగు ప్రమాదములు

హీనాతిరిక్తం తిర్యక్ చ గాత్రచ్ఛేదన మాత్మనః
ఏతాశ్చతస్రోష్టవిధే కర్మణి వ్యాపదః స్మృతాః॥

శస్త్రచికిత్స తక్కువగాగాని, ఎక్కువగా గాని, అడ్డదిడ్డముగాగాని జరుగుట, వైద్యుని శరీరము తెగుట ఇట్టివి ప్రమాదములని గ్రహించవలెను.

అజ్ఞానలోభాహిత వాక్యయోగ భయప్రమోహైర పరైశ్చవిభావైః
యథాప్రయుఞ్జీత బిషక్కుశస్త్రం తథా సశేషాన్ కురుతేవికారాన్॥

---

వేళ్లతో వెంపలి వేసినారా కాయలతో కౌగిలు వేసినారా?

తెలియకపోవుట, డబ్బుయందు ప్రీతి, తదితరులు తనను గూర్చి నిందావాక్యములు పలుకుట, భయము, తబ్బిబ్బు, ఇతర ఉద్దేశ్యములు, వైద్యుడు వీటినన్నిటిని కలిగియుండి శస్త్రచికిత్స కొంతవరకే చేసినటువంటి రోగికి తదితర వ్యాధులుకూడ సంప్రాప్తమగును.

## గాయపుసంధి తదితర నష్టములు కలుగుట

సురేన్ద్రగోపప్రతిమం ప్రభూతం రక్తం స్రవేద్వ్యేత్క్షతతశ్చ వాయుః
కరోతి రోగాన్ వివిధాన్ యథోక్తాంశ్ఛిన్నాసు భిన్నాస్వథవా సిరాసు॥

ప్రత్యేకముగా సిరలు తెగినయెడల ఆ గాయమునుండి ఆర్ద్రపురుగుతో సమానమగు కాంతిగల రక్త మెక్కువగా కారుచుండును. అట్లు తెగుటవలన వాతము ప్రకోపించి శిరోరోగములు కలిగించును.

కౌబ్జ్యం శరీరావయవావసాదః క్రియాస్వశక్తిస్తుములా రుజశ్చ
చిరాద్వ్రణో రోహతి యస్య చాపి తం స్నాయువిద్ధం మనుజం వ్యవస్యేత్॥

స్నాయువులు తెగినయెడల వంటితనముగిలిగి అవయవములు పనిచేయజాలవు. పనులు చేయుటయందు శక్తికూడ తగ్గును. బాధ ఎక్కువగానుండి చాలాకాలమునకుగాని గాయము మానజాలదు.

శోఫాభివృద్ధిస్తుములా రుజశ్చ బలక్షయః పర్వసుభేదశోఫౌ
క్షతేషు సంధిష్వచలాచలేషు స్యాత్సన్ధికర్మోపరతిశ్చ లిఙ్గమ్॥

కదలునవి, కదలకుండునట్టి సంధులు తెగినచో వాపు తీవ్రముగా నుండి ఎక్కువ బాధ కలుగును. బలము క్షీణించును. కణుపులు పగులును. వాచును. సంధులు పని చేయలేక పోవును.

ఘోరా రుజో యస్య నిశాదినేషు సర్వాస్వవస్థాసు న శాన్తిరస్తి
తృష్ణాఙ్గసాదౌ శ్వయథుశ్చ రుక్షః తమస్థివిద్ధం మనుజం వ్యవస్యేత్॥

అస్థులు తెగినయెడల రాత్రింబవళ్ళు విడువకుండ విపరీతమైన బాధలు కలుగుట, కాంతిలేకుండుట, దాహము, అవయవములు కృశించుట, పోటు, వాపు గలుగును.

## శస్త్రచికిత్సచేయు వైద్యుని లక్షణములు

శౌర్య మాశుక్రియా శస్త్రతైక్ష్ణ్య మస్వేదవేపథు
అసమ్మోహశ్చ వైద్యస్య శస్త్రకర్మణి శస్యతే॥

ఎరుపో వెంపలో.

భయము లేకుండుట, శస్త్రచికిత్స గురించి యెరుగుట, పనిముట్లను గలిగియుండుట, చెమట, వణుకు, సమ్మోహము లేకుండుట, శస్త్రచికిత్స చేయు వైద్యుని లక్షణములైయున్నవి.

శల్యాకృతి విశేషాంశ్చ స్థానాన్యావేక్ష్య బుద్ధిమాన్
తథాయన్త్ర పృథక్త్వం చ సమ్యక్ శల్యమథాకరేత్॥

తెలిసిన వైద్యుడు శల్యముల రూపములను, స్థానభాగములను, వాటికి పనికి వచ్చు శస్త్రపనిముట్లను చక్కగా తెలిసికొని శల్యములను దీయవలయును.

కర్ణన్తి తు శల్యాని దుఃఖోహార్యాణి యాని చ
ఆదధీతభిషక్తస్మాత్తాని యుక్త్యా సమాహితః॥

కర్ణములంగలవిగాగాని, ఎక్కువ కష్టముతో తీయదగినవిగా నుండు శల్యము నను దీయుటలో చాలా జాగ్రత్తతో ఆలోచించి, యూహతో, యుక్తితో, నిపుణతతో వైద్యుడు తీయవలెను.

శోథపాకౌ రుజశ్చోగ్రాః కుర్యాచ్ఛల్యమ నిర్హృతమ్
వైకల్యం మరణం చాపి తస్మాద్యత్నాద్వి నిర్హరేత్॥

శల్యములను తీయనియెడల అచ్చటవాపు, పాకము, తీవ్రమగుబాధ, అంగవైకల్యము, మరణముకూడ కలుగును. కాబట్టి సాధించి శల్యములను తీయవలెను.

తదేవయుక్తస్త్వతిమర్మ సన్ధీన్ హింసాత్సిరాః స్నాయుమథాస్థి చైవ
మూర్ఖప్రయుక్తం పురుషం క్షణేన ప్రాణైరియుక్తౌదథవా కథంచిత్॥

మూర్ఖవైద్యుడు శస్త్రచికిత్స ఎక్కువగా చేసినయెడల మర్మములు, అవయవసంధులు, నిరలు, స్నాయువులు, ఎముకలు గీటిని పాడుజేసి బాధపెట్టుటయే గాకుండ రోగి ప్రాణమునుకూడ తీయును. లేదా అట్టి రోగిచాలా కష్టముతో బ్రతుకును.

## గాయములను కుట్టుట

తతో వ్రణం సమున్నమ్య స్థాపయిత్వా యథాస్థితమ్
సీవ్యేత్ సూక్ష్మేణ సూత్రేణ వల్కేనాశ్మన్తకస్య వా॥

శల్యమును పరీక్షించి తీసిన తరువాత గాయమును పైకెత్తి సరియగు స్థితిలో నుంచి సూక్ష్మమగు దారముతో గాని, నారచెట్టునారతో, జనుము, నార మున్నగు వానిలచేగాని

శణజక్షౌమసూత్రాభ్యాం స్నాయ్వా వా వేన వా పునః
మూర్వా గుడూచీ తానైర్వా సీవ్యేద్వేల్లితకం శనైః॥

స్నాయువుల చేతగాని, వెంట్రుకలతోగాని, సాగనార తిప్పతీగనారలతోగాని కుట్టవలయును.

సీవ్యేద్గోఫణికాం వాపి సివ్యేద్వా తున్నసేవనీమ్
ఋజుగ్రన్థిమథో వాపి యథాయోగమథాపి వా।

కుట్టుటలో జడలు అల్లినట్టుగాగాని, పైకి క్రిందికి కట్లు దింపునట్లుగాగాని, చిరిగిన గుడ్డను నేతగాండ్రు కుట్టినట్లుగాగాని, తిన్నని ముడి కలుగునట్లుగాగాని, ఏరీతిగా కుట్టిన బాగుండునో ఆరీతిగా చేయవలయును.

### కుట్టుసూదుల పరిమాణము

దేశేల్పమాంసే సన్ధౌ చ సూచీవృత్తాఙ్గులద్వయమ్
ఆయతా త్ర్యఙ్గులా త్ర్యస్రా మాంసలే వాపి పూజితాః॥

స్వల్ప మాంసముగల ప్రదేశము, సంధులు వీటియందు కుట్టుటకు సూది గుండ్రముగానుండి రెండంగుళముల పొడవుండవలెను. మూడంగుళముల పొడవుండి ముక్కోణముగానుండు సూదిని ఎక్కువ మాంసముగల ప్రదేశమునందు కుట్టుటకు పనికివచ్చును.

ధనుర్వక్రా హితా మర్మఫలకోశోదరోపరి
ఇత్యేతాస్త్రివిధాః సూచీస్తీక్ష్ణాగ్రా సుసమాహితాః॥

మర్మస్థానములు, అండకోశములు, కడుపు వీని పైభాగములందు కుట్టుటకు విల్లువలె వంగియుండు సూదుల నుపయోగించవలెను. ఈ మూడురకముల సూదుల యొక్క కొనలు పదునుగలవిగ, పట్టుకొనుటకు వీలుగ నుండునట్లును,

కారయేన్మాలతీ పుష్పవన్తాగ్రపరిమణ్డలాః
నాతిదూరే నికృష్టే వా సూచీం కర్మణి పాతయేత్
దూరాద్రుజో వ్రణౌష్ఠస్య సన్నికృష్టే వలుఞ్చనమ్॥

మాలతీ పుష్పముల తొడిమ కొసలవలె గుండ్రముగా తయారుచేయించవలెను. గాయములను కుట్టునపుడు సూదులను మిక్కిలి దూరముగాగాని, సమీపముగాగాని గ్రుచ్చరాదు. గాయమునకు దూరముగా కుట్టినయెడల యెక్కువ బాధ కలుగును. మిక్కిలి దూరముగా కుట్టినచో కట్లు తెగిపోవును.

---

పుట్టమన్ను వేస్తే భూమి పండును.

## కట్టుకట్టుట

తత్రఘనాం కవలికాం దత్వా వామహస్త పరిక్షేప మృజు
మనవిద్ధము సంకుచితం మృదుపట్టం నివేశ్య బద్నీయాత్
న చవ్రణస్యోపరి కుర్యాద్గ్రన్థి మాబాధకరం చ॥

గాయముపైన దళసరియగు కవలికనుకోసి చిన్నదిగ విడిపోకుండ ముడుతలు లేకుండ, మృదువుగనుండు పట్టను ఎడమచేతితో సరిగామూచి సుఖముగా నుండునట్లు కట్టు కట్టవలెను. కాని గాయముమీదను వదులునట్లు చేయరాదు.

అబధ్యమానోదంశ మశక తృణ కాష్ఠోపల పాంసు శీత
వాతాతప ప్రభృతిభిర్విశేషై రభిహన్యతే వ్రణో వివిధ వేదనో
పద్రుతశ్చ దుష్టతాముపైత్యా లేపనా దీనిచాస్య విశోషముపయాన్తి

గాయమును బంధించక పోయినయెడల నోరీగలు, దోమలు, చిన్నచిన్న పుల్లలు, రాళ్లు, దుమ్ము, చలి, గాలి, ఎండ, మున్నగునవి గాయముమీద పడుటవలన పలువిధ బాధలతోగూడి దుష్టత్వము నొందును. కట్టుకోని గాయములోని లేపనములు త్వరలో ఆరి పోవును.

## కట్టభేదములు

పీడయ న్నరుజో గాఢః సోచ్ఛ్వాసః శిథిలః స్మృతః
నైవ గాఢో న శిథిలః సమో బన్ధః ప్రకీర్తితః॥

గాయమునకు గట్టిగ కట్టుకట్టుటవలన నొప్పియున్నను బాధపెట్టనిదిగా నుండు దానికి గాఢ బంధనమందురు. వదులుగానుండి గాలిపోవుటకు వీలుగానుండు దానిని శిథిల బంధనమందురు. ఎక్కువ బిగువుగ ఎక్కువ వదులుగ నుండక సమానముగానుండు దానికి సమబంధన మందురు.

తత్రస్ఫి కుక్షి కక్షా వంక్షణోరు శిరః సుగాఢః
శాఖా వదన కర్ణ కణ్ఠ మేఢ్ర ముష్క పృష్ఠ పా
ర్శ్వోదరోరఃసుసమ. అక్ష్ణోః సన్ధిషు చ శిథిల ఇతి॥

కటిప్రదేశము, కడుపు, చంక, గజ్జలు, తొడలు, శిరస్సు భాగములందు గాఢ బంధనమును కొమ్మలు మొఖము, చెవులు కంఠము శిశ్నము వృషణములు, వీపు పార్శ్వ ములు, ఉదరము, వక్షస్థలములందు సమబంధనమును నేత్రములు సంధులందు శిథిల బంధనమును ఉపయోగించవలయును.

---

సవిక్కాలో గొడ్డు పెట్ట చేయరాదు.

చూరితం మధితం భగ్నం విశ్లిష్ట మతిపాతితమ్
అస్థిస్నాయు సిరాచ్ఛిన్న మాశుబన్ధేన రోహతి॥

ముక్కలుగా జేయబడినదియు, చిలుకబడినదియు, విరిగినదియు, సంధులనుండి యూడినదియు, స్వస్థానము విడచి జారి(వేలాడునదియు, అస్థులు, స్నాయువులు, సిరలు మున్నగునవి విరుగుటవలన కలిగినదియు నగు గాయములు కట్టుకట్టుటవలన త్వరగా మానును.

స్వబుద్ధ్యా చాపి విభజేత్కృత్యా కృత్యాంశ్చ బుద్ధిమాన్
దేశం దోషం చ విజ్ఞాయ వ్రణం చ వ్రణ కోవిదః
బుతూంశ్చ పరిసంఖ్యాయ తతో బన్ధాన్ని వేశయేత్॥

తెలివిగల వైద్యుడు సాధ్యాసాధ్యములు కనిపెట్టి గాయములను స్వబుద్ధితో పరిశీలించి కట్టుకట్టవలెను. గాయములవిషయమై బాగుగా తెలిసినవైద్యుడు ఆయా భాగములను, వాతాది, దోషములను ఆయా బుతువులను తెలిసికొనిన తరువాత కట్టు కట్టుట ప్రారంభింపవలెను.

"సుశ్రుత సంహిత"

శల్యతంత్ర లక్షణములు

తత్రశల్యం నామవివిధతృణ కాష్ఠ పాషాణ పాంసు లోహ
లోష్టాస్థి బాలనఖ పూయాస్రావ దుష్టవ్రణా న్తర్గర్భశల్యోద్ధరణార్థం
యన్త్రశస్త్రక్షారాగ్ని ప్రణిధాన వ్రణవినిశ్చయార్థంచ॥

పలువిధములగు తృణములు, కట్టెలు, రాళ్ళు, ధూళి, ఇనుపముక్కలు, మట్టి గడ్డలు, ఎముకలు, గోళ్ళు, చీము, మున్నగువాటిని వ్రణమునుండి తీయుటయు, గర్భమునందలి శల్యమును బయటకు తీయుటయు, యంత్ర, శస్త్ర, క్షార, అగ్నుల నుపయోగించుటయు, వ్రణముల నిర్ధారణ జేయుటయు ప్రయోజనముగా నుండుదానికి శల్యతంత్ర లక్షణ మందురు.

యస్మింస్తోదాదయో దేశేసు స్తథాగురుతాపి చ
ఘట్టితే బహుశోయత్ర స్రూయతేఋుద్యతేపిచ॥

శరీరభాగమునందు ఏ అవయవములో పోటు. స్పర్శ తెలియకుండుట, భారముగా నుండుట, మాటిమాటికి కదలించుట, స్రవించుట, పోటు యెక్కువగానుండుట, లక్షణములున్న అచ్చటచ్చట శల్యములున్నవని తెలిసికొనవలెను.

అయితే అరికె లేకపోతే కంది.

అస్థ్యాత్మకం భజ్యతే తు శల్యమ స్త్రశ్చశీర్యతే
ప్రాయో నిర్భుజ్యతే ఖారమాయసం చేతి నిశ్చయః॥

ఎముక సంబంధమగు వస్తువులు శరీరములో నున్నచో వెలుపలికి తీయునపుడు రెండు మూడు ముక్కలై విరిగిపోవును. ఇంకను అది లోపలనే జీర్ణించును. కొమ్ము, ఇనుము సంబంధమగు శల్యములున్నచో జీర్ణించక వంకరతిరిగి యుండును. బంగారము, వెండి, తగరము, ఇత్తడి, సీసము మున్నగునవి తీసివేయక శరీరములోనున్నయెడల పిత్తాగ్నులచే కరగిపోవును.

వార్క్ష వైణపత్రార్ణాని నిర్హ్రియన్తేతు నోయది
పచన్తి రక్తం మాంసం చ క్షిప్రమేతాని దేహినామ్॥

కఱ్ఱ. వెదురు, తృణములు, మున్నగునవి శరీరములోనుండి తీయనిచో అవి త్వరలోనే రక్తమును, మాంసమును పచింపజేసి నాటుకొని టవియే సడిపోవును.

## ఎముకలు విరుగుట, తొలగుటలో బాధలు

ప్రసరణా కుంచనవర్తనోగ్రా రుక్స్పర్శవిద్వేషణమేతదుక్తం
సామాన్యతస్సంధిగతస్య లింగముత్పిష్ట సందేశ్వ యధుస్సమాం
తాత్ విశేషతో రాత్రిభవా రుజా చ విశ్లిష్టకే తౌ చ రుజా చ నిత్యమ్॥

చాచుట, ముడుచుట, త్రిప్పుట, కలిగినపుడు తీవ్రమైన బాధ, తాకినయెడల సహించరాని బాధమాత్రము సంధి విరిగినప్పుడు సామాన్యలక్షణములుగా నుండును. సంధియందుండు రెండు ఎముకలు నలిగినపుడు సామాన్య లక్షణములే గాక సంధియందంటను శోషకలిగియుండును. రాత్రులయందు దెక్కువగా బాధయుండును. సంధియంతవాపుండును. మరియు ఎల్లప్పుడు తీవ్రమైన బాధకూడ నుండును.

వివర్తితే పార్శ్వరుజశ్చ తీవ్రా స్సిర్యగ్గతే తీవ్రరుజోభవంతి
క్షిప్తేతిశూలం విషమం రుజశ్చక్షిప్తే త్వధోరుగ్విఘటశ్చసంధేః॥

సంధిఎముకలు మెలికలు తిరిగినపుడు సంధియందలి రెండుఎముకలయొక్క ప్రక్కభాగములందు తీవ్రమైన బాధకలిగియుండును. ఎముకతో నెముక అంటుకొనియుండక అడ్డముగ పొడుచుకొని వచ్చుట కలిగినపుడు తీవ్రమైనపోటు కలిగియుండును. ఇవి ఒక్కొక్కప్పుడుండును. మరొకప్పుడుండవు. సంధియందలి రెండెముకలలో ఒక ఎముకక్రిందికి మరియొక ఎముకపైకి దిగినపుడు బాధయు, సంధియొక్క రాపిడియు నెక్కువగ నుండును.

---

పైరుపెట్టక చెడిపోవుటకంటె పైరు పెట్టి చెడిపోవుటమేలు.

## ఎముకలు విరుగుట

భగ్నం తు కాండే బహుధా ప్రయాతి విశేషతో నామభిరేవ తుల్యం
కాండే త్వతః కర్కటకాశ్వకర్ణ విచూర్ణితం పిచ్చితమస్థిచల్లితం ॥

ఎముకలు విరుగుటలో అనేకరీతులుగా నుండును. పన్నెండు రకములుగా విరుగునని తెలియుచున్నది. అస్థియొక్క చివరభాగములు నలిగి మధ్యయందు నలగక యెత్తుగ నున్నయెడల భగ్నమని (విరిగినదని) తెలిసికొనవలయును. ఎముకలు విరిగి గుఱ్ఱపుచెవివలె పొడుచుకొని వచ్చినపుడు, ఎముక చూర్ణముగా నలిగినపుడు ధ్వనివలనను, తాకుటవలనను విరిగినట్లు తెలిసికొనవచ్చును.

కాండేషు భగ్నం హ్యతిపాతితం చ మజ్జాగతం విస్ఫుటితం చ వక్రం
ఛిన్నం ద్విధా ద్వాదశధాపి కాండే సామాన్యమగ్రే కిల తస్య లింగమ్ ॥

అస్థి ముక్కలు నలిగి పిండిగా నుండును. కీలియందు వాపు హెచ్చుగానుండును. ఎముకయొక్క ఒక ప్రక్క భాగము నలిగి పేరుకొని బైటకు వచ్చునపుడు స్రావముండదు. మధ్యను విరిగి ప్రత్యేకముగా కనబడువానికి కాండభగ్నమందురు. దీనిని కదల్చిన యెడల విరిగిన భాగము వ్రేలాడుచుండును. పూర్తిగా విరిగిన ఎముకను అతిపాతమనియు, విరిగిన ముక్క అస్థిమధ్యమందు మజ్జలోనికి మజ్జను పైకిత్రోయుటచేత దీనిని మజ్జాగతమనియు, చిట్లిపోయిన ఎముకను విస్ఫుటితమనియు, కొన స్థితి వదలి వంగిన ఎముకను వక్రమనియు, నామములు గలవు. ఛిన్నము రెండువిధములు. అందు నొకటి పగిలి అటులనే అతుకుకొని యుండుట, మరొకటి పగిలి రెండుగ నుండుట. అవి పన్నెండు విధములు.

## విరిగిన భాగపు సామాన్యలక్షణములు

సస్తాంగతా శోధరుజాతివృద్ధిస్తథా వృథావృద్ధిరతీవనిత్యం
సంపీడ్యమానే భవతిహ శబ్దః స్పర్శాసహం స్పందనతోదశూలః
సర్వాస్వవస్థాసు న శర్మలాభో భగ్నస్య కాండే ఖలు చిహ్నమేతత్ ॥

అవయవములు శిథిలమగుట, వాపు పోటు హెచ్చగుట, బాధ ఎల్లపుడు ఎక్కువగా నుండుట, నొక్కినయెడల ధ్వని కలుగుట, స్పర్శను సహించలేకపోవుట, అవయవములు అదరుట, మురుపులు, పోట్లు, పరున్నను, లేచినను సుఖములేకపోవుట, ఈ లక్షణములు కాండభగ్నమునకు (ఎముకలు విరిగినచో) లక్షణములని గ్రహించవలెను.

---

భిన్నం కపాలం కట్యాం తు సంధిముక్తం తథాచ్యుతం
జఘనం ప్రతిపిష్టం చ వర్జయేత్తు చికిత్సకః॥

మోకాళ్లు, పిరుదులు, అంసఫలకము, గండములు, తాలువులు, శంఖములు, గజ్జలు, శిరస్సు వీటియందుండు కపాలాస్థులు విరిగినను, కటియందు అస్థి జారినను, తొలగినను లేక పిరుదులయందలి కపాలాస్థి విరిగినను చికిత్సించక వదలిపెట్టవలెను.

అసంశ్లిష్టకపాలం చ లలాటే చూర్ణితం చ తత్
భగ్నం స్తనే గుదే పృష్ఠే శంఖే మూర్ధని వర్జయేత్॥

కపాలము విరిగి కలియనప్పుడు, లలాటభాగము చూర్ణముగ నలిగినప్పుడు, స్తనములకు మధ్యభాగము, గుదము, వెన్ను, శంఖములు, శిరస్సు పైభాగములందున విరిగినయెడల విడిచిపెట్టవలెను.

సమ్యక్సంహితమప్యస్థి దుర్న్యాసాద్దుష్టబంధనాత్
సంక్షోభాద్వాపియద్గచ్ఛే ద్విక్రియాం తచ్చ వర్జయేత్॥

విరిగిన ఎముకను బాగుగ కలిపి కట్టబడనప్పటికి సరియగు స్థానములో నుంచక పోవుటవలనను, స్వస్థానమునందు బాగుగానుంచినను సరిగా బంధించక పోవుటవలనను, బంధమునందలి పోవుటవలను ఎముక వికృతిబొందును కాబట్టి అట్టివి చికిత్సించరాదు.

తరుణాస్థీని నమ్యంతే భిద్యంతే నలకాని తు
కపాలాని విభజ్యంతే స్ఫుటంతి రుచికానిచ॥

ముక్కు చెవులు కన్నులు గుదమునందుండు లేత ఎముకలు విరిగినపుడు వంగిపోవును. కాళ్ళు మొదలగు వాటియందుండునవి, రంధ్రములు గలిగి గొట్టమువలె నుండునవి విరిగిపోవును. మోకాళ్లు, పిరుదులు, అంసము, తాలు, శంఖ, శిరస్సునందుండునవి చితికిపోవును. వలయాస్థులు, ప్రక్కభాగములందు, పృష్ఠమందు, వక్షస్థలమందు, ఉదరమందు, పాయువు పందు, పాదమునందుండునవికూడ చితికిపోవును.

ఆదౌభగ్నం విదిత్వాతు సేచయే చ్ఛీతలంబునా
పంకేనాలేపనం కార్యం బంధనం చ కుశాన్వితమ్॥

విరిగిన వెంటనే ఆభాగమును చల్లని నీటితో తడుపవలెను. తరువాత బురద, జిగురు వగైరాలను గుడ్డపట్టించి నునుపుగానుండు బద్దలతో కట్టు కట్టవలెను.

అవనామితమున్నహ్యే దున్నతం చావపీడయేత్
ఆంచేదధః క్షిప్తమధోగతం చోపరివర్తయేత్॥

---

ఏడు ఎండల విత్తనములు ఎంతవరకైనను చూపును.

విరిగినభాగములు క్రిందికి వంగినయెడల పైకెత్తియు, పైకియెక్కిన వాటిని క్రిందికి లాగి సరిచేసియు, క్రిందికిజారిన పైకెత్రోసియు, వెనుకకు తిరిగినచో సరిగా పాటునకు త్రిప్పవలెను.

మధుకోదుంబరాశ్వత్థ కదంబ నిచులత్వచః
వంశసర్జార్జునానాం చ బంధార్థ ముపసంహరేత్
పటస్యోపరిబధ్నీ యాన్నగాఢం శిధిలం న చ॥

తరువాత ఇప్ప, మేడి, కడిమి, ప్రబ్బలి, వెదురు, సర్జవృట, మద్ది, వీటిపట్టలతో బాగుగా పై భాగమునవేసి గుడ్డకట్టినట్లు చుట్టి అంత బిగువుగ, అంత వదులుగ గాకుండ సాధారణముగ మెత్తని త్రాడు మొదలగువానిచే కట్టవలెను.

ప్రథమే వయసి త్వేవం మాసాత్సంధి స్థిరో భవేత్
మధ్యమే ద్విగుణాత్కాలాదంతిమే త్రిగుణాత్తథా॥

మొదటివయస్సున విరిగిన ఒకనెలలో ఎముకలు కలసిపోవును. మధ్యవయసు నందు రెండు నెలలలోను, అంత్యవయసులో మూడు నెలలలోను ఎముకలు కట్టుకొనును.

భగ్నసంధి మనావిద్ధమహీనాంగమనుల్బణం
సుఖచేష్టా ప్రచారం చ సమ్యక్సంధి తమాదిశేత్॥

ఎముక కట్టుకొనినయెడల పైకి పొడుచుకున్నట్లుగాక అవయవము చిన్నదిగాక, పెద్దదిగాక చాచుట, ముడుచుట, కదల్చుట, మొదలగు వాటియందు బాధలేక యుండినచో సరిగా ఎముక కట్టుకొనినదని తెలిసికొనవలెను.

"సుశ్రుత సంహిత"

## గాయములు (Wounds)

పశువులను మందలుమందలుగా నుంచునపుడు వానిలోనవి కలహించి కొమ్ములతో పొడుచుకొనునపుడును, పనిచేయునపుడును పశువుల పాదములకు గాని, తదితర భాగములకుగాని దెబ్బలు తగులునపుడును, గోతులలోనికి వంతెనలమీదనుంచి కాలువల లోనికి ఆకస్మికముగా పడినపుడును, రోడ్లమీద నడచుటవలనను, రైళ్ళవలనను, మోటారులవలనను, తదితర ప్రమాదములవలనను గాయములు (Wounds) ఏర్పడుచుండును.

ఎన్ని ఎండలు కొట్టిన అన్ని వగవులు ఆగును.

## గాయములలోని రకములు

పోటుగాయములు:—కత్తి, ముండ్లు మొదలగు కొనగానుండు పనిముట్లతో పశువులను పొడచుటవలన ఈ గాయము లేర్పడును.

శస్త్రగాయములు:—మిక్కిలి పదునుగల చేపాకత్తితోగాని, తదితర పదును గల ఆయుధములతోగాని చెదరనీయక చీల్చుట (గీచుట, నరుకుట) వలన ఈ గాయము లేర్పడును.

వ్రేటుగాయములు:—బిడాపులగల కత్తితో కొట్టుటవలనను, పెద్దపులి మొదలగు ఘోరజంతువులు గోళ్లతో రక్కుట (గ్రుచ్చుట, కొరుకుట) వలనను ఈ గాయము లేర్పడును.

నలుగుడు గాయములు.—పశువులు గోడలు గోతులలో అకస్మికముగా పడుట, గుద్దుకొనుట, రైళ్లక్రింద, మోటారుకార్లక్రింద పడుటవలన చర్మము క్రింది భాగములు నలుగునట్లు దెబ్బలు తగులుటవలన ఈ గాయము లేర్పడును.

గుండుగాయములు.—తుపాకి, పిస్తోలు మున్నగు ఆయుధములలో గుండువేసి పశువులను కొట్టుటచే ఈ గాయము లేర్పడును.

## గాయములనుండి రక్తమును పోనీయరాదు

గాయము తగిలిన వెంటనే రక్తమును పోనీయకుండ ముఖ్యముగా వైద్యుడుగాని, పశువు యజమానిగాని చూచుచుండవలెను. ఈ గాయమునకు వెంటనే తగు చికిత్స ఆలస్యములేకుండ చేయవలెను. ఇటువంటి చికిత్సలు చేయించుకొనుటకు రైతు ఆతురత పడుట యత్యవసరము. రైతుగాని, వైద్యుడుగాని అట్టి చికిత్సచేయుట ఆలస్యము చేసినచో రక్తమంతయు స్రవించి గాయముతగిలిన పశువునకు ప్రాణాపాయముకూడ కలుగును.

## రక్తనాళములు (Arteries)

పశువు దేహమునందు శుద్ధరక్తనాళములు, మలినరక్తనాళములు, సూక్ష్మ రక్తనాళములు మున్నగునవి యుండును. వీటికి ప్రమాదము వచ్చినప్పుడు రక్తము స్రవించును. రక్తముయొక్క రంగును, అది స్రవించు విధమును చూచి, అది యెక్కడ నుండి కారు రక్తమో తెలిసికొనవచ్చును. రక్త మెక్కువగా పోవుచున్నయెడల బలహీనత, ధనుర్వాతము కలిగి మరణము సంభవించును. గాయములలో రక్తము పేరుకొని గడ్డకట్టును. నెత్తురుకారకుండ ఆపుటకు ప్రకృతిసిద్ధమైన ఉపాయములలోనిది యొకటి. కనుక అట్లు పేరుకొనియుండు రక్తమును ఏకారణముచేతనైన కదుపరాదు.

---

అయినో పనినో అన్నారు.

## శుద్ధ రక్తనాళములనుండి రక్తము కారుట

## (Arterial Bleeding)

ఈ రక్తనాళములనుండి స్రవించురక్తము కాంతికలిగి ఎరుపురంగుగా నుండును. లోపల నాడులు కొట్టుకొనుటవలన రక్తము కొంచె మురవడిగా వచ్చుచుండును. ఇట్లు పశువు రక్తనాళములనుండి రక్తము కారుచున్నట్లు తెలిసికొనినతరువాత వెంటనే చికిత్సచేయుటకు ప్రారంభించవలెను. ఈ నాళములు (ధమనులు) పశువు దేహమునం దంతట నుండును. కనుక వాటిసలములనుబట్టి చికిత్సలు ప్రత్యేకముగానుండును. ధమనుల కపాయము కలిగినపుడు మొదట రక్తము నాపుజేయుటకు బొటనవ్రేలితో (Digital Pressure) నొక్కవలెను. ధమనులను ఎక్కడ నొక్కిన రక్త మాగునో తెలిసికొనవలెను. ముఖ్యముగా ఈరక్తనాళములు పశువుదేహములో ఎట్లు వ్యాపించి యున్నవో తెలిసికొనుట అత్యవసరము.

రక్తము ప్రవహించు భాగములను పరీక్షించుటకుముందు వైద్యుడు చేతులను శుద్ధముగా నుండునట్లు చూచుకొనవలెను. ఎముకలు విరిగినప్పుడు, పేళ్లు గాజుముక్కలు గాయములలో నున్నప్పుడు మాత్రము పెద్దశుద్ధరక్తనాళమును పట్కారులతో నొక్కవలెను. తల, నొసలు, కంఠము, జెబ్బ, పొదుగు, తొడ, నాలుక, చెవి మున్నగు భాగములకు దెబ్బలుతగిలి, ఆకస్మికముగా రక్తము స్రవించునప్పుడు చాల జాగ్రత్తగా చికిత్సలు చేయవలెను. పైనచెప్పిన భాగములకు గాయములు తగిలినయెడల పైకియెత్తి యుంచుము. ఇట్లుచేసినయెడల, ఆ భాగమందలి రక్తము కొంతవరకు తగ్గును. రక్తము స్రవించు భాగమందు వ్రేళ్లను మోపిగాని, తడిలేకుండ పరిశుభ్రముగానుండు పీచు, దూది, పొడిగుడ్డ మున్నగునవి గాయముపైనుంచిగాని నొక్కవలెను. ఇట్లు చేయుటవలన రక్తముఆగును. అంతకు తగ్గనిచో గాయము ప్రమాదముగా నున్నదని సందేహము లోచినయెడల మీఫిర్కా ఆయుర్వేద పశువైద్యాచార్యునిగాని మీ తాలూకా వెటరినరీ డాక్టరునుగాని పిలిపించి చికిత్స చేయించుము.

## మలినరక్తనాళములనుండ రక్తముకారుట

## (Venous Bleeding)

గాయములనుండి రక్తము మలినముగా స్రవించుచున్న యెడల సిరలకు గాయము తగిలినదని తెలిసికొనవలెను. వీటినుండ చెడునెత్తురు తిన్నగా ప్రవహించుచుండును. ఈ రక్తనాళములు తెగినభాగములు వాపుదలకొంది యుండును. వీటిని గట్టిగా బిగించి కట్టు కట్టవలెను.

---

వెద అదును అయినప్పుడు వెలుగులోనయినా పోయవలెను.

## సూక్ష్మనాళములనుండి రక్తముకారుట

## (Capillary Bleeding)

ఇవి పశుదేహమునం దంతటను వలయల్లికలవలె నుండును. ఇవి తెగుదలనొంది నప్పుడు రక్తము చిమ్మచున్నుండును. వీటిని చేతికొటనప్రేలితో నొక్కిన ఆగిపోవును.

## ముక్కునుండి రక్తముకారుట (Nasal Bleeding)

పశువుముక్కురంధ్రములనుండి అనేక కారణములవలన రక్తము ప్రవించవచ్చును. అట్టి సమయములందు జాగ్రత్తగా పశువును పరీక్షించి వేడిజేయుటవలన వచ్చుచున్నదో లేక దెబ్బతగిలి వచ్చుచున్నదో విచారించవలెను. తదుపరి చికిత్స చేయవలెను.

## గాయములనుగూర్చి ముఖ్యవిషయములు

1 గాయములు తగిలినవెంటనే తగు చికిత్స చేయనిచో ఈగలవలన గాయము పెద్దదై చాలప్రమాదము కలిగించును.

2 గాయములందుండు ఇతరపదార్థములను ముఖ్యముగా తొలగించి శుద్ధము చేయవలెను.

3 ఈ శస్త్రవైద్యమును గ్రంథములో చెప్పిన లోషన్సు, ఆంగ్ల, ఆయుర్వేద, హోమియోపతి చికిత్సలు చేయుదురు.

4 శుద్ధజలముతో గాయములను కడిగి శుద్ధముచేయవలెను.

5 గాయములో బొగ్గుపొడుముగాని, ఆ పొడిలో తదితర చూర్ణములుగాని కలిపి వాడినవెంటనే గారపట్టును.

6 గాయములు తగిలినప్పుడు పశువునకు విశ్రాంతి నీయవలెను. పనిపాటులు చేయించరాదు.

7 గాయములు చిన్నవైనయెడల అనగా లోతులేనప్పుడు వాటిఅంచులనుదగ్గరగా పట్టుకొనజాలిన బంకవంటి పదార్థములను గుడ్డపై పట్టించి గాయముమీద వేయవలెను.

8 గాయము లోతుగా తెగియున్నప్పుడు ధనుర్వాతము రాకుండ కాపాడవలెను.

## పోటుగాయములు

పశువును కత్తితోగాని, తదితరపనిముట్లతోగాని, చర్మమునందుగాని, కండరము లందుగాని, పొడుచుటచే ఆ భాగమంతయు ఆరంభములో రక్తమిళితమైయుండును. అట్టి సమయమునందు ఇదివరకు చెప్పినలోషన్సుతో ప్రతిదినము కడుగుచు, గాయములకు తగు ఔషధములు వేయుచు, కట్టు కట్టుచుండవలెను. లోతుగా తెగినయెడల అంచులు

---

అదునున పొదిలో చల్లినా పండును.

కట్టవలసినయెడల మీతాలూకా వెటరినరీ ఆస్పత్రికి తీసికొనిపోవుట మంచిది. లేక మీఫిర్కా ఆయుర్వేద పశువులడాక్టరును పిలిపించి చికిత్స చేయించుడు. గాయమువేసిన కత్తి త్రుప్పుపడినదో లేక దాని ఆకారమెట్లున్నదో చూడవలెను. లేనిచో గాయమును మాన్పుట చాలకష్టము.

## శస్త్రగాయములు

ఈ గాయములు చాల ప్రమాదము గలిగించును. ఎందుచేతనన, చర్మమును కండరములను చీల్చుకొనిలోపలికి పోవుటవలన రక్తనాళములు తెగి పశువులకు ప్రాణాపాయము గలుగును. గాన ఈ గాయములు తగిలిన వెంటనే దుమ్ము లేకుండ చూడవలెను. లేనిచో ధనుర్వాతము సోకి చనిపోవును. కాబట్టి జాగ్రత్తగా చూడుము. లోతు గాయముగా నుండి విస్తరించి చర్మపు కండలు వ్రేలాడుచున్నపుడు అంచులను కుట్టి ప్రతి దినము చికిత్స చేయవలెను. మీ తాలూకా పశువుల ఆస్పత్రికి తీసికొని వెళ్ళుట మంచిది. పశువును తీసికొనివెళ్ళుటకు వీలులేనియెడల ఈ గ్రంథములోని చికిత్సలు చేయుడు.

## పోటు గాయములు

చేతికఱ్ఱలతో కొట్టినపుడు చర్మము పగిలి రక్తము కారును. ఇట్టి సమయము అందు. అంతగా ప్రమాదముండదు. పెద్దపులి మున్నగు జంతువులు కరచినప్పుడు లోతు గాయములైనయెడల చాల అపాయము కలుగును. గాన యిట్టి సమయములందు ఏ భాగముపైన కాటువేసినది, ఎంతవరకు ఆభాగము చెడినది వెంటనే కనుగొని చికిత్స చేయవలెను. అట్లు చేయనియెడల వాతము గ్రమ్మి చనిపోవును.

## కాటు గాయములు

ఇదివరకు చెప్పిన గాయములకంటె ఈ కాటుగాయములు చాల ప్రమాదములు కలిగించును. ఎందుచేతనన, విషసంబంధమైన వస్తువులు శరీరములో ప్రవేశించుటవలన ఆభాగమంతయు చెడిపోయి ప్రమాదము పుట్టును. కాబట్టి జాగ్రత్తగా పరిశీలించి చికిత్స చేయుట మంచిది.

## కట్టుకట్టుట (Bandages)

పశువులకు అపత్సమయమున సమీపమందు దొరకిన వస్తువుల సహయోగము లోనికి తెచ్చి కట్లు గట్టవలయును. అట్టి సమయములందు గాయములకు గుడ్డపీలికలు, నూలుబట్ట పీలికలు, చేతిరుమాళ్ళు, ఫ్లానలుగుడ్డపేలికలు, నారగుడ్డ పీలికలు మొదలగునవి పనికివచ్చును. కట్లు కట్టుటలో పలురకములు గలవు. ఆయుర్వేద పశువులడాక్టరు కత్తెర, పట్కారు, గుడ్డపీలికలు, తదితర పనిముట్లు మున్నగునవి దగ్గర నుంచుకొన

---

వలెను. వీనిని వాడుటకు ముందు పనిముట్లను శుభ్రముగా చేయవలెను. ఇంకను నీరు, దూది, చేతులు తుడుచుకొనుటకు ఒక తుండుగుడ్డ యుండు టవసరము.

ముఖ్యముగా చేతులు కడుగుకొనకుండ కట్లను విప్పరాదు. గాయములలో గాలి, దుమ్ము, పురుగులు మున్నగునవి దూరి బాధ కలిగింపకుండ కట్లు గాయములను సంరక్షించును. గాయములోనుండి రక్తము కారునప్పుడు దానిని నొక్కి అదిమిపట్టిన గాని రక్తప్రవాహ మాగదు. అట్టి సమయములో గాయము చుట్టును కట్టుగుడ్డను చుట్టి, గాయమును నొక్కి రక్తము నాపుజేయవచ్చును. కట్లు కండరముల (Muscles) కు శ్రమ నీయకుండ నుండును. గాయముపైన కట్టుకట్టి అంతటను వ్యాపించునట్లును, గాలి గాయములకు సోకకుండునట్లును సమానముగా కట్టవలయును. కట్టకు చలువగుడ్డగాని, కోరాగుడ్డనుగాని యుపయోగించుట మంచిది. ఆ గుడ్డను మందునీటిలో నానవేసి ఆరబెట్టి అంచులు చింపవలయును. ఈ కట్టుగుడ్డలయొక్క పొడవు వెడల్పు గాయములకు తగినంతగా చింపి వాడుకొనవలయును. కట్టుముడతలు ముడతలు పడకుండ చక్కగా కట్టవలెను. అపాయపు అవయవములుకదలినయెడల బద్దలు చేర్చి కట్టవలయును. అందువలన అపాయపు అవయవములను కదలనీయవు. అపాయములు సంభవించినప్పుడు అన్ని భాగములకు కట్లు కట్టుటకు వీలుండదు. కాబట్టి ఉపాయముతో కట్టవలెను.

గాయముపైనున్న కట్లు అంటుకొని యున్నచో రావిచెక్క, తుమ్మచెక్క మున్నగు వగరు వేడినీటితోగాని, తదితర లోషన్లతోగాని తడిపి, నెమ్మదిగాతీసి దూరముగా పారవేయవలెను. లేనిచో పశువు ఆ రసిగుడ్డలను తినును. తరువాత చీము, నెత్తురు రసియున్నయెడల హైడ్రాజన్ పెరాక్సైడ్తో శుభ్రముచేసి తరువాత మందు వేయవలెను. దుర్మాంసము పెరిగినయెడల మైలతుప్పు ముక్కతో ఆ దుర్మాంసమంతయు పోవువరకు తోముచుండవలయును. ముఖ్యముగా గాయములకు గాలి నెంతమాత్రము సోకనీయరాదు. ఎంత చిన్న గాయమైనను నిర్లక్ష్యము చేసినచో ధనుర్వాతము (Tetanus) సోకి పశువును బాధపెట్టును.

## కుట్లువేయుట (Sutures)

శస్త్రగాయములు, పోటుగాయములు, కంటుగాయములు తగిలి ప్రమాదములు కలిగినపుడు అంచులను చేర్చి కుట్లు వేయవలసియుండును. ఇట్టి సమయములందు గాయమున కుపయోగించు లోషన్సు, పనిముట్లు దగ్గర నుంచుకొనవలెను. ఏభాగముయొక్క అవయవముమీద గాయముకలిగినదో, అది లోతుగా నున్నదో, ముక్కముక్కలుగా చీలినదో, రక్తనాళములకు ప్రమాదమేమైన కలిగినదో, ధనుర్వాతము వచ్చుటకు సూచనలేమైన నున్నవో, ఏయే గాయమునకు ఏయే సూదిలో కుట్టిన సరిపోవునో మున్నగు విషయములన్నియు పరిశీలించి తదుపరి కుట్టవలెను. గాయము చాల వెడల్పుగ,

అదుపుతప్పిన పయిరున్ను ముసలివాని బిడ్డలు ఒకటి.

లోతుగ, పొడుగుగనుండినయెడల దూదినిగాని పీచుగాని లోపలదూర్చి అంచులకు కుట్ట వలెను. కుట్టు దారములకు నరములు, సిల్కుదారములు, గట్టి నూలుదారములు ఉపయో గించవలెను. లేనిచో తెగిపోవును. దారములు, శస్త్రపనిముట్లు కావలసిన ఇంగ్లీషు మందుల షాపులలో దొరకును. కుట్టుకుట్టవలసినపుడు వెటరినరీ డాక్టర్లకుగాని, ఆయుర్వేద పశువైద్యాచార్యులకుగాని చూపించుట మంచిది.

## నలుగుడుగాయములు (Bruises)

ఈ గాయములు కలిగినపుడు చర్మము పైభాగమునకు భంగము కలుగును. కాని లోపలనుండు రక్తనాళములు చితికి బాగుగా నలిగిన ప్రదేశము నల్లబడును. రెండు మూడు దినము లైనతరువాత చుట్టునుండు చర్మము పసుపురంగుగాగాని, ఎరుపురంగుగా గాని, నలుపురంగుగాగాని మారును. నలిగిన చోటనుండు రక్తము అటునిటూ చెదరును. అందువలన వాచుటయు, నల్లబడుటయు తటస్థించును. అవయవములు ఎక్కువగా నలిగినయెడల ఆయా భాగములను వేడినీటిలో గుడ్డముంచి పిడిచి కాచుటమంచిది. దెబ్బలుతగిలిన గాయములును, శస్త్రచికిత్సచేసిన గాయములును కొంతకాలమువరకు మానవు. ఈ గాయములు కొంచెముగనో, గొప్పగనో వాపుగలిగి యుండును. ఈ వాపులకు వేడినీటికాపులు తీయవలెను. లేదా అవిసెగింజలపిండియైన కట్టవలెను.

## గాయములకు చికిత్స

సామాన్యముగా అన్ని గాయములకు గట్టిగా కట్టుకట్టినయెడల రక్తము స్రవించుట ఆగును. గాయములవద్ద వెంట్రుకలు కత్తిరించినయెడల త్వరగామానును. గాయములకు వెంటనే చికిత్సచేయనియెడల ఈగలు మొదలగునవి వ్రాలును. అందువలన ఈపిపట్టును. ఈ యీపి వెంటనే పురుగులగును. గాయములందు పురుగులుపడినచో అచ్చటిమాంసము నవి తినుటచే గాయములు త్వరగామానును. కాబట్టి పురుగులుపడినయెడల పట్కారుతో గాని, శ్రావణముతోగాని తీసివేయవలెను. లేక చేతిచూపుడువ్రేలును గాయములోపలకు పోనిచ్చి పురుగులనన్నిటిని తీసివేయవలెను. తరువాత పుండ్లకు వాడు మందులను వాడ వలెను.

## ఆయుర్వేద (Native) వైద్యము

మంచినూనె 15 తులములు, వేపనూనె 8 తులములు, గాడిదగడపాకుపసరు అర్ధ సేరు నవటాకు, సీమగగ్గిలము 4 తులములు, ముర్దారుసింగు 2 తులములు, ఏకతిల్లిపా యలు అర్ధసేరునవటాకు

తెచ్చి ఈమూడువస్తువులు నూరి పైవానిలోకలిపి కాచి గాయములకు పట్టించ వలెను. ముందు గాయమును తుమ్మచెక్క రావిచెక్క లేక చింతాకు వేపాకువేసి కాచిననీటితో కడిగి కరువాత మందుల నుపయోగించవలెను.

---

ముదురునవేసిన పయిరు మునుమున పుట్టిన కొడుకు.

లేక కుప్పింటచెట్టు సమూల చూర్ణముతో తగినంత విభూతి కలిపివేసిన గాయములు మానును.

లేక నలిగిన గాయములకు నరమూత్రము వాడిన పనిచేయును.

లేక మునగాకు, వస, నూరి ఉడికించి వేసిన తగ్గును.

వరా:—ఆయుర్వేద చికిత్స లనేకరకములుగలవు. పశుచికిత్సాసారమను గ్రంథములో చూచిన తెలియును.

## వైరూప్య (Allopathic) వైద్యము

### గాయముల కడుగు లోషన్సు

ఫినైల్ 1 భాగము, నీరు 100 భాగములు.

లేక కార్బాలిక్ ఆసిడ్ 2 డ్రాములు, వేడినీరు సేరు.

లేక పొటాషియం పర్మాంగనేట్ 10 గ్రెయిన్సు, నీరు 2 సేర్లు.

లేక ఆలం 1 తులం, నీరు 2 సేర్లు.

పైన చెప్పిన లోషన్సు తయారుచేసి సీసాలోనుంచి బిరడాలు పెట్టి అవసరమున్నపుడు ఉపయోగించవలయును. రావిచెక్క, తుమ్మచెక్క నీటిలో నానవేసి కాచి ఉపయోగించుము. అవుసరమున్నపుడు మాత్రమే తయారుచేసికొనవలెను. నిలువయున్న చెడును.

### తైలములు, మలాములు, చూర్ణములు

పుండ్లకు, గాయములకు అప్పుడప్పుడు టింక్చర్ అయోడిన్ రాసిన తగ్గును.

కార్బాలిక్ ఆసిడ్ $\frac{1}{2}$ అవున్సు, వ్యాసలైను 8 అవున్సులు కలిపి అన్ని గాయములకు పట్టించవచ్చును.

లేక బోరికుఆసిడ్ 1 భాగము, జింకుఆక్సైడ్ $\frac{1}{4}$ భాగము ఓలియంపేసెప్ $\frac{1}{8}$ భాగము, క్రియోసోట్ $\frac{1}{8}$ భాగము, కొబ్బరినూనె 8భాగములు కలిపి తయారుచేసిన అన్ని గాయములకు పుండ్లకు పనిచేయును.

లేక టర్పంటైన్ 1 భాగము, మంచినూనె 4 భాగములు కలిపి వాడవచ్చును.

పుండ్లను, గాయములను శుభ్రము చేయుటకు హైడ్రాజన్ పరాక్సైడ్ను ఉపయోగించిన మురికిని తీసివేయును.

లేక క్యాంఫర్, బోరాక్సు, జింకాక్సైడ్, పంచదార సమానభాగములు కలిపి అప్పుడప్పుడు పుండ్లను గాయములకు పట్టించవలయును.

లేక బోరాక్సు, ఛార్కోల్, ఆలం, కాపర్‌సల్ఫేట్ సమానభాగములు కలిపి అప్పుడప్పుడు జల్లుచుండవలెను.

## వ్రణములు (Abscess)

ఇదివరకు చెప్పినగాయములకు తగిన చికిత్సలు చేయక పోవుటచే సూక్ష్మజీవులు ప్రవేశించును. పుండుపడును. ఈపుండ్లను జాగ్రత్తగా కాపాడవలయును. ఇంకను ఈగలు, దోమలు మొదలగునవి పుండ్లమీద వ్రాలి గ్రుడ్లుపెట్టును. గాలిసోకుటవలన ఆగ్రుడ్లనుండి తెల్లని దారములవంటి పురుగులు బయలుదేరును. గాయములలో పురుగులు పడిన పశువు పనిచేయుటకు పనికిరాదు. కాబట్టి ప్రతిరైతు తగినశ్రద్ధ తీసికొనవలెనయును. అచ్చట మాంసము క్రుళ్ళి ఆభాగమంతయు వాచి అపాయము కలుగును. దుర్వాయువులు చేరుటచే, చెడు ఆహారములు మేయుటచే, అతివేడి యుండుటచే, ధాతుశక్తి తగినంత లేకపోవుటచే కురుపులు, గడ్డలు మొదలగునవి యేర్పడును. ఇంకను దేహమునందెచ్చటనైనను కలుగవచ్చును. ఎఱుపువర్ణము గలవి త్వరగా మానును. ఇవి పశువుశరీరమువిూద వ్యాపించినతోడనే తగినశ్రద్ధ తీసికొనకపోయినచో శరీరమంతయు వ్యాపించును. దేహసౌఖ్యము చెడిపోవును. ఆప్రదేశమందలి మాంసము క్రుళ్ళిపోవ నారంభించును. మరికొన్ని కురుపులు క్రమముగా పెద్దవై అంచుయేర్పడి మిక్కిలి యెఱ్ఱగానుండి రసి కారుచుండును. ఈరసి కొన్నిటికి దుర్వాసన గలిగియుండుటయు, మరికొన్నిటికి లేకుండుటయు గలదు. బలహీనములగు పశువులకివి తరచుగా లేచి బాధపెట్టుచుండును. సామాన్యముగా కురుపులన్నియు ఒంటరిగాగాని, అనేకములుగా గాని లేచుటయుకలదు. ఇవి బటానిగింజంత పరిమాణము మొదలు కోడిగ్రుడ్డు ఆకారమువరకును అంతకంటె నధికముగాకూడ నుండవచ్చును. కొన్ని చీము రక్తము చేరకయే అంతరించిపోవును.

## పిండికట్లు (Poultices)

పశువులకు కలుగు అనేకరోగములకు పిండికట్లు కట్టుదురు. ఇవి కట్టుటవలన మెత్తబడు స్వభావ ముండును. పశువులకు కలుగువాపులు, నెత్తురుగడ్డలు, గూటిగడ్డలు మొదలగు వానికి పిండికట్లు కట్టినచో నొప్పితగ్గి త్వరలో కురుపు తేలును. జొన్నపిండి, వరిపిండి, అవిసెగింజలపిండి, గోధుమతవుడు మున్నగువానితో వేడినీళ్లుచేర్చి పిసికి ముద్దగాచేర్చి పలుచనిబట్టలో వేసి కట్టుట మంచిది. దుర్వాసనవేయు కురుపులకు గాయములకు మసిబొగ్గుపొడి, పిండి కలిపి కట్టుటమంచిది. పశువు సహించగలిగినంత వేడిగానుండుపిండిని వాపులమీదగాని, తదితరభాగముల మీదగాని వేసి పైన ఆకుగాని, దళ

ముందువేసిన పైరు మేలు.

సరియగు కౌగిలముగాని పెట్టి కంబళిగుడ్డతో కదలకుండునట్లు గట్టిగా కట్టవలయును; ప్రతి మూడు నాలుగు గంటలకు తీసివేసి క్రొత్తకట్టు కట్టవలెను. క్రొత్తకట్టు సిద్ధముగువరకు ప్రాతకట్టు విప్పరాదు. పశువుయొక్క బాధనుబట్టి కట్టు బిగింపవలయును. ఆవిసెగింజలు నూరి ఉడికించి కట్టవలెను. వాపు మాంచును. గడ్డను మెత్తపరచును.

## వత్తు లెక్కించుట (Setons)

పశువులకుగలుగు వ్రణములు, గడ్డలు, కంతులు మొదలగునవి పగిలి నెమ్మదించక పోయినచో ఈ వత్తులను ఎక్కించుదురు. ఇటువంటిపనులు అనుభవముగలవారిచే చేయించుట మంచిది, బద్దపాటుగల సూదితో పశువుల గాయములలో దూర్చబడెడు నును పైన గుడ్డపీలికలు దారములు మొదలగువానిని వత్తులందురు. ఈ వత్తులెక్కించుట సులభమైన పని. సూదిరంధ్రమునకు దారముగాని, గుడ్డపీలిక దారమువలె చేసిగాని యుపయోగించు కొన వలయును. తరువాత చర్మమును కత్తితో చీల్చి ఆ గాయముద్వారా ఎంతదూరము వత్తి పోవలయునో అంతవరకు సూదినిఎక్కించి ఆ కొనయందుగూడ చర్మమునుచీల్చి సూదినిలాగి దారమును అచ్చట నెమ్మదిగా నిలుపవలయును. ఆ దారపుకొనలకు జీలుగ బెండు కట్టవలెను. లేదా ప్రత్యేకముగా ముడులు వేయవలయును. వత్తులు ఎక్కించుటకు ముందు కొకమందును వాడుట మంచిది. ఆకొకమందులు పొక్కుమందులు, ఎంత పని చేయునో ఈవత్తు లెక్కించుటవలనకూడా అంత ప్రయోజన ముండును. ప్రతి దినము వత్తి నెమ్మదిగా క్రిందికి జారదీసి పుండును శుభ్రముగా పైచెప్పిన లోషన్సుతో కడిగి మరల ఆవత్తి ఎక్కించుచుండవలెను. అగత్యమైన యెడల క్రొత్తవత్తి నెక్కింపవచ్చును. ఇటువంటి పనులు వ్రణచికిత్సయందు అనుభవము గలవారిచే చేయింపవలయును.

## ఆయుర్వేద (Native) వైద్యము

కవిరి పొడిలో తగినంత మాచికాయపొడి కలిపివేసిన తగ్గును,

లేక చింతబెరడు మసిలో ఆముదపు పలుకులు సమానముగా వేసి నూరి వేసిన తగ్గును.

లేక పటిక, కవిరి సమానభాగములు తీసికొని రెట్టింపు మసిబొగ్గు కలిపివేసిన పగిలి రసికారుచుండు గాయములకు పట్టించిన తగ్గును.

లేక కర్పూరము, వెలిగారము, ఒకభాగమున్ను, విభూతి రెండుభాగములున్ను కలిపి గాయములకు, పుండ్లకు పట్టించిన తగ్గును.

లేక గానుగచెక్క పొడి, తుమ్మచెక్క పొడి సమాన భాగములు కలిపి వేసిన తగ్గును.

---

విత్తులు చల్లుటకు విసుకగూడదు.

## ఆంగ్లేయ (Allopathic) వైద్యము

జింకుఆక్సైడ్ 2 భాగములు, బోరికుఆసిడ్ 2 భాగములు, అయొడోఫారము $\frac{1}{20}$ భాగము, యూకలిప్టస్ ఆయిల్ $\frac{1}{100}$ భాగము, కొబ్బరినూనె 8 లేక 10 భాగములు కలిపి సమస్తగా నుపుపుండ్లను, వ్రణములు చితికినప్పుడు దీనిని వాడిన బాగుగా పనిచేయును.

లేక కార్బాలిక్ ఆసిడ్ 1 ఔన్సు, గ్లిసరీన్ 6 ఔన్సులు కలిపి ఆయాభాగములకు వాడిన బాగుగా పనిచేయును,

లేక క్రియోసోట్ 1 డ్రాము, వ్యాసులైన్ 1 ఔన్సు, కలిపి రాసిన తగ్గును.

## కణతులు (Tumours)

పశువు శరీరమున నేభాగమందైనను వాపు కలుగును. ఈ వాపు పొంగి మెత్తగా గాని, గట్టిగ రాయివలెగాని యుండును. దీనినే కంతి యందురు. ఇది పశువులకు దెబ్బతగులుట వలనగాని, చలిగాలి సోకుటవలనగాని, బలహీనము వలనగాని, పిల్లిపెసర మున్నగు వాతవస్తువులు మేపుటవలనగాని, చిరుకప్పలు ఎక్కువగానుండు చెరువులలోని గుంటలలోని నీరు ఎక్కువగా త్రాగుటవలనగాని పుట్టుచుండును.

కంతియొక్క అడుగుభాగపు చర్మముక్రింద మాంసము మందగించి క్రమముగా వాచియుండును. ఈ కాయలు పొట్లుపడి బురబుర లాడుచు నీరుండునట్లు కనబడిన యెడల మెత్తని కంతియనియు, వేలితో ఆకాయపై నొక్కినయెడల అణగక నిరుసుగా నున్నపుడు గట్టి కంతి యనియు తెలిసికొనవలెను.

ఈ కంతులు ముఖ్యముగా పశువుల మెడమీదను, ప్రక్కలను, అల్లుమీదను, జెబ్బలమీదను, మూత్రకోశ భాగములందును లేచును. జెబ్బలమీదను, గూళ్ళమీదను లేచు కంతులు త్వరగా మానవు. పశువును చాల బాధించును. కంతి పుట్టగనే రైతులు దానిమీద కాల్చుదురు. ఇది చాల పొరబాటు. ఎందుచేతనన అచ్చటి మాంసమంతయు వేడివలన గడ్డకట్టి ఎన్ని మందులు వేసినను మానదు. ఇంకను అచ్చటి రక్తనాళములు కూడ చెడిపోవును. మెత్తని కంతులను శస్త్రము జేసినయెడల త్వరగా నెమ్మదియగును. రైతులు ఆతురతపడి, కంతి పుట్టినదనగానే కాల్చుట తగదు. ఏకంతి ఏ కారణమువలన పుట్టినదో, కాల్చుటవలన తగ్గునా? లేక ఏమైనా పూతమందులు వేసిన తగ్గునా? లేక శస్త్రముచేసిన తగ్గునా? లేక యేమయిన పసరులు, పట్టీలు వేసిన తగ్గునా మున్నగునవి విచారించి చికిత్స చేయవలెను. కొన్ని పశువుల దొడ్లలో అన్ని పశువులకు ఒకేసారి శరీరముపైన కంతులు పుట్టుచుండును. ఇట్టి సమయములందు జాగ్రతగా పరీక్షించవలెను. చెడు నీటిని త్రాగుటవలననా, లేక వరుసగా ఆ దొడ్డిలో

---

దండిపైరు కాదు.

నున్న పశువులన్నియు పిల్లిపెసర యున్నగునవి మిక్కుటముగా తినుటవలన రక్తము చెడి వచ్చినవాయని గుర్తెఱుంగవలయును. తరువాత చికిత్సలు చేసికొనవచ్చును. నాసటిమీద పుట్టిన కంతి వలన పశువు మరణించును.

## అఱ్ఱు కణతులు (Yoke Tumours)

కంతికి ఆరంభములో పశువు మెడగాడి గీరుకొనినట్లు అగును. కాడి రాపిడివలన దుమ్ము చర్మములోనికి పోయి కంతి పుట్టించును. కనుక పశువుల మూపుమీద గాయము నను పుండునట్లు కాడిని రెండు ప్రక్కల సమానముగ నుండునట్లు కట్టవలెను. ఒకవైపున బరువు తక్కువగను, మరియొకవైపున బరువు ఎక్కువగను, నుంచరాదు. కాడికి మన్ను మొదలగు పదార్థము లేమియు లేకుండ శుభ్రముగ నుంచవలెను. ఎద్దుమూపు మీద కూడ మలినముండరాదు. ఇట్లుంచని యెడల కణతులు పుట్టుచుండును. కంతిపుట్టిన పశువుచే నెట్టి పనిని చేయించక వానికి పూర్తిగ విశ్రాంతినియ్యవలయును. గాయము పూర్తిగా మానువరకు పనిచేయింపరాదు. లేదా కాడికట్టవలసిన అవుసరము లేని పనియేదయిన అనగా దుప్పలుమూర్చుట మొదలగు పనులలో పెట్టవలెను. కాడి మెడ మీద నున్నంతకాలము పుండ్లుపడుచుండును. ఈ కంతులు ముదిరినయెడల చాల ప్రమాదము కలిగించును. తుదకు కంతి యంతయు మూడగానగును. అప్పుడు శస్త్రముచేసినను లాభములేదు. కాబట్టి అఱ్ఱుకణుతులను జాగ్రత్తగా చూచుచుండవలెను.

## గంటిఅఱ్ఱు

మెడమీద కాడినిలుపు ప్రదేశమున మంట, నొప్పితో గూడిన దద్దురవలనను, అక్కడనుండు వెంట్రుకలు రాలిపోవుట వలనను, ఈజబ్బు ప్రారంభమైనదని తెలిసికొనవలెను. అప్పుడు జంతువుతో పనిచేయింపరాదు. పుండుపడిన పిమ్మట పశువుతో పనిచేయించినయెడల అపుడు వాచి పెద్దదై యెక్కువబాధ పెట్టును. క్రొత్తగా కలిపిన దూడలకు ఈకంతులు లెక్కువగా పుట్టుచుండును. కొన్నిటికి కంతిపుట్టనుండగనే అగ్ర భాగము వాచి చర్మము చిట్లి మంటపుట్టుచుండును. మరికొన్నిటికి చినచిన్న కాయలవలె పుట్టి కాడితగిలినప్పుడెల్ల పశువు బాధకోర్వజాలక యుండును. సామాన్యముగా గంటిఅఱ్ఱు మానుట కష్టము. శస్త్రము చేయవలసి యుండును.

## కణతులకు దారపుకట్లు (Ligatures)

చిన్నచిన్న కణతులు పుట్టినపుడు అనగా వెలగకాయంత, నారింజకాయంత పరిమాణముగా నున్నపుడు పట్టు, పురికొస, నూలు మున్నగువానితో చేయ బడిన దారములతో ఆకంతుల మొదటిభాగమునకు గట్టిగా చుట్టిన సునాయాసముగా తగ్గును. ఇట్లుకట్టిన యెడల కంతిలో నుండు రక్తపునాడులు బంధించును. అందువలన కంతిపరిమాణము తగ్గిక్రమేపి నెమ్మదించును. ఇంకను రక్తనాడులను బంధించుటకును, విషపురుగులు కఱచిన భాగముల చుట్టు కట్టివేయుటకును, ఈ దారములు మిగుల లాభకరములు.

---

ఒత్తు పొత్తు చెరుచును.

## చికిత్స

కణతులు వెటరినరీ డాక్టరుగారితో గాని, ఆయుర్వేద పశువైద్యాచార్యునితో గాని శస్త్రచికిత్స చేయించుట మంచిది. ముఖ్యముగా గట్టిగానుండి చాలాకాలము వరకున్న కణతులను తప్పక కోసివేయవలెను. అయినను అట్లుచేయుటకు వీలుకాని యెడల పొక్కు (కోత) మందులుగాని, పలుగురాళ్ళు అంటించిగాని, కారపు (మంట) మందులు రుద్దించుటచేతగాని నెమ్మదికావచ్చును. మరికొందరు కంతిచుట్టు గట్టిదారము చుట్టి ముడివేసి వదలిపెట్టుదురు. కొన్నాళ్లకు ఆకంతి తెగిపోవుటగలదు. ఈ కంతులను శస్త్రముచేయవలసి నపుడు దాని సమీపమున నున్న రక్తనాళముల దగ్గర శస్త్రచికిత్స చేయుటకంటె మరియొక విధముగా చికిత్సచేయుట మంచిది. కొందరు పశువైద్యులు కణతులను చీల్చి ఎఱ్ఱకడ్డీనికాల్చి లోపలికి పొడిచెదరు. ఇదిచాల అపాయము. వెంటనే పశువు చనిపోవును.

గుంటకరాకు }
గాలిమిడాకు } సమ భాగములు
గాడిద గడపాకు }

ఆముదములో వేయించి 3, 4 కట్లు కట్టవలెను.

కొట్టుపసుపు 2 తు, కస్తూరి పసుపు 2తు, సజ్జ 1 తు, గంధకము 1తు, మణిశిల 1 తు, మిరపకాయలు 1 తు, ఆవుకొయ్యి పావుశేరు, ఆముదము పావుశేరు, ఆవనూనె పావుశేరు.

ఈ వస్తువులన్నియు కలిపి మెత్తగా నూరి నలగ్రొక్కి ఒక పాతకుండలో పెట్టి వారము దినములవరకు ఎండలో నుంచి తీసి పశువుల కణుతులకు మూడు దినములు రాచి నాల్గవనాడు వేడి నీటితో కడుగవలెను. ఇట్లు చేసినచో కణుతులు కరగిపోవును.

లేక కటకరోహిణి 4 తు, కోష్టు 4 తు, వెలిగారము 4 తు, ఆవాలు 16 తు, కొంచము వెచ్చచేసి మెత్తగా పొడిచేసి జొన్నపిండితో కలిపి నాలుగు దినములు కట్టిన యెడల యీజాడ్యము కుదురును.

లేక గంగ సిందూరము 1 తు, రససిందూరము 1 తు, ఇంగిలీకము 1తు, రస కర్పూరము 1 తు, చిత్రమూలం 1 తు, మైనము 1 తు, తెచ్చి పైన వస్తువులు మైనము కలిపి వుడికించి పాకమునకు రానిచ్చి దింపవలెను. పాలాస్త్రిని కంతికి సరిపడు బిళ్లచేసి వెచ్చబెట్టి తరువాత కంతిమీద వేయవలయును. దానిపైన ఒక యిత్తడిబిళ్లగాని తగరపు బిళ్లగాని వేసి పదిదినముల వరకు వరుసగా కట్టిన యెడల కంతి చక్కగా కరుగును.

పశువుల మెడమీద కంతిని శుభ్రముగా యిదివరకు చెప్పిన లోషనుతో కడిగి దినమునకు రెండుపర్యాయములు ఒక గంటసేపు చన్నీళ్ళు ధారగా పోయవలెను. ఆ

ఒత్తు వాములుకోరును పలచన పాతల్లు కోరును.

భాగము ఆరినతర్వాత హారతి కర్పూరము కలిపి మంచినూనెనుగాని, కొబ్బరి నూనెను గాని, నొప్పిపోయి తిరిగి వెంట్రుకలు వచ్చువరకు బాగుగా పుండునకు రాయవలెను. పుండుపడిన తర్వాత మరల ఆపశువుతో పని చేయించినయెడల ఆపుండు వాచి పెద్దదై యెక్కువ బాధపెట్టును. అప్పుడు మూడుపాళ్లు ఆవపిండియు, ఒకపాలు మిరపకాయల పొడి, వేడినీటితో కలిపి వేయుట మంచిది. ఇట్లుచేసిన కంతిలో చీమున్నయెడల పగిలి రసిస్రోడ్చి వేయును. లేదా వాపు హరించును.

## వైరూప్య (Allopathic) వైద్యము

గట్టికంతులకు హైడ్రాజరీ అయోడైడ్ రుబ్బం ఆయుంటుమెంటు వేసిన తగ్గును.

లేక మెర్క్యురీ 16 ఔన్సులు, లార్డు 16 ఔన్సులు కలిపి కంతులకు పట్టించిన తగ్గును.

లేక మెత్తనికంతులను శస్త్రముచేసి లోషన్సుతో కడుగుచు కార్బాలిక్ ఆయిల్‌గాని, తదితర మందులుగాని వేయుచు వచ్చిన తగ్గును. వాతముచేతగాని, చెడు నీటివలనగాని పుట్టిన కంతులుగల పశువులకు కాలికం సల్ఫైడ్‌ను అర్ధడ్రాముగాని, ఒక డ్రాముగాని గంజిలో కలిపి ఈయవలెను.

లేక కంతులకు టింక్చర్ కంతారిడిస్ అను ఔషధము వాడవచ్చును.

లేక అయోడిన్ 32 గ్రెయినులు పొటాషియం అయోడైడ్ 32 గ్రెయినులు లార్డు 2 ఔన్సులు కలిపి మర్దన చేసిన కంతులు కరిగిపోవును.

## ఎముకలు విరుగుట (Fractures)

పశువుయొక్క ఎముకలు దృఢముగా నున్నప్పటికి పెళుసుగా నుండుటవలన అవి బలమైన దెబ్బలు తగులుటచేతను, క్రిందపడుటచేతను, గుద్దుకొనుటచేతను, సాధారణముగా పింగాణివలె విరుగుచుండును. బయట బలమైన దెబ్బలు తగులుటవలనగాని, కండరముల మూలమునగాని ఎముకలు విరుగుచుండును. ప్రక్కటెముకలందుండు ఎముకల గూడును చూడుడు.

ప్రత్యేకముగా ఎముకమాత్రమే విరుగుట తటస్థించిన యెడల విరిగినభాగము రెండుముక్కలుగానగును. తదితర అవయవములకు హానియుండదు ఇట్టి సమయములందు గాయమేమైన యున్నదేమో చూడవలెను.

ఎముక విరుగుటతోగూడ ప్రత్యేకముగా గాయములు కలసియున్నయెడల చర్మమునకును, చర్మముక్రింద ఎముకమీదనుండు అవయవములకును గాయముతగిలి బయటనుండి ఎముక విరిగినస్థలమునకు రంధ్రముపడియుండును. విరిగిన మొనయొకటి చర్మమును పొడుచుకొని బయటకు వచ్చియుండుటవలన రంధ్రముపడును. ఎముక విరుగుటయేగాక




గాయముకూడ పడినయెడల ఎక్కువ అపాయము కలుగును. ఈరంధ్రముగుండ గాలి, విషక్రిములు, దుమ్ము చేరి ధనుర్వాతములోనైనగాని, విషజ్వరములోనికిగాని రావచ్చును.

ఎముక విరుగుటతోకూడ పశువు దేహమందలి కొన్ని అవయవములకు హానికలుగును. తలపుర్రె ఎముకలు విరుగునప్పుడు కొన్ని సమయములందు మెదడునకు కొమ్ములకు హానికలుగును. ప్రక్కటెముకలు విరుగునపుడు కొన్ని సమయములలో ఊపిరితిత్తులకు హానికలుగవచ్చును.

కొన్నిటికి ఎముక చిన్న చిన్న తునకలుగా నలిగిపోవుటగాని, విరిగిపోవుటగాని తటస్థించుచుండును.

లేతవయస్సుగల దూడలఎముకలు విరుగక చిట్లిగాని వంగిగాని యుండును.

## ఎముక విరిగినట్లు కనిపెట్టుట

ఎముక విరిగినభాగము బాధ, పోటుకలిగి వాచును. ఇంతియేగాక హానిపొందిన అవయవములు వంకరగ నుండును.

దెబ్బతగిలిన భాగమును నుపయోగించుటకు శక్తిలేక యుండును, ఒకప్పుడు వాచియుండును.

విరిగినభాగమును కదల్చుటకుగాని, ఏపనికైన ఉపయోగించుటకుగాని స్వేచ్ఛగా వదలివేయుటకుగాని వీలుండదు.

---

పలచని పెరుగు పాత్రలు నిండును.

ఎముకవిరిగిన భాగమునకున్ను, దేహము అవలివైపుననుండు అదే విధమైన భాగమునకున్ను ఆకారమందు వ్యత్యాసముండును.

ఏఅవయవము విరుగునో దానిఆకారము కోమలత్వము, అందము మొదలగునవి చెడిపోయి వికృతరూపము కలుగును. అది కుడిభాగమైన యెడల నెడమభాగముతోను, ఎడమభాగమైనయెడల కుడిభాగముతోను సరిపోల్చిచూచి పొట్టి, పొడుగు, లావు, సన్నము మొదలగు భేదములు కనిపెట్ట వచ్చును.

సామాన్యముగా చేతితోఁ దట్టి ఎముకలు కనిపెట్టవచ్చును. అప్పుడు పశువు చాల బాధపడుచు ముట్టుకొననీయదు.

విరిగిన యెముకయొక్క గరుకైన మొనలురెండు ఒకటితో నొకటి రాచుకొనుట చేత కరకరమను శబ్దము కలుగును. అయితే ప్రథమచికిత్సచేయువారు ఇట్టిశబ్ద మున్నదో లేదో తెలిసికొనుటకై ఎముకలు రాపిడికలిగింప ఎన్నడును ప్రయత్నించరాదు.

ఎముక విరిగినది లేనిది వాస్తవముగా తెలిసికొనవలసి యుండునెడల, విరిగిన యెముకయొక్క వాడిమొనలు వాటిచుట్టునుండు కండరములందును, చర్మమందును గ్రుచ్చుకొనకుండునట్లు మిగుల జాగ్రత్తతోను, మెలకువతోను పరీక్షించవలెను. అట్లు గ్రుచ్చుకొనినయెడల ఎముకవిరిగియుండుటతో గూడ ప్రత్యేకగాయములు లేదా దేహమందలి కొన్ని అవయవములకు హానికలుగును.

## విరిగిన ఎముకల గాయములకు చికిత్స

విరిగినయెముక ఏ ప్రకారము అతుకుకొనునో దానిని ఆరంభములో తెలిసికొనవలెను. విరిగిన కొనలయందు ఎముకతో సంబంధించిన ఒకక్రొత్తపదార్థము ఏర్పడి ఆకొనలు ఒకటితో నొకటి అతుకుకొనును. ఈ క్రొత్త పదార్థము మొదట మృదువుగానుండి ఒకనెల లేక రెండునెలలలోపుగా క్రమక్రమముగా గట్టిపడి ఎముకగా మారిపోవును. ఈ కాలమందు విరిగిన యెముకయొక్క మొనలను అవియుండ వలసిన చోట ఉంచి ఏ మాత్రము కదలకుండ కట్టుకట్టినయెడల ఎముక అతుకుకొని పోవును. కాబట్టి ఎముక విరిగిన గాయములకు చికిత్స చేయునపుడు గాయము తగిలిన భాగమునకు కొంచెము లాగి విరిగిన కొనలను అవియుండవలసిన విధమున ఒకటిగా జేర్చి అవి అతుకుకొనువరకు, అవియేమాత్రము విడిపోకుండ చూడవలయును. అవయవములు విరిగిన పశువులను మంచములలో వేసి కట్టి వ్రేలాడదీయరాదు.

## పుఱ్ఱెఎముక విరుగుట (Special Fracture)

తల పుఱ్ఱె ఎముకలు విరిగినపుడు ఒకచోట విరిగినది, ఎక్కువచోట్ల విరిగినది, ఎముకమాత్రమే విరిగినది, లేక రక్తనాళములకు భంగము కలిగినది మొదలగు సంగతు

---

పచ్చడము వెడల్పున పదిక్రగ లుండినా పైరు వెరచవద్దు.

లను, చేతితో తాకి కనుగొనవచ్చును. ఈ యెముక విరిగిన పశువుతో పనిచేయించ రాదు. మీ తాలూకా వెటరినరీ డాక్టరుగారిని పిలిపించి తగిన చికిత్స చేయవలెను. డాక్టరుగారు వచ్చులోపల గాయమునుండివచ్చు రక్తమును ఆపుచేయుటకు ప్రయత్నించ వలయును. చల్లనినీటిని గాయముమీద పోయవలెను.

## క్రిందిదౌడ విరుగుట (Fractured Lower Jaw)

క్రిందిదౌడ విరిగినప్పుడు పశువు నోరు తెరువలేదు. అరవలేదు. రక్తము గాని, చొంగగాని రెండును కలిసిగాని నోటినుండి బయలువెడలుచుండును. పశువు చాల బాధపడును. దీనముగా మనుష్యులవంక చూచుచుండును. పై పుఱ్ఱె ఎముక విరిగిన మాదిరిగనే దీనికికూడా చికిత్స చేయవచ్చును. వెటరినరీ డాక్టరుగారిని రప్పించి దౌడను యథాస్థానమునకు తెచ్చుటకు ప్రయత్నించవలెను. అటుతరువాత కట్టుకట్టి ముడివేయ వలెను. పశువు గడ్డముయొక్క అడుగునుండి కొమ్ములపైగా ముడివేయవలెను. కట్టు గుడ్డ పొడవుగానున్నయెడల దురల తలపు కట్టి ముడివేయవలెను.

## ప్రక్క ఎముకలు విరుగుట (Broken ribs)

పశువు కొమ్ములనకును వెన్నెముకకును మధ్యను సాధారణముగా ప్రక్కఎముకలు విరుగును. పశువులను ఈ ఎముకలమీద దెబ్బలు కొట్టెదరు. అందుచే నివి ఎక్కువగా విరుగుచుండును. అట్టివేళలయందు పశువు ఊపిరిని పీల్చునపుడు హృదయభాగము బాధగా నుండును. అట్టిసమయమున బాధగా నున్నచో తగు చికిత్స చేయవలెను. ఇంకను ఈ ఎముకలు విరుగుటవలన కొర్జమునకు పూపిరితిత్తులకు బాధ కలుగును.

ఎముకలను స్వస్థానములోనికి చేర్చి కట్టవలెను. ఇక్కడ కట్టుఆగుట చాలా కష్టము. కనుక పశువు ఎముకలచుట్టును కట్టవలెను.

## కాలు విరుగుట (Broken leg)

పశువు మోకాలు క్రిందిభాగములో నేదైన విరిగినయెడల మొదట వాపు కలుగును. ఎక్కువగా విరిగినయెడల ఎముకలు చర్మమును చీల్చుకొని వెలుపలికి వచ్చును. ఇటువంటి సమయములో ఎముకలను స్వస్థానమునకు చేర్చి కట్టు కట్టవలెను. పశువులు తొడయెముకలు విరిగినయెడల కట్టుకట్టుట చాల కష్టము. అచ్చట కట్టు నిలువదు గాన యిదివరకు చెప్పిన బద్దలు వేసి కట్టుకట్టవలెను. ఈ ప్రక్కపటములో చూపిన కాళ్ళలోని ఎముకలు చూడుడు.

---



## ఆయుర్వేద చికిత్సలు (Native)

పశువు శరీరములో ఏ భాగము విరిగినను యీ దిగువ చికిత్సలు చేయవచ్చును. విరిగిన వెంటనే చింతగింజల బెరడు రుబ్బి జిగురు వచ్చునట్లు వుడకబెట్టి ఒక ముతక గుడ్డను పట్టీగా చింపి జిగురు బాగుగా రాచి ముందు విరిగిన భాగమును స్వస్థానములో

---

మొదలు మోటుగ వేస్తే కొనసన్నగి పోదునా?

చేర్చి పైన ఆ పట్టీగుడ్డను వేసి, దానిమీద మరియొక పాడిగుడ్డనువేసి నున్నగా చెక్కిన బద్దలనుగాని యిదివరకు చెప్పిన అట్టముక్కలనుగాని పైనవేసి కట్టినచో త్వరగా ఎముకలు కట్టుకొనును. బాధ వాపు తగ్గును. కట్టు కట్టునప్పుడు బాధనొందు భాగమునకు ఆధారముగను దానిని కదలకుండునట్లు చేయుటకును, ఈకట్టు ఉపయోగపడును. ఈ కట్టు 15-25 దినములవరకు నుంచవలయును. తరువాత కట్టుపైనున్న బద్దలు తీసివేసినయెడల నొప్పి క్రమముగా తగ్గును.

విరిగినయెముకలను స్వస్థానమునచేర్చి నాలుగైదంగుళముల వెడల్పుగల ముతకగుడ్డను ఉమ్మెత్తరసముట్టిని పూసి విరిగినంత వరకు చుట్టవలయును. కట్టు 30 దినములవరకుగాని, అంతకుపైగాగాని, ఈ విధముననే యుంచవలయును. పశువునకు మేత ఎక్కువగా మేపరాదు. మఱ్ఱియూడలకొనలు పిడికెడునూరి అరసేరు ఆవుపాలతో కలిపి దినమునకు రెండు సారులవంతున వారము దినములు త్రాగించవలయును. ఇట్లు చేసినచో ఎముకలు త్వరగా కట్టుకొనును.

కొందరు వైద్యులు పేడ,వెన్నపూస గుడ్డనురాచి కట్టుకట్టెదరు. కాని దీనివలన నెంతమాత్రము ప్రయోజనములేదు. ఉత్తరేణి ఆకునూరి కట్టుకట్టి పక్షము దినము లుంచవలెను.

## విరిగిన ఎముక భాగములకు సాధారణచికిత్సలు

ఎముకలు విరిగినప్పుడు గాయమునుండి రక్తము కారుచున్నది లేనిది పరీక్షించవలయును. ఆ గాయము శుభ్రముగా నున్నది, మురికిగానున్నది పరీక్షించవలెను. రక్తము కారుచుండినయెడల గాయములో వాయువునందుండు సూక్ష్మజీవులు ప్రవేశింపకుండుటకు గాయములను దూదితోగాని లింటుతోగాని, పీచుతోగాని, కట్టుకట్టవలెను. రక్తమునాపుటకవుసరమైన యెడల కట్టును బిగించుటకు టూర్నిక్వె నుపయోగించవలెను. టూర్నిక్వె అనగా జానెడుపొడవుగల చేతికఱ్ఱముక్కలు ఒకదానిని దెచ్చి కట్టునకును చర్మమునకును మధ్య దానికొనలలో నొకదానిని దూర్చి గిరగిర మెలికలు త్రిప్పవలెను. అట్లు త్రిప్పినందువలన కట్టుబిగిసి ధమనులకు తగిలిన గాయములగుండ పారునట్టి రక్తము ఆగిపోవును. ఎముకలు చర్మముక్రింద నుండి కంటికగపడవు. అవి విరిగినట్లు కంటితో చూడలేము కాని కొన్ని గుర్తులవలన ఎముకలు విరిగినటుల తెలిసికొనవచ్చును. గాయము మురికిగా నున్నయెడల పొటాషియం పర్మాంగనేట్ లోషన్‌తోగాని, కార్బాలిక్ లోషన్‌తోగాని కడిగి శుభ్రముచేయుట మంచిది. ఇట్లు చేయుటచే సూక్ష్మజీవులు చెడిపోవును. తొడ, మోకాలు, జబ్బభాగములందు విరిగిన ఎముకలు కట్టుకొనుట చాలా కష్టముగాన చివరకు రాక్షస వైద్యము చేసినను తగును.

## కట్టుబద్దలు (Splints)

కట్టుకట్టునపుడు బాధనొందిన భాగమునకు ఆధారము కలిగించుటకును, దానిని కదలకుండునట్లు చేయుటకును కట్టుబద్దలు ఉపయోగించుచున్నవి. కట్టుబద్దలు లేక సన్నని వెదురుదువ్వలు మొదలగువానిని కట్టుబద్దలందురు. ఒకప్పుడివి దొరకనిచో కాగితపు అట్టలు వెదురుబద్దలు తదితర చెట్లయొక్క బద్దలు ఉపయోగించవచ్చును. వీటిని కట్టుతో చేర్చునపుడు ఒత్తును విస్తారముగా నుండరాదు. అపాయము కలిగినభాగముయొక్క కీలు దాటియుండునట్లు వీటిని చేర్చి కట్టుకట్టవలెను. లేనియెడల జాయింటుకీలు తప్పి గాయమునకు కదలికలు గలిగించి బాధను కలుగజేయును.

పశువును కదలనీయరాదు. అట్లు కదలుటవలన ఎముకలు కదలి ప్రమాదము సంభవించును. కట్టుబద్దలు రెండంగుళముల వెడల్పుగల ముక్కలుగాజేసి జంతువు అవయవమునకు తగినవిగా నుండవలెను. ఎముక పగిలినచోట అరంగుళమునుంచి అరంగుళము క్రిందికి వచ్చునట్టి పొడుగుగల బద్దలు నునుపుగా చెక్కి చీల్చవలయును. బద్దలువేసి కట్టుటకు పూర్వము విరిగినభాగమునకు గుడ్డలుచుట్టవలెను. లేనిచో చర్మమునకు చెరుపు గలుగును. లేదా బద్దలు చర్మమును చీల్చును. ఒకసారి బద్దలువేసికట్టిన తరువాత అయిదు ఆరువారములకు కట్టువిప్పరాదు. ఎముక విరిగి పొడుచుకొని వచ్చినపుడు కట్టును ప్రతి వారమును తీసి మరల క్రొత్తకట్టు కట్టుచుండవలెను. లేనిచో అచ్చట క్రుళ్ళి పశువునకు అపాయము సంభవించును. విరిగిన ఎముకలు కలిసికొనక అచ్చట చీముపట్టినయెడల కత్తితో చీల్చి యెముకముక్కలను చీమును తీసివేసి దానిని గాయముగా నెంచి అందుకు తగిన చికిత్స చేయవలెను. పెద్దజంతువుల కాళ్ళు విరిగినచో చికిత్సవలన నెంతమాత్రము ప్రయోజన ముండదు.

## వైరూప్య (Allopathic) వైద్యము

ప్యారిస్ ప్లాస్టర్ అను తెల్లపొడిని నీటితో కలిపి గుడ్డకుగాని, దూదికిగాని పట్టించి కట్టుకట్టవలెను. ముందు గాయమెంతవరకున్నదో, విరిగిన ఎముకలను పాటునకు త్రోసి కట్టుకట్టవలెను.

## ఎముకలు తొలగుట (Dis locations)

దీనినే యిండితొలగుట యందురు. కీలువద్ద ఎముకలు అమర్చబడియుండి గూటినుండి అది బయట త్రోయబడుటనే ఎముక తొలగుట యందురు. ఎముక తొలగిపోయిన భాగము వాచి నొప్పికలుగ చేయును. తొలగిపోయినభాగము అంద వికారముగ నుండును. కీలువద్ద యెముక తొలగిపోవునేగాని రెండు కీళ్ళుండుమనుండు ఎముక తొలగిపోయినచో పశువు నడవజాలక డెక్కచివరనే నేలమీద జారలాగుచు తిరుగుచుండును. ఎముక విరుగుటయు, విరిగిన మొనలు గరుకుగానుండి ఒరసికొనుటయు నుండదు. కరకర

మను శబ్దముండదు. కీళ్ళయందుతప్ప కదికెదచోటుల చలనముండదు. ఎముకతొలగి పోయిన కీలుకదలక స్థిరముగా నుండును.

## చికిత్స

స్థాన భ్రంశమునొందిన యెముకను స్వస్థానమునకు త్రోయవలెను. తరువాత దానిపైన మంటమందు వేసి పశువును ఒకచోట కదలనీయక యుంచవలయును. తొలగిన ఎముకను లాగి వడగట్టిన పెరుగుముద్ద, నిమ్మపండ్లు, ఆముదపుపప్పు, గుంటకరాకు సమ భాగములుగా కలిపి తొలగిన భాగమునకు పూయవలెను. పశువును అంతగా మేపరాదు. ఎక్కువగా మేపినచో పశువు జీర్ణకోశములు చెడిపోవును. ఇట్టి పశువు నెలనుంచి మూడుమాసములవరకు బాధపడును. [illegible] కుదురును.

అవసరమున్నపుడు రక్షకూడ వేయవలెను. నొప్పితగ్గుటకు తంటెపాకు నూరి కట్టవలెను.

## ఎముకలు గూళ్లనుండి జారుట

ఎముకలు గూళ్లనుండి తొలగిన యెడల గూళ్లయందు బాధయుండి వాపు గనిపించును. ఆభాగము కదల్చుటకు వీలుండదు. ఆభాగముమీద బరువు ఆనుటకు వీలుండదు. ఆ భాగముతో నేవిధమైన పనులను చేయజాలదు. అట్టి భాగమును మనము చేతితో ఎంత మెల్లగాతాకినను నొప్పికలుగును. ఆభాగముయొక్క ఆకారము చెడియుండును. అనగా వంకరతిరుగుటయో, పొట్టిపోవుటయో తటస్థించును. ఒకప్పుడు కీళ్లుబిట్టుబిగిసి కదలుటకు వీలుండదు. ఎముకలు గూళ్లనుండి తొలగునని గ్రహించవలెను. సాధారణముగా పశువుమోకాలు చీలమండమోడ ఎముకలుగు జబ్బమొదలగు భాగములయందలి ఎముకలు గూటినుండి తొలగుచుండును. వీటిలో భుజాస్థియొక్క తల పెద్దదిగాను అదిప్రవేశించు గూడు చిన్నదిగా నుండుటనుబట్టి తరచుగా గూటినుండి తొలగుచుండును. ఇట్టిబాధలు పైవాటికే యెక్కువగా కలుగుచుండును. ఎముకలు గూటి నుండి తొలగినవో లేక అసలే విరిగినవో తెలిసికొనుట కష్టము. కాబట్టి మీతాలూకా వెటరినరీడాక్టరుగారికిగాని మిక్కిలి అనుభవముగల మీ గ్రామ పశువైద్యునకుగాని చూపించవలయును.

## జెబ్బ కుదళ జారుట

పల్లెలయందుండు పశువులకీ ప్రమాదము సామాన్యముగా తటస్థించును. ఎత్తు స్థలమునుండి పల్లమునకు దూకుట వలనగాని తప్పటడుగు వేయుటవలనగాని కాలు జారుటవలనగాని యిది తటస్థించును. మసకజారిన కాలుపైన భారమేమియు మోపజాలదు; కనుక మూడుకాళ్లతో నడచును. జారినట్టి కీలును పట్టిచూచినయెడల ఎముక

---

పండేపంట పయిరులోనే తెలియును.

యొక్క చివరభాగము మామూలు స్థలము నుంచి వెలుపలికివచ్చి చేతికి గట్టిగాతగులును. ఈస్థితి వెంటనే తెలుసుకొని కీలు సరిచేసినచో పట్టి యవయవము బాగుపడుట కెక్కువ యవకాశము కలదు. దగ్గర లోతైన చెరువుగాని కాలువగాని యున్నయెడల దానిలో జంతువును ఈదఁ గొట్టించవలెను. అందువలన కీలు సద్దుకొనవచ్చును. లేనియెడల మంచి ప్రక్కను పడద్రోసి జబ్బుకాలునకు చిన్నమోకునకు బిగుగా త్రాడుకట్టి యొకరు దానిని ముందుకు నెమ్మదిగా బలముతోఁ లాగుచుండగా పైకివచ్చిన యెముక కొనను సాధకుడు తన యరచేతితో మామూలుస్థలములోనికి త్రోయుటకు ప్రయత్నించవలెను. ఇట్లు త్రోసిన టక్కుమని యెముక లోనికి పోవును. పిమ్మట కుంటుచిహ్నములు పోయేవరకు జంతువును నెమ్మదిగ నడుపవలెను. ఈ మాదిరిగనే పశువుల కాలు విరిగినప్పుడుకూడ స్వస్థానమునకు చేర్చి కట్టుకట్టవచ్చును. జబ్బువెనుక జారినపుడు 24 గంటలలో త్రోసి కట్టనిచో రక్తము గడ్డకట్టి కాలురాదు.

## కాలు రెల్లపోవుట (Sprain)

### స్వభావము (Causes)

బండి యెద్దులను సవారి బండ్లనుకట్టి వివాహములకు ఇతర గ్రామాదులకు వెళ్లునప్పుడు స్వారి చేయించునప్పుడును రాత్రిపొద్దులలోగాక ఎక్కువగా స్వారి చేయించునప్పుడును, కాలిగుత్తి మెలక పడినప్పుడును ఈ ప్రమాదము సంభవించును. పశువు పరుగెత్తునప్పుడు నాలుగు పాదములను ఒకేసారి భూమిని విడుచును. ప్రతి అడుగునందును, కాలుడెక్కలు మాత్రమే భూమిని తాకుచున్నవి. మరియు ప్రతి అడుగునకు పిమ్మట మోకాళ్లు తిన్నగా నుండవు. పరుగెత్తుటలో వెనుకపాదములు భూమిని విడుచునప్పుడు అకస్మాత్తుగా మోకాళ్లు తిన్ననగుచున్నవి. పిక్కసందులు కీలు సాగి బలముతో కాలి డెక్కలగుండా త్రోపునిచ్చి దేహమును పైకి ముందుకు త్రోయుచున్నది. పాదముల యొక్క గిట్టలు భూమిమీద పడును. అట్లు పడకముందే తిన్నగానున్న యా వెనుకటి మోకాళ్లు బాగుగావంగి దాని పాదములు భూమిని విడచి కొంత దూరమువచ్చును. పైకెత్తబడిన వెనుకకాళ్లు నడకలో నున్నట్లు దానంతటదియే యాగక అందలి కండరముల చేత బలముతో ముందునకు లాగబడుచున్నది. అడుగుల త్వరితమును బట్టి యీ చలనము జరుగుచున్నది. భూమిని విడువబోవునప్పుడు వెనుకటి మోకాలు తిన్ననై అతి తొందరగా లాగుకొనుటవలన ఒకవిధమైన జంటకాళ్లతో దుముకుటయే జరుగుచున్నది. దీనికే పరుగెత్తుట యందురు. ఇటువంటి సమయములలో పశువుకాళ్లు రెల్లపోవును. యనగా పశువుడెక్కనుండి జబ్బవరకు పోవు నరము చెదరును. పశువు రెల్లపోయిన కాలును భూమిమీద ఆనించలేదు. చాల బాధపడును. పశువు మిగుల దీనముగా నుండును. రెల్లపోయిన భాగమందు వాచి వేడిగా నుండును. మనము చేతితో తాకినయెడల గిలగిల తన్నుకొనును. బాధచే పండ్లుకొరుకును. పశువునకు జ్వరము కూడా నుండును.

---

పూచిన పూలెల్లా కాయలైతే భూమిన దానికి సలిమువుండదు.

## ఆయుర్వేద (Native) వైద్యము

రెల్లపోయిన భాగమునకు రెండు బిందెల చన్నీళ్లు ధారగా పోయుట మంచిది. రెండు కుండపెంకులు తీసికొని పశువు డెక్కకునొక్క నొప్పిగల భాగమందు పెంకులువేసి గుత్తి కిరుప్రక్కల ఒకకొసతో బిగించి ఒకబిందెడు చన్నీళ్లు తీసికొని ధారగా పోయవలెను. ఇట్లు నొప్పి తగ్గువరకు పోయుచుండిన నెమ్మది యగును. రెల్ల పోయిన భాగమునకు తవుడు వేయించి కాపులు వేయుట మంచిది. ఇట్టి పశువులకు 15 నుంచి 60 దినములవరకు చికిత్స చేయవలసియుండును.

లేక వస 1 తు, వాము 2 తు, పసుపు 1 తు, కలిపి నూరి నూనెతో ఉడికించి రెల్లపోయిన భాగమందు మర్దన చేయవలెను.

లేక సున్నములో చింతపండు కలిపి పట్టువేయుము.

లేక సారాయిలో కోడిగ్రుడ్డు తెల్లసొన కలిపి పట్టువేయవలెను.

లేక మునగాకు 2 గుప్పెళ్ళు, వస 1 తులము, వాము 6 తులములు నూనెలో కలిపి ఉడికించి రెండు కట్లు కట్టవలెను.

## వైరూప్య (Allopathic) వైద్యము

కాలు పైకి ఎగలాగిన వెంటనే చన్నీటిలో అమ్మోనియుం క్లోరైడ్ కలిపి ధారగా ప్రతిపూట పోయుచుండినచో తగ్గును.

లేక టర్పెంటైన్ ఒకటి లేక రెండు ఔన్సులు ఆ భాగమునకు వేసి వేడినీటి కాపులు వేసిన తగ్గును. లేక వైట్ లోషను వాడిన తగ్గును.

## చెమటగుల్ల (Foul)

### స్వభావము (Causes)

పశువులు తిరుగునప్పుడు వాని గొరిజలచుట్టు అప్పుడప్పుడు మన్ను పేరుకొనును. దానిని పరిశుభ్రముగా చేయనియెడల అచ్చట వాచి వేడిగా నుండును. తోటభూములందును, రాతినేలలందును, అరణ్యములయందును, బీడుభూములందును, తిరుగు పశువులకు తరచుగా ఈ గుల్లలు లేచును. ముఖ్యముగా నివి వెనుకకాళ్లకు వచ్చును. కాలు కుంటిన వెంటనే తగు చికిత్స చేయనిచో ఆ భాగము చీముపట్టి బాధపెట్టును. కాలు భూమిమీద ఆనించలేదు. మేత నీరు మాని విచారముగా నుండును. ఇంకను అశ్రద్ధ చేసినయెడల పశువు కృశించి మరణమునకు సిద్ధమగును.

---

## ఆయుర్వేద (Native) వైద్యము

గుల్ల పెద్దదిగానుండి మెత్తబడినయెడల శస్త్రముచేసి లోపలను నీటితో కడిగి మందులు వాడవలెను. తరువాత ఆ గాయముపైన ఒక దట్టమైన గుడ్డవేసి వెముడు చెక్క, ఆవాలు, వాము సమభాగములుగా చేర్చి నలగద్రొక్కి వెచ్చజేసి కాయవలెను. ఈరీతిగా నాలుగుదినములు చేయుము.

లేక ఆముదపువత్తివేసి పొడిసున్నము అది కట్టవలెను.

లేక ముండ్లతోటకూర వెచ్చనిది ఉదయ సాయంకాలములందు కట్టవలెను.

లేక నల్లఉమ్మెత్తాకు పసరు, ఉప్పు మెత్తగా నూరి 3 దినములు కట్టుకట్టవలెను.

## వైరూప్య (Allopathic) వైద్యము

శస్త్రము చేసినతరువాత మురికిని లాగుటకు హైడ్రొజన్ పరాక్సైడ్‌ను ఉపయోగించవలెను. తదుపరి టించర్ అయోడిన్‌గాని, కార్బాలిక్ ఆయిల్‌గాని, కాంఫర్ లినిమెంటునుగాని వాడిన బాగుగా పనిచేయును.

## బెణుకులు (Sprains)

పశువు కాలియొక్క ప్రతికీలు రెండుగాని, అంతకు పైనగాని ఎముకలతో గూడి నారవంటి త్రాళ్లతో కట్టబడియుండును. ఈ త్రాళ్లనే టెండెన్సు అందురు. ఈ త్రాళ్ళు కీళ్ళను తొలగకుండ బంధించి యుండును. పశువు కాలుజారినను, తప్పటడుగులు వేసినను, అధిక వేగముగా పరుగెత్తినను, అధికమైన బరువులు లాగినను ఈ టెండెన్సు [పట్టుకు నరములు] కొలదిగనో గొప్పగనో విస్తరించి సాగినయెడల బెణుకుట యందురు. బెణికిన కొంచెము సేపటికి ఆ భాగము వాచి నల్లబడును. పై చర్మము పగలనిచో మొదటనే రంగుమారినట్లు కనబడును. రెండుమూడు దినములైనతరువాత చుట్టునుండు చర్మము నలుపుగానైనను, ఎరుపుగానైనను కొంచెము పసుపువర్ణముగానైనను ఉండును. బెణికినచోటనుండు రక్తము అటునిటు చెదరుచుండును. కనుక వాచుటయు నల్లబడుటయు తటస్థించును. పశువులకు సామాన్యముగా మణికట్టు, మోకాళ్ళు, జబ్బలు, పిమనములుగు మొదలగు అవయవములు బెణుకుచుండును. ఒకప్పుడు అపాయములు సంభవించిన యెడల ఎముకలు గూటినుండి తొలగక కీళ్లమీద నుండు సంధి బంధములు కండరములు మొదలగునవి మెలికలుతిరిగి నలిగి బాధను కలిగించును. అట్టి బాధలకు బెణుకులని పేరు.

## ఆయుర్వేద (Native) వైద్యము

బెణికిన అవయవమును స్థిరముగా నుంచవలయును. కదలనియరాదు. బెణికిన భాగమునకు తడిగుడ్డచుట్టి తడుపవలెను. ఇట్లు తడిపినచో ఆ భాగము బిగియును. కొం

దరు వేడినీటికాపులు బెణికిన భాగములకు కాపు తీయుదురు. వేడినీటి కాపులకంటె ఇసుకకాపులు చాల శ్రేష్టము. బెణికిన భాగమును చాలాకాలము వాడుకచేయని యెడల ఆ అవయవము బిగిసిపోవును.

మద్దకర్పూరము 1 తులము, కొబ్బరినూనె పావుసేరు, కలిపి బెణికినచోట రుద్దవలెను.

లేక హారతికర్పూరము $1\frac{1}{4}$ తులము, కర్పూరతైలము 6 తులములు, సబ్బు 2 తులములు, కలిపి మర్దన చేయవలెను.

లేక పచ్చిజెముడుచెక్కను గ్రోక్కి బెణికినచోట కట్టవచ్చును.

లేక రావిచెక్క మెత్తగా నలగద్రొక్కి యెండబెట్టి చూర్ణముచేసి నీటిలో కలిపి బిళ్లచేసి బెణికినచోట కట్టుకట్టి ఆకట్టుపైన చన్నీళ్లు ధారగా పోయవలెను.

లేక కోడిగ్రుడ్డు సొనతో మంచినూనె కలిపి పట్టువేయుము.

లేక మంచిఘాటైన సారాయి ఆరగా ఆరగా రుద్దుచుండవలెను. బెణికిన అవయవమునకు ఎన్ని చికిత్సలు చేసినను లొంగని యెడల బొత్తులు పెట్టవచ్చును.

## వైరూప్య (Allopathic) వైద్యము

అంగు ఎంటంపంబ్లం అసిటేట్ నుగాని, ... ఆయంటుమెంటుగాని, టర్పెంటైన్ నుగాని, బోరిక్ ఆయింటుమెంటుగాని, జింకుఆక్సైడ్ ఆయింటుమెంటుగాని ఆయా బెణుకులకు మర్దనచేయుచు వేడికాపులు తీయుచుండిన యెడల తగ్గును.

## మోకాళ్లుదిగుట

పశువుకు మితముమించి మేపుటవలనను, చర్మములో నుండు బలహీనతవలనను, దుమ్ము, తేమ పగ్గిరాల కొట్టములో నుంచుటవలనను, తడిరోగ వాతరోగములవలనను ఈ వ్యాధి కలుగుచున్నది. వెనుక మోకాళ్ళుగాని ముందుమోకాళ్ళుగాని వాపుచెందును. ఈవాపును తాకినయెడల గట్టిగ నుండును. మరికొన్నిటికి మెత్తగ నుండును. నడచునపుడు కాళ్ళు వంగనీయవు. ఆ వాపులదగ్గర దురదకలుగుచుండును. ఆరంభములో పశువు మోకాలి చిప్పలచుట్టు గుండ్రని వాపుండును. ఈవాపు వృద్ధిచెంది కాలిక్రింది భాగమునకుకూడ పోవును. ఈవాపులలో ఒక విధమగు జిగురుపదార్థముండును. ఇట్టివి తగ్గుట కష్టము.

## ఆయుర్వేద (Native) వైద్యము

జిల్లేడుపువ్వు, ఇప్పపిండి, ఉల్లిపాయలు సమభాగములుగా చేర్చి మెత్తగానూరి బిళ్ళవలెచేసి పశువుమోకాళ్ళ మీద కట్టవలెను.

---

దూస్తే దోసెడు, వూదితే ఊళిక్కి అన్నట్టుగావుంది ఈ సేద్యం.



సాంప్రదాయముగల ఇంగ్లీషుజాతి గోవులు



శ్రీ శరణు రామమోహనరావుగారి చక్కని ఆవుపెయ్య. కూచిపూడి గుం. జి.



శ్రీ గడ్డిపాటి కోటయ్యగారి అందములోను, బండపట్టులోను పేరొందినవి.
ప్యాపర్రు (తెనాలి తాలూకా)



శ్రీ పోపూరి వీరయ్యచౌదరిగారి ఛాలెంజి ఎద్దుల పెద్దసైజు—ఇసుకపట్టు
శిరిపురం (తెనాలి తాలూకా)

## వైరూప్య (Allopathic) వైద్యము

వాపునకు అప్పుడప్పుడు టర్పెంటైన్ రుద్దుచుండిన తగ్గును. లేక టింక్చర్ అయోడిన్ రెండువేళల రాసిన తగ్గును. లేక టర్పెంటైన్‌లో ముద్దకర్పూరము, సోపు, అమ్మోనియా ఫోర్టస్ కలిపి రాసిన తగ్గును.

## గిట్టలకు క్రుళ్లుపుట్టుట

పశువునకు కాలిగొట్టుపడుటవలనగాని, తదితర వ్రణములవలనగాని, మోటారు కారు, బండి మొదలగునవి గిట్టల మీదుగా పోవుటవలనగాని, కేవలుపడి గిట్టలు తెగి పోవుటవలనగాని, గాయములకు చేతగాని చికిత్సలు చేయుటవలనగాని, ఈ క్రుళ్లుడు పుట్టును.

## ఆయుర్వేద (Native) వైద్యము

ఈ వ్యాధికి చికిత్సచేయుట చాలకష్టము. ప్రతిదినము కట్టుకట్టవలెను. క్రుళ్లకుండ నుండు పదార్థములువేసి చికిత్స చేయవలెను.

ముద్దకర్పూరము—2 తు, వస 1 తు, వ్యాసులైను 2 తు, కలిపి అచ్చట రాయవలెను.

లేక బోరిక్ ఆసిడ్ అను తెల్లనిపొడివేసి కట్టుకట్టవలెను.

లేక జీడిత్తులు సేరుతెచ్చి త్రొక్కి చమురు తీయవలెను. తరువాత సేరు గొఱ్ఱె క్రొవ్వు, అర్ధసేరు మైనము, అర్ధసేరు ఆవునెయ్యి, అర్ధసేరు నువ్వులనూనె, అర్ధసేరు ఆముదము, తీసికొని వచ్చి పై చమురు కలిపి కాచవలెను.

తరువాత పశువుగిట్టను రక్తమువచ్చునట్లు క్రుళ్ళుతీసివేసి దానిపై చురుక్కుమనునట్లు కాచినతైలము పోయవలెను. తరువాత మైనము బిళ్ళగాజేసి దానిపైనవేసి మరియూదు వేసికట్టుకట్టవలెను. ఆకట్టు మూడుదినములుంచి నాల్గవనాడు ఇదివరకు చెప్పిన లోషనుతో కడిగి మరల మైనపుబిళ్ళవేసి కట్టుకట్టవలెను. పుండుమానువరకు నిట్లే చేయవలెను.

## వైరూప్య (Allopathic) వైద్యము

ఇదివరకుచెప్పిన లోషన్లతో కడిగి కార్బాలిక్ లినిమెంటుగాని, క్యాంఫర్ లినిమెంటుగాని, అయిడోఫారంగాని వాడినతగ్గును.

---

రోహిణి కార్తెలో పిత్తుటకంటె రోటిలో పిత్తుట మేలు.

## కాలిగోళ్లు

పశువును నాగలికట్టి దున్నునప్పుడును జీతగాడు నాగలిమేడిసరిగా పట్టుకొనక పోవుటచేతగాని యేమరుపాటున దున్నుటచేతగాని పశువుల కాలిడెక్కలను నాగలికఱ్ఱు గ్రుచ్చుకొనిన యెడల పశువునకు ప్రాణాపాయముకూడ రాగలదు. ఈగాయముచే పశువు చాలవిచారముగా నుండును. తగినచికిత్స చేయనిచో కాలుచెడిపోవును. కాలు నిరుపట్టి వాచును. పోటుండును. పశువు నడువజాలదు. లోతుగాయమునకు వెంటనే చికిత్స చేయనిచో ధనుర్వాతముసోకి మరణించును.

## వైరూప్య (Allopathic) వైద్యము

ఆ గాయమునకు ఈగలను ముసరనీయరాదు. చాల జాగ్రత్తగా నుంచవలెను. గాలి ప్రవేశించకుండ కట్టు కట్టవలెను. గాయమును పొటాసియం పర్మాంగనేట్ లోషనుతో గాని తరితర లోషన్నుతోగాని కడిగి టింక్చర్ అయోడిన్ స్వచ్ఛమైనది వేసి దానిపైన బోరిక్ ఆసిడ్ అను తెల్లని పొడివేసి కట్టుకట్టవలెను. వాపులున్న యెడల వేడికాపులు కాయవలెను.

లేక నల్లజీడిగింజ కాల్చి ఆ భాగమునకు అంటించవలెను.

లేక గాయపొడివేసి నాలుగుకట్టులు కట్టవలెను.

పశువు కాలిడెక్కలకు మేకు గ్రుచ్చుకున్నయెడల జాగ్రత్తగా తీసివేసి నిరుపట్టకుండ చేయవలెను.

కాల్చిన యిటుకరాతిమీద గుడ్డ మడతలుగా పెట్టి దానిపైన చన్నీళ్లు ధారగా పోయుచుండవలెను. ఈప్రకారము మూడు నాలుగుదినములు చేయవలెను.

లేక టింక్చర్ అయోడిన్ ఆ వాపునకు రాయుము.

ఇసుకతో వేసికాపుడు తీయుట మంచిది. వాము, వెల్లుల్లిపాయలునూరి నాలుగు కట్టులు కట్టుము.

## మందగుడి (String Halt)

పశువునకు ఈ వ్యాధి వాతమువలన వచ్చును. కాళ్ళు ఈడ్చుచుండును. కొన్నిటికి తేలికగా తగులుటవలన కొద్దిగా కుంటుచుండును. వ్యాధి ముదిరినకొలది కాలు పైకి లాగుకొని నడువలేకపోవును.

## ఆయుర్వేద (Native) వైద్యము

వాము 15 తులములు, దిరిసెనచెక్క 15 తులములు, సొంఠి 12 తులములు, చేదుపొట్లకాయలు 10 తులములు, పొగబంతిచెక్క 13 తులములు, చేమబీరకాయలు

---

12 తులములు, పెన్నేరువేరు 10 తులములు, ఇవన్నియు కలిపి నూరి నిమ్మకాయంత ఉండలు చేసి రెండుపూటల తినిపించవలెను. వ్యాధి ముదిరిన ఈ చికిత్సకూడ లాభములేదు.

## వైరూప్య (Allopathic) వైద్యము

రెక్టిఫైడ్ స్పిరిట్ టింక్చర్ అకోనైటిన్ను రక్తనాళమునకు ఇంజెక్షన్ యిచ్చిన తగ్గును. ఇంతకంటె మంచివైద్యము లేదు.

## గిట్టలవగుళ్లు

పశువులను బండ్లుకట్టి రాతినేలలందు కంకరరోడ్లమీద తోలుటచేతను, దీర్ఘప్రయాణములు చేయుచుండుటచేతను, సరియైన నాళములు డెక్కల అడుగుభాగమున కట్టించక పోవుటచేతను, పశువుల గిట్టలు అరిగిపోవుట చేతను ఈ వ్యాధి కలుగుచుండును. ఈవ్యాధి ముందరికాళ్ళకును వెనుక కాళ్ళకును అప్పుడప్పుడు వచ్చుచుండును. గోరిజలు పగిలి వాపుపుట్టును. ఆబాధచేత పశువు అడుగు వేయజాలదు. అజాగ్రత్తగానున్నచో ఆవాపు పుండుగా మారి గిట్టలూడిపోవును.

## ఆయుర్వేద (Native) వైద్యము

(1) వేడినీటిలో ఉప్పుకలిపి డెక్కలమీద పోయుము.

(2) గుగ్గిలము, మైనము, లక్క, సింధూరము ఒక్కొక్కటి పావుతులము వంతున తెచ్చి మెత్తగానూరి పొడిచేసి నూనెలో కలిపి కాచి డెక్కలలో పోసి దానిపై కాచిన వేడియిటుకరాతి పొడుముతో కాచవలెను.

(3) ముండ్లతోటకూరఆకు తెచ్చి ఉడికించి వెచ్చనిది కట్టవలెను.

(4) కరక్కాయపొడి, ప్రత్తిసున్నము పటికబెల్లము సమానముగా తెచ్చి మెత్తగానూరి నొప్పిగల గోరిజలకు పట్టించి ఉప్పునీటితో కాచవలెను.

(5) తవుడు నీరు చిక్కగా కలిపి ఉడికించి దినమునకు ఒకసారి కట్టవలెను.

(6) గుగ్గిలము బెల్లము నెయ్యి మైనము కలిపి రాయవలెను.

(7) నిమ్మరసము, సైంధలవణము, జెముడుపాలు, జిల్లేడుపాలు, గుగ్గిలము ఆవు వెన్నతో కలిపి రాయవలెను.

## వైరూప్య (Allopathic) వైద్యము

జింకు ఆక్సైడ్ ఆయింటుమెంటుగాని సింపిల్ ఆయింటుమెంటుగాని బోరిక ఆయింటుమెంటుగాని వాడిన బాగుగా పనిచేయును.

---

మృగశిరలో వేసిన పైరు మాసములు రావడమున పుట్టిన కొడుకు మేలు చేయును.

## గిట్టల సందున దుర్మాంసము పెరుగుట

గిట్టలకు దెబ్బతగిలినపుడు తగుచికిత్స చేయనపుడుగాని కాలిగొట్టుపడి గిట్ట చీలినపుడుగాని, యే దెబ్బయైన తగిలినపుడు శస్త్రముచేసి సరిగా చికిత్స చేయనపుడుగాని, యీ దుర్మాంసము పెరుగుచుండును. పశువు పనిచేసినపుడు గిట్టలసందున నున్న ఈ దుర్మాంసమునకు పుల్లలు, గడ్డలు, గుచ్చుకొని బాధనొందును. దుర్మాంసము పెరిగి బాగుగానుదిరిన యెడల శస్త్రము జేయుట చాలకష్టము. కాబట్టి యిటువంటి పశువునకు వెంటనే దుర్మాంసమునకు చికిత్స చేయుట మంచిది.

## ఆయుర్వేద (Native) వైద్యము

మీ తాలూకా వెటరినరీ డాక్టరుగారిచే శస్త్రము చేయించి తగు చికిత్స చేయించవలెను.

అట్లు వారు దొరకనిచో దుర్మాంసము పదునైన కత్తిచే కోసివేసి దానిపైన ముసాంబ్రము 1 తులము, పటిక 1 తులము, తెచ్చి పొడిచేసి జిల్లేడుపాలలో కలిపి నూరి కోసినభాగమందు వేసి కట్టుకట్టవలెను.

లేక హరిదళము 2 తులములు, కవిరి 2 తులములు, కరక్కాయలు 2 తులములు, కరిదూపము 4 తులములు, ఉశిరికపప్పు 3 తులములు, ఉత్తరేణిచెక్క 6 తులములు కాల్చి పొడిచేయగా వచ్చినది మూడు తులములు తీసికొని మెత్తగ నూరి ఆముదములో కలిపి మలాముగా వండి దానిపైన వేయవలయును.

## పురుగు తొలుచుట

పశువు చర్మముక్రిందనుండు రక్తనాళములలో ఈ పురుగులు చేరి చర్మమును తినును. ఈ పురుగులు తొలవగనే రక్తము కారుచుండును. ఇట్లు శరీరమంతటనుకూడ తొలచుచుండును. ఒక్కొక్కప్పుడు నెత్తురు కారుచుండుట చూచిన చాలా భయంకరముగా నుండును. దీనివలన పశువునకు ప్రమాదములేదు. గాని ఆగాయముపై ఈగలు వ్రాలినయెడల పుండ్లు పురుగులుపడి పశువును బాధించును. కాబట్టి ఆరంభములోనే చికిత్స చేయవలెను.

## చికిత్స

మైలుతుత్తపు నీరుగాని, పటికపొడిగాని, అద్దుచుండవలెను. లేక వసపొడి అంటించవలెను. గంగసింధూరము వెన్నయు కలిపి రాయవలెను. మైలుతుత్తము దొండాకు పసరు కలిపి రాయవలెను.

---

ముధునంలో పుట్టిన మొక్క మాసం తిరిగినప్పుడు పుట్టిన కొడుకు వుండవలయును.

లేక పురుగు తొలచునప్పుడు వెన్నుదిగా పట్కారుతో పట్టుకొని లాగవలెను.

## పులిపిరికాయలు

పశువు శరీరముమీద ఈ పులిపిరికాయలు వాటంతటవే పుట్టును. కొన్నికాయలు వాటంతటవే వూడిపోవును. వాటిని కోయరాదు. అట్లు కోసిన రక్తము నాపుట చాల కష్టము. ఈ కాయలు రక్తనాళము నాక్రమించి యుండును. ఇవి చర్మమున కెత్తుగా నుండినయెడల బలమైన దారముగాని, గుఱ్ఱపువెంట్రుకలుగాని తెచ్చి గట్టిగా చుట్టి జారకుండ ముడివేయవలెను. కొన్నిదినముల కవియె వాటంతటవి యూడిపడును.

## మెడనరము పట్టుట

దీనినే మెడియందురు. సాధారణముగా రైతులు ఎద్దులతో పందెములు వేసికొని బండ్లమీద ధాన్యముగాని గడ్డిగాని బరువుగాని వేసి బురదగానుండు కాలువలలో లాగించెదరు. అటువంటి సమయములలో పశువునకు మెడనరము సాగి ఒకవిధమైన నొప్పిని కలిగించును. అప్పుడు మెడ నటునిటు త్రిప్పజాలదు. ఏపని చేయజాలదు. మేతమానును. మందమతిగానుండును. క్రమేణ తెలివి తప్పిపోవును.

## చికిత్స

ఆముదముగాని వ్యాసెలైనుగాని నొప్పిగల భాగమందు మంట పుట్టునట్లు తోమి వేడియినుక కాపులుతీసిన తగ్గును. ఈ ప్రకారము బాధతగ్గువరకు చేయవలెను. ఇది నా ప్రత్యక్షానుభవము.

లేక కొమ్ముల సందు మొదలుకొని తోకముడివరకు ఒక దారముచే కొలతతీసి ఆదారమును మడతవేయవలెను. మడచిన దారమును మరల కొమ్ములసందునుండి వెన్ను మీదికి కొలతవేయగా మొదటికొలతలో సగము అగును. అచోటగుర్తుపెట్టి వెన్నుకు అడ్డముగా అగుర్తుమీద వాతవేయవలెను.

లేక జిల్లేడువేరుపొడి వేపనూనెలో కలిపి నొప్పిగలచోట మర్దనచేయవలెను.

లేక జెముడుపాలు ఆముదముకలిపి మర్దన చేయవలెను.

లేక వెన్నలో దుష్టపాపపసరు కలిపి రుద్దవలెను.

లేక మెడకు పెద్దదుంగకట్టి చెరువులో యీదించిన తగ్గును.



అరుద్రకార్తి విత్తనానికి అన్నం పెట్టిన యింటికి సెగిలేదు.

# మాద వగైరా వ్యాధులు

## ఇరువది మూడవ భాగము

### తోకమాద (Cancerous tail)

దీనినే తోకగురుజు అందురు. పశువుతోకయొక్క కుచ్చుండు స్థానమునందు ఈ వ్యాధి పుట్టును. కుచ్చుపైభాగమంతయు నల్లబడి వెండ్రుక లూడిపోవును. తోక చివరభాగమున ఉంగరమువలె మెలికలు తిరిగి బిరుసుగానుండును. క్రమముగా తోక కుచ్చు వెండ్రుక లూడిపోయి మొండితోకగానుండును. పశువు సరిగా మేతమేయక వెల్లిచూపులు చూచుచు తిరుగుచుండును.

### చికిత్స

పశువుతోక చివరభాగము కత్తితో తెగగొట్టి గోరువెచ్చని నేతిలో ముంచవలయును. తరువాత కలబందమట్టలు, సైంధవలవణము, ఆవాలు, అల్లము సమభాగములుగా తెచ్చి నూరి పులికలిలో మూడుదినములు నానవేసి పూటకు గొట్టము త్రాగించవలెను. వెండ్రుకలు మొలచుటకు ఉమ్మెత్తతో నీలిమందును నూరి 4, 5 దినములు రెండుపూటలు పట్టించుచుండవలెను.

లేక తోక తెగగొట్టినప్పటికి కూడ మరల తోక చెడిపోవుచుండును. కాన ఎక్కడకు తోక కుళ్ళి ఎండిపోవునో అంతవరకు అనుమానములేకుండ తెగగొట్టి మూనెలో ముంచవలెను. తరువాత టింక్చర్ అయోడిన్ ఆపుండుకు రాయవలెను. ఈగల ముసర నీయరాదు. తోకఎముక ఉంగరములమాదిరిగా ఊడినపుడు తోకమాదయని గ్రహించి అనుమానములేకుండ నరకవలయును.

### నైరూప్య (Allopathic) వైద్యము

ప్రతిదినము లోషనునీటితో కడుగుచు టింక్చర్ అయోడిన్ ఘాటయిన కార్బాలిక్ ఆయిల్ గాని రాయుచుండిన తగ్గును. లేక ఫ్లావిన్ ఆయింటుమెంటునుగాని ఫినైల్ ఆయంటుమెంటులో కొద్దిచుక్కలు కార్బాలిక్ ఆసిడ్ కలిపిగాని రాసిన తగ్గును.

### కొమ్ముమాద (Cancerous horn)

పశువుయొక్క కొమ్ములు మనచేతివ్రేళ్ళకున్న, కాలి వ్రేళ్లకున్నటువంటి గోళ్ళవంటి పదార్థముతో నిర్మింపబడినవిగా నున్నవి. ఇట్టికొమ్ములు జంతువులయొక్క యావజ్జీవమును

---

ఆరుద్ర ప్రథమ పాదమున విత్తనము వేస్తే ఆరంభములు చేయును.

పెరుగుచుండును. అకస్మికముగా నూడవలయునే గాని తమంతటవి ఊడవు. ఒకానొకప్పుడేదైన దెబ్బతగిలినపుడు ఇట్టికొమ్ము లూడిపోవును. కొమ్ము తిరిగి క్రిందపడినపుడు నిజమైన కొమ్ముఅమర్చబడియుండును. ఆకొయ్యచుట్టును స్పర్శగ్రహణ శక్తిగల చర్మమమర్పబడి యుండును. దానియందసంఖ్యాకములగు నాడులును, రక్తవాహికలును



గలవు. నిజమైనకొమ్మునను నటికినను బాధకలుగనేరదుగాని, ఈకొయ్యభాగము నెంత స్వల్పముగ గ్రుచ్చినను ఎక్కువబాధ కలుగును. కొయ్యచుట్టునుండు చర్మములో నాడులును, రక్తవాహికలు నుండుటచేతనే ఈబాధకలుగుచున్నది. ఈ కొయ్య అడుగు భాగమున మెదడను పదార్థముండును. పై పటమును చూచిన మీకే అర్థమగును.

ఈ మెదడుభాగమునకు చీము సంబంధమైన సూక్ష్మజీవులు ప్రవేశించి కొమ్ము మాదయను వ్యాధిని కలిగించును. ఈ మాద ఒక కొమ్మునకుగాని, రెంటికిగాని రావచ్చును. తలను కొంచెము గురద ప్రారంభమయి, యెఱ్ఱని వర్ణముగల బొబ్బలు కనపడును. ఇవి క్రమముగా పసుపువర్ణముగా మారును. ఇవి చితికి తేనెతుట్టె ఆకారమువహించి పొక్కులుకట్టును. ఈపొక్కుల యడుగున పుండ్లుయేర్పడును. ఈవ్యాధిని అశ్రద్ధ చేసిన యెడల పశువున కపాయము కలుగును. ఇది బహుమొండివ్యాధి. పశువు తలలోనున్న మెదడుకు ప్రవేశించి క్రమముగా కొమ్ములోపలి భాగముకూడ తినుచుండును. ముక్కుల నుండి చీముగాని, చీమునెత్తురుగాని. పడుచుండుటవలన పశువు కొమ్ము వాలిపోవును.

విరిగిన కొమ్ము మాదయైన పశువు చాల సుశించి పోవుచుండును. ప్రత్యేకముగా ఈవ్యాధికలిగిన పశువు ఎక్కువగా ఒలియుచుండును. పశువునకు కొంటిగలుగును. ఈస్థితిలో పశువు చనిపోవును. నెత్తురుచిగుర్చుమాద నెమ్మదికాదు.

---

ఆయుద్రతో అదునుసరి,

## హెచ్చరిక

ఈ వ్యాధి సామాన్యముగా చికిత్సకులొంగదు. కాబట్టి ఆరంభములోనే తగు చికిత్స చేయవలయునుగాని కొమ్ము వాలిన తరువాత నేమియు లాభములేదు.

అనేకమంది పశువైద్యులు మేము నెమ్మదిచేసెదమని కొంతడబ్బు మందుఖర్చున కని తీసికొని తరువాత మావల్ల కాదందురు. ఇది నా స్వానుభవము.

మన రైతులలో చాలమంది నెమ్మది యగునేమోయని ఆతురతతో అనేక చికిత్సలు చేయించెదరు. కొన్ని మంచి బండిగిత్తలకు వచ్చినపుడు రైతు విచారము, ఆతురత చెప్పనలవికాదు. మా పశు చికిత్సాలయము దగ్గరకుకూడ అపుడపుడు చక్కని గిత్తలు వచ్చును. వాటిని చూచిన నాకే చాల విచారముగ నుండును.

## చికిత్స

కాని ఇటువంటి వ్యాధిగల పశువు కొమ్ముకోసి ఈ దిగువ చికిత్సలు చేయవలెను.

కొమ్ముకోసి వెంటనే కల్లుబెల్లను వెండ్రుకలు తెచ్చి పైనవేసి యినుపకడ్డీతో కాల్చవలయును. ఇట్లు కాల్చినచో కొమ్ములోపలనుండు పురుగులకు వేడితగిలి చనిపోవును. తరువాత కాల్చిన భాగములో మూనువరకు మర్రిపాలు పోయవలెను. లేక ఇంగిలీకము, ఇటుకరాతిపాకుడు, దంతిచెక్క చూర్ణము కలిపి కొమ్ముగాయములో పోసి కట్టుకట్టవలెను. తరువాత సారాయి చటాకు, కాజఆముదము చటాకు కొమ్ముకోసిన వైపు చెవిలో పోసి కట్టుకట్టవలెను.

అప్పుడప్పుడు ఫినైల్ ద్రావకముతో కడుగుచుండవలెను.

లేక వామింటాకు మూడుగుప్పిళ్లు, నీరుల్లిపాయలు 2 తులములు, వస 1 తులము తీసికొనివచ్చి నూరి రసముతీసి ఏప్రక్క కొమ్ము వ్రాలినదో ఆప్రక్క ముక్కురంధ్రములో పోయవలెను.

నల్లజీడిగింజలు నువ్వులు కలిపి పండు జిల్లేడాకురసమును నూరి కొమ్ములచుట్టు పట్టించుము.

## ఆంగ్లేయ (Allopathic) వైద్యము

కొమ్మును కోసివేసి లోషన్సుతో కడిగి ఘాటుగల మందులను వాడవలెను. గట్టిపడుటకు అప్పుడప్పుడు ఫార్మలిన్ లోషను వాడుట మంచిది.

## పార్శ్వపుమూద

పశువు మెదడులో ఒకవిధమైన సూక్ష్మజీవులు పుట్టిన ఈరోగము కలుగును. దీనినే అర్ధాంగవాతమనియు, పార్శ్వపు వాతమనియు చెప్పవచ్చును. ఈ రోగము

---

అనుద్రలో అడ్డెను చల్లితే పుట్టదు పండును.

శిరఃప్రదేశములో నున్న పశువులకు కలుగుచుండును. పశువుమెడకు సగభాగమునకే సోకును. క్రింది పటమును చూచిన విశదముగా తెలియును.



పార్శ్వప్రమాద

పశువు తలను ఆరంభములో అటునిటు ఆడించుచుండును. ఒకముక్కునుండి మాత్రమే చీమిడివంటి పదార్థముకారుచుండును. చెవిలోనుండి కూడ ఒకవిధమగు స్రవము స్రవించుచుండును. ఒక కొమ్ముభాగమునకు, కొమ్మువైపున నున్న చెవికి ముక్కురంధ్రములకు ఈ వ్యాధిసోకును. ఒకకన్ను లోపలికిపోవును. నోటినుండి చొంగ పడుచుండును. ఈ వ్యాధిని ఆరంభములో గుర్తించలేక కొమ్ముదొల్లలందురు. కాబట్టి జాగ్రత్తగ పరీక్షించవలెను. పసుపు పచ్చని, చిక్కని చీమిడి చెవులనుంచి ముక్కుల నుంచి పడుచుండును. చాల దుర్వాసనవేయును. వ్యాధి ముదిరినకొలది టుప్పెటుప్పెలుగ చీమిడి పడుచుండును. ఈ చీమిడి కోడిగ్రుడ్డులోనుండు పచ్చని ఆకారముగనుండును. పశువు శుష్కించిపోవును. చెవిలోపురుగులు పడును. పశువు చూచుటకు చాల అసహ్యముగా నుండును.

## చికిత్స

ఈ వ్యాధికికూడ తగిన చికిత్స లేదు. ఇదియును మొండివ్యాధియై యున్నది. ఈ వ్యాధి తగిలిన పశువు 5, 6 మాసములవరకు జీవించును. తరువాత చనిపోవును. కాబట్టి ఈ వ్యాధిగల పశువును ప్రత్యేకస్థలమునుంచవలెను. ఇది అంటువ్యాధియై యున్నది. పశువుముక్కులను, చెవులను, లోషనునీటిలో కడిగి టించర్ అయోడిన్ చెవిలో వేయవలెను.

పశువుకొమ్ములనుండిమూతివరకు చుక్కలు పెట్టవలెను. చెవిచుట్టు మూడు చుక్కలు పెట్టవలెను. మచ్చిలిగంటయొద్ద ఒకచుక్కపెట్టవలెను. ఈవ్యాధి నెల రెండు నెలలవరకు యుండునుగాని త్వరగా తగ్గదు.

---

చిన్న పుష్యాల కార్తెలో చిట్టెడు వడ్లు చల్లితే పుట్టెడు వడ్లు పండును.

## చెవిమాద (Cancerous ear)

### స్వభావము (Causes)




చెవిగూబలో వాతసంబంధమైన పురుగులుపట్టి కురుపులు లేచుటగాని, నర సంబంధమగు అస్వస్థతవలనగాని, ఈవ్యాధి కలుగును. ఇవి లేచుటచే చెవిమధ్యభాగము, లోపలి భాగము, వెలుపలిభాగముకూడ వాపుపుట్టును. ఆ వాపువలన పోటు అధికమై బాధ కలుగును. పశువునకు చలిగాలి తగిలినపుడును, అటునిటు తిరుగునపుడును, మేత తినునపుడును నొప్పికలుగును. ఈవ్యాధికితగిన చికిత్సచేయనిచో కురుపులు పెద్దవై చెవిని వ్రేలాడవేయును. చెవిమొదట చాల వాపునొంది యుండును. చెవిబయిట భాగము నందుకూడ కురుపు లుండును. ఈ కురుపులు ఎఱ్ఱగానుండును. కురుపులు చితికి దుర్వాసనవేయును. ఈగలు ఆ రసిపైన వ్రాలి పురుగులుపట్టును. క్రమముగా చెవిభాగమునంతను పురుగులు తినును. పశువు క్షీణించును చాల వికారముగా నుండును. ఈ దుర్వాసనను తక్కిన పశువులు పసిపట్టును. పైపటమునందు చూచిన మీకే తెలియును.

### ఆయుర్వేద (Native) వైద్యము

ఈ వ్యాధి ముదిరినయెడల నెమ్మదియగుట చాల కష్టము. పెద్దజంతువులకు, విశేషముగను మందీయవలెను. చెవిచుట్టు వాపున్నయెడల వేడికాపులు తీయవలెను.

చెవిలో బొక్కాకుపసరు పోసి దూది పెట్టవలెను.

లేక వామింటాకు ఉప్పుతోనూరి రసముతీసి చెవిలో పోయుము.

లేక మార్కండాకుపసరు 4 తు, చిగురుప్పు ½ తు, కరిమాపము ¼ తు, తెచ్చి గోమూత్రముతో కలిపి చెవిలో పోయుము.

లేక సీమకసిందాకు, రాతిసున్నము నూరి చెవిలో పిండుము.

లేక వేపనూనె ½ తులము, గోరింటాకుపసరు ½ తులము, వేపాకుపసరు ½ తులము, మిరియాలపొడి ½ తు కలిపి పోయవలెను.

చెవి మొదటి భాగమునందు 5, 6 చుక్కలు పెట్టవలెను.

## వైరూప్య (Allopathic) వైద్యము

హైడ్రాజన్ పెరాక్సైడ్‌తోగాని, పర్మాంగనేట్ లోషనుతోగాని చెవిని కడుగుచు టింక్చర్ అయోడిన్‌లో వేపనూనెకలిపి కొన్ని చుక్కలు వేయుచువచ్చిన తగ్గిపోవును.

## తలమాద (Cancerous head)

వాతము వలనగాని, తలశుభ్రముగాలేకపోవుటవలనగాని, మెదడులో యేవ్యాధి యైన కలుగుట వలనగాని, పశువుల కీవ్యాధి కలుగుచున్నది. ఈవ్యాధి ఒకవిధమయిన సూక్ష్మజీవివలన కలుగుచున్నది. మెదటి భాగమందు పురుగులుచేరి ఈ వ్యాధి కలుగు చున్నది.

తలలో చీము సంబంధమైన పరుపులులేచును. ఆరంభములో దురదయుండును. ఈపరుపులు ఎరుపు రంగుగా నుండును. ఈ పరుపులు తామరవలె గుండ్రముగ నుండక వంకరలుగ నుండును. కొంచెము పసుపు వర్ణము గల చీముండును. ఈచీమువలన పశువు భూమిమీద తనతలను ఆన్చుచు విచారముగ నుండును. వ్యాధి ముదిరినకొలది ముక్కులవెంట ఆచీము పడుచుండును. మెదడు క్రమేణ లేని తుట్టిఆకారము వహించి తల మెత్తబడి పశువునకు బాధ యెక్కువై చనిపోవును.

### చికిత్స

ఆవుపాలు అర్ధశేరు, సొంటి 1½ తు, వస అరతులము కలిపి ప్రతిదినము ఈ మోతాదు వంతున పక్షము దినములు త్రాగించవలెను.

తలపైన పురుగులను చంపు మందుచే మర్దనచేయుచుండవలెను.

లేక సూరేకారము ½ తు. నీరు అర్ధశేరు కలిపి మెదటిపైన పోయవలెను.

గుఱ్ఱపుమూత్రము, నిమ్మకాయరసము, పచ్చకర్పూరము కలిపి రాయుము.

గంధకపుపొడి 2 తులములు, మైలతుత్తముపొడి 1 తు, పటికపొడి 1 తు వ్యాసులైను 5 తు. కలిపి పూయుము.

---

పుబ్బలో పుట్టెను చల్లుటకంటె ఆశ్లేషలో అడ్డెడు చల్లుట మేలు.

## వైరూప్య (Allopathic) వైద్యము

కార్బాలిక్ ఆయింటుమెంటుగాని, లేక కాపర్ సల్ఫేట్ ఆయింటుమెంటు గాని లేక అయోడిన్ ఆయింటుమెంటుగాని రాసిన తగ్గును.

## పంపరవాపు (Scrofulous Tumours)

పశువు చెవిక్రిందుగా మెడపను, దవుడ క్రిందుగా నుండు స్థానమునందును ఈ వ్యాధి కలుగును. ఈ వాపు తరచుగా చలిగాలి తగులుటచేత కంఠమువరకు వ్యాపించును. గడ్డలు గడ్డలుగా లేచి వాచును. ఈవాపుగల భాగము గట్టిగ రాయివలె నుండును. అందువలన వెంటనే చేయనిచో ఆవాపు పెద్దవుండ్లుగా మారి పశువున కూపిరి యాడక చనిపోవుటయు గలదు. కొన్ని పశువులకు గుండెలోని రక్తముచెడి నీరుగా మారి వాపుగాపుట్టి చనిపోవును.

### చికిత్స

దీనికి వేడికాపులు తీయవచ్చును.

లేక చవుడు సున్నము కలిపి వెన్నవెంట దుక్కులు పెట్టవలెను.

లేక తురక వేపాకు నీటిలోవేసి కాపులు తీయవలెను.

లేక బండిగురివింద ఆకు పసుపు పాపుసేరు, సున్నము 4 తులములు కలిపి వాపులకు రాయవలెను.

లేక చింతపండు పులుసు అరసోలెడు, సున్నిపిండి గిద్దెడు కలిపి రాయవలెను.

ఇదివరకు కల్లవాపులకు చూపించినరీతిగా ఈ వ్యాధికి కూడ వాతలు వేయవచ్చును.

### చేరు వాపు

ఇదివరకున్న పాతగాయములలో సూక్ష్మజీవులు చేరుటవలనగాని చలిగాలికి లోనగుటవలనగాని చేరుయొక్క రేగుదలవలనగాని గజ్జెరియావ్యాధివలనగాని అతిమూత్ర వ్యాధివలనగాని ఈవాపు కలుగవచ్చును.

### లక్షణములు

ముం పశువు అంగముమీదగాని లేక అంగముమీదనుండు తిత్తిమీదగాని వాపు పుట్టును. అది క్రమముగా పెద్దదై చిలికి పుండగును. పశువు చాల బాధపడుచుండును. అప్పుడప్పుడు కండ్లనుండి నీరు గార్చును. వాపు ఎక్కువైనకొలది పశువు నడువజాలదు. మూత్రకోశము వాచును. మూత్రము పోయలేక బాధపడుచుండును. ఈవ్యాధి పేగులకు కూడ వ్యాపించును. ఇట్టి సమయములో పశువునకు అపాయము కలుగును.

---

ఆశ్లేషలో వూడిచినట్టయితే అడిగినన్ని ధాన్యాం.

## చికిత్స

ఆరంభములోనే ఈ వాపునకు వేడికాపు పెట్టుట మంచిది. తేలికయగు ఆహారపదార్థములు పెట్టుచుండవలెను.

నల్లజీలకర్ర 4 తులములు, ఉప్పు 1 తులము, నల్లుమ్మెత్తాకు రసములో మెత్తగా నూరి కుండలో పోసి ఉడికించి ఆ తైలమును వాపునకు రాయవలెను. తరువాత పిడక నిప్పుచే కాచవలెను.

లేక చిన్నపిల్లల నీరుడు 2 భాగములు, ఉప్పు 1 భాగము కలిపి ఆ నీరుడు బాగుగా ఇగురనిచ్చి అందులో ఉప్పు 2 తు. ఉత్తరేణిభస్మం 1 తు. కలిపి పశువునకు దాణాగా పెట్టుచుండవలెను.

లేక గచ్చాకు 5 పిడికిళ్లు, ఆవాలు 1 తు. నల్లజీలకఱ్ఱ 1 తు. వెల్లుల్లిపాయలు 1 తు. త్రొక్కి ఉండలుచేసి దినమునకొకటి వంతున తినుపించుచుండవలెను.

## అఱ్ఱువాపు (Yoke gall)

ఎద్దు లెక్కువగా బరువులు మోయుటవలనను బురద నేలలలో బండ్లులాగుటవలనను, విసుగువిరామములేక రాత్రింబవళ్ళు బండిపని చేయుటవలనను, మెడమీద ఆనెడికాడి గరుకుగా నుండుటవలనను, పగ్గపు రాపిడివలనను, బండి ముందు వెనుక బరువులు సమానముగ లేకపోవుటవలనను, అచ్చటి చర్మము ఒరసికొని పోవుటవలనను, క్రొత్తమాడలను కలుపునపుడు మెడమీదకాడి ఆనెడు ప్రదేశమందు, చెమట ఎక్కువగా పట్టుటవలనను, పశువుచర్మము ఎక్కువగా బిరుసుగా నుండుటవలనను ఈవాపు కలుగుచున్నది. కొన్ని వాపులు మెత్తగానుండును. మరికొన్ని గట్టిగా నుండును.

ఆ స్థలములలో ఆరంభమునందు దుందగానుండి క్రమముగా అది గట్టిపడి వాపుగా పైకి కొంచెము తేలును. ఈవాపు నానాటికి పెద్దదియై పెద్దగుమ్మడికాయంత పరిమాణము కలదగును. ఈ వాపులో చెడునీరుండును. మరికొన్ని వాపులు గట్టిగానుండి పశువు పనిచేయలేక మెడ నటునిటు త్రిప్పుచుండును. బలవంతముమీద పనిచేసినయెడల మెడ నటునిటు త్రిప్పలేక మిక్కిలి బాధపడుచుండును. మిగుల వికారముగానుండును. గట్టిగానుండి వాపు కొన్నిదినములవరకుండి పగిలి రసికారును. గుమ్మడికాయవలె నుండు వాపును శస్త్రము చేసినచో దానినుండి మురికినీరు కారును. నీరు తగ్గినతరువాత పశువులకు బాధతగ్గును. కొన్నిమాడలకు గంటి అఱ్ఱువాపు కలుగును. ఈవాపు క్రొత్తచేసి అఱ్ఱుమీద పుండుపడును. ఈపుండు పొరలుపొరలుగా నుండి ఎరుపురంగుగానుండును. అది త్వరగా మానదు. కాని అఱ్ఱువాపువలన పశువులంత ప్రాణాపాయము లేదుగాని మిగుల బాధనొందును. అది భాగమంత వాపుయుండి నెత్తురున్న పశువు కొంత కాలములో మరణించును.

---

మఖలో చల్లిన విత్తనము మచ్చలు కడుతుంది.

### చికిత్స

గట్టిగానుండు వాపులను వెంటనే ఇనుక వేయించి కొవ్వులు తీసిన వెంటనే తగ్గును.

వాపు కురుపుగా తేలి పుండయి పగిలినయెడల పటిక నీటిచే కడగవలెను.

అత్తులయందు ఎరుపు, నలుపు, తెలుపు రంగులుగల కొయ్యగండలు పెరిగిన యెడల శస్త్రముచేసి తరువాత కల్లుబెల్లము కలవె ద్రుకలు మెత్తగానూరి ఆ పుండుపైన పెట్టి అగ్నిచే కాల్చవలెను.

### వాపులకు

బండిగురివెందాకు పసరు 6 తు, తడిరాతిసున్నము 2 తు, కలిపి రాయుము.

లేక బిళ్లదుమసి 2 తు, నిమ్మకాయంత వెన్నపూస కలిపి ప్రతిదినము వాపునకు రాయుము.

లేక వరిపొలములందుండు నత్తలలో పెల్లనివి తెచ్చి కాల్చి సున్నముచేసి అముదములో కలిపి రాయుము.

లేక బొంతజెముడుపాలు గిద్దెడు, ఆవు పేడరసము 3 గిద్దలు, కలిపి వాపునకు పట్టించుము.

లేక కొందరు ముక్కుకొననుండి తోకతుదివరకు త్రాటిచే కొలిచి ఆ త్రాటిని సగభాగముచేసి మరల కొలిచి ఆస్థలమందు చురకలు వేయుదురు.

### గంగడోలుక్రిందవాపు (Amasarca)

ఈ వాపు వాతదోషమువలన వచ్చునని నా యభిప్రాయము. ఈ వాపు ముఖ్యముగా పశువు ముందురెండు కాళ్లమధ్య పైభాగమున వాచును. దీనినే మనవారు పేడపురుగు పట్టుటవలన కలుగునని తలంచెదరు. ఈ వాపువలన పశువున కేమియు అపాయము లేదుగాని వ్యాధిముదిరి వాపు పగిలినయెడల క్రమేణ తగ్గును.

ఆరంభములో కొంచెము వాపుండును. దినదినమునకు వ్యాధి పెంపొంది పశువుయొక్క గొంతుమొదలు గంగడోలు వరకును, ముంగుకాళ్లను వాచును. తగిన చికిత్స చేయక ఆవిధముగనే యుంచినచో ఈ వాపు చాల పెద్దదై పశువునకు బాధ కలిగించును. క్రమముగా వాపు ఎక్కువగుచుండును.

### చికిత్స

ఒక పదునైన చాకుతోగాని, సూదములుతోగాని ఆ వాపుపైన నెత్తురువచ్చునట్లుగా గీయవలెను. తరువాత ఉడికించిన పేడరసమును, ఆ వాపుమీద చీపురుకట్టచే కొట్ట

---

పుబ్బలో పుట్టెడు చల్లుటకంటె మఖలో మానెడు చల్లుట మేలు.

వలెను. కాని కొందరు వైద్యులు ఆ వాపును కత్తిచే చీల్చుదురు. వెంటనే రక్తము ఎక్కువగాకారి గాయము పెద్దదగును. మరల వెంటనే చెడునీరు చేరి పశువును బాధించును. ఇటువంటి సమయములలో వేడికాపులు తీయుటమంచిది.

బండిగురివెందాకుపసరు నీరుసున్నముతో నూరి పశువు వాపునకు పట్టించ వలెను.

లేక ఆవిసె ఆకు నీరుసున్నములో నూరి వాపునకు రాయుము.

లేక జిల్లేడాకుపసరు దుష్టపాకుపసరు వెన్నపూస, పసుపు కలిపి ఆ వాపు భాగమునకు పూయుము.

## బుడ్డగొట్టుట

సాధారణముగా మనదేశములో గిత్తలకు రెండు సంవత్సరములు మొదలు అయిదు సంవత్సరములలోపుగా, అనగా 2 పండ్లు మొదలు 6 పండ్లు వచ్చునప్పటికిగాని బుడ్డగొట్టరు. గిత్తకు బుడ్డగొట్టునప్పుడు త్రాడుగట్టి క్రిందకు పడద్రోసి వృషణములను గట్టిగా పట్టుకొని దానిపైనున్న నరమును చేతితో మెల్లగా క్రిందికి జారతీయుదురు. తర్వాత వృషణముల పైభాగమున నొక కోకలియు క్రిందిభాగమున నొక కోకలియు పెట్టి వృషణముల పైభాగమున గట్టిగా నొక్కి రెండవనరమును, కడుపులోనికి త్రోయుదురు. తరువాత పైనున్న నరమును కోకల్లమధ్యనుంచి వృషణములలోనికి జారతీసి క్రింద కొట్టెదరు. అంతట వృషణములలోని మూలపదార్థము పిండివలె నగును. తరువాత కోకల్ని తీసి వృషణములకు ఆవుపేడ, పసుపు కలిపి రాచెదరు. వెంటనే కోడిగ్రుడ్లు, పాలు పెట్టుదురు. పొగరుబోతు గిత్తలకు రెండుముక్కుల మధ్యనున్న కండను లావుగాపట్టి దానిగుండ ఒక అంగుళము త్రాడు ముక్కులో దూర్చి కొమ్ములకు గట్టెదరు. ఇందుచే గిత్తపొగరు తగ్గును. 10, 15 దినములకెల్ల పశువు ఆరోగ్యముగా నుండును.

కాని యిప్పటి పరిస్థితుల ననుసరించి పశువులకు బుడ్డలు సరిగా కొట్టకపోవుట వలన ఆ భాగము వాచి పుండై మరల వెటరినరీ ఆసుపత్రులకు తీసికొనిపోవుచున్నారు. కాబట్టి లోపలి పలుకంతయు పూర్తిగా నలుగునట్లు కొట్టినచో ఆవులమీదికి పోజాలదు. వృషణముల పైభాగ ముబ్బి 10, 15 దినములలో దానిలోపలి పలుకంతయు శీర్ణమై తిత్తిమాత్రమే వ్రేలాడుచుండును. బుడ్డకొట్టినతరువాత ఇరువదిపాళ్ళ నేతిలో 1 పాలు కార్బాలిక్ ఆసిడ్‌ను కలిపి కొన్ని దినములు ఆ పుండుమీద వేసిన నెమ్మదియగును. బుడ్డగొట్టుట ఆరగంట పట్టును.

## బర్డోజీ మాస్కు లెటరు

ఇదియొక పెద్ద పట్కారువలె నుండును. ఇది వెటరినరీ ఆస్పత్రిలలో నుండును. దీని పిడివద్ద కొద్ది బలము నుపయోగించిన ఎక్కువ బలముగా నొక్కునట్లు యేర్పాటు చేయబడినదిగ నుండును. ఇది మూసినపుడు నొక్కుటకు ఏర్పాటైన భాగములు ఒక

---

పువ్వులో విత్తుడుకంటే పూరికేవుండడం మేలు.

దానికి ఒకటి సందులేకుండా కలిసికొనియుండును. అందువలన వీటిసందున ఏమియుంచి నప్పటికి అదియంతయు నలిగిపోవును. దీనివల్ల ఒక్కొక్క నరమున నిమిషమాత్రము నొక్కుటచేత గుల్లలు హరించుకొనిపోయి జంతువులు నపుంసకత్వమును పొందును. ఈ ఆపరేషను అయినతరువాత ఏవిధమైన చికిత్సయును అవుసరములేదు. పశువులలో ఈ ఆపరేషన్ విత్తులు తీయకుండగను, నెత్తురు రాకుండగను చేయవచ్చును. ఈ పనిముట్టుచే వృషణముల దగ్గరనున్న నరములు నొక్కినప్పుడు టప్మను శబ్దము వినబడును. తరువాత బోరిక్ ఆయింటుమెంటు గాని సల్ఫర్ ఆయింట్‌మెంటు గాని రాచి విడిచిపెట్టుదురు. తరువాత ఒకటిరెండు దినములువాచి క్రమముగా తగ్గును. ఈ పశువులకు జ్వరముగాని మరి యొక బాధకాని కలుగదు. కనుక వెంటనే పనిలో కలుపవచ్చును. కాని యీ ఆపరేషను చేయించుటవలన పశువు బుడ్డకొట్టినంత బలము గలదిగా నుండదని అనేక మంది రైతులు చెప్పిరి.

కాని బుడ్డకొట్టుట ఒక అంగుళము పట్టును. ఈ పనిముట్టుచే నొక్కినచో రెండు నిమిషములు పట్టును. బుడ్డకొట్టిన జంతువు కొన్ని వారములు వాపువల్ల బాధ పొందును. చాలకాలము వరకు వాపు తీయక గడ్డకట్టి యుండుటకు ఎక్కువ కాలము పట్టును. పై పనిముట్టుచే చేసిన, వాపు కొంచెముగా వచ్చును. ఆ వాపు ఒకటి రెండు దినములలో తగ్గును. బుడ్డ కొట్టినపుడు జంతువు పడు బాధ మెండైనది కాని యీ పనిముట్టు వలన కలుగు బాధ చాల తక్కువ.

గిత్తను బుడ్డకొట్టకుండ నపుంసకత్వము కలుగునట్లు చేయుటకు చికిత్స మనరైతులు, గిత్తలు మొదలగు వాని బీజములను నలుగగొట్టుట, కత్తిచే తీసివేయుట మొదలగు పనులు మానివేయుచున్నారు. కాని కొన్ని రకముల ఔషధ ప్రయోగముల వలన వానికి నపుంసకత్వము గల్గింప వచ్చునని కొన్ని గ్రంథములను యునాని వైద్యమునందు జెప్పఁబడి యున్నది.

ఆవు క్రొవ్వు పావుశేరు, నక్క మాంసము కలిపి రెండు గడియల ప్రొద్దెక్కిన తరువాత తినిపించ వలెనని ఒక గ్రంథములో వ్రాయబడి యున్నది.

## గొంతులో కురుపులు

పశువుయొక్క గొంతుక శుచిగా లేనప్పుడు గాని గొంతుకలో ఒక విధమైన సూక్ష్మజీవులు ప్రవేశించి నిలుకడగా నుండుటవలన గాని, గాలికుంటు, మశూచి మున్నగు వ్యాధులు సోకుటవలన గాని ఈ కురుపులు పుట్టుచుండును.

గొంతుక వాపువల నొందవచ్చును. నోటిలో ఒకవిధమైన చొంగ పడుచుండును. నోటినుండి దుర్వాసన వచ్చుచుండును. కురుపులు ఎరుపురంగుగా నుండును. పశువు అపరిమితముగా బాధపడుచుండును. గొంతుకలో పోట్లు పొడుచుచున్నట్లుం

---

పుబ్బలో చల్లిన ముబ్బుతో ముత్తుకొనేది.

డును. ఊపిరివీల్చుట కష్టముగా నుండును. మేత మున్నగువానిని తినజాలదు. జావ మొదలగు ద్రవపదార్థములను త్రాగును.

## చికిత్స

వెదురుగొట్టముగాని, పేముచువ్వగాని పశువు నోటియందుంచవలెను. తరువాత ఆ గొట్టముగుండా మన చేతిని పోనిచ్చి ఆ కురుపులను తాకి కనుగొనవలెను. తరువాత పక్వమునకు వచ్చినచో ఆ కురుపులను చిదుపవలెను. ఆపైన పటికనీటితో కడిగి తగిన మందు వేయవలెను.

ఉప్పు 3 తులములు, వేడినీరు అర్ధసేరు కలిపి త్రాగించవలెను.

లేక పాతచింతపండు రసము అర్ధసేరు త్రాగించవలెను.

లేక వాకుడుపండురసము 10 తులములు లోపలి కీయవలెను.

లేక వెల్లుల్లిపాయ రసము 5 తులములు త్రాగించవలెను.

## గొంతుకలో వస్తువు లడ్డముపడుట

ఆహారవాహిక పశువుయొక్క గొంతునకు ఎడమభాగమందుండును. దీనికి స్పర్శజ్ఞాన మధికము. ఆహారపదార్థములు దీనికి తాకిన వెంటనే దానిని లోపలికి పోనిచ్చి



వెనుకభాగమందు ముడుచుకొనుచు దానిని ముందునకు జరుపును. ఇట్లు మేత నీరు కొంత పోయినతరువాత తిరిగి వెనుకభాగము ముడుచుకొనుటవలన ఇది క్రమముగా జరుగుచు జీర్ణాశయములోనికి బోవును. ఇది జాలరుసంచివలె నుండును. మరియు పశువునోటికి నెమరు తెచ్చుకొనుట కూడ ఈమార్గముననే. ఈగొట్టము

యొక్క లోపలిభాగమె యెల్లప్పుడు తడిగా నుండును. అందువలన ఆహారము ఈ గొట్టముగుండా జారిపోవును వెనుకవుటయుంనుండు బొమ్మను చూచిన ఆహారనాళము నుంచి ఆహారకోశమువరకుండు భాగములను చూడుము.

పశువులు నములకుండగనే చెరుకుగడలు, దుంపలు, తాటిపండ్లు, నారదినుసులు, గుడ్డపీలికలు మొదలగువానిని ఆతురతతో తినునప్పుడు గొంతుగ్రోవిలో అనగా పైన చెప్పిన ఆహారనాళములో చిక్కుకొని అడ్డుతగులును. వానికి వాడిగల అంచులుగాని, మొనలుగాని యున్నయెడల గొంతునకు గాయము లేర్పడును.

## లక్షణములు

జంతువుయొక్క గొంతుక నొప్పిగా నుండును. దగ్గుచుండును. చొంగ కార్చు చుండును. కడుపుబ్బును. కడుపుబ్బినయెడల పశువు చనిపోవచ్చును. ఆహారనాళము కొన్నిటికి వాచును. ముక్కులగుండ నీరు కార్చుచుంకును. కడుపుబ్బకుండ నుండిన యెడల కొంతకాలము జీవించును.

## చికిత్స

వెటరినరీ వైద్యశాలలో ఒకవిధమైన పనిముట్టు గొంతులోనికి దూర్చి అడ్డును తొలగించుదురు. పశువు గొంతుకను ఒత్తరాదు. ఒక యినుపకడ్డీని పశువు నోటికి పోనిచ్చి జాగ్రత్తగా లోపలికిగాని బయటికిగాని లాగవలెను. లాగినతరువాత మెత్తని మేత, నూకలజావ పెట్టవలెను.

## సర్పి

ఈ వ్యాధి వాతరోగములోగాని, పాండురోగములోగాని, రక్తప్రసరణమునకు ఆటంకము గలుగుటవలనగాని, వేడిగల పదార్థములను మేపుటవలనగాని రావచ్చును. సర్పము ఏమాదిరిగా త్వరగా అటునిటు ప్రాకుచుండునో ఆదేమాదిరిగా ఈ సర్పి పశువు శరీరమంతటను వ్యాపించును.

## లక్షణములు

ఆరంభములో పశువునకు జ్వరము కలుగును. పశువు కంఠములోపలనో, తదితర భాగములందో ఒకవిధమైన కురుపులు లేచును. ఇవి లేచినవెంటనే త్వరత్వరగా ఆయా ప్రదేశములకు ప్రాకును. నోరు తెరువజాలదు. నోటివెంట ఒకవిధమైన చొంగ కారు చుండును. దాహ మెక్కువగా నుండును. వ్యాధి ముదిరినకొలది నోరు తెరువజాలక ఒకవిధమైన దుర్వాసన కొట్టును. నాలుక నటునిటు త్రిప్పజాలక రెండు దవుడల మధ్యగా కరచుకొనియుండును. మూతిభాగమందైనచో ఆ భాగమంతయు వాచును. ఉచ్ఛ్వాస నిశ్వాసముల నాటంకపరచును. క్రమేణ కంఠముదగ్గరగాని, మూతిమీద

వుత్తరలో చల్లినపయిరు కత్తరలో నరికిన కొయ్య.

గాని, యున్న వాళ్ళ గంగడోలునకు దిగును. ఈవిధముగా 3, 4 దినములుండి ఉచ్ఛ్వాస నిశ్వాసములు లాడక మృతినొందును.

## చికిత్స

చేదుజీలకర్ర 1 తులము తీసికొని నేతితో కలిపి ఆ పర్విభాగములకు రాయవలెను.

లేక నల్ల ఉమ్మెత్తాకురసము రాయవచ్చును.

తప్పకుండ విరేచనమునకు మందీయవలెను. పటికనీటితో నోటిని కడుగుచుండవలెను.

## హెచ్చరిక

ఈవ్యాధి తగిలిన పశువును ప్రత్యేకముగా నుంచుట అత్యవసరము. అనుభవముగల వైద్యునకు చూపించి తగిన చికిత్స చేయవలెను. కొందరు మంత్రములను పెట్టించెదరు. ఎన్నిమంత్రములు పెట్టినప్పటికి ఆరంభములోనే తగినచికిత్స చేయనియెడల లాభములేదు. ఈ వ్యాధి మనుష్యులకు సోకుటకంటె పశువులకు నాలుగురెట్లు విస్తరించును.

## చెవిలో చీము

చెవిగూబలోగాని, మధ్యగూబలోగాని, వాపు కలుగును. ఇది వాతమువలన గాని, కొరకవలనగాని, లోపల వ్యాధి ఆరంభించి పైకి వ్యాపించగా తేలును. చలిగాలి తగులుట వలన ఈవాపు ఎక్కువై లోపల ఒకవిధమైన పుండు సంభవించును. ఒకటిరెండు దినములైన తరువాత దుర్వాసనపుట్టి పసుపురంగుగల ద్రవము కారును. దీనినే చీము అందురు. ఈ చీము వచ్చినతరువాత కొన్ని సమయములందు చెవిలో వ్రణముగా తేలును. ఈ వ్యాధి త్వరగా నెమ్మదిగాదు.

## చికిత్స

ఈ వ్యాధిగల పశువుతో పనిచేయించరాదు. చెవిలో మందు పోసినతర్వాత చెవిని కొమ్మునకు కట్టవలెను. సబ్బునీటితో పిచికారీ చేయవలెను. వాతమువలన చెవులో నుంచి రసి కారుచున్న చాలకాలమునకుగాని తగ్గదు.

కలబందమట్టను కాల్చి రసము పిండి చీముతోవున్న చెవులో రెండు మూడుచుక్కలు పోయవలెను.

లేక గవ్వసున్నము కాల్చి పొడిచేసి బాగుగా చెవిలో వేసి, తరువాత నిమ్మ పులుసు అరతులము పోయవలెను.

లేక వేపనూనె 10, 15 చుక్కలు పోయుము.

లేక పటిక 2 తులములు, పసుపు 1 తులము కలిపి పొడిచేయుదుము.

---

మాలపున్నమమునకు మాదిగవాడైన చల్లడు.

లేక గంజాయియాకురసము చెవిలో పోయుము.

లేక నిమ్మపండురసము ½ తు, వేపచెక్కరసము ½ తు, రసకర్పూరము ¼ తు కలిపి చెవిలో పోయుము.

లేక సిరుల్లిపాయల రసము 3 తు, మిరియపగంధం ½ తు కలిపి పోయవలెను.

చెవిలో యేవ్యాధివలన నైన పురుగులుపడినచో పండుజిల్లేడాకుల రసము పోయుము.

లేక సారాయి 5, 6 చుక్కలు పోయవలెను.

లేక పసుపు, తురకవేపాకురసము కలిపి పోయవలెను.

## పంటినొప్పి

పంటియొక్క నరము రేగుటవలన నొందుటవలనగాని, దెబ్బతగులుట వలనగాని, ఈనొప్పి కలుగుచుండును. పండ్లమధ్య నుండెడి ఆహారము ప్రక్కుటవలనను, నోటియందుండెడి పుట్టకొక్కజాతి సంబంధమగు నొక పురుగు పన్నులనావరించి పంటినితినును. ఇంక నీవ్యాధి వాతరోగమువలన కూడ రావచ్చును.

## చికిత్స

చిత్రమూలము వేరురసము నొప్పిగల భాగమునకు పట్టించిన తగ్గును.

లేక టింక్చర్ ఫెర్రి-పర్ క్లోరైడ్ లో ఆగుగు దూదితోముంచి పంటినొప్పి పైన పెట్టుము.

లేక పొగాకుపొడి అంటించిన యెడలతగ్గును.

లేక పిప్పరమెంటుఆయిల్ 4, 5 చుక్కలు దూదితో ముంచి పండ్లసందున పెట్టుము.

లేక మాకొండాకు పసరు పట్టించుము.

## ప్రక్కదంతములు

పశువు పండ్లు సమానములేక హెచ్చుతగ్గులుగా పెరుగుటచే మేత సరిగా తిన జాలదు. దవుడలకు నొప్పికలుగును. వాతరోగమువలనకూడ దంతములు హెచ్చుతగ్గులుగా కలుగవచ్చును. లేక దంతము ప్రక్కన మరొక దంతము కలుగవచ్చును.

షరా:—ఇటువంటి దంతములను తీసివేయుటగాని లేక అకురాతిలో అరగ తీయుటగాని మంచిది. పశువులను కొనువారు పండ్లుగాని, దంతములుగాని కదలుచున్న పశువులను కొనుట తగదనియు చాలజాగ్రత్తగా ఆలోచించి కొనుటమంచిదనియు నాయభిప్రాయము.

---

హాస్యపోయిన ఆరుదినాలకు అడిగినుండా వీత్తు.

## దంతముల రంగు మారుట

కొన్ని పశువుల దంతముల రంగుమారి నలుపుగా నుండును. దంతములందలి రక్తముచెడి రంగుమారును. ఈరంగు ముదిరినకొలది దంతములు గుల్లయై ఒకవిధమైన ద్రవము గలుగును. క్రమక్రమముగా ఆగుల్లలో పురుగులుపడి పశువు బాధనొందును.

### చికిత్స

ఇంగువను నూరి ఆదంతములో పెట్టుము.

లేక పురుగులుపడిన యెడల జాగ్రత్తగా వగరుసీటితో కడిగి ఇదివరకు చెప్పిన పురుగులకు వాడుమందు లుపయోగించవలెను.

## దంతములు కదలుట

వాతరోగమువలనగాని, నిక్కోకవలనగాని, యేదైన దెబ్బతగులుటవలనగాని, గట్టి పదార్థములు తినుటవలనగాని, వృద్ధాప్యము వచ్చిన పశువులకుగాని దంతములు కదలును. దవుడభాగములకు వాతలు వేయుటవలన తగ్గును.

## తామర (Eczema)

పశువు శరీరములోనుండు రక్తము చెడుటవలన ఈవ్యాధి కలుగుచున్నది. పంగాయుడ్ అను సూక్ష్మజీవివలన కూడ ఈవ్యాధి కలుగుచున్నది. ఇది లేతజంతువులకు తరచుగా వచ్చుచుండును. పశువుతలమీదను, ముఖము, కొమ్ము, మెడ మొదలగు భాగములందును లేచును. చర్మముమీద మచ్చలుపడి నలుపువర్ణముగా నుండును. ఈ మచ్చలు గుండ్రముగానుండి ఒకనాణెము పరిమాణము కలిగియుండును. ఈవ్యాధి గాలివలనను, తాకుడువలనను మనుష్యులకు కూడ వ్యాపించును.

### చికిత్స

పశువు కేవలము బలము చెడియుండినయెడల విరేచనముకు మందీయవలెను. మరునాడు పశువుదేహము సబ్బుతో కడిగి ఆరిన తరువాత 2½ తు. గంధకపు పొడిని, అర్ధసేరు నూనెలో కలిపి రాయవలెను. ప్రతిదినము ఔషధప్రమాణముగా గంధకము కడుపులోనికి యిచ్చుట మంచిది. పశువు సిక్కిలి శుష్కించినయెడల అన్నభేది, సీల వేము, సొంటి, ఉప్పు కలిపి ప్రతిదినము బలము వచ్చువరకు పెట్టుచుండవలయును. ఉప్పును మాత్రము మేతతో చేర్చి తప్పక పెట్టవలెను.

లేక పశువులకు తామరపన్ను ఒకటియుండును. అది అనుభవము గలవారితో తీయించిన తామరపోవును. ఈపన్ను ప్రత్యేకముగా ఒక ప్రక్కను విడిగానుండును.

---

హస్తవాసనహాతే వి త్తినవాడు ఒకటే వి త్తనివాడు ఒకటే.

## గజ్జి

ఇది పశువులకు సంభవించును. ఒకానొక చెడుగాలివలన యీ సూక్ష్మజీవులు పశువుదేహములోపల ప్రవేశించును. ఈపురుగులను "పారసైటు" జీవులందురు. ఇవి చర్మములోనుండు రోగపదార్థము తిని చర్మమును తొలచి లోపల గ్రుడ్లుపెట్టి పొదుగును. ఇది వేడిరోగపదార్థముండలమువలన కూడ కలుగును. కొన్ని పశువులకు ఈగజ్జి దట్టముగానుండి దురద హెచ్చుగా నుండును. ఇది మెత్తని దేహమునందెక్కువగా వ్యాపించును. ఈవ్యాధి ఎక్కువగా మగపశువులకు కలుగును. వెండ్రుకలు రాలిపోవును. పొక్కులులేచి పక్వమై పగిలి పసిమివర్ణముగల ద్రవము కారును. ఇది ఎక్కువైనకొలది గోడలకు కట్టుగొయ్యలకు రుద్దుకొనుచుండును.

### చికిత్స

గంధకము 1 తు, మైలతుత్తం ½ తు, బోరిక్ఆసిడ్ 2 తు, వ్యాసలైను 4 తు కలిపి రాయవలెను.

లేక సన్నని గోనెపట్టాతునక తెచ్చి కాల్చి మసిజేసి ఆముదములో కలిపి రాయవలెను.

లేక పెరుగుతో తుపాకిమందు కలిపి రాయవలెను.

లేక పచ్చిపొగాకురసము పట్టించిన మంచిది.

లేక కామంచాకుపసరు పట్టించుము.

## కాలిన బొబ్బలు (Burns)

సాధారణముగ పశువుశరీరముమీద వేడినీరు, వేడిగంజి యెర్రగా కాలిన యినుప వస్తువులు మున్నగునవి ఆకస్మికముగా పడినపుడును గంధకద్రావకము మొదలైన ద్రావకములు తగులునపుడును, పశువుశరీరము కాలును. దేహముమీద తేలికగా కాలినచో యెఱ్ఱబడును. దేహము మాడ కాలినచో బొబ్బలగును. పశువుదేహము యెక్కువగా కాలినయెడల దాని కపాయముకూడ సంభవింపగలదు. శరీరముమీద పుండ్లు పడినపుడు సూక్ష్మజీవులు గాలివలన లోపలికి ప్రవేశించును. జాగ్రత్తగా కాపాడవలయును. బొబ్బలను చిదుపరాదు.

### చికిత్స

మన్నపునీరు కొబ్బరినూనెతో సమానముగ కలిపి చేతితో గిలకొట్టగా వచ్చిన వెన్నవంటి పదార్థమును రాయుము.

మజ్జిగలో పిడుకబూడిదను (కచ్చిక) కలిపిరాయుము.

---

హస్తము అయివాళ్లు, చిత్తము మూడువాళ్లు.

వంట ఆముదము వీసెడు, తడిరాతి సున్నము వీసెడు, నీరు అడ్డెడు తీసికొని ముందు నీటిలో ఆవస్తువులను వేసి చేతితో గిలకొట్టగా వచ్చిన వెన్నవంటి పదార్థము రాయుము.

కాలిన ప్రదేశమున మనుష్యుని మీరుదు ఆరగా ఆరగా పోసిన యెడల మంట ఆగిపోవును.

## నుసిమిరి (Mague)

ఈ వ్యాధి పేనుసంబంధమైనట్టియు, బూజుసంబంధమైనట్టియు, సూక్ష్మజీవులవలన పశువులకు కలుగుచున్నది. ఇది అంటురోగము. ఇది ఉష్ణరోగపదార్థ మండలమువలన ఉత్పత్తియగును. మొదట పశువుశరీరమునందక్కడక్కడ ఈ నుసిమిరి పుట్టి క్రమేపి వృద్ధియగుచుండును. పశువునకు ఎక్కువగా దురద, మంట పుట్టి అప్పుడప్పుడు తన పండ్లతో గీరుకొనుచుండును. బొబ్బలుకూడ పుట్టవచ్చును. క్రమముగ నల్లమచ్చలుగ మారి అవి గ్రుడ్డుపోసి పలుచని ద్రవము స్రవింపజేయును. వెండ్రుకలు రాలిపోవును. ఈవ్యాధి గిత్తలకు తరుచుగా వచ్చుచుండును. పశువు అప్పుడప్పుడు నుసిమిరియున్న చోట గోడలకు, గుంజకు, కట్టుగొయ్యకు నేసి రుద్దుకొను చుండును. పశువు ఆకారము చెడి క్షీణించుచు కాంతి తగ్గును. ఈ వ్యాధియుదిరిన [illegible] తగ్గుట చాలకష్టము.

## చికిత్స

సైంధవలవణము కలబందమట్టరసముతో కలిపి రాయవలెను.

మేకవదరు వేడియైనది తీసికొనివచ్చి శరీరమునకు మూడు నాలుగు పూతలుపెట్టి తరువాత వేడినీటితో కడుగవలెను.

2 తులముల పసుపు, అర్ధసేరు ఆవుపాలతో కలిపి ఒకపూట త్రాగించిన తరువాత అడ్డసరపు విత్తులు, నువ్వులు, ఉప్పు, కొట్టుపసుపు, వెట్టిపుచ్చవేళ్ళు, బావంచాలు, జిల్లేడుమొగ్గలు ఒక్కొక్కటి తులమానంతున తీసికొనివచ్చి మెత్తగానూరి వేపనూనెలో కలిపి నుసిమిరియున్నచోట రాయవలెను. మూడవనాడు మేకపాటలో నుండు వెచ్చని వదరు రుద్ది నాల్గవనాడు వేడినీటితో శరీరమంతయు కడుగవలెను. శరీరమంతా వ్యాపించి మచ్చలుపడి బాధజెందు నుసిమిరి తగ్గుట చాలాకష్టము.

## తోక నుసిమిరి

పేడ మన్ను మొదలగు కల్మషపదార్థములు పశువుతోకకు అంటుకొని యుండుట చేతను రైతులు వానిని పరిశుభ్రముగా కడుకక పోవుటచేతను ఈవ్యాధి కలుగుచున్నది. ఒక విధమైన బూజు సంబంధమైన సూక్ష్మజీవులు తోకలోపలిభాగమున ప్రవేశించి దురదను పుట్టించును. తోక నల్లబడి వెండ్రుకలూడిపోవును. ఈవ్యాధి పశువులోక

---

హాసలో వేస్తే, హాస్తములోనికి రావు.

తప్పుడు పైభాగమునకే యుండును. ఇది యెక్కువగా వ్యాపించిన కొంది పశువులోక సరిగా నెత్తురేక తప్పుతో నటునిటు విసరుకొనును.

## చికిత్స

మైలతుత్తము పావుతులము, గంధకము 1 తు, వస 1 తు, వ్యాసులైను 2 తు కలిపి నుసిమిరికి రుద్దవలెను.

లేక ఒక పిడకవంటతెచ్చి తోకపైనున్న నుసిమిరిపై ఎఱ్ఱబడునట్టు రుద్దవలెను. తరువాత దానిపైని పసుపు మాగడ కలిపి రాయవలెను. ఇట్లు రెండుమూడు దినములు చేసిన నెమ్మదియగును.

పసుపు నల్లేరుతో కలిపి బాగుగా రుద్దవలెను.

విషబొద్ది కొబ్బరినూనెలో కలిపి రాయవలెను.

వెన్నతో ముద్దారుశింగు కలిపి రుద్దవలెను.

ఆముదపు పలుకులు, సూరేకారము, ఉప్పు మెత్తగానూరి పెరుగుతో కలిపి రాయుము.

## పొడలు - మచ్చలు (Scabs)

పశువు శరీరముమీద గుబురు గుబురుగ ఒకవిధముగ మచ్చలేర్పడును. కాని వీని వలన ప్రమాదములేదు. పశువు ఆకారము చెడును. వాటంతటవి పుట్టుచుండును. ఇవి చలిగాలి సోకగనే పోవుచుండును.

## చికిత్స

విభూతి, పుల్లమజ్జిగ కలిపి నాలుగైదుదినములు రాయవచ్చును. మజ్జిగలో పిడక బూడిదకలిపి రాయవచ్చును. ఆవనూనెలో వెల్లుల్లిపాయలు వేసి కాచి రాయవచ్చును. వేపాకు కాల్చిన బూడిదలో నెయ్యి కలిపి రాయవచ్చును. రావిచెక్క బూడిద క్రొత్త తడినున్నముతో కలిపి రాయవలెను.

## వెంట్రుక లూడిపోవుట

పశువునకు పెద్దరోగము, జ్వరము, గాలికుంటు మొదలగు రోగములు తగిలి నెమ్మదించిన తరువాతను, పశువు ఈనినతరువాతను లేతమూడలకు దుర్బలత్వముచేతను వెంట్రుకలూడిపోవుట తటస్థించును. పొట్టివెంట్రుకలను కత్తిరించవలెను.

తరువాత పోకచెక్క నీటితో కడిగి నీలిమందుతో ఉమ్మిచేర్చి రాయవలెను.

లేక వ్యాసులైనులో నీలిమందు తగినంత కలిపి రాయుము.

లేక ముసాంబ్రము ఘాటుసారాయిలో కలిపి రాయుము.

లేక వెల్లుల్లిపాయల పొట్టు కాల్చి నీరునూనెలో కలిపి రాయుము.

---

హస్తలో అడ్డెడు కావు.

## గోమారులు, జుడ్డపుంజాలు

ఈ గోమారులు కాలఋతువులనుబట్టి పుట్టుచుండును. మరల వాటంతటవి పోవుచుండును, కాని ఇవి పశువును పట్టుకొని నెత్తురును పీల్చుటచేత పశువు దుర్బలత్వము చెంది పలువిధ సంకటములపాలగుచున్నది. కాబట్టి వెంటనే వీటికి తగు చికిత్స చేయవలెను. గోమారులు బహు మొండిజాతి. వీటికి పశువు శరీరమును తొలుచుకొని పోవునంతటి శక్తికలదు. ఈ గోమారులున్న పశువును చూచిన మనకు చాల అసహ్యకరముగ నుండును. ఈ గోమారులవల్ల రక్తమూత్రమను వ్యాధి సోకునని ఇదివరకే ఈ గ్రంథములో చెప్పియుంటిని. పశువు పొదుగుమీదను, కాళ్లమీదను, కండ్లరెప్పలమీదను వీలులేని స్థలములమీదను పట్టి బాధించును.

### చికిత్స

ఫినైల్ అర్ధసేరు, ఫ్రెంచివార్నీసు పావుసేరు, కార్బాలిక్ 1 తులము, గంధకపు పొడి 4 తులములు, వేడినీరు సేరు కలిపి దీనిని గుడ్డతో ముంచి రాయవలెను.

లేక మంచినూనె దేహమంతటికి రాచి యెండలో నుంచినయెడల చావవుగాని ఊడిపోవును. కాబట్టి ఈ చికిత్స చేయు పశువును దూరముగా నుండు ప్రత్యేకస్థలమందుంచి చికిత్స చేయవలెను.

### హెచ్చరిక

గోమారులున్న కొట్టములలో పశువుల నుంచి చిన్న మంటవేయుదురు. ఇది చాల ప్రమాదకరమైన విషయము. నేను ఈ గోమారులవలన తగులబడిన కొట్టములను ప్రత్యక్షముగా చూచియున్నాను. కాబట్టి ఇటువంటి ప్రమాదకరమైన పనులు చేయుటచేత కొన్ని పశువులు కూడ మరణించినవి.

### తీటరోగము

ఈ వ్యాధి పశువునకు ఒకవిధమైన పురుగువలన కలుగును. చర్మము అడుగుభాగమున ఈ పురుగు లుండి అన్ని అవయవములకు దురద కలిగించును. ఈ దురద పశువు సహింపలేక ఏ చెట్టునకో, ఏ గోడకో వేసి రుద్దుకొనును. వెంటనే యెఱ్ఱని పుండ్లగును. ఈ పుండ్లపైన ఈగలు వాలి చీము పట్టును. దద్దురు దద్దురుగా శరీరమంత పొక్కును. ఈ దద్దురు ఎఱ్ఱగానై వాపుజెంది పుండ్లుకూడ పడవచ్చును. శరీరకాంతి తగ్గును. మలబద్ధక ముండును.

### చికిత్స

ఈగలను వ్రాలనీయరాదు. చమురుగుడ్డతో అన్నివైపుల అద్దుచుండవలెను. పశువును శుభ్రమైన స్థలమునందుంచవలెను. కార్బాలిక్ ఆసిడ్ ఒకపాలు, కొబ్బరినూనె మూడుపాళ్లు కలిపి రాయవలెను.

---

హస్తలో అడ్డెడు చల్లుటకంటె చిత్తలో చిట్టెడు చల్లుట మేలు.

లేక సీతాఫలవిత్తులు మెత్తగా నూరి పెరుగులో కలిపి కాచి ఒక గంటసేపుంచి తరువాత కడగవలెను. లేక ఆవిసె ఆకురసము పూయుము. లేక ముషిణిచెట్టు చిగుళ్లు ఉప్పు కలిపి నూరి రాయవలెను.

## పశువు దేహము ఉడుకెత్తుట

పశువును అతితీవ్రమైన ఎండలో పనిచేయించు చుండుటవలనను ఆసమయము లోనే దాహ మెక్కువై శరీరము ఉడుకెత్తి యుండునపుడు చన్నీళ్ళతో దేహము కడుగుటచేతను, జ్వరముకలిగి యుండునపుడు ఎండలో పనిచేయించుటచేతను, ఆవ్యాధి కలుగును. పశువు ఎండలో నూడజాలదు. వగర్చుచుండును. నీడకుపోవుచుండును. ఒకానొకప్పుడు నీటిలోకూడ పడును. దేహ మంతయు మంటలెక్కును.

### చికిత్స

సూరేకారము 2 తులములు నీటిలోకలిపి త్రాగించవలెను.

చన్నీటిలో గుడ్డ ముంచి తలకు కొట్టవలెను.

శరీరముపైన కూడ చన్నీటికావులు తీయవచ్చును.

## దోమలు (Musquitoes)

పల్లపుప్రదేశములలోను, మురికిగుంటలలోను ఇవి ఎక్కువగా నుండును. వీటి వలననే పశువులకు అనేక విధములైన వ్యాధులు ప్రబలుచుండును. కాబట్టి వీటినిగూర్చి లమునకు తగిన చికిత్స చేయవలెను. దోమలు పశువులకు మిక్కిలి హానిని కలిగించు శత్రువులు. కొన్ని దోమలు విషకరమైన కాటుగలవి. ఏనుగుకాలు అను వ్యాధి వీటి వలననే కలుగుచున్నది. కాని వానిని పరీక్షచేయుట కష్టము. కనుక నన్నిదోమలును విషము గలవని తలంచి జాగ్రత్త తీసికొనుట యుక్తము. ఈగలవలెనే దోమలకు జన్మ పారంపర్య మున్నది. మురుగుకాలువలు, బురద నేలలు దోమలకు మిగుల నిష్టము. పగిలిన తొట్లలోను, పగిలిపోయిన డబ్బాలలోను నీరు నిలిచియుండకుండ జూడవలెను.

### చికిత్స

ఆవుపేడతో కలిపిన చెత్తను తెచ్చి దానిలో గవ్వసాంబ్రాణి అనురకల గంధకము కలిపి పొగవేసిన మరల నవి రాజాలవు. లేక దాల్చినఆకులు లవంగాలఆకులు నీటిలో కలిపి చల్లిన దోమలు రావు.

లేక ధూతులనిచెట్లను కొట్టములలో కట్టిన రాజాలవు.

## పేలు

ఇవి మనుష్యుల తలలోనుండు పేలకంటె కొంచెమెక్కువ పరిమాణము కలిగి యుండును. ఇవి పట్టినచోట దద్దురుపుట్టి చర్మము వాచును. వాటిని తేలికగా చంప వచ్చును. కాని ఈడి తీసివేయుట కష్టము.

---

చిత్తలో చల్లితే చిత్తిగా పండును.

### చికిత్స

కొబ్బరిచిప్పలను కాల్చి తీసినచమురు పేలున్నచోట రాయవలెను.

లేక వెల్లుల్లిపాయల రసము పూయుము.

### జోరీగలు

జోరీగలు పశువుకడుపున కడుగు భాగమునకు, తదితర భాగములందును, వందల కొలదిగా వేసవికాలపు చివరదినములలో ఎక్కువగా కాన్పించును. జోరీగపిల్లలను పశువు మ్రింగినపుడు గుండుసూది పరిమాణము కలిగియుండును, కాని రెండుసెలల పిమ్మట యవి పెద్దవై జాన్ జూలైవరకు లోపల నేయుండి తరువాత మలముతోపాటు వెలికి వచ్చును. ఈపురుగులు కడుపు లోపలిభాగమునుండి యేమైన హానిచేయునదియు, లేనిదియు పశువైద్య లేమియు చెప్పజాలరు. పశువు శరీరము వెలుపల నివసించు జోరీగలు చర్మముపైన గ్రుడ్లుపెట్టి సంతానవృద్ధిని పెంపొందించును. పశువురక్తమును పీల్చుచుండును. ఇవి ఎక్కువగానున్న పశువు క్రమేపి క్షీణించుచుండును. పశువునకు దురద పుట్టును. ఇవి అంటువ్యాధులను వ్యాపింపజేయును.

### చికిత్స

వీటి కింతవరకు సరియైన చికిత్స కుదురలేదు.

ఫినైలు 1 భాగము, నీరు 2 భాగములు కలిపి దేహమంతయు రాయవలెను.

లేక కర్పూరతైలముగాని, తారుగాని ఆయాభాగములందు రాయవలెను.

### మిన్నల్లులు (hleas)

కొన్నిదూడలకు మిన్నల్లులు పట్టి బాధించును. వెంట్రుకలు రాలిపోవును. పుండ్లుపడి దూడ నాకకొనుచుండును. ఈబాధ ఎక్కువైనకొలది దూడచనిపోవును. ఇవి పాలదూడలకు తరచుగా పట్టుచుండును. మిన్నల్లులు చర్మమునందు రంధ్రముల జేసి గ్రుడ్లుపెట్టును. ఆగ్రుడ్లు పిల్లలై చర్మముపై దురదను పుట్టించును. ఇవి రోగములుగల పశువురక్తమును పీల్చి యితరపశువుల దేహములలో దీనిని విడుచుటవలన అంటు వ్యాధులు కలుగుచుండును.

### చికిత్స

ఫినైల్ 1 భాగము, నీరు 2 భాగములు కలిపి శరీరమునకు పట్టించుము.

లేక వేపనూనె 1 భాగము, కిరసనాయిల్ 2 భాగములు కలిపి పట్టించిన వెంటనే తగ్గును.

లేక వేపాకు నీటిలోవేసి మరగకాచి ఆనీటితో దూడను కడుగవలెను.

సంపూర్ణము

దీపావళికి దివ్యాంతపాట్ట.

# తూనికలు - కొలతలు

30 చిన్నములఎత్తు—1 తులము
3 తులములు—1 ఫలము
8 ఫలములు—1 సేరు
12 తులములు—1 అర్ధసేరు
5 సేర్లు—1 వీసె

2

5 తులములు ఎత్తు—1 గిద్ద
2 గిద్దలు—1 అరసోల
2 అరసోలలు—1 సోల
2 సోలలు—1 తవ్వ
2 తవ్వలు—1 మానిక
2 మానికలు—1 అడ్డెడు
2 అడ్డలు—1 కుంచము

3

60 చుక్కలు—1 డ్రాము
8 డ్రాములు—1 ఔన్సు
20 ఔన్సులు—1 పైంటు
24 ఔన్సులు—1 క్వార్టు
8 పైంట్సు—1 గాలను

4

2 వడ్లగింజల ఎత్తు—1 గ్రైయిను
20 గ్రైయినులు—1 స్క్రూపిలు
3 స్క్రూపిల్సు—1 డ్రాము
8 డ్రాములు—1 ఔన్సు
12 ఔన్సులు—1 పౌను
2½ ఔన్సులు—1 తులము
180 గ్రైయిన్సు—1 తులము
5 తులములు—1 చటాకు
16 చటాకులు—1 సేరు.

---

N. B:- ఈ చింతామణిలో నున్న చికిత్సలుగాక ఇంకా కావలెనని కోరిక గలవారికి పశువైద్య ఔషధ యోగావళి (అను) గ్రంథము చూడుడు.

# పశువైద్య ఔషధములు

## 1. జంతురక్షిణి

కింక, నొమ్ము, గురక, జరము, జెబ్బవాపు మున్నగునవి మీ గ్రామములో నున్నపుడు మంచి పశువులకు రోగపశువులకు ఈ రక్షిణిని యిచ్చిన చాలును. శాస్త్రసమ్మతముగా తయారైన లేహ్యము.

## 2. పశుబలవర్ధని

పశువులకు, గొర్రెలకు, మేకలకు, బలము, చురుకుదనము, సత్తువ రావలెననిన ఈ బలవర్ధని పక్షమురోజులు అనుపానపత్రికలో ప్రకారము వాడిన చాలును. ఎంతో మంది వాడిరి.

## 3. అశ్వబలవర్ధని

గుఱ్ఱములు బలిసియుండుటకు, నరపటుత్వము కలుగుటకు దీనికి మించిన మందులేదు. మసాలాకంటె బాగుగా పనిచేయును.

## 4. క్షీరోజన్

పాడిపశువుల రోగములకు, పాలెక్కువ యిచ్చుటకు రుచికలుగుటకు ఈ క్షీరోజన్‌ను పక్షము దినములు వాడిన చాలును.

## 5. పశుమిత్ర

కడుపుబ్బు, అజీర్తి, కడుపునొప్పి. వివిధశూలలు వగైరా వ్యాధులన్నిటికి ఈ మందు బాగుగా పనిచేయును.

## 6. వాతారి

శిరోవాతము, నక్కు, ఎముకు, కాళ్ల పక్షవాతములు వగైరా అన్నిటికి ఈ వాతారి తగ్గించుటలో పెట్టినది పేరు.

## 7. సాన్‌టాల్

నీరుచురుకు, రక్తమూత్రము, అధికమూత్రము, ఉచ్చబుడ్డలోనొప్పి, ఉక్కనష్టము మున్నగు రోగములలో పని చేయును.

## 8. బేల్ పౌడర్

విరేచనములు, రక్తవిరేచనములు, జిగటవిరేచనములలో ఈ పౌడర్‌ను వాడిన చాలును.

## 9. విబ్రా

చూడిపశువులకు వచ్చురోగములలోను, పిండ మభివృద్ధి నొందుటకు ఈ మందు బాగుగా పనిచేయును.

### 10. క్రిమిహార్

లేగ దూడలకు, కుక్కలకు వివిధరకముల పురుగులు మలముగుండ పడుచుండును. అట్టి పురుగులకు ఈ క్రిమిహార్ చాలును.

### 11. కనకాసవ

గుల్మములకు, పశువులకు వచ్చు దగ్గు, గుండెదగ్గు ఊర్ధ్వశ్వాసల నణచుటలో కనకాసవకు మించినదిలేదు.

### 12. ఉల్బం

పశువులకు మావి పడనప్పుడు, మేయిరాగానే త్రోసిన తరువాత ముక్కుడు కలిగినపుడు ఈ ఉల్బంను వాడిన ఆశ్చర్యద్భుతముగా పనిచేయును.

### 13. విషఘ్ని

పశువులను పిచ్చికుక్క నక్కలు కరచినపుడు విషవస్తువులు తినినపుడు ఉంగిడికి ఈ విషఘ్నిని వాడిన తగ్గును.

### 14. గర్భక

గొడ్డుబోతు పశువులు మరల చూడికట్టి ఈనుటకు ఈ గర్భక పెట్టినది పేరు. అనుభవయోగము.

### 15. అనోడైన్

చెవిలో పురుగులు, చెవి వాలుడు, చెవి వాపు మున్నగువాటికి బాగుగా పని చేయును.

### 16. గ్లయిమాల్

కాలిన పుండ్లకు, చర్మపుపగుళ్ళకు, పాక్కిన భాగములకు పనిచేయును.

### 17. కార్నెక్సు

కొమ్ములు విరుగుట, పై తొడుగూడుట, శస్త్రముచేసిన కొమ్ము గాయములకు పనిచేయును.

### 18. ప్రోకాల్

గోమారులు, మిన్నల్లులు, ఉండిగలు పశువుల చర్మమును బాధించునపుడు ఈ తైలమును పట్టించిన చచ్చును.

### 19. పశు నేత్రాంజనము నెం. 1

పువ్వులు, కంటితెలుపులు, కాయ్యగండలకు బాగుగా పనిచేయును.

### 20. పశు నేత్రాంజనము నెం. 2

కండ్లనుండి నీరు కారుట, ఎరుపులకు, రోగపశువులకు కలికము వేయుటకు దీనిని వాడవలెను.

## 21. హిలాగ్

వివిధ రకముల గాయములకు, కత్తిదెబ్బలు, కాలుగొట్టు పుండ్లకు బాగుగా పనిచేయును.

## 22. కీటారి

తలనుసిమిరి, ఆకుసిమిరి, తామర మున్నగు చర్మవ్యాధులకు పనిచేయును.

## 23. వెటరినరీప్లాష్టర్

ఎద్రు వాపులకు, పంపరకు, కల్లవాపులకు, కలిమిడికి ఈ ప్లాష్టరు బాగుగా పనిచేయును.

## 24. స్ప్రెయిన్‌కిల్లర్

బెణుకులు, మిడిపట్టుట, వాతనొప్పులు, కీళ్ళవాపులకు, కాళ్లు పట్టుపట్టి కుంటునపుడు ఈ తైలము బాగుగా పనిచేయును.

## 25. ధగ్‌ధగ్

పశువులు వాటి మూత్రము ఆవిరియే త్రాగుచు కృశించునపుడు ధగ్‌ధగ్‌ను వాడిన బాగుగా పనిచేయును.

వరా:- కావలసినవారు కేట్లాగునకు వ్రాసిన ధరలు తెలుపబడును. ఈ రీతిగనే గుళ్ళిములకు కూడ మందులు గలవు.

వీటిలో కొన్ని ట్రేడ్‌మార్కు చేయించితిమి



## ప్రింటగుచున్న గ్రంథములు

1. అశ్వవైద్య శాస్త్రము
2. పశువైద్య ఔషధ యోగావళి
3. కోళ్ల పరిశ్రమ
4. ప్రాచీన పశు సంజీవి
5. శునక వైద్యము



Printed at the Lakshmi Power Press, Tenali.